శ్రీ గురు బసవలింగాయ నమః

జోళదరాశి-ప్రకటన-13

# శూన్య సంపాదనము

కన్నడ మూలము

శ్రీ గూళూరు సిద్ధవీరణ్ణొడెయరు

సవ్యాఖ్యాన
సంగ్రహాంధ్రీకరణము
డా॥ జోళదరాశి దొడ్డనగౌడ

ప్రకాశకులు
రామేశ ప్రకటన మందిరము
జోళదరాశి - బళ్లారి జిల్లా,
కర్నాటక రాష్ట్రం - 583111.

# SUNYA SAMPADANAM

Written by Dr Joladarasi Doddanagouda

Published by Ramesa Prakatana Mandiram, 'Joladarasi'
Bellari Dt , Karnataka - 583111

Printed Pages

ప్రథమ ముద్రణము - 1000 ప్రతులు

శాలివాహనశకం ౧౯౧౨ ప్రమోదూతనామ సంవత్సరం
శ్రావణము - (1990 ఆగస్టు)




**వెల : 60/- రూ॥లు**

పుస్తకములు లభించు చోట్లు

1. **జి చంద్రశేఖర రెడ్డి,**
   నెం 12-2-826/4/11,
   ఎల్ ఐ సి కాలనీ, మెహిదీపట్నం,
   హైదరాబాదు - 500 028
   ఫోన్ 253 578

2. **శ్రీ హెచ్ చన్న వీరగౌడ,**
   రామేశ ప్రకటన మందిరం,
   జోళదరాశి, బళ్ళారి జిల్లా,
   కర్నాటక రాష్ట్రం - 583 111

---


ముద్రణ పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్, హైదర్‌గూడ, హైదరాబాద్ - 500 029.

# స మ ర్ప ణ

ఎరిగినవారికి కాదు

ఎరుగనివారికి కాదు

ఎరిగి, మరచిన శరణులకై

చిరముగా వెలుగనీ

శూన్యసంపాదనము

రామేశు కృపగలిగి.

# ప్రకాశకుల మనవి

నిరంతర "శూన్య సంపాదనాభ్యాస సంభ్రమతి"గా వినుతికెక్కిన డా॥ జోళదరాశి దొడ్డనగౌడ గారి రచనా వ్యాసంగం అనంతముఖంగా సాగుతున్నది తెలుగు-కన్నడ భాషలనే రెండు చక్రాల సాహిత్యరథంపై శారదాదేవిని విశ్వ వీథుల్లో విహరింపచేస్తూన్న సారథి ఆయన

కవి, గమకి, నాటకకర్తా నటుడూ, ప్రయోక్తా, రాజకీయ విశ్లేషణా చతురుడూ, అద్వితీయ ఉభయ భాషా కావ్య వ్యాఖ్యానానుసంధానీ మా దొడ్డన గౌడగారు బాల్యంలో, భారత, భాగవత, బసవ పురాణాదులతో ప్రారంభమైన వారి కావ్య వాచనం శూన్య సంపాదనా - ప్రవచనంతో ఒక గట్టు చేరినది. కృపామూర్తులైన ధారవాడ మురుఘామఠం అధిపతులు శ్రీ మృత్యుంజయ స్వామివారి ఆదేశం శిరసావహించి సుమారు ముప్పయ్యేండ్లుగా శూన్య సంపాదనా - ప్రవచనానికే తన జీవితం ముడుపుగట్టి శూన్య సంపాదనమంటేనే దొడ్డన గౌడగారు - దొడ్డన గౌడగారంటేనే శూన్య సంపాదినమనే సుస్థిర భావనను కర్ణాటాంధ్ర జనానీకపు హృదయములందు పరిమళింప జేసినారు

ఈ నిరంతర వ్యాసంగ ఫలితంగా ''బయలుగళికెయబెళగు" అను పేర శూన్య సంపాదనమునకు కన్నడ భాషలో సమగ్రంగా వ్యాఖ్యాన గ్రంథం వెలువడి 1985 వ సంవత్సరంలో మా ప్రకటన మందిరం ద్వారా ప్రచురింపబడి అన్ని వర్గాల పాఠకుల ఆదరాభిమానాలు చూరగొన్నది

తెలుగు కన్నడ భాషల అనుబంధం ఈనాటిది కాదు పండిత వర్గానికే పరిమితమైన కన్నడ సాహిత్యాన్ని బసవన్న మొదలగు శివశరణులు తమ వచనాలతో జనసామాన్యులకు చేరువగా తెచ్చిన విధంగానే పాల్కురికి సోమన మార్గకవితా పథానువర్తియై యున్న ఆంధ్ర సాహిత్యాన్ని దేశిమార్గం పట్టించి నాడు ఆ మహాకవిచే రచింపబడ్డ బసవపురాణ - పండితారాధ్య చరిత్రలను భీమకవి అనువదించి కన్నడమునకు కానుకపెట్టిన రీతిగా కన్నడంలో శ్రీ గూళూరు

సిద్ధవీరణ్ణొడెయరు పరిష్కరించి వెలార్చిన "శూన్య సంపాదనే"ను తెలుగుకు తెచ్చి శ్రీ గౌడగారు కన్నడాంధ్ర సంబంధాలను మరింత పరిపుష్టం చేసినారు

శ్రీ దొడ్డన గౌడగారి శూన్య సంపాదనా వ్యాసంగిమొక తీరని తపన-ఆరని దాహం ఈ గ్రంథరచన కొనసాగుతున్న సమయంలో అకస్మాత్తుగా తమ మిద్దె మీద కాలు జారిపడి, కుడి కాలు విరిగినా, ఆ బాధను కనపడనీయక అంత వరకూ తమ ఎదలో తొలుస్తున్న భావాల్ని కాయితంపై పెట్టిన పిదపే కాలి చికిత్సకు అంగీకరించినారు పుత్తూరు శల్య వైద్యులు శ్రీ గంగరాజుగారి పుణ్యమా అని విరిగిన కాలు కుదురుకొని పూర్తిగా నయమైనది

సాహిత్య రచన ఒక ఎత్తు దాని ప్రకటన మరొక ఎత్తు తెలుగు విశ్వ విద్యాలయం స్థాపించబడి దానికి తొలి కులపతిగా భాషాచార్య శ్రీ తూమాటి దొణప్పగారు వచ్చిన వేళ అది తెలుగులో దొడ్డన గౌడగారి శూన్య సంపాదనము రచన విషయమై జోళదరాశి, జి చంద్రశేఖరరెడ్డి ద్వారా విని, ఆ గ్రంథాన్ని తామే తెలుగు విశ్వవిద్యాలయం తరపున ముద్రింపించి ప్రకటిస్తామని ఆసక్తితో అభ్యర్థించినారు వారి కోరిక మేరకు వ్రాత ప్రతిని 1985 లోనే విశ్వవిద్యాలయం వారికి ఒప్పగించడం జరిగింది

దొడ్డన గౌడగారి నాటకాభినయ కౌశలాన్ని బాల్యంలో చూచి అభిమానం పెంచుకొన్న శ్రీ దొణప్పగారు, జోళదరాశి వారి క్రాంతి పురుష బసవన్న నాటకం "తెలుగు కన్నడాల్లో ఏక ప్రతిగా" ముద్రింపించి నూత్న సంప్రదాయానికి మార్గదర్శకులైనారు ఆయనే వారి రంగస్థలానుభవాలను భావితరం కళాకారులకు ఉపదేశాత్మకాలుగా "అనుభవాలు-జ్ఞాపకాలు" పేర వారి కళా జీవితాన్ని ప్రకటించినారు వారిచే ఆనాటి బాణిలో రంగస్థల గీతాలను పాడించి ఒక సంప్రదాయ చిహ్నంగా ధ్వని ముద్రణ చేయించి విశ్వ విద్యాలయానికి తెచ్చుకొన్నారు

విశ్వ విద్యాలయం నియమానుసారంగా ప్రకటనా-పూర్వ పండితాభిప్రాయం నిమిత్తం ఆచార్య శ్రీ మహంతయ్యగారి వద్దకు పరిశీలనకు పంపినారు శ్రీ మహంతయ్యగారు గ్రంథాన్నీ, అందలి విషయాన్నీ, రచనా నైపుణినీ,

వివేచనలోని నవ్యతనూ మెచ్చుకొని ప్రశంసించి, శీఘ్ర ప్రకటనకు ప్రతిపాదించి ప్రచురణార్థం వ్రాత ప్రతిని తయారు చేయమని సలహా ఇచ్చినారు ఆ విధం గానే శ్రీ దొణప్పగారి ఆధ్వర్యంలో వ్రాతప్రతి తయారుచ కేర్పాటు జరిగింది ఆ పనీ పూర్తి అయింది

ఈ లోపున శ్రీ దొణప్పగారు పదవీ విరమణ గావించడం, క్రొత్తవాళ్లు ఆ స్థానంలోకి రావడం జరిగాయి

ఈ మార్పుల సందడిలో శూన్యసంపాదన ముద్రణా కార్యక్రమం కాస్తా నిలిచిపోయింది ఈ విధంగా తెలుగు విశ్వవిద్యాలయంలో ఐదేళ్ళు గడిపిన తెలుగు - శూన్యసంపాదనమును వెలికి తీసి ప్రకటించే అవకాశం మా ప్రకటన మందిరమునకు దొరకుట మా భాగ్యంగా భావిస్తున్నాము మరొకమాట - పరిమళ భరిత కుసుమాన్ని శిరసున రసజ్ఞులు ధరిస్తే అరసికులు ఉదాసీనత చూపడం లోకసహజమే కదా!

ఇహ "బయలుగళికెయబెళగు" కన్నడ గ్రంథాన్ని ధర్మపీఠాలు, సంఘ సంస్థలు తత్వాభిమానులూ 'కొని' విశేషంగా ఆదరించి ప్రోత్సహించిన తీరుగా మా ఈ తెలుగు శూన్యసంపాదనమును కూడ ఆదరించి మా సత్కార్య నిర్వహ ణకు నెఱవు కాగలరని ఆశిస్తున్నాము

అగాధ తత్త్వ సారాన్ని అరటి పండొలిచి అరచేత పెట్టినట్లు తెలుగు భాషలో వెలయింపజేసి, అందులో తమ జీవన సార్థక్యతను సిద్ధింప చేసుకొన్న శ్రీ దొడ్డన గౌడ గారు బహుపుణ్యులు వారికి మా హృదయపూర్వక కృతజ్ఞ తాంజలులు

ఐదు సంవత్సరాల నుండి ఈ గ్రంథం వెలుగు చూడాలని అనేక విధా లుగా శ్రమించిన మా ఊరివాడూ, మా కాత్మీయుడూ అయిన చిరంజీవి చంద్ర శేఖరరెడ్డికి రామేశుడు శుభాశీస్సుల నందజేయవలెనని మా విన్నపము

గ్రంథాన్ని సమగ్రంగా పరిశీలించి తగు సలహాలనిచ్చి సహకరించిన శ్రీ M S మహంతయ్యగారికి (Retd Head of Kannada Dept, O U) మా కృతజ్ఞతాభివందనలు తెలుపుకొంటున్నాము

సాహిత్య మేరువులు ఆచార్య శ్రీ దొణప్ప గారు గ్రంథ ప్రకటనకు సూక్త సలహాలివ్వడమే గాక అమూల్యమైన తమ "ఉడుగర" రచనతో మాకు వెన్నుదన్నుగా నిలిచినందుకు శిరసా నమస్కరిస్తున్నాము

అపారమైన శూన్య తత్త్వాన్ని గురించి చక్కగా విశ్లేషించిన శ్రీ వి వి యల్ నరసింహారావుగారి సహకారం మరవరానిది వారికి మా అభివాదములు తెలుపుతున్నాం

అయినంతమేర దోషరహితంగా పుస్తకం తయారు కావటానికి ప్రూఫ్లు దిద్దటంద్వారా సహకరించిన శ్రీ అక్కిరాజు రమాపతిరావుగారికీ, ముద్రణాభారం వహించి, వేళకు సమకూర్చిన శ్రీ పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ యజమాని శ్రీ శ్రీనివాస్ గౌడ్‌గారికీ, వారి సిబ్బందికీ మా ప్రత్యేకాభినందనలు తెలుపుకుంటున్నాము

జోళదరాశి
15-7-90

హెచ్. చన్నవీరగౌడ

ప్రొ. టి దొణప్ప
ఎం ఏ పిహెచ్ డి ,డి లిట్
వ్యవస్థాపక కులపతి,
తెలుగు విశ్వ విద్యాలయం,
హైదరాబాద్

# ఉడుగర

'సుజాతాసః జనుషా పృశ్నిమాతరః' (ఋగ్వేద) అని నేల తల్లికి నివాళు లర్పించి, 'నమస్తేలాంగలేభ్యో నమ ఈషాయుగేభ్యః' అని నాగలికి నమస్సు లందించి, 'కాయకవే కైలాస' అన్న శివశరణుల నుడికి శరణార్థి సేసి, తర తరాలుగా బంగారు పంటలు పండించి, ఏటేటా సుగ్గిలో కళ్ళాల కొలుచుతో గరిసెలూ, గాదెలూ, గెడంచులే కాక - కణజాలూ కావు పాతరలూ నిండించి, అరుగాలమూ వేయారు మంది ఆప్తులనూ, అనాధలనూ, ఆశ్రితులనూ పోషించి, ఊరి దొడ్డరికం నిలుపుకుంటూ వచ్చిన నూరారు ఎకరాల 'ధణీ'ల దొడ్డ వంగడం గమక కళానిధి, గమక కళా ప్రపూర్ణ బిరుదాంచితులు డాక్టర్ శివశ్రీ జోళ దరాసి కెంగల్లు దొడ్డనగౌడగారిది కాపుదనపు కుల కాయకంలో పైచేయిగా, కుప్ప మీది కుపేంద్రులుగా, చుట్టుముట్టు పల్లెలలో సమ్రాట్టులుగా పేరు పెంపులు వహించి, తాము పెంచిన మంచిని పది మందికీ పంచిన గొంచికాళ్ళ కోవకు ఈడు జోడైన ఇలువరుస శ్రీ దొడ్డన గౌడగారిది శివశ్రీ మఠం షడక్షరప్ప, సర్వదర్శన పండిత బళ్ళారి వై నాగేశ శాస్త్రులు వంటి అయ్యవార్ల ఒజ్జరికంలో, సర్వశ్రీ యాచంరెడ్డి మహాబలేశ్వరప్ప, భాస్కరాచార్య రామచంద్ర స్వామి వంటి కురువృద్ధుల సాన్నిధ్యంలో, నాట్య కళా ప్రపూర్ణలు బళ్ళారి రాఘవ, విడుపనకల్లు నాటకద హనుమంతప్ప వంటి గురు వృద్ధుల సర్వంకష శిక్షణలో, శ్రీయుతులు ఆ న కృష్ణరాయ, టి-పి కైలాసం వంటి హితవరుల సాంగత్యంలో, కప్పగల్లు సంజీవమూర్తిరావు, రావాడ వెంకటరామశాస్త్రి వంటి సన్నిహితుల సాహచర్యంలో చతురంభోధులు వంటి దార్శనిక-రంగస్థల-సంగీత-సాహిత్య సముద్రాలను ఆపోశనం పట్టిన అపర అగస్త్యులు శ్రీ దొడ్డన గౌడగారు కర్ణా టాంధ్ర భాషా సాహితీ ధర్మాలూ, మర్మాలూ, వీరికి హృత్కమలె పురాతన అధునాతన శివశరణ గురు చరణుల పునీత గాథలూ, వినీత బోధలూ వీరికి కంఠో పాఠం శ్రీ గౌడగారు బిరుదు పురస్కారాలకు గాని, సనదు సత్కారాలకు

గాని ససేమిరా వెంపరలాడని అంతర్ముఖులు, గురుజన ప్రసాదానికీ, హితజన అభివాదానికీ తప్ప, అటు సూర్యుడిటు పొడిచినా ఇతరత్రా దేహీయని చేయి సాచని అప్రతిగ్రహీతలు, సనాథులా, అన్యనాథులా అన్న వివక్ష గాని, తమ కులమా తమ పొలమా అన్న విభేదం గాని, పిన్నలా పెద్దలా అన్న వివాదం గాని పాటించని బాలా భోళా శంకరులు, రంగస్థలం పైనా, జీవిత రంగస్థలం పైనా సహృదయ హృదయంగమంగా, సద్బంధు చింతామణిగా సవ్యసాచిత్వం వహిస్తూ వస్తున్న సర్వభద్ర సంయోజకులు,

దిదృక్షువులనూ, ముముక్షువులనూ దృష్టిలో పెట్టుకుని కర్ణాటాంధ్ర భాషలలో శ్రీ దొడ్డన గౌడగారు కైసేసిన అనేక రచనలలో ప్రస్తుత కృతి 'శూన్య సంపాదనము' ఒకటి ఇదే పేరిట వీరశైవ తత్త్వ ప్రతిపాదకంగా వీరు కూర్చిన కన్నడ రచనకు స్వకీయమైన తెలుగు అనువాదమిది 'ఒనే కులం-ఒరువనే దైవం ' (ఒకటే కులం, ఒకడే దేవుడు, అదే మానవ కులం, అతడే శివుడు) అని ఒడలు దండెగా, తలకాయ సొరకాయగా, నరాలు తంతులుగా, వేలు పుడకగా చేసి, సివసత్తులు అరువత్తు మూవరు నాయన్మారులు బత్తీసు (ముప్పై రెండు) రాగాలలో భక్తిప్రపత్తులతో ఎలుగెత్తి ఆలాపించిన పాటల మూటయే పురాతన శైవసిద్ధాంతానికి మొదలు సంచి 'ఏకోదేవస్సర్వ భూతేషు', సమానీప్రపా సహవోన్న భాగః (అథర్వవేద 3-6-31-6)- మీ అందరకూ ఒకే చలివేంద్రం ఒకే చాపకూడా ఉండాలి"- అని వేదర్షుల అభిభాషణం ఇలా, ఆదిలో అన్ని మతాలూ, అన్ని మంత్రాలూ చెప్పింది అదే! ఐతే, ఆచరణ దశలో, అభ్యాసదిశలో అధికార దర్పితుల అహంకారం, అల్పప్రజ్ఞుల అజ్ఞానం ఆచార్యవర్యుల అలసత్వం, అప్రతిభుల అశక్త దుర్జనత్వం, జ్ఞానవికలుల స్వార్థపరత్వం, నయవంచకుల ఉల్టాపల్టా నటనలు అసలు ఆశయాల తార్మారులకూ, తప్పుదారులకూ కారణాలవుతూ రావడం చరిత్ర చెప్పిన సాక్ష్యం ఇలాటి లోటుపాట్లను సరిగా గుర్తించినందువల్లనే కావచ్చు, వీరశైవ విశ్వాస ప్రవర్తకులైన చోదకులైతేనేమి, బోధకులైతేనేమి, సాధకులైతేనేమి తమ రచనా ప్రవచనాలలో, ఆచరణ ప్రచారణలలో, అసలు సిద్ధాంత ప్రతిపాదనంలో దురర్థాలూ,దూరాన్వయాలూ దొరలకుండా ఎచ్చరిక పడినట్లున్నారు విశేషించి,వీరశైవంలో ఉత్తమ మధ్యమ అధమాలన్న అధికారి భేదాలు పొడగట్టవు కలిమీ లేములూ, కులాలూ తలాలూ, చదువూసంధ్యలూ, చిన్నాపెద్దా అంతరువులూ,

వృత్తి ప్రవృత్తులూ, స్త్రీపుం భేదాలూ వంటి అరల పొరలకూ, అడ్డుతెరలకూ అతీతమైన ఒక విశిష్ట విశ్వాసమూ, వినూత్న ప్రచారణమూ, వినిర్మల ధర్మాచరణమూ ముప్పేటగా మూటకట్టిన సిద్ధాంత ప్రబంధ నిబంధనమిది ఈ విశ్వాసులలో చాలామంది అట్టడుగు బడుగు వర్గాలనుంచి స్వయంకృషితో, స్వయం ప్రతిభతో పైకివచ్చినవారు, నమ్మికకూ, నుడివడికీ, నడవడికీ నడుమ ఏపాటి ఎడమూ చూపక నిరీహులై, నిర్భీకులై మనుగడ సాగించి, లెక్కకు మిక్కిలిగా దళితులనూ, దగాపడ్డ తమ్ములనూ సామాజిక విషవలయాలనుంచి, అసమానతల అడుసునుంచి తప్పించి పైకి తెచ్చినవారు సదాశయాలనూ, సమున్నతాచరణలనూ పోషించేవారూ, శ్రమనూ, సమతనూ భూషించేవారూ, నవతనూ మానవతనూ ప్రేమించేవారూ, మన్ననసూ మమతనూ పెంచేవారూ, మంచినీ మర్యాదనూ పంచేవారూ శివశరణ గణానికి పరిచరణులుగా పరిగణించబడ్డారు. ఎప్పుడో, ఎవ్వరో దివినుంచి భువికిదిగివచ్చి తమ్ము ఉద్ధరిస్తారన్న ఆశను అడ్డం పెట్టుకుని నిష్క్రియా పరులై కూర్చోకుండా, తమంత తాముగా ఎక్కడికక్కడే తప్పులు దిద్దుకుని, చెడును తుంచి, మంచిని పెంచడానికి తమవంతు పనిని పకడ్బందిగా సాగించాలన్న తపనా, భువినే దివిగా తీర్చాలన్న తహతహా, మానవుని మహాదేవునిగా మలచాలన్న తపస్సూ శివశరణుల దీక్షాశిక్షణలలో కన్పిస్తున్నట్టు భావించవచ్చు

వీరశైవ దీక్షాపరుల రచనా రీతులలోగాని, ప్రవచన ధోరణులలో గాని సాదాసీదా సగటు మనుషులు అందుకోలేని శైలిగాని, అర్థంచేసుకోలేని భాషగాని కలికానికైనా కన్పించవు వారిది ప్రజల ఉద్యమం, దాని ప్రధాన ప్రబోధ సాధనం ప్రజల భాష సామాన్యులు అలవాటుపడ్డ భాష వారి అందుబాటులోని శైలి, వారి రోజువారీ వాడుకలో జీర్ణించిపోయిన ఛందస్సూ శరణ వాఙ్మయ నిర్మాణంలోని అసలు మర్మం అతి గహనమైన తాత్త్వికాంశాలనూ, అతినిగూఢమైన శాస్త్రీయ విషయాలను గురుశిష్య సంవాద ఫక్కికలో, సహవాసుల వాకోవాక్య విన్యాస భణితిలో తేటయైన భాషలో సూటియైన శైలిలో అవసరాలకనుగుణంగా పరిపాటియైన ఛందస్సులో విప్పి చెప్పడం అనుభవమంటపారూఢుల గురు పరంపరలోని విలక్షణ లక్షణం ఇలాటి విశిష్ట ప్రక్రియలో రూపెత్తినదే శ్రీ దొడ్డరంగౌడగారి ప్రకృత కృతి 'శూన్య సంపాదనము' పుట్టి

బుద్ధి ఎరిగినది మొదలుగా శివశరణ శ్రీ చరణులను శుశ్రూషించి సంచయనం చేసిన సంస్కార బలంతో బహు కాలం శ్రమించి, బదుకు నడకలో ఎదురుపడే వడిదుడుకులను అతిగమించి, ఆవశ్యక గ్రంథ సంచయాన్ని కూలంకషంగా శోధించి,సహస్రాధిక సదస్సులలో, సమావేశాలలో సాగించిన ప్రవచన ప్రసంగాల ముఖంగా విశ్లేషణలో పరిపక్వతనూ, వివరణలో పరిపూర్ణతనూ సాధించి, తమదైన కైవాడంతో కమనీయంగా రూపించిన రచనమిది పురాతనులు కన్నడంలో పొదిగిన పలుకు సొగసులను తేనేలొలికే గేయ భణితిలో తెలుగురూపున శిల్పించడం, వాటిలోని అనల్పార్థాలను అలతి అలతి మాటలలో ముత్తెపు సరుల మాదిరిగా పోహళించడం శ్రీగౌడగారి నేర్పరితనంలోని ప్రత్యేకతలు రాయలసీమ మాండలిక స్పర్శతో మిళితమైన శ్రీగౌడగారి పలుకుబడి వరవడి మహా పసందైనది అందలి తీయందనాల తీరు తీయాలను వెలికి తీసి విందు చేయడానికిది చోటు కాదు 'బిడుగడె' గడియ నాటికి అనువుపడునేమో మరి!

కర్ణాటాంధ్ర భాషలలో గ్రామాధికారి అనే అర్థంలో పర్యాయవాచకాలుగా బహుళ ప్రచారంలో ఉన్న 'గౌడ', 'రెడ్డి' - అన్న పట్టపు పేర్లకు గావుండ, రట్టోడి అన్నవి సమీప మాతృకావర్గంలోనివి క్రీస్తుశకం ఆరేడు శతాబ్దాలనుంచి శాసన వాఙ్మయంలో బహు వారాలు ప్రయుక్తమైన ఈ సమీప మాతృకలకు 'గ్రామ కూట-', 'రాష్ట్ర కూట-', అన్న సంస్కృత పదబంధాలు మూల మూర్తులని చరిత్రకారుల నిర్ధారణం ఈ రెండూ రాజ్యాంగపరమైన అధికారి పదవీ సూచకాలు స్థానిక పాలకుడు, గ్రామ వ్యవహార పర్యవేక్షకుడు - అనే అర్థాలు గల 'గ్రామకూట'-యే జనుల వాడుకలో నలిగి రాతకోతలలో కరగి వికృతినంది గామఊడ-, గాముండ-, గావుండ-, గౌండ-గా క్రమ పరిణతిని పొంది, నేటి పట్టపు పేరు గౌడ్/గౌడ/గౌడుగా అవతారమెత్తింది గవిని/గౌని (<గౌడని) ద్వితీయాది విభక్తి ప్రాతిపదిక మధ్యయుగాల నాటి బాహత్తరి (డెబ్భై రెండు) నియోగాలలో గ్రామస్థాయిలో పదస్థులైన వారి హోదాను సూచించే పదవీ నామంగానూ, వ్యవహార బలంచే వారి వారసుల పట్టపు పేరుగానూ గౌడ/గౌడు, స్థిరపడింది ఆ దరిమిలా ఇది కొన్ని తెగలకూ, కులాలకూ కూడా పాత వాసన వదలని పట్టపు పేరుగా వాడుక కెక్కింది ఈనాడు తమిళనాడులో దీని రూపాంతరం పూర్ణ బిందు ఘటితంగా 'గౌండర్' అన్నది కొన్ని తెగల పట్టపు పేరుగా చెలామణిలో ఉంది

రాష్ట్ర పాలకుడన్న అర్థం గల 'రాష్ట్రకూట -' పద బంధం సైతం పై మాదిరిగానే రట్టఊడ, రట్టుడ, రట్టోడి, రట్టడి, రట్టడ్లు (బహువచనం), రడ్డులు/రడ్లు (బ వ), రడ్డి (ఏక వచనం)గా కాలాంతరంలో రూపాంతరాలు పొంది, నేటి 'రెడ్డి'కి అనుక్రమ రీతిలో మాతృక అయింది క్రీ శ. పదమూడో శతాబ్దినుంచే 'రెడ్డి' కనిపిస్తున్నది అంతకు పూర్వము 'రడ్డి'దే రాజ్యం 'రడ్డీ గ్రామాధికారీ' అన్న హేమచంద్రసూరి 'దేశీనామమాల'కూడ నేటి అర్థాన్ని ధ్రువపరుస్తున్నది మౌలికంగా నిర్దిష్ట రాజ్యభాగానికి పాలకుడన్న విపులార్థంలో వాడుకపడ్డ రట్టడ్లు/రడ్లు అనంతరయుగాలలో రూప పరిణామంతోపాటు అర్థ విపరిణామం సైతం పొంది, దేశీనామమాల కాలంనాటికే (క్రీ శ పన్నెండో శతాబ్ది) గ్రామస్థాయికి దిగివచ్చినట్లు నిర్ధారించవచ్చు రడ్డి/రడ్డులు అన్న ప్రయోగాలు ఆతర్వాతి తెలుగు సాహిత్యంలో చెదరుచెదరుగా కనిపిస్తాయి 'రడ్డులు నడచిరి పురస్సరద్వార్యముగా' (పాండు 3-75) అన్న పాండురంగ విభుని పదగుంఫనంలో నిర్ధారక స్థానంలో నిలబడ్డాడు 'రడ్డి' మొదట్లో రెడ్డిరికం ఉండి 'రెడ్లు'గా వ్యవహృతులైనవారి వారసులకు నేడు రెడ్డిరికం ఉన్నా, లేకున్నా, నడుమంతరంగా ఊడి ఉన్నా ఒకనాటి ఉపాధిపరమైన 'రెడ్డి' అన్న పదమే పట్టపు పేరుగా వ్యవహారంలో నిలిచిఉంది

ఇంతకూ రామాయణంలో పిడకలవేటలాగా పొంతనా పొందికా కుదరని ఇంత ఉపోద్ఘాతం ఎందుకంటారేమో? ఈ ప్రవేశికకు కారకులూ, ప్రేరకులూ ఐన ఉభయ కవిమిత్రులిద్దరూ - శివశ్రీ హిరే గౌడర చన్నపీరన గౌడ నవరూ, శ్రీ గుత్తి చంద్రశేఖరరెడ్డిగారూ- శ్రీ దొడ్డన గౌడగారితోపాటు కృష్ణదేవరాయల సువర్ణయుగంనాటి దండు బాటలో మొగసాల మజిలీగా వాసిగాంచిన 'జోళద రాసి' గ్రామవాసులు ఒకరి పట్టపు పేరు 'గౌడ', మరొకరిది 'రెడ్డి' ఈ ఇరువురూ ప్రస్తుత కృతికర్త శ్రీ దొడ్డన గౌడగారికి రెండు కళ్ళవంటివారు కన్నకొడుకులు కాకపోయినా, దొడ్డనగౌడగారి ఆలనపాలనలలో వీరు కన్న సంతానంకన్న మిన్న బహుముఖ ముఖరితమైన దొడ్డన గౌడగారి ప్రతిభా ప్రభుతనూ, పాండితీ విభుతనూ కర్ణాటాంధ్ర సీమలలో ప్రచురపరిచే మేలికెల సంలో ఈ వీరశేఖరులు ఉభయులూ నేను ముందు, నేను ముందు - అని పోటా పోటీలు పడుతున్న ఉత్తమ సంస్కృతిపరులు, ఉదాత్త గురు కార్యతత్పరులు.

'గురు శుశ్రూషయా విద్యా' 'స్పర్ధయా వర్ధతే విద్యా' అని ఊరకే అన్నారా పెద్దలు శ్రీ గౌడగారి తాత్త్విక ప్రచార సాచివ్యంలోనూ, రంగస్థల వరివస్యా సదస్యంలోనూ, సాధుసజ్జన పరిచర్యాసపర్యలలోనూ, సాహితీ సమర్చనా చర్చలలోనూ, స్వచ్ఛంద సేవా నేపథ్య సారథ్యంలోనూ ఈ దోస్తులిరువురూ ఏకార్థ సముపేతులు, ఇష్టార్థ సిద్ధి సంపీతులు 'ఆచార్యః పూర్వరూపమ్ - అంతేవాస్యుత్తర రూపమ్ - విద్యా సంధిః ప్రవచనగ్ం సంధానమ్' అన్న ఉపనిషత్సూక్తి గురుశిష్యులు ఈ ముప్పురిపట్లా స్వభావోక్తి విశిష్య, ఇట్టి శిష్యసంపత్తిని స్వాయత్తం చేసుకున్న శ్రీ దొడ్డన గౌడగారు అక్షరాలా అదృష్ట జాతకులు (సువర్ణకలనా సిద్ధులైన) ఈ భద్రాశయులు ముప్పురి 'హస్తవాసి' 'జోళదరాసి'ని రాసిలో, వాసిలో తులలేని వెలలేని జనపదంగా, జ్ఞానపథంగా తీర్చిదిద్దింది ఈ చూపులో జోళదరాసి గ్రామవాసులు ధన్యులలో ధన్యులు

సహస్ర చంద్రమో మండల దర్శనోత్సవ సముత్సుకులైన శ్రీ గౌడగారికి ఒసగులొసగే ఎత్తుకు ఎదగని ఈ 'శరణార్థి' ఎడదముడివిప్పి ముందిడిన 'ఉడుగర' ఇది-

మకాం నాగార్జున విశ్వవిద్యాలయం,
నాగార్జుననగర్ - 522510
ప్రమోద శ్రావణ శు పంచమి

తూమాటి దొణప్ప
26 జూలై, 1990

శోళదరాశి గుత్తి చంద్రశేఖరరెడ్డి
బి ఇ,
ప్రధాన నిర్వాహకుడు
వేంకటేశ్వరా ట్రాన్స్‌మోబైల్
ఎక్విప్‌మెంట్ ప్రై లిమిటెడ్
హైదరాబాదు

# దొడ్డ కోయిల

అదొకమహాటవి

ఆ అడవంతా వ్యాపించిందా అనిపించే మహావృక్షం పెద్దపెద్ద కొమ్మలతో దట్టమైన రెమ్మలతో సూర్యకిరణం నేల సోకని తీరులో వెలసివుంది ఆ చెట్టు బుడంలో, కొమ్మలు చీలే ప్రాంతంలో గూడుకట్టుకొని కాపురముంటోంది, ఒక కోయిల ఆ కోయిల నల్లనిదైనా అందమైనదే విశాలమైన రెక్కలు అందమైన పట్టులాంటి మెత్తని తనువూ, చక్కటి గొంతూ దాన్ని ఇతర్ల కోయిలల కన్న ఓ మెట్టు పైనే వుంచాయి

అయితే ఏం దానికి అనేక బంధనాలు బాధ్యతలు కాంత పైని వ్యామోహం, అధికారానికై ఆరాటం, జీవికకై పోరాటం దాన్ని బంధించివేస్తూంటే, కీర్తిదాహం, లాలసత్వం, పుట్టుకొస్తున్న పిల్లలపై మమకారం ఇవి బరువులుగా మారి దాని రెక్కలను బాధిస్తున్నాయి ఈ బాధ్యతల కామనల బరువుతో దాని రెక్కలు విశాలంగా విప్పుకోవడమే లేదు దాని గొంతు నిండుగా పలకడమే లేదు

ఇంత తాపత్రయపు బ్రతుకులో ఆ కోయిలకు ఒకనాడు అరుణోదయ రేఖలు విరియకమునుపే ఎక్కణ్ణుంచోగాని చాల మెత్తగా కానీ దృఢంగా, అస్పష్టంగా కానీ మధురంగా ఒక ఎలుగు వినిపించింది ఒక్క ఉదటున మేల్కొన్న ఆ కోయిల ఆగళం ఎవరిదో ఎటునుంచి వస్తోందో తెలుసుకోలేక పోయింది తను విన్న గళంలోని మాధుర్యానికి, స్వచ్ఛతకి మారుపోయింది ప్రయత్నించి రెండడుగులు పైకి ప్రాకగానే రెక్కలు నొప్పిపెట్టాయి బాధ్యతల-బరువు క్రిందికి లాగింది ఉసూరుమంటూ నిట్టూర్చింది గొంతెత్తి చెవులొగ్గి జాగ్రత్తగా విన్నదా, పైస్వరాన్ని అది తనున్న చెట్టు కొనకొమ్మల్లోంచి వినిపిస్తున్నట్లు చూచాయగా అనిపించింది అప్పుడు ప్రారంభమైంది దానిలో పై స్వరంలో తనూ పలకాలనే, తనూ ఆ ఎత్తులకు ఎదగాలనే తపన!

రోజులు నెలలుగా, నెలలు సంవత్సరాలుగా కాలచక్రం కదలిపోతూనే వుంది ప్రతిరోజు తెల్లవారుఝామున తను వింటున్న గొంతును చేరటానికి మన కోయిల ప్రయత్నిస్తూనే వుంది మొదటిరోజు రెండడుగులతో ఆగిపోయినదాని యానం, మరింత ప్రయత్నం మీద, మరో అడుగు, ఇంకో అడుగు, ఇంకొక్క అడుగు సాగుతూనే వుంది బరువులకు లొంగి తన గూడు చేరుకొంటూనే వుంది ఎంత ప్రయత్నించినా తన గొంతు తనకే అసంతృప్తి కలిగిస్తూనే వుంది అయినా తన ప్రయత్నం మానలేదు

ఈ నిరంతర సాధనతో, తపనతో, ధృఢ దీక్షతో అలా పైకి సాగిపోతున్న కోయిలకు పైకి వెళుతున్న కొలది రెక్కలు విశాలంగా విచ్చుకో సాగాయి బరువులు తగ్గిపోయాయి అక్కడి లలిత రసాల పల్లవములు ఎంతో ఆప్యాయమానంగా వున్నాయి గొంతు స్వచ్ఛతని మాధుర్యాన్ని నింపుకొంటున్నది తను విన్న గళం ఎవరిదా? ఎవరిదా? అని కొనకొమ్మల మీద నిల్చి చుట్టూచూసింది ఎవరూ అగుపడలేదు ఆర్తిగా, అభిమానంగా నిండుమనంతో గొంతెత్తి పిలిచింది

ఆశ్చర్యంగా కోయిలకు సందేహాల మబ్బులు విచ్చిపోయాయి ఆనాడు తను విన్న గళానికీ, ఈనాడు తన గొంతులోని నాదానికి ఏమీ తేడాలేదు అప్పుడే గడ్డకట్టిన పెరుగుని చిలికి అలాగే వెలికి తీసిన నవనీతాన్ని, కొంత కొంతగా మెసవుతూంటే కలిగే తాదాత్మ్యం అమ్మ స్తన్యాన్ని కేరింతలతో జుర్రుకొనే పసిపాప ఆనందం, చిమ్మచీకటి గుహలోంచి, కళ్ళుకిం పైన వర్ణించరానంత ప్రకాశవంతమైన వెలుగులోకి నడచిన అనుభవం, ఆ నల్లనయ్య పిల్లన గ్రోవిని ఆస్వాదిస్తున్నంత పరవశత్వం, తన గొంతులోనే జాలువారు తున్నాయి తనూ కూస్తోన్నది తను కూస్తోన్నది కోయిల తను ఏ బాధలూ బాదర బందీలూ లేని విహాయసంలో నిర్మల, నిరామయ వాతావరణంలో ఎలమావి మేతతో ఎద పొంగేలా ఆనందంగా కూయగల్గుతున్నది తను తొలుత విన్న గొంతుతో తన గొంతు కలగలిసి పోయింది ఏకనాదం సంతరించు కొన్నది అదే ప్రణవనాదం

జోళదరాశి గ్రామంలో సంపన్న కుటుంబంలో పుట్టి ఆడింది ఆటగా పాడింది పాటగా వేసింది నాటకంగా గడిచిపోయింది బాల్యం ఒక విధమైన మొండితనం, అనుకున్నది సాధించాలనే తపన చోటుచేసుకున్నాయి అప్పుడే యవ్వనం రెక్కలు విచ్చుకొన్నది కామనలూ కనులు తెరచుకొన్నాయి అది వొక వున్మాదం, ఒక ప్రభంజనం, దినాలు గడిచి అనుభవంగా మారిపోయింది భాషాదురభిమానాలు కులవైషమ్యాలు ఎడనెడపొడ సూపిన అహంకారం అన్నీ అన్నీ కాలానుగతంగా కరగిపోయి, అంతః చేతనగా ప్రజ్వలించిన నాద ప్రియత్వాం కళామూర్తిత్వందాల్చి నటరాజు భక్తికి దారితీసింది అలా నటరాజ దివ్యదీప్తుల్ని బళ్ళారి రాఘవగారు కనులకు కట్టితే ఆధ్యాత్మికంగా మా చేళ్ళ గురికి ఎర్రితాత కలలో కనిపించి పథనిర్దేశం చేశాడు దాసోహం భక్తి రూపు కట్టిన మురుఘా మఠం స్వామి శ్రీమృత్యుంజయుల వారు హస్తమస్తక సంయోగంతో నూతన జన్మ ప్రసాదించినారు అంతా కరగిపోయి నిఃకల నిజం నికరంగా ముందు నిలుస్తున్న తరుణంలో ఒళ ఎళ్లారి తాతగారు బసవని కార్యంపై దృష్టి మరల్చారు

ఈ దొడ్డ కోయిల నేడు అన్ని భవబంధాలకు అతీతమై పోతున్నది. మమ కారాల, అహంకారాల మంచుతెరలు కరగి పోగా రామేశుని ప్రసన్నత అనే అరుణ కాంతులు విచ్చు కొంటున్నవి అజాత శత్రువుగా రూపొందుతున్న ఈ దొడ్డ కోయిలకు ఎందరెందరో ఆర్ద్రితా పూర్ణమైన తమ అభిమానాలు ఎలమావి చిగురు జొంపములుగా మేతవేస్తూంటే ఈ మెత్తని, కలమాగిన, తన్ను తాను మరచిన, పరవశించిపోయిన, ఎల్లలు చెదరిన, కల్లలుమాసిన, నిరామయమయిన, నిర్వికారమయిన, సహజమయిన, సరళమయిన, సులలితమైన గొంతులోంచి అవి శ్రాంతంగా ప్రణవనాదం పలుకుతున్నది ఈ దొడ్డకోయిల కూస్తున్నది అపును ఈ దొడ్డకోయిల రామేశప్రియంగా నేడు కూస్తున్నది

కూయవేమెనీవు కోయిలా
నరకమెల్ల నాకమవగా ॥మా॥
నీ పాటవిని ఆ రామేశుడే గంతులేసి గెంతేలా ॥కూ॥

అని ఆలాపించినదాగొంతే
ఎక్కడిది ఈ నాదలహరి అని వెతుక్కొన్నది గొంతే

పోయివస్తానండి మా వూరెకి, అందరి శరణండి శెలవిచ్చిపంపండి మా వూరి రామేశుడు పిలువనంపేడు అని నిర్వికారంగా పాడగల్గింది.

లలితరసాల పల్లవఖాది యై చొక్కు
కోయిల జేరునే కుటజములకు,

ఆదొడ్డ కోయిల స్వరం ప్రేరణగా మరో కొత్త గొంతు వినపడుతున్నది ఈమధ్య అదింకా సంపూర్ణ స్పష్టతను చేకూర్చుకోనే ప్రయత్నంలో వున్నా గళంలోని స్వచ్ఛత, మానవత్వపు మాధుర్యం కొట్టవచ్చినట్లు కనపడుతున్నాయి నిజమే! అదిప్పుడు అన్ని బరువులూ మోస్తూనేవుంది ఒక్కొక్క బంధనం విడిపోతుంటే కొత్తకొత్త మమతానురాగాల బంధాలు దాన్ని పైకే లాగుతున్నాయి నిశరాతిరిదాటింది శుక్రుడు పథగామిలా ఉదయిస్తున్నాడు వెలుతురిప్పు డిప్పుడే ఆవరించు కొంటోంది ప్రణవనాదం పలికేందుకై గొంతు సవరించు కొంటోన్న ఈ చిన్న కోయిలను నేను చెన్న కోయిల అంటాను

ఏదేమైనా ఈ గొంతు నాది అపశ్రుతులున్నా, అరకొరలున్నా ప్రళయ, ప్రణయ, ప్రణవ నాదాల ప్రవాహంలో ఏటికి ఎదురీదుతున్న ఈ పికం స్వరం గుండె గొంతుకలో కొట్లాడుతోనేవుంది దొడ్డ కోయిల ప్రణవనాద శ్రవణంచే పవిత్రమై చెన్న కోయిల మమతానురాగాల పిలుపుకు ప్రతి స్పందనను ఇలా వ్యక్తం చేస్తున్నది

గొంతెత్తి ఓంనమో నారాయణా అంటున్నది చేతులెత్తి నమస్కరిస్తున్నది

హైదరాబాదు
31-7-90

ఓంనమశ్శివాయ
గుత్తి చంద్రశేఖరరెడ్డి

# పూర్ణసిద్ధి

**డాక్టరు వి.వి.యల్. నరసింహారావు,**
ఎం ఏ ,పిహెచ్ డి
పురా సంచాలకుడు
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయం
పరిశోధనాలయం, హైదరాబాదు

శ్రీ దొడ్డనగౌడ గారి 'శూన్య సంపాదన వ్యాఖ్యకు పూర్ణసిద్ధి కలిగింది. లోకంలో జీవులకు పూర్ణత సంపాదించుకోవాలనే ఆసక్తి సహజం, కాని శూన్యతను సంపాదించుకోవా లనుకోవటం అసహజం అతి విలక్షణం మరి దీని సార్థక్యం? అంటే ఈ శూన్యమని చెప్పబడేది లౌకికార్థంలో మనం చెప్పుకునే 'వట్టి-రిత్త' కాదన్నమాట, శూన్యంలా కనిపిస్తున్నా అది పూర్ణమైనదే అయి వుండాలి లేకపోతే శూన్యాన్ని సంపాదించుకోవాలనే ఆసక్తి ఎందుకు కలుగుతుంది?

శివశరణుల దృష్టిలో శూన్య సంపాదన కంటె కోరదగింది మరొకటిలేదు పరమ గమ్యమైన శూన్య సిద్ధి కోసం అనేక శివశరణులు తమ జీవితాలు వెచ్చించి సిద్ధి పొందారు శూన్య తత్త్వ రహస్య నిర్వేదనంచేసి తాము సాధించిన పూర్ణతను లోకులకు కూడా సిద్ధింపజేసి తరించారు

అటువంటి మహానుభావులలో గూళూరు సిద్ధ వీరాచార్యుడు గణనీయుడు కన్నడభాషలో ఆ మహానుభావుడు సంకలించిన 'శూన్యసంపాదన' పరమ పవిత్రమైన శైవదర్శన గ్రంథం ఆ మహాగ్రంథాన్ని గ్రహించి, సుగమ సుందరమైన వ్యాఖ్య రచించిన పుణ్యుడు శ్రీ దొడ్డనగౌడ కన్నడంలో 'బయలు గళికెయ బెళగు' అనే పేరుతో వ్రాసిన ఆ వ్యాఖ్యాన గ్రంథాన్నే తెనిగించి, శ్రీ గౌడగారు ప్రకృత గ్రంథంగా మనచేతి కందించారు

గౌడగారి కిప్పుడు నిండు ఎనభై యేళ్ళు ఈయన కన్నడాంధ్రములు కైవసమైన గొప్ప రచయిత అంతకంటే కూడా గొప్ప నటుడు బళ్ళారి రాఘవకు సహనటుడుగా ఆ మహానటుని మన్ననలందుకొన్న మరో మహానటుడు ఈయన నటుడుగా రచయితగా తన 'అనుభవాలు, జ్ఞాపకాలు' గ్రంథరూపంలో తెలుగువారి కందించాడు ఆ గ్రంథంలోని ఉపసంహార వాక్యాలలో తన 'తుది కోరిక' ఏమిటో స్పష్టంగా తెలియజేయటం జరిగింది

"ఇన్నేళ్ళ అభ్యాస ఫలితంగా సాధనలో గడించిన ఆనందం-అదే-కావ్యగతమైన నిత్య సత్యతత్వం పూతగా సాగిన జీవితానందం-గూర్చి తెలపాలని శూన్యసంపాదనా తత్వభరిత కావ్యం మహానుభావులైన అల్లమ, బసవ, సిద్ధరామ, అక్కమహాదేవి, చెన్నబసవాది అనేక శివశరణుల జిజ్ఞాసకు పట్టిన అద్దం, అది నాకు తెలిసిన మేర కన్నడాంధ్రాల్లో వ్యాఖ్యానం వ్రాసినాను 'బయలు గళికెయ బెళగు' వెలుగు చూచింది మరి తెలుగులో కూడా వెలువడి నా తెలుగు సోదరుల ఎదలో బసవతత్వ వ్యాప్తికి తోడ్పడితే అదే నాకు తృప్తి, సంతృప్తి." (పుట 151)

గౌడగారి తుది కోరిక ఇప్పుడు తీరింది తీరటానికి పరమ సాధకుడైన భవ్యుడు-శ్రీ జి చంద్రశేఖరరెడ్డి, ఈ గ్రంథ ప్రచురణ మొక మహా యజ్ఞంగా భావించి, అహరహం శ్రమించి, అనేక వ్యయప్రయాసల కోర్చి, కార్యసాధకుడై శ్రీ గౌడగారికి మాత్రమే కాక సకలాంధ్ర శివశరణ సాహితీ రసజ్ఞ కోటుంకు కూడా సంతృప్తి సంతోషాలు కలిగించాడు. శ్రీ రెడ్డి దొడ్డన గౌడ విరచిత 'క్రాంతిపురుష బసవన్న' నాటకాన్ని కన్నడంనుంచి తెనుగుచేసిన ధీశాలి

ఇంతా చేసి ఇది శూన్య సంపాదన ఆకాశాన్ని అరచేత ముడుచుకోవటం వంటిది ఆకాశం లేనిదే అవకాశం లేదని అందరికీ తెలుసు అవకాశం లేక పోతే చరాచరమైన జగత్తే లేదు సృష్టి సమస్తం అవకాశంలోనే ఇమిడి వుంది అంటే ఆకాశం కేవలం శూన్యం కాదన్నమాట బ్రహ్మాండ భాండమైన విశ్వ విశ్వాన్ని శూన్యం తనలోనే నింపుకొని వున్నదని అర్థం అటువంటి శూన్యాన్ని సంపాదించటం కంటే జీవి కోరుకోవలసింది ఏముంటుంది?

# II

లౌకికమైన బ్రతుకులు వెళ్ళబోసుకునే సామాన్యుల దృష్టిలో సంపాదన శూన్యమైన వారిపట్ల ఆదరం తక్కువ లౌకిక సంపాదనలు కేవలం అర్థ తత్పరంగా ఉంటాయి అలౌకిక సంపాదన పారమార్థికమై శివశంకరమై ఉంటుంది పరమార్థం తత్త్వచింతకలవారికే సాధ్యం

తత్త్వ పరిభాషలో శూన్య శబ్దం మనకు క్రొత్తది కాదు చిరపరిచితమైన చిత్పదార్థం అది నిత్య నిర్మలమైన పరశివ పరంజ్యోతి స్వరూపం సర్వ శూన్య నిరాలంబ స్థితి సముద్భూతం ఈ సంగతి తజ్ఞు లెరుగుదురు

షడ్దర్శనాలలో అటు ఆస్తికములు కాని, ఇటు నాస్తికములు కాని శూన్యమును నిరసించినవి కావు అస్థిరాత్మవాదులై నాస్తికులుగా చెప్పబడిన బౌద్ధులలో కూడ సౌత్రాంతిక, వైభాషిక, మాధ్యమికుల మాట ఎట్లావున్నా యోగాచార్యులు మాత్రం శూన్యవాదులుగానే ప్రసిద్ధి పొందారు

బుద్ధత్వప్రాప్తికి శరణ్యమైన 'సర్వజ్ఞత్వం బోధిసత్వలక్షణంగా చెప్పబడింది పూర్ణత్వపర్యాయమైన 'పారమిత' షడ్విధంగా విభక్తమై దాన శీల క్షాంతి వీర్యధ్యానపూర్వకమై 'ప్రజ్ఞ'కు పారమ్యం సిద్ధింపజేసింది నాగార్జునుల ప్రజ్ఞాపారమిత శూన్యతా లక్షణాన్ని స్వభావ రమ్యంగా ఆవిష్కరించింది శూన్యత నిస్స్వభావ మనుకుంటే లోకవ్యవహారం విచ్ఛేదం పొందకతప్పదు సంవృతి సత్యంనుండి పారమార్థికసత్యం నిష్పన్నమయ్యే మార్గం 'మాధ్యమిక కారిక'ల్లోను, 'విగ్రహవ్యావర్తిని' లోను నాగార్జునుడు నిర్ద్వంద్వంగా ప్రవచించాడు

ఈ మార్గంలో ప్రభవించిన తర్కమే అనంతర కాలంలో గౌడపాదులు, ఆదిశంకరులు, మధుసూదన సరస్వతి ప్రముఖులు సమాదరించి జగన్మిథ్యా తత్త్వ ప్రవక్తలై అవిద్యారూప మాయాతత్త్వ నిరాసకులైనారు

బ్రహ్మతత్త్వం జగత్తుకు వివర్తోపాదానమనీ వివర్తమంటే కానిది ఉన్నట్లు భాసించటమే ననీ ఉన్నది ఒక్కటీ త్రికాలాబాధ్యమై పారమార్థిక సత్త అనబడే బ్రహ్మతత్త్వమే ననీ, బ్రహ్మజ్ఞానేతరమైనది వంధ్యాశిశు, గగన పుష్ప సదృశమై మిథ్యాశబ్దవాచ్యమనీ శూన్యతత్త్వాన్ని క్రొత్తపరిభాషలో చెప్పటం జరిగింది అద్వైతుల 'మాయ' ఈ పరిభాషలో పరమప్రాధాన్యం సంతరించుకుంది,

శూన్యవాద మాయావాదాలకు భిన్నం కాని అచలమార్గం నాథపంథీయులు ఆదరించిందే నవనాథులలో ఒకడైన గోరఖ్‌నాథుడు మొదట బౌద్ధుడైనా తరువాత శైవుడు కావటం గుర్తించతగిన అంశం ద్వైతాద్వైత విలక్షణమైన సమతత్వ ప్రతిపాదన, వర్ణాశ్రమ తిరస్కారం, కర్మకాండ నిరాసం, యోగమార్గావలంబనం నాథపంథీయమైన అచల పరిపూర్ణయోగానికి అభిన్నములే

అందాకా ఎందుకు? శివాద్వైతిగా జీవతత్వాన్వేషణ చేసిన వేమన నిర్గుణోపాసన శూన్యమందే పర్యవసించింది బయలందే బ్రహ్మముందని కుండబద్దలుగొట్టి చెప్పాడుగదా!

"తెలివి నిలిపి చూడు దీపించు నాకళల్
కళ లుడుపక చూడు కలుగు బయలు
బయలు నంటి చూడు బ్రహ్మంబు గాంచెదు
విశ్వదాభిరామ వినుర వేమ "

"బయలున సర్వము పుట్టును
బయలందే లీన మగును బ్రహ్మంబనగా
బయలని మదిలో తెలిసిన
బయలందే ముక్తి బట్టబయలగు వేమా!"

వేమనకు సమకాలికుడైన వీరబ్రహ్మం తన కాళికాంబ శతకంలో శూన్య సంపాదన లక్షణాన్ని స్పష్టంగా వివరించాడు

"బట్ట బయలనంగ పరమాత్మ యనగను
వే రటంచు దలచు వెఱ్ఱివాడు
బయలులోన బయలు పరికింప పరమాత్మ
కాళికాంబహంస కాళికాంబ "

## III

వీరబ్రహ్మాదులపై కర్నాట వీరశైవ ప్రభావం బలమైన ముద్రవేసింది వీరశైవులలో బసవేశ్వరుడు పరమానుభావుడు శూన్యసంపాదకులలో అగ్రగణ్యుడై బయలు ప్రాకి పరమేశ్వర సాక్షాత్కారం తాను పొందటమే కాక ధరపై జీవులకెల్ల కలిగించిన మహోపదేష్ట అందుకే బసవేశ్వర వచనాలు వచన వాఙ్మయంలో అనర్ఘమణులుగా తేజరిల్లాయి

ఆ మహనీయుడు తనకు గురుస్థానీయుడైన కూడలి సంగమ దేవుణ్ణి స్మరణపూర్వకంగా సంబోధిస్తూ, పరమపారవశ్యంతో పలికిన వచనాలు వీరశైవ భక్తులకు మాత్రమే కాక సర్వసాహిత్య రక్తులకు కూడా ఉపాదేయములైనాయి

"నా దేహాన్ని దండంగా చెయ్యవయ్యా! నా తల సొరబుఱ్ఱగా చెయ్యవయ్యా! నా నరాల్ని తంత్రుల్నిగా చెయ్యవయ్యా! నా వ్రేళ్ళను తీవలు బిగించే పుల్లల్ని చెయ్యవయ్యా! ముప్పైరెండు రాగాలు పాడవయ్యా, ఎదఎత్తుకొని వాయించవయ్యా, కూడలి సంగమ దేవా!"

బసవేశ్వరుని ఈ సంగీతం విన్న సిద్ధవీరణ్ణ తన గద్యలో బసవేశ్వరుని వర్ణించిన రీతి గుండె గగుర్పాటు కలిగిస్తుంది సాధారణ శైవులవల్ల వీరశైవ సద్భక్తి మసకబారిపోవటం బసవన సహించడు సాధారణ శైవుల్నే మన్నించని బసవన శైవేతరుల్ని మన్నిస్తాడా? అందుకే అన్నాడు గూళూరు సిద్ధవీరణ్ణొడెయడు తన గద్యంలో-

గురులింగ జంగమ పూజచేస్తూ నిత్యం ఎనభై ఎనిమిది పవాడములను జయిస్తున్న బసవేశ్వరుడెట్లా ఉన్నాడంటే-

'శైవ హృదయశూల, వైష్ణవ జీమూత ఝంఝామారుత, చార్వాక మద దంతి సృణి, బౌద్ధ దర్దురఫణి క్షపణవన దావానాల, నైయాయిక హరిణశార్దూల, భాట్టమత శరధి కుంభజ, ప్రాభాకర కదళీమత్తగజ, మీమాంసా హిమచైత్ర, వైశేషిక లతాలవిత్ర, కాపాలిక కుముద మార్తాండ, సాంఖ్యమత శరభభేరుండ, కర్మవాద కుధర కులిశ, మాయావాదమూల కుద్దాల, కాలాముఖ కంఠపాశ, శాక్తేయ తిమిరదీప, సౌరమత పన్నగ ఖగాధిప - సన్నిభుడై, వీరశైవ సద్భక్తిని వర్ణిస్తూ, శివశరణ సాగర పూర్ణేందు భాసమానుడై' సుఖంబున్నాడట

(పుటలు 105, 106)

ఇక్కడ మూలగద్యకారుడైన సిద్ధవీరణ్ణ బసవేశ్వర చరిత్ర ఏమీ వివరించకుండా విశిష్ట విశేషణ ప్రయోగ మూలంగా బసవేశ్వరుని ప్రతిభాపాండిత్య మహిమలు రూపు కట్టించాడు

దొడ్డన గౌడగారు వ్యాఖ్యానంలో వీటి వివరణకు పూనుకోక బసవేశ్వరుని చరిత్రను హృదయంగమంగా వివరించి ఒక్కమాటన్నారు "ఎవరి అభి

ప్రాయమెట్లున్నను శూన్యసంపాదనకు ఇప్పుడు చెప్పినదంతా ఎక్కువైనది కాని కొంచెమైన వెనుకటి వృత్తాంతము తెలిసికొనవలయునని ఎవరికైన అభిలాష ఉండుట సహజమని పూర్ణంగా చెప్పకపోయినా తగినంత వివరించడమైనది "
(పుట 108)

గౌడగారి వ్యాఖ్యానపద్ధతి సంగ్రహంగా, సముచితంగా, సుందరంగా, సురుచిరంగా ఉన్నది

సహజంగా మహానటుడు కావటంవల్లనూ, మహాగమకి కావటంవల్లనూ సన్నివేశాన్ని నాటకీయ ఫక్కీలో శ్రవణసుభగంగా వినిపిస్తున్నట్లు కళ్ళముందు ప్రదర్శిస్తున్నట్లు వ్యాఖ్యానించగలిగాడు

అల్లముని ఆవేదనతో ఆరంభమైన శూన్య సంపాదన ముక్తాయక్క, సిద్ధరామయ్య, బసవేశ్వరుడు, మడివాళయ్య, అద్యక్కి మారయ్య, మాళిగె మారయ్య, నులియ చంద్రయ్య, ఘట్టివాళయ్య మొదలైన మహా శరణుల కృషితో ఉత్తరోత్తర యెంత సుసంపన్నమైనదో గూళూరు సిద్ధవీరేశ్వర గద్యములు సూత్రప్రాయంగా చెప్పగా దొడ్డన గౌడగారి సంగ్రహ వ్యాఖ్యలు పరశివ తత్త్వాన్ని - శూన్యంలో నిండివున్న మహా నిక్షేపంగా నిరూపిస్తూ - పూర్ణసిద్ధిని సాధించాయి

ముందు అందుకే అన్నాను - మళ్ళీ అంటున్నాను—

శ్రీ దొడ్డన గౌడగారి శూన్యసంపాదన వ్యాఖ్యకు పూర్ణత సిద్ధించిందని

గౌడగారి ఈ కోరిక సఫలం చేసిన చంద్రశేఖరరెడ్డిగారి చిరకాల వాంఛ ఈడేరింది.

గమక కళానిధి గమక గాంధర్వం శివశరణ శ్రవణపేయంగా తెలుగు గుండెల గుంజారవ గేయంగా శూన్యసంపాదన వ్యాఖ్యారూపంగా జాలువార్చిన దొడ్డన గౌడగారికీ ఏతత్పూర్ణసిద్ధిని పరామర్శించే అవకాశం నాకు కలిగించిన చంద్రశేఖరరెడ్డిగారికీ అభివాదపూర్వకంగా అభినందిస్తున్నాను

హైదరాబాద్
31-7-1990

పి. వి. యల్. నరసింహారావు

ఆ మహనీయుడు తనకు గురుస్థానీయుడైన కూడలి సంగమ దేవుణ్ణి స్మరణపూర్వకంగా సంబోధిస్తూ, పరమపారవశ్యంతో పలికిన వచనాలు వీరశైవ భక్తులకు మాత్రమే కాక సర్వసాహిత్య రక్తులకు కూడా ఉపాదేయములైనాయి

"నా దేహాన్ని దండంగా చెయ్యవయ్యా! నా తల సొరబుఱ్ఱగా చెయ్యవయ్యా! నా నరాల్ని తంత్రుల్నిగా చెయ్యవయ్యా! నా వ్రేళ్ళను తీవలు బిగించే పుల్లల్ని చెయ్యవయ్యా! ముప్పైరెండు రాగాలు పాడవయ్యా, ఎదఎత్తుకొని వాయించవయ్యా, కూడలి సంగమ దేవా!"

బసవేశ్వరుని ఈ సంగీతం విన్న సిద్ధవీరణ్ణ తన గద్యలో బసవేశ్వరుని వర్ణించిన రీతి గుండె గగుర్పాటు కలిగిస్తుంది సాధారణ శైవులవల్ల వీరశైవ సద్భక్తి మసకబారిపోవటం బసవన సహించడు సాధారణ శైవుల్నే మన్నించని బసవన శైవేతరుల్ని మన్నిస్తాడా? అందుకే అన్నాడు గూళూరు సిద్ధవీరణ్ణొడెయడు తన గద్యంలో-

గురులింగ జంగమ పూజచేస్తూ నిత్యం ఎనభై ఎనిమిది పవాడములను జయిస్తున్న బసవేశ్వరుడెట్లా ఉన్నాడంటే-

'శైవ హృదయశూల, వైష్ణవ జీమూత ఝంఝామారుత, చార్వాక మద దంతి సృణి, బౌద్ధ దర్దురఫణి క్షపణవన దావానాల, నైయాయిక హరిణశార్దూల, భాట్టమత శరధి కుంభజ, ప్రాభాకర కదళీమత్తగజ, మీమాంసా హిమచైత్ర, వైశేషిక లతాలవిత్ర, కాపాలిక కుముద మార్తాండ, సాంఖ్యమత శరభభేరుండ, కర్మవాద కుధర కులిశ, మాయావాదమూల కుద్దాల, కాలాముఖ కంఠపాశ, శాక్తేయ తిమిరదీప, సౌరమత పన్నగ ఖగాధిప - సన్నిభుడై, వీరశైవ సద్భక్తిని వర్ణిస్తూ, శివశరణ సాగర పూర్ణేందు భాసమానుడై' సుఖంబున్నాడట (పుటలు 105, 106)

ఇక్కడ మూలగద్యకారుడైన సిద్ధవీరణ్ణ బసవేశ్వర చరిత్ర ఏమీ వివరించకుండా విశిష్ట విశేషణ ప్రయోగ మూలంగా బసవేశ్వరుని ప్రతిభాపాండిత్య మహిమలు రూపు కట్టించాడు

దొడ్డన గౌడగారు వ్యాఖ్యానంలో వీటి వివరణకు పూనుకోక బసవేశ్వరుని చరిత్రను హృదయంగమంగా వివరించి ఒక్కమాటన్నారు "ఎవరి అభి

అగాధమైన బయలులో ఎండిన ఆకులు ఆహారముగా జేసికొని నీవే నాకు మగడు కావలెనని శివుని గూర్చి తపసు జేసినది ఇట్టివెన్నో కోరికలపై విచిత్ర వరములు తమ ఇష్ట దైవారాధనలనుంచి పొందినారని తెలుపు గాథలు కొన్ని మాత్రమే ఆ ఋషులు, మునుల్లు తమ ఇష్టార్థములులు పొందిన తరువాత ఈ బయలును, ఏ చెట్టుచేమలో, ఏ పుట్టదిబ్బలో ఏ రాఘుగుండులో అడ్డుపెట్టి బట్ట బయలును మరుగు పరచుకొన్నారు ముఖ్యముగా వేమనవంటి యోగులైనను, బయలు బ్రహ్మమనినమ్మి సిద్ధి పొందినప్పటికిని పార్థివ శరీరమున్నంతవరకు వట్టి బయలులో బ్రతుకలేదు

ఇట్టి స్థితిలో బయలు బ్రహ్మను ఆరాధించు విధానము అసాధ్యమని ఆ బయలు బ్రహ్మను శూన్యమునుంచి విడదీసి, ఆకారానికి తెచ్చుకొన్నదే శూన్య సంపాదనము వీరశైవులు శూన్యమునుంచి గురు, లింగ, జంగమములను సంగ్రహించినారు ఉపాసన విధానము అష్టావరణ పంచాచారాలు షట్స్థలములుగా నియమించుకొన్నారు అష్టావరణమే అంగిమనియు, పంచాచారమే ప్రాణమనియు, షట్స్థలములే ఆత్మయనియు భావించి, గురునిర్ణయ లింగ ధారియై ప్రతి వీర శైవుడు నమ్మి ఆచరించుట కర్తవ్యము, (దీని సంక్షిప్త వివరణ 1978లో ప్రకటితమైన నా 'వచనామృతము' (తెలుగు అనువాదము ప్రస్తావనలో చూడవచ్చు) ఇట్టి సంపాదనము వీరశైవులేగాక భారతీయ వివిధ మతములు సంపాదనజేసి అనుష్ఠానమునకు తెచ్చుకొన్నవనుట సత్యము

మనలో కొంతమట్టుకు ఈ విధానమును నిరసించిన మతము లేకపోలేదు ఇప్పటికి ముసల్మానులు, క్రైస్తవులలో ఒక తెగవారు కలరు ఉపాసనలు భిన్నముగా సాకార-నిరాకారములలో, సగుణ, నిర్గుణములలోనున్నను మానవుని మన శుద్ధిని, సిద్ధిని గూర్చియే చెప్పబడినవి చెప్పబడిన విధి విధానములు మత మతానికి ఎగుడ దిగుడులుగా నున్నను, ఆయా మతాలలో చేరినవారు ఇతర మెంచక తమ ధర్మమే శ్రేష్ఠమని నమ్మి, అనుష్ఠానమునకు తెచ్చుకొని ఆత్మోద్ధారము పొందుట కర్తవ్యము "స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః" అన్న గీతాచార్యుని బోధ మరవరానిది

అన్ని మతాలకు మూలము ఆదిశైవమతమని పెద్దలు పేర్కొన్నారు ఆదియు శూన్యావతరణమే కాలమును అందుకోలేని జ్యోతిర్లింగము ఆవిర్భ

వించిన సన్నివేశాన్ని గుర్తుంచుకొని అది ప్రథమముగా భావించుకొని దాని ప్రతీకగా మానవులు ముందుముందు తమతమ ఇష్టాలను (మతాలను) సామూహికంగా బోధలుజేసి, మానవుల అభిమతాలను పొంది, ఇది శ్రేష్ఠ మతమని కట్టు దిట్టములతో, నిబంధనలు ఏర్పరుచుకొని, జీవుడు దేవుడగు సదుపాయములు సాధనమునకు తెచ్చుకొన్న అంశము సాధారణమైనదికాదు ఎన్నో ఏండ్లు అసంసారియై, ఇచ్ఛవచ్చినట్లు వ్యవహరించిన మానవుడు క్రమబద్ధ జీవితమును అలవరుచుకొనుట ఎంతయో శ్రమదాయకమన్నది చరిత్రనుంచి తెలియవచ్చును

## అష్టావరణాలు

గురు-లింగ, జంగమ విభూతి రుద్రాక్షి మంత్రము
పాదోదకము, ప్రసాదము - ఇవి అష్టావరణములు

## వివరణ

గురు—వీరశైవుల అష్టావరణ, షట్స్థల మార్గానువర్తియై, సమాజసమ్మతిని పొంది గురుత్వసంస్కారమువడసి సమాజానికి లింగదీక్షలిచ్చి ధర్మబోధ జేయు కర్తవ్యము (కాయకము) గలవాడు

లింగ—భక్తుల అనిష్టాలను పరిహరించి వారుకోరే ఇష్టాలను ప్రసాదించేది ఇష్టలింగము దీనిస్వరూపము సచ్చిదానందము

జంగమ—భక్తి జ్ఞాన, వైరాగ్యముల సమన్వయముతో సమాజనిర్ణయ ప్రకారంగా గురూపదిష్టలింగారాధనయందుండు భక్తులను పరీక్షించి రక్షించువాడు (కాయకము)

విభూతి - ప్రకాశ ప్రతీకమైన శివుని శరీరపుకాంతిగా ఎంచి, దానివలె భక్తుడు ప్రకాశమును పొందవలెనన్న భావచిహ్నము

రుద్రాక్షి - పరమశివుని జ్ఞాననేత్రమని నమ్మి ఒకటినుంచి పదునాలుగు ముఖాలున్న రుద్రాక్షలను భక్తులు తమ అంగమునందు ధరిస్తారు చిన్న రుద్రాక్షలను నూటఎనిమిది కూర్చి మాలగాజేసుకొని మంత్రపునరశ్చరణకు జపమాలగా వాడుతారు

మంత్రము - ఓం నమః శివాయ యనునదే మంత్రము ఈ మంత్రము ద్వారా లింగ స్వరూపము నిర్ణయింపబడినది, ఇక్కడ లింగము అర్థరూపమైతే తద్వాచక శబ్దమే మంత్రమని చెప్పబడును ఎందుకంటె శబ్దార్థాలకు విడదీయ రాని సంబంధముండుటవల్ల అంగముమీద ధరించిన లింగానికి, మనస్సు కిచ్చిన మంత్రానికి దేహ మనస్సుల సంబంధమెట్లో అట్లే నిత్య సంబంధమైనది

పాదోదకము - ఉపాసనాక్రమమును బట్టి లింగవంతుడైన భక్తుడు- గురు జంగమముల పాదపూజచేసి లింగసాక్షిగా స్వీకరించుట దీక్షాపాదోదకము (గురుపాదోదకము), లింగపాదోదకము (శిక్షాపాదోదకము),జంగమపాదోదకము (జ్ఞాన పాదోదకము) అని మూడు పాదోదకములు

ప్రసాదము .- భక్తుడైనవాడు తన తను-మన, ధనాదులను గురులింగ జంగములకర్పించి వారి తనుమన ధనాలని ప్రసాదంగా భావించి భోగించుట

## పంచాచారములు

లింగాచారము, సదాచారాము, శివాచారము

గణాచారము-భృత్యాచారము ఇవి పంచాచారములు

## వివరణ

లింగాచారము - మానవుని నడతకు శుద్ధతనుకూర్చు నీతి ప్రధానమైన ఆచరణ లింగ పూజాధ్యానములనుంచి లింగములోనున్న మంచిగుణములు తన అంగ-ఇంద్రియములనుంచి మనస్సునుంచి వ్యవహరించే సద్వర్తనము

సదాచారము - లింగాచార సద్గుణములను పొందియుండుట ఇది వైయక్తికము సదాచారము వీరశైవుని వ్యక్తిగతము కాకుండా సమాజానికి దేశానికి హితము కలిగించేది వీరశైవేతరులకు గూడ విరుద్ధం కాని రీతిగా ఆదరణీయంగా వర్తించేది

శివాచారము - లింగభేదాలెంచక, చిన్న పెద్దయనక, తన మతమే ముఖ్య మనక, ఇతర మతాల ఆత్మానుభవులను శివస్వరూపులుగా భావించి నమ్రతతో మెలగుట

గణాచారము - తన మతము, ధర్మము, ఉపాసనానిష్ఠకు భంగము రాకుండా చూచుకొని, ఇతర ధర్మములకై సహకరించుట

భృత్యాచారము - నేనన్నది నాదన్నది అహంకార మమకారములు ఎట్టి పరిస్థితులందును తన జీవనము రాకుండా యుండి గురులింగ జంగమునికి సేవకుడై తద్వారా సర్వసమాజములోనున్న పూజ్యులందు వినయముతో వర్తించుట

## షట్ స్థలములు

భక్త, మహేశ, ప్రసాది, ప్రాణలింగి, శరణ
ఐక్య-ఇవి ఆరు స్థలములు

## వివరణ

భక్త - సదాచారవర్తనము శివునియందు (లింగము) నమ్మకము, శివ భక్తులయందు కింకరత లింగజంగములు ఒకటేయని భావించి భృత్యాచారియై యుండుట

మహేశ - బొంకకుండుట - అనాచారిగాకుండుట, అన్యుల హింసించ కుండుట, పరధన - పరస్త్రీ - పరనిందల విడిచియుండుట, సదాలింగ నిష్ఠతో పరిశుద్ధాత్ముడై యుండుట

ప్రసాది - తన సర్వాంగాన్ని లింగనిష్ఠతో గట్టిపరచి, మనస్సును ఎగ ద్రోసి ఉన్మనీయావస్థలో సహస్రారదళములో శాంతినివాసమేర్పరచి లింగమునకు అర్పించిన నైవేద్యమును లింగజ్ఞానమునుంచియే స్వీకరించిన అంగార్పితాన్ని తొలగించి లింగముఖానికి నివేదించి నిత్యము లింగప్రసాదంగా స్వీకరించుట (ప్రతియొక్క ఇంద్రియ ముఖముచే తాను అనుభవించే పదార్థములను మొదట లింగానికర్పించి తరువాత అవధాన భక్తి పూర్వకంగా ఆ లింగ ముఖమునుంచి ప్రసాదంగా పరిగ్రహించుట)

ప్రాణలింగి - సుగుణాలే ప్రాణలింగము దుర్గుణాలే ప్రాణవాయువు ఇట్టి సుగుణ-దుర్గుణాల పారద్రోలి సుఖ దుఃఖాలలో, శత్రు-మిత్రత్వములో స్తుతి నిందలలో, పరిహాస్య, విస్మయ, విలాసాల విషయదోషాల భ్రాంతిని త్రెంచి

ప్రాణసంబంధమైన పూర్వాశ్రయాలను విడిచి సదాలింగధ్యాన సంబంధియై, లింగమే ప్రాణంబుగానుండుట

శరణ - లింగాన్నే పతిగాభావించి భక్తుడైన తానేసతియై ఇతరమెరుగక పంచేంద్రియస్పందనాల లెక్కింపక సందులేని ఎఱుకయే తానై ఆ ఎఱుకయందు భ్రాంతిలేని, హృదయకమలమధ్యమందుండు పరమేశ్వరునిలో సమరస స్నేహము పొంది విడనాడకుండుట

ఐక్యము - ఆకలి, దప్పి, శోకమోహాలు, జరామరణాలను ఖండించి షడూర్ములు తొలగించి కామ క్రోధ, లోభ మోహములవిడిచి నాహం కోహం సోహంబులు భావంబులో లేక అష్టవిధార్చన షోడశోపచార రహితుండై కర్పూ రాగ్ని సంబంధమువలె కర్పూరము గుణవాసనా రహితమైయుండు అగ్నియై లింగస్మరణతో లింగమే తానైయుండుట

అష్టావరణాలు పంచాచారాలు - షట్స్థలాల స్థూలవివేచనం చేయడమైంది వీరశైవ సిద్ధాంతాన్ని ప్రతియొక్కరు ఆచరించుటకు, జీవనానుభవములో తెచ్చుకొనుటకు అత్యంత సరళసులభమైన ధర్మమని ప్రతిపాదించినారు

## ఆ సులభతను ఈ రీతిలో చూడవచ్చు

మానవులకు బ్రహ్మజిజ్ఞాస కన్న జీవజిజ్ఞాస ప్రాథమికంగా ముఖ్యం ఆ జిజ్ఞాసలో ప్రతియొక్కరి ఆత్మ వికాసానికి మార్గముంది దీని అనుష్ఠానమునకు పురుషులు స్త్రీలు పామర - పండిత జాతి - విజాతి లేక అందరూ సమానులు

వైదికుల శాస్త్రప్రభయాల్లో అనువంశికంగా తరతరాలుగా తలలెత్తలేని శూద్రచండాలులని పిలువబడువారు దైవానికి, ముక్తికి, మానవసమాజానికి, సమానాధికారమున్న మానమానవతత్త్వమౌల్యాలనుబట్టి అర్హులు

పురుషుల సహజాటుతో స్త్రీలు మెలగాలన్న వైదికనియమాలను ఎంచక పురుషులకున్న అధికృత వీరికుంచి స్వాతంత్ర్యధర్మాధికరణలో సమానతయుంది స్త్రీ ఒక ఇంటిగూటిలో వెలుగు దీపంకాక లోకాన్నే వెలిగి వెలిగించే శక్తిస్వరూపిణి, మానవ సంతానానికి మాతృదేవత స్త్రీలలో అభివృద్ధిగాంచనప్పుడు పురుషులు పొందినామన్న అభివృద్ధికి అర్థమేలేదు

ధర్మసాధనలో ఇహ-పరమను భేదాలులేవు ఇహాన్ని నమ్మి పరాన్ని అనాదరించుట (నాస్తికత) పరాన్ని నమ్మి ఇహాన్ని ఉదాసీనం (ఆస్తికత) చేయుటలేదు ఈ రెండు మార్గాలలోని అధికృత, ఫలాపేక్షలెంచక ఆ విభేదాలు లేని ధర్మరంగములో, మానవజీవనావశ్యకము చూపేకాయకమే ముఖ్యమని ఆ కాయకమే కైలాసము కాగలదు

నమ్మిన భక్తునకు ఒక్కడే దేవుడు, నమ్మిన సతికి ఒక్కడే భర్త బహు దేవతోపాసనలు వ్యభిచారభక్తి ఉపాసనీయంకాదు

తానునమ్మిన దేవుని తానే పూజించి ధ్యానించవలెను తన ఆకలికి తాను చేయు భోజనమునకు మారుగా ఇతరులుచేస్తె తన ఆకలి తీరదు ప్రకృతిబద్ధంగా శారీరక భోగాలు వారువారే అనుభవించువిధానమున్నట్లె ఇదియుకూడ (తన్ను గురించి-పూజారులు చేసేపూజలు-జపాలు పనికిరావు)

దేవాలయాలు-మహాక్షేత్రాలు జేరి ధనవ్యయంచేయక తానే సాధనతో ఆ దేవునికి అలయం కావలెను (దేవతాక్షేత్రాలు మనదేశములో ఐశ్వర్యవంతంగా చేయడమువల్ల కొంతమటుకు పరదేశాలవారి అఘాతానికి గురియైంది) దేవుని పేరిట వెచ్చబెట్టె ద్రవ్యమును తోటిమానవుల జీవనోపాయాలకు సమకూర్చిన అదే నిజమైన దేవతారాధన

మానవత్వములోనె దైవత్వముంది ఆ దేవత్వాన్ని క్రియారూపకంగా ఉపాసనకు తెచ్చుకొని పూజాధ్యానాలతో ఆరాధించవలెను అది నీ ఇష్టంగాయుండి ఇష్టార్థములనిచ్చునదిగాన అదియొక గురుతై సావయ - నిరవయసమన్వయమై సగుణ నిర్గుణోపాసనల చిక్కులేని విశ్వాకృతిని సూచించు లింగోపాసనకు నీ యంగమందే ఆ లింగాన్ని ధరించి నీ యిష్టాన్ననుసరించి ఉపాసన చేయుటకు అనుకూలము ఇది ప్రతివారికి దైవదత్త స్వాతంత్ర్యము

వైదిక ధర్మములోని పూజారి, పురోహిత, శాస్త్రి మొదలగువారి అభిప్రాయ భేదాలు, విధి, నిషేధ, ప్రాయశ్చిత్తాలు, ఆహ్వాన-విసర్జనలు, వ్రతాలు ఉపవాసాల గొడవలులేక స్వతంత్రంగా పీరికయ్యే ధనవ్యయంగాక, పుణ్యా-పాపాల భ్రాంతులులేక ఆ లోక మీలోకాల పదవి ఆ మిషలు లేని ఒక విశిష్ట సంస్కారాన్నిచ్చేదియై నిర్మల భావసంపదకు మూలమౌతుంది

iii)

దేవుడు పవిత్రుడు మానవుడు అపవిత్రుడు అనే సంకోచ భావనలు దేవ మానవత్వానికి భిన్నమై దూరమై దేవుడన్న భక్తి కన్న భయమే ఎక్కువయింది దీనినుంచి మానవుడు దేవుడగుటకు సాధ్యముగాదు దేవుడు మానవుని హృదయ మందేయున్నాడనేవారు ఆ దేవుడు అన్యుడుగా తనకన్న పవిత్రుడుగా ఎంచడము సంకోచించడము ఒకరీతి భయాన్నే సూచిస్తుంది ఆ భయం వైదిక శాస్త్రకారులు పెట్టింది ఈ భయాన్ని తొలగించే ఉపాయంలో నున్న దేవుని ఒక చిన్హంగా ధరించేదే నిర్భయాన్ని పొందు సవ్యమార్గం

## శూన్యసంపాదనలు

శూన్య సంపాదనము నుంచి వెలువడినది సృష్టి అందులో మానవో ద్ధరణకై పుట్టిన మత ధర్మములలో వీరశైవ ధర్మము పేర్కొనదగినది శూన్య సంపాదన పేరుతో గ్రంథమును వ్రాసినటుల ఇతర మతాలవా రెవరూ ఈ పేరున గ్రంథము వ్రాసినట్లు తెలియరాదు ఇదియే వీరశైవమునకు శ్రేష్ఠతమ మని చెప్పుటగాదు ఈ గ్రంథవిశిష్టత ఏమనిన ఇది కావ్యముకాక, శాస్త్రము గాక, సాహిత్య తత్త్వానుభావ శివశరణుల వచనములు సంగ్రహించి నాట కీయముగా, వాదోపవాదములు, నిర్ణయములు, పూర్వోత్తర పక్షముల వాదముల రీతి సంభాషణలు, ఆయా విషయములు ఆయా సన్నివేశాలలో వచ్చు శరణులు తమ వచనాలతో చర్చించురీతి ఏ ఇతర సాహిత్యములో లేదన్న ప్రతీతి పండితుల వల్ల కలిగినది

కన్నడ వాఙ్మయమునకు ఇది సరికొత్తయైనటుల ఇతర భాషలకు కూడ ఇట్టి రచనా చాతుర్యము కొత్తయే యని చెప్పవచ్చు ఇంగ్లీషులో ప్లేటో యను నాతడు సంభాషణ రూపకముగా వ్రాసినాడని చెప్పెదరు ఇప్పుడు చెప్పబోవు శూన్యసంపాదనలు ఒకటిగాదు నాలుగు మొట్టమొదట వ్రాసినవారు శివగణ ప్రసాది మహాదేవయ్య రెండవవారు హలిగెయార్య మూడవవారు గుమ్మళా పురము సిద్ధలింగయ్య నాలుగవవారు గూళూరు సిద్ధ వీరణ్ణగారు (ఈ శూన్య సంపాదనము అనువాదము చేసినవారు) ప్రభుదేవర శూన్య సంపాదనమనియే ప్రారంభమైనదానిలో మొదటిదానియందు 1012 వచనములు, రెండవదానియందు 1596 వచనములు, మూడవదానియందు 1439 వచనములు, నాలుగవ దానియందు 1542 వచనములు సంగ్రహించబడినవి ఈ సంఖ్యల ప్రమాణము వారు వారు

తమ తమ కాలమందు దొరికిన వచనములు వాడుకొన్నారని నమ్మినచో దీనిలో రెండవ హలిగెయార్యుడు ఉపయోగించుకొన్న వచన సంఖ్యయే ఎక్కువని తెలియ వచ్చుచున్నది శ్రీ ఎల్ బసవరాజు తాను సంపాదించిన శివగణ ప్రసాది మహా దేవయ్యగారి శూన్య సంపాదన పీఠికయందు గ్రంథకర్తల క్రమమును-వారి వెనుక నున్న రచనలను ఇటుల ఉదాహరించినారు

1 సింగిరాజు (బసవ చారిత్రము)

2 శివగణప్రసాది మహాదేవయ్య (ప్రథమ శూన్య సంపాదనము)

3 (అ) లక్కణ్ణ దండేశ (శివతత్త్వ చింతామణి)
  (ఆ) మహాలింగ (వచన సంకలనము)
  (ఇ) హలిగెయార్య (రెండవ శూన్య సంపాదనము)

4 చామరస (ప్రభులింగ లీల)

5 గుమ్మళాపురము సిద్ధలింగయ్య (మూడవ శూన్య సంపాదనము)

6 గూళూరు సిద్ధ వీరన్న (నాల్గవ శూన్య సంపాదనము)

దీనియందు కాలమానములు కనపరచలేదు గ్రంథములు, ఆ గ్రంథ రచనకారుల పేరులు ఉన్నవి కర్నాటక విశ్వవిద్యాలయము వారు ప్రకటించిన మొదటి శూన్య సంపాదన పీఠికలో ఇట్లున్నది

| | | | |
|---|---|---|---|
| ౧ | శివగణప్రసాది మహాదేవయ్యగారి మొదటి శూన్య సంపాదనము | క్రీ శ | 1420 |
| ౨ | కెంచ వీరణొడెయుల శూన్య సంపాదనము | ,, | 1495 |
| ౩ | గుమ్మళాపురము సిద్ధ లింగయ్య శూన్యసంపాదనము | ,, | 1500 |
| 4 | గూళూరు సిద్ధ వీరణార్యుల శూన్య సంపాదనము | ,, | 1510 |
| ౫ | హలిగె దేవర శూన్య సంపాదనము | ,, | 1520 |

కాలమానములు ఇవి నిశ్చితములు అయినను కాకున్నను 1420 నుంచి 1520 వరకు పెంచి నూరేండ్లుగా ఎంచి సరిపెట్టుకొన్నారు ఇదిగాక నలుగురే శూన్య సంపాదనాకారులని చెప్పుటలో కెంచవీరణ్ణుని జొనిపినారు విమర్శకులు పరామర్శించు టుచితము ఎల్ బసవరాజు హలిగెదేవుని రెండవ వాడన్నది

ఇక్కడ ఐదవవాడైనాడు తన సంపాదనలో ఎల్ బసవరాజు నాల్గు శూన్య సంపాదన వచనముల క్రమాంకమిచ్చినాడు ఇవిగాక శివగణ ప్రసాది శూన్య సంపాదనలో లేని సంపాదనలు తరువాత ఎంతగా ఎవరెవరు ఎట్లు పెంచినారో స్పష్టముగా చూపినారు నాలుగు శూన్య సంపాదనలలో మొదట ప్రకటమైనది గూళూరు సిద్ధవీరణ్ణొడెయుల సంపాదన దీనిని 1930 యందు ఫ గు హళకట్టి యనువారు ముద్రించిరి తరువాత 1958 లో ప్రొ సం శి భూసనూరు మఠ, ఎం ఎ వీరు సంపాదించినారు శ్రీ రావూరుకల్లు మఠము, ఆదవాని మండగిరి మఠము స్వాములు దీని ప్రకాశకులైనారు

తరువాత 1969 లో శివగణ ప్రసాది శూన్య సంపాదన ఎల్ బసవరాజు చేయగా దానిని చిన్మూలాద్రి బృహన్ మఠము మహా కర్తలైన శ్రీమన్ మహా రాజ నిరంజన జగద్గురు మురుఘ రాజేంద్ర మహాస్వాములు చిత్రదుర్గము వారికి వారి పరంపరలో వచ్చిన వ్యాకరణాచార్య శ్రీ ని ప్రణవ జగద్గురు మల్లికార్జున స్వాములు అర్పితము జేసినారు అటు తరువాత కర్నాటక విశ్వవిద్యాలయము 1971 యందు ప్రకటించినది

మూలమున్నటుల వచన క్రమాంకమున్న దున్నట్లు విశ్వ విద్యాలయము ప్రకటించినది ఎల్ బసవరాజు మాత్రము చదువరుల కనుకూలముగా నుండు నట్లు - గూళూరు సిద్ధ వీరన్నగారు పరిచ్ఛేదములుగా (21 సంపాదన) చేసినట్లు - 22 సంపాదనలుగా విభజించి ఆయా సంపాదనల గూర్చి సులభ కథా వృత్తాంత మిచ్చినారు ఇది కాక శివగణ ప్రసాది మహాదేవయ్య గారిది కాని రచన (౧) నులక చందయ్యగారి సంపాదన-హలగెయార్య, (౨) ఆద్యక్కి మారయ్య సంపాదన - గుమ్మళాపురము సిద్ధ లింగయ్య, (౩) గోరక్షకుని సంపాదన - గుమ్మళాపురము సిద్ధ లింగయ్య, (౪) మోళిగె మారయ్య సంపాదన-గూళూరు సిద్ధ వీరన్న, (౫) ఘట్టివాళ ముద్దణ్ణగారి సంపాదన-గూళూరు సిద్ధ వీరన్న ఈ ఐదు సంపాదనలు అనుబంధములో చేర్చి ఉపకరించి నారు సిద్ధరామయ్య లింగదీక్ష దీనియందులేదు లింగమనునదేమన్న చర్చ వచ్చినను, మహాయోగి సిద్ధరామునకు లింగమవసరమెందుకని ప్రభుదేవుడే సమర్థించినపుడు ఆ ప్రస్తావన అక్కడికే నిలుచును రెండవ హలిగెయార్యుడు సమర్థనీయముగా వీరశైవ సిద్ధాంతము రీతి వచనములు సంగ్రహించి సిద్ధ

రామునికి లింగదీక్ష చేయించినారు మిగత సంపాదకులు దానినే ముందు తమ తమ సంపాదనలో సాగించిరి

కర్నాటకములో ఆనాడు మొదటది శివగణప్రసాది, నాల్గవది గూళూరు సిద్ధ వీరన్నగారి శూన్య సంపాదనలు అచ్చు పడినవి మిగత సంపాదనలు ప్రకటన కాలేదు దీని పరిశోధన కంతటికి చాల శ్రమపడినవారు బిజాపురము ఫ గు హళకట్టి (1930 లో శూన్య సంపాదన ప్రకటించినవారు) వకీలు వృత్తిలో చేసికొన్న సంపాదనమేమో ఎవరికి తెలియదు శివశరణుల వచనములు తాటి యాకులనుంచి పరిశీలించి సమాజమున కిచ్చిన సంపాదనము సమగ్ర కన్నడ నాడుకు తెలిసినది ప్రసారమునకు శివానుభవ మాసపత్రిక నెలకొల్పి ప్రకటనకు 'హితచింతక' అచ్చు మిషన్ ఉంచుకొని బసవన్న, చెన్నబసవన్న, ప్రభుదేవ, మహాదేవి అక్క మున్నగువారి వచనములు చిన్నపుస్తకములుగా, పెద్ద వచన సంకలన సంపుటాలుగా ప్రచురించినారు ౧౨ వ శతాబ్దములో జరిగినవన్న ఐతిహాసిక విమర్శలు నిర్ణయాత్మకముగా ప్రకటించినారు ఇట్లు వచన పితామహులై శరణవాఙ్మయమును వెలువరించినవారు ఒక సాధారణ వ్యక్తియై కనబడినను మహాశక్తియై బృహత్తరమైన కార్యము సాధించి దేశమునకు మహోపకార మొనర్చిరి

మరియొకరు శ్రీ చన మల్లప్పగారు శివమొగ్గజిల్ల శిరాళకొప్పమువారు ఉపాధ్యాయవృత్తిలో నుండి, కమనీయ భాషాపాండిత్యములచేత వెనుకబడిన శివ శరణుల అమూల్య వచనములు, చరిత్రలు ప్రకటించిరి శ్రీ ఆర్ ఆర్ రంగనాథ దివాకరులు హుబ్బళ్ళివారు వీరు మొదటి వచనములను శాస్త్రమని పిలిచి సవిమర్శతో వచన సంకలనము పుస్తకముగా "వచనశాస్త్ర రహస్యము" అని ప్రకటించిరి శ్రీ దివాకరుగారు పండితులు సంస్కృత, కన్నడ, ఇంగ్లీషు భాషాకోవిదులు ఉపనిషత్తులు చదివినవారు ఆమూలాగ్రంగా రహస్యాన్ని గ్రహించినవారు వారు "ఉపనిషత్తులందున్న అన్ని విషయములు వచనములందు దొరకును ఐతే వచనమునములందున్న అన్ని విషయములు ఉపనిషత్తులలో దొరకుటకు సాధ్యము కాదు" అని నిరాఘాటముగా చాటిరి 'భక్తి భండారి బసవన్న' యను గ్రంథాన్ని ఎం ఆర్ శ్రీనివాసమూర్తిగారు ప్రకటించి శరణ తత్త్వాన్నెంతో విశాలంగా ప్రసరించిరి కాదంబరీ సార్వభౌముడు (తెలుగువారికి

తెలుసు) అ న కృష్ణారావుగారు 'అనుభవ మంటప' మరియు ఇతర గ్రంథముల ప్రకటించి తన వక్తృత్వ ప్రతిభవల్ల శరణతత్వ చరిత్రలను ప్రచారము జేసిరి

దీనికిముందు కొన్ని ఏండ్ల క్రిందట బళ్ళారిలో సక్కరె కరడప్పగా రుండేవారు కంట్రాక్ట్‌లో నంపాదించినది సంగీత పాఠశాల, సంస్కృత పాఠశాల, వైదిక పాఠశాలలకు వెచ్చించుటయే గాక నిత్య దాసోహి ఏ జంగమయ్య దేనిని అడిగితే లేదనక ఇచ్చినవారు మెడలోని బంగారు లింగకాయ నిచ్చి లింగయ్యను వస్త్రములో గట్టుకొని నిశ్చింతుడైన ఆధునిక బసవన్నవలె విరాజిల్లినాడని చెప్పెదరు శరణులై బళ్ళారిలో చుట్టుముట్టు ప్రాంతాలలో మరాలు గట్టి ధర్మమును పెంచిన మరిస్వామి, కొట్టూరుస్వామి, కళ్యాణస్వామి, మద్దాన స్వామి, రాఘవాంకస్వామి, చేళ్ళగురికి ఎర్రిస్వామి, ఎమ్మిగనూరు జడెప్ప మున్నగు మహానుభావులు ఎందరో ఉండిరన్న మంచికాలము 19 శతమానము కొన 20 శతమాన ప్రారంభము మహా మహిమురాలు ఆదవాని లక్ష్మమ్మ అప్పు డుండినవారు

ధారవాడములో లింగాయత విద్యాభివృద్ధి సంస్థ, వీరశైవ విద్యా వర్థక సంఘములు ధర్మరంగానికి దిగి పునశ్చేతన కార్యములు మొదలుబెట్టినవి. ఈనాటి బసవన్నగా సమాజోద్ధారమునకు సతతము శ్రమించిన ధారవాడ మురుఘా మఠము స్వామిగారు శ్రీ మృత్యుంజయప్పగారు భక్తాగ్రేసరులలో గణింపతగిననారు వీరు ఎంతో కష్టపడి బీద విద్యార్థులకు ఉచిత ప్రసాద నిలయము ప్రారంభించినది గణనీయమైనది వారి శిష్యులు శ్రీ మహంతప్పగారు (ప్రస్తుత మఠాధిపతులు) సమాజానికెంతో సేవజేసినవారు అనేకులు ఆ కాల ముల్లో శ్రమించిరి వారందరూ వందనీయులు

త్యాగధనులైన శి శి బసవానాళ ఎం ఎ గారు మహా పండితులు వారు బహుకాల పరిశ్రమవల్ల బసవన్నగారి "షట్‌స్థల వచనములు" సంపాదించి, పరిష్కరించి ప్రకటించినారు దాని పీఠికలో "దేవవాణికి జనవాణి యగుటకు అసాధ్యమైనపుడు జనవాణినే దేవవాణి అంతరాని కెక్కించిన పవాదము వీరశైవ వచన కారులది" యని నిర్ణయంగా రాసినది ఎన్నటికైన ఆదర్శనీయము వీరితోబాటు బుద్ధయ్యగారు నంది మఠముగారు, హాలభావిగారు, ఫండిత నాగ

భూషణ శాస్త్రిగారు, సర్వదర్శినీ తీర్థ, కళాప్రపూర్ణ పండిత వై నాగేశ శాస్త్రి గారు, బళ్ళారి, పావటె సిద్ధరాయప్ప మున్నగువారు ఆనాడు చేసిన శరణ సాహిత్యము ఎక్కువగా ప్రసారమైనది కర్నాటక వాడవాడల తిరిగి ప్రచారము చేసిన కీర్తన కేసరి బి శివమూర్తి శాస్త్రిగారిని, మల్లాబాది వీర భద్రప్ప గారిని ఎవరు మరవగలరు ?

ఆంధ్రములో ఆనాడు-

ఇంచుమించు అదే కాలమున ఆంధ్రదేశములో వీరశైవ సాహిత్యము మరుగుపడినది వెలికితెచ్చినవారిలో కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు, బసవరాజు అప్పారావుగారు, వీరేశలింగము పంతులు మొదలగువారు ముఖ్యముగా నాగేశ్వరరావు పంతులుగారు పాలకురికి సోమనారాధ్యులవారి సాహిత్యము ప్రచురించుట శ్లాఘనీయము ఆంధ్ర సారస్వతానికే కావ్య స్వాతంత్ర్య భిక్ష పెట్టిరి ఉత్త అనువాద సాహిత్యములోనున్న ఆంధ్రభాషకున్న కొరత అపవాదము పారద్రోలినాడు సోమయ్య ఆయన రాసిన ద్విపద బసవపురాణము కన్నడభాషకు అనువాద మొందినది 1369 లో భీమకవి భామినీ షట్పదిలో చక్కగా అనువదించినాడు అదివరకు సంస్కృత సాహిత్యము అనువాదమయ్యేడిది అప్పటినుండి ఇతర భాషల కనువాదము పొందు ఘనత ఆంధ్ర కావ్యములకు సమకూడినది విశేషమేమనిన, సోమన్న రాసిన ద్విపద పండితారాధ్య చరిత్ర దేవభాషకెక్కి తలమానికమైనది తెలుగువారికి గర్వకారణము ఈ సాహిత్యము వీరశైవ సిద్ధాంతమునకు బసవ-పండితారాధ్యుల చరిత్రలకు సంబంధించినది పాలకురికి తరువాత ఆయన ప్రశిష్యులు పిడుపర్తి సోముడు, ఇతరులు సోముని ద్విపద కావ్యపోకడలో వీరశైవాన్ని కొంతవరకు ముందుకు సాగించినారు భక్తకవులని ఖ్యాతిగాంచిన పోతన, శ్రీనాథులు వ్రాసిన కావ్యములు మహోత్తమమైనవైనా వీరశైవ తత్త్వమునకంతగా ఉపకరించలేదు. ఇటీవలివారు విమర్శకాగ్రేసరా ఐతిహాసిక సమ్రాట్ బండారు తమ్మయ్యగారు స్వధర్మ పత్రికనుంచి వీరశైవధర్మానికి తోడుపడినారు పండితారాధ్య చరిత్రకు ఘనమైన విమర్శతో సర్వవిధాల తమ పాండిత్య ప్రతిభలను చూపిన డా॥ చిలుకూరు నారాయణరావుగారు గొప్పవారు వారినిమించి ఇతరులు వ్రాయగలరాయనునంత మహాపండితులు బండారు తమ్మయ్యగారి బసవపురాణ పీఠిక మన

ఖీయమైనది. ఇటుల ఆంధ్రదేశముచో శైవానికి మహాబిరుదాంకితులు కొందరు జేసిన ధర్మప్రచారము దేశము అందుకొనలేదు

బసవపురాణము అక్కడనే వ్రాయబడినను, బసవన్న ఎవరో ఎక్కువగా తెలియలేదు కర్నాటకములోనైనను వచనములు ప్రసిద్ధమైన తరువాతనే తెలియ వచ్చినది ఐన చరిత్రకారులు ఈయన పురాణపు కల్పనాపురుషుడేకాని సాధారణ చరిత్రాంశ పురుషుడుగాదని నమ్మిన పాలలో పులుసు పిండినారు కొంతకాలానికి హిరియూది, చౌడదానపురము, కన్నానూరు శాసనములలో బసవన్న పేరు కనబడి, శా శ 1177-1202 నడుమకాలమన్నారు అర్జునవాడలోని (బాగేవాడి-బసవన్న పుట్టినయూరు ) శివాలయములో దొరికినది (శా శ 1182) అప్పుడా యన చారిత్రిక వ్యక్తిగా ఒప్పుకొని చరిత్రకారులు బసవన్నకు ప్రాణము పోసినారు తెలుగులో వచనములు లేవు ఏ దేశమునుండో కల్యాణమున కొచ్చిన అక్కడి కన్నడభాష నేర్చుకొని కన్నడములోనే వచనములు రాసినందున అవి వ్యాపకానికి దూరమై ధర్మప్రసారము ఇతర నాడులలో కాలేకపోయింది. సౌరాష్ట్రి, కాశ్మీర, ఒరిస్సా, ఆంధ్ర మున్నగు దేశాలనుంచి వచ్చినవారు తమ తమ భాషలో శరణ తత్త్వాలను వచనముగా వ్రాసియుంటె ఈనాటికెంతో వీరశైవ సిద్ధాంతము భారతము నాల్గు చెరగుల వ్యాపించియుండెడిది ఎందుకో ఆ భాగ్యము ఆ ధర్మానికి దొరకలేదు కాని పంచాచార్యుల ప్రసిద్ధ పీఠములున్నా తగినంత ధర్మ పరిణామము కాలేదు కర్నాటకమందున్న జంగమ పీఠముల వలె ఆంధ్రములో లేదు ఉరనకొండ - గవి మఠము ప్రసిద్ధ జంగమ మఠము ఇది కర్నాటకములో, తమిళనాడులో శాఖా మఠములు పొందినది ఈ మఠము నకు పీఠాధిపతులుగా వచ్చినవారిలో కర్త కరిబసవ స్వాములవారు - చెన్న బసవస్వాముల వారు మహా పండితులే గాక తమ లింగానంద మహిమలచే వీర శైవులే గాక ఇతర మతస్థులు, ముసల్మానులు ఈ మఠానికిప్పటికి భక్తులు ఇతర మఠములున్నను వ్యాప్తిలేనివి

వేమన వ్యాసములు రాసిన రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు ఆంధ్ర దేశము ధార్మిక రంగములో ఎంతవరకు ప్రగతి పొందినదన్న సంగతి తమ పుస్తకములో ఇట్లు వ్రాసినారు "ఆంధ్రులకు శంకరాచార్యుని అద్వైతముగాని, రామానుజుని విశిష్టాద్వైతముగాని పట్టలేదు శంకరుడు మళయాళములో, రామా

నుజుడు అరవదేశములో, మధ్వాచార్యులు కన్నడ దేశములో పుట్టిరి వైదిక మతాన్ని వేరువేరుగా బోధించిన నింబార్కాచార్యులు, వల్లభాచార్యులు ఆంధ్ర జాతికి చేరినవారైనను వారి మతమంతయు ఆంధ్రదేశపు వెలుపలనే యున్నది. ఇట్లెందుకైనదో కాని కాకతీయ సామ్రాజ్యమందును, విజయనగర సామ్రాజ్య కాలమునందును, మొదటి కాలమునందు వీరశైవ మతము, రెండవ కాలమందు రామానుజ మతము ఆంధ్ర దేశమునందు ప్రవేశించి నిలచినవి ఇవి కూడ మత కర్తల అనుయాయులతో ప్రాకి వచ్చినవి మతాచార్యులెవరు ఆంధ్రదేశమున పుట్టలేదు ప్రచారమునకై సంచరించలేదు సంచరించబోయిన రామానుజుడి పారద్రోలగా కర్నాటకమునకు పారి వచ్చెను " శర్మగారిట్లు వివరించిన విష యానికి ఆంధ్రదేశమున్న ఇప్పటి రీతియే తార్కాణము

పోతులూరు వీరబ్రహ్మముగా, అతని అనుయాయులు యాగంటివారు, దూదేకుల సిద్ధయ్య ఇతరులు శైవమతాన్ని బోధించి కాల జ్ఞానమును చెప్పినారు. వారి మఠములు, శిష్య బృందములు ఇప్పటికి ఉన్నవి. వీరశైవము గురించి చెప్పిన కొన్ని పాటలు పాడుచున్నారు. ఏమైనను వేమన్న - వీరబ్రహ్మముగారు ముఖ్యులైన మత ప్రచారకులే (ఎక్కువగా అద్వైతప్రచారకులు) కాని మత కర్తలు గాదు

పైన వివరించిన ఆంధ్ర కర్నాటక రాజ్యములలో వీరశైవమెట్లు సంఘ ములో ప్రాకినదని తెలిసినంతమట్టుకు శూన్య సంపాదనా వ్యాజమున ఇక్కడ ఉదాహరించుట జరిగినది ఈ విధానముండకపోయినను సత్ పురుషులు, తత్త్వ విదులు, సద్ విచారశీలురు ఉండకపోరు ఇది భారత రాష్ట్ర వైశిష్ట్యము మత ధర్మాల వ్యాపకములో ఎన్ని అవిచార, అసంగత, అన్యాయములు, పాప కర్మాలు లేవు? ఏమైన అవి ఇవి ఉండియే యుండును

## నేటి శూన్య సంపాదకులు

శూన్య సంపాదనకు విస్తారముగా శ్రీ నిడుమామిడి శ్రీశైల సూర్య సింహా సనాధీశ్వరులు, జగద్గురు డా చన్న బసవరాజ దేసికేంద్ర శివాచార్యులు కన్నడ ములో "సంపాదనెయ సొంపు" అను శీర్షికతో నాలుగు సంపుటాలు దెమ్మి 2076 పుటలుగా విభజించి సమగ్రంగా (గూళూరు సిద్ధ వీరన్న సంపాదనము)

సముచితంగా, పాండిత్య పూర్ణంగా వ్యాఖ్యానించినారు శ్రీవారి అద్భుత పాండిత్య ప్రతిభా వైఖరులు సంస్కృత వ్యాఖ్యానకారులవలె రాణించిన దానికి కన్నడ వ్యాఖ్యానమేమియు తక్కువ కాదనునట్లు లిఖించి యశస్వియైనారు పీరి పాండిత్య ప్రతిభా విశేషములు తెలుసుకొనువారు అరుదు శ్రీవారి లేఖినికి ముసలితనమంట లేదు 77 సంవత్సరములైనను చక్కలాంటి దేహానికి ముసలితన మంటలేదు ఏముందని అంటుతుంది? ఉన్నదంతా చైతన్యమే రెండు వందలకు పైగా వారిదే ఒక పుస్తకాలయమున్నట్లున్నది ఇప్పటికీ రాస్తూనే ఉంటారు ధర్మ రంగభూ స్వాములలో ఇట్టి ప్రవృత్తి గలవారుండరేమో?

ఇక రెండవ వారు గూళూరు సిద్ధ వీరన్నగారి శూన్య సంపాదనను సంపాదించి ప్రొ సం శి భూసనూరు మఠముగారు ఎం ఎ పెద్దగా 'పరామర్శ' పేరుతో గ్రంథాన్ని రాసినారు. తమ స్వాతంత్ర్య సంజనిత వైఖరీ విలాసమున నవీన రీతులతో వివరించి కేంద్ర సాహిత్య అకాడమి, రాజ్య సాహిత్య అకాడమి ప్రశస్తి ప్రదానములు పొందిన ధారవాడ నివాసులు చిన్నదిగా సయుక్తికంగా సమర్పకంగా రాసినవారు డా చిదానంద మూర్తిగారు, డా తిప్పేరుద్ర స్వామిగారు డా చిదానంద మూర్తిగారు "శూన్య సంపాదనను గురించి" అను పేరున, డా హెచ్ తిప్పేరుద్ర స్వామిగారు శూన్య తత్త్వ వికాసము మరియు శూన్య సంపాదన పేరున వ్రాసి ప్రకటించినారు డా ఎన్ ఎం వృషభేంద్ర స్వామిగారు భూసనూరు మఠ్‌గారి 'పరామర్శ'కు ప్రతిగా 'పరామర్శెయ విమర్శె' అను గ్రంథమును వ్రాసినారు

## నన్నుబట్టిన శూన్యసంపాదన

ఈ మొదట నా మిత్రుడు మల్లాబాదె వీరభద్రప్ప దగ్గర పుచ్చుకొన్న ఫ గు హళకట్టిగారు ప్రకటించిన ప్రభుదేవర శూన్య సంపాదము నాతోనే యుంచుకొన్నాను మిత్రుడడిగినా ఇయ్యలేదు వేరే ప్రతులు దొరకని కాలమది "పరహస్తం గతం గతః" అన్నది మిత్రుడు తెలుసుకొన్నాడు గతం జేసిన నాకు ఆ సంపాదన సొన్నజుట్టింది తెలియలేదు ఐనా విడువలేదు అభ్యాస బలమున సాహిత్యములోనున్న తత్వార్థములు నెమ్మదిగా కొంతమట్టుకు గ్రహించి, నాటకీయంగా సంభాషణలు ఆయా సన్నివేశాలలో పాత్రలనుంచి రసవత్తర

ముగా, కావ్యమయంగా అల్లుకొని ౨౧ సంపాదనలు యుండిన దానిలో ప్రయత్నించి ౧౭, ౧౮, ౧౯ సంపాదనలలోని వచనాలు సంగ్రహించి ౧౯ దవ సంపాదనగా ఉండినదాన్ని ప్రభుదేవుని ఆరోగణ, కట్టుకొని సమయోచితంగా సంగీతము, నా మిత్రుడు టి కుమారస్వామి సహాయముతో కూర్చుకొని అభ్యాసము జేసితిని

నేను జేసికొన్నదాని కాధారమేదియు తెలియదు ఒకరీతి కీర్తనముగా యుండినను కీర్తనముగాక, సంగీత గమక ప్రవచనములకు సులభముగా సామాన్యులకు అర్థమయ్యే విధానములో తత్త్వార్థములు వెల్లడించు రీతిని అనుసరించితిని కీర్తనముగాని పురాణముగాని చెప్పునవి కథలు ఆ కథలు శ్రోతలలో కొందరైన తెలిసియుండుటవల్ల, చెప్పువారికి వినువారికి కష్టము లేదు ఏదో వేసరిల్లినపుడు పిట్టకథలు చెప్పి నవ్వించి ముందుకు పోవ కథకున కెంతైన అనువుంది ఇవేవీ శూన్యసంపాదన ప్రవచించువారికి సుంతైనను లేదు సహాయమంటె సంగీతము మితవాద్య పరికరములు చెప్పు విషయమునకు ఇవేవి భంగకారిగా నుండకూడదు అట్లైన సంగీత కచేరిగా మారును తత్త్వ సమర్థన, వాదోపవాద విషయముల ప్రతిపాదన విడివిడిగా చెప్పగల సమర్థత ప్రవచనకారుడు అభ్యసించియుండవలెను సమయోచిత ప్రతిభా విశేషములు శూన్య సంపాదన వచనములకు వ్యత్యయము గాకుండ నుండవలయును ముఖ్యముగా చెప్పునదేమనిన మనవారికి——

చాలమట్టుకు శాస్త్రములోనున్న పుణ్య పాపముల చర్చలు, వానికి పరిహారములు, స్వర్గ సుఖాల కథనములు కూడలేదు వైదిక ధర్మానికి చాల దూరమున్న కేవలము మానవతత్వాన్ని గురించి బతుకుతెరువుకు దైవ పథము చూపు శరణుల వాస్తవిక తత్త్వాలు చర్చించి నిర్ణయించు అమోఘ విషయ సంగ్రహములలోగొన్న వచనములు గల ఈ శూన్య సంపాదన చెప్పుటగాని - దాని విను అలవాటుగాని లేదు వేసరిక గొన్నవారికి అద్వైతము తెలియకపోయిన ఏదో తాత్కాలిక సమాధానమిచ్చును దీనిలో అదియులేదు మానవ జీవనాంశములు దాని ప్రగతి తెలుపు సర్వ సమన్వయ శివాద్వైత శివాంతముగల దీనిని ప్రవచించుటెట్టి కష్టమో చెప్పువానికే తెలుసు.

ఇటువంటి అభిప్రాయములచేత బసవ జయంతిలో బసవన్న పుట్టిన బాగేవాడి (విజాపురము జిల్లా) యందు 1952 లో మొదటిసారిగా ప్రవచనమైన పుడు కొంతవేళ ప్రేక్షకులు సహకరింపకున్నను తరువాత బసవన్న అనుగ్రహ మువల్ల గ్రహింపగలిగినారు

తరువాత ధారవాడ ఆకాశవాణిలో ప్రత్యేకంగా ప్రసారమైనపుడు విద్వాంసుల మెప్పు పొందినది కొన్నాళ్ళ తరువాత ధారవాడ మురుఘా మఠము స్వాములు శ్రీ మృత్యుంజయప్పగారు విన్నారు అప్పటినుంచి నా తత్త్వశాస్త్రము గురువులు పండిత నాగేశ శాస్త్రిలవారి అధ్యక్షతలో కర్నాటకము నలుమూలలు శూన్య సంపాదనలోని ఇతర సంపాదనల ప్రవచనములు నడచినవి నా మిత్రుడు, ప్రతిభాశాలి టి కుమారస్వామి పరమపదించాడు నా సహాయకుడు, నటుడు, పౌరాణికుడు వై యం చంద్రయ్యగారు మరుగైనారు, నా దివ్యచేతన అనుగ్రహ మూర్తి శ్రీ మృత్యుంజయప్పగారు బయలైనారు ఇన్ని సంవత్సరములైనచో ఎవరుందురు? వారి వారి త్రోవ వారికి త్రోవ చిక్కని నేను మిగిలినాను నా ప్రవచనసేవ నిలవలేదు 1982 వరకు సాగినది

వారములో మూడు గ్రామములందు కచ్చితంగా ప్రవచనాలు జరుగుటయే గాక శూన్యసంపాదనను సంగ్రహించి 2 భాగాలుగా జేసి "బయలగళికె" (అర్చన) యను పేరుతో మొదటిభాగము అఖిల భారత శివానుభవ సంఘాధ్యక్షులైన బళ్ళారి వై మహాబలేశ్వరప్పగారు ప్రకటించినారు (1961) రెండవ భాగము ధారవాడ మురుగా మఠము శ్రీ మహంత స్వాములు ప్రకటించినారు (1970) తరువాత ఆ బయలు గళికెలోని నాటకములు ధ్వని ముద్రణమైనవి ఈ కార్యము ౨౦ సంవత్సరాల క్రిందటి మాట

మరియొకరు నా హితుం అభిప్రాయాను సారముగా శూన్య సంపాదనల ప్రవచనము సంగ్రహించి ధ్వని ముద్రణమైనవి (౨౭ క్యాసెట్టులు) శ్రీమతి నాట్యరంగ, సినిమారంగ నటీమణి జయమ్మగారు, శ్రీమతి స్వర్ణమ్మగారు, గమక శారద శ్రీమతి శకుంతలాబాయి పాండురంగరావు శ్రీ చన్న బసవేశ్వ రప్ప-పోషిత నాట్యమండలి యజమానుడు గుబ్బి వీరణ్ణగారు నా యీ కార్య ములందు సహకరించిరి. దీనికి బెంగుళూరిలో నున్న నా మిత్రుడు ఎ ఎన్ చంద్ర

శేఖరప్ప ముఖ్యులు వీరందరి సహాయమును మరువలేము చేళ్ళగురికి శ్రీ ఎర్రి తాతగారి మఠము ధర్మదర్శులు నాకెంతో ఉపకరించినది - స్మరణీయము ఈ కార్యముతోబాటు నాటక, కావ్యగాయన, నాటకరచన, సాహిత్యసభల కార్యము లకు ఎడతెరపి లేక కాలుగాలిన పిల్లివలె ఇల్లు పెద్ద కృషి సంసారము వదలి దిక్కులేని దివాణమువలె తిరిగినది ఇప్పుడు తలచుకొనిన ఎంత పిచ్చియని అని పించును నవ్వు వచ్చును కడుపార నవ్వేద ఒకటిగాదు, రెండుగాదు, జీవ మానములో దయ్యము పట్టినట్లు ఒకే రీతిగా ౬౦ ఏండ్లు ఈ రీతి గతించినది

# శూన్యసంపాదనకు నా వ్యాఖ్యానము

పూజ్యులు గదగ తోంటదార్య జగద్గురువుల ఆదేశ ప్రకారము శూన్య సంపాదనకు సమగ్ర వ్యాఖ్య "బయలు గళకెయ బెళగు" అను పేరిట 10 నెలలు దీక్ష బట్టి రాసి అచ్చువేయించగా 1062 పుటల గ్రంథం ౨౨౪౫౨ బసవ జయంతి యందు శ్రీవారి అద్భుత హస్తముతోనే ప్రకటమైనది చేళ్ళగురికి, శివమొగ్గలో కూడ ప్రకటన కార్యములు జరిగినవి

నా నాట్య గురువులు బళ్ళారి రాఘవాచార్యులతో 12 ఏండ్లు ఆంధ్ర రంగభూమిలో పెక్కుచోట్ల కబీరు, నారద, చంద్రగుప్త, సుదేవ, రామ మొదలగు పాత్రాభినయముల సేవతో ఆంధ్రులకు పరిచయమైతిని రాఘవగారు 1946లో నటరాజును చేరుకొనిరి నేను దిక్కులేనివాడనైతిని ఐనను గురువుగారి రాఘవ కళా మందిరము పేరిట బళ్ళారిలో నాట్య భవన నిర్మాణానికి నా ఆరోగ్యము నా సంసారపు కొరతలు గమనించకుండ, అక్కడక్కడ పెద్దవారి సహాయ ముతో నాటకములాడి సంగ్రహించిన ధనముతో సంఘాధ్యక్షులైన వకీలు హెచ్ లింగారెడ్డిగారి పెద్ద సహాయమువల్ల సంఘము పెద్దల వల్ల మందిరము నిర్మాణమైనది నా గురు ఋణమును కొంతమట్టుకైన తీర్చగల భాగ్యము చేకూరినదని సంతసించినాను

శూన్య సంపాదన - ప్రవచనము నా కళాసేవ గురించి చెప్పినది ఎక్కువై విసుగు కలుగవచ్చు సామాజిక కళాసేవారతుడైన నా వంటి వాడు ఎవరికి చెప్పవలెను? వినువారెవరు? ఏమైన సరిదిద్దుకోవలసిన బాధ్యత సమాజము నదే కదా!

# తెలుగు సోదరులకు నా చిన్ని సేవ

ఈ వెనుక శివశరణుల వచనములు తెనిగించి 'వచనామృతము' పేరుతో 1978 ఆంధ్రప్రదేశ్ అకాడమి వారి సహాయము పొంది శ్రీ డా బెజవాడ గోపాలరెడ్డిగారి నుంచి హైదరాబాదులో అకాడమి నుంచి ఆవిష్కారణమైనది ఇది గాక చేళ్ళగురికి శ్రీ ఎఱ్ఱి తాతగారి మఠము ధర్మ దర్శకుల కోరికపై "గేయ సంజారవము" అను కన్నడ గీతాలు తెనిగించి, ఇతరములైన నా తెలుగు గీతములతో వానిని ప్రచురించుట జరిగినది కన్నడములో వ్యాఖ్యాన సహితము శూన్యసంపాదన అచ్చులో నున్నపుడు తెలుగులో సంగ్రహముగా వ్రాయ వలయునను కోరిక గలిగి వ్రాయబూనితిని సునాయాసముగా ఏడు సంపాద నలు ముగింపై ఎనిమిదవ సంపాదన వ్రాయుచుండ రోజు వేధించు కోతుల నదలించబోయి ఆ చోటుననున్న మిద్దెమీది భవంతిలో పడగా కుడికాలు ఎముక విరిగినది దానికి కట్టుకట్టి లోపలకు ఎత్తుకొనివచ్చి మంచము మీద పరుండబెట్టినారు వ్రాయుచున్న దానిలో మిగిలిన విషయము తలలో చుట్టుకొను చుండగా కాలికన్న ఆ భావావేదన ఎక్కువై తాళలేక నా మేనల్లునితో "నేను చెప్పెదను, నీవు వ్రాయవలసినది" అన్నాను గుమిగూడిన మా బంధు మిత్రులు ఆశ్చర్య పడినారు మా వాడు బెదరి నన్నే చూచుచుండగా, సంజ్ఞ చేసితిని వ్రాయుటకు కాగితాల కట్ట ఎత్తుకొన్నాడు చెప్పినది వ్రాసినాడు "అబ్బ" యని ఏదో బరువు దించుకొన్నట్లుగా సమాధానమైనది చూచినవారికి "ఏమి ఈ పిచ్చి" అనిపించి యుండవచ్చును ఒక రీతి ఈ ఘటనబట్టి చూడగా నేను శూన్య సంపా దనను పట్టుకొన్నానా? లేక ఆ శూన్య సంపాదనయే నన్ను పట్టినదా? అని పించినది శూన్య సంపాదనయే నన్ను విడువక శిక్షారక్షలతో పట్టుకొన్నదన్నది నా అనుభవానికి వచ్చినది

ప్రసిద్ధ శల్య చికిత్సకులు పుత్తూరు శ్రీ గంగరాజుల మనుమడు కృష్ణ రాజు నా యింటికే వచ్చి చికిత్స చేసినందున తరువాత వ్రాయవలసిన ౧౫ సంపా దనలు కదలక పరుపుమీదేయుండి వ్రాయవలసి వచ్చెను నిస్వార్థ, నిర్మాయిక సంపన్న గంగరాజుగారు "వైద్యో నారాయణో హరిః" యను వాక్యానికి నిర్వ చనకారులై యున్నారు వీరి కుటుంబము శల్య చికిత్స చేయు విధానము ఆంధ్ర దేశమునకే కీర్తిదాయకమైనది

నేను వ్రాసినాననుకొన్నను, నేను వ్రాయలేదు ఏ కారణమో శూన్య సంపాదన నాచే వ్రాయించుకొని నన్నుద్ధరించినదని నమ్మినాను. గడచిన ఏడు డిశంబరు కొనకు ముగిసినది చెప్పలేనంత సంతసమైనది నా ఆత్మ తెలుగు సోదరుల సేవ చేయ ఈ శూన్య సంపాదనము నన్ననుగ్రహించినదని సంబర పడినాను ఇప్పుడారు నెలలనుంచి కాలిఎముక కూడుకొనివచ్చి నిత్యకృత్యాల కవకాశమిచ్చినది

ఇది శూన్య సంపాదనలోని సృష్టి-సృష్టిలోని శూన్యము

దీని ప్రకటన భారమంతా శ్రీ జి చంద్రశేఖరరెడ్డి తనదిగా భావించి నందుకు నాకు ఆనందమైనది నేనేగాక నావారు గుణభారం మోసి సంతసించారు

శ్రీ తూమాటి దొణప్పగారు హైదరాబాదు తెలుగు విశ్వవిద్యాలయానికి వచ్చిన సుసమయంలో నా కన్నడ నాటకము క్రాంతి పురుషబసవన్నను చిరంజీవి చంద్రశేఖర రెడ్డి తెలుగులోకి అనువదించగా దీనిని కన్నడ,తెలుగు ఏకప్రతిగా ప్రచురించుట జరిగినది ఇటువంటి పని ఇంతవరకు ఏ విశ్వవిద్యాలయము చేయలేదు ఇది నవ్యనూతనము జ్ఞాపకాలు-అనుభవాలు పుస్తకాన్ని, నా జీవిత కళా సేవను ఆంధ్రసోదరులకు ప్రకటించి అందించినారు దీనికి కారణము చెప్పబోతె శ్రీ దొణప్పగారి కళానుభావ సామ్రాజ్యము ఎంత పెద్దదో! 50 సంవత్సరాల క్రిందట, వారు విద్యార్థియై ఉరవ కొండలో ఉండగా నా నాటకం గరుడ గర్వ భంగము చూసి అందులోని నా కృష్ణపాత్రను ఎంతో మెచ్చుకొని, వేషములేని గౌడుగారు ఎట్లుంటారో చూడాలని మా జోళదరాశికి వచ్చినారట నేను ఊరిలో లేకుండుటవల్ల నిరాశతో తిరిగిపోయినారట ఇట్టి పిచ్చిగల వారుండ గలరా అంటె ఇప్పటికీ ఆ వెనుకటి ఘటనను మరువని శ్రీ దొణప్పగారు వున్నారు గదా!

నా షష్ట్యబ్ది సమారంభములో వారి రచనలు రెండు నాకు కానుకగా దొరికాయి జానపద సాహిత్యాన్ని గూర్చి విపులంగా, విమర్శనాత్మకంగా వెలయించిన ఆ కృతులు చదివి పల్లెటూరు వాసినైన నేను నా మనసు నిండా ఆనందించాను.

ఇక హైదరాబాదులో నాటకఆవిష్కరణకు పోయినపుడు వారు చూపిన సహృదయత ఏ జన్మానికి మరచేదికాదు ఆయనగారు ఎంత ఘనులో తెలుసు రసహృదయులందరికీ

కృష్ణునకు రాధ తన సర్వస్వము అర్పించి ఎలా ఆనందించినదో వారిని నేనట్లు ప్రేమించి అనంతవందనాలు అర్పిస్తున్నాను

ఇట్లు
బుధజన విధేయుడు
కె. దొడ్డన గౌడ

జోళదరాశి
9-7-1985

---

**గమనిక** పైన రాసిన దర్శనమునకు కారణాంతరములవల్ల ఏర్పడిన విఘ్నాల అవాంతరముచే ఈనాటికి దర్శనం దొరకి శూన్యసంపాదనము ప్రకటితమై తెలుగు సోదరుల ఆదరానికి పాత్రమైనందుకు సంతసిస్తున్నాను

జోళదరాశి
31-7-1990

విధేయుడు
కె. దొడ్డన గౌడ

# శూన్య సంపాదనము

## విషయానుక్రమణిక

శ్రీ గురు బసవలింగాయ నమః

# శూన్య సంపాదనము

## ప్రథమోపదేశము

౧

కం॥ శ్రీ విమల ముక్తిదాయక!
పావన మయ పరమచరితః షట్స్థల విభవా!
భూవినుత! సచ్చిదాత్మక!
భావజహర! ప్రోవు సిద్ధ లింగాచార్యా! ౧

అమిష కుంతల ఛేద్యుని
సేమమున పదములు నాల్గు శివశరణులకున్
ప్రేమ నొసగువాని నపూ
ర్వామోదమ్మున నుతింతు బసవాధీశున్ ౨

వరబోళ బసవ దేశికు
నురుతర కృపగాంచి అల్ల మూర్తము నరుదౌ
పరమానుభావ బోధల
వెరవున గూళూరుసిద్ధ వీరణ తరచెన్. ౩

శ్రీమత్ పరాత్పర పరశివ నిత్య నిర్మల నిరఘ నిరవద్య అనిర్వాచ్య పరంజ్యోతి స్వరూప, షట్స్థల జ్ఞాన ప్రభాపుంజ రంజిత సకల భక్త హృత్ కమల కర్ణికావాస, శరణజన ముక్తి ప్రదాయక, అఖిల జగదారాధ్యులైన తోంటద సిద్ధ లింగేశ్వరుని కృపా ప్రసన్న పాత్రులైన దేశిక బసవేశుని సంస్తుతి యించి వసుధ యందలి షట్స్థల జ్ఞానులైన దివ్యానుభావుల బోధలను గూళూరు

సిద్ధ వీరేశ్వరుడను మహానుభావుడు, నిత్య నిరంజన నిర్మాయుడను అల్లమ ప్రభుదేవుడు సమస్త మహాగణ సమూహమునకు జ్ఞానప్రసంగమును బోధించిన క్రమంబును సకల పురాతనుల వచనముల నుంచి సంగ్రహించితిమి శివ గణంబులకు శరణార్థులు

ప్రథమంబునందు అఖండాద్వయ అనుపమ నిరవయ నిరంజన సర్వ శూన్యం భావహించిన సచ్చిదానంద నిత్య పరిపూర్ణమైన నిఃకల లింగము ధ్యాన పూజాదులు లేక నిరవయంబున బయలుగా ఉండరాదనుచు తన స్వేచ్ఛా లీలా విలాసపు తలంపున తన చిత్ ప్రభా సామర్థ్య శక్తిని ముందుగొనుచు అనంత కోటి బ్రహ్మాండములను అణుకోటి ఆత్మలను తనయందె పుట్టించి ఆ ఆత్మలకు పంచ వింశతి తత్త్వంబుల సమ్మంధము ప్రాప్తించిన ఆ ఆత్మలు దేహోహం భావంబున జాతి వర్ణాశ్రమ కులగోత్ర నామ సీమలు సుఖ దుఃఖ బంధ మోక్షాలకు లోనై తమ నిజస్వరూపంబులు మరచిన ఆత్మంబులు కాలకామాదులకు అప్పగించి, వారి సుఖ దుఃఖ బంధ మోక్షంబుల చేరనీక యంత్ర వాహకుడై ఆడించుచుండు నా పరశివ లింగము అట్టి ఆత్మంబులందు జన్మంబునకు దూరమౌచు, శివ సంస్కారంబు పొంది, దేహ భావంబునకు రోసి సంసారంబు నుంచి విడదీసి, గురూ పావస్థలో నుంచినప్పుడు ఆ పర శివలింగము గురువై వచ్చి త్రివిధ దీక్షలచే మలత్రయంబులు పోగొట్టి దీక్షనిచ్చి రక్షించె, లింగస్వరూపమై వచ్చి, కరస్థలంబున పూజగైకొని రక్షించె, జంగమ స్వరూపుడై వచ్చి, అంతరంగ బహిరంగములందు నిండి బోధించి శిక్షించి రక్షించె, ప్రసాదంబు కరుణించి తనలో కూడుకొనుచుండును ఆ నిఃకల పరశివలింగము

ఆ నిఃకల పరశివుని సచ్చిదానంద స్వరూపుడౌ బసవన్న, చెన్న బసవన్న, ప్రభుదేవులే గురులింగ జంగమ స్వరూపంబులై, సకల జగత్ పావనార్థమై, మర్త్యంబున కవతరించిరి ఇటుల గురులింగ జంగమంబులు మూడు ఆ నిఃకల పరశివ లింగమే తానైనది

ఇట్లు సిద్ధ వీరాచార్యులు తమ ప్రారంభ గద్యము చెప్పుచు చెన్న బసవన్న అల్లమ ప్రభుదేవుల సాక్షి గద్యముల నుదాహరించి, అల్లమ ప్రభుదేవుని వృత్తాంతము ఇలాగున వెల్లడిస్తున్నారు

... శ్రీ వీరశైవాచార శిరోరత్న శ్రీ వీర శైవాచార ప్రమథనాయక, శ్రీ వీరశైవాచార దీక్షాచార్య, మర్త్యలోక పావన కారణావతార అనిమిష శ్రీ చరణాంభోజ కర్ణికావాస గుహేశ్వర నామామృత స్వీకార సంతుష్ట, శ్రీమత్ సకల జగదాచార్యులైన అల్లమ ప్రభు దేవులు, చెన్న బసవరాజదేవులే ముఖ్యులైన, అసంఖ్యాత మహాగణ బృందంబుతో మహానుభావ ప్రసంగంబు జేసిన శూన్య సంపాదన గురించి చేసిన సద్గోష్ఠి కథా ప్రసంగమును, ముక్తకమైన శివా ద్వైత వచనంబులను, ఉత్తర ప్రత్యుత్తర సంబంధముగా చేర్చి శివగణ ప్రసాది మహాదేవయ్యగారు భూలోకపు మహాగణంబులకు ఆ మహా ప్రసంగాన్ని సమర్పణ చేయుచు సిద్ధరామేశ్వర దేవునికి ఉపదేశ క్రమంబు లేదని గుమ్మళాపురము సిద్ధలింగ దేవులు సమస్త పురాతనుల వచన సమ్మతమున సంగ్రహించిన ఆ క్రమంబు బట్టి ఈ శూన్య సంపాదనలో జేర్చి శివ గణంబులకు సమర్పించితిమి

## వ్యాఖ్యానకారుని విన్నపము

ప్రథమంబునందు శివగణ ప్రసాది మహాదేవయ్యగారిని, హాలిగెయార్యుని, గుమ్మళాపురము సిద్ధలింగదేవుని, గూళూరు సిద్ధ వీరణ్ణొడెయులుం గారిని సంస్మరించి, సర్వ శివశరణ చరణారవిందముల కభివందించి, స్వప్న బోధామూర్తి చేళ్ళగురికి శ్రీ ఎర్రి తాతయ్యగారి గురు కృపాలబ్ధుడనై, ధారవాడ మురుఘా మఠము శ్రీ మృత్యుంజయ స్వాముల అనుగ్రహము పొంది, తత్వార్థ గురు సర్వదర్శనతీర్థ శ్రీ వై నాగేశ శాస్త్రులు, బళ్ళారి వారిని నిర్మల మనముతో ధ్యానించి, పరమ పవిత్ర శ్రేష్ఠ దర్శన గ్రంథమైన అనుభవామృత మహాశయమైన గూళూరు సిద్ధ వీరాచార్యుని కన్నడ శూన్య సంపాదనకు నా తెలివికందినంత, నా జీవన పావనార్థంబుగా తెలుగున సంగ్రహించి భక్తవరులు మన్నింప వ్రాయబూనెదను తప్పులు నావి ఒప్పులు మీవి

ముందు అచ్చొత్తిన సద్భాగ్యమట్లు గోచరించుచున్నది
చూడుమా! మట్టి మరుగున దేవళంబునందొక మాణిక్యము
చూచిన యంత ఇక మొదటివలె యగునా గుహేశ్వరా! ౧

మరియు

వెదుకబోయిన తీగ కాలికి చుట్టుకొన్నట్లు, తలచిన
తలంపు చేకూరినట్లు, పేదవాడు పెన్నిధి కన్నట్లు, నే
వెదకుచు వెదకుచు వచ్చి భావాతీతుని కంటినయ్యా! నా
ఎఱుక కార్యంబు కంటినయ్యా! నాలోని బయటి సర్వాంగ
పరమ ప్రకాశమున వెలుగు జ్యోతిని కంటిని జూడుమా!
గురుతులేని కరస్థలమున కడు చోద్యంపు చూపున నా
పరమగురుని కని బ్రతికితిని కనుమా గుహేశ్వరా! ౨

**వివేచనము :**

ఔను గదా, భాగ్యము కూడివచ్చినప్పుడు రాయి పరుసమౌతుంది మన్ను బంగారమౌతుంది ఈ వెనుక నా హృదయమునందు ముద్రవేసిన సౌభాగ్యము కన్నులకు ప్రత్యక్షమైన నా పుణ్యము అగణ్యము ఆహా! ఏమి చోద్యమిది. మన్ను మరుగుననున్న మాణిక్యమట్లు ఇక్కడ ఈ ఆలయములో చూచు జ్యోతిర్మయ ప్రకాశములో వెనుకటి అజ్ఞానపు మబ్బులుండునే స్వామి!

వెదుకబోయిన తీగ కాలికి చుట్టుకొన్నట్లు అనుకొన్నది ఐనట్లు పేదవాడు దోవలో కాలు తాకిన బోటు రాయి నుంచి ఐశ్వర్యము జూసినట్లు, ఆహా, మహాదేవ! ఈ రోజు నా జ్ఞానానికొక నిలుకడ కంటినయ్యా! ఈ మొదలు నా మనోమందిర జ్యోతియై వెలిగిన గురుని కంటిని ధన్యుడనైతిని

అక్కడుండు అనిమిషయ్యను జూచి ఆశ్చర్యచకితుడైనాడు అల్లముడు అతడెవరన్నది అతడెట్లు పరవశుడై యుండునది ఎరిగినాడు ఒకానొక కాలములో చాళుక్య వంశములోని వసుషేణుడు ఆతడు అతనికి వృషభేశ్వరుని నుంచి దొరకిన ప్రాణలింగ ప్రభావంబే ఇంతటి మహిమకు కారణమని గ్రహించి ఇటుల గురు సంబంధము లోకవృత్తము గూర్చి అనుకొనుచున్నాడు.

కన్నది పట్టనొల్లక కానరానిది పట్టెదనన్న అది
చిక్కలేదన్న, అయాసంబు జూడుమా! కన్నది కని
గురు పాదంబు బట్టిన కానరానిది కానవచ్చునయ్యా
గుహేశ్వరా! 3

**వివేచనము :**

లోకజనుల ప్రవృత్తి కడు చోద్యము సులభమేదో కష్టమేదో తెలియరు సులభతను ఉదాసీనము జేయుట కష్టాన్ని బట్టి తొందరకు లోనౌట ఏనాటి నుంచియో జనుల రక్తములో ప్రవహించి వచ్చిన అవివేక రమ్యము కనుచూపు కందునది, సులభంగా దొరకునది గురుపాదము దానిని పట్టలేక నమ్మలేక, ఏదో కనుచూపుకందని అదృశ్యాన్ని పట్టెదనని పరితాపానికి గురియై జీవనాన్ని నిష్ప్రయోజనము చేయుటకన్న కనబడు గురుపాదము నమ్మి పట్టిన కానరానిది కానవచ్చును గదా!

అల్లముడు సూక్ష్మమగు మార్గాన్ని బట్టి అనుకొన్నది నిజమే తత్త్వ వేత్తలు దృశ్యాదృశ్యాల వివేచన చేసిన శాస్త్రముల అర్థానుభవములను విభజించి చూడగా దృశ్యానికి మూలము అదృశ్యమేననియు అదృశ్యానికి మూలము దృశ్య మేననియు చెప్పబడుతుంది ఈ దృశ్యాదృశ్యాలు రెండు వేరైనది ఒకటి నుంచియే అదియే బ్రహ్మమందురు ఈ సుందర ప్రకృతిలో పరికించితే కనబడు దృశ్యములోనే కానరానిది ఇముడుకొన్నది సులభంగా గ్రహించ వచ్చు

నాల్గు దిక్కులకు విశాలంగా ప్రాకిన చెట్టు కొమ్మలు కనబడుటకు మూలము వేర్లు అవి కనబడవు అందే కానరాని వేర్లనుంచి కనబడు చెట్టు పెరిగిందన్నది నిజమే కదా! అటులనె దృశ్యమును ఆధారంగా వుంచుకొని అదృశ్యములోనున్న సచ్చిదాత్మను కనుగొనుటకు కనబడు గురువే మూలమని అల్లముడు గురుమార్గము నిశ్చయించుకొని గురుని చూస్తు చూస్తు సంభ్రమాన్వి తుడై ఇట్లనుచున్నాడు

## గురు మహిమ

కాయము నుండైన మూర్తిగాదు జీవము నుండైన
మూర్తి గాదు ప్రాణము నుంచైన మూర్తి గాదు
పుణ్యంబు నుంచైన మూర్తిగాదు ముక్తిచేనైన రూపంబు
గాదు యుగంబు నుంచైన మూర్తిగాదు యుగళంబు
నుంచైన మూర్తిగాదు శివునిచే జనించిన మూర్తిగాదు
శక్తిచే బుట్టిన మూర్తిగాదు ఇదెట్టి మూర్తియని ఉప
మించెద! కానరాని కాయంబు, చూడరాని తేజంబు,
వివరించరాని రీతి, కారణంబు చేబట్టి కన్నులకు గోచరం
బైన పరమ సౌఖ్యంబదేమని వర్ణింతునయ్య-గుహేశ్వరా। ౪

మరియు

స్ఫటిక ఘటంబు వోలె లోన బైట అన్నది లేదు
చూడుమా! ఈ వికట చారిత్ర్యంబునకు వెఱగైతిని
చూడ కనుపించుచున్నది తాకిన చేతి కందదు చేరుట
సమీపంబు పోవ పోవ దూర దూరంబు ఆకారంబును
నిరాకారంబు మ్రింగి బయల సమాధిలో చిక్కె జూడుమా!
దర్శనమే అమృతాహారమై యుండె స్పర్శించి చేరిన
ఇంకెట్లో గుహేశ్వరా !! ౫

**వివేచనము** •

ఏ దానినైన కొనకు ఏ లోకంబులోను కనపడని ఏ దేవునైన విరివిగా వర్ణించవచ్చు ఐతే సందర్శనీయుడైన మనః ప్రవృత్తిలో నున్న గురుని వర్ణించడము గాని, నిర్ణయించడము గాని సాధ్యము కాదు హరుడంటే పరానికి చెందిన వాడౌను నరుడంటే ఇహానికి చెందిన వాడౌను ఇహపరాలకు దూరుడైన వాడే గురువు నిరుపముడు సహజ తత్వమైన దాన్ని పొగడుట సాధ్యమా? యని అల్లముడు అనుకొనుచు వర్ణించే స్వభావాన్ని బిగబట్టక ఈ గురుడు తనువు నుంచి కాలేదు జీవ - ప్రాణ పుణ్యముల నుంచి పుట్టలేదు ముక్తిగాని యుగ యుగళంబుల నుంచి గాని వెలువడలేదు శివ శక్తులు కారణము కాదు. ఏమో! దీనికి ఏమని చెప్పవలెనో తోచదు ఐతే హృదయానికి చెప్పరానిదేదో చెప్పుచున్నది

సమీప మని పట్టబోతే చేతి కంధదు దూరంగా తొలగి తొలగి ఊహ కందని రీతి నలుదిక్కుల వ్యాపించుచున్నది ఆకారమై తోచుచున్న దానిని నిరాకారము కబళించినది బయలులో బయలు సమాధి యైనది ఆహా! ఎంత వింత ఇది ఎంత సంతసమిది దర్శనమే అమృతాహారమైనది ఇక ఆ పరముని కూడిన సుఖ మెట్టిదో?

ఇట్లని అల్లముడు సందర్శన భాగ్యాన్ని పొగడుకొనుచు ఒక సందేహానికి లోనైనాడు ఏమిటంటే, గురువు సాక్షాత్కరించినాడు అతడు జ్యోతిర్మయుడు సావయుడై యున్నాడని కనిపించునుగాని క్రియోపదేశానికి సాధ్యుడు గాడు. తానున్నది, ఎదుటున్నది ఎఱుగడు నిశ్శబ్దావరణంబులో వేరొక శబ్దము వాక్కుల వినని ముగ్ధుడైనందున నన్ను శిష్యునిగా గ్రహించడు లింగోపదేశాను గ్రహ మివ్వడు. ఎట్లైన ఆయన అనుగ్రహం పొందవలెను నాకు నేనే గురువై ఉపదేశము పొందవలెనని నిశ్చయించుకొని అల్లమదేవుడు ఇట్లనుచున్నాడు

## గురు శిష్యుల అభేదము

నుడి నడకలేని గురుని గని ఉపదేశము పొంద
బోయిన చూచి పలుకడు పలికించిన వినడు కొన
మొదటి కార్యం బెటదెట్లు అయ్యో? మూగ మూగలు
మాటలాడు కొన్నట్టిది నాలోని ఎరుక పరిమళంబు
బయటచూడ ముగ్ధత్వంబు ఇదెట్లని ఉపమించెద? నియ
మంబు లేని మనోహరము ఇయ్యది తన నుంచి తానౌను
గాని భిన్నంబునందున్నదె గుహేశ్వరా? ౬

మఱియు

ఒకటందునా? రెండైనది రెండందునా? ఒక
టైనది ఒకటి రెండను సందేహమిదేమిటో? వియోగంబు
లేని కూటంబునకు విప్పి వేరుగాని ఉపదేశము గురు
శిష్యుల‌ను భావంటునక భేదంబు గలదా గుహేశ్వరా!! ౭

**వివేచనము :**

ఆహా! ఏమియు కానివాని చూపు కంది స్పర్శ కందని వానిని ఇదిట్లని నిర్ణయించుటెట్లు? నిర్ణయించ లేనిది గురువుగా గ్రహించుటెట్లు? ఎదుటున్న మహానుభావుడు ఈతడె నీ గురువని హృదయము స్పందించి నర మండలాన్ని జేగొట్టుచున్నది ఆనంద హర్షాలు పులకాంకురాన్ని లేపుచున్నవి ఈ దివ్యమూర్తి నిర్ణయింపరానిది శాస్త్ర నియమాలకు అందనిది ప్రమాణముగాని అప్రమాణ మిది ఏదియున్న ఏది కాకున్న భక్తికి దూరముగాని సహజస్థితి నందుకొన్న గురు స్వరూపము కాబోలు నా అంతరంగము మూగవోయినది బహిరంగము ముగ్ధమైనది

ఏమని భావించదమో తెలియకున్నది ఇక్కడ నాకెవరు చెప్పెదరు? నా ఎరుకకు తెరువేది? ఇది ప్రశాంతమైన ఏకాంతము ఎదుట గురువున్నాడన్న అతడు క్రియా రహితుడు పట్టిన పట్టు వీడడు పిలచిన పలుకడు దగ్గరంటె దూరము దూరమంటె దగ్గర ఈ విలాస వినోద వైఖరి ఊహాతీతము ఇది గాక ఒకటంటె రెండైనది రెండంటె ఒకటైనది ఈ ఒకటి రెండను సందేహ మేమిటి? విడదీయరాని అవినాభావ సంబంధ సముచ్చయానికి వేరుగాని ఉప దేశము గురు శిష్యులను భావానికి భేదమెక్కడ?

అల్లమ ప్రభువు గురు నిరూపణకు శిష్యుడే మొదటివాడని తలచి కేవలము జ్ఞాన జ్యోతిగా వెలుగు గురు అనిమిషయ్య నుంచి క్రియోపదేశంబు సాధ్యము కాదని తనలో ఈ లాగున అనుకొనుచున్నాడు

## అభిన్న లింగోపదేశము

కానరాని గురువు కంటికి గోచరించిన చెప్పరాని
విన్నపము స్పర్శలేని హస్త మస్తక సంయోగంబు
నొసలులేని విభూతి పట్టంబు వినరాని కర్ణ మంత్రంబు
నిండి తొలుకని కలశాభిషేకంబు ఆగమంబు లేని దీక్ష
పూజకు రాని అంగంబు సంగంబు లేని సంబంధము
స్వతంత్రమై, అనుగ్రహమునకు అనువగునట్లు చేయుమా
గుహేశ్వరా!

మరియు

నీవు నాకు గురువైనచో, నే నీకు శిష్యుడైనచో
నా తను కర్మంబు తెంచి నా కరణ గుణంబుల వోనాడి
నీవు నా కాయమందణగి, నీవు నా ప్రాణంబులో చేరి,
నీవు నా భావంబులో కూడి, నీవు నా కరస్థలంబునకు
విచ్చేసి కారుణ్యంబు చేయుమా, గుహేశ్వరా ! ౯

మఱియు

ఆదినుంచట్టట్టు నాకు నీవె గురువయ్యా అనాది
నుంచట్టట్టు నాకు నీవె గురువయ్యా రెండు నామంబులు
పుట్టకమున్ను మీకు నేనె శిష్యుండనయ్యా నా భావ
కాయంబులోని భ్రమము దీర్చి, నా జ్ఞాన కాయంబులోని
మరపు త్రుంచి, నా యందు ఎఱుక దోవ జూపుచు,
బయట మాటాడ కూరకున్న విడువను చూడుమా।
శ్రీ చరణములను చేసిన అంతె మహా ప్రసాదమని
చేకొందు ఇట్లు ఏ తెరంగుననైన, నా దేహము మీలో
సమయించి పొందెద మీ కారుణ్యము గుహేశ్వరా!
మీరుండు మర్మమిది చూడుమా। ౧౦

**వివేచనము :**

గురువు చేయలేని దీక్ష శిష్యుడే గురుడై తనకు తానే చేసుకొనక మునుపు గురుశిష్యుల సంబంధాలను అల్లముడు విమర్శించుకొంటు - అయ్యా మహా స్వామీ! నేనేమని విన్నవింతు? చూడచూడ కన్నులకు పరాత్పర చిత్ ప్రకాశమూర్తి విరాజిల్లుచున్నది దశదిశల వ్యాపించిన సర్వాత్మచేతనా సమష్టికి విన్నపము చేయ విషయమేలేదు పలుకేలేదు అర్థమేలేదు ముట్టి తట్టుటయేలేదు ఫాల తలంబున భసితమేలేదు మేనంత శివుని వెలుతురు నాదంబు లేని మంత్రము కలశంబు లేని తీర్థము సక్రమంబు (ఆగమంబు) లేని దీక్ష ఆహాహా, ఏమిటిది విరోధాభాసము! ఇలాటి దీక్షకు లింగము పూజలవసరమా? ఔను - కావలెను సంగములేని నిస్సంగములో స్వతంత్రంబె తానె యగునట్టు గురు కృప చేయగలదు.

గురుదేవా! మా ఇద్దరి గురుశిష్యసంబంధము పొందితె నా తనువు నీలో నుంచుకొనుము కర్మ బంధాలు త్రెంచివేయుము నా దశేంద్రియాలలో పొదుగ కొన్న కళ్మలము తుడిచివేయుము అయ్యా, ఇటు వినుము నీవు నా దేహంబులో చేరుము నా ప్రాణంబులో చేరుము భావంబులో చేరుము ఇటులచేరి తను, మన ప్రాణంబులేకమై నా కరస్థల పీఠమున జేరి రక్షింపుము.

ఈ నా ప్రార్థనము ఈనాటిది కాదు దీనికి తుద మొదలు లేవు ఆనాటి నుంచి నీవె నాకు గురువు నేనె శిష్యుడను అప్పుడు నీవు నేనను రెండు పేర్లు లేవు అంతా ఏకమే మా సంబంధము కాలాతీతము ఈనాడు మౌనియై నేనే మన్న పలుకక ఈరకుంటే నీ కమనీయ పాదపద్మంబులను విడుతునా గురుదేవ! నీవై క్రియాను గ్రహమిచ్చినా సరియె, లేకున్నా సరియె నీవె నేనై నీ కృపాదీక్ష పొందెద.

అల్లముడు గురుతత్త్వాన్ని విశదీకరించుకొని ఒక నిశ్చయానికొచ్చి మౌనియైన శ్రీ గురు సన్నిధియందు సాష్టాంగ ప్రణామంబాచరించి అభిన్న క్రియావర్తనుడై నివేదించుకొంటున్నాడు

జ్యోతి లోపలనున్న కప్పురంబునకు నీటిలోపల
నున్న ఉప్పునకు, శ్రీ గురువులోనున్న శిష్యునకు వేఱు
వేఱు క్రియా క్రమంబు గలదె గుహేశ్వరా? ౧౧

**వివేచనము :**

అల్లముడు ఇట్లనుకొనుచు గురుశిష్యులకు భిన్నంబు లేదని అనిమిష గురు దేవుని కరస్థలమందున్న లింగమును తానే తీసుకొన్నాడు ఆ క్షణములోనే శ్రీ గురువు నిరవయంబై దేహంపు అస్థి చర్మంబులు కీలుదప్పి కుప్పగా నేలబడిన, అల్లమప్రభు ఈ దురంత దృశ్యాన్ని చూచి మనంబున చాంచల్యమావరించి, అయ్యో, ఇదేమి గురు హత్యయా? గురు ద్రోహమా? నేననుకొన్నది శివాద్వైత సిద్ధాంతము తప్పా? అని వెరగై ఏమియు తోచక నిలబడినాడు

## ప్రభుదేవుని సందేహము

భ్రాంతి యావరించినది చింతానల చిత్తుడైనాడు మొదట అనుకొన్న దంతయు మరల మొదట నుంచి తప్పెక్కడైనదో చూచుకొనుటకు ఇటుల తనకు తానే చెప్పుకొనుచున్నాడు

ఆణవమల మాయామల కార్మిక మలమను మల
త్రయంబులు తెగి మిగిలిన నిర్మలుండైన శిష్యుడు కాయ
జీవంబుల భ్రాంతి సూతకములింకి నిశ్శంకుడైన గురుడు
ఈ రెంటి భావంబులోన ముందేది? వెనుకేది? అని
తెలియుటెట్లు? కరస్థలానికి కారుణ్యము జేసిన, మన
స్థలానికి హంగులేదు మన స్థలంబున చెరగొడ్డి వేడిన
కరస్థలపు లింగంబు చేజారినది గురు స్థలము నిలువ
పరస్థలమందడగిన భావ బడలిక యిదేమో గుహేశ్వరా? ౧౨

**విశ్లేషణము :**

గురువానుగ్రహ మోహానికి జిక్కి ఇట్టి నిందనీయమైన ఘటనకు లోనైతి శ్రీగురుడు ప్రాణఘాతనికి కారకుడైతి ఇష్టలింగ ప్రాప్తితో గురునష్ట పాతకమున్నదని తిరుగనైతి శివశివా! నేడెట్టి ప్రమాదానికి లోనైతినని ప్రభుదేవుడు విచార సాగరమున బడి దానిలోని తరంగాల తాకిడికి మునిగిలేచి నిశ్చలుండై నిలిచి, లేదు లేదు, శిష్యుడు త్రిమలాల మలినము తుడిచి నిర్మలుడైనాడు గురువు కాయ జీవంబుల మాయాసూతకంబులు లేక సంశయ రహితుడైనాడు గురుశిష్యులిద్దరూ పవిత్రులై ఈ పవిత్రతలో ముందు వెనుకల గొడవేమిటి? కరస్థలానికి వచ్చి ఇష్ట లింగము మనో స్థలములో నున్న ప్రాణలింగమే గనుక దానికి ప్రత్యేకత లేదు లోపలున్న ప్రాణలింగమంటె అది జ్ఞానలింగము బయటికొచ్చి ఆరాధనకందిన క్రియా లింగమైనది ఐతె గురుస్థలము నుంచి ఈ క్రియసాగుట సామాజికము ఇక్కడ నడచిన క్రియ ఏక క్రియ క్రియాతీతుడైన గురువుగాన శిష్యునే గురువు చేయు క్రియను చేసి శిష్యుడై ఆ క్రియనందుకొని ధన్యుడైనాడు గదా! ఆ గురు స్థలము నష్టమౌటకు కారణమేమి? శివాద్వైత సిద్ధాంతరీతిని వివేచించి పరికించితే ఆ గురుస్థలము పరస్థలములో లీనమైనది నాకెందుకింత భావబడలిక?

నిర్ణయంబెరుగని మనసా, సందేహంబాహారంబు
గొంటివి గదా! మాయా సూత్రంబిదేమొ? కంటిలోని
మబ్బు తెలియరాదు గదా! వెలుతురులోని శృంగారము
వేధించుచున్నది గుహేశ్వరా! ౧౩

**వివేచనము.**

ఆహా మాయా విలాసము తెలిసియు తెలియని రీతిని ముందుంచి సంకల్పాన్ని కదలించును గదా! ఓ మనసా, కదలకుము స్థిరత్వాన్ని విడువకుము కంటిలోని చీకటి వెలుతురులోని వైయారములు బాధాకరములు భ్రాంతి జన్యములైనను చూపు వెలుతురు ఉపయోగము నా గురుడు నిజమైనాడు ఆ గురుని చేతనము లింగమందడగినది ఆ లింగమునా కరస్థలంబున కొచ్చినది కాన ఈ శ్రీగురువు నా కరస్థలమందు మనస్థలమందు పూర్ణుడై నివసించినాడు ఆయన చావలేదు చావున్నవాడు గురుడు గాడు, అమృత స్వరూపుడని అల్లమరాయుడు వికలంబైన మనసును కుదుటపరచుకొని సమాధాన చిత్తుండై ఇట్లనుచున్నాడు

## అల్లముని సమాధానము

ఆహా, మనసా, మరచితివి గదా నీ పూర్వాపరంబు:
ఘనము మనములో చేరి ఆ మనము లింగములో మిశితమై
ఆలింగము నా కరస్థలాన్ని పొందినమీద వినాశ వియో
గమను భావభ్రాంతి ఇదేమిటిదో? జననంబు లేని
ఘనంబునకు మరణమున్నదె? తెరపులేని నిజము తన
యందు తాను వేద్యమైయుండు గాన ఎదుట కానరాదన్న
అజ్ఞానంబిదేమిటో? జననంబులేని నీవు నేననుటమాని
తానెయై సాధ్యమైయుండె దీనికేమందు గుహేశ్వరా? ౧౪

**వివేచనము:**

ఓహో మనసా, నీవెవరో? వచ్చిందెందుకో చేయబోవు కార్యంబేమో? పొందగల పరమార్థమేమిటో? మరచితివా నీ వెనుకటి కథ: వివేకించి విమర్శించితే నీ ఘనత అదేమైనదో చూడు ఘనము మనములో చేరినదిగదా? ఆ మనము లింగములో కూడినది ఆ లింగము నా కరస్థలములో నివసించిన వెనుక భయమెక్కడది? వినాశముగాని యోగవియోగములు గాని అక్కడుండుటకు స్థానములేదు జనన రాహిత్యానికి మరణంబు కలదే? సందులేక నిండిన నిజము తనకు తానె ఎరుకై యుండుగాని ఎదుట కనబడదను అజ్ఞానమేలనయ్యా? పుట్టనే లేదని నీవు-నేననేదెక్కడ? అదంతా విభేదంబుమాని తానెయై సాధ్యమైయుండె

అల్లమారాధ్యుడు తన అనంత జ్ఞానాన్ని విస్తరించి జరిగిన కార్యమునకు కలిగిన సందేహమునకు సమాధానంబు చెంది మరియు ఇట్లనుచున్నాడు

చూడనిదానిని వెదుకుచురుగాని చూచినదాని
నెవరు వెదకెదరు? ఘనమునకు ఘనమైన వస్తువు, తానె
గురువయ్యె తానె లింగమయ్యె తానె జంగమయ్యె తానె
ప్రసాదమయ్యె తానె మంత్రమయ్యె తానె యంత్రమయ్యె,
తానె సకల విద్యాస్వరూపుడయ్యె ఇట్లు ఇవి యన్నియై
నా కరస్థలంబునకు వచ్చె ఇక నిర్వికారినయ్యా గుహే
శ్వరా! ౧౫

### వివేచనము

ఇక మనోవికారానికి తావులేదు లోకములో విచిత్రమేమంటె, కనుల ముందున్నది చూడరు కనుమరుగైన దానిని ఎంతో కష్టపడి వెదకెదరు ఔనుగదా! కానరానిది పరమతత్వము కనబడునది లౌకికతత్వము ఎదుటున్నదే గాక వ్యవహారములో చేరినది దాన్ని వెదుకవలెనన్నది లేనేలేదు వెదుకవలె నన్నది ఘనము ఈశ్వర స్వరూపము అది అనుగ్రహించి గురులింగ జంగమ ప్రసాద మంత్రయంత్రమై సకలము తానెయై, నా ఇష్టలింగమై ఈనాడు నా స్వయమైనది ఇకనే నిర్విచారి, నిర్వికారి, ఆనందవిహారి యని అనుతాప సంతాపంబుల మరచి శ్రీ గురు నిత్యుడని తలచి ప్రభువు ఆ గురువె ప్రాణలింగ సంబంధియని స్తుతించుచు మరియు ఇలాగనుచున్నాడు

ఎక్కడి మావి, అదెక్కడి కోయిల? ఎక్కడినుంచె
క్కడ సంబంధమయ్యా? కొండ ఉసిరికకాయ సముద్రపు
ఉప్పు-ఎక్కడి నుంచెక్కడ సంబంధమయ్యా? గుహే
శ్వర లింగానికి, నాకు ఎక్కడి నుంచెక్కడ సంబంధ
మయ్యా? ౧౬

### వివేచనము

పరమాశ్చర్యమిది విజాతి విలక్షణమిది సృష్టి కల్పించిన వినోదమిది మామిడి చెట్టెక్కడో, కోయిల పక్షెక్కడో? లేని సంబంధము, వసంత ఋతువు

గూర్చునట్లు, ఉసిరిక కాయ సముద్రపు ఉప్పు ఊరగాయ చేర్చినట్లు, గుహేశ్వరా ఇదెక్కడి సంబంధమయ్యా ఎక్కడ నుంచిది వచ్చినదయ్యా? పెండ్లి కాక మునుపు వధూవరులు ఎక్కడి వారో ఏ యూరో తల్లిదండ్రులెవరో, వారి వృత్తి గుణాదులెట్టివో, పెద్దలు నిర్ణయించి తాళి కట్టించిన తోడనే విడరాని దాంపత్యబంధమై సంసారలత సాగినట్లు, శ్రీగురు కారుణ్యము నుంచి ఇపుడు నేను నీవు ఒకటైతిమి అది అంగ సంసారమైతె ఇది లింగ సంసారము, అది సతిపతు - లైతే ఇది లింగపతి శరణ సతియైనది అంగసంసారానికి, లింగ సంసారానికి వ్యత్యాసము లేదు వైదిక మార్గ విభేదము లౌకిక పారమార్థమను వ్యత్యాసము లేదు గురు లింగ జంగముల ఆరాధన లేక అంగ సంసారము సాగదు లింగసంసారము సాగదు రెంటికి దేహేంద్రియాలు ఒకటె. అవస్థా త్రయాలు ఒకటే త్రిగుణాలు ఒకటె దేహానికి సంబంధించిన క్రియలు ఒకటె

రెంటిలోను చెడ్డది విడిచి మంచిని సాధించునదె ముఖ్యము లింగ సంసారములో స్వరూపంబు లేని సద్గుణాలు సంపాదించితే అంగ సంసారములో ఆ సద్గుణాలకు స్వరూపమిచ్చి చూపించుమన్నది అంగసంసారమును తెలియని వారు లింగసంసారమును సులభముగా తెలియలేరు అయ్యా, ఈనాడు నాకు నీకు వివాహమైనది ఇది దిక్కులేని వివాహము శరణులు పెద్దలు లేరు వివాహ విధి జరిపే పురోహితుడైన గురువు లేడు ఈ సంభ్రమానికి పందిరిలేదు పచ్చటి ఆకులు లేవు మేళము లేదు తాళములేదు కలశములేదు ముత్తైదువులు లేరు స్వామి ఇవన్ని మంగళ వస్తుసముదాయము లేకున్నా మంగళానికి మంగళమైన నా మనోహరుడు నామనోనాథుడు అయిన నీవు చేపట్టినావు నన్ను రక్షించినావు ఇక పెరవారితో నాకేమిపని నా వల్లభుడు నా పక్క చేరిన నాకింకెవరి దాక్షిణ్యమెందుకు?

ఎవరు లేని వివాహము, దీక్షలేని లింగధారణను సమాజం ఆక్షేపిస్తుంది సమాధానము లేకపోలేదు నాల్గు వివాహవిధులలో గాంధర్వ వివాహము లేదా? అది సమాజము సమ్మతించినట్లు మన దీక్షను మతము ఒప్పుకొని తీరాలయ్యా యనుచు అల్లముడు దీర్ఘంగా తన కార్యాన్ని సమర్థించడములో కాలములోని ప్రాకృతిక విధానమును తలచుకొని ఆనందించి ముందు సాగుతూ

కానరాని లింగము నా కరస్థలంబున కొచ్చిన
వినలేను చెప్పలేను నాకిది చోద్యంబు,మరిమరి చోద్యంబు!
గుహేశ్వరుడను లింగము నిరాకారము బయలు, సాకా
రమై నా కరస్థలంబునకు విచ్చేసిన చెప్పలేను వినలేను ౧౭

ఔను, నేనేమి చెప్పగలను అతడు బయలైనవాడు ఎవరికి కనబడక, వెదకిన చిక్కక అలభ్యమైన వాడు నను వలచి నన్ను ఉద్ధరించుటకై తనకు తానె నిరాకారము నుంచి సాకారాని కొచ్చి ఇట్లు నా కరస్థల సౌభాగ్యమై వచ్చిన నా ప్రాణనాయకుని ఏమని, ఎట్లని కొనియాడుదు? మాటలున్నవే? అర్థ భావము లున్నవే? నాకంత జాణతన్నమున్నదే? కావ్య రసామృతమును నిర్మించగలనా? పాడగలనా? ఏమియు తెలియని ముగ్ధత ఆవరించినది అతని విడిచి ఏదియు జ్ఞాపకమునకు రాదు చోద్యమిది, మహానందమిది

తనువు తత్తరించి మనసు మీయందు చిక్కె-
నయ్యా! చూపె ప్రాణంబై ఆప్యాయనము మీయందు
కరగినదయ్యా (ఆరినదయ్యా) చిక్కె- శూన్యంబులోన
గుహేశ్వర నిరాళంబు! ౧౮

**మరియు**

మిమ్ముచూచు సుఖమున్నంత వఱకు కూడు కొను
టెక్కడిదయ్యా? మిమ్ముకూడుకొను తమకి మున్నంత
వఱకు చూపు సాగదు చూచి కూడి విస్మయమైన సుఖము
ఏమని నెరుపమింతునయ్యా గుహేశ్వరా! ౧౯

**వివేచనము**

తాను పొందిన సౌభాగ్యమును నూతనముగా పతినుంచి పొందిన సుఖాలను, అతని రూప రేఖా విలాసాలను కొత్త పెండ్లికూతురు హద్దుపద్దులు లేక చెప్పకొని ఆనందించినట్లు అల్లముడు తను సాధించి స్వాధీనంబు జేసుకొన్న ప్రాణలింగాన్ని ఎంత పొగడిన తృప్తిలేదు వలపు కైపులో ప్రియురాలిని తిప్పి తిప్పి ఆయా అవయవ సౌందర్య సౌష్ఠవాలను వర్ణించినట్లు అల్లమయ్య తన లింగయ్యను పొగడుచున్నాడు

తనువు వణకి మీయందు చిక్కి చూచెడి చూపు ప్రాణముగా మారి తృప్తి పొంది మీ యందు గురుతులేక ఆరిపోయె నీవు శూన్యములో నిరాళమైతివి ఇది గాక మిమ్ము చూచినదే సుఖమయ్యా! ఆ సుఖమున్నంతవరకు నీ లోపం కూడు టెట్లు? మిమ్ము కూడిత చూచుటెట్లు? చెప్పరా నా స్వామి! ఏమి చేయుదు? నా కిది విచిత్రము చూచుట చేరుట ఒకేసారి సాగదు ఒకటుంటె మరియొకటి సాగదు ఒకటుంటె మరియొకటి సున్న

ఇలాగున సామాన్యునివలె మతిమాలిన వానివలె అల్లముడు ఆనందమున ఉప్పొంగినాడు

## గూళూరు సిద్ధ వీరన్నగారి గద్యము

"ఇట్లు గురు కరుణనుంచి ప్రాప్తమైన ఇష్ట లింగమునందు విశ్వాసము బలమైనప్పుడు ఆయత లింగము ఆ ఇష్టలింగభావము మనోవేద్యమైనప్పుడు స్వాయత లింగము ఇష్టలింగ ప్రభావము మనోవేద్యసుఖము భిన్నమై యుండక, అనుపమ పరిణామ పరిపూరితమైనప్పుడు సన్నిహిత లింగము ఇట్లు ఇష్ట ప్రాణ భావ లింగంబులు తనుత్రయమందు ఆయత స్వాయత సన్నిహితంబులౌటకు ఆ శరణుని షడంగమునందు షడ్విధలింగ సంబంధమైనదే షట్ స్థలంబులని ప్రభు దేవుడు నిరూపించినది అది యెట్లన్న"

**భక్తిస్థలము**

ప్రమిదయూ యున్నది వత్తియూ యున్నది
జ్యోతి వెలిగించుటకు నూనెలేకున్న వెలుగెట్టులగునయ్యా?
గురువూ ఉన్నాడు లింగమూ ఉన్నది శిష్యునికి జ్ఞానో
దయం కలుగునంతవరకు భక్తి ఎట్లు సమకూరునయ్యా?
సోహం అనుట విని దాసోహము చేయకున్న ధిక్క
రించితి నేను గుహేశ్వరా! ౨౦

మరియు

అన్యరజము చేరక తన రజమును తొందరించక
రవి పంట వాడక, లింగపు పంటదెచ్చి జంగమమందు
సమయించును ఆ భక్తునందుండును గుహేశ్వరుండు ౨౧

మరియు

తెల్లవారు జామున లేచి లింగపాదంబు ముట్టి
సుప్రభాతంబునలేచి శివభక్తుల ముఖము జూచిన పుట్టి
నందుకు సఫలము జూతుమా! సత్యవచన మిట్లని పలుకు
చుండె ఇవి లేనివారినొల్ల గుహేశ్వరా! ౨౨

**వివేచనము**

ప్రమిద యున్నదనుకో వత్తియు దానియందున్నదనుకో ఐతే వెలిగే నూనె లేకున్న ఆ దీపమెట్లు వెలుగును? ఆలాగుననె గురువు వున్నాడు లింగము ఉన్నది శిష్యునికి ఆ గురులింగములో నమ్మకముదయించేంత వరకు భక్తి సమకూడుటెట్లు? నేనన్న సోహం విన్నందుకు నీవన్న దాసోహం చేయకున్న నదెట్లు భక్తి యగును? స్వామి నేనొల్ల దాసోహము లేనివారికి నే దూరము, వారి ముఖము చూడను వారిని నిరసింతు

ఇవిగాక అన్యమతముల కసవు రేపక స్వమత కసవు పెంచక అంటె భక్తుడైనవాడు అన్యుల గొడవలకు పోక తన నమ్మకము వదలక ప్రకృతి జన్య పదార్థములను లింగాని కర్పించక పరిశుద్ధ మనంబున లింగానుగ్రహమను పంటను ప్రసాదంబుగా జంగమస్వామి కర్పితము చేయును ఆ భక్తుడెవడో వానియందు గుహేశ్వరుడుండును

లింగపాదము బట్టి శివశరణుని లేచిన తోడనె చూచుట మహాభాగ్యము పుట్టినందుకు సార్థకము ఇవి లేనివార నొల్లనయ్యా యనుచు అల్లముడు భక్తి స్థలమందుండు సమయాచారముల నిట్లు చెప్పుచు, ఈ భక్తి నిశ్చలంగా యుండ వలెనంటె సదా భృత్యాచారియై యుండి విశ్వాసంబున నిష్ఠ నభివృద్ధి పరచు కొన్నపుడు ఆ భక్తియే మహేశ్వర స్థలంగా మారును అదెట్టులనిన-

**మహేశ్వర స్థలము**

ఇచ్చిన గుఱ్ఱమెక్కనెరుగక మరియొక గుఱ్ఱంబు
కాంక్షించు వారలు వీరులు గారు, ధీరులు గారు ఇది
కారణము మూడు లోకాలు గుఱ్ఱపు జీను మోసుకొని
బసలింతో గట్టుచురయ్యా గుహేశ్వరా! ౨౩

**మరియు :**

అష్ట విధార్చన షోడశోపచారంబుల దాక్షిణ్య
మెంచక చేసెద నే జేయు క్రియలంతయు నీవెయైన
కారణమున గుహేశ్వరా, నీయందు చేరితినయ్యా! ౨౪

**వివేచనము**

అల్లముడు రెండవ స్థలమైన మహేశ్వరాన్ని అందుకొంటూ నిరూపించ డానికి పైన ఉదాహరించిన వచనాలు (లౌకికంగా) భౌతికంగా చెప్పుచున్నాడు

లోకులు ఎంత తెలివిమాలినవారు! ఇచ్చిన గుఱ్ఱాన్ని ఎక్కలేక ఆ కాలు వంకర, ఈ కాలి గిట్ట చీలిక, తోక సొట్ట అని ఏమేమో ఒల్లని పేర్లు బెట్టెడి వారు వీరులు గారు, ధీరులు గారు ఎందుకంటె, గుఱ్ఱము యుద్ధానికి సహాయము, ఆ సహాయాన్ని ఎట్లు పొంది జయము సాధించుటో తెలియని పంద పశువు ఇలాటివారు అన్ని లోకములలో ఉన్నారు ఉన్నవారి జీవనము ఎట్లున్నదంటె, ఇచ్చిన గుఱ్ఱాన్ని వదలి మరియొక గుఱ్ఱాన్ని వెదకడానికి ఆ గుఱ్ఱము జీను మోసుకొని తిరుగు పిచ్చివారివలె ఉన్నారు

భావమేమిటంటె, గురువు అనుగ్రహించి ఇచ్చిన లింగాన్ని విడచి లోకము లోనున్న ఇతర దైవముల మతాల గురువుల వెదకుచు పోవువారు వ్యభిచార భక్తి గలవారని విడంబించుచు మరి ఇలాగంటున్నాడు ఆ మాటలో తన నిష్ఠను వెల్లడిస్తున్నాడు,

జలము, గంధము, అక్షతలు, పత్రి, పుష్పము, ధూపము, దీపము, నైవేద్యము, తాంబూలము, అష్టవిధార్చనలు (ఇవి ౮ పూజలు) పాద, అర్ఘ్య, ఆచమన, పత్రము, పుష్పము, గంధము, అక్షతలు, యజ్ఞోపవీతము, ఛత్ర, చామరము, వ్యజనము, గీతము, వాద్యము, నృత్యము, ప్రదక్షిణ, నమస్కారము, స్తోత్రము ఇవి షోడశోపచారములు (౧౬ ఉపచారములు) అందరూ శాస్త్ర మర్యాదను మీరలేక చేయు విధానము నే చేయను ఇదిగాక నే జేసిన కార్యము అంతా నీ పూజలే స్వామి! అందున నా పూజకు విరామమే లేదు పూజాంతరం సంసారము పనిపాటలనేవె లేవు పూజలు నీవె సంసారము నీవె దేవా!

అల్లముడు ఇటులని వివేచించి విశ్వాసమున భక్తుడై ఆ విశ్వాసములోని నిష్ఠనుంచి మహేశ్వరుడై, ఆ నిష్ఠలో కదలిక లేని సావధానమున్న ప్రసాది స్థలమగునని చెప్పుచున్నాడు

## ప్రసాది స్థలము

త్రివిధంబు నిత్యమని, త్రివిధంబనిత్యమని ఎఱిగిన
వారెవరయ్యా? త్రివిధంబునకు త్రివిధమిచ్చి త్రివిధ ప్రసా
దంబు స్వీకరించిన వారిని నాథుడనెద, వారిని పీరులనెద,
ధీరులనెద గుహేశ్వరా! లింగమందు ప్రసాది యనెద ౨౫

మరియు

అర్పిత అనర్పితమనుట ఎవరు తెలియుదురయ్యా!
అర్పించికొనుట అనర్పితంబు, అర్పించక కొనుట
అర్పితము అర్పించి అర్పించకకొనుటయె మీ ప్రసాది
గుహేశ్వరా! ౨౬

## వివేచనము

త్రివిధ-త్రివిధంబుల నిత్య అనిత్యాలు ఎరిగిన వారెవరు? నిత్యమైన గురులింగ జంగమములకు తను మన ధనంబులు నావి గావను భావనతో అర్పించినపుడు ప్రసాదమౌను అనిత్యమనెడి కాలదోషంబు వీడును భక్తుడైన వాడు ఈ విధానమును అనుసరించి గురులింగ జంగమ ప్రసాదములే ఈ తను మన ధనాలని నిత్యత్వమును తెలిసి సదా ప్రసాదిగా యుండును

దీనియందు ప్రసాద మగుటకు ముఖ్యముగా అర్పితము, అనర్పితమనె విధానము తెలిసి మెలగితె మాత్రము ప్రయోజనము ప్రతిరోజు భక్తుడు తన కాయకము నుంచి సంపాదించినది గురులింగ జంగమానికి అర్పించి వారి ప్రసాదముగా భుజించవలయును నేను అర్పించితినని, నే సంపాదించితినని అది ప్రసాదము గాక అనర్పితమగును ఏ అహంకారములు లేకి 'మీరిచ్చినది మీ కర్పితము' అని అర్పించిన, అది అర్పితము ముఖ్యముగా నేను మీకిచ్చితిని మీ నుంచి పుచ్చుకొంటినని భావమే లేక యుండుట అచ్చప్రసాది గుణము

ఈ విధంగా అల్లమ ప్రభుదేవుడు వివేచించి విశ్వాసమున భక్తుడై ఆ విశ్వాసమే నిష్ఠగా పరిణమించి మాహేశ్వరుడై, ఆ నిష్ఠయే సావధానమైనపుడు ప్రసాదియై, ఆ సావధానంబులోని స్వానుభావ వివేకమే ప్రాణ లింగమై, లింగ ప్రాణిగా నుండు వర్తనమును ఇట్లు అల్లముడు వివరించు చున్నాడు

**ప్రాణ లింగి స్థలము :**

నీరు మూర్తియై ఉదయించె పీఠంబునందు, మూల
స్థానంబు స్థిరమయ్యె శివ పురంబను స్వదేహంబునందు
వాయువు పూజారియై, పరిమళ దండంబు గట్టి పూజ
జేయుచుండే నవద్వార శివాలయము ఆది మధ్యస్థానమందు
గుహేశ్వరుండను లింగమచ్చోటనే నిలిచియుండె —౨౭

**వివేచనము**

ఈ వచనము గూఢార్థమునందుండుట వల్ల ప్రతి పదార్థాల గొడవ కన్నా భావార్థమే తెలుసుకోడానికి సులభము (ఇలాంటి వచనాలు శూన్య సంపా దనలో అక్కడక్కడ వచ్చినపుడు భావార్థాన్నే వాడుకోవాలి ) ప్రాణలింగమంటె ఉచ్ఛ్వాసనిశ్వాసాలు లింగభావంబులు కావలెను ఆ భావములు సర్వాంగంబు లోని కర్మేంద్రియ జ్ఞానేంద్రియాలు లింగములుగా మారి అనుభావముతో స్థిరమై లింగ ప్రసాదమై ప్రసన్నమై ప్రకాశించినప్పుడు ప్రాణలింగియై మెలగు తాడు

ఇటుల అల్లముడు తనకు తాను చెప్పుచు విశ్వాసమే భక్తికి మూలమై, ఆ విశ్వాసము నిష్ఠగా పరివర్తించినప్పుడు మహేశ్వరత్వమై, ఆ నిష్ఠయే సావధాన మైనపుడు ప్రసాదమై, ఆ సావధానంబునందు స్వానుభావ వివేకమే ప్రాణ లింగమై, ఆ స్వానుభావ వివేకములోని జ్ఞానము నుంచి శరణుండైన భేదమును ఇట్లని వివరించుచున్నాడు

**శరణ స్థలము**

స్మరణ జచ్చియుండె, భ్రాంతి నశించె, ఎరుక
ఘురుగయ్యె, గురుతు లేదయ్యె అచ్చోటనింక గతిని వెదకు

టున్నదే? అచ్చోటి మతిని పుడుకుటున్నదే? అంగమే
నాశమై లింగంబు లీనమై కన్నుల కాయంపు కళలు వెలి
గెడి భంగంబు మ్రింగియుండె జూడు గుహేశ్వరా! ౨౮

**వివేచనము**

వెనుకటి జన్మలలోని, ఇప్పుడుండు జన్మములోని కార్యాలు ఏవియు జ్ఞాపకానికి రాక నశించి పోయినవి తాను తనదన్న భ్రమణలు దూరమైనవి. జ్ఞాన మజ్ఞానంబులు కానక మరుగైనవి ఇక సాధన ప్రధానమైన చిన్హము (లింగము) గురి గురుతులేకయుండె ఇట్టి స్థితియందు గతి-మతుల నెవరెంచెదరు? అవసరమేమున్నది? ఉన్న అంగమే లింగములో మిశితమైనపుడు అక్కడ చూడబడు కన్నులు కనబడు అంగమెక్కడున్నది? ఆ విభిన్నత ఇక లేదు

అని అల్లముడు భక్తి స్థలమునుంచి మాహేశ్వర స్థలము, ప్రసాదిస్థలము, ప్రాణలింగి స్థలము, శరణ స్థలంబుల సూక్ష్మ వివరాలు చెప్పుచు షట్ స్థలంబులోని కొనయందుండు ఐక్య స్థలాన్ని విశదీకరించుచున్నాడు

**ఐక్యస్థలము ·**

నిజమెరిగిన నిశ్చింతుడు చావును జయించిన
మహాంతుడు ఘనంబు లోగొన్న మహిముడు పరము
చేకొన్న పరిణామి బయలు నించిన (పూర్ణుడు) భరి
తుండు గుహేశ్వర లింగడు శాంతి సహజుండు ౨౯

**వివేచనము ·**

చింతలేని తనాన్ని పొందవలెనంటె సర్వతోముఖంగా నిజమెరిగినగాని నిశ్చింత చేకూరదు చావును, చావు లక్షణాలును, దాని కార్య విధాన పరిణామములను విమర్శించి చూడవలెను ముఖ్యముగా సృష్టి కార్యాని కనుగుణంగా వర్తించే మృత్యువుకు భయపడక యుండుటయే జయాన్ని సంపాదించినట్లు అంటే ఒకరీతి భయమే మృత్యువు నిర్భయమే మహాను భావత్వము ఈశ్వరుని తనలో నివసింప జేసుకొన్నవాడు మహా మహిముడు తనకు అన్యమన్న పర స్థలాన్ని అవగతము జేసుకొన్నవాడే ఆనంద స్వరూప పరిణామి అటులనె బయట ఏమి లేదనక బయలును తన లీలా వినోదియై నింపిన శాంతుడు సహజుడు

## అల్లముడు జంగముడై వెడలుట

అల్లమస్వామి తన గురువు అనిమిషయ్యగారి లింగంబు ధరించి, భక్త, మహేశ, ప్రసాది, ప్రాణలింగి, శరణ, ఐక్యమను ఆరు స్థలములందు ఆచార లింగము, గురులింగము, శివలింగము, జంగమలింగము, ప్రసాదలింగము, మహా లింగములను ఆరు లింగముల ఉపాసన, సాధనసిద్ధి నెరిగి, తన సిద్ధిని తనదిగా నుంచుకొనక లోకజీవుల భవబంధాలు త్రెంచి ముక్తులచేయు తలంపున మొదట తనదనుకొన్నదంతా గురులింగ జంగమార్పితం చేసినది ప్రసాదంగా మరలపొంది జంగమ తత్త్వాన్ని గైకొని, భారంబులేని ఆకాశ తత్వ శరీరియై, నిలిచిన నీడలేని - నడచిన పాదచిహ్నములు లేని, తాకినవారికి స్పర్శలేని సర్వ స్వతంత్రుడై, నిర్మలుడై, వీణాపాణియై సుమధుర వచనాలు పాడుకొనుచు తన లోకోద్ధరణ మార్గానికి ఆదర్శాన్ని స్మరిస్తూ ముందడుగు బెట్టి మెల్లగా వెళ్ళుచు, అరగన్ను చూపుతో ప్రకృతిని తిలకించుచు, వివిధ, నాద మాధుర్య స్వరాలు వీణలో పలికించుచు ఈ విధంగా పాడుకొనుచున్నాడు

కాళ్ళులేని, గమనంబు, చేయిలేని స్పర్శము, నోరు
లేని స్వాదము, భావంబె పరియాణమై పరమ దేహి
యనుచు వేడుకొను పరముని చూపవయ్యా గుహేశ్వరా! ౩౦

మరియు

కన్నే కట్టైయె, చేయే గిన్నెయై, చెవియే సకల
పురాతనుల కారుణ్యమనుచు మనసు భిక్షము భుజించి
దేహ పరిణామంబుజెందిన, ఘన మహిముల చూపవయ్యా!
గుహేశ్వరా! ౩౧

ఇదియుగాక

కన్నదంతా పావనము, విన్నదంతా పారమార్థ
బోధ తాకినదంతా పరుషంపు తాకు, అప్పుడే పలికిన
వారెల్ల అప్పుడే ముక్తులు, నడచిన చోటెల్ల జగత్ పావ
నంబు, మెట్టిన భువనంబంత అవిముక్త క్షేత్రంబు
సోకిన నీరెల్ల పుణ్యతీర్థంబులు శరణంచు భక్తి జేసిన
వారెల్ల సాయుజ్యాలు గుహేశ్వరా। సంచార సౌందర్యంబ
గమ్యంబు జూడుమా! ౩౨

**వివేచనము :**

అయ్యా గుహేశ్వరా! దేహమే ముఖ్యమని దేహేంద్రియాలే కార్యములకు మూలమని నమ్మినవారిని నాకు చూపకు కాళ్ళు, చేయి, నోరుల గమనము స్పర్శలు, రుచుల భ్రమలేక ఇవన్ని చిత్తమై వెలసి భావ కప్పరముబట్టి లోక జీవనోద్ధరణకై దేహియనుచు ఈశ్వరునికి మొరలిడు మహాత్ముని చూపి నాకు నీ సేవలిచ్చి వారి జూపుమయ్యా!

ఏ పరికరాలు లేక పరమ వైరాగ్యమూర్తియై కన్నె చేతిబెత్తమై చేయియే కొప్పెరయై (పాత్ర) సదా పురాతనుల కారుణ్యములు విను చెవియై తన మానసమె తనకు భిక్షాన్నమై యుండు ఘన మహిముని జూపుమయ్యా!

కన్నది, విన్నది, తాకినది, పలికినది అంతా పావనము అప్పుడిప్పుడనేది లేదు ఎప్పుడెక్కడ ఆ పరమ జంగముని పాదంబు సోకునో అది అవిముక్త క్షేత్రము (చచ్చిన మీదట వచ్చే ముక్తి నిచ్చేది గాదు జీవముండగానె ముక్తి నిచ్చే శరణక్షేత్రము) భూమి - జలము - అగ్ని - వాయువులు పవిత్రమౌట సత్యము నీ మహిమాతిశయమేమని పొగడుదును

అల్లముడు ఆనందమున గొంతెత్తి ప్రకృతి పులకించునట్లు మహా తత్త్వార్థము పాడుకొనుచు అలాంటి మహిమావృత జంగముని చూడ కుతూహలుడై వెడలెను

ఇది

కృపామూర్తులైన శ్రీ మృత్యుంజయప్పగారిని, స్వప్న బోధామూర్తులైన శ్రీ ఎఱ్ఱి తాతయ్యగారిని స్మరించి, సకల శివశరణులకు వందించి శూన్య సంపాదనలోని మొదటి ఉపదేశమునకు సంగ్రహముగా జెప్పిన వ్యాఖ్యానము సంపూర్ణము

శ్రీ గురు బసవలింగాయనమః

# శూన్య సంపాదనము

## ముక్తాయక్కగారి సంపాదనము

౨

కం॥ కాయగుణదూరు డల్లమ
రాయడు ముక్తమకు కూర్మి ప్రాభవ పదవిన్
హాయిగ నొసగుట తెలుపుదు ని
రాయసమున శరణజనులు రక్తిని పొగడన్

శివశరణుల శ్రేణిలో గణనీయ శివాద్వైత తత్త్వవేత్తయని ముక్తాయక్క ఖ్యాతిగాంచిన శరణురాలు ఈమె అన్న అజగణ్ణ ఆనాటి (12 వ శతాబ్దానికి) బసవేశ్వరుని శరణ సమూహమందు అల్లముని సమానమని మన్నింపబడిన మహనీయుడు ఈ అన్న చెల్లెళ్ళ కుటుంబ విచారములు ఎక్కువ తెలియకున్నను వీరు ధారవాడ జిల్లా గదగు తాలూక సమీపమున నున్న 'లక్కుండి' యను గ్రామ నివాసులని చెప్పుచున్నారు ముక్తాయక్క మగని యూరు మసణికల్లు రాయచూరు జిల్లాలోని గ్రామము ఇద్దరూ లింగతత్త్వ జీవులె అన్న అజగణ్ణను ముక్తాయి గురువుగా ఎంచి ఆధ్యాత్మిక సాధనలో అతని సహాయం పొంది తన అనుభవాన్ని పెద్దగా పెంచుకొన్నది

అజగణ్ణ కృషీవలుడు సామాన్యాదాయము నుంచి తృప్తి చెందిన కాయక జీవి ఔను - కాదను వాదానికి దూరుడు కావలెనన్న కోరికలకుగాని, వద్దను వైరాగ్యాలకు గాని ఏలాంటి సంబంధమే లేని సహజాత్ముడు ఎల్లప్పుడు ప్రణవోచ్చారముతో మెలగెడి స్వభావ మాతనిది ఒకరోజు రాత్రి పంటచేను కావలి యందు మెట్టుమీద యుండగా ఒక నాగుపామొచ్చి తనయందున్న రత్నాన్ని వెలి గ్రక్కి దాని వెలుతురులో తన ఆహారాన్ని వెదకుచున్నప్పుడు అజగణ్ణ తన

అలవాటు ప్రకారం ఓం నమఃశివాయ అన్నాడు ఆ శబ్దము విని భయపడిన పాము మణిని మింగి ప్రక్క పొదలోనికి వెళ్ళింది ఇది చూచిన అజగణ్ణకు ఆశ్చర్యమయింది ఏమిటి ఈ సృష్టి విధానము? కావలసినప్పుడు వెలుగును మింగడం, వెలిబెట్టడం! ఇది అండజం సర్పజాతి దీనికింత స్వతంత్రమా? పిండజుడైన మనిషి శబ్దాన్ని అలా ఎందుకుపయోగించరాదు? అని అప్పటినుంచి ప్రణవ మంత్రాన్ని మౌనములో దాచినాడు దానితోబాటు నిత్యజీవితాన్ని మౌనంగా పరిణమించినాడు. అప్పటినుంచి గుప్త భక్తుడైనాడు

ఒకనాడు ఇంటిలో పోవునపుడు వాకిలి పైపట్టికి మస్తకము తాకింది నియమము మరచి గుప్తంగావుంచుకొన్న మంత్రాన్ని గట్టిగా పలికినాడు అప్పుడు తెలిసి నా గుట్టు బయలయిందని ఆ ప్రణవ మంత్రోచ్చారముతోనే ప్రాణాన్ని వదలినాడు అపుడు ముక్తాయి పుట్టినింటిలో నుండడం వల్ల అన్న అజగణ్ణ అకస్మాత్తుగా బయలైనందుకు శోకాకుల చిత్తయైనది

ప్రథమోపదేశమందు జంగమత్వాన్ని గ్రహించి, దృష్టాంతంగా తానను కొన్న జగద్భరితమైన మహాశక్తి 'కాళ్ళులేని గమనంబు' కన్నెకట్టియై, కన్న దంతా పావనము. విశ్వోద్ధరణకై వచ్చిన వ్యక్తులను చూపవయ్యా గుహేశ్వరా యని వీణ వాయించుచూ పాట పాడుకొనుచు, పరమానంద రసభరితమై, పాడు చున్న పాటయే నాదబ్రహ్మమై, దేశంబుం పర్యటించుచూ, కనబడిన వారికి, నమ్మినవారికి సామాన్య అసామాన్యమను భేదమెంచక, మతము, కులము, పంథము లెంచక, విశ్వాసముతో అడిగినవారి సంశయాలకు సమాధానంబులిచ్చి సాధకులకు ఆయా సాధనములోనే దారి చూపుచూ తనలోని నిజాన్ని కనుగొనుచు, ఒకరోజు కర్నాటకములోని లక్కుండి మార్గము పట్టి తనకు తానె కమ్మగా పాడుకొనుచు అజగణ్ణుని ఎడబాటుచే వికలత నందిన ముక్తాయక్క ఇంటి ముందుకు వచ్చి నిలబడినాడు అల్లమ దేవుడు

ఎవరొచ్చినా, ఎవరుపోయినా తెలియలేని మరులుగొన్న ముక్తాయి శోకానికి అంతులేదు ఇరుగుపొరుగువారు సమాధానానికి ఎదురులేదు ఆమె దుఃఖమే ఒకతీరు నిలబడిన అల్లముడు ముక్తాయిని చూడగానే ఏడుపులో నున్న అర్థాన్నిబట్టి ఈమె మహాజ్ఞానియని అట్లనే నిలబడియుండగా ముక్తాయక్క అన్నను తలంచుకొని ప్రలాపించుచున్నది.

## ముక్తాయి శోకము

ఎరుక నోటి యందుంచి నెమరు వేయు చున్నది
మర్త్యలోక మెల్ల ఎరుక నెమ్మది గానక కృంగినది
లోకమెల్ల, నేనెట్లు బ్రదుకుదునన్నా! చీకటి వెలుగును
సందేహమును నా కన్నుల గట్టి అద్దము జూపించినట్లయ్యె
అజగణ్ణా నీ యోగము! ౧

**వివేచనము :**

అన్నా! నేనేమందును? అన్నిటికి నాకేమి తెలియును? ఒక తూరి వెలుతురైతే మరియొక తూరి గాఢాంధకారము తెలిసెనను నంతలోనే ఏమియు తెలియరాని, కానరాని మబ్బు తెరలు ఈ లోకమే విచిత్రము ఏనాటి నుంచియో మహా జ్ఞానమును పోకచెక్కవలె నోటి యందుంచుకొని నాలుకచే అటు ఇటు పక్క దవడలు మార్చుచు ఒకే రీతి నెమరు వేయుచునే యున్నది వ్యర్థ ప్రలాపముల మాటలట్లు ఆదిలో పలుకు దిగక బయటికి రాక ఉన్నచోటనే పొరలాడుచు సంకటపడు చున్నది ఇట్టి లోకములో నే నొకతె ఎట్లు బ్రదుకుదు నయ్యా? అన్నయ్యా, నా కెవరు దిక్కు? ఇన్ని నాళ్ళు నా తోబుట్టువై, అగ్ర జుడవై, ఆనంద నిధి తత్పరుడవై, తల్లి తండ్రివై యుండి పరబ్రహ్మ స్వరూపు డవైనను నా మీదవున్న సోదరీ వాత్సల్యము అపారము వదలిపోయితివి మహానుభావా, పరమ పురుష, చిదానంద స్వరూప, నీవు నా దగ్గరుండియు ఎరుగలేదు ఎరుగుదమన్నపుడే మరుగైతివి తండ్రీ, ఎంత నాటకమాడితివయ్యా! కన్నులకు గడ్డకట్టి అద్దములో చూచుకోమన్నట్లైనది అజగణ్ణా నీ యోగము నాకైన ప్రయోజన మేమి?

**అన్నయ్యా, ఒక్క మాట**

గ్రుడ్డివాని చెయ్యి గ్రుడ్డివాడు పట్టినట్లుండవలెను
మూగవానిచేత కావ్యంబు విన్నట్లుండవలెను అద్దము
లోని ప్రతిబింబమట్లు పట్టెదమన్న వారికి వశము
గాకుండ వలెను అన్నా, తాబేలు శిశు స్నేహంబువోలె
వుండనొల్లక అరూఢంబు చెడితివయ్యా అజగణ్ణా! ౨

**వివేచనము .**

నీ రూఢి నిశ్చలత ఎందుకు వదిలితివయ్యా! నీ బ్రహ్మ తత్త్వానికి అది బంధమయ్యేనా? నీ మౌన మహనీయతకు కొరతయయ్యేనా? నీ నిర్మాయ నిర్మోహత్వానికి నిర్దయ నిరహంకారమే శివయోగమని ఎంచితివా? నీవే మన్న. ....లేదు లేదు, ఏమనడానికి నీవు కానరావు ఐనా ఉన్నావనుకొని చెప్పడానికొస్తే, అన్నా, నీ విట్లు చేసింది తగదని అంటాను మొదట శబ్దాను సారియై తరువాత మౌనానికి చిక్కి గుప్త భక్తుడవై వ్యవహరించినావు అది మరచి వాకిలి తాకినదని శబ్దము జేసి నా గుట్టు బయలైనదని లింగములో మరుగైతివి ఇది బాగున్నదా? ఏమో, చావడానికి ఒక నెపమైనది గదా? ఇంత సులభంగా ప్రాణాన్ని వదలవలసిన అవసరమేమియు లేదు నీకున్న సంసార మంతా నీ..... చెల్లెలు పుట్టుక స్థానబంధము వదలి గురుశిష్యుల సంబంధము పెరి గింది నీ పలుకులే నేర్చుకున్నాను మౌనముతో నేర్చుకున్నాను రెంటికి మూలము సాకారము అది నిరాకారమయ్యె-ఇప్పుడు నా గతి యేమి? నా ఆత్మ సందేహాలకు సమాధాన మేమి? నీవు పెద్దలకు పెద్దవాడవు చిన్నదాన్ని చిన్న బుచ్చి దిక్కులేని దానిగా జేసిపోవుటేమి న్యాయమప్పా?

నీ బ్రహ్మత్వానికి లోటు లేక ఈ ప్రపంచమున యుండుటకు ఏలాటి అభ్యంతరం లేదుగదా! చూడు, గ్రుడ్డివాడు ఇంకొక గ్రుడ్డివాని చేయి పట్టు కొనును ఒకరిద్దరొటయే లాభము కాని వారెక్కడికి పోవ వీలులేదు గుడ్డియంటె గడ్డికాదు ప్రపంచమంతా చూసి తెలిసి సమాధానియై మరేమి చూచేది లేదను మహా జ్ఞానపు గడ్డి (కనుమూత) ఎక్కడకు పోవలేడు అలాగుననే మూగవాడు కావ్యాన్ని చెప్పడం మరొక మూగ వినడం అంటె గురువై చెప్పడం శిష్యుడై వినడం ఏమియులేదు. అద్దములోని ప్రతిబింబమట్లు తాబేటి కూన తల్లి పిల్లల సంబంధము చిత్రము దేహాలు ఒక్కచోట నుండ నక్కరలేదు తల్లిఎక్కడున్నా పిల్ల తలచితె కడుపు నిండునంట! ఇలాగున ఉంటేనే ఆధ్యాత్మ తత్త్వ లోకమే మైనా తరిగిపోవుచుండెనా?

స్ఫటిక భాండమందున్న జ్యోతి లోపల, బయట ఒకే ప్రకాశమిచ్చునట్లు మహా శివయోగికి ఇహపరాలను భిన్నము లేదు రెండును సమానమే ఇది ఎరిగి

ఎఱిగి వైరాగ్య వైభవోపేతమైన క్రియా రాహిత్య యోగానికి వశుడై జీవుం యోగక్షేమాల కాయకాన్ని వదలి వట్టిదైన, వ్యర్థమైన ముక్తిని పొందినావు

ఇవి నిష్ఠూరములు కావన్నా! నన్నొక పిచ్చిదానిగా జేసి పోయితివి అందరిలాగ బ్రతుకుటకు రాకుండా జేసితివి సద్గురు అజగణ్ణా! నీవున్నపుడు దూరమున్న సంశయ పిశాచాలు ఇప్పుడు నన్ను చుట్టుముట్టి వేధించి వెక్కిరించు చున్నాయి నీ యంతరంగమందు దాచిన సదానందతత్వ నిధిని బయటపెట్టి, అజ్ఞులకు పంచక పారిపోయినావని అంటాను ఇహపరాన్ని సమత్వంగా అనుభ వానికి తెచ్చుకొన్నను అది ఎవరికియ్యక నీదిగానే యుంచుకొని పోయిన లోభి యని అంటాను

క్షణ క్షణానికి ముక్తాయి దుఃఖ సముద్రములో మునిగిపోతున్నది తీరాన్ని సమీపిస్తున్నపుడు ఓడ పలక చీలి సముద్రములో మునిగిపోయినట్లు, వెన్న వచ్చునపుడు కుండ పగిలినట్లు, తనకున్నదంతా క్షణములో పోగొట్టుకొన్నవాని యట్లు పెద్దగా ఎంచి, తను దానినుండి సహాయ సహకారం పొందు సమయం మించినందున ముక్తాయి సమాధానము లేని ప్రలాపంలో పరవశమైపోయింది

అలాగుననే ప్రతిమయట్లు నిలబడిన అల్లముని గొంతు బొంగురు వోయింది ఎందరో ఎంతెంతగానో తమ తమ కోరికలకై లోకములో ఏడ్చిన వారున్నారు ఏడ్పుకు స్త్రీ పురుషులను వివక్షతలేదు దాని కందరూ ఒకటే స్త్రీలనే గమనించితే తన కుమారునికై ఏడ్చిన చంద్రమతి, తన సతిత్వానికి వచ్చిన అపనిందకై ఏడ్చిన సీత, మానభంగానికై ఏడ్చిన ద్రౌపది శోక సంతప్తు లయిరి అర్జునుని ఏడ్పు దీనిలో చేరింది దానికి కృష్ణుడు గీత చెప్పినాడు ఏడ్చినది ఆత్మసాక్షాత్కారానికై కాదు బంధు సంహారానికి ఇలాటి పద్దులు యుగ యుగాలను ఉడికించినవి - దానినుంచి మంచివైనా - చెడ్డవైనా ఆ దుఃఖాలు తమ తమ ప్రాపంచిక సంసారముల సుఖంబులకై ఏడ్చిన భౌతికపు ఏడ్పులు ఏడ్చిన వారేమొ పెద్దవారు ఏడ్చిన కారణాన్నిబట్టి చిన్నవారైనారు అల్లమదేవుని కిదంతా జ్ఞాపకానికొచ్చినది ముక్తాయక్క సామాన్యురాలు ఆమె ఏడ్పులో ఎంత ఘనత యున్నది! ఇలాటి దుఃఖాలాపము ఈ లోకానికంతగా పరిచయం లేనిది నేను విన్నదిలేదు ఈనాడు చూచే భాగ్యమొచ్చినది "ఎపుడో ఎవరి

తోనో నేనన్నాను మనిషి అన్నిటికి ఏడ్చే అలవాటు పడినాడు ఆత్మసాక్షాత్కారానికై ఏడ్చేది ఎవరైనా నేర్చుకొన్నారా?" అన్నాను ఈమె ఏడుపు ఎన్ని మహార్థాలను వెల్లడిస్తున్నది? ఒక దిక్కున లోక శారీరక సంబంధమున్నట్లు మరియొక రీతిలో దానిని మించిన పరమప్రీతి స్నేహాలను పొందినట్లు ఇవేమియు గాక తత్వజిజ్ఞాసువై తన్ను అన్నను మరచి కేవలం గురుశిష్య సంబంధమే పిలిచినట్లు అదిగాక పరబ్రహ్మ స్వరూప లక్షణాలను ఆకళించిన ఈ మహాతల్లి అజగణ్ణ మరుగైనందుకు ఎన్ని నిశిత ఆక్షేపణ లెత్తింది? ఆ యాక్షేపణలో శబ్దబ్రహ్మ, నిశ్శబ్దబ్రహ్మ ఏమర్మ ఎంత చక్కగా తన శోకములో వెల్లడించింది ఇది శోకమంటె అర్థమేమి? ఇది శోకమేగాదు ఇది శోకవిముక్తతకై శోకము శోకమనుకుంటే అది బాధిస్తుంది ఏదైన ప్రపంచమేగాని, ఆధ్యాత్మికమేగాని హద్దులు మీరితె ఇలాగౌతుంది స్త్రీ హృదయం గులాబివలె అత్యంత కోమలము ఆమె శోకమొక బోధయైయుంది మధురాలాప సంగీతమైయుంది నాకెంతయో విను కుతూహలమున్నను సమాధానము చెప్పకుండ ఊరకుండరాదని తలవంచు కొన్న ముక్తాయి దగ్గరకొచ్చి మృదువుగా ఇట్లనుచున్నాడు

## అల్లముని సమాధానము

**అల్లమ ప్రభు**

అరచేతి యందు విరిసిన తలను బట్టి, కన్నీటి
ముత్యాల హారంబుగట్టు నీవెవరు చెప్పవమ్మా! కందిన
చంపక పూవును భృంగంబు నాస్వాదింప భేదం బెఱుగక
కలత జెంది పరితపించుటెందుకు చెప్పు చెల్లీ? ఒకటిం
దున రెండైనది రెండందున ఒకటైనది ఎఱుకలోన ఈ
మరపేమి చెప్పుమా? దుఃఖంబులేని విలాసము లేని అను
తాపము మా గుహేశ్వర లింగమందు కనబడుచున్నది,
నీవెవరనునది చెప్పవే తల్లీ! 3

**వివేచనము**

లోకములో అన్నిటికన్న శోకానికి ఎక్కువ ఆకర్షణముంది దానిలో అబలలైన ఆడవారి దుఃఖానికెక్కువ బలము ఏలాటి రాతిగుండె బైరాగినైనా

కరగించి కరుణ వాత్సల్యముల వంపురింప జేయుమన్నది అందువల్ల యోగులు, సన్యాసులు తన వైరాగ్య నిశ్చలతకై సమాజ సంబంధాలకు దూరంగా ఉంటు న్నారేమో కాని శివయోగి జీవుల దుఃఖనివృత్తికై సమాజమందేయుండి తనలింగ పూజాఫలములను పంచి పవిత్రుల గావించును

అల్లమ శివయోగి హృదయం కరిగింది అమ్మాయ్! అని మమతతో సంబోధించి ఇట్లడుగుచున్నాడు సుజ్ఞానంబుచే వికసించిన తలను అరచేతియం దుంచుకొని దుఃఖ సంజనిత కన్నీటిధార ముత్యాలహారంగా కనబడునట్లు ఏడ్చు నీవెవరమ్మా? ముకుళించిన సంపెంగపూవులోని స్వాదాన్ని తుమ్మెదలాగు విధంబు తెలిసియు తెలియక ఈ రితి వేదన మొందుటెందుకు తల్లీ! తేనె నిచ్చిన పూవు వాడి కిందపడుతుంది తాగిన భృంగము కూడబెట్టి జీవులకు పంచుతుంది

చూడు ఈ యొక్క చోద్యము ఒకటంటె రెండవుతుంది రెండంటె ఒకటవుతుంది ఇది ఈశ్వరుని లీలా నాటకము చోద్యము ఇది ఎరిగిన ఎరుకలో మరపెందుకొచ్చినది? చెప్పవే చెల్లీ! నా మాటె వింటావుగదా' లోకములో దుఃఖ మనేదే లేదు, దుఃఖాని కెందుకాశ్రయమిచ్చినావు? మోహమన్నది అది ఏదాని మీదుంచితె దానిపై మమత పెంచుతుంది దూరమైనపుడు అదే దుఃఖమౌతుంది. మా గుహేశ్వర లింగయ్యలో ఇది బోధ పడుతుంది నీవు ప్రాజ్ఞురాలివి పరిచయము చెప్పుమక్కా!

ప్రభు ముక్తాయిక్క శోకకారణంబు అడుగుటలోనే అన్యాపదేశంగా సమాధానము చెప్పుచు ఆధ్యాత్మికంగా ఆమె ఆత్మపరిచయము సూక్ష్మంగా తెలిపినాడు అడిగినప్పుడు తలవంచుకొని దుఃఖములో మునిగిన ముక్తాయి తల ఎత్తి చూచింది నీళ్ళునిండిన నేత్రాలకు నిలిచిన చిదాత్మ స్వరూప జంగముని రూపము మసకైనందున కన్నీల తుడుచుకొని చూచి వెఱగున లేచి సాష్టాంగ వందనం బాచరించి కొంత సేపేమియు తోచక ముగ్ధురాలై యుండి మరుక్షణ ములో ఏమి తోచిందొ గొంతు సవరించుకొని ఇట్లనుచున్నది

**ముక్తాయక్క .**

ఎవరని యడిగిన ఏమని చెప్పుదునయ్యా? కాయ
మందు మాయలేదు భావమందు భ్రమలేదు రమ్మని

యడుగుటకు గురుతే లేదు ఎవ్వరికి పుట్టక అయోని
యందు జన్మించి బుద్ధిరాహిత్యమున నేనేమందునన్నా!
తల తెగి, వాసంబు చెడి, వెలిగెడు జ్యోతి నా అజగణ్ణ
తండ్రివెన్నంటి వచ్చిన చెల్లెలినయ్యా! ౪

**వివేచనము**

మహానుభావా! నేనొక ఉన్మాదిని ఎవరంటే చెప్పేదేముంది? నిర్మాయ కాయము భ్రాంతి లేని భావము గురుతులేని తత్వము ఎవ్వరూ ప్రసవించని అయోనిజను బుద్ధియేలేని నేను తమకేమని చెప్పుదు? ఎవరని చెప్పుదు? తల లోని జ్ఞానంబు లయమై నివాసంబులేక విజ్యోతియై వెలిగెడు అజగణ్ణ తండ్రి తోబుట్టువు ముక్తాయి నేనన్నా! ఒక్కొక్క మాట మూల్యము లేని మాణిక్యము తన అన్న అజగణ్ణుని అగణ్య గుణాలు, పరబ్రహ్మత్వంబు చెప్పుచు ఈనాటికి ఎవరూ ఇంకొకరికి చెప్పనిమాట నాకు బుద్ధిలేదని ముక్తాయి అన్నపుడు అల్ల మునికి ఆశ్చర్యమైనది ఆహా! ఎంత తత్వరహస్యము ఒక ముక్కలో నిరహం భావంగా పలికినదీమె ముక్తాయి నామము సార్థకమని ఉద్వేగభరితుడై పరమా నందభరితుడై అంటున్నాడు

**అల్లమ ప్రభు**

కానరానిది కంటి, వినలేనిది వింటి, ముట్టరానిది
ముట్టితి, అసాధ్యంబు సాధించితి, చెడిన తల చేబట్టితి,
నివాసంబులేనిది నిర్ణయించితి, గుహేశ్వరా! మీ శర
ణుండు అజగణ్ణునికి శరణని బతికితినయ్యా! ౫

**వివేచనము**

అహో నేను కన్నది అపూర్వము కానరానిది, ఈ లోకములో జీవుల పరిమిత దృష్టికి అందనిది, ఈ దినం కంటి అలభ్యమైన, వినలేనిది వింటి గదా! మహా చోద్యము సాధనకు అసాధ్యమైనది సులభంగా సాధ్యమైనది జ్ఞానా జ్ఞానముల వివాద వికారములకు దూరమై, పరమప్రకాశ భరితమైన మస్తకమును స్పర్శించితి వాసరహిత వాసనారహిత సర్వాంతర్యామిని నిర్ణయించితి ధన్యత చేకూరెనయ్యా గుహేశ్వరా! మీ శరణుడు నిర్మల నిజతత్త్వస్వరూపుడు సకల సంసార విదూరుడు' శివ శరణ గణ నాయకుడు మహనీయ శివయోగి సర్వ స్వతంత్రుడైన అజగణ్ణకు శరణని బ్రతికితిని

ఇట్లు ఆవేశభరితుడై తన యన్న అజగణ్ణుని సహజత్వాన్ని కన్నుల ముందు సాకారంగా జూపిన ఈయనెవరని ముక్తాయక్క మిట్టిపడి చోద్యమంది, దుఃఖము చేత కుంచితమైన తన విశాలమైన పద్మదళ నేత్రాలు పైరెప్ప నొత్తి చూచింది తన అన్నయే వచ్చినాడేమో అనుకొన్నది ఆకార వ్యత్యాసమున్నా అన్ని విధానములు, మాటలు, అర్థానుభవాలు, అమితమైన ప్రీతి వాత్సల్యములెల్ల ఆవేయని కొంతసేపు భవ్యాకార తేజోవిలాసుడైన అల్లమ ప్రభుదేవుని కండ్లప్ప గించి చూస్తు చూస్తు ఈలాగున వినయముతో ప్రస్తావించు చున్నది

**ముక్తాయక్క**

సచ్చిదానంద స్వరూపమైన, వాఙ్మనోతీతమైన జ్ఞాన
క్రియల సమకూర్చుకొని నిలిచిన జంగమస్వామీ!
అంగమే ప్రాణమైన శరణుల కూడి, చిదానందంబులో
అవిరళంగా ఐక్యమైన నా అన్న నజగణ్ణ నెఱిగె శరణను
నీవెవరు చెప్పవయ్యా ? ౬

**వివేచనము**

ముక్తాయి కుతూహల భరితయై పలికిన పలుకు జంగమ తత్త్వానికి, జంగమ కర్తవ్యానికి నిర్వచనంగా యున్నది జ్ఞాన స్వరూపమైన జంగమత్వ మంటె ఎల్లెడల భరితమైనదిగా యుండినను లోక జీవనోద్ధరణానికి సాకారము ధరించినపుడు అగాధ, అనంతమైన అజ్ఞానము క్రియతో మిశితమై భక్తిని గ్రహిస్తుంది ముక్తాయి జంగమ తత్త్వాన్ని సంపూర్ణంగా ఎరిగిన భక్తురాలు ఇక్కడామెకు తన అన్న అజగణ్ణుని స్వభావం కలిగిన ఈయనెవరో తెలుసుకో వలెనను ఆతురతతో తమరెవరు? అన్నది విని సంతోషించి ఇట్లు అల్లమయ్య నిగూఢంగా చెప్పుచున్నాడు

**అల్లమ ప్రభు**

శరణు శరణార్థులు అక్కా! ధరణి యాకాశమిల్లు
కట్టకమున్న పారు జలము అగ్ని వాయువు మొదలేల
నప్పుడు పుట్టినది మా యమ్మ. దానికి మొదట పుట్టక

పెరిగి యుండె మా తండ్రి వీరిద్దరి గర్భమందొచ్చితి
నేను నా చెల్లెలైదుగురు వావిచెడి నాకు భార్యలైరి కామ
బాణము తాకక వారి సంగంబు జేసితిని నే నీకు బావ
నల్లయ్యను నీవు నాకు మఱదలు మా గుహేశ్వరుని చేబట్టి
పరమ సుఖివై కలత కందెరచుట కారణంబేమి
చెప్పవమ్మా? ౭

**వివేచనము**

అమ్మయ్యా శరణార్థులు! చెప్పుటకేమున్నది? అంతా పాతబొంత ఇప్పుడున్నది అప్పుడు - అంటె చెప్పరాని వెనుక ఏమియు ఉండలేదు అప్పుడు మా యమ్మ అంటే మాయ (మాయంటె ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి) పుట్టింది మా నాయన ఎవరికి తెలియక తెలిసేదానికెవ్వరు లేనప్పుడు, కన దానికి తల్లీదండ్రి లేనప్పుడు తనంతకు తానే పుట్టక పెరిగినాడు ఆయనే పరమశివుడు స్వయంభు అనెదరు ఆయనే నా తండ్రి నా తోడబుట్టువులు ఐదుగురు (నేల, నీరు, అగ్గి, గాలి, ఆకాశము) ఈ లోకపు వావి వరుస చెడి నాకు సతులైనారు వారితో ఆసక్తి - ఆశ - ఆమిషములను కామచేష్టలు లేని సంసారము సాగించినాను అంటే ఇది సృష్టికి ఇష్టము లేదు ఐన జ్ఞాన క్రియా సృష్టికి మాత్రమే పరిమితము అందువల్ల నాకు నీకు చుట్టరికము చుట్టినందున నీ బావనే నైతిని నీవు నాకు మరదలైతివి అక్కా! ఎంత చక్కని బాంధవ్య మాధుర్య తత్త్వభావమిది? పేరు చెప్పలేదుగదా - అందరు అల్లయ్య అల్లయ్య అంటున్నారు చూడు, అంతా సరియనుకో ఐతే ఇదేమో నాకు తెలియదు దుఃఖ రహితమైన లింగయ్యను పట్టి సుఖియై ఇట్లు దుఃఖించుటకు కారణమేముందో చెప్పెదవా చెల్లి?

మెత్తగా మార్మికంగా, తాత్త్వికంగా అల్లముడు తన పుట్టుక, పేరు చెప్పేదానిలోనే ఆది, అనాది, బ్రహ్మాండపు పూర్వాపరాలు, ప్రవృత్తి, నివృత్తులు, పంచతత్వ బాంధవ్యాలు బావమరదలు వరకు చక్కని, చల్లని, తియ్యని మాటలతో చెప్పినపుడు ముక్తాయక్క హృదయం మొదటనే మెత్తబడినది కరగి, హర్ష భరిత ప్రవాహమైనది వినయ వినమ్రతతో అల్లముని వేదికపైని కూర్చోబెట్టి ఇటుల ప్రశ్నించుకొంటున్నది

**ముక్తాయక్క :**

దేవదేవా, శరణార్థి, అవధరింపుమయ్యా! విన్న సుఖంబు చెవులకు సంప్రీతియై యుండె ఆ ప్రీతి కన్నుల ముందు మూర్తియై నిలిచె ఆ మూర్తియై కనుగొన్నది మనంబునకు వేద్యమయ్యె శివశరణుల దర్శన సుఖంబేమని చెప్పవచ్చు? మదమడిగి హరుషంబు చెందిన నా అజగణ్ణుని ఎడబాటు దుఃఖంబు మీ సంగ మంబున స్వయమయ్యె చూడా ప్రభుదేవా! ౮

**వివేచనము .**

శరణార్థి మహానుభావ ఆలకించండి ఆహా ఏమందును? తమ సద్బోధ చెవులకు సంబరమయ్యె ఆ సంబరమే ఆకారము తాల్చి కన్నులముందు నిలిచె ఆ యాకారమే మనంబునకు విదితమయ్యె స్వామి, ఇది అపూర్వము తలవని తలంపు తనకు తానె సమకూరినది శివశరణుల మాహాత్మ్యము అగాధము సందర్శన సౌభాగ్య సుఖంబు బుట్టెనయ్యా! మద మోహంబులడగి, హరుషంబు గూడిన నా అజగణ్ణ తంద్రికై తపించు నా దుఃఖానికెంతో సమాధానమైనది నే ధన్యురాలను

అని తనకైన దుఃఖమునకు సమాధానం కలిగిందని ముక్తాయి పలుకులో పరబ్రహ్మ స్వరూపుడైన తన యన్న యందున్న మమకారం కొంత శాంతించిన, మహాజ్ఞానియైన ముక్తాయికి సంపూర్ణశాంతి చిక్కలేదని తలచిన అల్లమస్వామి అనునయముతో ఇలాగంటున్నాడు

**అల్లమప్రభు**

చావువాడు గాదు పుట్టువాడు గాదు ఘనంబునకు గమనంబులేదు మనంబునకు సాధ్యంబు గాదు తన్ను తప్పించి ఎదుటను ఒప్పించెనను భిన్న భావిగాదు గుహేశ్వరుని శరణుడు అజగణ్ణను అట్టిట్టనరాదు వినుమా తల్లి!

**వివేచనము :**

అమ్మాయీ ! సావధాన చిత్తురాలివై చూడుము నీవు తెలుసుకొన్న దానికి, ఈ వియోగ దుఃఖానికి సంబంధమే లేదు అసామాన్యమైనది పరవస్తువు అది చావు బతుకులకతీతం ఉన్న తత్వమింతే ఏది బ్రతుకునో అది మృతి చెందును మృతియైనదంటే మరల పుట్టుకే గదా? ప్రకృతి తన ప్రపంచ ప్రభుత్వాన్ని నడిపేందుకు చేసుకొన్న నాణ్యము మీ యన్న ఈ నాణ్యము గాదమ్మా! ఆయన ఘనాన్ని పొందేవాడు గాదు ఎందుకంటె ఆయనె ఘనము అంటే సర్వభరిత సచ్చిదానంద స్వరూపుడు అందువల్ల మనస్సుకు తెలిసే వాడు గాడు ఇంకొకటి తాను చిన్నవాడై ఎదుట పెద్దదని భిన్నోపాసన చేయు వాడు గాడు రెండును తానేయైనవాడు అక్కా! ఒక్కమాట అది ఇదియనీ, చూచితి, చూడలేదని, నాదని, అన్నయ్యా నాకుండె, పోయెనని, అది లాభమని, నష్టమని ఏమేమో మనసుకు తోచినట్లు అనుకొంటె అదే దుఃఖమై సుఖవృక్షానికి వేరు పురుగౌతుంది ఏమియు అనడానికి ఆస్పదమే లేదు అంత పెద్దవాడు అజగణ్ణ జగత్తే కానివాడు మహనీయుడు అజగణ్ణకు శోకించరాదమ్మా!

ఇట్లు అజగణ్ణుని సచ్చిదానంద శివయోగ తత్త్వాన్ని విస్తరించి ఏడ్చు చున్న ముక్తాయికి సమాధానం చెప్పిన ప్రభుదేవుని మాటలు అమృతాన్ని చిందించినట్లయింది ఆహా, ఎట్టి మహాత్ముడీతడు! చూడని అన్నను ఎంత సహజంగా వివరించినాడు ఏద్వరాదు ఔను నిజమే ఐతే ఆ ప్రభు మెప్పు పొందిన అన్నను మరచుటెట్లు? అట్టి ఘనుడు మరుగైతే ఎవరూరుకొంటారని ముక్తాయి అల్లమస్వామిని చూచి ఇట్లనుచున్నది

**ముక్తాయక్క**

దేహంబు బట్టితిగాన అనువెరుగక చెడితి మనసు
బట్టితిగాన ఎరుక నిలువక చెడితి భావంబు కోరిక తీర
లేదుగాన వియోగమై చెడితి జ్ఞానంబు పలికి అజ్ఞానంబు
నకు లోనైతి నన్నెరుగక భిన్నజ్ఞానియైతి అజగణ్ణ
మహిముడు ఘనంబునకు వేద్యంబుగాన, నా బుద్ధికి తెర
గప్పి పోయెనప్పా! ౧౧

**వివేచనము .**

నీ మాట నిజము తండ్రీ! అట్టి మహనీయ మనోహరుడు నా భాగ్య వశంబున భ్రాతయై, జ్ఞాననిధియై, గురువై వచ్చి పూర్ణము చూపక నన్ను పూర్ణములో పడవేసినది సామాన్యమా స్వామీ? మరల ఇది దొరుకుతుందా? అది నవరసభరితమైన కాని సర్వ సూక్ష్మమైన కాని, చావని పుట్టని తత్వమైన గాని, ఏమైనగాని అది సాకారంగా తూకానికొచ్చితే మాత్రం అజ్ఞానపు మబ్బు తెగు తుంది ఆకార భ్రాంతి దోషమొచ్చి కలత పెంచుచు నన్నది అంత సమంజసము గాదు ఎవరో కొందరు మీలాటి సిద్ధులనుకొనే మాట అందరికిది సమ్మతము గాదు

ఏడ్చుటకన్న మరి దిక్కేముంది? తమరేదో చెప్పెదరుగాని అది తమ అంతస్తుకు తగినది నాకు దేహముంది, మనస్సుంది, భావముంది ఉన్నదేమో ఉందే ఉంది అది నే నను మమకారములో చిక్కుకొన్నది నాకు జ్ఞాన ముందంటే ఉంది అది వ్యత్యాస జ్ఞానము సాకార మోహము స్వామి! అలవాటనేది స్వభావమైనపుడు సహజానికి త్రిప్పుకొనుట కష్టమప్పా! కష్టము నాకున్న అజ్ఞానాన్ని పారదోలక అజగణ్ణ పోవుటేమి న్యాయము!

ముక్తాయి తనలో తానెంతో జ్ఞానామృతము త్రాగు సమయములో ముంత జారి క్రిందబడి అశాభంగమైనదని ఒకే రీతి పరితాపము చెందినది ఆమె బ్రహ్మ జిజ్ఞాసువుగాన ఆమెలోని భావాలు సామాన్య లోకసంసారానికి చెందినవి కావు అల్లముడు నిరాకారత్వమును బట్టి ఇచ్చిన సమాధానానికి, ముక్తాయి సాకార సంపూజ్య సుజ్ఞానంబు జీవుడు లభ్యమెట్లని యడుగుచు, అది మరుగైతె దుఃఖము విడువదని చెప్పింది అలభ్య లభ్యానికై గురుతత్వము పొందుటకిది అనివార్య మన్నపుడు, అల్లముడు యోచించి ఏదైన జీవికి సమాధానము, శాంతి ముఖ్యమని ఇట్లు సెలవిచ్చుచున్నాడు

**అల్లమప్రభు**

లేని అనుమానంబు ఉన్నదని భావించితె అది
కన్నులముందు ఆకారమై బాధించు నమ్మా! లేని తనువు
ఉన్నదను వరకు అదే మాయయై వేధించు చుండును
క్రియారహిత లింగానికి క్రియ ధరించినగాని కాదనువారి

సందేహములు ముందగు రీతికి చెడుగౌను చూడక్క!
మనసు మందిరమైన లింగంబు తెరంగెరిగిన గుహేశ్వ
రుడను లింగము దూరంబుగాదు చూడుమా! ౧౨

**వివేచనము :**

నిజమును పరిశీలించి చూచితే నీవు కట్టుకొన్న భావనములు జీవ బంధనములేగాని పరతత్త్వమును తెలియు విధానము కాదు అది నీకు వివిధ శారీరక సంబంధాలు కల్పిస్తుంది దానితో నీ మనసు వికార విషయాలకు లోనౌతుంది ఎంతవరకు నీవి కాని శరీరేంద్రియాలు నీవని వ్యవహరించెదవో, అంతవరకు మాయయై నానారీతి అవస్థల కూపంబులో త్రోయుచున్నది ఇంకొకటి ఇది నిఃక్రియ లింగము (ఆత్మ) ఉపాసనకై లోపలున్న జ్ఞానము తన చంచలాన్ని నిశ్చలంగా పరిణమించుటకై బయటికొచ్చి ఆచార లింగము, ఇష్టలింగము, క్రియా లింగములను పేర్లు పొందినది ఇది ఎంతవరకు? క్రియాంతము వరకు లింగమనిపించును ఆ తరువాత అది మూలజ్ఞానంగా స్థిరపడుతుంది అటులనే ఈ దేహ జీవాత్మలు కనబడుట సుఖ దుఃఖ కామ మోహ వ్యవహారములు భ్రాంతి జన్య లోకములో ఎంతైన వుంది దాని రహస్యము గుహేశ్వరు నెరిగినపుడు వెల్లడౌతుంది అంతవరకు నీ యనుతాప సంజనితములు నిజమే యనిపించును

అల్లమస్వామి చాణాక్షుడు, దుఃఖములో నున్నవారికి అద్వైతము ఎక్కువగా వాడుచున్న ప్రపంచపు పోకడలు బాగా తెలిసినవాడు గాన లింగతత్త్వాన్ని కూడ ఉదాహరణగా వర్ణించినపుడు ముక్తాయి కనుగొని అల్లముని కిట్లనుచున్నది

**ముక్తాయక్క**

కాయమందు కాయమై మనసునందు మనసై
ప్రాణంబునందు ప్రాణమై యొండెననిన, కొందరికైన
తెలియగలదా? అంతరంగ మందున్నదన్న దేమిటో చెప్ప
రన్నా? మనమందు ముట్టిన కానరాదు బహిరంగ
మందున్నదన్న పూజించువరకు కానరాదు సాకారము

కాని నిరాకార లింగము దుఃఖమున్నంత వరకు సాధ్యంబు
గాదు నా మనంబున ఘనంబుంచి చూపువారు లేరు గాన,
నా అజగణ్ణ బెట్టిన పట్టు చిక్కుకు వెరగందితినయ్యా
ప్రభుదేవా! ౮౩

**వివేచనము** ·

అయ్యా, తమరిప్పుడు సెలవిచ్చిన విషయము ఎందరికి అర్థమౌతుందో తెలియదు కాయమందు కాయమై అన్నారు అలాగే మనస్సు ప్రాణాన్ని దానితో బాటు పోల్చి చెప్పినారు అట్లంటేమి? అదిగాక అంతరంగము బహిరంగ మన్నారు. అక్కడుండేవి ఇష్ట ప్రాణ లింగములైన సాధ్యంబదెట్లు? బహిరంగ ములో నున్న ఇష్ట లింగము గురు ప్రసాదితమైనా పూజించే వరకు దాని అంతు తెలియదు ఇక అంతరంగమందున్న ప్రాణ లింగము కానరానిది జ్ఞానమను కొన్న అది సంతప్త జీవులకు వశము కానిది కాయము, మనస్సు, ప్రాణాలు ఏమున్న దుఃఖ రాహిత్యానికి సహకారి గావు అవి త్రిమలానికి చెందినవి అల్లయ్యగారు, ముఖ్యంగా దుఃఖ నివృత్తికి మనసు నందు ఘనంబుంచుకొను రహస్యంబు జెప్పక ఈ పట్టు చిక్కు ముడి (దారము చిక్కు) బెట్టి నా యన్న మరుగైనందుకు పిచ్చిదానినైతి ఈ చిక్కు విప్పి వివరం చూపే వారు దిక్కు లెక ఈ సంతాపానికి గురియైతిని

నిజమే ఆమె చేతికందినది నోటికందలేదు ముక్తాయి పొందే అమూల్య జ్ఞానరత్నము క్షణములో మరుగైనది అది ఇక తన అజగణ్ణనుంచి దొరకదు ఏమైనా తానే సంపాదన చేసుకొనవలెను ఎట్లో శోకాన్ని గురించి, పరివారాన్ని గురించి చక్కని సమాధానము అల్లయ్య అన్నలాగున చెప్పుచున్నాడు కాని అది సమాధానం, వేదాంతమేలే వేదనారహితంకాదు ఎవరి మాటలో ఎవరి కథలో ఏడ్చేవారికా సమయంలో చెప్పే నీరసపు వృత్తాంత బోధలు

ముక్తాయి సమాదానం పొందక తన అన్ననే గురించి మరి మరి పరి తపించుచున్నది చూచి, ఆహా! దుఃఖము ఎంత బలంగా లోకాన్ని ఆక్రమించినది దాని నివృత్తికై వేదాంత బోధలు ఎన్నో ప్రబలంగా అలముకొన్నాయి ఆయా కాలానికి పెద్దవారు వచ్చి లోకదుఃఖ నివృత్తికై పాటుపడినారు ఐతే ఆ దుఃఖము

ఉన్నదున్నట్లే యుంది ప్రకృతి తన పోషణకై వుంచుకొన్నదేమో? ఈమె అసామాన్యురాలు ఐన దుఃఖి తెలిసినా విడువదని అల్లముడు యోచించి మరియొక రీతి సమాధానము ఇట్లు చెప్పుచున్నాడు

**అల్లమప్రభు:**

తెరువులేని ఘనంబు గురుతుకు రాకున్న మున్ను
చూపినవారెవరు చెప్పుమా మహా లింగైక్యమును? ఆ
రూఢములోని కూట ముందు నేనెవరి సాక్ష్యంబుగాన!
పేరు జేసి పలుకవచ్చునే ప్రాణలింగమును? ఎరుక
స్వయమై మరపు నష్టమైన గుహేశ్వర లింగంబు తానే
చూడుమా! ౧౪

**వివేచనము**

అక్కా, పిలువని పేరంటాలు రావడం, అంటుకొనడం, వదిలించు కోవాలన్న శోక యుండటం జీవికి సహజం ఇదంతా సుఖ దుఃఖాల కామ మోహ వ్యవహారాలు మోక్ష వృత్తాలు నీకివి సంబంధాలు కావు చూడు, వేరు కానిదైన ప్రాణలింగాన్ని భిన్నంగా భావించరాదు లోన బయట ఉండినా క్రియా భిన్నమే గాని జ్ఞానమొక్కటియే గద సాధనానికి రెండైతే సిద్ధిలో రెండు లేదుగదా! అది యుండేదే ఒకటి సూది మొనయంత సందులేక జగద్భరితమైన బ్రహ్మ తత్వంబు తెలియనపుడు కానకున్నపుడు చెప్పిన వారెవరు? చూపినవారెవరు, ఆ మహాలింగైక్య విషయము? ఇవన్ని జీవితాన గురుతులకు పెంచుకొన్న అన్వయాలు మహనీయమైన ఆరూఢత్వ కూటమునొందిన వారిని చూచిన సాక్ష్యము లేదమ్మా! ఒక్కమాట, ఏమియులేదు, జ్ఞానము స్వయమైతే అజ్ఞానం నష్టమౌతుంది అపుడు తానే గుహేశ్వర లింగమౌనుగదా!

ఇటుల ప్రభుదేవుడు సర్వవ్యాపక బ్రహ్మతత్వాన్ని, రెండుగాని ఒకటిని, మాయావృత లోకవ్యవహారము లెన్నియున్నను పరమ సుజ్ఞానంబు చేత తన్ను తానెరిగిన ఈ దుఃఖ వ్యామోహము ఉండదని వివేకము చెప్పిన ముక్తాయి అంటున్నది

**ముక్తాయక్క :**

గురు వచనంబుచే గాక లింగమెరుగ రాదు
గురు వచనంబుచే గాక జంగమం బెరుగరాదు గురు
వచనంబుచే గాక ప్రసాదం బెరుగరాదు గురు వచనం
బుచే గాక తన్ను తానెరుగ రాదు పూర్వ జన్మంబున
లింగంబు పూజచేసి ఈ జన్మమున జ్ఞానోదయం బైన
దన్న, గురువు లేక మున్ను బనదన వచ్చునే! తన
యందు తానె సన్నిహితు డౌదునంటె గురు లేక కాదు
కనుమా! నా అజగణ్ణయను గురువు లేక అరూఢి కూడిక
సమరసము కాదు వినుమా! ౧౫

**వివేచనము :**

బావయ్యా! ముక్కులేని మోము లింగము లేని పీఠము, గురువు లేని జ్ఞానము, అగాధ బ్రహ్మతత్వాన్ని నా దుఃఖ నివారణకై వెల్లడించావు నీవు మహనీయుడవు మహా తత్త్వవేత్తవు పరమ శాంతమూర్తివి గురు లేనిదే జ్ఞానంబు చేకూరునను భావంబు విస్తరించితిరి గదా! కాదంటే మీ ఘనతకు లోటు. ఔనంటే మాలాటి అజ్ఞానులకు చేటు గురు వచన సంస్కారములేక లింగ మెరుగుటెట్లు? గురువచనానుభవము లేక జంగము నెట్లెరుగనగును? గురువాను గ్రహము లేక ప్రసాదం బెట్లు దొరకును? గురు కారుణ్యము గాక తన్ను తానెట్లెరగ గలడు? ఇది తమకు వినోదమైతే నాకాశ్చర్యము అన్ని శాస్త్రాలు, అన్ని ధర్మాలు, అన్ని మత తత్వములకు గురుపథమే మూలముగదా! ఏదో మీలాటివారికి తెలిసిందంటే వెనుకటి జన్మలో పొందిన గురువానుగ్రహం కారణమై యుంటుంది ఔనా? ఊరకే మాటలతో కాదు నాయన్న అజగణ్ణ గురు లేక సామరస్యమెట్లు?

చక్కగా గురుతత్వాన్ని విశదీకరించుతూ అల్లముడు చెప్పిన తన్ను తానెరుగు విధానాన్ని త్రోసివేసింది మీలాటివారను పెద్దరికానికిది కొంచము వన్నెపూసి వెనుకటి జన్మంపు గురు సంస్కారమెత్తి ఈ జన్మములోని పూజ్యత నిలబెట్టినది వెనుకటి దన్నప్పుడు, గురుఘాధిక్యమెత్తినపుడు, ముక్తాయిని వివ

రంగా కండ్లు విప్పి చూచినాడు అల్లయ్య తను అనిమిషయ్యగారి ప్రాణలింగము పొందినదెట్లు ఈమెకు తెలిసినది? అని చకితుడైనాడు తన దీక్ష గురుదీక్ష గాదు ఉపదేశము లేనేలేదు గురువు కూలబడి ప్రాణము వదలినాడు దానికంతా అల్లముని శిష్యత్వమే సమాధానము దానికి శివాద్వైత శాస్త్ర సమ్మతినిచ్చినాడు ఐనా ఆ క్రియ వీరశైవ మత సాంప్రదాయ విధి గాదు

గురువులేక జ్ఞానాన్ని సంపాదించడము అంటే అజగణ్ణ తన గురుడని, ఇపుడు లేడని విలపించు ముక్తాయికి చెప్పిన సమాధానానికి శిష్యాధిక్యత చెప్పే అవసరం అల్లమునికి కలిగింది పోయిన గురు రాడుగదా! దానికే నీలో నీవు చూచుకొమ్మన్నాడు తన అనుభవము అదేయైనది ఈలాటి ఆకాశతత్త్వాలు నమ్మేదిగాదు ముక్తాయి ఎంత సంతోషములోనున్న అవధానియై అల్లమునికి గురు నిశ్చయాన్ని ప్రతిపాదించినది విని అల్లమస్వామి ఇట్లనుచున్నాడు

**అల్లమప్రభు**

గురువునకు శిష్యునకూ దూరమెంత, సమీప
మెంతను టెవరెరుగుదురు? గురువే శిష్యుడాయె తన
వినోదంబునకు, శిష్యుడె గురువయ్యె తన వినోదంబునకు!
కర్మమను కపటంబు సంక్రమించిన కారణము భిన్నమై
ఉన్నదన్న అది నిశ్చయంబగునే? అది అనాది నుంచి
టెట్టు వెను వెనుకైన పరతత్త్వతమును తెలిసి చూచిన నీవే
స్వయంజ్యోతి ప్రకాశమని ఎరింగిన, నీకు నీవె గురువు
గాని నీకన్న అధికమైన గురువున్నదే! ఇది కారణము
గుహేశ్వర లింగము తానె యనునది నీ నుంచి నీవె
ఎరుగవలె చూడుమా ముక్తాయక్కా! ౧౬

**వివేచనము**

అక్కా! గురుమార్గాన్ని బట్టి నీవు చెప్పినది కాదనరాదు మార్గము ఊరు చేరేంతవరకే ఊరు చేరిన తరువాత నీవే గురువు గురువు నుంచి శిష్యునకు, శిష్యుని నుంచి గురువుకు దూరమున్నట్లు కనపడును ఎవరికంటే అజ్ఞాన పద్మాసనాసీనులకు! వారి మాట పాటిజేయక నిజాన్ని వివేకించి చూస్తే గురు

శిష్యులు వినోదానికి ఇద్దరైనారే కాని అది ఉన్న తత్వము ఒకటే దీక్షాప్రకరణ కర్మ కాండమను కపటనాటకంబున ఇదంతా వేరు వేరను భిన్నాలు పెరిగినవి కొంచెము నీ యనుమాన ప్రవృత్తినుంచి ప్రక్కకొచ్చి చూడుము నీకన్న భిన్నమైనది ఏదీలేదు ఉన్నదంతా నీవే ఈ స్వస్వరూప జ్ఞానము తెలిసిన గుహేశ్వర లింగమే నీవు కావున నీ నుంచి నీవెరుగవలెనమ్మా!

అల్లమ స్వామి ముక్తాయి చెప్పిన గురుపథాన్ని ఒప్పుకొని అటు తరువాత తన్ను తానెరిగే మార్గం సులభంగా విశదీకరించి, పరతత్వం పొందడమంటే గురుని కెప్పుడు శిష్యుడై ఉండేదికాదు భృంగకీట న్యాయముగా ఆ గురువుగా తానయ్యేది అని చెప్పినది విని ముక్తాయక్క ఇట్లనుచున్నది

**ముక్తాయక్క :**

అద్వైత నిర్ణయముజేసి రెండు లేవనువారు బిడ్డ
గన్న కలవోలె యుండవలె గాని చెప్పనంత వరకు
భిన్నంబు గాదె చెపుమా? జ్ఞానంబు వీడి "అజ్ఞానంబు
నాశమై, గురుని వదలితి" ననువారు ఎదుటివారితో తమ
చాతుర్య కళలు చూపుటెట్లు? మనసు కొన మొన యందు
ఎరుక కంటి ముందు స్వయంజ్యోతియై వెలుగుచుండిన
తానేటి కగునే? చూచి ఎరిగినది మరువగలవారు నా
అజగణ్ణునట్లు శబ్ద ముగ్ధుడై యుండవలె గాని ఈ శబ్ద
సందోహము సరిగాదు ప్రభుదేవా! ౧౩

**వివేచనము**

జంగమస్వామి! తమరు ప్రతిపాదించిన అద్వైత సిద్ధాంతము ఒకరి సమాధానానికి చెప్పితే కాదు చెప్పుటయే ద్వైతమైనప్పుడు అది అద్వైత మెట్లగును? వినుట చెప్పుట రెండు క్రియలున్నపుడు ఒకటనేది దేనికి? కేవల జ్ఞానములో మీ యద్వైతమంటే అది శిశువుకన్న చెప్పరాని కలవలె యుంటుంది ఎదుటివారి నోరుగొట్టు చాకచక్య వాదముతో లేదయ్యా! జ్ఞానా జ్ఞానముల కతీతుడై గురు సంగము వదలి నేనే గురువైతి ననియెడివారు ఏమి తెలియని

రీతి మనుషులై యుంటారు తనలోని వెలుగు తనముందు ప్రజ్వలించుచున్న దన్న అది కాసనగునే? దానికి భిన్నమే గదా! అయ్యా, ఏమైనకాని చూచినది, ఎరిగినదంతా మరచి మా యజగణ్ణ యట్లు శబ్ద ముగ్ధుడుగా యుండుటే సహజము

బ్రహ్మన్ని గురించి చెప్పితే అది బ్రహ్మ కాదను విచారమెత్తి ముక్తాయక్క అల్లముని అభిప్రాయాన్ని అడ్డగించింది బ్రహ్మ అంటే తన యన్న ఎందు కంటే, అయన మౌని ఆ యన్న సంపర్కములో పెరిగిన ఆమెకు సర్వతో ముఖ బ్రహ్మము తెలియదన్న మాట గాదు శబ్దమైతే సహజ బ్రహ్మ కాదనే సందేహముండినది ఇది జరిగిన అల్లముడు నవ్వి అనుచున్నాడు

**అల్లమ ప్రభు**

పలుకే జ్యోతిర్లింగము స్వరమనునది పర
తత్వము తాళోష్టసంపుటి యనునదె నాదబిందు కళా
తీతము గుహేశ్వరుని శరణులు పలికి సూతకులు గాదు
చూడుమా! ౧౮

**వివేచనము** •

పిచ్చితల్లీ! శివయోగుల పలుకులు లోకములోని వారి పలుకులట్లుగాదు వారి పలుకులు జ్యోతిర్లింగములు స్వరము శబ్దమనునవి పరతత్వార్థములు. ఏమిటో నీ వాదార్థమే విపరీతము శబ్ద ముగ్ధము బ్రహ్మమనుకొన్నావు అలాటి శబ్దము లేని పలుకులేని కొండలు లేవా? చెట్లు చేమలు లేవా? సృష్టిలో ఎన్నో ఉన్నాయి అవన్నీ బ్రహ్మమేనా? ఐనదంతా బ్రహ్మమంటే ఇది కాదు ఇది యౌనని చెప్పితే వివేకమనవచ్చునా? గుహేశ్వరుని శరణులు ఏ ప్రమాణానికి చిక్కని శివయోగులు చూడు ఇరవైయైదు తత్వముల సిద్ధిని పొందు సాంఖ్య యోగానికన్న నాద, బిందువులను రెంటిని సాక్షాత్కారమునకు కారణమైన తారకయోగము శ్రేష్ఠము కొంత ముందుకు సాగి 'కళ' సాక్షాత్కారమునిచ్చు అమనస్క యోగము తారకానికన్న అగ్రగణ్యము దీనికన్న రాజయోగము మించినదంటే యోగములో మిక్కిలి యోగమంటే శివయోగము ఇట్టి సర్వ సిద్ధ శివ శరణుల మాటలను వెక్కిరించెదవా? మాటలు మైలపడుటకు వారిలో నేమున్నది? వ్యోమతత్వం పరిశుద్ధమైన శబ్దము అది శబ్దముకాక ఎందుకుండ

వలెను? నీకొక పిచ్చి పలుకే వద్దంటే బ్రహ్మమని చెప్పేవారెవరు? చెప్పకపోతే తెలిసేదెట్లు? ఇంకొకటి తెలుసుకో తాళోష్ఠ సంపుటమనే మాటయుందిగదా? అంటే నోరుముందు, పెదవుల ముద్ర లోపల పక్క దవడలు కొండనాలుక, చిరునాలుక, గొంతు నాదపుపెట్టె పెదవులిప్పి పలుకతే నాదమయం వాక్యమయం బ్రహ్మాండమంతి శబ్దమయం పెదవులు మూసితే మౌనము ఇది యంత నీకు చెప్పే అవసరం లేదు ఐతే శరణుల సహజతత్వం తెలుపడానికి ఇవన్ని చెప్పడమయింది ఈ రెంటికి పట్టుపడనివారు మనవారు, శివానుభావులు

మాటమీద ఎంత వ్యాఖ్యానము చేసినాడు ఈ స్వామి? ప్రతిభావంతుడు, సమయోచిత ప్రజ్ఞావంతుడు, సమయోచిత ప్రజ్ఞావంతుడు, వివిధ యోగమార్గాలు తెలిసిన మహాశివయోగి, దుఃఖ నిర్వచనముపై ఇంత గొడవ లేచింది గాని దుఃఖశమనం కాలేదు దుఃఖశమనమంటే శాస్త్రార్థములా? వ్యాఖ్యార్థములా? తత్వార్థములా? ఏపీకావు అనేక విషయములు తెలియకపోలేదు పెద్ద వారి కరుణామృత ధార జల్లులు నాకు తాకుతూనే వున్నాయి ఐనా ఈ వాదము పట్టి లేదని ముక్తాయక్క తనలో వితర్కించుకొని అల్లమునికి ఇట్లనుచున్నది

**ముక్తాయక్క .**

నడచి నడచి నడత కన్నవారు మాట మాటలుగా
చెప్పచుండిరే? మాట మాటలు చెప్పున్నంతవరకు నడచిన
దంతా అబద్ధమందును మాటల మథనంబునుంచి తెలివి
కరణ మథనంబు నుంచయ్యేగాని, అనుపమ స్వరభేద
మైన తెరగేదో చెపుమా? మనసుకు మనసే సాక్షిగాన
నిఃపతి కాదు చూడుమా! నా అజగణ్ణ తండ్రి శబ్దానికి రోసి
ముగ్ధుడయ్యేనయ్యా! ౧౬

**వివేచనము**

ముక్తాయమ్మకు వేసరికతోబాటు ఈసడింపై అయ్యా, మహనీయా! నీ యద్భుత వాగ్విలాసము శ్లాఘనీయము ఒక శబ్ద శ్లేష నిరూపణానికి ఎన్ని చుట్లు చుట్టితివయ్యా! ఎంత యోగ, వేదాంత తత్వ, శాస్త్రాలు వల్లించితివయ్యా! ఇదంత నడిచిన వారిట్లు చెప్పుచుండిరే? తమరెంత పెద్దవారైన ఎంతవరకు ఇట్లు

చెప్పుచుండెదరో అంతవరకు నడిచిందేది నిజము కాదని ఘంటా ఘోషంగా చెప్పెద మీరు చెప్పింది తను మన ఇంద్రియాల ఘర్షణచే జనించెనే కాని అనుపమ స్వరభేదమైన రీతి ఏమిటో చెప్పండి? వేరె మరియొకటి అవసరమేదియు లేదు మనసుకు మనసే సాక్షి, ఇతరము లేదు ఆ శబ్దాలకే మనయన్న వేసరికజెంది ఊరకయయ్యె - శబ్దాలు నాదాలు వాక్యాలు అవియన్ని ఎవరికి తెలియనివికావు స్వామీ?

ముక్తాయక్క శోకాన్నుంచి కొంచెము కోపాని కొచ్చింది నా ప్రయత్న ములో సగము గెలిచినట్లెయనుచు అల్లమప్రభు దేవుడు మందహాస ముఖార విందుడై సహజ స్వరములో ఇలాగంటున్నాడు

**అల్లమప్రభు :**

తన్ను తానెరిగిన పలుకంతా తత్త్వంబు జూడుమా
తన్ను తామరచిన పలుకంతా మాయ జూడుమా ఎరిగి
మరచిన శివయోగి శబ్దంబెల్ల ఉపదేశంబు కాక భిన్న
మున్నదె? నీ మనసు నందున్న శోక శమనమునకు అను
నయము పలికిన, నా మనమందు దోషంబు లేదు తల్లీ! మా
గుహేశ్వరు లింగమునకు నీవే కారుణ్యపు శిశువైతివిగాన
నోరు తెరచితి గాని భిన్నమున్నదె పిచ్చిదాన? ౨౦

**వివేచనము**

మాట - మౌనము మీది వాదము పెరుగుతుందంటె ఏమి చెప్పేది? నీ దుఃఖోపశమనమే నా లక్ష్యము, వాదము గాదు శాస్త్ర చర్చలుగాదు మౌనము తెలుసుకొన్న నీకు మాటయు బ్రహ్మమనుట తెలుపుటకై ఇంత రగడ పెరిగింది ఐనా నీ పట్టు వదలవు దోవబట్టిపోవు నేను చూచిన తోడనే నిలిచినాను, ఎందుకో తెలుసా? మా గుహేశ్వరుని చిన్ని బిడ్డవు దుఃఖించరాదని సమాధానానికై మాట లాడితిని ఇవి మాటలంటున్నావు నీవు కాదు ఒక మర్మము చెప్పెద వినుము ఎవరు తమ్ము తామెరిగి మాటలాడెదరో ఆ మాటలన్నియు పరతత్త్వములు ఎవరు తమ్ము తాము మరచి మాట్లాడెదరో ఆ మాటంతయు మాయ. మాతా

నీవిప్పుడు మొదటి స్థితి నుంచి తేరుకొంటున్నావు చూడు ఎంత మాటలాడిన కసింతైన నాలో దోసంబు లేదు

అని అల్లముడు చాలా మృదువుగా తనను తాను విప్పుకొని చూపినాడు. ఒక క్షణము ముక్తాయక్క స్తబురాలై నిలిచిపోయింది మరియొక క్షణంలో మెరుపు వలె తన యన్న జ్ఞాపకానికొచ్చి స్మరణ వ్యాపించినది వాదపు మరు గున్న విచార మొచ్చింది కటువు గాక సరసంగా బావమరదుల వరుసతో నవ్వుతు పలుకుతుంది

**ముక్తాయక్క** •

గురుతుంచుకొన్న వేయి కేకలు వేయు నోరు,
కూయకోయ్ బావ కూయకు వడగల్లు కడవలో ముత్యాలు
మాణిక్య మణులు నింపి ఎత్తువారు లేక చెలుల వెదకు
చుంటిని మనము లోని తనువునందు, తనువులోని మన
మందు, తనకు తానెత్తుకొనిన మేర దప్పి మనము కరగి
పారి పొంగినది మా అజగణ్ణుని యోగము! ౨౧

**వివేచనము**

ముక్తాయక్క ఆడవారికి సహజమైన ఛలోక్తుల విసరుతో బావ అల్ల య్యను అలాగాడిస్తూ విడంబిస్తు ఇట్లనుచున్నది చూచుకొన్నావా నీవెట్లున్నావో? చేతిలో లింగము, నోటిలో బ్రహ్మతత్త్వం పలికి లింగమక్కరలేదంటావు: ఊపి రాడక గట్టిగ బట్టినావు గడియ నిలువలేక నోరు పెడబొబ్బలు పెడుతుంది, అహో, అదేమి నేరం? మంమరాతి కుండలో ఏమేమొ ముత్యాలు మాణిక్య వజ్రాలు నిండ పెట్టుకొన్నావు అది ఎత్తుకొనుటకే చేతకాదు అంతబరువు జేసుకొన్నావు. ఎత్తే చెలియలకై అటు ఇటు మాస్తున్నావు బావయ్య! వారి పీరిని వెక్కిరించుట గాదు తమ మనములో నున్నది తానెత్తుకొన్న మనము మేరదప్పిపారుతుంది, అజగణ్ణుని యోగిమట్లు

చాలా తత్త్వ సూక్ష్మంతో బావ అల్లయ్యను పరిహాసించింది వడగళ్ళ కడవఅంటే కరిగిపోయే నశ్వరమైన ఈ తనువును పోల్చింది. దానిలో నింపు

కొన్న మాట ముత్యాలు 'నిన్ను నీవు చూచుకొన్నదే బ్రహ్మంబు' అని వెనుక చెప్పుచు వచ్చిన అల్లమునకు - మనసుతో తనువు, తనువుతో మనసు నీయంతకు నీవెత్తుకోమన్నది, ఎన్నో తత్త్వార్థాల సమూహమైంది తనువు మనసుతో ఎత్తడ మంటెఇష్టలింగముతో ప్రాణలింగాన్ని, మనసన్న ప్రాణలింగమునుంచి ఇష్టలింగ మెత్తుకోమన్నట్లు అవి రెండు భావంబులో ఐక్యమైతే అదే అజగణ్ణుని యోగము దీన్ని విడిచితె నీరు కుండలోనివంత కరిగిపోయేదేయని నిశిత విమర్శ ముక్తాయి చేసినది విని అల్లముడు ఆశ్చర్యము పొందినాడు భళీ! ఎంత సమర్థురాలీమె! ఎంతమాట కంతమాట ఏ నిశ్చయానికా నిశ్చయముతో వాదాన్ని సమర్థనీయంగా సరస మధురంగా నడపుతుంది దీనికేమి చెప్పుతుందో చూడవలెనని కుతూహలా విష్టుడైన అల్లమదేవుడు ఇట్లనుచున్నాడు

**అల్లమప్రభు :**

జ్ఞానంబు సమయించి అజ్ఞానంబు తుంచి, భావంపు
భ్రాంతి విభ్రాంతమైన వారి హస్తంబున గురుతునెంతురే?
తానడిగి తానుండి తనలోనే తానైన సత్య శరణునికి
అంతరంగమందొక్క తెలివి వున్నదే? గుహేశ్వర శర
ణునిరీతి కాయముండు వారి కండ్లకు సందేహమై
వుండును నిస్సందేహాలకు నిజమై యుండు మరులేల
చూడుమా! ౨౨

అదియును గాక,

నుడువునుంచి నడత చెడియుండె నడత నుంచి
నుడి చెడియుండె, భావంపు మలినంబు అది తానె సిగ్గుపడి
పోయెను జూడుమా!
గుహేశ్వరుడను సుజ్ఞానంబు బొత్తిగా గొడ్డువోయినది
గనుమా! ౨౩

**వివేచనము**

అమ్మాయి! ఏమో వరుసకు అన్నావు, అన్నదేమో నీకు తెలియదు జ్ఞానాజ్ఞానములు నశియించి భావములోని సంకల్ప వికల్ప వికారములు లేని

కరమందుండు లింగము ముఖ్యమని తలచెదవా? అంగి మే లంగ మైనది గదా? అప్పుడు అంగాంగ భేదము లెంచరాదు, శరణుడు అసమాన్యుడు అతడు అహం కారమం దడగి నిరహంకారంలో నిలచిన లోకోత్తరుడు, అట్టి శివయోగికి ఇది తనదను అంతరంగమునందొక్క ఎఱుక వున్నదే చెల్లీ? గుహేశ్వరుని శరణునికి కాయమున్నదనుమాట కాయముండువారి కండ్లకు భ్రాంతియై యుండును భ్రాంతిలేనివారికి సత్యమై యుండును ఇదంతా నీకు తెలియదన్నాను ఎందుకో తెలుసా? తెలియదంటే కొందరికెందుకు, చాలామందికి కోపము వస్తుందికదా? నీకురాదు ఎందుకంటే నాకు బుద్ధిలేదు అని మొదటి నీ పరిచయములో చెప్పుకొన్నావు అట్టి నిన్ను నే పరిచయమై చెప్పుకొనుటలో మరదలుగా చేర్చుకొన్నాను అందుచే నా బుద్ధి అడుగంటినది అది నీ ప్రభావమేమో! చెడు నుడి నుంచి నడత, నడతనుంచి నుడి చెడౌనమ్మా, ఇకనేముంది? ఉన్నది భావము లోపల అంటుకొన్న గిసిమసి తనకుతానే సిగ్గుచే పారిపోయింది... అని అల్లముడు నేరుగా చెప్పుకొనుచు ముక్తాయక్కను చూచి చెప్పే మాట నిలిపి, మరలా ముందుకుసాగి, అమ్మాయి! ముఖ్యముగా తెలుసుకో వాదమొద్దు, గుహేశ్వర లింగంబను పరమ జ్ఞానంబు బొత్తిగా గొడ్డువోయింది ఇంకే విషయ, విమర్శల, విచారముల కాన్పులకు తావులేదు

అదిరిపడింది ముక్తాయి తన అన్నయే అల్లమ జంగముడై వచ్చినాడని, పరబ్రహ్మమేనని నమ్మి, ఇక గుహేశ్వరుడు మాటలు ప్రసవించడు- అన్నమాట హృదయానికి శాంతినిచ్చింది ఆనంద భరితురాలై ఇట్లు అనుచున్నది

**ముక్తాయక్క**

ఔనౌను, శివశరణుల మహిమ ఎవ్వరికెరుగాదు
ఇనుము త్రాగిన నీటియట్లు, నీడ నిండిన పసుపున్నయట్లు
మంటలో నిమిడిన కప్పురమున్నట్లు బయలు నాలింగించిన
గాలియట్లు ఉన్న రీతి చెప్పెదనన్న, మాట కలవడునే?
తెలిపెదనన్న మతిలేదు స్మరించెదనన్న మనసు లేదు
నా అజగణ్ణ తండ్రిని కూడుకొన్న నీ మహిమకు నమో
నమో అనుచుంటినయ్యా! ౨౪

**వివేచనము**

ఓహో! మహాదేవా! శివ శరణుల మహా మహిమలు తెలియగల వారెవరు? లోహము త్రాగిన జలము, నీడలో వన్నెకెక్కిన పసుపు, మంటలోని కర్పూరము, బయాలాలింగించిన గాలివోలె చెప్పుటకు మాటలున్నవే? మతిలేదు, ఏమియు తెలియదు మనసే లేదయ్యో స్మరణ ఎక్కడిది? ప్రభుదేవా, నీవు అనంత కరుణామూర్తివి సర్వ సంగ వివర్జిత జంగమ స్వామివై జగత్తులో నున్నదంతా అది ఇది యనక నా వంటి దిక్కులేని దానిని రక్షించితి నీ బిడ్డ వంటి దానను గాన నేను దుఃఖాతిరేకమున ఏమన్నా వాత్సల్యమున మన్నించి కన్నీరు తుడిచితిరి నా యన్నతో బాటు ఇలాగే ఉద్ధతితనముచే వ్యవహరించు చుంటి సహజంగా నాకున్న తత్త్వ జిజ్ఞాస తీవ్రమైనది ఎదురైతే ఓరిమి తక్కువేమో? ఉద్రేకములో మాట్లాడేది నాకలవాటు నా యన్న సహించి ఓదార్చినట్టు సర్వతోముఖ బ్రహ్మమును తెలియపరచితివి ఇక చూడవని, జ్ఞానతత్త్వాన్ని పొందనని వ్యగ్రురాలై అజగణ్ణను తలచుకొంటు శోకసముద్రమున పడి దిక్కులేక కొట్టుకొనిపోవుచున్నప్పుడు నావయైవచ్చి నన్నెత్తి వినోదమాడి కృతార్థురాలిగా జేసితివి నా అజగణ్ణవై సాక్షాత్కరించి గురువైతివి స్వామి, ఉపదేశామృతము గోరెదనని ముక్తాయక్క శోక నివృత్తయై శాంతముతో పలుకుచున్నది చూచి అల్లముడు సముదితాంతఃకరణముతో మెల్లగా ఇట్లు బోధించుచున్నాడు

**అల్లమ ప్రభు**

ముక్తికి ముఖంబై యుక్తికి దూరమై జ్ఞానమునకు
జ్ఞానమైయున్న భేదంబు కానవచ్చుచుండె జూడుమా!
తెలివి మారి మరుపు మరగై నీయందు సన్నిహితమయ్యో
గుహేశ్వరుని శరణుండు అజగణ్ణుని రీతి బయలునందు
గూడిన మరీచికయట్లయ్యో, చేరిచూడుమా వేరుగాక —౨౫

**వివేచనము :**

తల్లీ! నీకు దుర్లభమైన దేదియూ లేదు వియోగ దుఃఖ మేఘ మడ్డువచ్చినందున జ్ఞాన భాస్కరుడు మరుగైయుండె అంతేకాని, లోకుల అజ్ఞానమట్లుకాదు నీ శోక గీతాలు ఎంతో అర్థ గర్భితమై, కళాభరితమై ఆత్మ తత్త్వ నిర్మలానికి నిజానికి స్థైర్యానికి తోడైనవి నేను చెప్పేదేమున్నదమ్మా? మహానుభావుడు పరాత్పరుడు, నీ యన్నను నీ కన్నీళ్ళ కణ కణాల్లో చూచి సంతసించాను నీకు శోకము శాంతి చేయడానికొచ్చి అపూర్వ లాభము సంపాదించాను

ముక్తి (విడుదల) కావలెనంటే యుక్తులను పసుపురుసు దూరంగా తోల వలయును ఇంకొకటి, తెలివికి తెలివి అవతలగా ఉంటుంది ఆ ఆయవాన్ని పట్టి గొట్టనంత వరకు జ్ఞానా జ్ఞానముల తాకులాటలు స్థిరత పొందనీయవు అజ్ఞాన మెంత అపాయమో జ్ఞానము అంతే ఈ విషయాన్ని సరిపెట్టుకొన్నప్పుడు నీలో నీవే నీయన్న అజగణ్ణునివలె బంధరహితయై బయలులోని మరీచిక బయలులోనే మిళితమైనట్లు నీవై చూచుకో తల్లీ!

ఇట్లని ప్రభుదేవుడు మహాలింగైక్య భేదాన్ని నిరూపించునప్పుడు ముక్తాయక్కగారు తన ధన్యతను తానే కొనియాడుకొనుచు అల్లమ జంగమస్వామి పాదారవిందములకు సాష్టాంగ నమస్కారములు చేసి వినమ్రతతో ఉపదేశాన్ని మనో లయ స్థానంబు నందుంచుకొని ఇట్లనుచున్నది

**ముక్తాయక్క**

గిణమహిమ శరణుల సంగంబు నుంచి ఘనంబు
నకు ఘనము వేద్యమైనపుడు ఎరుక లేదు మరుపు లేదు
కూడిక లేదు ఎడబాటు లేదు మనసు మేర దట్టు
నిరవయలైన సుఖము శూన్య నిశ్శూన్యమని అందురే;
శబ్ద ముగ్ధంబైన అజగణ్ణ తండ్రిలో చేరిన మీద జ్వాల
మింగిన కప్పురంబు వోలె నైతినయ్యా! ౨౬

**వివేచనము .**

ముక్తాయక్కగారు శాంత చిత్తయై శివశరణుల సంగము తనను ఘనత కెక్కించి ఘనతలో సామరస్యంబు పొందించెనని ఇక శూన్యము లేదు, నిశ్శూన్యము లేదని శబ్ద ముగ్ధుడైన అజగణ్ణ యట్లైతినని నిశ్శబ్దమయ్యెను

మౌనముగా చూస్తూ నిలబడిన అల్లమ ప్రభుదేవుడు తన వీణను ప్రతిగట్టి వాయించి తన కిష్టమైన గీతాలు పాడుచూ ముందుకు ప్రయాణము సాగించినాడు

ఇది కృపామూర్తులైన శ్రీ మృత్యుంజయప్ప గారిని, స్వప్న బోధామూర్తులైన శ్రీ ఎర్రి తాతయ్య గారిని స్మరించి సకల శివ శరణులకు నందించి శూన్య సంపాదనలో ముక్తాయక్క--అల్లముల సంవాదమునకు సంగ్రహముగా చెప్పిన వ్యాఖ్యానము సంపూర్ణము

శ్రీ గురు బసవలింగాయ నమః

# శూన్య సంపాదనము

౩

## సిద్ధ రామయ్యగారి సంపాదనము

కం॥ గుడి గోపురములు మొదలగు
గడణంబుల మాన్పి యల్లమ ప్రభు రాయుండున్
మృడ సిద్ధ రామున కిడిన
కడు తత్త్వార్థపు సంగతి కథనము వినరే

భూలోక పరమేశ్వరుడని ౧౨ శతాబ్దమందు విఖ్యాతి గన్న సిద్ధ రామ దేవులు సకల జీవుల ఉన్నతికై సొన్నలిగె యను (ఇప్పటి షొల్లాపురము, మహా రాష్ట్ర) చిన్న పల్లెను విస్తరించి మహా శైవ క్షేత్ర నిర్మాణానికి పూనుకొన్న యోగీశ్వరుడు లోకములో ఎక్కడెక్కడ పవిత్రాలు, మహిమలు, ఫల ప్రదాన ములున్నవో ఆ యంశాల సారములన్ని సంగ్రహించి తన క్షేత్రములో స్థాపించి, వచ్చిన యాత్రికులెవరు గాని ఆ పుణ్య ఫలాలు సంపాదించడానికి, దుష్కర్మను తొలగించుకొనడానికి, అనువైన సుఖ నివాసములు కలుగ జేసి, జీవులకు శ్రమ లేక క్షేత్రమున ఎక్కడున్న అక్కడ శివలింగ ప్రతిష్ఠలచే నలరారు దివ్యాకార ప్రాకార గోపురములు గల శివాలయములు, లక్ష తొంబదియారు వేలు నిర్మించు ప్రయత్నము మంచినీటి బావులు, చెరువులు, కోనేర్లు, ఉత్సవాలకు, పూజలకు ఇతర క్షేత్ర కార్యములో శిల్పులు, పనివారలు అహర్నిశములు పని సాగించు చున్నారు

సిద్ధ రామయ్యగారి వెనుకటి చరిత్ర శూన్య సంపాదనా కారుడైన గూళూరు సిద్ధ వీరణ్ణొడెయులు ఏమియు చెప్పలేదు కైలాసము నుంచి తెచ్చు కొన్నాడు క్షేత్ర రచనకు పెట్టినాడు ముందు తాను చెప్పవలెనన్నది చెప్పు చున్నాడు

ఇతరులు చెప్పినవి ఐతిహాసికంగా ఒప్పుకోడానికి కొన్ని గురుతులు ఈనాటికి వున్నాయి సొల్లాపురములో చూడవచ్చు 13 వ శతాబ్దిలోని రాఘవాంక మహాకవి వ్రాసిన 'సిద్ధరామ చారిత్రము' శ్రేష్ఠ కన్నడ కావ్యమని ప్రఖ్యాతిని పొంది జన జనితమైనది.

ఈ కావ్యకథా వృత్తాంతము సంగ్రహించి చెప్పిన ఇట్లుండును

కైలాసమందు పరమశివుడు పార్వతీదేవితో ఓలగించి యుండ వారి దర్శనానికై అద్రిశిర, ఊర్ధ్వశిరులను గంధర్వులు తమ వచ్చు దోవలో భృంగేశుడు రాగ చూచి నవ్వినపుడు "భూమిలో అజ్ఞాన జన్ములై భవి కులములో సతిపతులై పుట్టండి" యని కోపగించి శాపమీయగా గంధర్వులు భయమంది విముక్తికై వేడుకొనగా, శివయోగి మీ గర్భమున పుట్టును అతనినుంచి మీ శాప విమోచనము ముందు జరుగునది శివుని వల్ల తెలియండి యని వెళ్ళిపోయినాడు గంధర్వులు శివుని సందర్శించి జరిగినది చెప్పగా కరుణించి "సొన్న అగలో పుట్టండి నేనే మీకు కొడుకై పుట్టెద"నని అనుగ్రహించినపుడు ఆ గంధర్వులు కాపుకులములో పుట్టి మొరడి ముద్దన గౌడ, సుగ్గమ్మ పేరులతో దంపతులై సంతానముగని ముసలివారైరి

ఒకనాడు మహిమా పురుషుడైన రేవణ సిద్ధేశుడు శిష్యపరివారముతో ముద్దన గౌడు ఇంటికొచ్చి సుగ్గమ్మ ఉడుపుకు నమస్కరించగా ఆమె చోద్యమంది అడుగగా 'నీ గర్భమున శివయోగి జన్మించును' అన్నపుడు ఆమె నవ్వి "స్వామి పుట్టు ముట్టే నిలిచిన ముసలిదానికి సంతానమెట్లగు" అన్నపుడు "మహా యోగిపుంగవుడు మైలలో పుట్టునా? కామ వికారము నుంచి జన్మించినవాడు మహితాత్ముడగునా? సందేహము వలదు లోక మట్లు గాక నాల్గైదు నెలలకు పుట్టును సిద్ధరామ యని పేరు పెట్టండి"యని ముద్దనగౌడుకు హెచ్చరికనిచ్చి ఆ యూరిరాజు నన్నప్ప భార్య చామలదేవికి చెప్పి స్వామి వెళ్ళిపోయినాడు

స్వామి చెప్పినట్లేయైనది కైలాసము నుంచి గిరిజాదేవి వచ్చి బిడ్డకు మమకారముతో సిద్ధరాముడని పేరుబెట్టి వెళ్ళింది ఇదొక కలగా సుగ్గమ్మ భ్రాంతి సంతోషాలతో కొడుకును పోషించుకొంటు వచ్చినపుడు తమ కులదేవుడు

ధూళి మూకాళుడు పేరు సిద్ధరామునికి పెట్టుతుంది అపుడు మూగవానివలె ముగ్ధు డౌతాడు సిద్ధరాముడు తల్లిదండ్రుల కేమియు తెలియక కొర్రచేను, పసులు కాయుటకై నియమించగా అక్కడొక చోట దొరకిన లింగాన్ని పూజిస్తుండగా ఒక జంగముడు వచ్చి విభూతినిచ్చి తన నివాసము పేరు జెప్పి, నాకు చాలా ఆకలి కొర్రన్నము పెరుగు పెట్టుమని అడుగగా సిద్ధరాముడు ఆతురముతో ఇంటికి వచ్చి అమ్మను అడిగి చద్ది తెచ్చి చూడగా జంగమస్వామి కనబడలేదు పరితాపమున మల్లయ్యా యని ఏడ్చుచుండగా కొండకు యాత్ర పోవువారు ఆ త్రోవలో వచ్చి ఆ మల్లయ్య దగ్గరికే మనము వెళ్ళెదము రమ్మని సిద్ధరాముని పిలుచుకొనిపోయి శ్రీశైల మల్లికార్జున లింగాన్ని చూపగా, ఈ లింగము తన మల్లయ్య కాదని పర్వతమంతా జంగమ మల్లయ్యను వెదకినను కానరానప్పుడు సిద్ధరామయ్య ఉద్వేగమున ఒక పెద్ద ప్రపాతమున పడబోవగా కొర్రచేనులో దర్శనమిచ్చిన మల్లికార్జున జంగమమూర్తి ఆవిర్భవించి రెండు చేతులతో ఎత్తు కొని కరుణతో అనుగ్రహించి, నీ యూరికి పొమ్ము నీ తోడనే నేనుంటాను తల్లి తండ్రులు నీకై పరితపించుచున్నారు పొమ్మని అదృశ్యము కాగా అన్నయైన బొమ్మయ్య వెదకుచు వచ్చినందున ఆయన వెనుక సొన్నలాపురము వెళ్ళి తల్లి తండ్రుల దుఃఖ నివారణ జేసినాడు

శ్రీశైల మల్లికార్జునుడు చెప్పినట్లు సిద్ధరామదేవుడు మహాయోగియై శివానుగ్రహమున ఫాలనేత్రుడై మహాక్షేత్ర నిర్మాణము ఇతర మహత్తర చారిత్రిక విషయములు గల కావ్యాన్ని అత్యంత రసభరితంగా రాఘవాంక కవి వ్రాసినాడు కాలానుసారంగా సిద్ధ నంజేశుడు, లక్కణ్ణ దండేసుడు, ఇతర కవులు వర్ణించినారు

ఈ కావ్యము శూన్య సంపాదన పుట్టిన కాలానికి ముందు వచ్చినది చరిత్రము ముఖ్యముగాక, వారువారు జేసుకొన్న ఆధ్యాత్మిక సాధనలేవి? దానిలో జయమొంది లోకములో నున్న సామాన్య జనుల ఆత్మోన్నతికి ఇచ్చినదేమన్నదే శూన్య సంపాదనలోని శివశరణుల తత్త్వ విచారములు ప్రాచీన భారత సత్సంప్రదాయం ప్రకారంగా జీవుల ఉద్ధారముకై సిద్ధ రామేశ్వరుడు తీర్థక్షేత్ర నిర్మాణములు చేయు కార్యము ముఖ్యము ఈ కార్యము జరుగుచుండగా

అల్లమ ప్రభుదేవుడు ఆ నిర్మాణ క్షేత్రరంగములో ప్రవేశించి దిగ్భ్రమజెంది నిలిచినాడు ఎందరెందరో నిర్మాతలు తమతమ కార్యములో మగ్నులైనారు ఈ స్వామి వచ్చినది ఎవరు గమనించలేదు లక్కుండిలో ముక్తాయక్కగారికి శాంతినిచ్చి వచ్చిన అల్లమునకు ఇక్కడ ఎక్కడ జూచిన పనులు చేయు శబ్దములు, కోలాహలములు, చిత్రము అక్కడ జరిగే కార్యరంగం దేవతల నిర్మాణము గుడిగోపురాలు చెరువులు ప్రధానంగా రాయి మహత్తరముగా పనికి ముఖ్యమైనది చూస్తు చూస్తు ఒకచోట నిలిచి ఆ పనితనాన్ని జూసి ఇట్లను చున్నాడు

**అల్లమ ప్రభు** ·

ధరణి మీదొక పెద్ద సంత యంగళ్ళ కొచ్చిన
వీరినేమందు? నానారీతి భండ వ్యవహారములోన ఈయ
లేదు కొనలేదు వ్యర్థ ప్రయాస మిదేమిటో? అరమరులు
గొన్న శివుడు నెరిమరులను జగము పుట్టించిన విధము
గని చోద్యమందితి గుహేశ్వరా! ౧

**వివేచనము :**

ఏమి, ఏమిది, ఎంత ఆర్భాటము? అదెంత వేగము· ఆతురము ఎంత జన సమూహము ఆరుపులు విరుపులు తెరపులు లేక చెవులు చిల్లులు పడినట్లు దిక్కులు శబ్దమయమయింది ఆహాహా, అర పిచ్చి శివుడు ఎంత పిచ్చిని ఈ జీవులలో పెట్టి సృష్టించినాడు? ప్రపంచమనేదే ఒక బృహత్తరమైన సంత ఇదేమి వ్యవహారమొ ఏమి కథయో కాలేదు పోలేదు వృధా ప్రయాసము ఆహా, దీనికెంత శ్రద్ధ ఏకాగ్రత సంతోషము, ఉత్సాహము

అనుకొనుచు అక్కడినుండి మరియొకచోటికి వచ్చినాడు అక్కడ దేవాలయము పని ముమ్మరంగా సాగుతున్నది చూచినాడు పనివారెవరు ఈయనను గమనించలేదు ఆ మగ్నతలోనున్న అవివేకాన్ని ఇట్లాగున విడంబించుచున్నాడు

రాయి ఇల్లుజేసి, రాయి దేవునిజేసి ఆ రాయి
రాయిమీద పడిన దేవుడెక్కడ పోయెనోయ్? లింగప్రతిష్ఠ
చేసినవారికి నాయక నరకంబు గుహేశ్వరా! ౨

మరియు

దేహంబె దేగులమై యుండగా, వేరె మరి దేవా
లయం బేటికయ్యా? ప్రాణమే లింగమైయుండ, వేరె మరి
లింగమెందుకయ్యా? చెప్పువారు లేరు వినువారు లేరు
గుహేశ్వరా, నీవు రాయియైతే నేనేమగుదునయ్యా? ౩

**వివేచనము :**

తనలోని సత్త్వము ఎరుగక రాయిలో ఎంత కళలను నింపుతాడు శిల్పి! అది దేవుడైతె ఆచార్యుడు మంత్ర తేజము నింపి ప్రాణ ప్రతిష్ఠ జేయును ఇద్దర్లు పెద్దవారే అయితే తమలోనున్న తత్త్వాన్ని తామెరుగరు ఇది ఇట్లని తల వోయు నవసరము లేని భక్తులు ఆసేతు హిమాచలమున్న దేవుళ్ళను ఎంతో కాలమునుంచి కొలుస్తూనె వస్తున్నారు భారతమున దేవుడులేని ఊరులేదు అది గాక ఇంటింటి దేవుళ్ళు, దేవాలయాలు, క్షేత్రాల నిర్మాణము నిలువలేదు ఐతే శిథిల దేవాలయాలకు, పూజలు లేని, నైవేద్యాలు లేని అనాథ దేవుళ్ళకు కొరత లేదు అట్టి దేవుళ్ళను చూస్తె కనికరమౌతుంది ఎవరు ప్రతిష్ఠజేసిరో వారికి నరకమౌగాకయని ఆ దిక్కులేని దేవుళ్ళు తిట్టుతారేమోయని అనిపించుచున్నది ఔను మరి, ఆ గుడిలో దేవుడు ఎంత అపాయ స్థితిలో ఉంటాడు చుట్టు బలమైన గోడలు, పైన పెనుబండలు తలమీద గోపురము తలమీది గోపురము పడితె దేవునికి బైటికిపోవు తెరవేది? వాకిలికి బీగము ఇదెంత కష్టమో, ఎంత వెచ్చమో తెలిటుకపోలేమ ఐన దీనినే మరి మరి చేస్తూనే వున్నారు

సృష్టి పుట్టుకయే ఒక దేవాలయంగా మానవుని జేసింది లోపలనున్నదె ప్రాణలింగము ఇదీ ఎవరు చెప్పితె ఎవరు వింటారు? కష్టమే లేకుండ దేవాలయం కట్టి మనిషె దేవాలయమైనాడు తన హృదయములోనె లింగదేవుడున్నాడు ఇది మరుగు గాదు మోసముగాదు శాస్త్రము గాదు వేదము గాదు, చదువు రానక్కర లేదు, తెలిసినాయనను నమ్మితె చాలు ఐతె ఇది అలవాటులో లేనిదై నమ్మడానికి అర్హత లేకున్నందున అతి దుర్ఘటమైన కార్యమైనది అయ్యా, స్వామి గుహేశ్వరా! నీవు ఇట్లనే రాయియై స్థిరపడితె నా గతి ఏమయ్యా? అని తనలో తానె నవ్వు కొనుచు ఆ పక్క తిరిగినాడు వేలకు వేలు జనాలు కోనేరు త్రవ్వుచున్నారు

వారిని వెక్కిరించి ముందుకొచ్చి నిలిచినాడు ఈ క్షేత్ర నిర్మాత సిద్ధ రాముడని విన్నాడు 'సొన్నలిగె' లో లక్షా తొంభై ఆరువేలు లింగాల ప్రతిష్ఠ అట వెనుకటి రావణేంద్రునివలె ప్రతిష్ఠ జరుపుతాడని విన్నాను ఇక్కడికే వచ్చినాను ఆయన శివదత్త నేత్రాగ్నిని పొందినవాడట మహా యోగీశుడని విన్నాను ఇంతవరకు కనబడలేదు అక్కడొక చెరువు త్రవ్వుతున్నారు, అడిగెదనని సమీపించి వారితో ఇట్లనుచున్నాడు

> లోన కడిగి, నీరు నింపు బెరుగని వెర్రివాడేమయ్యో
> చెప్పరే: జల సంగమును కడుగ నెరుగక జలము కోరు
> నాతడు ఎట్లున్నవాడు చెప్పరే: నేల శోధించు మర్మమెరు
> గక చెరువు కట్టించు వడ్డె రామయ్యని విధమెట్లు చెప్పరే:
> మా గుహేశ్వరుని నిజమెరుగని పిచ్చి సిద్ధ రామయ్యే
> ఎటులుండె చెప్పరయ్యా:

**వివేచనము :**

అయ్యా, ఏమిటీ అవివేకం: పాత్రను శుద్ధిజేసి తెలిసినవారు వాడుకొంటారు లోపల అంటే ఈ దేహమనే పాత్రలో చెప్పరానన్ని కిల్బిషాలు నిండియుండగా పైన జేసే ఈ పవిత్ర తీర్థమనే నాటకము ఏ జీవుల పాపాలు నిర్మలం చేయ గలవో చెప్పగలరా: పెద్ద క్షేత్ర నిర్మాత ఎంత గందరగోళము చేసినాడనేది ఆయనకే తెలియనప్పుడు ఇక మీకేమి తెలియగలదు: మీ యజమాని ఎంత అవివేకానికి వివిధమైన ఆకారాలిచ్చి జీవులకు భోగ్యమైన నేలను చెడిపినాడు, రాళ్ళను చిత్రవధ చేస్తున్నాడు ఆయనెక్కడ: పెద్దవాడట ఆకాశ గమనం గల వాడట నుదుట కంటివాడట ఆయనెక్కడ: ఆయ నెంతవాడో చూడలేదు ఆయన మీతో చేయించే పని చూచి వడ్డె రామయ్య యని తెలుసుకొన్నాను ఈ మాట అల్లముని నోటినుండి రాగానె సిద్ధ రామయ్య గారి భక్తులు, పనివారంత గుమిగూడినారు వచ్చిన పెద్ద పెద్దవారు ఇది భూ కైలాస మంటుంటే వీడెవడు బికనాసి నోటికొచ్చినట్లు మా గురు సిద్ధ రామదేవుని, భూలోక రుద్రుని, వడ్డె రాము డంటాడని చేతిలోనున్న పనిముట్లు, రాళ్ళు రప్పలు కోపముతో విసిరి నారు గురునింద ఘోరాపరాధని, వానిని చంపి వేయాలన్న ఈసుతో పైన పడబోవ

డానికి ముందు కురికినప్పుడు వారు అల్లమప్రభువు మీద విసరిన చాను, సుత్తె, గడారములు రాళ్ళు విసరినవి ఎవరెవరివో వారి మీదనే వాన కురిసినట్లు పడినవి గుంపంతా అల్లకల్లోలమైనది, రాళ్ళు చెక్కె పరికరాలకు తామే రాయై దేహము గాయాలై రక్తము కారుచుండగా వచ్చిన వాడెవడో గారడివాడని భయ పడి గురువుకు చెప్పడానికని పారిపోయినారు

వ్యోమకాయుడైన అల్లముడు మౌనంగా మందహాసముతో సిద్ధ రాముని ఒడ్డె, కామాటిక మొదలైన భక్తులు అజ్ఞానము నుంచి తానెవరో తెలియక చేసిన పెద్ద ఆందోళనము జూసి ఇట్లనుకొంటున్నాడు

సహజంబు పలికిన చేరనీయరు చూడరన్నా! అస
హజానికి గాని మెచ్చదీలోకము చెరువు కట్టించే అయ్యను,
ఒడ్డె రామన్న యంటె కోపంబున లింగ దేహంబు
నొప్పింతురే? మా గుహేశ్వర లింగము జగము నందు
పూర్ణముగాన, శరణుల నొప్పి మరల పాతకుల తాకితె,
అల్లయ్య జూచి నవ్వుచుండెను ౫

**వివేచనము ·**

ఏమి లోకమయ్యా! అంతా కృత్రిమము ఎట్టున్నా పొగడవలెను మంచి దేదో చెప్పితె ఎంత కోపము? ఎంత నిష్ఠురము? ఎంత ఆవేశము? లేని గొప్ప తనాన్నంత ఊడ్చి దెచ్చి తలమీద వేయవలెను అది కసువైనా హసన్ముఖులై మోసెదరు ఎట్టి అజ్ఞానము? చేసే పని జూచి ఉన్నదున్నట్లు అనక లేనిది ఎట్లనె దరనేది వీరికింతైన తెలియక రాళ్ళ విసరడమేమిటి? ఇలాటి శిష్య వర్గాన్ని పెంచుకొన్న సిద్ధరాముని గురుత్వమనే ఘనత ఏలాటిదొ తెలిసెగద! లోకములో కొందరి గురుత్వాలు తమ పనులకు, తమ రీవి దర్పాలకు, సంపదలకు అనువై పెద్దవారిని జేయుటకు ప్రయోజనమగుచున్నది అయితే ప్రజల పాపము రాజు కంటుకొన్నట్లు శిష్యుల పాపాలు గురుదేవుల గొంతులకు ఉరిత్రాళ్ళయ్యేది తెలియదు

శివ శరణుల మహిమ తెలియరు వారు ఇతరులను నొప్పించరు తాము నొచ్చుకున్నారంటె నొప్పించిన వారె నొప్పికి లోనగుదురని అల్లమ దేవుడు నవ్వుచు లీలా మానసుడై 'ఎంత సంస్కృతురాలామె' యని ముక్తాయక్కను స్మరిస్తున్నాడు

గుంపు గుంపుగా వేదనలతో క్రోధ చిత్తములతో గురు సిద్ధ రామయ్య దగ్గరకెళ్ళి ఒడ్డె భక్తులు దండములు బెట్టి జరిగినది చెప్పుకొనగా, శిష్యాభిమాని శిష్యులు పొందిన ఆఘాత అవమానము జూచి అగ్నిపర్వతమువలె మండిపోయినాడు తన భక్తులకైన నొప్పి తన నొప్పిగా ఎంచి ఇట్లనుచున్నాడు

**సిద్ధరామయ్య :**

ఒరె ఒరె అయ్యా, మీవారి బాధ నాబాధ జూడుమా!
కని కని సైరించలేనయ్యా! మీవారి తోడ ఘర్షించువారి
జూచిననే వారిపై క్రోధంబు దాల్చెద కపిల సిద్ధ మల్లి
నాథా నీవు వారి యందున్నావు గాన ౬

**వివేచనము**

ఓ కాలాగ్నిరుద్రా! సైరించలేను నీ వారు, నిను నమ్మిన వారు, నీ సేవ యందుండినవారు ఒక సామాన్య యాత్రికునిచే భంగితులై ఈలాటి బాధకు నిర్నిమిత్తముగా లోనైనది చూచి ఊరుకొనను నీవారు నావారు వారితో ఘర్షణ తగదు తగదు నేను కోపానలుండనైయ్యెద మహాదేవా! ఎందుకంటె, నీవు వారి యందు నివసించియున్నావు గాన, తగిన ప్రాయశ్చిత్తము చేసెద నన్నాడు

ఎవరో వచ్చినాయనను తన శిష్యులు చెప్పగా విన్నాడు సిద్ధరాముడు చూడవలసినంత పెద్దవాడు గాదని తలచినాడు నాటు పోటు విద్యలనేర్చిన ఏ కాటిపాపడో అయి వుండవచ్చని అనుకొని, ఏమైనకాని వాడెవడైనకాని కాల్చి బూడిద చేయుమని తన మూడవ కంటి కిట్లనుచున్నాడు

బ్రహ్మయైనగాని, విష్ణువైన గాని, ఇంద్రుడైన
గాని, చంద్రుడైన గాని, మా శివశరణుల బాధ నా బాధ

జూడుమా! వాని రాచెద కాల్చెదనని తన ఫాల నేత్రం
బునకు ఆజ్ఞాపించిన నిలువగల వీరులెవరో నే గాననయ్యా! ౭

**వివేచనము :**

క్రోధానల జ్వాలలతో సిద్ధరాముడిట్లాదేశ మిచ్చిన తోడనె నుదుటిలో నున్న అగ్నినేత్రమునుండి మంటలు భగ్గుమని బయటికొచ్చి బయలును ఆక్ర మించినవి ధగధగ జ్వాలలు మండుచు బ్రహ్మాండము కాల్చునా అన్న సందేహ మావరించినది ఒక విపత్తును తప్పించుకొని గురువుకు నివేదించితే పరిహా రము పేరిట మరియొక మహామృత్యువు నోరు తెరచుకొని వచ్చెనని సిద్ధరాముని శిష్యులు భయమొందినపుడు అయన అభయమిచ్చి ఆ నిటల నేత్రాన్ని జూచి తనలో ఇంత జ్వాలానలం ఎక్కడుండినది? ఎట్లున్నదని ఆశ్చర్యము జెంది కొంచెము వెనుకకు జరిగి ఆ శివనేత్రాగ్నికి వందన మాచరించి ఇట్లనుచున్నాడు

అయ్యా, మీ మూర్తిని చూచెదనన్నచో దృష్టి
పారదు మీ తేజమును ఎవ్వరు చూడజాలరయ్యా! మీ
తేజ మెవరికి పోల్చరాదు చూడుమా! మీరు కోపించి
నొసటి కన్ను తెరచిన ప్రతిఘటించు వారెవరు చెప్ప
వయ్యా! కపిలసిద్ధ మల్లికార్జునా, మీ తేజంబు ముల్లో
కముం మ్రింగిన నే జూచి కన్నుమూసితినయ్యా! ౮

**వివేచనము :**

"మహాదేవా! నీ నేత్రాగ్ని అసమానము ఎదురుకొనున దీ లోకంబులో లేదు. నీ ప్రజ్వలిత నేత్రము ఉపమాన రహితము నీవు కోపించి కన్ను తెరచితె మూడు లోకాలు బూడిదలు కావా? నేనిది తెలియలేదు ఇన్నాళ్ళు నాలోనె నెమ్మదిగ ఎట్లుండెనో ఎరుగ పరమేశా, నీ భక్తుల నొప్పించినవానికి తగు దండన జేయు"మన్నపుడె మంటలెగరేసి ముందుకు వస్తున్నది అల్లమ ప్రభువు జూచి ఎక్కడిదీ మంట? వినాశకారియై ఎదురైనదాన్ని కాల్చుతు వస్తున్నది ఇవుదేమి జేసేది? ఏ మంటలైతె మనకేమి సంబంధము? అడవిలోని మంటకు అడవియే గురి నీటి మంటకు సముద్రమే గురి కాయములోని అగ్గికి కాయమే

గురి కాలాగ్ని రేగితే లోకములే గురి శివశరణులకు అయ్యా శంకరా, నీ మాయపు చిచ్చు గురి కాదని అనుకొనుసంతలో మంట ముందుకొచ్చినపుడు "సిద్ధరాముని పంటి మంటయా ఇది" అని గురుతించిన అల్లముడు నవ్వి ఇట్లను చున్నాడు

**అల్లమ ప్రభు .**

కాయ గుణము విడిచి, మాయింపు మదము నించి
కామ క్రోధంబులెల్ల సమసిపోయె అంగమంతయు లింగ
లీయమై, కంటి కళల వెలుగు క్రుంగి గుహేశ్వరుని
విరహాగ్ని యందు కాలిన వారిని మరల కాల్చెదనన్న
సిద్ధ రామయ్యగారి పిచ్చి జూడుమా! ౯

**వివేచనము**

ఏమి పిచ్చి! కాల్చుటకు అగ్నియున్న నేమి, కాలుటకు ఏదైన పదార్థమైనది యుండవలె గదా! నన్ను కాల్చుటకై సిద్ధుడు తన కన్ను పోగొట్టుకొన్నాడు చూచుటకిది అందరికి అంగము అంగము లింగములో లీనమైనది దీనినెవరెరుగు దురు? అంగమును కాల్చే అగ్గి లింగాన్ని కాల్చుతుందా? ఇట్లు కాయాశ్రయ గుణాలు లేవు ఉన్నదనుకొన్న దంతయు గుహేశ్వరుని విరహములో బూడిద యైనది ఇది తెలియని సిద్ధ రాముడు మూర్ఖుడు

ఈ మూర్ఖత్వములో తాను నిర్మించిన క్షేత్రమే కాలుతుంది అయ్యో అవివేకమా! ఔను అవివేకమే వితరణము లేక మండే అగ్నికేమి తెలుసు? శక్తిలో మిన్నయైనట్లు అజ్ఞానములో దానికి సమానము లేదు అణచిపెట్టి యుంటె క్షేమము ఈలాగున ప్రసిద్ధుడు బైట పెట్టితె ఎంత ప్రమాదము ? నిరపరాధు లైన ప్రాణులు వ్యర్థంగా నాశమగుచున్నవి ప్రాణుల మేలుకై ఇక ఈ రామప్ప క్షేత్రము గట్టేదేమిటి? పొగలు నిండి నాలుకలు చాపుతు ఉగ్రంగా వచ్చే మంటను ఆ క్షణమే నిగ్రహించి ప్రభు దేవుడు తన పాదములో ఇముడ్చుకొంటు వినోదించుచున్నాడు

మీ శక్తి జగము నందున్నది, జగము శక్తి మీ లోపలున్నది జగమునకు మీకు భిన్నమైనందుకు వెరగైతిని! ఆ కాలమందొక తూరి త్రిపురముల కాల్చిన నాకు సిగ్గయ్యె కాముని గాల్చి కామహరుడని పేరు పొందిన నీ అహంకారము కని అసహ్యమయ్యె నా మనసు, కాలుని గాల్చి బొట్టు పెట్టుకొంటె నాకు నగుబాటనిపించె మీ ఘనము గుహేశ్వరా నీవు కోపించి కన్ను తెరచితె నా యరికాలునం దడగెనయ్యా నీ కోపము ౧౦

**వివేచనము :**

అయ్యా నీలకంఠా! నీ పూర్వపు కంటి కథలు చాలా వినోదములు నీవెట్లున్నా ఏమి చేసినా అవి లీలలుగా ఎంచి నీ భక్తులు నిన్ను కొనియాడుదురు గాన నీవు ఎగ్గులు సిగ్గులు లేని ఏ పనైన జేసెదవు కాదనేవారు లేరు నీ కెదురు లేదు త్రిపుర దహనము, మన్మథ దహనం, యమధర్ముని దహనం సిగ్గుచేటు కాదయ్యా, ఒకమాట మీ శక్తి జగములో నున్నది జగము శక్తి మీలోనున్నది కాల్చిన వారెవరని కాల్చితివి? వారి వారి పేరుతో నిన్ను నీవే కాల్చుకొన్నట్లు గదా? ఆహా! స్వామి సాంబడా, ఎంత వివేకమయ్యా? అది అక్కడికే నిలువ లేదు సిద్ధరాముని అవివేకము వరకు వచ్చి, నాపై పడినది నీవు మహా ఘనుడవు నీకంటి కాహుతియైనవారు ఉన్నవారు బూడిదైరి నేను లేనివాడను సిద్ధరామునికిచ్చిన నీ కన్నే బూడిదయైనది

చూచెద సిద్ధరాముని అహంకారమెంత పొడవో శక్తి ఎంత ఘనమో, అతని మహత్తు ఎంత బరువో పరీక్షించెదనని అల్లముడు ఎక్కడ సిద్ధరాముని మంట యడంగెనో అక్కడినుండియే మహా జ్వాలను బైటకు తీసెను అది ప్రజ్వలించి కోటి సూర్య ప్రకాశమానంగా ముందు నిలిచింది చూచి ప్రభు దేవునికి ఆశ్చర్యమైనది గుహేశ్వరా, నీవు జ్యోతిర్లింగమైతె ఉపమించుటెట్లు? అని ఆ మహా జ్వాలకు సిద్ధరాముని దగ్గరకు వెళ్ళుమని ఇటుల ఆదేశ మిస్తున్నాడు

కాలాగ్నియను దావానల మావరించి లోకము దహించెనన్న శివశరణులు భయమందురు చంద్రశేఖరుడు కోపమున అగ్నినేత్రము తెరచిన శివశరణులు దానిని లెక్కించరు అసమాక్ష లింగమును తమ వశంబునకు తెచ్చుకొన్న శరణులు కినుక వహించి అగ్ని నేత్రము తెరచిన చతుర్దశ భువనంబులోన ఎవరు గురి కారు॰ గుహేశ్వరా, మీ జ్ఞాన ప్రకాశము వేడియైన సిద్ధ రామయ్య దేవుడను శివ యోగి హృదయమే గురియని అల్లయ్య నుడివె ౧౧

**వివేచనము :**

గుహేశ్వరా, అలింపుము కాలాగ్ని లేచి లోకముం దహించునన్న శివ శరణులు చూచినను భయమందరు రుద్రుడు క్రోధమూర్తియై ప్రళయ జ్వాలలు కక్కుతున్న తన ఫాల నేత్రము తెరచిన శివ శరణులు లక్ష్యపెట్టరు ఎందుకో తెలసా? ఆ మహా అసమాక్షుని కన్నుతీసి సమాక్ష లింగంబుగా జేసి తమ వశములో నుంచుకొన్న శరణులు తమ పాదనేత్రము తెరచితె చతుర్దశ భువనంబులలో ఎవ్వరు వేదనకు గురికారు॰ లింగ దేవా, మీ జ్ఞానప్రకాశము కొంచెము వెచ్చనైతే సిద్ధరామ శివయోగి హృదయమే గురియని అల్లముడు ఫాల నేత్రాగ్నికి పాదనేత్రాగ్నికి వున్న విభేదము చక్కగా అభివర్ణించాడు ఫాల నేత్రము కోపానలముతో నిండుకొని దహన గుణావృతమైనది పాదనేత్రాగ్ని అగాధ అనంత ప్రకాశముతో కోప శాంతావృతమైనది ఫాల నేత్రాగ్ని వివేచన లేక మంచిచెడ్డలను ఒకేతూరి కాల్చివేయు అజ్ఞానావృతమైనది పాద నేత్రాగ్ని చెడ్డను మాత్రం కాల్చి మంచిని రక్షించు మహానుగ్రహావృతమైనది

సిద్ధరాముడు అల్లముని అలక్ష్యము జేసినట్లు అల్లముడు జేయలేదు క్షేత్ర విడంబనలో సిద్ధరాముని చులకనగా పలికిన ప్రభువు ఇప్పుడు తన నేత్రాగ్నికి ఆదేశమిచ్చునపుడు శివయోగిగా గౌరవముతో జూచెను వెక్కిరించినా, వెలి బెట్టినా, పెద్దవారు పెద్దవారే సిద్ధరాముని గుణమెంచి దోషంబు దిద్దడానికని పంపిన పాదాగ్ని చూడ చూడ వెగ్గళమై భూమ్యాకాశములు వ్యాపించి, భట

ఛటార్భటలతో సిద్ధరాముడున్న దిక్కుకు తిరుగగానె, ఇది నాదిగాదు ఎక్కడిదీ అనుగ్రహ ప్రకాశం అని అన్నాడు చూడగానే తెలిసింది సిద్ధరామునికి తన అపరాధము ముందు నిలిచి పరిహసించి నట్లైనది పరితాప సంజనిత హృదయుడై, వచ్చిన వారెవరో తెలుసుకొన్నాడు అతడు నా స్వామి నా ఒడయడు నేనెరుగ నైతిని అయ్యో మహాదేవ, నీ భక్తుడై ఇంతహంకారినై చెడితి శివశివా, నీవు వచ్చితివా తండ్రీః వచ్చిన తండ్రి నెరుగని ఈ దురభిమాని, దుశ్చింతుని కొడుకుగా ఎందుకు కన్నావుః నాయనా, అప్పుడే నన్నెందుకు చంపక పెంచినావుః ఇప్పుడు ఇంత చెడు చేసినా చావక బతికినాను నీ వాత్సల్యము తీరలేదు ఇంత దయ నీకెందుకుః అనుచు దుఃఖితుడై ముందుకు వచ్చుచు ఏదో జ్ఞాపకానికొచ్చి సిద్ధరాముడు పరితాపమున ఇట్లనుకొనుచున్నాడు

**సిద్ధరామయ్య**

దట్టడవిలోన, రేయి పగలక నేను అప్పా,అయ్యా
యనుచు మొరబెట్టి వెదకుచుబోవ, నేనున్నాను రా కొడు
కంచు పిలిచి కన్నీరు తుడిచి, తన నిజము జూపిన
దేవుని పాదము ఈనాడు ఇచ్చటికి నడచి వచ్చిన, నే
నెరుగక మరులైతినని నా మనమందు హెచ్చరిక జేసె
అతని గని గొనివచ్చి కపిల సిద్ధ మల్లికార్జునయ్యను
దాచుకొనెద ౧౨

**వివేచనము :**

పూర్వస్మృతి సిద్ధ రామునికి అంతా జ్ఞాపకాని కందిచ్చింది బాల్యమందు తాను చేను కాస్తున్నపుడు ఆకలియని మల్లయ్యస్వామియను జంగముడు వచ్చి అడుగగా, ఇంటికిపోయి సద్ది తెచ్చెదనని అమ్మనడిగి సద్ది తెచ్చినపుడు జంగమయ్య చేనిలో వుండలేదు భ్రాంతుడై వెదకుచు శ్రీశైల యాత్రికులతో పోయి, వారు గుడిలోని లింగమును చూపగా ఒప్పక, నా మల్లయ్య జంగమస్వామి ఇక్కడే నివాసమనియుండె ఎక్కడను దొరకలేదు కదా యని దుఃఖిస్తు వెదుకి వేసరిల్లి ఒకచోట పెద్దప్రపాతం (రుద్రకమ్మరియది) దరిని "తాతయ్యా, నీవు కనబడకపోతెచచ్చెద"నని దానిలో దుముకబోవునప్పుడు ఆమల్లయ్య, అతడు శివుడే

వచ్చి, హా! నిలువు తనయా సాహసము వలదని వచ్చి చేపి మీనుగా ఎత్కొని ఏండ్ల క్రింద ఎత్తి రక్షించిన మహనీయుడు ఈనాడు నె పిలువకయే తానై వచ్చి నపుడు నెను జేసిన కృతఘ్నతకు కొనయున్నదా? అయ్యో స్వామి, ఆనాడు నిన్ను వెదకుతు వచ్చి నీ యనుగ్రహం పొందితిని ఇప్పుడవి పోగొట్టుకొంటిని నీ ప్రసాదిత నేత్రశక్తిని భస్మాసురుని పోలె నీ మీదే ప్రయోగించితిని ఇక నాకు దిక్కేది గతియేది శంకరా? బాల్యములో నున్న నిర్వంచకత భక్తి పెద్ద వాడ నేనను అహంకారములో మరుగైనది నీవు కృపామూర్తివి నేనెరుగనిది నీవే ఎరిగించి దయతో నీ వానిగా జేసుకొంటివి స్వామి వచ్చెద నిన్ను ఇక వేరుగా వుంచుకోను నా హృదయ నివాసములో ఉంచుకొందునంచు అవధానియై తన తప్పు తెలిసి పూర్వ కథ స్మరించి వేగంగా వస్తుండగా శిష్యులందరు చుట్టు ముట్టి, గురుదేవా! ముందుకు వెళ్ళకండి అతడు విచిత్రమైనవాడు నిలిచిన నీడ లేదు, నడచిన పాదరేఖలు లేవని అడ్డగించినపుడు, మీ యభిమానంబున తప్పితి అతడు నా స్వామి! నన్ననుగ్రహించ వచ్చినపుడు అగ్నినేత్రము విసరి అప రాధినైతిని విడువండి ఆయనెట్లో నేనట్లె యనుచు వారికిట్లనుచున్నాడు

అతడై నగలి నేనగుదు అతడున్న రీతి నేనౌదు
అతల్లడొనిది నేనొల్ల అతని సన్నిధికి చెందెద నా ప్రాణము
అతని మీద బెట్టి కూడెద కపిల సిద్ధమల్లికార్జునా! ౧౩

**వివేచనము**

లేదు లేదు, నేను వేరుగానుంతును అగాధమైన అక్షమ్యమైన అపరాధపు పాతములో పడిపోతిని ఆనాడు రక్షించిన దేవుని మరచినందున ఇటులైనది నే జేసిన తప్పెంత పెద్దదో మీరు తెలియలేరు ఆనాటి రుద్రకమ్మర ప్రపాతము కూడ నన్ను లోగొనదుగాన ఆయన కృపయే నా ప్రాణము నాకేమియు వలదు. నేనేమి చేయను లోకములో నా ప్రశస్తి ఏమియులేదు అంతయు ఆ మహా స్వామి కృపావరణలో ఆడుకొను బిడ్డను, అని వారికి సమాధానము చెప్పి వస్తూ వుండగా, ఔను, నన్ను సమీపానికి చేరనీయకపోతె? అనుకొన్నాడు సిద్ధరాముడు. ఆయన కోపగించితె నేను విడుతునా? మదహస్తి మదహస్తిని పట్టినట్టు పట్టెద

ఏ రూపైతె ఆ రూపై పట్టెద రూపే లేకుంటే రూపించి పట్టెదనని పంతముతో ఆవేశముతో వడివడి వచ్చి అల్లముడున్న చోటికి వచ్చి చూచి చూచినట్లెల్ల కండ్లు నిండి హరుషోద్గారముతో ఇట్లనుచున్నాడు

ఎండిన చెరువుకు వాగువచ్చి చేరినట్లు ఓ అయ్యా!
మిమ్ముగని కండ్లు గండ్లుగా పారెనయ్యా! నా మనంబు
నకు మనము వేద్యమైతె నే మరచితి హా! హా!! అయ్యా
కపిలసిద్ధ మల్లినాథుని గాంచిన సుఖము ఎవరికినిలేదు ౧౪

వివేచనము.

దేవరదేవా! వట్టి చెరువుకు వంకవచ్చి చేరినట్లు నీవు వచ్చితివి అగ్గి కన్నుచే నా నేత్రాలు శుష్కమై ఎండియుంటె అది నీవు నిగ్రహించినందున నీ దయారసమనే వాగు వచ్చి ఆనందమను గండ్లు పారుటాయె స్వామి స్వామి తెలియకనే మరచితిని అనుగ్రహమను పిచ్చితో నొసటియందు శివాగ్నిని ఉంచుకొని యుంటిని మీరు రాకయుంటె అది అక్కడనే యుండేది తగదని దాన్ని ఈ రోజు నా నుంచి విడదీసి నీ వెలుగిచ్చి రక్షించినావని సిద్ధరాముడు వినమ్రుడై నమస్కరించుచున్నాడు

ఓ అయ్యా నా శిరము మీ చరణము సోకిన మీద
నా యందు గుణ దోషంబు గణియింతురె? "భృత్యా
పరాధః స్వామినో దండః" కపిలసిద్ధ మల్లికార్జున దేవా,
త్రాహి త్రాహి రక్షించు దేవా! ౧౫

వివేచనము.

సోమనాథా! అపరాధము జేసిన నా తల అనుగ్రహించిన మీ పాదాన్ని సోకిన తరువాత ఇంకక్కడ గుణ దోషంబులుండవు ఉండినా సేవకుడు చేసిన అపరాధమునకు స్వామికి శిక్ష ఇది పెద్దవారన్నది నన్ను రక్షించు దేవా యని సిద్ధరామయ్య భవ్య దివ్యాకారమూర్తియై వెలుగుచున్న అల్లమ ప్రభు దేవుని హర్షోద్గారము తో స్తోత్రము జేయుచున్నాడు

**స్తోత్రము :**

మీ నిజ రహస్యంబెవరెరుగుదురయ్యా? చతుర్దశ భువనంబులెల్ల మీ కర స్థంబందడగి యుండెనయ్యా! మీ సమానమైన దేవుడున్నాడె? కపిలసిద్ధ మల్లికార్జునా! ౧౬

మరియు

అనంతమైన దేవతలందరు తండ తండములుగా ప్రణామం బాచరించునప్పుడు వారి మకుట సంఘట్ట రజము రాలిన చోట రజత పర్వతంబులయ్యె, కపిలసిద్ధ మల్లికార్జున దేవరదేవా మీ ముంద ౧౭

మరియు

హరి యను నాతడు మీ చరణం బెరుగడు బ్రహ్మ యను నాతడు మీ మకుటంబు నెరుగడు యతి వ్రతులు, ఋషులనెడివారు మీ అంతరంగము నెరుగరు సమస్త దేవతలు మీ రోమ ప్రణామం బెరుగరు శతకోటి సూర్యులు మీ వెలుగును చూడజాలరు కపిలసిద్ధ మల్లికార్జునా, నేను నిన్నెరుగుదునే అయ్యా? ౧౮

మరియు

తలపించెదవు మరపించెదవు నా గుణ దోషము మీది వినవయ్య నా విన్నపంబు మిమ్మెంచువాడ నేగాదు. జూడయ్య మీ నుంచి మిమ్మెంచెద కృప జేయుమా కపిల సిద్ధ మల్లికార్జునా! ౧౯

మరియు

చేతులను దీసి విసరివైచిన తనువును ఖండించి తునా తునుకలు చేయ, విడువ విడువ మీ చరణంబు నింక నా తనువు నాశమైనను మిమ్ముల జ్ఞాన తనువుతో ఆవరించెదను చూడుమా కపిలసిద్ధమల్లికార్జునా! ౨౦

**వివేచనము**

సర్వేశా! నీ నిజమెవరెరుగుదురు? ఎట్లు నిర్ణయింతురు? సాకారమంటె నిరాకారముగా మారుతావు సరె అదే నిశ్చయమంటె ఆ క్షణముననే ఏదో ఆకారము దాల్చి వచ్చెదవు ఆ యాకారమే నిజమని చెప్పేలోపల ఇంకొక ఆకారంగా మారుతావు ఏమని నిర్ణయించేదయ్యా! భువన బ్రహ్మాండములు నీ చేతి బొమ్మలు

నీ వైభవోపేత వందనార్చనలు ఏ కవి వర్ణించగలడు? అనంతమైన దేవ సమూహాలు నీ పాదారవిందాలకు నమస్కరించు ఆతురములో ఆ దేవతల నవరత్న ఖచిత కిరీటాల ఘర్షణకు రాలినపొడి రజత పర్వతములైనవి ఆహా! అదెంత మనోహర మహా మహిమయో చెప్పనలవిగాదు

హరి నీ పాదము ఎరుగడు బ్రహ్మ నీ మకుట మెరుగడు యతులు, ఋషులు, మునులు, యోగులు, మహాజ్ఞానులు నీ యంతరంగ విధానమేమో ఎరుగరు సమస్త దేవతలు నీ రోమ ప్రమాణంబులు తెలియలేరు మీ మహా ప్రకాశంబు శతకోటి సూర్యులైన చూడజాలరు అన్నప్పుడు నేను మిమ్మెరుగ నగునే స్వామి

అయ్యా అంతటికి నీవె కారణము ఆ కారణములు నావి కావన్నట్లు ఇతరుల మెడపగట్టి వేధించెదవు నిన్ను తలచుటగాని, మరచుటగాని జీవులకు స్వతంత్రమా? జీవేశుడై నీవుండగా జీవి తప్పించుట ఏటి న్యాయమయ్యా చూడు నిన్ను స్మరించను అంటె నేను స్మరించెదనని నిన్ను పేరుపెట్టి స్మరించను మీనుంచి మిమ్ము ధ్యానించెద

నీవేమైన కోపగించి నన్ను త్రోసితె నే విడువను నా కాయాన్ని తునా తునకలుగా నరికితె మీ చరణాంబుజములను విడువనయ్యా! అదియునుగాక నా ప్రాణమీ తనువునుంచి వదలితె సూక్ష్మత జ్ఞాన తనువునుంచి ఆవరించె చూడుమని సిద్ధరామదేవుడు వినయ వివేక భక్తి శ్రద్ధలతో మనోహరంగా స్తోత్రము చేసినాడు ఎంతేగాదు స్తోత్రపాత్రుడు తృణీకరించిన విడువనను పంతము [illegible] [illegible]కొల్పసదో, ఆ భావనలో దేహ ప్రాణాల

నాశమువరకు వచ్చినాడు అల్లముడు వింటున్నాడు ఏమియు అనలేదు ఐన సిద్ధరాముడు మరి మరి ఉద్రిక్తుడై మిము పట్టెద విడువను స్థూల తనువుపోతే సూక్ష్మ తనువుతో పట్టెదనన్నాడు ఆటలాడించువానివే అన్ని తప్పులన్నాడు కొనియాడి రక్షించుమంటాడు మరియొక తూరి నేను నిను కొనియాడనంటాడు నీ మనసుతో నిన్ను స్మరింతునంటున్నాడు వివిధ భంగుల భక్తి జ్ఞానముల వీర చైతన్య భావములచే తన శక్తిని వెల్లడించుట కిట్లన్నాడో లేక ఆ యల్లముని సర్వశక్తుల నిరోధించి తన అనుగ్రహంగా మార్చుకొనుట కన్నాడో తెలియదు అన్నిటికన్న సిద్ధుడు యోగ సమర్థుడు అతనికి తెలియనిదిలేదు ఎవరికేగాని సులభుడు గాదు తాను తప్పు జేసినదేమొ సరి ఐతె అది ఆ సమయానికి తనదిగా చేయలేదు శివుని పేరుమీదనే నడచినది ఏదో భావనకు చెప్పుకున్న అపరాధం ఒప్పుకున్నాడు ఇప్పుడు వీర భక్తావతారుడై నిలచిన సిద్ధరామయ్యను గని అల్లయ్య నవ్వినాడు ఎంతవరకు వచ్చి పట్టి స్తోత్రముచేసి దానిలో తన యోగశక్తిని వెల్లడించినాడు సమర్థుడే అనుకొని అల్లమ ప్రభువు ఇట్లను చున్నాడు

**అల్లమ ప్రభు**

తనువున్న మానవులట్లు చేతికందడు ప్రాణ
మున్న జీవులట్లు నడయాడకుండు చూడ కండ్ల కనువు
గాదు విన చెవుల కలవిగాదు గుహేశ్వరుని తెరగు వట్టి
స్తోత్రమునకు చిక్కదు చూడుమా సిద్ధరామయ్యా! ౨౧

మరియు

కంటికి కనబడునన్న రూపంబుగాదు, చేతికి
చిక్కుననిన దేహంబుగాదు నడచిన గమనిగాదు పలికిన
వాచాలుండు గాడు నిందించినవారికి విరోధి గాడు
పొగడినవారికి మిత్రుండు గాడు గుహేశ్వరుని రీతి
మాటాడిన మాటకు దొరుకునె? సిద్ధరామయ్యా, మరు
లైతివే ౨౨

**వివేచనము** •

సిద్ధరామయ్యా, నీ ఖ్యాతి విన్నాను అగ్నిసాక్షిగా వైదిక విధానంగానె నన్నాహ్వానించావు మంచిదాయె ఐతె నీవిప్పుడు ఘనంగా నన్ను స్తుతించి నీ భక్తిని అర్పించావు మా గుహేశ్వర లింగంబు పోకడలు విచిత్రము ఇతర దేవతలు స్తోత్రాలకు తలూపినట్లు ఊపడు, ఇంతకు స్తోత్రమంటే ఇష్టములేదు. తనువున్నదంటె అది చేతికందదు ప్రాణమేమొ ఉందనుకో, పారాడదు, చూచే కండ్లకు, వినే చెవులకు అలవిగాని వస్తువే కాని వస్తువు ఉత్తస్తోత్రాలకు చిక్కదు.

ఇంకొక మాట గమనించు సిద్ధ దేవా! కనబడితె రూపంబు కాదు చేతికి తగిలితె దేహంబు గాదు నడచితె పోవుటలేదు మాటాడుచున్నను వాచాళి గాదు తిట్టినవారికి విరోధిగాడు పొగడిన వారికి స్నేహితుడు కాడయ్యా ఇది తెలియక పట్టెద, పైనెక్కెద, కట్టెద, నిను విడువను, తునుకలుగా నరికిన, ప్రాణము పోయినా సూక్ష్మమునుంచి బంధించెద...... ఇవేటి మాటలో! ఈ మాట లర్థము లేమిటో నాకు తెలియదు ఇన్ని మాటలాడుటకు నేనెక్కడున్నానో అది తెలియక మాటలాడి పెద్దగా పొగడితే అయ్యేదేమి? వచ్చిన వారితో ఒకే తూరి ఇన్ని మాటలాడె అవసరముందా? కవితల వర్ణనలకు తత్త్వము సంత సిస్తుందా? అని ప్రభుదేవుడు నిండిన కుండవోలె ధీర గంభీరంగా సిద్ధరామయ్య చేసిన స్తుతిపారాన్ని నెమ్మదిగా దిద్ది వివేకం జెప్పినప్పుడు మంచి భక్తి ఆవేశ ములోనున్న సిద్ధరామయ్య మెత్తబడినాడు తన ప్రార్థన పనికిరాలేదు ఎవరిని గురించి ప్రార్థించినదో ఆ ప్రార్థన వారు ఒప్పి సంతసిస్తే ప్రార్థించిన భక్తునికి సంతోషం కలుగుతుంది సిద్ధరామయ్య ఖిన్నుడైనాడు ప్రార్థనయే కదా అన్నిటికి ముఖ్యము? అది కాదంటె మరే ఉపాయముంది? అనుకొని అతనినే అడుగవలెనని ఇట్లు మనవి జేసుకొంటున్నాడు

**సిద్ధరామయ్య**

స్తోత్రములన్నవి నీవు చేయగానైనవి చూడయ్యా!
మూర్తియన్నది నీ తలపుచేనయ్యె చూడయ్యా ఆ మూర్తి
యనునది నీ స్వభావము కనుమయ్యా! నా హృదయ
కమలంబులో బుట్టు స్మరణ నీ గతి చూడయ్యా! కపిల

సిద్ధ మల్లినాథయ్యా, నీవు స్తోత్ర ప్రియుడు కాకయున్న
బాణ, మయూర, హలాయుధులకు వలచినదెట్లు చెప్పరే? —౨౩

**వివేచనము .**

ప్రభుదేవా! సోత్రము ఇష్టములేదని ఇంతవరకు ఏ దేవతలు చెప్పలేదు తపము, జపము, యోగములకన్నా భజనయే సులభమని తెలిసినవారు చెప్పినారు దాన్ని అనుసరించి పండిత పామరులను భేదము లేక తమ తమ ఇష్ట దేవతలను సోత్రాలచే మెప్పించి ఇష్టార్థములు పొందినారు ఈనాడు తమ రెండుకో దానికి విరుద్ధంగా సెలవిచ్చినారు దీని భావమేమొ మాలాటివారికి వింతయగుటయే కాదు భ్రాంతియైనది

మహాస్వామి, ఒక చిన్న మనవి స్తోత్రములు వద్దంటున్నారు కదా ఆ స్తోత్రములు రచనలు చేసినవారెవరు? ఆ రచనకు వస్తువుగా మూర్తియైన వారెవరు? మీరే కదా అది మీ స్వభావము స్తోత్రము చేయుట నేర్పి జీవనోద్ధారానికి దోవ జూపిన గురుదేవులు మీరే కదా! సకలాన్ని ప్రేరేపించు సర్వశక్తుడవు నీవే కదా! నాలోని స్మరణ నీవు కాదా మీకన్నా ముందున్నవారెవరో చెప్పేదరా? ఐనదంతా మీనుంచి ఐనది కదా దానిలో ఈ స్తోత్రము ఇష్టము లేదనడానికి కారణమేమి? వెనుక బాణుడు, మయూర, హలాయుధులు నుతించి నిను మెప్పించి కైలాస పదవులు పొందలేదా? ఔను నేను తెలియక అపరాధము జేసి విన్నవించుకొన్నాను మనసార నీ గుణగానము జేసుకొన్నాను, అదికాదంటె నీ మెప్పు పొందడమేదో సెలవైనట్లు, అని సిద్ధరాముడు భక్త భగవంతుల బాంధవ్య సూత్రాలు స్తోత్రాలని పరంపరాగత వేదాగమ విధానములు సూక్ష్మంగా విన్నవించినదంతా విని చిరునవ్వుతో అల్లము డిట్లనుచున్నాడు

**అల్లమ ప్రభు**

వచన రచనలను వన్నె మాటల రీతిగాదుచూడుమా
పొగడి కన్నవారంత మూర్తిలోపలైరి వేదశాస్త్ర మార్గ
మంతయు కొనియాడికానలేదన్నది గుహేశ్వరునిసాక్షియై
మూడు లోకంబు లెరుగునయ్యా సిద్ధరామయ్యా! —౨౪

**వివేచనము :**

అయ్యా, నీవు మంచి మాటకారివి వివిధ వర్ణాల మాటలు తియ్యని మాటలు ఏమైన పలికే కవీశ్వరుడవీవు చూడు వినడానికి ఇంపుసొంపుగాని ఇట్టి మాటలకు ఆ పరాత్పరుడు చిక్కడు, నీవు చెప్పినట్లు చిక్కినాడంటె మూర్తియైనవాడు వానినే ధ్యానించిన భక్తులు ఆ మూర్తిలో కలసిపోయిరి, అంతె విన్నావా వేద శాస్త్రములు చెప్పుచున్నవి గదా "ఎంత నుతించినా అతడు చిక్కలేదు" అని గుహేశ్వర సాక్షియై మూడు లోకాలు ఘోషించుచున్నాయి సిద్ధరామదేవా నీకేమి తెలియదా? అల్లముడిటుల మూర్తిని ముందుజేసి అమూర్తి విషయం విస్తరించి నాడు ఔను, సాకారము ఫలప్రాప్తి నిరాకారము నాస్తి నిజమే ఐతె, రెండు అయ్యేవాడు ఒకడే గదా! ఈ విషయం లాగితే తగవు పెరుగుతుంది, ఇప్పుడెందు కని సిద్ధరామయ్య ఒప్పుకొని ఇట్లనుచున్నాడు

**సిద్ధరామయ్య :**

వేద ప్రియుడు కాదయ్యా నీవు శాస్త్ర ప్రియుడు కాదయ్యా నీవు! సోత్ర ప్రియుడు కాదయ్యా నీవు యుక్తి ప్రియుడు కాదయ్యా నీవు, ముక్తి ప్రియుడు కాదయ్యా నీవు దీని కన్నిటికి నీవు అసాధ్యుడవు చూడయ్యా! నీవు భక్తి ప్రియుడని మొరబెట్టితిని, కావుమయ్యా కపిల సిద్ధ మల్లికార్జునా! —౨౫

**వివేచనము :**

ఔను వెనుక నేను జెప్పిన దానిలో వేద, శాస్త్ర, స్తోత్ర, యుక్తి, ముక్తులకు ప్రియుడు అయ్యే మూర్తి స్వభావములు నీలో లేవు, ఐతె భక్తి ప్రియుడనేది తెలిసితిని స్వామి నా మనవి మన్నించి రక్షించ వేడుచున్నాను అని సిద్ధరాముడన్నది విని అల్లముడు బదులు చెప్పుచున్నాడు

**అల్లమ ప్రభు :**

భక్తి యుక్తులెరగిన వారెవరు? ఎరిగినవారి నెవరిసీ
గాం తన్ను మరచి, ఎదుట విడచి ఉండుటెరగిన అతడె

భక్తుడు. ఆ భక్తుని శివుడు మెచ్చడు నుడియందు
భక్తిని యాడి నడవకుండిన కడగానడు, శివుడొప్పుట
కల్ల మరచి కోప జ్వాల నుమిసి, ఎరిగివచ్చి వందనం
బాచరించితి ననెడి మాట కొప్పునె మా గుహేశ్వర లింగము? -౨౬

**వివేచనము .**

ఎన్నైన మాటాడవచ్చు, భక్తియంటె ఏమి? యుక్తియంటె ఏమి? దాని విధానము లేమని తెలిసినవారెవరయ్యా? నే చూడలేదు నీవేమైన చూచినావా లేక నీవె తెలిసికొన్నావా? చూడు భక్తి పరమావధియంటె - మొదట తాను భక్తుడ నేది స్మరణలో ఉండకూడదు ఎదుట ఆరాధించే ఇష్టదేవుని శ్రేష్ఠత తొలగి యుండిన అతడు భక్తుడౌతాడు అతనిని శివుడు మెచ్చుకొంటాడు అదే మాటలలో భక్తి యుండి నడతలో లేకుండిన కొనగానడు, శివుడొప్పడు కాదయ్యా పెద్ద పెద్ద మాటలాడుచున్నావు గాని నీ సందర్శనానికి వచ్చిన వారిని పిలుచుటే తెలియదు గదా - ఏలాటి మాటయైనను పలికినావా? అగ్గిమంటలు కక్కినావు గదయ్యా పెద్దవారి కృపవల్ల నేను చావలేదు అందుకె ఇప్పుడు వందనాల - సాష్టాంగాల భక్తిని ప్రదర్శన జేస్తున్నావు మాడి మసియై యుంటె అనుట తోడనే సిద్ధరాము డొచ్చి పాదాలు పట్టి, అయ్యా అయ్యా అంత మాటనకు అని అడ్డగించి ఇట్లనుచున్నాడు

**సిద్ధరామయ్య**

నా కోపమన్నది నీ కన్ను జూడుమా ఎందులోన
నే నెంతటివాడ చెప్పవయ్యా నీ జ్ఞాన తేజంబు ముందు
నా తెలివి ఎంతటిది చెప్పవయ్యా? -౨౭

మరియు

నా దిటపు భక్తి మీ రూపు చూడయ్య నా దిటము
లేని భక్తియూ మీరూపు చూడయ్య నాకు వేరె స్వతంత్ర
మున్నదే కపిల సిద్ధ మల్లినాథా? -౨౮

**వివేచనము .**

దేవదేవా! నీవు సర్వాత్ముడవు, అది నా కోపము గాదు తండ్రి! నీ కంటి ప్రతాపము నీ ఘనత, నీ చిద్విలాసము, నీ లోక నాటక వినోదములో నే నెంత వాడనయ్యా? నీ మహా జ్ఞాన ప్రకాశము ముందర నా తెలివి ఎంత ?

నా తెలివి యనేదేమున్నది నిజమైన భక్తికి మీరె కారణము అబద్ధమైన భక్తికి మీ రూపె కారణము మీ రింతగా తప్పులు నా తలమీద బెట్టుచున్నారు కాదా ఇది న్యాయమా? నాకు మీ రిచ్చిన స్వతంత్ర మెంతటిదో, తెలిపెదరా? ఆటలో సూత్రధారుడు తాళము తప్పి బొమ్మ మీద కోపించినట్లుంది భక్తి, వినయ, విధేయతలతో సిద్ధరాముడు సర్వ స్వతంత్రునిదే లోకంబులో నేమైనను కారణము అది మంచిదో చెడ్డదో విమర్శించి చెప్పేదెవరు? ఏమైన నాటకము చూచు ప్రేక్షకునివలె ఊరకుండవలెను మాటలాడుట అనివార్యము స్వామి లోపల ప్రతి ప్రాణికి ఉన్నదేదో చెప్పుకొనవలె గదా ఎదుటి వారికి తెలిసేదెట్లు నీ కృప గలిగితె నడతలు వచ్చేదెంతసేపు ఇట్టి మాటలాడుచున్నప్పుడు అల్లముడు సంతోషంగా విన్నాడు భక్తునికున్న మనస్తత్వాలు, శ్రద్ధాయుక్తులు విపులంగా యుండుటయేగాక యోగబలం పొందిన మహా జ్ఞానియని అల్లమదేవుడు తన మెప్పును బైబబెట్టక మరియొక ఆక్షేపణ ఎత్తుచున్నాడు

**అల్లమప్రభు**

కోపతాపంబనునది ఎరుకలోన భక్తి యుక్తి
యనునది నిత్యంబులోన భావంపురీతికి వన్నెలంచుకొన్న
నిర్భావికి అది సహజమగునే? వచ్చిన శరణుల విధము
లెరిగి శంక సందేహముడిగి నమ్మకున్న వెనుక ముందై
పోవు జూడుమా మా గుహేశ్వర లింగము ౨౮

**వివేచనము**

లోకములోనున్న మంచి చెడ్డలకంతా ఒకడెవడో ఉన్నాడని, వాడు సర్వాత్ముడని వాని తలకు కట్టేటె నేర్చుకుంటె వాడు భక్తుడనిపించుకొంటాడు గాని నిజంగా భక్తుడు కాడు లోకములో జీవ స్వాతంత్రము లేకపోలేదు

అందువల్ల కోపతాపాలకు వాని జ్ఞానము మూలము భక్తి దానిని నడపే యుక్తి ఆయా కాలానికి లోబడి యున్నాయి ఇక భావము ఏ వన్నెల తళుకులు లేక శుభ్రంగా ఉంచుకొంటె ప్రాజ్ఞులు ఒప్పుకుంటారు లేకపోతె అది సహజమై నిలువదు ఒక మాట గమనించు సిద్ధదేవా! వచ్చిన వారినెరుగని ఎరుకనుంచి ఏ మెరుగుటకు సాధనము కాగలదు? ఆదరణ, సత్కారము, వినయము, ఉప చర్య ఇవన్ని మనిషి జీవనానికి ప్రథమ పారము గదా ఇదియు వచ్చిన వానిదే తప్పేనా? ఈ రీతికి సమ్ముఖంగా వచ్చినవాడు వెన్నుజూపి వెళ్ళను అని అల్లముడు చక్కని విమర్శతో సామాన్య మానవ జీవధర్మముకూడ నడవలేని వాడు మనిషే కానప్పుడు భక్తుడయ్యేది ఎట్లు? అని యడిగినప్పుడు సిద్ధరాముడు ఏ స్వతంత్రాన్ని ఒప్పుకోలేని వాదమెత్తి ఇట్లనుచున్నాడు

**సిద్ధ రామయ్య**

మహా క్రోధంబు నీవు నాపైన బెట్టి, ఒల్లను,
రాననుచు పోవజూచెదవ అయ్యా చెయ్యి పట్టిన వదలించు
కొనెదవు నా ఉరంబున బట్టిన తప్పించుకొనెద వెట్లు?
నీ విటుల పోవు త్రోవలన్ని నిలిపెదను వినుమా సూక్ష్మ
తనువుతో పట్టిన ఏలాగు విడిపించు కొందువు చెపుమా
కపిలసిద్ధ మల్లికార్జునా? ౩౦

**వివేచనము** ·

అయ్యా బెదరించకు వాదించి నోరుగొట్టకు ఉగ్రమైన ఆగ్రహాన్ని చూపిన నెపం ముందుంచి రాను, ఒల్లను పొమ్మని నన్ను వెనుకకు త్రోసి మెత్తగ జారిపోవజూసెదవా స్వామి? గట్టిగ ముంజేయి పట్టితె కసరుకొందువు గాని, నా బలమైన భుజాలలో ఇమిడించుకొంటె తప్పించుకొందువా? కానిమ్ము నీవు తప్పించుకొని పోవు దోవలెన్ని వున్నాయో అన్ని ఆపెదను దేవా! ఒక్క మాట నీవు ఆకాశకాయుడన్న-ఎవరికి దొరకనన్న నను పట్టేవారు లోకములో ఎవరు లేదన్న ఘనతలు అయ్యగారి కెంతగానో కొండంత పెరిగినవి మే మన రాదు గాని సూక్ష్మ శరీరము లేదా! దానితో మిము బంధించడానికి రాదా యోచించండి పట్టుకొన్నప్పుడు దానికి చిక్కక పోదురా? చెప్పండి యని సిద్ధ

రాముడు మహా ఆవేశ భరితుడై పట్టెదని ప్రభునిమీద సవాలు చేసినది విని అతని ఆధ్యాత్మిక శౌర్యాన్ని, సామర్థ్యాన్ని మెచ్చుకొని అల్లముడు మరల ఇట్లను చున్నాడు

**అల్లమ ప్రభు .**

అంగంబున పట్టెదనన్న చిక్కడు ప్రాణముచే
పట్టెదనన్న దొరకడు భావంబున పట్టెదనన్న చిక్కడు
సూక్ష్మతను మనము కొనమీద పట్టెదనన్న చిక్కడు
భావాతీతమైన నిరాకారంపు ఘనము సుజ్ఞాన సమ్ముఖంబు
నకు అసాధ్యంబు చూడుమా! గుహేశ్వరుని శరణుల
నీవెట్లు నిలువబెట్టుదువు చెప్పుమా సిద్ధ రామయ్యా? ౩౧

**వివేచనము :**

చిత్త చాంచల్యపు సాహసమే కాని చిక్కరాని సర్వ స్వతంత్రమైన పరవస్తువును దేహ ప్రాణ భావముల నుంచి పట్టెదననుట భ్రాంతి నీవు పట్టెద నని శపథంబు లాడేది నీ యట్లు గాదు ఆ విధానమే వేరు సూక్ష్మమంటున్నావు దాన్ని నీకు పోల్చుకున్నావు కద అది సూక్ష్మము కాదు సూక్ష్మాతిసూక్ష్మము పట్టుటెట్లు? అదిగాక భావమంటావు అదియు గాదు దాని కవతల యుండేది నిరాకారము కూడ సుజ్ఞానానికి దొరకదు సాకార-నిరాకారాలకు అతీతము ముఖ్యంగా అదేది కాదు కాని దానిని నీవెట్లు నిలబెట్టెదవు ఇదంతా నీవను కొన్న పిచ్చి పిచ్చికి ఏ అర్థము లేదని నిర్ణయాత్మకంగా పలికినప్పుడు సిద్ధ రాముడు ఇది అసాధ్యము ఈ రీతికి దొరకదని ఇట్లనుచున్నాడు

**సిద్ధరామయ్య :**

నన్నపుడే చెరబట్టినారు గదమీరు మిమ్ము పట్టు
వారేపట్టెదరు తనువుండి తను వేరైన వారు, మిమ్ము పట్టు
వారే పట్టెదరు మనసుండి మనసు వేరైనవారు, మిమ్ము
పట్టు వారే పట్టెదరు చేయుండి చేయి వేరైన వారు,
మిమ్ము పట్టువారే పట్టెదరు కన్నుండి కన్ను వేరైన

వారు ఇన్ని యున్నవారు మొదలు మిమ్ము పట్టలేరు
కపిలసిద్ధ మల్లినాథా, మిమ్ము ఉంచి నిలుప నేనెంతటి
వాడ, కరుణించి రావయ్యా నా దేవర దేవా! ౩౨

**వివేచనము**

స్వామి! తమరు చెప్పినది కాదనడానికి రాదు ఎందుకంటె సర్వ స్వతంత్రుడవు నీవొకడే చిక్కిన, చిక్కకపోయినా, చెల్లుతుంది ఇచ్ఛామాత్ర మున జగమంతయు సంచలనమౌతుంది మీరు దొరకలేనంటె నేను దొరకెద నెన్నెందుకు విదలించుకొంటారు? ఇక్కడికి తమరెప్పుడు దయచేసినారో అప్పుడె తమ అనుగ్రహమున పట్టుకొన్నారు ఇక నేను పట్టుకొనుస దెక్కడి మాట తండ్రి! అవసరమేమి? ఐతె నా మాటగా నేను మనవి చేయుటలేదు మిమ్ము పట్టువారున్నారు వారి తను, మనముండి అవి తమవని అనుకొననివారు కరము, కన్నులుండి తమవి గావనిన వారు పట్టెదరు పట్టే సాధనాలు ఇన్ని యున్నవారంత పట్టెదరని కాదు నీవు పట్టుబడితె మాత్రము సులభము అన్నిటి కన్న తమ కృపా బంధనమే సర్వసౌఖ్యము జ్ఞాన బలముచే నిను బంధించే సాధనమున్న భక్తి నుంచి ఏమైన జేసుకోమని తమకు చిక్కుటె మంచిది గాన తమరు దయచేసి నా మఠానికొచ్చి అనుగ్రహించవలెనని వేడుకొన్న సిద్ధరాము నికి అల్లయ్యస్వామి ఇటువనుచున్నాడు

**అల్లమ ప్రభు**

గతిచెడి ధృతిచెడి మతిచెడితినయ్యా ఎడచెదనన్న
శక్తిలేదు పలికెదనన్న జిహ్వాలేదు ఎదుటివారి ఉపచారము
సరిరాదు మాకు వచ్చిన విధముతెలిసి, పనిపాటలెరిగి చేర
వచ్చిన శరణునకు వేరొక ఏకాంతమను సందేహమున్నదా?
ఎడములేని ఘనములో చేరిన వెనుక తిరిగి వచ్చుట
కెడమున్నదే మా గుహేశ్వర లింగునికి 33

**వివేచనము**

సిద్ధరామన్నా! చేతకాదు నాయనా! నీవేమొ విశ్వాస ప్రేమలతో నా మఠానికి రమ్మన్నావు నా స్వభావమే ఒకతీరు ఎందుకో చెప్పలేను పిలిచినది

తప్పని కాదు అది సంప్రదాయమే ఐతె నాకు నడచుటకు శక్తిలేదు మాటాడు టకు నాలుక పలుకదు ఇదంతా చెప్పేదెందుకంటె ఎదుటున్నవారు పలికె మాటలు అంతగా మాకు నచ్చదప్పా! చూడు, వచ్చిన వారి రీతి, వారి స్వభావము, కార్య విధానము లెరిగిన శివ శరణులకు మరి ఏకాంతమను సంశయి మెందుకయ్యా! సందు లేక జగమంత నిండిన ఈశ్వరునకు ఒక ప్రత్యేక ఏకాంతముండునా? ఎక్కడున్న అక్కడే చేరుట ఉన్నచోట భక్తి చేయవలెగాని అక్కడికిక్కడికి వచ్చుటకు తెరవేది?

సరళంగా స్పష్టంగా సిద్ధరామయ్యకు ఈశ్వరుని సర్వవ్యాపకత్వాన్ని వివరించి చెప్పిన అల్లముని యుక్తికి మచ్చుకొని సిద్ధుడు విన్నవించుకొంటున్నాడు

**సిద్ధరామయ్య**

తెరవులేని ఘనము గురుతుగా వచ్చిన కారణ
మేమి చెప్పుమయ్యా? భక్తి కారణమిచ్ఛకు వచ్చిన
మీద ఉపచారమునకు తెరవేది? కపిల సిద్ధ మల్లినాథా,
వేంచేయుమయ్యా కరుణాకరా! ౩౪

**వివేచనము**

మహాస్వామి! మీరు చెప్పుతత్వము ఒక దానికొకటి సంబంధమున్నదా? ఏకము అనేకములకు మూలము ఒకటే గద అది నీవేయైయుండి ఇట్లు పలుక వచ్చునా? కాళ్ళులేవు నాలుకలేదు శక్తిలేదు ఈ మాటల కర్థమేమొ తమరే చెప్పవలెను సర్వభరితము వ్యక్తియై అపరిమితయై వచ్చి, వచ్చిన ఉన్న ప్రమాణాన్ని బట్టి చెప్పితె అసమర్పకము భక్తిలోభానికి వశుడై మూర్తిగా పిలువ కయే వచ్చి భక్తుడు పిలిచినప్పుడు రాక మాటలడ్డుబెట్టి మీ విచక్షణ, విచార తర్క పాండిత్యము నిను నమ్మినవారి మీద విసరితే వారేమి చెప్పగలరయ్యా? ఎక్కడినుండియో ఇక్కడికి నడచివచ్చిన శ్రీపాదములు కొంచెము ముందుకు నడువలేవా? ఎంతైన ఎంతపెద్దవారైన తమకుతామె వచ్చినవారు ఎక్కువ గౌరవాన్ని, పూజోపచారాలను ఆశించేది యుక్తముగాదు ఇది స్వామి భృత్యునింటికి వచ్చినట్లు-భృత్యునితప్పులున్న ఎంచరానివి తమరు కరుణాసముద్రులు దయచే

నా విన్నపము మన్నించిరావలె స్వామియని సిద్ధరాముడు అల్లముని అభిప్రాయాన్ని సయుక్తితో త్రోసివేసినాడు అతడు వచ్చిన కారణాన్ని బైటబెట్టినాడు ఏ దాక్షిణ్యము లేక పిలువక వచ్చినవారు అంతఎ పట్టు పట్టురాదన్నప్పుడు ప్రభుదేవునికి కోపమేమియు రాలేదు ఒకమాట వాదానికి చిక్కింది అది స్వామి భృత్యన్యాయము దాన్నిబట్టి అల్లముడు ఆక్షేపమెత్తి ఈలాగన్నాడు

**అల్లమ ప్రభు .**

భక్తుడున్న చోటికి కర్తుడొచ్చిన అట్టిట్టనక నమ్మ
వలెను చూడయ్యా! కర్తుని చూచి భృత్యుడు మంట
లుమిసిన మరి కర్తుభృత్య భావంబునకు సంబంధమేమి?
తప్పి తప్పి తిద్దుకొంటినన్న అది పరశుద్ధియగునె? గుహే
శ్వరలింగుని శరణుడెవరన్నది నీకేమి తెలియును పొమ్మా
పిచ్చిరామా! ౩౫

**వివేచనము .**

అసంబద్ధము భృత్యుడు నీవైతె కర్త వచ్చినప్పుడు నీ వర్తనమెటులుండె? ఉగ్రమై ఉదాసీనమై ఉండలేదా? మరిమరి ఆ శూ చెందుకు? ఇప్పుడు నీవు పిలువడానికి నేను రావడానికెక్కడైన సంబంధముందా చెప్పు పిలిచితె వచ్చుటకు, పిలువకపోతే రాకుండుటకు ఎవరి ఆజ్ఞలో లేనివాడను సంచారము నా ఇచ్ఛామాత్రము ఒక మహాక్షేత్ర నిర్మాణము, ఉన్న మన్నురాయితో చేసి భూకైలాస నిర్మాతృవనిపించుకొన్న నిన్ను చూడడానికి రాలేదు ఉన్నచోటనె ఉన్న నీ క్షేత్రాచర్యము, లోకానికంత ఆదర్శము గాదు నడయాడు జీవ క్షేత్రాలు నిర్మాణము జేయుటె లోకోద్ధరణానికి పరమోపాయమని తెలుపవచ్చిన వారిని నీవెట్లురుగుమువని బిరబిర మాటలు భరంభున సిద్ధరామునిపై కరివంగా రాలినప్పుడు, సిద్ధరాముడు వినమ్రుడై తలవంచినాడు స్వామికి నా మీదున్న కోపము పోలేదు ఆయన అనుగ్రహం పొందితినని అనుకొన్న లోపలనె తప్పుతుంది ఆయన అనుగ్రహం పొందే వరకు ఏదీ నిర్ణయముకాదు దీనికి మూలము పిలుపులో నా మదమన్న మాట అహంకారము గదా, తప్పైనదని సిద్ధరాముడు ఇట్లనుచున్నాడు

**సిద్ధరామయ్య**

అయ్యా, మిము గాంచువేళ నమ్మక, నయమెంచక, శరణనుపెరుగక వ్యర్థమై అహంకారంబులో బడి చెడితి చూడయ్యా! చెరిపి చింతించి వెదకెదనను మరులు నేనయ్యా! కపిలసిద్ధ మల్లినాథయ్యా, పాలముంచు నీళ్ళముంచు నీవె గతి నీవె మతి ౩౬

మరియు

నా భరణభారంబు మీదయ్యా, నా హాని వృద్ధి మీదయ్యా! నను మరిమరి బాధించకయ్యా తండ్రి, నీబాధ నా ప్రాణంపు యమబాధ కపిలసిద్ధ మల్లినాథా, రక్షించు భక్షించు మీ ధర్మంబువాడ నేను ౩౭

**వివేచనము**

దిక్కుతోచక సిద్ధరాముడు అల్లముడు పలికిన వాడిపలుకులకు బెదరినాడు, బాధపడినాడు భక్తిసాధనలన్ని తన అహంకారములో మునిగిపోయినవని విచారపరవశుడైనాడు ఇక వేరెంచుటకు వీలులేదు అతని దయామృతమే తన జీవితము లేకున్న మరేమియు పొందుటకు సాధనము లేదు బిరబిర వచ్చినాడు దుఃఖ భరితుడై ప్రభుదేవుని పాదారవిందములు పట్టినాడు నా అహంకారము నాకీ గతి తెచ్చినది స్వామి! పాలలో ముంచిన, నీట వేసిన నీవే నాకు గతి మతి నా గుణంబెంచకు నా భారమంతా నీదే తండ్రి నన్ను పీడించకు నే తాళజాల అయ్యా, మీకు చిక్కినవాడ నేను ఏమైన జేసుకొమ్మని ఏడ్చుచున్న సిద్ధరాముని ఆతురముతో అల్లముడు పైకెత్తి కన్నీరు తుడిచి, సిద్ధా! నేను కరినాత్ముడను యోగకళలు వెలిగ్రక్క కన్నులలో బాధాకరమైన నీరు దెప్పించితి నాయనా: ఏడ్వకుమని సమాధానంగా ఇట్లనుచున్నాడు

**అల్లమ ప్రభు**

బయట ఆడివచ్చెనంచు పలికించక ఊరకుంటిని నా మనంబు నొచ్చి తాకిన మీ కడ ముందైతిని గద్గదించి బెదరి కాలు మీద పడిన కన్నీరు మజ్జనము జేసినట్టయ్యె అదిగని పైకెత్తెను మా గుహేశ్వర లింగము ౩౮

**వివేచనము**

హా! హా! నాయనా సిద్ధరామదేవా! కన్నీరు చూడజాల నీ అఖండ తేజో విలాసము మరుగు కాదు తల్లియున్నదంతా తన కొడుకు సూది మొన యంతైన తన నుంచి వేరుగాక యుండవలయునను స్వార్థ మమకారముతో ఎక్కడి కైన పోయిన దానిమీదనే మనసుంచియుండును రాక తడవైతె వాడు తన్ను మరచి అన్యమేదో మెచ్చుకొన్నాడని మోసంగా అసమాధానంగా ఉంటుంది వాడు వచ్చి అమ్మా! అంటె అంతయు మరచిపోవును అటులనే చూడు నీ వొచ్చి పాదములను నీ కన్నీటితో అభిషేకము చేసినటులై అంతయు నిర్మలమైనది ఇక చాలు మాటలు కొంత కారిన్యమై నీ నొప్పికి కారణమైనదని అల్లముడు అత్యంత ఆదరమున మాతృవాత్సల్యభరితుడై సిద్ధరామునికి సమాధానంబు చెప్పిన సిద్ధరామయ్య కినుకతో కొడుకు తల్లిని పరుసంబులాడినట్లు ఇట్లనుచున్నాడు

**సిద్ధరామయ్య**

నా తను కరిగించిన కొరగించిన దుఃఖమెవరి
దయ్యా? అయ్యా అయ్యాయనుచు ఏడ్చు రోదనంబెవరి
దయ్యా? మరపు అను శూలానికి గురిచేసిన వారెవరయ్యా?
హాహాయను ధ్వని వినలేక కని కరుణించి శిరము పైకెత్తి
నా కన్నీరు తుడిచే కపిల సిద్ధ మల్లినాథుడు చూడుమా! ౩౯

**వివేచనము**

తండ్రీ అల్లమదేవా నీకొక వినోదము నాకు ప్రాణసంకటము నా జ్ఞానమును అజ్ఞాన శూలానికి బెట్టిన నీవుకావా? నా తనుమనాలు బాధించి కన్నీరు తెచ్చినది నీవుకాదా? అయ్యా అయ్యా హాహాయని నీవే దిక్కని పాదములమీద పడినప్పుడు నాస్వామి ననుగన్న తండ్రి కన్నీరు తుడిచి శాంతింపజేసెనని సిద్ధ రామదేవుడు అల్లముని కరుణను కొనియాడుచుండగా ఆవేశ భరితుడై సిద్ధ రామునిట్లు అల్లముడు స్తుతించుచున్నాడు

**అల్లమప్రభు**

(సిద్ధ వీరణ్ణొడెయ గారి గద్యము)

ఇట్లు సిద్ధరామయ్య దేవునికి కుర్బాణంబుగని కృపచే, శిరము పట్టెత్తి, కన్నీరు తుడిచి ఆ ప్రభుదేవులు ప్రసన్నులై పరమయోగి, శుద్ధ సాత్వికయోగి, సచ్చిదానందయోగి, నిత్య పరిపూర్ణయోగి, శివయోగామృత సేవ్య సంతుష్టయోగి, సకల కరణ మరణ రహితయోగి, సర్వేంద్రియ సుఖ నిర్మూలయోగి, సంసారవనదావానల యోగి, మాయాహర యోగి, మాయామద దూర యోగి, మాయామద మథనయోగి, సగుణయోగి, సన్నిధానయోగి, నిర్గుణయోగి, నిరంజనయోగి, సకల నిష్కలతత్త్వ శిరోరత్నయోగి, అఖండ పరిపూర్ణయోగి, అప్రమాణ గుణ భరితయోగి, అప్రతర్క్య చారిత్ర యోగి, అసాధ్య సాధక యోగి, అభేద్య భేదక యోగి, సుజ్ఞాన ప్రభామయ యోగి, మహా జ్ఞానైక్య చైతన్య యోగి, కాయగుణ ధర్మ కర్మ సంహార యోగి, బ్రహ్మాండ సందోహ సంభూత కారణ యోగి, నిరవయ నిర్లేప నిః పాపయోగి, ఇహలోక పరలోక గతి రహిత యోగి అనుచు కొనియాడి ఆ సిద్ధరామ దేవుని గాఢాలింగనంబు జేసుకొన్నాడు

**వివేచనము**

ఇరవై ఎనిమిది రీతులగా సిద్ధరామదేవుని పూర్ణయోగాన్ని వర్ణించినాడు ఎంత వర్ణించినను తృప్తిలేక అల్లమస్వామి మరియు స్తోత్రము జేయుచున్నాడు

మీ యందు సన్నిహితుడై, నిజమెరిగి కూడిన శివయోగిని కన్న నా మన మెడబాటు చెందదయ్యా! నా తను కౌగిలించకుండదయ్యా! నా ధ్వని కొనియాడ కూర కుండదయ్యా! గుహేశ్వరా మీ శరణ శివయోగి సిద్ధ రామయ్యను ఆలింగించి, అధిక్రముడిగి మోదమంది నమో నమో యనుచుంటినయ్యా! ౪౦

మరియు

కాయమందు కరణంబు లేదు, ప్రాణంబునందు
భావంబులేదు భావంబునందు భ్రమలేదు నవనాళంబు
లోపల సంచలనంబు మున్నె లేదు, బ్రహ్మ రంధ్రమందు
ఎరుక తడియారిన శివయోగి గుహేశ్వర శరణ సిద్ధ
రామయ్యా, నినుగని నా భవంబు నాస్తియయ్యె వినుమా! ౪౧

**వివేచనము .**

మహాయోగీశ్వర సిద్ధరామదేవా ! నీ మహిమ నోరార కొనియాడకుండ వుండలేను నీ యోగాంగాలింగన సుఖానుభవము పొందక యుండజాల నను నే మరచి శరణార్థు లర్పించెద-నీ సందర్శన భాగ్యమునుంచి నా భవబంధనము వీడెనయ్యా కాయముంది, ఇంద్రియ చంచలతలేదు ప్రాణముండి, భావ కల్పనలు లేవు భావ భ్రమలు లేవు నవ నాళములున్నవి గాని వానిలో గాలి సంచారము లేదు బ్రహ్మరంధ్రముంది అక్కడ నేను బ్రహ్మమనే తెలివి గురుతుకూడలేదు నీయట్టి యోగశక్తినిగని నేనానందపరవశుడనైతినని అల్లము దేవుడు కొనియాడుట విని సిద్ధరాముడు సమాధానము చెందక ఇట్లనుచున్నాడు

**సిద్ధరామయ్య**

యోగంపుజాడ నాకేమి తెలుసునయ్యా? యోగము
శివశక్తి సంపుటమై యుండుగాని, శివశక్తి వియోగమై
యుండదయ్యా, హృదయకమలంబునందు భ్రమియించక
యుండువాడు నీవె కాని నాకు వేరె స్వతంత్రము లేదు,
చూడు కపిల సిద్ధ మల్లికార్జునా! ౪౨

**వివేచనము**

లేదు లేదు మహాదేవా ! నీవు నాయట్టి కోపతాప యోగములో మునిగి వ్యర్థముగా జీవితము గడపిన వానిని, తమ దయార్ద్ర కృపా విశేషమున వినలేని వర్ణనలతో కొనియాడి చిన్నపుచ్చకుమయ్యా స్వామి ! ఘనానికి ఘనుడైన ని ఘనములో తృణమైయుండు నిన్ను నీవెత్తిచూపినపుడు ఘనముగా ఏదయైన ఎట్టిదైన వెలుగుతుంది నేను స్వతంత్రుడను కాను, శివయోగికాను యోగ

మార్గము తెలియదు యోగము యోగమందురు ఆ యోగము శివశక్తి సంపుటమై యుండునుగదా స్వామీ! జ్ఞాన క్రియా యోగమిది అటుకానిచో యోగమెట్లు. వియోగానికి యోగముంటుంది యోగానికి యోగము లేదు హృదయ కమల మధ్యంపు చలనమే యోగానికి మూలము ఆ చలనము లేనివాడు యోగి కాడు వియోగికాడు ఆ నిశ్చలత సర్వతంత్రుడవు నీవు కాక మరియొకరులేరు అని సిద్ధరాముడు కొనియాడి మరి ఈలాగున స్తోత్రము జేయుచున్నాడు

ఉత్పత్తి స్థితిలయలులేని అభవుడు నీవుచూడయ్యా!
నాకు వేరె స్వతంత్రము లేదు వినుమా! నీ ఇచ్ఛా
మాత్రమున నేనుండెద, పెద్దవాడవు నీవె దేవుడవు నీవె
కపిలసిద్ధ మల్లికార్జునా నేనెంతటిలో నెంతటివాడ చెప్ప
వయ్యా ప్రభురాయ? ౪౩

చెప్పు చెప్పు స్వామీ! తమరన్న దానిలో నేనే దానికయ్యేదను శివశివా! సృష్టి స్థితిలయాదుల కట్టిట్టులున్న దిట్టవు నీవు జన్మ జరామరణ రహితుడవు నీవు నీ ఇచ్ఛలో చరించు భృత్యుడ నేను నేనెంత మీరెంత? అయ్యా! అయ్యా! వద్దువద్దు, నన్ను పెద్ద జేయవద్దు, పెద్దకు పెద్ద నీవు. దేవునకు దేవుడు నీవు నను సిగ్గుపరచకు నీ కరుణామృతపుతెరలో నన్ను బైట బెట్టక మూసుకో తండ్రీ యని వివిధ భంగుల దాసోహం భావమున సిద్ధరాముడు విన్నవించు కొన్న విన్నపము విని మన మలరి అల్లముడు సిద్ధరాముని నిర్మోహ నిర్వంచక, నిష్కల్మష భక్తి సౌందర్యమునకు తాళలేక రెండు చేతులు పట్టి ఇట్లను చున్నాడు

**అల్లమ ప్రభు**

మనము మనము సమరసంబైనవారు ఎట్లుండె
దరో అట్లుండురీతి తెలియరాదు చూడుమా! ఎదుటున్న
ఇచ్ఛ ఎరుగకుండెదరు లోపల జూచిన బట్ట బయలు
నందుందురు గుహేశ్వరుని శరణులు తాము లేని మహి
మలున్నది నీ నుంచెరిగితిని చూడుమా సిద్ధరామయ్యా! ౪౪

**వివేచనము .**

ఇదివరకు ఎరుగనిది ఎరిగితిసయ్యా సిద్ధరామా! శివయోగ విధానము అవగతమైనది శివశరణులు మనము మనము కూడి చరించుచేమొ తెలిపినా నయ్యా వారు ఏలాటి అభిలాషలూ బైటలేనివారు లోపల బయలై యుండువారు అంటె తామున్నదే తామెంచని మహిమలు ఈనాడు నిను జూచి తెలిసితిని, సకల పాపవర్జిత నిర్జర సార్వభౌమా, సనాతన సిద్ధవిద్యాభిరామా నిన్నేమని స్తుతి యించవలెనో తెలియకున్నాను అని అల్లమదేవుడు ఏ పెద్దరికము తనయందు ఉంచుకొనక అందరికన్న తాను చిన్నయును నిరహంభావముతో స్తుతించుచుండ సిద్ధరాముడు అనుకొనుచున్నాడు అహో మహనీయ మహిమాన్విత మహోదారు డీతడు లీలాన్విత నిత్య నిరంజనుడు ఇతడు ఒప్పినది లోకమొప్పును కాదన్నది ఎట్టి కాలకాలుడైన నిరోధించలేడు అని అనుకొని, మహాస్వామీ నా మనవి వినండి అని సిద్ధరాముడు ఇట్లనుచున్నాడు

**సిద్ధరామయ్య :**

అగునది కానిది, ఒప్పగ జేసెదరు అయ్యా, మీ
మెప్పు సొగసు జూడయ్య! నీవెట్లు చూచిన అట్లుండుగాని,
ఔను కాదనువారు లేరు కనుమా కపిలసిద్ధ మల్లికార్జునా॥ ౪౫

**వివేచనము**

మీరు దేవాధిదేవులు పరమ పునీతులు సర్వాంతర్యాములు, సర్వ స్వతంత్రులు తమరు ఔనన్నది ఔను, కాదన్నది కాదు అవి రెండూ నీ స్వాతంత్ర్యము లోనివి లోకానికి చిక్కని అసాధ్యములు నీవు వద్దంటె అయ్యే పని కాకపోవును కానిపని కమ్మంటె ఆ క్షణమె ఔతుంది ఈ విశ్వ చేతన మంతా నీ ఇచ్ఛలో అణగియుంది నీవెట్లు సంకల్పించెదవో ఈ విశ్వమట్లు మెంగుతుంది అల్లమయ్యా! ఏదియుకాని నీవు అన్నియు ఐనావు అంతయు నీవు చెప్పినట్లె నను గొప్పజేసి పలికినా నీవే గొప్పవు చులకనజేసినా నీవే గొప్పవు నీ పలుకుల వెలుతురులో వెలిగెడివాడ నేనేమనగలను? అనుటకు నాకేమి స్వతంత్రము? సర్వ స్వతంత్రుడవు నీవు అని సిద్ధరామయ్య పలికిన వినయమున కలరి అల్లమస్వామి సంతోషముతో ఇట్లనుచున్నాడు

**అల్లమ ప్రభు :**

స్వతంత్ర పరతంత్రమునకు గురుతేది చూడుమా!
తానన్నది సళించి ఎదురన్నది మరచి భావదగ్ధమై
యున్న అది స్వతంత్రము నీవనుట ధిక్కరించి,
తానన్నది నిఃకరించి ఉభయ భావంబున సన్నిహితమైన
పర తంత్రము స్వతంత్ర పరతంత్రంబుల రెండునూ
వివరించక తన్ను మరచియుండువాడు ఉపమాతీతుడు
గుహేశ్వరుని శరణులు దేహంబులేని నిర్దేహులనునది
ఈనాడు కనుగొంటి జూడుమా, సిద్ధరామయ్యా! ౪౬

**వివేచనము**

సిద్ధరామ దేవయ్యా! ఒక రహస్యము కనుగొన్నాను నీ దర్శన భాగ్యము నుంచి నిర్ణయించుకొన్నాను శివశరణులు నిర్దేహులు స్వతంత్రులు గారు పరతంత్రులు గారు స్వతంత్రాపేక్ష జీవస్వభావము పరతంత్రాపేక్ష శివ స్వభావము జీవ శివత్వాలు వేరు కావడమువల్ల ఈ స్వతంత్ర పరతంత్ర మేర్పడినది తానెవరనునది మరచి ఉపాసనకై ఎదుటున్న ఇష్టలింగాన్ని లక్షింపక, రెండెంచని భావమైనపుడు అది స్వతంత్రము నీవనుట - తాననుట ఈ ద్వంద్వ భావములు సామరస్యమైనపుడ పరతంత్రము ఈ రెండు ఉపాధులకు చెందినవి ఒకటై యున్నది రెండుగా ఎపుడు మారినదో అపుడే ఈ స్థితులు ఏర్పడినవి విభిన్నస్థితులు కానివారు, ఉపాధులకు చిక్కనివారు స్వతంత్ర పరతంత్రులకు చిక్కనివారు కనబడు దేహముండినా వినబడు మాటలుండినా, లోక క్రియలు నడచినా, నిర్దేహి, సిద్ధరామా ఈనాడు నినుజూచి శరణ నిజతత్త్వము జూచితినని అల్లముడు స్వతంత్ర పరతంత్ర తత్త్వవిమర్శచే శరణ తత్త్వము నిర్ణయించి పలికిన అది విని సిద్ధరాముడు అంటున్నాడు

**సిద్ధరామయ్య :**

మాట వున్నంతవరకు కాయంబు పోదు తల
వున్నంత వరకు ప్రాణ సూతకంబు విడదు కాయ జీవ
ముల కట్టుసందు విడదీయలేను, నేను నిర్దేహియన్న

నవ్వరే మీ ప్రమథులు? నా అంతరంగములో నున్న అవ
గుణంబు త్రుంచి నీ రీతి చేసిన నేనుండెదగాని వేరు గతి
కాన జూడుమా! అయ్యా కపిలసిద్ధ మల్లినాథా, వెనుక
లేదన్న నేమి ముందు ఎటులగును? ౪౭

**వివేచనము**

అయ్యా అల్లమప్రభు! నన్ను ప్రశంసించుట తమ కౌతకలీల స్వామి, నన్ను నిర్దేహియని విశేషించినారుగదా అది తమ ప్రమథులు సమ్మతించరు. మాటలు ఎంతవరకుండునో అంతవరకు దేహముండును ఇది అనివార్యము, దేహముంటె మాటలు తలపులున్నంతవరకు ప్రాణ మలిన ముండుట తప్పదు. ప్రాణములేక జ్ఞాపకాలుండుటకు తావులేదు మరియొకటి ఈ కాయాన్ని, జీవాన్ని చేర్చి కుట్టిన మీ దారపు కుట్టేమొ నాకు విప్పడానికి రాదయ్యా ఇట్టి అస్వతం త్రుడను, అజ్ఞుడను నిర్దేహి అయ్యేది ఎట్లయ్యా నా మనవి విని నా అంతరం గములో నున్న అవగుణాలు కాల్చి, నీవున్నట్లు నన్ను జేసుకుంటె ఉండెద. లేకపోతె నా గతి దుర్గతి ఎన్నిజెప్పిన, విన్న, వెనుకైనదేమొ ఐనది అయ్యా ముందు నా గతి తెలివియ్యండి, అని వినయంబుతో సిద్ధరామయ్య అడిగినప్పుడు ఆతని నిరహంభావ నిర్మలతకు మెచ్చి అల్లముడు సంతసముతో ఇట్లను చున్నాడు

**అల్లమ ప్రభు**

అవునవును, భక్తి, భావంపు భజన ఎటులో అటు
లుండు అంతరంగపు తెలివికి ఆచారమే కాయము
ఆచార కాయము లేకున్న తెలివికాశ్రయము లేదు తెలివి
ఆచారమందు సమరసమైన లింగైక్యుని, క్రియా బద్ధుడని
పలికితె పంచ మహాపాతకము నీ తెలివికి అంకితుడై
ఆచారమునకు కింకరుడై, మా గుహేశ్వరుడు నీ
వశంబయ్యె, నీ సుఖ సమాధిని చూపరావయ్య సిద్ధ రామ
దేవా! ౪౮

**వివేచనము:**

అదిసరి! అదిసరి!, సిద్ధరామదేవా, సహజ యోగీంద్రుడవు నీవు సత్య మునే పలికితివి లోపలున్న జ్ఞానము ఆచారమై ప్రయోజనము పొందవలెనంటె కాయమె మూలము ఆచారము కాయము లేకుంటె జ్ఞానమెంతున్న ప్రయోజ నానికి రాదు కావున తెలివి ఆచారమందుకూడిన లింగైక్యుని లోకములో సంసార తాపత్రయాలలో బడి భవపాశబద్ధులైన జీవులట్లు ఎంచరాదు లింగైక్య వర్తి గతాంగ వికారియన్నట్లు శరణుడు లింగ సమాధి గాడు లింగ చేతనుడై సర్వము లింగార్పిత ప్రసాదియై లోకవర్తనలో అంగ వికారిగాక యుండు అది తెలియక మనవలె అతడూ, అంటె మహా పాతకమునకు గురి కాగలడు ఏ సంశ యము లేని నీ పరిశుద్ధ సిద్ధాంగ పావిత్రమునకు, ప్రకాశమునకు, పరిమాణము నకు, ప్రమాణమునకు మా గుహేశ్వరుడు నీ చేతికి చిక్కె ఇంకేమి అంతా నీ వశము చేసుకొన్నావయ్యా పోవుదము నీ సాధనా మంటపము చూపరా, సిద్ధరామ దేవా యని అల్లముడు పరమోత్సాహముతో చేయి బట్టుకొని తానె ముందు ముందు నడుచునప్పుడు సిద్ధరాముడు, ఆనంద బాష్పాలతో తన ధన్యతను కొనియాడుచు నా స్వామి నా ఒడయడు కరుణించె అప్పుడు పిలచినప్పుడు నాకు కాళ్ళు లేవు, శక్తి లేదు, కండ్లు లేవు ఎదుటి వారి ఉపచారములు నాకు సరిరావు ఏముంటె ఉన్న చోటనె కానీ, అని యుండె అప్పుడెందుకట్లన్నాడో ఇప్పుడు తెలిసె నాదిగా చూడవలెనని అహంభావముతో ఆహ్వానించినందున అట్లనె ఔను మరి తప్పుగాదా అది ఇప్పుడాయనే నన్ను పట్టి ముందు పోవు చున్నాడు ఎంతాతురము ? దయానిధియని అనుకొనుచు సిద్ధరామయ్య ఇట్లను చున్నాడు

**సిద్ధరామయ్య :**

నా ప్రియుడు వలచి వలపించి వేధించుచు నన్ను
రమ్మ రారమ్మ అనుచు, నా కరుణ హరణంబు చూపిన
తానె వలచి వచ్చి నా తలనెత్తి నిమిరి నా ఇంటికొచ్చె
కపిలసిద్ధ మల్లినాథుని ప్రేమమెంత ఘనమో నేనేమని
ఉపమింతు ?

**వివేచనము:**

నా ప్రాణనాథుని ప్రేమము అపారము అతడు కరుణించి నా కోరికదీర నా యింటికొచ్చె ఆహా నా భాగ్యమేమని జెప్పుదు వలచి వలపించి నా తలం పెరిగి అనురాగ రసధార చిమ్ము చూపులతో నన్నులరించి, హృదయ కమలము వికసింప నా నెనరు గైకొని చెయిబట్టి నా తల నిమిరి దయాఘనుడై నా ప్రాణ నాథుడై నా మతంబునకు వేంచేయుచు నాకు కృతార్థత నిచ్చెయనుచు సిద్ధ రామ దేవుడు భక్తి రసావేశమున అల్లముని చెయిబట్టి పోవుచు, తలఎత్తి- ఆతని ముఖ వికాసము జూచి పులకాంకితుడై ఇట్లనుచున్నాడు

అంగము లేనివాడని నేనెరుగ, మహాలింగమందు
సరికూడినాడని నేనెరుగ ఎట్టి వేషమందు వచ్చి నిలిచిన
తావు నేనెరుగ కోపమను సంసార సాగరమున సాధ
నంబు జేయ ప్రభుదేవుని సులువు అఘటితమైయుండె
కపిల సిద్ధ మల్లికార్జునా! ౩౦

**వివేచనము :**

లేదు లేదు నేను ఏమియు ఎరుగను మహనీయ అల్లమస్వామి శూన్య కాయుడందురు అదేమొ నేనెరుగ మహా లింగైక్యుడందురు అదియు నాకు తెలియదు ఎప్పుడు ఏ రూపము ధరించి వచ్చునో నే చెప్పజాలను నా యజ్ఞా నము పెద్దది కోపతాపమను సంసార సాగరమునబడి ముందెరుగక సాధన జేయుచుంటిని ఏ జన్మ భాగ్యమో నేనున్న చోటికే అల్లమ ప్రభుదేవుడు నను మన్నించి రక్షించుటకు వచ్చినాడనుచు సిద్ధరాముడు పరమ సంతస స్వాంతుడై అల్లమ స్వామిని పిలుచుకొనివచ్చి తన హృదయమును పీఠంబునిచ్చి పాదార్చన జేసి షోడశోపచారంబుల పూజించి, పాదోదకంబుగొని పరమానంద భరితుడై ప్రసాద స్వీకారానంతరము శాంతచిత్తుడై ప్రసన్న వదనుడైయుండగా తనలో అణగియున్న తన క్షేత్రరచన అల్లముని విమర్శనకు గురియై వాదములో నిర్ణయమై యుండలేదు అనేక విషయాలు వాదములో వచ్చిపోయినవి అల్ల ముని కృపకు పాత్రుడైనా తాను జేసే క్షేత్ర కార్యము మెప్పు పొందలేదు అందువల్ల అల్లముని సమ్మతి పొంగుట కిది మంచి సమయమని తలచి విన్న వించుకొనుచున్నాడు

అణువునందు అణువై యుందువో దేవా నీవు
ఘనమున ఘనమైయుందురయ్యా దేవ జగమునందెల్లెడల
నీవులేని తావున్నదే? ఎనభైనాల్గు లక్ష శివాలయంబుల
నీవుజేసి, లోపలున్నది జూచి నేజేసితిని కాని, కపిలసిద్ధ
మల్లినాథయ్యా, నేను వేరె స్వతంత్రమెరుగను ౩౧

**వివేచనము :**

జంగమస్వామి! తప్పైనా ఒప్పైనా నీ కృపావరణములోనె ఉంటుంది రెంటికి నీ ప్రేరణయే మూలము ఐన జీవికున్న సాధనా స్వాతంత్ర్యాన్ని సత్పురుషుల సహకారముతో, నీ నిర్మాణసృష్టిని అర్థము చేసుకొని నిను పొందు మార్గము నిర్ణయించుకొనుటలో అనేకమైన విధానములు, ఆయా జీవుల స్వభావముల కనుగుణంగా లోకములో కార్యరంగములు ఏనాటినుంచియో సాగి వచ్చినవి ఎందరెందరో మహాపురుషులు తమ సాధనచే కనుగొన్నది లోకాని కిచ్చినారు

తమరు చిన్నదానిలో చిన్నదై ఘనమందు ఘనమై జగద్భరితమైన జంగమమూర్తియై, ఎనభైనాల్గులక్షల జీవరాసులజేసి, ఆ జీవులలో తమరున్నది జూసి, జీవుల సదుపాయానికై ఎందరో ఏనాటినుంచియో జేసుకొనివచ్చిన క్షేత్ర రచన నేను జేయుచుంటిని ఇది తమరు సృష్టిమూలముగా జూపించినది జూచి చేసినదే గాని ఇది నా స్వతంత్రము గాదు

అయ్యా, తమరు ఈ రచనకు సమ్మతించక ఆక్షేపణలచే విడంబించినారు జీవులకిది జ్ఞానములకు కారణము గాదా? మన్ను-రాయి యని తిరస్కరించారు దానిలో తమరు లేరా? దానినుంచి జీవులకు బోధకాదా? జీవుకన్న మన్ను, రాయి నీ లీలతోబాటు ప్రళయాంత్యంవరకుంటుంది అంతవరకు వచ్చిపోయె జీవులకు ఈ రాయి, మన్నే నిను జూపుటకు సాధనము కాదా? అనంతముఖమైన విచిత్ర నిర్మాణశక్తిని పూర్ణముగా కనుగొన్నవారెవరో తెలియదు

తమ కృపవల్ల తెలిసిందానిని చేయుచున్నాను అది నీ యాజ్ఞచే జరుగుచున్నది నీ కార్యమేగదా స్వామి! నీ భృత్యుడై జేసెదగాని నా యాజమాన్య

మేమియు లేదు తండ్రి! అనుచు సిద్ధరామదేవయ్య తన అంతరంగములో నున్న దంతా ఒకటొకటె వినయంగా అల్లముని పాద సన్నిధి యందు పెట్టినాడు తప్పొప్పులేమొ అప్పగించినాడు కాని ముందు ఏ మార్గాన్ని అనుసరించుటో అడుగలేదు తన స్వంతంగా ఏమియు చెప్పుకొనలేదు

ఈ విన్నపానికి ముందు తన కుపదేశించాలని కోరినాడు దానికి ప్రభు స్వామి, ఎవరి ఉపదేశమేమున్నది? అది నీలోనె యున్నది నీ ఉపదేశము నీది కానంత వరకు ఎవరు జెప్పిన అది వారి యుపదేశమని, కానరాని నిజమును చూపడానికి రాదు అట్టి మహిమ తెలియుటెట్లు? "నిన్ను నీవె తెలుసుకో" అని గురుత్వాన్నుంచి జారుకొన్న తరువాత సిద్ధయ్య తన జీవన రంగములో నడచిన కథ చెప్పితాడు

అల్లయ్య సమాధానంగా విన్నాడు సిద్ధరాముడు అసత్యమేమియు చెప్ప లేదు లోక కల్యాణార్థము తాను చేసినదంతా చెప్పుకొని వచ్చినాడు ఆ చేసిన దంతా నాపై పెట్టినాడు సయుక్తితో తన కార్య రంగాన్ని సమర్థించుకొంటు, ఇపుడు తాను చేయుచున్న క్షేత్ర రచనానికి నన్ను మూలంగా ఎంచినాడు అంతయు పాతబొంత తప్పని గాదు దీని యందు సులభత లేదు కాలము మారినట్లు కార్యము సదుపాయమును కనుగొనుట యుక్తము సిద్ధరామునికది తెలుపవలెనని ప్రభువు ఇట్లనుచున్నాడు

**అల్లమ ప్రభు .**

కొనలేని లింగంబు నడుమ నుంచుకొందునన్న
అహంకారము ముందుంచుకొంటివయ్యా! ఎనభై నాలుగు
లక్షల శివాలయంబులను బయలు భ్రాంతి ఇదెక్కడిది
చెప్పుమా? మహా ఘన లింగమునకు జగములోని జీవ
రాసులు శివాలయంబౌనే? నీ లక్షపై తొంబదియారు వేలు
లింగములు నీ ఎదలోన కూర్చుకొనుమా! గుహేశ్వర
లింగము నిను తప్పించి పోయినది మరచితివా సిద్ధ
రామయ్యా?

**వివేచనము :**

అంతయు సరిగాని నీ భ్రాంతి కేమనవలయునో తెలియదు సిద్ధరామయ్యా! నీవు చిన్నవాడవని చెప్పుటలేదు నినుబోలు పెద్దవారు లోకములో దొరకుట అరుదు ఇదివరకు నీ రచనా క్రమానికి చెప్పుకొని వచ్చిన ఆధారములు, సామ్యములు, సాధనపు దృష్టాంతములు, కాదనకపోయినా శ్రేష్ఠమని ఒప్పుకొనను కొందరు ప్రాచీనులు వేసుకొన్న ప్రాతిపదికనుబట్టి నడచినావు జగన్మయ లింగానికి జీవులు ఆలయమౌట ఎక్కడైన కద్దా? అటులనుకొంటె అహంకార మౌతుంది అది సరికాదు నీవు భూమిలో స్థాపించవలెనన్న లింగమును నీ హృదయమందుంచుకో! సిద్ధరామ దేవా, గుహేశ్వరుడు నిన్ను మోసగించినది ఎరుగకపోయితివయ్యా!

అల్లముడు మరల సిద్ధరాముని అభిప్రాయమును ఖండించి, స్థావర లింగ పూజను నిరసించినాడు అన్యాపదేశంగా ఇష్టలింగోపాసనను మార్మికంగా చెప్పగా విన్న సిద్ధరాముడు అతని వాదానికి అడ్డురావడం వాదము పెంచినట్లు గునుకాని ప్రయోజనముండదని యుక్తియుక్తంగా ఇట్లనుచున్నాడు

**సిద్ధరామయ్య**

సకల లింగమును బట్టి ఎడబాటు లేక నడచు
కొమ్మంటిరిగాన నడచుచుంటిని లింగ ప్రతిష్ఠ చేయు
మంటిరిగాన చేయుచుంటి నాకు వేరె స్వతంత్రమున్నదే
వెనుక మీరిచ్చిన నిరూపము మీకు నిజము కాదనిన ఇక
ముందు స్వయమౌనటుల నడపించు కపిల సిద్ధ మల్లి
నాథయ్యా! 213

**వివేచనము .**

ప్రభు దేవ! మీరు జెప్పిన మాటను మీరె తప్పనుచున్నారు అందుకు నీ భృత్యుడై నడచిన నేనేమనగలను? సమయ సందర్భానుబట్టి వ్యవహరించు స్వాతంత్ర్యము మీకున్నది ప్రపంచము మీది మీ యాజ్ఞ ననుసరించి నడచేవి నాడి లింగస్థాపనలు, గుడి గుండారములు, చెరువులు, అన్న సత్రాలతో క్షేత్రాలు నిర్మించుమన్నారు వెనుక అది చేయుచున్నప్పుడు వచ్చి కాదన్నారు

ముందేమి చేయువలయునో ఆజ్ఞాపించండి అని స్వామి భృత్యన్యాయము ముందు బెట్టిన సిద్ధరాముని జూచి అల్లముడు చెప్పుచున్నాడు

**అల్లమ ప్రభు :**

చెరువు దేవాలయంబు లన్నియు గత కాలంబు
నడత రూపు కర్మకాండ యోగంబులెల్ల భవబంధంబు
లోపల వెనుక ముందను సందు వదలి గుహేశ్వర
లింగమందు చక్కగ చేరియుండవలయు సిద్ధరామయ్యా! ౨౪

**వివేచనము**

ఔను నీవన్నది సరే అవి యింతయు జీవికి ప్రారంభ సాధనము అంత్య పరిణామము కాదు అదిగాక కర్మకాండము యోగములు ఎంత జేసిన తెగని బంధము, భావరాహిత్యంబు గాదు బంధముక్తికి ముందు వెనుకలను సందు సంశయములు లేవు అని అల్లమప్రభు చెప్పిన దానిలో విచార సులభత యున్నట్లు, ఆచార సులభత లేదని కనుగొన్న సిద్ధరామయ్య కర్మాన్ని దాని ప్రయోజనాన్ని వెల్లడించు అభిప్రాయము వ్యక్తీకరించుచున్నాడు

**సిద్ధరామయ్య .**

కృషిజేసి కుడువకయున్న ఆకలి తీరు తెరవేది?
కర్మయోగము జేయక నిర్మల సుచిత్తమెరుగు రీతి యది
యెట్లు? వండక బువ్వ తినుటెట్లు? కపిల సిద్ధ మల్లికార్జున
లింగమునకు? ౨౫

**వివేచనము**

స్వామి! సాధనామార్గాల ఆది అంత్యాలు చెప్పినదేమొ ఒక రీతి సరియను కొన్న అన్ని సాధనాలకు మూలమైన కర్మజేయక యుండుట సాధ్యమా? కర్మము జీవికి అనివార్యము అది అసాధువు గాదు సాధనకు సాధువు చెప్పండి పనిజేయక పంటరాదు పంటలేనిది వంటకాలు లేవు వంటకాలు లేకుండిన ప్రాణుల ఆకలి తీరుటెట్లు? మనసు నిర్మలంగా నిశ్చలంగా యుండాలంటె ఒక్క క్షణం కర్మను వదలడానికౌతుందా· మీరు కర్మానికి చెప్పిన అర్థమేమిటొ

తెలియదు అని మెల్లమెల్లగా ఉభయులు అభిప్రాయ భేదాలతో వాదాన్ని నిర్మించు కున్నారు జ్ఞాన కర్మల వివాదములో దిగినారు సిద్ధరామయ్య చెప్పినది ఎవరూ కాదనేది కాదు ఐతె అల్లమప్రభు ఆ కర్మ పటలాన్ని చించి పేలికలు జేసి చూపుతాడు

**అల్లమప్రభు**

కర్మమే ప్రాణమంచు చేయుచున్న, జ్ఞానంబు తెలియు స్థాన శుద్ధమింకేది? చచ్చువరకు సాధనము జేసిన పోరాడు తావింకేడ? ఎరిగినది తెగదెంపి, పై నెరిగినదంత కాల్చి, పొట్టులేని తండులమట్లు కాయంబు దెస శుద్ధమై యుండవలయు, గుహేశ్వర లింగము నెరుగుటకు సిద్ధరామయ్య! ౫౬౬

**వివేచనము .**

అయ్యా సిద్ధరామయ్యా! నీవు జెప్పిన కర్మానికి జ్ఞానబలం లేదు కర్మా న్నుంచి కర్మమే గొప్పగా పెరిగి క్షుద్ర ఫలాలకు లోనవుతుంది కర్మమంటె సృష్టి నియమ చేష్టలు సుప్తముగా - వ్యక్తముగా తెరపిలేక తనంతకు తానే ప్రాణమున్నంత వరకు కార్య ప్రవృత్తమై యుండును అది ప్రధానమని ఎంచే జీవికి ప్రగతి లేదు ముఖ్యముగా నేజేయునదేమిం ఎందుకు? పరిణామమేమని తెలియలేని దానిని ఎంతజెసినా ఎన్నాళ్ళు జేసినా ప్రయోజనము లేదు "చచ్చే వరకు సాము గరిడీలు జేసి కుస్తీ వచ్చినప్పుడు పండుకొన్నట్లు" ఉపయోగ మేమిం అయ్యా, ఒక్క మాట చూడు నీవు చెప్పినట్లు కర్మము ముఖ్యమైనది కానిమ్ము ఐతె అది బంధనము కాకూడదు అది ఇది నేనే జేసితి, నా యాజ మాన్యమున జరిగినది అంటె అది అజ్ఞానమై, అహంకారమై, నీవు శ్రేష్ఠమను కొని చేయు కర్మములోనె పడి జన్మాలకు మూలమౌతుంది ఏది చేసినా జ్ఞాన మునకు ప్రాధాన్యమియ్యవలెను ఆ జ్ఞానము కూడ దోషయుక్తము గాక, నేను జ్ఞానియని అహంకరించక, అపుడప్పుడు లోక వ్యవహారాల నుంచి వచ్చు చిక్కులు రానీయక, పొట్టువదలిన బియ్యపుగింజ వలె జన్మరాహిత్యమై, దేహేంద్రి యములను సదా శుద్ధంగా ఉంచుకొన్నప్పుడే, తెలియగల దైవాన్ని తెలియుట సులభము

ఈ వివరములు సిద్ధరామునికి తెలియనివి కావు ఆయన ఎక్కువగా కర్మచేతనే జ్ఞానార్జనము జేసి మహా యోగీశ్వరుడని కీర్తి గాంచియుండె జ్ఞాన ప్రధానమునెంచి అల్లముడు చెప్పిన దానికి సిద్ధరాముడు చెప్పుచున్నాడు

**సిద్ధరామయ్య**

హస్తమందు ఒట్టి చూచుట కర్మపూజ గాదా? మన
సులో ధ్యానంబు జేయుట కాయ కర్మంబు గాదా? భావ
శుద్ధం బెరుగు తెరగింకేది కపిల సిద్ధ మల్లికార్జున. ౨౫

**వివేచనము**

ఉత్త జ్ఞానము అయినదానిని, కానిదానిని మరంత జ్ఞానపు మాటలు సమకూర్చుకొని ఖండన మండనలు చేయుచున్నదిగాని, దానికి నిర్మాణశక్తిలేదు ఎందుకంటె అది చేయదు జ్ఞాన సంపాదనకు కర్మము ముఖ్యము కర్మకాని దేముంది? చెప్పండి స్వామి! చేతబట్టి చూచుట కర్మపూజగాదా? మానసంబున తనకు కావలసిన దైవాన్ని కాని మరే ఇతరాన్ని కాని తలచుట దేహ కర్మంబే గదా! ఇక తమరు శెలవిచ్చిన భావ విషయ మేముంది? అని సిద్ధరాముడు తన కర్మ ప్రాముఖ్యాన్ని వివరణజేయ ప్రభుదేవుడు నవ్వి విచిత్ర వాదము నెత్తి ఇలాగున చెప్పుచున్నాడు

**అల్లమ ప్రభు**

బంగారు ఒరపెట్టి చూడవచ్చును గాని, వన్నెను
రుద్ది చూడనగునె? పూవు ధరియింపవచ్చుగాని, గంధంబు
ధరియింపనగునె? కర్మము చేయవచ్చుగాని, వస్తువును
ఎరుగనగునె? గుహేశ్వరుడనవచ్చు గాని లింగము
తానగుట రాదు సిద్ధరామయ్యా! ౨౬

**వివేచనము**

సిద్ధరామదేవా! విషయాన్ని కొంచెమోపికతో విప్పి చూడుము లోకములో చేయువారి అజ్ఞానము చెప్పరానంత పెరిగినది అదే జీవోద్ధరణమని బోధించు గురు సమూహము పెరిగింది ఇంకేమి అజ్ఞానానికి అజ్ఞానం తోడై, అద్భుత సిద్ధాం

తింగా మారింది చూడు ఈ కర్మవాదము ఫలాపేక్షల మీద పెరుగుతుంది బంగారు సానకొచ్చినట్లు వన్నెవచ్చుటకు సాధ్యమా? అలాగుననే పూవు తల యందు పెట్టుకొనునట్లు వాసనను పెట్టుకొనరాదుగదా? కర్మమూ అంతే! ఊరక శ్రమపడుటే గాని వస్తుజ్ఞాన మెరుగదు శివాశివా శివాశివా యని అనవచ్చు గాని శివుడు అవుతాడా? అని సిద్ధరాముని కర్మవాదం చించిపారవేసినాడు అల్ల ముని ప్రజ్ఞావిశేషాలతో, ఎదుటివారి నోరుగొట్టు విచిత్ర ఛలోక్తులు ఉపమానంగా వాడినది విన్న సిద్ధుడు ఇట్లనుచున్నాడు

**సిద్ధరామయ్య**

వన్నెలేకున్న బంగారమంచు రేమయ్యా? పూవు వాడి
రాలినచోట వాసన యుండదేమయ్యా? క్రియా శుద్ధియైన
కపిల సిద్ధ మల్లికార్జున లింగము భావశుద్ధమై యుండును ౩౬

**వివేచనము**

స్వామి! అసాధ్యమైన అసంబద్ధమైన ఉపమానాలు వాడితే ఉత్తరమిచ్చుట ఎలాగో తెలియదు క్షమించండి వన్నె-బంగారము వేరువేరు ఉండేదానికి సాధ్యమా? మీ ఉపమానములో విడదీసినట్టులైతే వన్నెలేనిది బంగారుగాదు ఇది అవ్యవహారము పూవు ఉపమానము అంతేగదా స్వామి బంగారపు ఉపమానమే మున్న పూవు వాడి కిందబడినచోట కొంతకాలం వాసనయుంటుంది కస్తూరిని కట్టిన గుడ్డయట్లు-ముఖ్యంగా అన్నిటికి క్రియాశుద్ధి ముఖ్యము జ్ఞాన శుద్ధికన్నా నిర్ణయాత్మకమని దిటంగా చెప్పచువచ్చిన సిద్ధరామునకు మరల తన వాద శూలానికి మెరుపు ఎక్కించి ప్రయోగించుచున్నాడు అల్లముడు

**అల్లమ ప్రభు**

రాగమడంగి తామసంబు సమసి అహంకారపుగిరి
మాసి మాటల వాముల (గడ్డివామి) మోపుల గొల్చి
కాయము కర్మంబులో నశియింప, జీవము సకల సంసా
రములో నొప్పి పడిన మరల భావశుద్ధం గలదే గుహే
శ్వర లింగయ్యకు? ౬౦

**వివేచనము**

ఏమైనట్లు? అటుగాదు ఇటుగాదు మధ్యలో నీ కర్మపు ఉయ్యాల ఊగు తుంది సిద్ధరామ దేవా! అంతరంగములోని చిత్తమందున్న రాగాన్ని పోనాడి నావు బుద్ధిలోని తామసాన్ని చంపినావు అహంకారమును త్రుంచినావు మాటల వాముల మోపుల కాల్చినావు అంతయు సరియే కాయానికి కర్మము జీవానికి సంసారము కట్టుకొని వేదనచెందె స్థితిలో భావానికెట్లు శుద్ధి పట్టుకుంది యని అల్లముడు వెక్కిరించి పలికినది విని చాలా వేసరముయినది సిద్ధరామునికి ఈయన ఒక నిర్ణయానికి రాని అసాధ్య వ్యక్తి ఎంత స్నేహమయుడో ఎంత దయార్ద్ర హృదయుడో అంతే నిర్మోహుడు నిర్దయుడు ఎవరు ఏలాగున్నను వారి మొగమోటమెరుగక విచారపు విసురుతో చిన్న బుచ్చుటలో అద్వితీయుడు ఒకరీతి పొగడినట్లేయుండి మరియొకరీతి ఎత్తిపొడిచినట్లుంటుంది కొంచము కటువుగా విరుగబడిన ధోరణిలో ఇట్లనుచున్నాడు

**సిద్ధరామయ్య**

మాటలాడు ఉత్సాహ చంచలత కాతురత పీడదు
ఉత్తమ మధ్యమ కనిష్ఠమెంచి మరిగాంచుటకు నడి
యాడుట మానదు నాకు గర్వము మొదలైన, మీకు
గర్వము వెగ్గలంబయ్యె! ఉభయంపు కలహ మింకెవరికి
జెప్పుదు కపిల సిద్ధ మల్లికార్జునా? ౬౧

**వివేచనము**

లోకములోని ఏ శ్రేష్ఠతలేగాని తమ హద్దు మీరరాదు శ్రేష్ఠతలు కనిష్ఠ ములపై పెద్దరికాలు పెంచుకొని పెద్దవై యుండరాదు స్వామి జంగమ దేవా! మీరు పొరబడుచున్నారు మీ స్వభావాన్ని తిద్దుకుంటె లోకానికి సులభత చిక్కుతుంది ఎందుకంటె, మీకన్నా పెద్దవారు లేనప్పుడు, లోకమంతా మిమ్ము జూచి నేర్చుకొనవలయును ఆ సామాన్యానికి నేర్చుకొనేద తమయందు సుల భంగా సరళంగా ఉంటె మంచిది

అది లేక ఎప్పుడంటె అప్పుడు విపరీతంగా మాటలాడు చతురత, వాద వైఖరి బాగా పెంచుకొన్నారు ఉత్తమ, మధ్యమ, కనిష్ఠవర్గాల ఎంచుమ వెక్కిరించుటకై తమ సంచారము జరుగుతుంది నాకేమొ ఉన్న గర్వము ఉంది కొండంత గర్వము మీకుందిగదా స్వామి! మీకు చెప్పేవారెవరు? కపిల మల్లికార్జునా, ఈ భక్త జంగమయ్యల కలహము ఎవరికి ఏమని చెప్పేది.

సిద్ధరాముని కంటిలో క్రోధరేఖలు మూడినవి అల్లముడు చూచి చకితుడైనాడు ఈయన క్రోధాగ్ని ఎట్టిదో మొదటనే చవిగన్నాడు ఎలాగుననో నిగ్రహించుకొన్నాడు ఇపుడు మళ్ళీ అటులైతె? కాకూడదు సిద్ధరామయ్య యోగ వాసిష్ఠుడు యోగ ప్రపంచమునకు రారాజు మాట, వాదనా వేగములో కొంచము మగ్గరించినది వెనుక మాతా ముక్తాయక్క (౩౨వ వచనము) పరిహసించింది ఇప్పుడు రెండవతూరి సిద్ధుడు బాగానె విడంబించినాడు కాక, శ్రేష్ఠతయను పుండుకు చక్కని శస్త్రచికిత్స చేసినాడు ఇక నయమే మార్గమని అల్లముడు నవ్వుతు సామరస్య భావముతో పలుకుచున్నాడు

**అల్లమ ప్రభు**

కర చరణాదులు వేరైనవిగాని తెలిసి ముట్టునది
ఒక్కటే ఆత్మ బిందువొక్క సారమందు సస్యములనేక
నామంబుల పెరుగునట్లు, గుహేశ్వరుని లింగమందు నేను
నీవను భావంబు లేదు సిద్ధరామయ్యా! ౬౨

**వివేచనము**

వద్దు వద్దయ్యా, కోపగించవద్దు, నీ కోపానికి బ్రహ్మాండము బెదరుతుంది నేను ఎప వేరు కాదు మాటను బట్టి అర్థాలు వచ్చి భావాలను కొట్టి లేపును ఊరకుంటె ఆ మాటల అర్థము ఎట్టిదైన నీరసించును గదా! చూడు ఈ దేహపు కాళ్ళు చేతులు వేరైనట్లున్నా ఆత్మయొక్కటే గదా ఒకే జలమున బీజము సస్యమై పెరిగి కొన్ని పేర్లు పెట్టుకొన్నట్లు మన మన పేరులు వేరైతేనేమయ్యా? మహాలింగముతో నీవు నేనను భావము లేదయ్యా, యని సిద్ధరాముని కోపాన్ని అల్లముడు శాంతింప జేసినాడు సిద్ధరామయ్య అల్లమునితో ఎంత చర్చించినా తన్ను గురించి తెలిసు విధానానికి వచ్చినపుడు నిర్ణయంగా ఏది చెప్పి యుండ

లేమ ఇప్పుడాయన సమీపమునకొచ్చి అనుసంయించినాడు. ఇప్పుడడిగితే ఫలితార్థముంటుందని అనుకొన్న సిద్ధరాముడు చాల వినయముగా అడుగుతున్నాడు

**సిద్ధ రామయ్య**

నేనేమి చేసిన వదంతయు శివనియె ఎంచి యుంటి
నయ్యా నేనేమి చేయుటంతయు నీవె కాదనిన అది
పోనిమ్మ మీయానతి కానరాని ఘనము కాయమందుంచి,
చెప్పరాని నిజము మనము నందు నాటి, చూపరాని
గురుతు నా తెలివిలో నిలిపి, ఇక మిమ్ము గాంచునట్లు
చేయుమా కపిల సిద్ధ మల్లికార్జునా! ౬౩

**వివేచనము**

మన్నించవలెనయ్యా! నా కోపమంటేమి స్వామి? పెళ్ళరాయికి తాకి పగిలినట్లు అది యంతయు పోని ప్రస్తుతం నా మనవి వినండి ఇదివరకు నేను ఏమేమి చేసినానో అంతయు నీ పని యని, నికు ప్రియమైనదని చేయుచు వచ్చినాను ఇప్పుడు కాదంటె అది వదలుతాను మీ యానతి ప్రకారంగా మెలగుతాను స్వామి కానరాని గొప్పదేముందో దానిని నా అంగము నందుంచండి. చెప్పరానిదని, రహస్యమని గుప్తంగా ఉంచుకొన్న సత్యాన్ని మనస్సులో చేర్చండి అదిగాక చూపరానిది నా ఎరుకలో బెట్టి మిము గాంచు విధానము తెలియపరచండి చూచిన-వినిన, చెప్పినను తెలియనిది గురుస్వామి గురుతుకు తెచ్చి ఉద్ధరించుతాడు నా గురుదేవుడు తమరై రక్షించాలని వినయ విధేయిత శిష్య భావంబుతో విన్నవించుకొన్న సిద్ధరామునికి అల్లయ్య ఇట్లనుచున్నాడు.

**అల్లమ ప్రభు**

దేహ భావంబు వదలు వరకు జీవ భావంబు వద
లదు జీవ భావంబు వదలు వరకు భక్తి భావంబు చేకూరదు
భక్తిభావంబు చేకూరకున్న తెలివి తేటపడదు తెలివితేట
పడనంతవరకు గురుతు నశియింపదు గురుతు నశియించు
వరకు మాయ మానదు ఇది కారణము కాయ జీవముల
చేర్చినకట్టు విడదీయు భేదమెరిగిన గుహేశ్వర లింగ
మెరుక సాధ్యమగును చూడు సిద్ధరామయ్యా!

**వివేచనము :**

ఆత్మ తత్త్వము అనేక విజ్ఞులు వివిధ రీతిగా చెప్పినను దాని నిలుకడ కేంద్రమొక్కటే అది సచ్చిదానంద పరబ్రహ్మము సిద్ధరామ యోగి! నీవడిగినది నాకు తెలియునని నీవనుకొన్నావుగాన నీకు తెలిసినవి మరుగైనది నీవడిగిన దానిలోనె నీకు తెలియునన్నది వ్యక్తమైనది శిష్యునికి తెలియనిది ఏ గురువు చెప్పలేడు శిష్యుడనుకొన్నదానిలో వున్న సందేహము దీసి ఔను అని నిర్ణయించి శాంతి మంత్ర మీయగలడు ఇది నీకు తెలియనిదిగాదు చూడు అన్వయానికి చెప్పుచున్నాను నేనను దేహమున్నంతవరకు జీవ భావము వదలదుగదా, ఇక జీవ భావము వదలకుండిన, భక్తి భావముపుట్టదు భక్తి భావము లేనిది జ్ఞానము రాదు జ్ఞానము రాకున్న అనుష్ఠానపు గురుతు నష్టము కాదు గురుతున్నంత పర్యంతము పట్టుకొన్న మాయపోదు మాయపోనప్పుడు ఈ కాయ జీవ సంబంధాల కూడికకు కారణమేమి? ప్రయోజనమేమి? ఒకదానిలో ఇంకొకటి చేరినది ఎట్లు? తనకుతానే చేరినదా? లేక ఎవరైన కూర్చి కుట్టినారా? అనునది ఎరిగితె అప్పుడు గుహేశ్వర లింగయ్య సాధ్యము కాగలడయ్యా సిద్ధరామయ్యా!

అల్లమయ్యగారు సక్రమంగా బాలపాఠము చెప్పినట్లు విడివిడిగా చెప్పుచు వచ్చి, కాయము - జీవము కూడిక విషయములో అతి కష్టకరమైన చిక్కు పెట్టినాడు నీవే తెలుసుకొమ్మని జారుకొన్నాడు సిద్ధరామయ్య అడిగినది అదే ఎందుకో అల్లముడు స్పష్టపరచలేదు శిష్యునకు తెలిసిందె గురువు చెప్పుతాడు అన్న అల్లముడు - చెప్పలేదంటె గురువునందు శిష్యునకున్న నమ్మకములో నేమైన కొరత కనబడినదా? అదేమొ చాణాక్షుడైన సిద్ధరాముడు విన్నవించుకొనుచున్నాడు

**సిద్ధరామయ్య**

నీర క్షీరముల సందు హంస విడదీయును
చూడయ్యా! కాయ జీవంబుల సందు మీరు విప్పెదరు
గాని నా కెక్కడ తెలియునయ్యా? నీవు పెట్టిన చిక్కు
విప్పరాదు నీ విప్పిన చిక్కు పెట్టరాదు కపిల సిద్ధ
మల్లినాథయ్యా, నీవు నా కాయ జీవంబుల కట్టు తెంపి
విడిపించుమా? మీ ధర్మము!

— ౫

**వివేచనము**

అయ్యా మహనీయా! నీ సహాయము లేనిది ఏదియు గాదు ముడివేయు టొకరు, విప్పేది మరియొకరా? ప్రళయాంత్యము వరకు విప్పరాని మేడిమలుపు పెట్టిన మహా దేవుడవు నీవు నీవు వేసిన ముడి విప్పుట, విప్పిన ముడి వేయుట ఎవరికి సాధ్యమయ్యా! నీవె లోకాని కొక్క పెద్ద ముడి నాకు సాధ్యము కాదు మునిగే నీటిలో దింపి తేలుకొని రమ్మన్నట్లు మీ కృప చేజిక్కక దూర దూరముగా తప్పించుకొని పోవుచుంటె నే జేయునదేమి తండ్రీ? నీ పరీక్షకు తాళుకొనునంత శక్తి లేదయ్యా స్వామి! తుదకు ఒక పక్షిని కాను నీరు విడచి పాలనే త్రాగు గుణము హంసకున్నట్లు నాకున్నదా? చెప్పు విషయ భేదా భేదాలు మాటలకు చిక్కి వాదము పెరుగుతుంది ఇక ఏ వాద వివాదాలు వద్దు ప్రభు నన్ను అనుగ్రహించండి అని సిద్ధరాముడు నిర్ధారించి వేడుకొనుచున్న విషయానికి అల్లముని మనసు కరిగి ఇట్లనుచున్నాడు

**అల్లమ ప్రభు** :

తెరపులేని ఘనము మనము నందడగి, శిరము
లేని మనము ఘనము నందడగి, తనకు తానె శాంతి
పొందిన మీద మరల చేరు చోటున్నదె? గుహేశ్వరుని
లీల మానువరకు జ్వాలలోని కప్పుర మటులుండవలెను
కనుమా సిద్ధ రామయ్యా ౬౬

**వివేచనము**

ఎడతెరిపిలేని మహాఘనము మనములో కూడి యుండగా మనము ఘనములో వేరుగాక సమరసము కావలయును అది రెండుగాని ఒకటిగాని నీవనునది లేదు అది యనునది లేదు దానిలో చేరవలెనను కాంక్షలేని శాంతియై తనకు తానె ఆనందమయమై యుండు సమయము వచ్చువరకు అగ్నిలోనుండు కప్పురము వలె యుండవలయును, అని పరమ శాంతస్థితిని పొందు విధానమును చెప్పినది విని తన ధన్యతను సిద్ధరాముడు నమ్రుడై చెప్పుకొనుచున్నాడు

సిద్ధరామయ్య .

చెరువు, వాగు, దేవాలయంబుల నుంచి మిమ్మ
గంటి ముగ్గలించిన రాయి తీయ మరుగున నిధిగాంచి
నట్లు నా మనసులోనున్న అజ్ఞానాంధకార పర్వతంబు
నకు దినకరుడుదయించినట్లు కపిలసిద్ధ మల్లికార్జున లింగ
మను భ్రాంతి స్వయమయ్యె ప్రభుదేవుని కారుణ్యమున ౬౭

వివేచనము :

ఆహా! చల్లని ఆప్యాయనము, అమర సుధాసేవనము, కర్మధర్మ సంజాత సాలోక్యము యోగానంద సమాధి సారూప్యము, జగన్నుత జీవనోద్ధారా, జంగమ చరణారవింద సామీప్యము, అల్లము కృపా కటాక్షము ఇదివరకు నేజేసిన లోక జీవహిత సేవాఫలమునకంటె ముగ్గరించినచోటనే పెద్ద నిధిని కంటి నా అజ్ఞాన తిమిర భాస్కరుడు నేనున్న చోటికే వచ్చి నన్ను కృతార్థుని జేసె మల్లికార్జునుడు స్వయమయ్యె

ఇట్లు తన కృతార్థతను, అల్లమస్వామి మహిమను కొనియాడి, అల్లముడు చెప్పిన నిజతత్త్వ రహస్యాన్ని మననముజేసుకొని అర్ధనిమీలిత నేత్రుడై పరవశావస్థయందున్న సిద్ధరామయ్య దేవుని సమసరసముగని అల్లముడు ఆనందమున కొనియాడుచున్నాడు

అల్లమప్రభు .

నిర్వికల్పితమైన అద్వైతము చూడరే! వెలుగు
లోని వెలుగు అడగియుండె చూడరే! చంద్ర సూర్యులు
భూలోకమందెవరని కాన ! జ్యోతిలేని ప్రకాశంపు
ప్రభయో! గుహేశ్వర లింగమందు సిద్ధరామయ్య దేవుని
మహా ఘనంబు నేమందును! ౬౮

వివేచనము

ప్రభుదేవుడు హరుష భరితుడైనాడు సిద్ధలోకములో సామాన్యంగా కానరాని యోగి సౌందర్యాన్ని సంపదను కనినాడు ఎప్పుడో ఒకతూరి ఇట్టి

యోగీశ్వరుని కని లోకానికి ఇచ్చుకొంటుంది కాలము ఇతని జ్ఞాన స్థైర్యము అసమానము ఇతడు భూలోక రుద్రుడన్న బిరుదు ఇతనికి ఒప్పతగినది ఆహా! వికల్పములేని ఇతని అద్వైతము శ్లాఘనీయము వెలుగులోని వెలుగు జ్యోతి లేని ప్రకాశము సూర్య చంద్రులవంటి జగత్కార్యభరితుడు ఈ మహాత్ముడు సిద్ధరాముడని అల్లముడు కొనియాడుచుండ తలవంచుకొని స్తోత్రానికి సిగ్గు పడి విన్నవించుకొంటాడు

**సిద్ధరామయ్య**

అయ్యా, మీ స్వరము గుడిచిన శబ్దంబు నామనం
బునకు వేద్యమయ్యె మీ నిజము కుడిచిన రీతి నా మతికి
వేద్యమయ్యె,మీ కరుణ ప్రసాదంబు నా సర్వాంగమునకు
వేద్యమయ్యె. మీ కాయముబట్టిన కరస్థల కారణము
చెప్పవే కపిల సిద్ధమల్లినాథా! ౬౫

**వివేచనము** •

అయ్యా జంగమదేవా, మన్నించండి తమరు పొగడితె బొమ్మ బ్రహ్మ మౌతుంది మీ శిక్షకు నా యోగతామసము సమయించినది అది అట్లనే స్థిరమై యుండులాగున ఉంచండి ఇప్పుడొక విన్నపము మీ మాటల ధ్వనిలోని ఓం కార నాదమునకు నా మనంబు అలరింది మీ నిజమును కనుగొని భుజించి నందువల్ల నామతికి నెమ్మదియైనది అదిగాక ముఖ్యముగా మీ కరుణ ప్రసాదము నా సర్వాంగానికి వేద్యమయ్యె ఐతె మీరు చేతియందుంచుకొన్న కరస్థలము కారణమేమో చెప్పవలెనని ప్రార్థన

సిద్ధ రామదేవుడు అల్లముని వామకరంబుననున్న లింగాన్ని గురించి అడిగినాడు ఇదివరకు ఇద్దరి వాదోపవాదములలో ఎన్నో విషయాలు చర్చకు వచ్చినవి గాని ఈ ఇష్టలింగము ప్రస్తావన వచ్చియుండలేదు దానికై వేచియుండె నన్నట్లు అల్లముడు ముదము వహించి తన గురు పరంపరను ఈ విధముగా చెప్పుచున్నాడు

**అల్లమ ప్రభు :**

అనాది గణనాథుని శిష్యుడు ఆది గణనాథుడు ఆది గణనాథుని శిష్యుడు అధ్యాత్మ గణనాథుడు ఆధ్యాత్మ గణనాథుని శిష్యుడు ఆత్మ గణనాథుడు ఆత్మ గణనాథుని శిష్యుడు వ్యోమసిద్ధ గణనాథుడు వ్యోమసిద్ధ గణనాథుని శిష్యుడు బసవ యను గణనాథుడు బసవ యను గణనాథుని శిష్యుడు అనుమిష యను గణనాథుడు అనుమిష యను గణనాథుని శిష్యుడు అల్లమప్రభు యను గణనాథుడు ఈ విధము అనాదినుంచి వచ్చిన అనుపమ లింగము గుహేశ్వరుడను పేరుగాంచి నా కరస్థలంబునకు సాధ్యమయ్యె చూడుమా! సిద్ధరామయ్యా! ౨౦

**వివేచనము :**

అల్లముడు తన గురుపరంపర చెప్పిన దానిలో ఈనాటి బసవణ్ణ వచ్చినాడు ఆయన అల్లముని గురు అనిమిషయ్యకు గురువని సిద్ధరామునికి తెలియుటతోడనె జాగ్రతుడై బసవరాజు ఈనాటి మానవోత్తముడని ఇదివరలో విన్నదానికి, అగమ్య అగాధమని తలచిన ప్రభుదేవుని గురువుకు గురువైన మహనీయ బసవన్నను చూసి తీరాలని చెప్పగా అల్లముని అభిప్రాయము అదేయై యున్నందున సిద్ధరామునితో కల్యాణనగరికి ప్రయాణమై వెళ్ళెను

ఇది కృపామూర్తులైన శ్రీ మృత్యుంజయప్ప గారిని స్వప్నబోధామూర్తులైన శ్రీ ఎర్రి తాతయ్యగారిని స్మరించి సకల శివశరణులను వందించి శూన్య సంపాదనలోని సిద్ధరాముని సంపాదనకు సంగ్రహముగా జెప్పిన వ్యాఖ్యానము సంపూర్ణము

శ్రీ గురు బసవ లింగాయ నమః

# శూన్య సంపాదనము

## బసవేశ్వరుడు చెన్నబసవేశ్వరునికి అనుగ్రహించిన సంపాదనము

❦

కం॥ చెన్నబసవేశునకు సం
పన్నత నుపదేశములను బసవారాధ్యుం
డున్నతమై జెప్పెనన్న
దెన్నుచుశరణులు మెచ్చుట నెరుకకు దెత్తున్॥

అదెట్లనిన ప్రభుదేవుడు సిద్ధరామయ్య దేవుడు బసవరాజదేవుని మహిమలను కొనియాడుచు, పరమానంద భరితులై అటు వచ్చుచుండ

ఇటు అఖండ అవ్యయ నిత్యనిరవయ నిశ్శూన్యమగు నిష్కల పరశివుని స్థూలతత్త్వము మర్త్యలోకమున జగ హితార్థమై బసవేశ్వరుడను నామంబున అవతరించి, షట్‌దర్శన, షట్ సమయంబులనుంచి వీరశైవ సద్భక్తి మసకబారియుండ ఆ శివభక్తిని ఉద్ధరించి సర్వాచారము లోగొని, కల్యాణ పట్టణమందు గురులింగ జంగమభక్తి జేయుచు, నిత్యము ఎనభై ఎనిమిది పవాడములను జయించుచున్న బసవేశ్వరుడు తానెట్లుండెననిన

శైవుని హృదయశూలము, వైష్ణవజీమూత జంఝామారుతము, చార్వాక చాదంతశృణి, బౌద్ధ దర్దురఫణి, క్షపణ వన దావానల, నైయాయిక హరిణ శార్దూల, భాట్టమత శరధికుంభజ, ప్రభాకర కదళీ మత్తగజ, మీమాంస హాలు చైత్ర, వైశేష లతాలవిత్ర, కాపాల కుముద మార్తాండ, సాంఖ్య మత శరభ

భేరుండ, కర్మవాద కుధర కులిశ, కాలవాద కమలతారేశ, మంత్రవాద మస్తక శూల, మాయావాద మూలకుద్దాల, కౌశమత తరుపరశు, కాళాముఖ కంఠపాశ, శాక్తేయతిమిర దీప, సౌరమత పన్నగ ఖగాధిపుడై వీరశైవ సద్భక్తిని వర్థించుచు శివ శరణ సాగరంబునకు, పూర్ణేందువై సుఖంబుండునంత

ఒకనాడు శివలింగార్చన జేయుచుండ లింగమందెరిగి, ఆ లింగపు కళ ఏకమై నీరు నీరు కూడినట్లు, క్షీర క్షీరము చేరినట్లు, రత్నంబునందు కళ కూడి యున్నట్లు, అంతరంగపు జ్ఞానము బహిరంగక్రియ ఒకటై, ఇష్టలింగపు కళ ప్రాణంబునకు భేదించి, ప్రాణలింగ సంబంధమగు భేదము శరణ సంగమున గాక చేకూరదనుచు జ్ఞాన ముఖంబున నిరీక్షించుచుండ, నిష్కల పరశివుని సూక్ష్మ తత్త్వమే చన్న బసవేశ్వరుడను నామంబున మర్త్యమున కవతరించి, సకల ప్రమథులకు షట్ స్థలంబు బోధించుటకు తానె కారణమై, అల్లమ ప్రభు దేవుని రాకకు తానె ముఖ్యుడై వచ్చి, ఆ బసవేశ్వరుని స్తుతియించి అనుగ్రహము పొందిన రీతి అదెట్లనిన, ఆ ప్రస్తావన వచనము

(ఇయ్యది శూన్య సంపాదనకారుని గద్యము)

గద్యకారుడైన గూళూరు సిద్ధ వీరణ్ణొడెయులు బసవేశ్వరుని చరిత్రము, చన్న బసవేశ్వరుని విషయములు ఇక్కడేమియు వివరించలేదు తత్త్వ నిరూపణకు కావలసినంత సన్నివేశం కల్పించుకొని తన సంపాదనను ముందుకు సాగించినాడు బసవేశ్వరుని మహిమను ముఖ్యంగా చెప్పినాడు బసవణ్ణ మొదట భక్తిని నిర్మలంగా జేసి నిర్ణయించడానికి వచ్చినాడని చెప్పినాడు

పదునాల్గు లోకాలలో మర్త్య లోకమే ఒక విశిష్టత పొందినది పై లోకములకు కిందటి లోకములకు బ్రహ్మాండ పురుషుని వడ్డాణమన్నట్లు భూలోకమున్నది వచ్చే మహాపురుషుని పై లోకాలనుంచియే దానిలో ఎక్కువ ఉద్ధరణ కార్య రంగములో నున్నవి వైకుంఠము కైలాసము వైష్ణవులకు దశావతారములు శైవులకు పంచ వింశతి (౨౫) శివలీలలు బసవేశ్వరుని అవతరణము ఈ రెండుగాక శివభక్తి నిర్ణయానికి విస్తరణానికి వచ్చినాడు

పన్నెండవ శతాబ్దమునందు బాగేవాడి యను గ్రామమున (ఇప్పుడిది విజాపురము జిల్లాలో తాలూక గ్రామము) మండిగె మాదరసుడను ఆరాధ్య బ్రాహ్మణుడు జహగీరుదారుడై యుండెను ఇతని ధర్మపత్ని మాదలాంబిక, ఆ గ్రామమందున్న నందీశ్వరుని ఆరాధించుచు, తనకు పుత్రానుగ్రహము చేయుమని కొంతకాలముగా వేడుకొనుచున్నప్పుడు ఆ దేవుని దయవలన బసవన్న జన్మించినాడు

ఆరాధ్య బ్రాహ్మణులలో రెండు తెగలున్నాయని చెప్పెదరు మొదటి తెగ వారిది లింగధారణము తరువాత యజ్ఞోపవీత ధారణము రెండవ తెగ వారిది మొదట యజ్ఞోపవీత ధారణము, తరువాత పెండ్లిలో లింగధారణము దీనిలో బసవన్న మొదటి తెగయందే పుట్టినందువల్ల లింగధారణ పుట్టుకతోనే జరిగినది ఉపనయనములో జందెము ధారణము చేయు సందర్భమందు రెండు దీక్షలు వద్దు, లింగధారణ దీక్షయే చాలని బసవన్న ఉపనయన కర్మాన్ని విరోధించినపుడు కులాచార సంప్రదాయముతో పెద్దవాడైన మాదరసు కుమారునికి బుద్ధివాదము జెప్పినాడు బసవన్న వినలేదు తండ్రి కొడుకులకు వాదము పెరిగి విరస మేర్పడినందున రక్త సంబంధాన్ని తెంచుకొని బసవన్న ఇల్లు వదలి కూడల సంగమ క్షేత్రానికి వెళ్ళెను బసవన్నకు అక్కయైన అక్క నాగమ్మ సహోదరి వాత్సల్యమునుండి విడనాడక తల్లి తండ్రి వంశము బంధు బాంధవుల మోహమునుండి విడనాడి నిశ్చలుడై తన ధ్యేయసాధనకు చిన్న వయసును లెక్కించక వెళ్ళిన తమ్ముని వెన్న కట్టి వెడలెను

బసవన్న కూడల సంగమ క్షేత్ర నివాసియై అక్క నాగమ్మ రక్షణలోనుండి సంగమేశ్వర గురుస్వామి సన్నిధిలో సకల శాస్త్రాభ్యాసములు జేయుచు ఆశ్రమమునందు అందరికి వినయ విధేయతల సేవా సహకారములతో మెప్పువడసి యుండెను

కల్యాణ పట్టణమునందు బిజ్జలుని ముఖ్య ప్రధానియైన బలదేవ మంత్రి మేనల్లుడైన బసవన్న నడచినరీతి పెద్దవారి దృష్టిలో అవిధేయమని ఎంచబడినను, బాలుడైనా దిట్టతనమున తన ధ్యేయ సాధనకు ఈ రీతి పెద్దరికాన్ని ప్రతిఘటించినది యుక్తమైనదేయని తలంచి బలదేవుడు తన కూతురు గంగాంబికనిచ్చి వాని

అభివృద్ధి చూచుట కర్తవ్యమని ఎంచి రాజధానికి అల్లుని పిలిపించుకొని కూతురు నిచ్చి పెండ్లిచేసి రాజు కొలువులో కరణికాన్నిప్పించి కాలమైన తరువాత బసవేశ్వరుడు పురోభివృద్ధికెక్కి ప్రధానియై, దండ నాయకుడై, ఆర్థిక మంత్రియై, బిజ్జలుని రాజ్యానికి వెన్నెముకయై, సర్వరీతి ప్రజాభ్యుదయము సాధించెను దానితో బాటు ధార్మిక సామాజికములో నీతియుక్తమై కాయక రంగాలను ఐచ్ఛికముగా పెంపొందజేసెను అనుభవ మంటపమును ఏర్పరచెను

అక్క నాగమ్మ తన భర్త శివ దేవునితో తమ్ముని శ్రేయోభివృద్ధిని గాంచి సంతసించెను శివశరణ కరుణ ప్రసాదమున కుమారునిగని, చన్న బసవణ్ణయని పేరు బెట్టెను ఆతడు తన మామ బసవన్న చేయు కార్య రంగాలలో తోడునీడై యుండెను

పాలకురికి సోమనారాధ్యుడు బసవ పురాణము నందు, హరి హరుడు కన్నడములో బసవరాజదేవర రగళె యందు ఇంచు మించు చెప్పుకొని వచ్చిన కథ ఇది అమల బసవరాజ చారిత్రము రాసిన సింగిరాజు వీరిద్దరికంటె ముందుగా రాసినాడని కొందరు చరిత్రకారుల అభిప్రాయము ఎవరి అభిప్రాయమెట్లున్నను శూన్య సంపాదనకు ఇప్పుడు చెప్పినదంతా ఎక్కువైనది కాని కొంచమైన వెనుకటి వృత్తాంతము తెలిసికొనవలయునని ఎవరికైన అభిలాష యుండుట సహజమని పూర్ణంగా చెప్పకపోయినా తగినంత వివరించడమైనది

ఒకనాడు చన్న బసవణ్ణ తనకు లింగానుగ్రహము చేయవలయునని బసవన్నను ప్రార్థించగా, నేనెవరికి గురువు కాను, ఇక ఉపదేశమిచ్చు టెక్కడి దని అదరి పడినప్పుడు దానికి చెన్న బసవయ్య సమాధానంగా గురు శిష్యుల అభేద ప్రవృత్తి ఎత్తి, శిష్యుడు నిర్ణయించుకొన్న గురుత్వాన్ని కాదనడానికి గురువుకు హక్కు లేదని వినయముతో విన్నవించుకొన్న చన్న బసవేశ్వరునకు తనకిష్టము లేకున్నా బసవణ్ణ ఇట్లనుచున్నాడు

**బసవణ్ణ**

గురువునకు నీవె కర్త లింగమునకు నీవె కర్త
జంగమమునకు నీవె కర్త ప్రసాదమునకు నీవె కర్త

ఉపదేశమునకు నీవె కర్త జాతం సంగము దేవుని
సాక్షిగా నాకు నీవె కర్తవైన కారణమున, నేను వద్దు
కావలెనననను చూడా చన్న బసవణ్ణా!

**వివేచనము**

చన్నయ్యా! నా మాట ఏను వు ఎందుకంటె, గురు లింగ జంగము ప్రసాదములకు నీవె యజమానుడవు అందున ఉపదేశమునకు నీవే గురువు దీనియందు నా స్వతంత్రమేమున్నది? స్వతంత్రము లెనివాడు భృత్యుడు ఆ భృత్యునకు ఔను కాదనుటకు, వద్దు కావలెనని నిర్ణయము పలుకుట కధికారము లేదు ని ఇష్టమొచ్చినటుల చేయుమని బసవన్న యుక్తి యుక్తంగా చెప్పిన ఉత్తరానికి చన్న బసవేశుడు బసవన్నగారి దాసోహం భావానికి, యాజమాన్య ప్రవృత్తి రహితత్వానికి వెరగొంద ఈ చిన్నతనములో ఎంతటి పెద్దతనాన్ని గుప్తనిధిగా ఉంచుకొని, లోకానికి ఎంత మహత్తరమైన సద్భక్తిని ప్రసాదించినాడు ఈ మహానుభావుడు: ఇతని కృపను పడయుట సులభముకాదు నేనన్నవారిని మనవారిగా పడయవచ్చు, నీవన్నవారిని చేబట్ట తరముగాదని యోచించి ఒక యుక్తి పన్ని బసవన్న చేతికి లింగమిచ్చి ఈ లింగ లక్షణము చూడుమని నప్పుడు బసవన్న తోడనె లింగ లక్షణము చూడ రాదు, అని ఆ లింగాన్ని చెన్నబసవనికిచ్చిన ఆ చెన్నయ్య శ్రీగురు కరుణమయ్యె నని ఆనంద పరవశుడై ఇట్లు చెప్పుకొనుచున్నాడు

**చెన్న బసవణ్ణ**

దేవదేవ, మహా ప్రసాదము తన రూపు తెలిసి
చూడవలెనందు అద్దమునకు విన్నవించిన ఆ యద్దము
వద్దు కాదనునే స్వామి? పతి యాజ్ఞచే సతి పతి భావంబు
పొందుమన, సంయోగ కాలమందు కాదనవచ్చునె? మీరె
జేసినను మీరె జేసినట్లు, నేను మహా ప్రసాదంబు స్వీక
రించిననూ నీవె చేసినట్లు అరచేతి లింగము లక్షణము
చూడుమని చేతికిచ్చిన లింగమున లక్షణము చూడరాదని
చెన్న సంగమనాథుని ఇదే కొమ్మని ఇచ్చిన మహా ప్రసాద
మని కైకొంటిని గురువు అదరి బెదరిన మనము నినున

యించి, ఏకార్థంపు భేదంబు చూపి విన్నవించితిని
కూడల చెన్న సంగమ దేవుని మహా మందిరపు గణం
బులు మెచ్చ సంగన బసవని కారుణ్యమునకు వరు
డనునది మూడు లోకంబు లెరిగి జయ జయ మనుచుండె ౨

**వివేచనము**

ఇది యొక సమస్యాత్మక సన్నివేశము దీనిలో గురువెవరో, శిష్యుడెవరో విభజించి చెప్పుట సులభము కాదు అదిగాక ఈ లింగదీక్షా విధానము వీర శైవుల ధర్మ సమాజ శాస్త్రము ఒప్పునదియూ కాదు ప్రథమోపదేశమందు అల్లమ అనిమిషయ్యల ప్రసంగమొక విశేష రీతియైతె, దీని రీతి ఇది యొక ప్రత్యేక విధానంగా మారినది నేను గురువు కాను అన్న బసవయ్య గారినే గురువుగా ఎంచిన చెన్న బసవన్న యుక్తి ననుసరించి బసవన్న హస్త స్పర్శ పావిత్రతతో లింగాన్ని పుచ్చుకొన్నదే లింగధారణమైన దనియు, లింగ లక్షణము చెప్పరాదు అన్నదే మంత్రమైనదనియు భావించి కృతార్థుడ నైతినని చెన్న బసవణ్ణ ఆనంద భరితుడైనాడు

ఇక గురుత్వానికి జంకిన బసవన్నకు దర్పణము, సతిపురుషాయతముల ఉదాహరణ లిచ్చి అతడు పొందిన భయానికి సమాధాన మిచ్చినాడు లింగము పొందినపుడు శిష్యుడైనాడు గురువు సందేహ నివృత్తికి గురువైనాడు

గురువు కానని చెప్పిన బసవన్న శిష్యుడైన చెన్న బసవన్న భావనకై లింగిమిచ్చి గురు తత్త్వానికి చేరినాడు ఇట్లు గురుశిష్య సంబంధములు క్రియలో రెండై, జ్ఞానమందు ఏకమగునను విధానము ఇక్కడ వ్యక్తమైనది పరిశుద్ధ మానసులై పరతత్త్వ కోవిదులైన బసవన్న-చెన్న బసవన్నగారలు తమ శారీరక సంబంధాలు ఎంచక, చిన్న పెద్దరికాల గొడవలకు పోక, గురు శిష్య శ్రేష్ఠ కనిష్ఠతలు చూడక కేవలము భక్తి భావమందు సామరస్యము పొందినారు

జ్ఞాన భావంబులందు చన్న బసవేశుడు తృప్తి చెందిననూ క్రియాత్మకంగా తన్ను ధన్యునిజేసిన గురుని అఖండ అవ్యయ లింగ స్వరూపాన్ని నిరూపించి భక్తి శ్రద్ధాదులను గురువుగా చెప్పక దాసోహంభావమున నడచి చూపవచ్చిన, భక్తాగ్రేసరుడు బసవన్నను స్తుతియించుచు ఇట్లనుచున్నాడు

**చెన్న బసవణ్ణ**

ఆది బసవణ్ణ అనాది లింగమందురు, కల్లకల్ల ఈ మాట వినరాదు ఆది లింగము, అనాది బసవయ్యే లింగము, బసవన్న బడిలోన పుట్టియుండె జంగమము బసవన్న ఉదరమందు పుట్టియుండె ప్రసాదము బసవన్న అనుష్ఠించి సపుడైయుండె ఇట్లు ఈ త్రివిధంబు నకు బసవన్నయే కారణంబని ఎరిగితినయ్యా, కూడల చెన్న సంగమదేవా! 3

మరియు

నమః శివాయ లింగము, ఓం నమఃశివాయ బసవేశుడు, నా మనస్థలమందు వెలిగి కనుపించితివి గాన ఇది కారణంబు కూడల చెన్న సంగయ్యా, ఆది యాధార రహితమందు మొదలు ఓం నమఃశివాయ యనుచుంటిని 4

**మరియు :**

బసవన్న ఓం కారంబు నుంచి అవల నాదబిందు కళల కట్టిట్టు ప్రథమాచారి నీవె, లింగాచారి నీవె, జంగమాచారినీవె, ప్రసాదాచారి నీవె, నాకు సర్వాచారియు నీవె గతి మతియై నన్ను నిలువజేసిన కారణంబున కూడల చెన్న సంగమదేవా, ఎట్టి నిర్ణయములేని కాలమందు ఓం నమఃశివాయ యనుచుంటిని 5

**వివేచనము**

ఉద్వేగ రహిత జ్ఞాన సామ్రాజ్యాధినేత చన్న బసవేశుడు ఉద్వేగ భరితు నాడు ఎందుకంటె, తాను పొందిన ధన్యత లోకములో ఎవరు పొందలేరు "నా కన్న చిన్నవారు లేరు, శివభక్తులకన్న పెద్దవారు లేరు" అని బసవన్న అన్నాడు అందరు పెద్దతనానికి బిరుదులెత్తుకొని తిరుగుచుండగా ఈ మహితుడు తన చిన్నతనానికి బిరుదుకాని బిరుదెత్తి ఎట్టివారికి చిక్కక ఉందరిలో అందరి లాగుండి అంటరివలెగాక దాసోహంభావపు కోటలోనుండె నేను దానిని పడ

గొట్టి అతని అనుగ్రహానికై ఎవ్వరు వహించని స్వాతంత్ర్యము వహించితిని "దయలేని ధర్మంబదేమియయ్యా" అని లోకాన్ని ప్రశ్నించిన బసవన్న మహా దయాళువుగాన నేను చిన్నవాడని తెలియనివాడనని నా అతిక్రమణాన్ని మన్నించి ఏమైన జేసుకొమ్మని తన్నే నాకిచ్చుకొన్న గురుమూర్తిగాన నా భక్త్యైశ్వర్యానికి నాజ్ఞానానందానికి నాషడస్థల తత్త్వ వికాసమునకు ఎనలేని ప్రాణలింగ రహస్యానికి గురియై బసవయ్యకు కూర్చు బిడ్డనై బ్రతికితి దీని కన్న పొందు సౌభాగ్యమేముంది ఈ లోకమున?

బసవగురు మహనీయుడు ఆదియని, లింగ మనాది యనువారున్నారు అది పొల్లు బసవడే అనాది బసవకు లింగమ్మప్పుడు లింగానికి ఆదియైనది, లింగము జంగమము, బసవన్న ఉదరమునుంచి బయటికొచ్చినది ప్రసాదము కూడ ఆయన స్వీకరించినప్పుడు ఆ పావిత్రత ప్రసాదానికొచ్చినది ఈ లింగ జంగమ ప్రసాదములకు బసవన్నయే కారణమని ఎరిగి కొనియాడుచుంటి

పంచాక్షరీ మంత్ర స్వరూపము లింగము! షడక్షర మహామంత్ర స్వరూపము ఓం నమః శివాయ! బసవయ్య యనునది నాయందు ప్రభవించి అనుగ్రహించినందున సదా ఓం నమః శివాయ యనుచుంటిని

అదిగాక, పరిశీలించి చూచితె, ప్రణవమైన ఓం కారానికి అందక అవతల వతలగా యుండువాడు నాదబిందు కళలకు దూరదూరమై యుండువాడు ప్రథమాచారి లింగాచారి జంగమాచారి ప్రసాదాచారిగా యుండి సర్వాచారిగా సర్వమందు వెలుగు బసవప్రభు నా బ్రతుకు బ్రతుకైనాడు నా జీవనానికి జీవమైనాడు అతని నిర్ణయమందు ఓం నమః శివాయ యని నాదాలాప తన్మయుడ నయ్యెద

ఇటుల చన్నదండ నాయకుడు బసవగురు మహిమను అపారంగా కొని యాడుచుండ బసవయ్య విని "తన్ను కొనియాడు స్తోత్ర సాహిత్యములో ఎంత అర్థాన్ని ఇమిడించినాడు" ఇది ఒక వ్యక్తికే అన్వయించేది గాదు మహాతత్త్వ లోకానికి అన్వయించే సద్భక్తి "చేతనామృత పానుని" తనలోనె అనుకొని చన్నబసవని ఘనతను గురించి ఆశ్చర్య సంజనిత మానసుడై ఇట్లనుచున్నాడు

**బసవణ్ణ .**

విత్తక, పెరగక పెరిగిన పెద్ద పంటరాశిని గనుమా! సుగంధ బంధురమట్లు పుట్టుకతోనె పరిమళంబు ఆది యనాదులు లేకమున్న తనంతకు తానె యైన కారణంబున ముట్టక తట్టక గురుకారుణ్యము పొంది లింగంబు స్వాయమయ్యె నాకు గతి మార్గంబు చూపవలె నంచు నా తోడయ్యెను కూడల సంగమదేవునందు చెన్న బసవేశ్వరుండు ౬

మరియు

విపిధ స్థానంబులందొచ్చి కష్ట కార్యంబులో చిక్కి క్షీణించి మిగిలి నిలిచిన నిలువకాడు గాదు మర్త్య లోకంబునందు శివాచారంపు ఘనము ఎరుగైనదనుచు కర్త తానె మహా ప్రసాదియై ఉదయించెను హస్తమస్తక సంయోగము లేకమున్న, ఆదిగురు అనాది శిష్యుడన్నది స్థిరపరచి, సంగమ నాథుడను లింగము నా చేతికిచ్చి సామంబున అనుగ్రహించుకొనెను నా వెనుకటి పూర్వా పరము నెత్తిచూపి తనవైపు చేర్చుకొనెను, కూడల సంగమదేవుని యందు చెన్న బసవేశ్వరుండు ౭

**వివేచనము .**

ఆహా! చెన్న బసవయ్యను గురించి ఎట్లు చెప్పవలెనో ఏమని చెప్ప వలెనో! ఏమని చెప్పితె తప్పు కాకుండునో తెలియదు లోకరూఢి గాక ఈ మహనీయునిదే ఒక ప్రత్యేకత ఎరుగుట కష్టము ఎరిగిననూ విస్పష్టముగా చెప్పుట మరీ కష్టము ఎందుకంటె, విత్తనము వేయకె నాటిన నాటిది పెరుగుటకు కాలావకాశమే అక్కరలేని పెరిగిన పెద్ద పంటరాశి పుట్టుకతోనె పరిమళించు మరువము అక్కడినుంచి ఇక్కడనుంచి పుట్టివచ్చెననుటకు అవకాశము లేదు ఎప్పుడో ఏమొ తనంతకు తానె పుట్టెను క్రియాదీక్షలేక హస్తమస్తక సంయోగము లేక లింగము చేపట్టెను నాకొక మార్గము చూపవలెనంచు నావాడయ్యెను

ఇతడు ఏవో కర్మబంధాలకు చిక్కివచ్చినవాడు గాదు ఏ పాపమొజేసి ఎవరి శాపమో మోసి, పరిహారానికిక్కడ గాలేదు ఎట్టి సాంసారిక తాపత్రయాలకు లోనైనవాడుగాడు భూలోకములో శివాచారము అవశిష్టమై పోతుందని ధర్మోద్ధరణ కర్తవ్యాన్ని వహించి లోకకర్తయే ఉద్భవించెను మహాప్రసాద విధానము ఎరుకపరచెను ఎంత యుక్తి దానిలో అదెంత శక్తి చిటికెలో లింగము నాచేతికిచ్చి అనుగ్రహము పొందిన చాతుర్యము ఎవరికబ్బుతుంది? ఆయనకాయనయే సాటి ఆదిగురువు అనాది శిష్యుడని ఈనాడు నిరూపించినాడు నా భయానికి వెనుకటి వృత్తాంతమేదో జెప్పి అభయమిచ్చినాడు నేనిప్పుడు చేయునదేమియు లేదు అంతకు చెన్నబసవేశుడె కారణమైనాడు

ఒకే ధారగా చెన్న బసవేశుని గురించి బసవడు స్తోత్రము చేయుచున్నది విన్న చెన్నబసవయ్య ఆయన చెప్పే విశేష మహిమావృత వర్ణనాలకు జంకి ఇంత చిన్నవాడు కానక్కరలేదు బసవన్న! ఆయనెంత ఘనుడో ఇప్పుడు చెప్పెదనని ఇట్లు అనుచున్నాడు

**చెన్న బసవణ్ణ**

ప్రథమ కాలంబున నిరాలంబియై యుంటిరయ్యా
ద్వితీయ కాలంబున తేజోమూర్తియై యుంటిరయ్యా
తృతీయ కాలంబునందు నాదమూర్తియై యుంటిరయ్యా.
చతుర్థ కాలంబునందు చైతన్యరూపధారియై యుంటి
రయ్యా పంచమ కాలమందు ధర్మమూర్తియై యుంటి
రయ్యా షష్టమ కాలమందు మీరు పరపురుషార్థ సాధ
నంబై త్రివిధ భక్తికి మీరె కారణంబై విచ్చేసితిరి మీరు
ప్రమథుల సహితంగా ముట్టి ప్రాణలింగింపు తీరు చూపవలె
నను నిమిత్త మాజ్ఞప్తుడనై మీ కారుణ్యమునకు వరుండనై
పుట్టితిని మీ కర కమలమందు కూడల చెన్న సంగమ
దేవా, మీ మహిమకు నమోనమో యందును ౮

**వివేచనము**

బసవ దండాధీశా! విస్మరింపకుము లోకమునం దెల్లెడల ఎల్లకాలమందు నీవు జేసిన అనంతలీలలు నీకే విస్మరణమైతె ఆ విస్మరణము నీ లీలలే సుమా.

నా నుంచి పలికించి నాకు ధన్యత చేకూర్చు కారుణ్యమిది చెప్పెద వినుమ ఒకటి రెండు మూడు నాలుగు ఐదు ఆరు కాలంబులలో నిరాంజన, తేజోమూర్తి, నాదమూర్తి, చైతన్యమూర్తి, ధర్మమూర్తి, బసవమూర్తియై ఆయా కాలముల ప్రజ్ఞాతిశయాలకు మూలకారణకర్తవైయుండి ఈ కాలమందు బసవ గురువై గురులింగ జంగమ భక్తికి మీరె యజమానుడై వచ్చితిరి పూర్వ నియోజిత మహావాక్యానుసారంగా నెపమాత్రంగా ప్రాణలింగానుసంధానము దాని రహస్యము తెలుపుటకు మీ కర సరోజ సంజాతుడై వచ్చితినిగాని మీరు లేని కాల కర్మములుండునే తండ్రి! మీరుంచినట్లుండు మీ భృత్యుడ నేను అను మాటలు విని, ఎంతో కాలమునుంచి తన వెనుకటి ప్రాణలింగ రహస్యము విన కుతూహలుడైన బసవదేవుడు ఇట్లనుచున్నాడు

**బసవణ్ణ**

లింగ ప్రాణముల సకీల సంబంధ మెట్టున్నదని
ఎరుగ ప్రాణ లింగ రహస్య సంబంధమెట్లో నే
నెరుగ ఊరక మందమతినై బయట పూజించి వ్యర్థమై
దివసంబులు పోయినవి కూడల సంగమ దేవునందు నా
ప్రాణ నిక్షేపమగు భేదంబు చూపుమయ్యా చెన్నబసవణ్ణా

**వివేచనము :**

అయ్యా చెన్నబసవా! లింగమేమొ, ప్రాణమేమొ దాని సంబంధాలేమొ తెలియదు ఇన్నాళ్ళు పూజజేసిన క్రియాలింగానికి సంబంధించిన క్రియలేమొ జరిగినవి గాని, దీనినుంచి ఆ ప్రాణలింగము తెరవేదో కనబడలేదు ఇదియొక అలవాటు పూజయైనది చేయునదేమి? నీవేమొ కొండంతగా కొనియాడినావు, దానివల్ల నీ ఘనత వెల్లడియైనదిగాని నాకేమియు ప్రయోజనము కాలేదు రహస్యము నీకు తెలుసు నన్ను పొగడక తెలుపవలెనని బసవన్న వేడుకొనగా చెన్న బసవడు వినమ్రుడై ఇట్లనుచున్నాడు

**చెన్న బసవణ్ణ .**

ఓహో! గురుదేవా మీ కరకమలమందు ఉదయించి
అంగముపై లింగము ధరించి, ఆ లింగమందు అను

రక్తమై, ప్రాణలింగ లింగప్రాణమునన్ నేను కంటిని మీకు నేను చూప సమర్థుడనె?

ఆచార మంగింబుపై ఆశ్రయించి, ఇష్టలింగ మందు దృష్టినిలిపి, భావ సంపన్నుడైన మీ ఘనత నే నెక్కడెరుగుదునయ్యా? అనుభావము అంతరంగి మందు కూడి ప్రాణలింగమందు నిక్షేపితమై నిజలింగైక్య మైన మీ ఘనత నే నెక్కడెరుగుదునయ్యా?

జ్ఞాన సమాధియందు ఆశలుడిగి, పరిణామ లింగి మందు మనసు లయమై, నిజలింగ స్థలమునందు తృప్తులై యుంటిరి మీరు మీ ఘనత నే నెక్కడెరుగుదును? అంగము మీద లింగమున్న దంతయు సంగమ నాథు దన్నపుడు, జంగమ ప్రాణియై యుంటివినీవు, మీ ఘనత నే నెక్కడెరుగుదునయ్యా?

లింగమున కొచ్చిన పదార్థంబుగాక, స్వీకరించనని మనస్సు ముడుపుపెట్టి తనువు ముడుపువెట్టి, సర్వాంగ సుఖంబంతయును ప్రాణలింగమున కర్పించి, నీవు తొలగి నిరాభారియై ప్రసాద లింగ ప్రాణియై యున్నారు మీరు మీ ఘనము నే నెక్కడెరుగుదునయ్యా?

అనాది శివునకు ఆధారంబు లేదని అఖండితుని మీ రోమంపు కొనయందు ధరియించి మహాలింగ ప్రాణియై యున్నారు మీరు మీ ఘనత నె నెక్కడెరుగుదునయ్యా? కూడల చెన్న సంగయ్య సాక్షిగా మీ ప్రాణ లింగ సంబంధపు కొంగు తాకిన ఉక్కు మిక్కిన ప్రసాది నేను చూడుమా సంగన బసవణ్ణా! ౧౦

**వివేచనము**

ఆహా! అదేమిటి బసవదేవా! తమకు తెలియదంటె లోకమొప్పునా, శరణులు పన్నులింతురా? నీ సంకల్ప మాత్రమున ఎక్కడ ఏ జీవి నుంచి ఏమి

కావలయునో అది కాగలదు నీవు గురుడై లోకానికి బోధించుచున్నావు. లింగమై పూజ సెందు చున్నావు జంగముడై శాసింపుచున్నావు ఈ మూడు ఎవరికి గోచరము గాదు అవి నీ అవ్యక్త మహిమలు, దాసోహం భక్తి మాత్రం మూర్తి గొని సదా భృత్యాచారములో సంచరించి శరణ లోకంబులో గురులింగ జంగ మారాధన సాధనాదర్శకుడవై మెలగుచున్నావు నీకు నే చెప్పుటన్నది ఏమున్నది? పరీక్షకుడు విద్యార్థిని అడిగినప్పుడు ఆయన నుంచి నేర్చినదే చెప్పుతాడు విద్యార్థి స్మరణశక్తి పరీక్షయే గాని పరీక్షకుడు తెలుసుకోవలసిందే మియు లేదు

మీ నుంచి లింగానుగ్రహము పొంది, ఆ లింగము అంగమునందు ధరించి ఆచరించిన ఆచారమే అంతరంగము నందున్న ప్రాణలింగ చేతనానికి ముఖ్యమైనదని తెలుసుకొన్నాను బసవేశా, మీకు చెప్పునంతటివాడనే?

ఆచారమె అంగమై, దృష్టియే లింగమై, భావ సంపన్నత పొందిన మీకు చెప్పనగునే? అంతరంగమందు అనుభావ సంపదను ప్రాణ లింగమందు స్థిరముగా స్థాపించి లింగైక్యమందు అంగ వికారములు లేకయుండు మహాత్ము డవు నీవు జ్ఞాన నిశ్చలత యందు కోరిక లుడిగి లింగమందు పరిణామ క్రియా మూర్తియైన నీకెవరు చెప్పుదురయ్యా బసవయ్యా!

లింగి మున్న అంగములెల్ల సంగమనాథుగా ఎంచి జంగమలింగ ప్రాణులై నారు లింగార్పితము కాని పదార్థాన్ని ఒల్లనని తను, మనములను అశుచి సోకని శుద్ధమందుంచుకొన్నారు సర్వాంగ సౌఖ్యాలు ప్రాణ లింగార్పణమని అర్పించి అర్పించితినన్న భావానికి దూరమై నిరాభారి చర చక్రవర్తులై ప్రసాద లింగ ప్రాణులై, అనాది శివునకు దిక్కు లేదని నీవు లింగంబుగా ధరించి మహాలింగ ప్రాణులైనారు మీకెవరు చెప్పెదరు? బసవరాజా, మీరే ప్రాణ లింగమని తెలుసుకొన్నాను మీ సన్నిధిలో భక్తుడై మీ యాజ్ఞా ఒద్దుకని చన్న బసవన్న చెప్పియు చెప్పని ప్రార్థనారీతిలో ప్రాణలింగ తత్త్వము మనవి జేసుకొన్నపుడు అపార జ్ఞాన భండారియైన చెన్న బసవన్న చెప్పినదంతా తనకు అన్వయించి చెప్పినాడు దానిలో తాను లేడు ఎంత చక్కని వివేకయుక్తమైన బోధ ఇది! ఎంత నిర్ణయాత్మకంగా ప్రాణలింగ విధానంబు వివరించినాడని

బసవన్న తనలోతాను జూచుకొని, ఔను ఔనని మెచ్చుకొని హర్ష నిర్భరుండై చెన్న బసవన్నకు ఆప్యాయమానంగా ఇట్లనుచున్నాడు

**బసవణ్ణ :**

అయ్యా, వృక్షమందగ్ని యున్న నేమయ్యా, మథించి చూపువారు లేరన్నంతవరకు చూడనగునే? జగములో కూడి పరిపూర్ణుడు శివుడనిన అంతరంగమందు కాననగునే? ఆదిలింగము - అనాదిశరణుని భేదంబు తెలిపి, నిజ ప్రాణమందున్న సుజ్ఞాన లింగమును కర స్థలంబునకు తెచ్చి, ఆ కరస్థల లింగము నా సర్వాంగ మందు ప్రతిష్ఠజేసి, చూపి, నిత్యము లింగైక్యమగు విధా నంబు తెలిపి, మర్త్య లోకమందెల్ల ఇది మొదలు ప్రాణ లింగము ఘనంబు వ్యాపింపజేసి శివభక్తి నుద్ధరించెను కూడల సంగమదేవునందు చెన్న బసవన్న నన్ను తగు నట్లు జేసి ఉంచె గాన ఇంక మర్త్యలోకాని కొచ్చిన, చన్న బసవన్న గారి శ్రీ పాదముల యాన ౧౧

**వివేచనము**

ఔనౌను ఉన్నదేమొ ఉంది అది ఇదియని చూపి తెలియజెప్పినగాని ఉన్న దిదియని తెలియడానికి సాధ్యము లేదు చన్న బసవేశా, కరుణించి నీవు చెప్పితివి గాన ఎరుగుటకు మార్గమయ్యెను చూసితివి గాన మాచితి మానులో నున్న అగ్నిని జగములోనున్న శివుని చూపు గురువున్నగాని చూడతరము గాదు చెప్పుటకు రమ్య ప్రవచనము, అనుభవానికి దుర్ఘటము, లోపలున్నదే బయటున్నది బయటున్నదే లోపలున్నదని అది బయటకొచ్చినప్పుడు క్రియాత్మ కము లోపలున్నపుడు జ్ఞానాత్మకమని స్థూలంగా నేనెరిగియుంటిని గాని, దాని మూలమెరిగితినయ్యా! అంగ, ప్రాణ, జీవ భావములు, బుద్ధీంద్రియాదులెల్ల లింగ మైనపుడు లింగైక్యము స్వయమై స్వాధీనమై యుండుననుట తెల్లమైనది ఈనాటి నుంచి ప్రాణ లింగము యొక్క ఘనత నీ నుంచి లోకవ్యాపకమైనది నన్ను నీలోన ఉంచుకొని రక్షించితిని ఇక భవంబు నాకు లేదు నీ పాదమాన ఘరి

మర్త్యానికి రాను అని బసవన్న తన్నెరుగుచు ఎరిగించిన చెన్న బసవన్నను శ్లాఘించగా విన్న చెన్న బసవన్న విన్నవించుకొంటాడు

**చెన్న బసవణ్ణ :**

మర్త్యలోక శివలోకంబనున దొక నిచ్చెనయైనది చూడుము దేవా! నీవు ఈ కల్యాణము నందవతరించి నపుడు సత్య శరణు లందరిని పావనము చేయవచ్చిన జన్మంబున వచ్చితినని పలుక వచ్చునే? కర్త్రిని రూపు భృత్యునకొచ్చిన, ఆ భృత్యుని కర్త్రిడు వెదకుచు వచ్చెను చూడుమా! సత్య సదాచారంబులు వ్యాపకము జేసి, మర్త్యుల పావనంబు జేసి, నిజలింగ సమాధిలో నిలుచు వారింకెవరు చెప్పవె, నీవుగాక? కూడల చెన్న సంగమ దేవుని సాక్షి, మీకు భవమున్నదని మనంబున తలంచితె సంగన బసవణ్ణా, మీ శ్రీ పాద మాన ౧౨

**వివేచనము**

అదేల బసవయ్యా! మీకు జన్మములున్నవె? మిమ్ము తలచినవారికి జన్మ రాహిత్యమౌను కదా! శివలోకానికి, మర్త్య లోకానికి వట్ స్థలంబను నిచ్చెన బెట్టి అక్కడి నుండి క్రిందకు దిగువారికి, ఇక్కడి నుండి ఎక్కిపోవు వారికి సులభోపాయము కల్పించినావు ఈ కల్యాణ పట్టణ నివాసమందుండి లోకమానవ కల్యాణము జేయుటకై జన్మించిన మీరు అందరివలె జన్మ బంధ నానికి చిక్కగలరా స్వామి! యజమాని యాజ్ఞ సేవకునికొచ్చిన, ఆ సేవకుని వెదకుచు కర్తృవే వచ్చెను బసవ ప్రభూ, చలించకండి మీరున్నచోటె కైలాసము మీకు భవమున్నదని నేనెన్నటికి తలపోయను మీ పాదమాన ఇహపరంబులు శరణులకు లేవు అని చన్న బసవణ్ణ విన్నవించిన బసవన్న హర్షోద్గారములతో మరియొక ప్రశ్న అడుగుచున్నాడు

**బసవణ్ణ :**

లింగపూజ జేసిన ఫలమేమయ్యా, సమరతి సమ
కళలు కలుగనంతవరకు? లింగపూజ జేసిన ఫల
మేమయ్యా, కూడల సంగమదేవునందు, నదిలో నది
చేరకున్నంతవరకు? ౧౩

**వివేచనము :**

చెప్పు చెన్నయ్యా, ఎన్నాళ్ళు ఈ లింగపూజలు? ఫలమేమి? కడవెడు నీళ్ళు పోసినా నానదు గంపెడంత పత్రి బెట్టినా వద్దనదు ప్రతిక్రియలేని క్రియ ఎంత జేసినా అంతె దానినుంచి సామరస్యము కలుగదయ్యా! ఏరుతో ఏరు చేరినట్టు సుఖసమాధి దొరుకుచెన్నడు? అని యడిగినప్పుడు లింగముఖమే జంగమము ఆ జంగమమే, అనాది గణనాథుడు, అల్లమ ప్రభు దేవుడు మీరు జంగమ ప్రాణియన్నది చూడ వెదకుచు వచ్చుచున్నాడు వారి రాక మీకు చూపెదను అనుచు ఇటుల చెప్పుచున్నాడు

లింగ జంగము, జంగమ లింగము ముఖము
మీరు గాక ఇక తెలిసినవారెవరయ్యా? అంగముపై లింగ
మున్నదంతయు సంగమ నాథుడన్నపుడు బిజ్జళుడు
పరికించి చూడుమని పంపగా వేషధారుల జంగమ ముఖ
మందు లింగము జేసిన వారెవరు జెప్పరె, మీరుగాక?
కట్టె బొమ్మని పిలిచి ఓ యనుచు పలికించి ఉడుపులిచ్చి,
బువ్వబెట్టి జంగమ లింగ ప్రాణి సంగన బసవన్న
యను ధ్వజమెత్తి మెరసిన వారెవరు చెపుమా, ఈ
కల్యాణమున మీరుగాక? జంగమ ముఖమందు గాక
లింగము నెరుగ ననుచు నా మనమునకు సందేహ మొడ్డి
జారుకొన్ననే సైరింతునె? నీవు జంగమ ముఖలింగ
సంబంధివనుట తెలిసి ఆదిగణనాధుడు అల్లమ ప్రభువను
నామంబు ధరియించి నిన్ను వెదకుచు వచ్చుచున్నాడు
కూడల చెన్న సంగమ దేవుని సాక్షిగాగ, సంగన
బసవన్నా, నీవె జంగమ ప్రాణియని నే నమ్మియుంటిని ౧౪

**వివేచనము .**

బసవరాజా! నన్ను సందిగ్ధములో పెట్టకయ్యా: జంగమ ప్రాణియై యుండి, జంగమ ముఖమందు లింగమెరుగనంచు జారుకొని నన్ను భ్రమలో పెట్టకు స్వామి! జంగమ ముఖ సంబంధి యనుటకు ఉదాహరణంగా అల్లమ ప్రభు జంగిమోత్తముడు నిను జూచుటకు వచ్చుచున్నాడు

లింగమే జంగమము, జంగమమే లింగమనుటకు నీవు చూపిన కట్టె మనిసి బొమ్మ మహిమ జంగమ వేషములు నిజముగా జేసి బిజ్జలుని నోరు మూయించిన మహాత్ముడ వీవు అని బసవనితో చన్నబసవన్న ప్రసంగించు చుండిరి

అంతలో

## అల్లమ ప్రభుదేవుని ఆగమనము

ఇక్కడ సొన్నలిగె నుంచి సిద్ధరామయ్యతో కల్యాణమువైపు పయనించు చున్న అల్లమదేవుడు అనేక పల్లె పట్టణాలు, నదులు కాలువలు వాటి ప్రకృతి వైచిత్రములు గమనించి పసురు తొడిగిన వసుంధరను జూచి సంతసించుచు, సిద్ధరామునితో అనేక విషయాలు చర్చించుచు, పథశ్రమ మెరుగక, బసవన్నను చూడవలెనన్న కుతూహలముతో వచ్చుచుండ ఒకనాడు గొగ్గయ్య అను ఒకరైతు తన తోటలోనున్న గరకనట్టు తీయుచుండగా ఆ రైతు పడుతున్న శ్రమమునకు కనికరించి అల్లముడు ఇట్లనుచున్నాడు

**అల్లమ ప్రభు**

తనువును తోటగాజేసి, మనసును గొడ్డలిజేసి,
కొట్టి పెల్లగించి తీసితినయ్యా భ్రాంతివేరులు సంసార
మను మంటిగడ్డను కొట్టి విత్తితినయ్యా బ్రహ్మబీజమును
అఖండ మండలమను బావి పవనమే మోట సుషుమ్నా
నాళంబునుంచి ఉదకంబు తీసి బసవులైదుగురు పస
చెడుపుదురని సమత సైపను కంచెగట్టి ఎల్లపుడు
ఈ తోటయందు జాగరముండి మొలకను రక్షించితిని
చూడుమా గుహేశ్వరా! ౧౩౯

**వివేచనము .**

అయ్యా రైతురాజా! అయ్యో, ఎంత శ్రమః చమట వాగులు నీ శరీరము నుంచి దిగుచున్నవి గదాః ఎంత సాహసముః ఆ గుద్దలి ఎత్తివేసినపుడు భూమి ఆశ్రయములో రక్షింపబడుచున్న ఎన్ని క్రిమికీటకాలు చావుకు గురియగు చున్నవో, దానినుంచి నీకెంత పాపము సంప్రాప్తించునో, మందబుద్ధివి తెలియక ఈ పనిజేసి పాపానికి గురియౌతున్నావు

చూడు, నేను నీవలె తోటగాడనె ఐతె నీవలె నేను చేయను విను గొగ్గయ్యా! నా తనువె తోట మనసనేదే గుద్దలి గుద్దలి లోలోపల పాతుకొన్న భ్రాంతి (భ్రమ) యను గరక వేరులు తీసివేసి సంసారపు మంటిగడ్డలు కొట్టి పక్వము జేసి వాని బ్రహ్మమనే బీజాన్ని నాటి, ఆధార చక్రమను బావి లోని నీరు సుషుమ్న నాళ మార్గమున పైకి తీసి కాలువలో పారించి, పంచ భూతములను పశువుల నోటికి నా పంట పడకుండ అనవరతము చుట్టు ముల్లు కంచె రక్షగట్టి జాగ్రత్తతో మెలగి రక్షించుచుంటినయ్యాః ఆ తోట పని సార్థ కము నీవు జేయుచున్నది జీవహింస, చేయవలదని అల్లముడు బోధించినప్పుడు ముగ్ధుడై తన పనిని శ్రద్ధతో నిత్యము జేయుచున్న రైతు గొగ్గయ్య గుద్దలి జార విడిచి తలయెత్తి చూచి వెరగంది ఏమి తెలియక నమస్కారమన్నాడు పక్కన నిలబడిన సిద్ధరామునికి నమస్కరించినా ఇద్దరు పెద్దవారే యనుకొని తన్ను బోధించిన అల్లమ ప్రభునికి ఏమి జెప్పవలెనో తెలియక అతనినే అడిగినటుల "స్వామి, ఏది పాపమొ ఏది పున్నెమొ పెద్దలనాటి నుంచి వంశానికొచ్చిన పని జేస్తున్నాను మీరేమొ జెప్పితిరి నాకేమియు తెలియలేదు నాలాటి మూర్ఖులే ఎక్కువ ఎంత చెప్పిన తెలియలేరు మీరు పెద్దవారు వారికి తెలియునట్లు మీరు నడతలో చూపితె చాలు" గొగ్గయ్య అజ్ఞుడని బోధ చేయబోయిన అల్ల ముడు అదరిపడినాడు సిద్ధరాముని దిక్కు చూచినాడు గొగ్గయ్య తన పనిలో దిగినాడు ఇక అక్కడుండు పనిలేక అల్లముడు ముందడుగు వేస్తూ "సిద్ధరామ దేవా! చూచితివా, ఆ గొగ్గయ్య ఎంత మాటన్నాడు ఆ మాటలో ఎంత అర్థ మిమిడి యుంది ఏదో చదువులు చదివినామని మనము అహంకరించుట ఎంత చిన్నతనమో చదువులేని గొగ్గయ్య ఆ మాటనుంచి విశదీకరించినాడు, ఆయన గొప్పవాడు మనము లోకానికి తెలియపరచేదానికన్న తెలుసుకొనునదే ఎక్కు" వనుచు త్రోవలో నడచి వచ్చుచుండగా

దూరమందు కల్యాణ పట్టణములోని త్రిపురాంతకేశ్వరుని గుడి గోపు రోన్నత శిఖర కలశము కనబడినందున కల్యాణము సమీపించితిమని సంతస ముతో సంభాషించుచు కల్యాణ మహాద్వారము సమీపించి ఆ పురానికి వందన మాచరించి, అయ్యా సిద్ధ రామేశా, వచ్చితిమి భూమండలానికి హృత్కమల కర్ణికావాసమైన, సరస్వతికి ముఖ దర్పణమైన, సకల ధర్మంబులను రక్షించు కరండమై, సత్యసాగరమై, భక్తికి పుట్టినిల్లై, ముక్తి ముఖమై, పుణ్య పుంజమై, అభినవ కైలాసముగా వెలుగొందు కల్యాణ కటక దర్శన భాగ్యము మనకబ్బిన దని మరియు ఇటుల వర్ణించుచున్నాడు

**అల్లమ ప్రభు :**

కళ్యాణంబను ప్రమిదయందు భక్తి రసమను
తైలమును నింపి ఆచారమను వత్తియందు బసవణ్ణయను
జ్యోతివెలిగించిన మెరసి ప్రకటంబయ్యె శివుని ప్రకాశము
ఆ ప్రకాశంబులో ఒప్పుచు నుండిరయ్యా అసంఖ్యాత
భక్త గణంబులు శివభక్తుఁడుండు క్షేత్రము, అవిముక్త
క్షేత్రంబనుట కల్లయా? శివభక్తుఁడుండు దేశము పావ
నంబనుట కల్లయా? గుహేశ్వర లింగమందు నా పరమా
రాధ్యుడు సంగన బసవణ్ణ మహిమ జూడుమా సిద్ధ
రామయ్యా! ౧౬

**వివేచనము :**

సిద్ధరామదేవా చూచితివా? వెలుగుచున్న సద్భక్తి ప్రకాశము తను, మనేంద్రియములకు పరమ శాంతిదాయకము, కళ్యాణ కటకమే ప్రమిద, భక్తియే తైలము ఆచారమే వత్తి బసవన్నయే వెలుగు జ్యోతి ఈ జ్యోతి ప్రకాశము వెలుగులో వెలుగులై అసంఖ్యాత భక్తగణంబులు జ్వలించుచున్నారు చూడు రామయ్యా! సిద్ధ సాధ్య విద్యాధరులకు గరుడ గంధర్వులకు దేవదానవు లకు లభ్యము కాని, వేద వేదాంతములు పొగడరాని అవిముక్త క్షేత్రమిది ఉన్నచోటనె ఉన్న దేహమందే జీవులు ముక్త మార్గనువర్తులై సమస్తము తామెయై నిత్యానందములు నుండు పావన క్షేత్రము ఎందుకంటె, ఇది శివభక్త

నివాసము శివుడున్న కైలాసమున కన్న మిక్కుటమీ జీవ కల్యాణ క్షేత్ర కల్యాణ కటకము నా ఆరాధ్యుడు బసవేశుడుండు పవిత్ర క్షేత్రము

ఇటుల కొనియాడుచు భక్తి పారవశ్యమున సిద్ధరాముని చేయి పట్టుకొని వచ్చుచుండ ఒకచోట చెన్న బసవన్న రాసిన కళ్యాణ పరిచయ ఫలకముందు నదిచూచి నిలబడి చదివి తెలుసుకొని ముందుకు వెళ్ళుచు పట్టణపు విస్తార వీధులు, ఎత్తైన దివ్య భవనంబులను, వింత వినోదములు జూచి సంతోషించుచు బసవ రాజు భవన సమీపానికి వచ్చినపుడు ప్రభుదేవుడు వివిధ రీతుల వర్ణించి బసవన్న యుండు విశాల రాజభవనమును కొనియాడి చెప్పగా సిద్ధరామదేవుడు పులకాం కురుడై భక్తిపారవశ్యంబున భవనంబునకు చేయెత్తి వందనమాచరించి ఇట్లు పలుకుచున్నాడు

**సిద్ధరామయ్య**

అయ్యా, మీ శరణులు కానివారల గృహంబులు వ్యర్థము చూడయ్యా! మీ శరణుల గృహంబులే నివా సంబు నాకు జూడుమా! సిరియాళుడు ఇల్లు గట్టి వేరె ఊరికి వలస పోయె దాసిమయ్య ఇల్లుగట్టివ్యవ హారమాడిపోయె సింధు బల్లాళుడు ఇల్లుగట్టి చేకూలి వాడయిపోయె గంగవాళుకలు ఇల్లుగట్టి లింగరహస్య మెరుగక పోయిరి వీరందరూ మందిరము గట్టి మహా మెరుగక సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యమను పదవులకు లోనైరి మా సంగన బసవన్న వచ్చి కల్యాణ మందు మందిరము గట్టిన మర్త్యలోకమెల్ల భక్తి సామ్రా జ్యమై యుండె ఆ మందిరమునకు తలవంచి లోపల పోయిన వారంత నిజలింగ పదవిని పొందిరి ఆ గృహంబు చూడవలెనంచు నే ఎంతో కాలము నుండి తపముంటి కపిలి సిద్ధ మల్లినాథా, మీ శరణ సంగన బసవణ మహా మంది రంబునకు నమో నమోయని బళికితినయ్యా! ౧౭

**వివేచనము .**

మహా ప్రభూః నే ధన్యుడనైతి, పవిత్రుడనైతి నాయట్టి సుకృతాత్ముడు మరిలేడు కొనియాడుటకు నోరాదని మహత్తరమైన బసవభక్తి నివాసము గంటి నినుగన్న కంటినుంచి ఇది యంతయు గాంచితి నీకు పరమారాధ్యుని భక్తి భండారి భవనంబు ఈ లోకములో ధ్రువమయ్యె పూర్వపు మహాభక్త శిరోమణులు మహాద్భుత త్యాగనిధులు సిరియాళుడు, దాసిమయ్య, సింధు బల్లాళులు కైలాస విలాసములకు లోనైరి గంగెవాళకులు చతుర్విధ పదవుల బంధనములో చిక్కిరి

చూడవలెనను కుతూహలము స్వామి, తమ కరుణచే ఈ రోజున జూచి ధన్యుడనైతినని మహానుభావంబున బసవేశ్వరుని స్తోత్రము చేయుచుండగా ప్రభువు వినుచు బసవ భవనము పరికించుచు పథశ్రాంతము మరచి పరవశుడై నిలిచినట్లే నిలిచిపోయెను

— ० —

ఇది కృపామూర్తులైన మృత్యుంజయప్ప గారిని, స్వప్నబోధా మూర్తులైన శ్రీ ఎఱ్ఱి తాతయ్యగారిని స్మరించి సకల శివ శరణులకు వందించి శూన్య సంపాదనలో "బసవేశ్వరుడు, చెన్న బసవేశ్వరునికి అనుగ్రహించిన సంపాదనము" నకు సంగ్రహముగా జెప్పిన వ్యాఖ్యానము సంపూర్ణము

శ్రీ గురు బసవ లింగాయ నమః

# శూన్య సంపాదనము

## ప్రభువు కల్యాణమునకు వచ్చిన సంపాదనము

కం॥ లింగార్చన మైమరపున
మంగళుడా బసవదంపచారుల, ప్రభుడున్
జంగమ భక్తి విధమ్ముల
నింగితమును బోధ జేసె, నిలనదియనెదన్

సిద్ధ రామదేవునితో అల్లమ ప్రభు దేవుడు కల్యాణమునకొచ్చి బసవేశ్వరుని రాజ భవనము ముందు నిలిచియుండగా హడపద అప్పణ్ణ చూచి వెరగందినాడు అప్పణ్ణ బసవేశుని ఆంతరంగిక భృత్యుడు, మిత్రుడు, ఆప్తుడై, ధార్మిక, రాజకీయ సామాజికములలో అహర్నిశలు బసవన్న బహిఃప్రాణంగా యుండు సద్భక్తుడు వారి దివ్య తేజో విలాసములు జూచినాడు పైగా అల్లమ దేవుడు నిలిచిన చోట ఆయన నీడలేదు ఏదో తేలికయై వెలుగుబట్టిన అంగము తెలియ డానికి సాధ్యము కాని రీతిగ నుండగని, మాటలాడించుటకు భయపడినాడు ఆ వేళ లోపల బసవన్న గారు లింగ పూజలో పరవశులై వున్నారు చేయగల కార్యాన్ని గురించి ఆలోచించి, ఏమైన కాని బసవన్నకు ఈ మహనీయుల రాక చెప్పకుండ యుండకూడదనుకొని మనసులోనే ఆ మహా పురుషులకు వందించి బిరబిర లోపలికిపోయి శివపూజా మగ్నుడైన బసవన్న దగ్గరకు వెళ్ళి భయభక్తి వినమ్రుడై నోటికి చేయడ్డుపెట్టి మెల్లగి విన్నవించుకొనుచున్నాడు

**అప్పణ్ణ**

దేవ దేవ, మహా ప్రసాదము కన్నులందు కలు
షంబు లేదు కాయమందు బరువు లేదు మాట యందు
మొన లేదు నడక యందు గతిలేదు ఇదెట్టి రీతియనునది
తెలియరాదు మరులు లేని మరులు, ఎరుకలేని ఎరుక,
బసవప్రియ కూడల చెన్న సంగయ్య రాక కౌతుకమై
యుండె చిత్తగించవయ్యా సంగన బసవణ్ణా! ౧

**వివేచనము :**

అన్నయ్యా, విన్నపము ఎవరని నిర్ణయించుటకు సులభముకాని దివ్య పురుషోత్తముడు మన భవన మహా ద్వారము ముందు నిలిచినాడు నిర్దోషమైన కన్నులు చూస్తూవుంటే దివ్య ప్రకాశ గోళములై వెలుగుచున్నవి ఇక అతని శరీరము అందరిలాగుండినా, దానియందు బరువే లెదను సూచనలిచ్చు ధూమాకారమా అను భావన కలుగుచున్నది బసవదేవా! ఏమి చెప్పవలెనో తోచకున్నది మరి ఆయన కాయానికి నీడలేదు పాదాలకు ముద్రలేదు నడిచినట్టు కనబడినా ఎక్కడికి పోవక ఉండినచోటె ఉండును ఆశ్చర్యము ఏదో పిచ్చి పిచ్చిగా కనబడినా పిచ్చికాదు విచక్షణుడు జ్ఞానమే లేదనునటుల కనబడును క్షణార్థమందు మహా జ్ఞానియటులా మన మతికి తోచును ఆయనతో మరియొక రెవరో ఆజానుబాహువు మహాయోగమూర్తివలె నున్నాడు ఏమియు తెలియక మీతో చెప్పకొంటిని ఈ వెనుక ఇట్టివారు మన మందిరాని కొచ్చినట్లు నాకేమి జ్ఞాపకము లేదు క్షమించవలెను పూజకు విఘ్నమైనది సెలవియ్యండి

నమ్రంగా నయ భయమున అప్పణ్ణ చెప్పకొనివచ్చిన విషయాలు లింగ పూజానురక్తిలో నున్న బసవన్నకు ఎక్కడనుంచియో దూరమునుంచి వినినట్లై అరమోడ్పు కన్నులు విప్పి చూచినాడు అప్పన్న చెప్పిన లక్షణాలు హస్తపీఠమందున్న లింగములో మసకగా కనబడినట్లైనది గురుతుకు రాలేదు పూర్ణంగా జాగ్రితావస్థకు వచ్చుటకు ఇష్టములేక, లింగానందము విడువలేక ఇట్లను చున్నాడు

**బసవణ్ణ .**

కాయపు కరంబునందు కరస్థలము ప్రాణపు
కరంబునందు జంగమ స్థలము ఈ ఉభయ భావంపు శివ
లింగార్చనపు పరమానంద స్థలంబు కాయము భక్తుడు
ప్రాణము జంగమంబు ఏది ఘనమందు? ఏది చిన్న
దందు? కూడల సంగుని శరణులు వచ్చిన ఉపచారంబు
నకు తెరవు లేదు కరుణించి రమ్మనుమా అప్పణ్ణా! ౨

**వివేచనము .**

అవకాశమెక్కడుండు అప్పణ్ణా! చూడు, శరీరపు చేతిలో ఇష్టలింగము ప్రాణము చేతియందు జంగమస్థలము అనునది ఏమన, బయటి ఆరాధనము గొనుచున్న క్రియాలింగము అంతరంగములో నున్న జ్ఞానములో చేరి పరమానందమైనది ఈ స్థితిని వదలలేను ఇంకొకటి కాయము భక్తుడు ప్రాణము జంగముడు గదా! దీనిలో ఒకటిని విడిచి ఒకటుండుటకు నేనిప్పుడు. ఏది ఘనము, ఏది కనిష్ఠమనేది. ఇది అవినాభావ సంబంధము ఇట్లుండగా శరణులు వచ్చిన - వచ్చినట్లే వచ్చుట కభ్యంతరము లేదు నీవె పోయి వినయంబున దోడు కొని రావయ్య అని బసవన్న పిలుచుటకు పూజ విడిచి లేవలేకయుండు రీతిని గని బసవన్నను జూచుచుండగా ధ్యానమగ్నుడై సగి చూచి ఏమనుటకు వీలులేక మహాద్వారము ముందరకొచ్చి భక్తితో వందనంబాచరించి విన్నవించుచున్నాడు

**అప్పణ్ణ .**

మనము మనంబులేకార్థమై, కాయ కాయములు
సంబంధమై, ప్రాణమునకు ప్రాణము సమదర్శనమై
యుండువారికి తెరమరుగనునది లేదు చూడయ్యా! సంగమ
నిస్సంగమై యున్న వారికి ఉపచారంబునకు పేరుండదు
చూడుమా: బసవప్రియ కూడల చెన్న సంగయ్య శర
ణుడు బసవణ్ణ పిలువనంపె కృపచేసిరమ్మా శ్రీగురుదేవా! ౩

**వివేచనము :**

శరణార్థులు మహాదేవర దేవా, శరణార్థులు తాము మహితాత్ములు, మహోదారులు, కరుణార్ణవుల నేను బసవేశ్వరుని భృత్యుడను నా పేరు హడపద అప్పణ్ణ బసవన్న గారిచే ఆజ్ఞప్తుడనై పిలువ వచ్చిన తమ సేవకుడను. లోన శివపూజ యందున్న బసవన్నగారికి, తమకు దేహప్రాణములు ఒకటె భావ సంబంధములు వేరు లేవుగాన తమకు భేదమే లేదు ఉపచారాని కింకెక్కడ తావు? లోపలకు విరుణించి రావలెనని వేడుకొనుచున్నాను

అప్పణ్ణ బుద్ధిశాలి, అనుభవజ్ఞుడు, బసవరాజుకు తగిన బంటు మృదు మధురంగా తేనెలొలుకు తియ్యని మెత్తని మాటలతో వారిని ఆహ్వానించిన ధోరణి జూచి అల్లమదేవుడు తల ఊపి ఇట్లనుచున్నాడు

**అల్లమప్రభు :**

మనసు మనసు ఏకమై, తనువు తనువు ఒక్కటై
కూడిన వెనుక పిలువనేల కాలుపట్ట నేలని ఎరిగినవారు
ఉపచరించి రమ్మనిన అదే కొరత జూడుమా! లింగము
చేతియందు క్రియయుండ మాటల అద్వైతమెట్లగును?
నేనుగాక మున్ను తానైతి ననువారి దగ్గరకు మా
గుహేశ్వర లింగము పాదముంచడయ్యా! ౪

**వివేచనము :**

ఓహో! ఇదియా మీ ప్రవర్తనలు? దూరపుకొండ నునుపు కానిమాటలు విని వచ్చినాము నిజమే. ఎంతైనా ఉన్నత రాజకీయవేత్తలు ఇంతె తామాడు మాట లర్థమే తమకు తెలియని రాజసులు అయ్యా అప్పణ్ణా! తను మనోభావాలు ఒకటని ఎంతో కమ్మగా పలుకుచున్నావు రమ్మని పిలుచుచున్నావు దీని యర్థమేమి? ఉద్దేశమేమి? రమ్మనే దానిలో రమ్మనేవారు, వచ్చువారు, ఇద్దరుండి భిన్నమైనపుడు, ఒకటనుట ఎట్లు? నీ పిలుపులోనే భిన్నమున్నది ఒకరొకరు ఒకటి కాదను కొరతయున్నది ఇట్టి చలోక్తులు, చూడవచ్చిన ధార్మిక పురుషుం తోడనా? బసవన్న చాల గొప్ప భక్తుడని కీర్తిగన్నాడు గదా-లింగపూజలో

లింగము అంగము వేరై పూజ్య పూజా ద్వైతభావముండి అద్వైతమెట్లగును? నేనెవరన్నది తెలియక రానై తిన్న వాడినని జీవితె తెలిసినాడు శివుడై తి నన్న అవిచారులున్నచోటికి రాము అని ఖండితముగా ప్రభుదేవుడు నుడువగా అప్పణ్ణ గ్రహించి ఆడినమాట సరిగాలేదని చెవరి బసవన్న దగ్గరకొచ్చి, మన పిలుపు చెల్లలేదు చెప్పినది అద్వైతము నడచింది ద్వైతము బసవరాజ, ఇది తగదు వచ్చినాయన తెలివికిందని మహానీయుడు విద్వాంసుడు మహా తార్కికుడు దుర్నిరీక్షణమైన వ్యక్తిత్వము భక్తి జంగమ అంగ లింగముల ఏకత్వ ద్వివిధత్వములు వాదాలకు రావుదేమొ స్వామి! మీరు పెద్దవారు. వచ్చినవారు పెద్దవారు . ఒక మనవి విన్నవించుకొంటాను

**అప్పణ్ణ**

దేవదేవ, మహా ప్రసాదము. మీ శరణువింటి
కొప్పుబంటునే గాదయ్యా! తను మన ధనంబుల వెను
కుంచుకొన్న వంచకుడు నేనయ్యా! మీ శరణులు
నా ఇచ్చ కొచ్చెదరె? "చకిత మభిధత్తే శ్రుతిరపి" యను
చుండ, నానుడి మీ శరణుల నోకునె? నుదురుపాటు కాపి
పొట్టకూటికి మీ మరుగున అడగియున్న హడపము
వాడిని నేనయ్యా! బసవప్రియ కూడల చెన్న సంగని
శరణులు నామాటకు రారు మీరె వెళ్ళి వేంచేసుకొని
రావయ్యా సంగన బసవణ్ణా!

**వివేచనము**

మీ శరణులను పిలువ నా యిట్టివాడు తగునా బసవేశా! లేదు లేదు మీ శరణులింట బంటుగానుండు భాగ్యము నేను పడయలేదయ్యా! ఎందుకంటు, తను మన ధనాదులు నావని ఉంచుకొన్న వంచకుడను విధిలిఖితము మీరలేక కడుపు కక్కుర్తికై మీ మరుగునబడిన హడపము వాడను తండ్రీ! శ్రుతులడు భ్రాంతి కలిగించిన మీ శరణులు నా యిచ్ఛకు రారు స్వామి! తమరేవెళ్ళోయి పిలుచుకొనిరండి, యని మనస్సులో నొప్పిపడి చాలవేదనతో అప్పణ్ణ లేక సేవ శరణులకు చెందలేదని పరితాపము బంది తానకు బసవన్నను మంచి శుంహా

యిచ్చునపుడు ఇక్కడి నడిచినదంత విని చెన్నబసవన్న ధావించి వచ్చినాడు బసవన్న పూజానుభావపు అలసటతో పొరబడినాడని తెలిసి ఇట్లనుచున్నాడు

**చెన్న బసవణ్ణ**

లింగమె జంగమము జంగమె లింగమనుచు నమ్మి
వచ్చినది నమ్మకున్న పాలకుండ యందు పులుపు జొచ్చి
నట్టు చూడయ్యా! అంగము మీద లింగమున్న దంతయు
సంగమ నాథుడంచు నమ్మిన నమ్మకము వచ్చిన శర
ణుల రీతి నెరుగకున్న తప్పే చూడుము గురుదేవ!
సంగమ నాథుడు ఇంటికి అంగము ధరించి వచ్చిన
ఇమ్ముగ ఎదురేగి వందనము చేయవలయు జూడయ్యా!
కూడల చెన్న సంగుని శరణులు ప్రభుదేవుడు సిద్ధ
రామదేవుడు వచ్చి వాకిలి ముందుండ కన్నెరుగకున్న
మన మెరుగదా సంగన బసవన్నా? ౬

**వివేచనము :**

ఇంత మైమరపా బసవేశా? నీవనుకొన్న వెనుకటి సంకల్పాలు మరచితిరా స్వామి! ప్రభుదేవుడు మిమ్ము వెదకుకొనుచు వచ్చుచున్నాడని నేను చెప్పియుండ లేదా? ఆయనిప్పుడు సొన్నలిగె సిద్ధ రామదేవునితో వచ్చి మహాద్వారమందు నిలబడి యుండగా ఈ శివపూజలేల? జంగముని రాక కేగి దా ఈ పూజలు? వచ్చినది లింగపూజ తెలుపలేదా నీవుకోరిన సంగమనాథుడే మహాజంగమ రూపముతో అనుగ్రహించుటకు పిలువక ఇంటికి రాగా ఈ చర్చలేల ఈ రాయబారా లేల? ఇదేమి రాజకీయమో చూచియే తెలియవలెనా అంతఃకరణాలెరుగ లేవా? చేసిన శివపూజలు ఇక చాలు, దయచేసి లేవండి

చెన్న బసవన్న ఆతురతతో వచ్చి బసవన్నను హెచ్చరించగా బసవన్న ఆపరి భయమంది, కన్నుల నీళ్ళతో చెన్న బసవన్నకు వందన మాచరించ బోయిన చెన్న బసవన్న ఆయనను పాదాభివందనము చేయనీక అట్లనే ఎత్తు కొని సమాధానంబు చేయగా బసవన్న గద్గద ధ్వనితో ఇట్లనుచున్నాడు

**బసవణ్ణ :**

మతిచెడి, భ్రమితిగుంది, బేలనైతినయ్యా! గతిచెడి, వ్రతముచెడి, ధాతు చెడ్డ బాహిరుడ నేనయ్యా! చేదు ముంతలోని ముత్యంబట్టులయ్యుండె నాదు భక్తి నడచి లింగ జంగమంబింటికి వచ్చిన ఎడమీయక చెడిన చెడుగు నేనెంతని చెప్పుదునయ్యా? నవరత్నము పెరికి మడువులో వేసిన మర్కటంబట్టులైయుండె నాదు భక్తి కూడల సంగమదేవుని తెచ్చి ఇచ్చిన మీ పాదరక్షలు మోసి గంతు లేసెద చూడుమా చెన్న బసవణ్ణా! ౭

**వివేచనము :**

తప్పితి, జారితి, చన్న బసవా, నీవు చెప్పినది మరచితినయ్యా! నాకు మతిలేదు నేను వట్టి భ్రమిష్ఠుడనైతి, భ్రమి చెడితి మర్కటము లాగైతి, కోరినది రూపుదాల్చి వచ్చినపుడు మైమరచితిని విషములోని ముత్యమయ్యె నా భక్తి చెడితినన్న దానికి మేరలేదు నా అవివేకానికి కొలతలేదు నా అజ్ఞానమునకంతులేదు తెలిసి చేసిన దానికి క్షమ లేదు చెన్న దేవా, నా సంగుని నాకు తెచ్చి ఇచ్చిన నీ పాదుకలు మోసి ఊరేగింతు కరుణించు

అని చెన్న బసవన్నను ఒకేరీతి పొగడి అంతులేక తనను నిందించు కొనుచు ఉన్మాదునివోలె, జడునివోలె, పరితపించుట చూచి చెన్న బసవణ్ణ మహానుభావుడైన బసవన్నకు భ్రమతి నింపి ఇటులనుచున్నాడు

**చెన్న బసవణ్ణ :**

ఓహో గురుదేవా మీ పాదరక్షల బంటు నేనుండ జంకేల, భయమేల ? సంగమ నాథుడొచ్చి మీ మనము చూడవలెనంచు తన మనము అడ్డు బెట్టె ఇది యొక లీల గాగ అది మీకు సహజమగునె? మంచు మోహరము సూర్య కిరణముల కడ్డమే? మిమ్ము స్మరియించు వారికి సంసారము లేదంచు శ్రుతులు పొగడుచుండ మీ జ్ఞానంబునకు లోటున్నదె? కూడల చెన్న సంగుని శర

ఖుల పిలువ నా మనసను చర్మపు పాదుకల తొడిగి
పొమ్మా సంగన బసవణ్ణా! ౮

**వివేచనము :**

గురుదేవా! గురుదేవా!! ఎందుకంత బేలతనము, ఎందుకంత దైన్యము? ఇక్కడైన అపరాధమేముంది? నీ పాదరక్షల బంటు నేనుండ జంకేల? బసవయ్యా, ఇది నీ యపరాధము కాదు వచ్చి నాయన కొంచెము పరీక్ష జేయుటకై ఈ నాటకమాడె అది మీకేమి సంబంధము? బసవ బసవా యన్న వారికి భవంబు లేదను వేద వాక్యములుండ మీకగు కొరత ఏమి? సూర్యుని కిరణాల ముందు ఎంత మంచున్నా నిలువగలదా? ఇదో, సందేహము వలదు నిశ్చలమై నా మనసను చెప్పులు తొడిగి రమ్ము పోవుదమని దృఢముగా పలికిన చెన్నబసవన్నని వీర వాక్యములు విని తన దుర్బలతను త్రెంచి కడు ముద మంది హర్షోద్గారముతో కృత నిశ్చయుడై ఇట్లనుచున్నాడు

**బసవణ్ణ :**

నమ్మితినయ్యా నేను నచ్చితినయ్యా నేను
బతికితినయ్యా నేను, మీ కృపవలన! పాడు గుంతలో బడిన
పశువు దూడను దీసి తల్లి ముఖము జూపినట్లు, పాప
కూపంబున బడినవాని లేపి కూడల సంగుని శరణుల
చరణము జూపి నన్ను మిగుల్చుకొనెను! పోయిన జీవ
మునకు తన కరుణపు సంజీవని పిండి ఎత్తెను చెన్న
బసవన్న వ౦౦ ఈ విధము బతికితిని జూడ మా! ౯

**వివేచనము**

ఆహా, ఎంత చల్లని సమాధాన మిది, ఎంత కర్తృ జ్ఞాన ధ్రుతి ఇది ఔను మరి అట్టి విజ్ఞాన నిధికే ఇట్టి సమర్థనీయమైన సమాధానము చెప్పుట సాధ్యము ఇది ఇతరులకు కాని పని ఇక నేను నమ్మితి, విశ్వాసముంచితి ఇక భయములేదు సంశయమను ప్రపాతములో పడిన నన్ను తన విశ్వాస ధైర్యములతో ఎత్తి, శరణుల పాదసేవకు పాత్రునిగా జేసినాడయ్యా చెన్న బసవరాజు లేకపోతె ఎత్తేవారు లేక గుంతలో పడిన పశువువోలె పడియుండ్డి

యుందును నేను భాగ్యశాలిని అప్పణ్ణా, చన్న బసవయ్య సమయమునకొచ్చి హెచ్చరించె, బతికితిని బతికితిని, సొడ్డల బాచరసా, ఏమందువు? మాయందరి కృపాకటాక్షమని ఒక్కేరీతి బసవన్న ఉన్మాదునివలె తనకు ఇప్పుడే ఇది తెలిసిన దన్నట్లు ఆడినమాటే ఆడుచుండగా బసవరాజు కడ్డువచ్చి శివశరణుడు సొడ్డళ బాచరసు నెమ్మదిగా ఇట్లనుచున్నాడు

**సొడ్డళబాచరసు :**

తెరపు మరపనునది మీ గుణముకాదు అమృత
సాగరమందు వేప దొక బిందువుండునా? మనసు చూడ
వలెనంచు నాటక మొడ్డిన, అందుకు సహజంబుగాదు గాన
వెరవవలదు మహాదాని సొడ్డళుని మనంబు నొచ్చెనని
జంకనేలనయ్యా సంగిన బసవణ్ణ? ౧౦

**వివేచనము :**

లేదు లేదు, ఎక్కెక్కడనూ సందేహము లేదు కవలు మనసు నీదికాదు ఎక్కడైన విన్నామా అమృతంబున వేప చేదుండునని? అసంభవము బసవన్న మహనీయుడు అతనిలో లోపమున్నదను వారెవరు? వచ్చినాయనెవరో కొంచ మొత్తి చూచుటకు ఈ నాటకము పన్నినాడు నీ సహజ సద్భక్తికి లోటు లేదు బసవరాజ!

సొడ్డళ బాచరసుడు స్థైర్యవంతుడు వివేకశాలి బసవరాజు దాసోహంభావ సంజనిత దౌర్బల్యానికి బాచరసుని పలుకులు అదెంతో నిర్భయత చేకూర్చినవి ధ్రుతిచెడిన బసవన్న స్థిరత పొందినాడు. మరేదో తలచుకొని బసవన్న అంద రితో ఇట్లనుచున్నాడు

**బసవణ్ణ**

లింగార్చనము జేతునయ్యా జంగముడు నా
మఠంబునకు రావలెనంచు ఆ జంగముడు నా మఠమున
కొచ్చిన, లింగార్చనము విడిచి జంగమార్చన జేయుదును
అదేమి కారణమనిన, ఆ లింగమునందు పదముండు,

ఫలముండు, భవముండు ఆ జంగమునందు పదము
నాస్తి, ఫలమునాస్తి, భవమునాస్తియైన కారణము
లింగార్చనం న కర్తవ్యం కర్తవ్యం జంగమార్చనం
లింగ జంగ ను యోర్మధ్యే జంగమస్తు విశిష్యతే
యన్నదిగాన కూడల సంగమదేవయ్యా, నేనిక భవ
భవాంతరము మీ జంగమార్చన జేసెద

**వివేచనము :**

లింగ ముఖాబ్జ భృంగమే జంగమము ఆ జంగముని ఆగమనానికే లింగ పూజ ఐతె, లింగపూజ వేళయందు జంగముడు వచ్చినప్పుడు లింగపూజ చేయరాదు జంగముని పూజ చేయవలయును ఎందుకనిన, లింగ పూజలో పదము, ఫలము, భవములుండును ఈ మూడు భక్తుడైనవాడు తనకై ఉంచు కొంటె జన్మబంధములకు చిక్కును గాన, ఆ మూడు జంగమార్పితము చేయవలెను.

అని బసవరాజు భక్తవత్సలుడు, ముక్తిముఖ దర్పణుండు, అహంకార కాసార శృంగారచ్ఛేదనుండు, కరుణరస సింధుండు, షడుస్థల సంధాన నివాసుండు, శత ఏకస్థల మూలుండు, పంచముఖ పంచలింగ స్థాపనాచార్యుండు, భక్తజన హృత్ కమలార్కుండు, శరణ నికురంబాబ్ధి శశాంకుడు, భవ విపిన దావానలుండు, భవసింధు బడబాగ్ని బసవదండాధీశ్వరుండు చెన్న బసవ రాజ దేవుడు మొదలైన అసంఖ్యాత మహా గణంబుల పిలిపించి, విభూతి వీడెములు, కానుకలు సహితంగా, నవరత్న ఖచితంబులైన దివ్యాంబరములతో వాకిట తోరణాలు గట్టించి, దేవాంగ మౌక్తిక చెరగుల చీరలు నడుమడలుగా (శివాచీలుగా) పరచి, చీని చీనాంబరములు పగడంబులు ఝల్లరులు, రత్నంబులు ఝల్లరులు మేలుగట్లు గట్టి కలశ దర్పణములు పంచ మహా వాద్యములు, ధూపారతి ఘంటా సహితమై, ప్రభుదేవుని పిలువ సర్వమంగళ కార్య సంభ్రమాతురుండై బసవరాజు ఇక్కడుండ (ఈ గద్యము సిద్ధవీరణ్ణొడెయులది )

అక్కడ అడిగేవారు దిక్కులేక పిలచిననూ తాము పోవకున్న, పిలుచుటకు వచ్చే అప్పణ్ణ వాద వివాదములో ఉండిపోయినాడు ఇంత రసాభాసమైన

ప్పుడు పిలువక పోవుటెట్లు? ఇంత దూరము చూడడానికై వచ్చి బసవేశ్వరుని చూడకపోవుటెట్లని సందేహముతో ఒకరినొకరు చూచుకొనుచుండ లోపలినుంచి మంగళ వాద్యములు వినిపించినవి ఆవి మనలనే పిలువ వచ్చుచున్నటులున్నవి అని అల్లముడు తెలిసి ఊరక వెరగున చూస్తున్న సిద్ధరామయ్యను జూచి ఇట్లను చున్నాడు

**అల్లమ ప్రభు**

చూడుమా సిద్ధరామయ్యా, అపుడె భక్తులకు
అహంకారమై యుండె భృత్యుడున్నెడకు కర్తృదేతెంచిన
ఇటుల పిలుచువారుందురె? బసవన్న యందు ఈ విధము
అజ్ఞానంబున్నదన్న మిగిలిన శివభక్తుల గతియేమి
చెపుమా? గుహేశ్వర లింగమును భక్తిరతితోన మన
ముంచి పిలిచిన పోవుగాక, వ్యర్థంబునకు పోవరాదు
చూడుమా! ౧౨

**వివేచనము** ·

సిద్ధ రామేశా, అదేమి ముగ్ధుడైయున్నావు? చూచితివా పెద్దవారి పామరత్వము విధాయకంగా కట్టుకొని తమ జీవిత పరమార్థమే ఇదన్నట్లు సక్రమంగా నడుపు కొనివచ్చుచున్నారు ఆహా, అజ్ఞానంబును ఎంతనిష్ఠతో పెంచుకొన్నారయ్యా! విచిత్రము వింటున్నావా లోపల వాద్య ధ్వనులు మమ్ము పిలుచుటకే ఉండవచ్చుగదా? అదిగో ఉత్సాహ ధ్వనులు ఏమి సంబరము? నిలిచిన మమ్ము కూర్చొనుమని చెప్పె దిక్కులేకున్నా, ఆహ్వానించే రాజరీవులు, మంగళ వాద్యాలు, ఆ పతాకములు, తోరణాలు, మణిఖచిత శృంగార దర్పణాలు, ఆయన అప్పణ్ణ అన్నాడు చూడు ఈ భవనము మాదని, దాని వాకిళ్ళ కావలి తమదని అనలేదా? ఇప్పుడు నౌభత్తు నగారులు వాయించుతు వచ్చు రాజసము చూస్తె మన ఇల్లనేదెక్కడ? వారిదె ఇల్లనునట్టులున్నది కదా? ఎంత తియ్యనిమాటలు స్వామి భృత్య న్యాయమెక్కడుంది? మేము పనికిమాలిన పరదేశులు! మాకై అంత విజృంభణముతో ఎదుర్కొనడానికి రారు, తమ గౌరవ పదవుల ప్రదర్శనానికి వచ్చుచున్నారు

శివశివా, పెద్దగా వందనాలుబెట్టి చూడవచ్చిన బసవన్న రీతియే ఇటులైన సామాన్య శివభక్తుల గతియేమి చెప్పవయ్యా? ఇట్టి విలాస వినోద విభ్రమము లతో పిలచిన సహజ గుహేశుడు పోవగలడా?

ఒకే ధాటిగ అల్లమప్రభు తమ నిశిత విమర్శా లింగఖడ్గంబెత్తి, ఆ వచ్చు చున్న వైభవాలను తునుకలుగా పడవేసి ధీరుడై మాయా కోలాహలుండై శాంత రుద్రునివలె నిలుచున్న ప్రభువును జూచి ఏమి చెప్పవలెనో తెలియక సిద్ధ రాముడిలా విన్నవించుచున్నాడు

**సిద్ధరామయ్య :**

మీ శక్తి అతనియందున్నది కనుమయ్యా! ఆతని
ప్రాణంబు మీయందున్నది! మీకు వారికున్న భేదము
ఎవరెరుగుదురు చెప్పవయ్యా? కపిలసిద్ధ మల్లినాథయ్యా,
మీ శరణ బసవణ్ణరీతి మీకె తెలుసునయ్యా! ౧౩

**వివేచనము**

నాకేమి తెలియునయ్యా స్వామి! మీరె కొనియాడి గొప్పవారంటె మీ వెనుక వచ్చినాను, మీశక్తి అతనిలోన, ఆతని ప్రాణంబు మీయందున్నట్టు అప్పణ్ణతో తాము భక్త జంగముల గురించి చెప్పినపుడు తెలుసుకొన్నాను ఇప్పుడది వేరైనది నాకేమి తెలియునయ్యా! మీరు మీరు పెద్దవారు ఏమన్నా, ఎట్లు చేసినా తప్పొప్పులను సమర్థించుకొంటారు మీకు చెప్పుటకేమున్నది? బహు దూరము నుంచి చూడవలెనంచు వచ్చి బసవన్నను చూడకమున్నే వెనుక నాదొకటైతె ఇదియొక రీతి కాబోవుచున్నది సర్వ సమర్థులు మీరని సిద్ధ రామయ్య పలుకుచుండ, లోపలి వాద్య ధ్వనులు సమీపించినవి లోపల నున్న ద్వారాన్ని దాటి మహా ద్వారము సమీపించగానే శరణ సమూహము లోనున్న బసవేశుడు ప్రభు దేవుని చూడగానె ఉత్సవ వైభవాలను వెనుక బెట్టి శీఘ్రమున వచ్చి ప్రభు దేవునకు దీర్ఘదండ ప్రణామము జేసి ప్రార్థించు చున్నాడు

**బసవణ్ణ :**

నాదు శిఖరము మీ చరణంబు సోకి వెరశి
భేదంబు లేదయ్యా! నా కాయంపు కపటము, నా మనసు
వికారము, మీ అంగుష్ఠపు మొన తాకినంతనె పరిహార
మయ్యె చూడయ్యా! కూడల సంగమ దేవయ్యా, మీ శ్రీ
పాదము వెలుగు గని నా అంతరంగములోని అంధ
కారము పీడెనయ్యా! ౧౪

**వివేచనము :**

అయ్యా మహా స్వామి నను, మన్నించి రక్షించండి. మీ పాద పద్మము నా శిరము సోకినంతనె కాయ కపటములు, మనసు వికారములు దూరమయ్యె కూడల సంగమ దేవయ్యా, మీ శ్రీ పాదాంగుష్ఠము సోకిన వెలుగు నా అంత రంగమున నున్న అజ్ఞానపు చీకటిని తొలగించెనని లేచి చూచునప్పటికి అక్కడ తన ఆరాధ్య మహా జంగముడె అదృశ్యుడై యుండగా బసవన్న చకితుడైనాడు కంపించినాడు ఏమిది చోద్యము? శివ శివా, నేనెంత పాపిని, దరదృష్టవంతు డను? నన్ననుగ్రహించుటకై ఆకారము దాల్చి వచ్చిన శ్రీకారము నిరాకార మైనది ఆహా, నా ఆలస్యము, ఉదాసీనమున చేతికి చిక్కక అదృశ్యమైనది

కనబడు రూపు కాసిరాని దానిలో చేరి అరూపమైనది ఆ రూపు నిజములో బందీయైనది ఆ నిజము నిర్ణయమందు సమాప్తియైనది గదా! ఆ పర వస్తువును దర్శించుట కాయమున్నవారి కి గునా? సద్భక్తి సదాచార సంయుక్తు డైన, మహాద్యుతి సంపన్నుడైన, అహంకార వివర్జితుడైన, సత్యాచార సము పేతుడైన భక్తుడు తన ఇష్టాన్ని రూపించును అదియే శూన్యసంపాదనము భక్తి హీనుడైన నేను సంపాదనా శూన్యుడనైతి సంపాదనా శూన్య తత్త్వము నకు ముక్తియందురు అది అర్థము లేని మాట శూన్యసంపాదన లేనివానికి ముక్తియగు టెట్లు?

హత భాగ్యుడైతినని వ్యథజెంది బసవన్న దుఃఖాకుల చిత్తుడై బయలైన అల్లముని గూర్చి వేదనతో ప్రలాపించుచున్నాడు

శరణని చరణంబు పట్టబోయిన చరణంబుల
నువు కానరావు గురుతు చేబట్టెదనన్న మొదటె అసా
ధ్యంబు అకటకటా! అహంకారమున చెడితినయ్యా
గురువా! నాపరమ గురువా, రావయ్య తెలియని తరుణుని
అవగుణంబు జూచెదరె కూడల సంగమదేవా? ౧౫

మరియు

తండ్రి నీవు, తల్లి నీవు, బంధు నీవు బాంధవులు
నీవు, నీవుగాక మరెవరు లేరు కూడల సంగమదేవా,
పాలముంచు నీటముంచు ౧౬

మరియు

నావారు నన్ను కొనియాడి బంగారు శూలం
బునకు నొక్కిరయ్యా! అహంకార గాయముతో నేనెట్లు
బ్రతుకుదును? నేనెటుల జీవింతును? జంగముడై వచ్చి
శూలము వదలించి, ప్రసాదదమను మందుబెట్టి పాలించు
కూడల సంగమ దేవా! ౧౭

**వివేచనము :**

చూడవచ్చిన భాగ్యాన్ని చేయార పోగొట్టుకొంటి ఇక నాకు దిక్కెట్లు? నే చెడిన చేటునకు కొన మొదలు లేదు అల్లమ ప్రభూ! నిన్ను చూడని కన్ను లున్ననేమి, చేతులార పాదార్చన చేయని ఈ చేతులున్ననేమి, నీ బోధాను భావంబు వినలేని చెవులున్న నేమి, నీ ప్రార్థనకు రాని నా నాలుక ఉన్న నేమి? అయ్యా, నే ననంతాపరాధిని, తండ్రీ, నా యపరాధము ముఖ్యమని ఎంచితె నీ కారు ణ్యానికి లోటు అది కారాదు తల్లి, తండ్రి, బంధు, బాంధవులంతా నీవేనయ్యా! నీవు విడిచిన నాకు దిక్కులేదు

అయ్యా, చిన్న మనవి నీ తనయుడు అమాయకుడనుకొని ఆలకించు అది యేమంటె- చూడు, పదవులు, వైభవములు, దవ్య భోగములు, షడ్రసోపేత భోజనములు, ఇంకా ఇంకా ఎన్నెన్నో ఉండినవని అనుకో దానికి నావారు శివ శరణులంతా కలసి పెద్దవాడని పొగిడినారు అది ఏమని తెలియక నిజమని

అనుకొన్నాను అప్పుడే స్వర్ణశూలమై గుచ్చుకొన్నది అది అహంకారగాయమై దినదినానికి పెద్ద పుండైనది స్వామి గురువా ఈ ప్రపంచమున దీనికి మందు లేదు అది నీ జోలెలో నుంచి మహనీయ జంగముడై వచ్చి ఈ అహంకారపు గాయాన్ని మాన్చి నన్ను నీవానిగా జేసుకో వేగిరమే రమ్ము రమ్మని పరితాప సంతప్తుడై వేడుకొనుచుండగా ఆ పన్నను వదలి కనబడకుండ నుండుట కెట్టి వారికి సాధ్యము కాదు దానియందు తన గురునకు గురువైన బసవన్నను పిలువకనే చూడవచ్చిన అల్లముడు మరుగైయుండునా? ఆ క్షణమే రాళ్ళు కరగించు బసవన్న విలాపము విని ప్రత్యక్షమైనాడు తన మొదటి గంభీరముద్రతో ఇట్లనుచున్నాడు

**అల్లమ ప్రభు**

లింగములోన జంగమం, జంగమునిలోన లింగమం, చెరిగి, మరచి, వ్యర్థాలాపములాడి, జంగమాన్ని మరి పొందు టెందుకయ్యా? ఆ లింగములోనె జంగముని జూచుకొనుము లింగార్చనవసరంబునకు జంగముడింటికి వచ్చిన లింగార్చనము మాని, జంగమంబున కెదురేగి నమస్కరించి భక్తిని జేయునాతడే భక్తుడు ఆ జంగముడు బయటుండ లింగార్చనముజేయు నాతడెట్టి భక్తుడు? జంగముని ఎదుట లింగము చేతియందు బెట్టుకొని, సహపంక్తిలో కూర్చొని పూజించునాతడు భృత్యాచార ద్రోహి ఆ భక్తునింటికి పోవు జంగముడె అజ్ఞాని మా గుహేశ్వరుని శరణులతోడ అహంకారము చెందిన వారిని చూడ నే నొల్లనయ్యా సంగన బసవణ్ణా! ౧౮

**వివేచనము**

ఎందుకు బసవయ్యా, మరల మమ్ము రమ్మన్నావు? నీ జంగముని లింగమున జూచుకొని సంబంధాచరణలో తన్మయుడవై, ఇంటికి వచ్చిన సహజ జంగమమును ఉదాసీనము జేసిన తరువాత మా యవసరము నీ కేటికి? పేరు ప్రఖ్యాతులు గాంచిన, భక్తి అహంకారము, కన్నుల నిండియున్నపుడు ఏది యుక్తము, ఎప్పుడేమి చేయవలె ననునది తెలియగలదా?

గురు జంగములు లేనపుడు లింగమందు జంగమ పూజలు జేయుట సంబంధాచారణము వారు సాక్షాత్ వచ్చిన లింగపూజ మాని వారి పూజ జేయుట సహజాదరణము వీర శైవాచారములో నివి బాల పాఠము చూడు, మరియొక మాట జంగముని ముందు కూర్చొని లింగపూజ జేసినవాడు ద్రోహి అట్టి భక్తు నింటికి పోవు జంగముడు అవివేకుడు అట్టి భక్తుని, జంగముని నే చూడనొల్ల

అల్లముని మాటల నిశిత కరారి గ్రుచ్చుచు బసవన్న మనో పటలాన్ని ఛిన్న విచ్ఛిన్నము జేసినది అపుడు శరణులందరు విచలితులైరి సిద్ధరాముడు బసవన్ననేమొ చూచినాడు సంతోషించి నమస్కరించుటకు వీలులేని కల్లోలము లేపినాడు అల్లముడు బసవన్నను కానకముందు కల్యాణానికి - మందిరాలకు వందనములు పెట్టి కొనియాడినాడు ఇప్పుడీ తప్పుల తడకనల్లి గొప్ప చిక్కు బెట్టినాడు ఎంతలో ఎంత వ్యత్యాసమూ కాబోవుచున్నది ఊరక చూచుచు నిలబడినాడు వచ్చిన వాద్యాలు చల్లబడినవి కలశ దర్పణములు కాంతి హీన మయినవి అలంకారములు మాసినవి వాతావరణము అపరాధ మాలిన్యముచే మలినమైనటుల నిశ్శబ్ద మావరించినది

బసవన్న అసామాన్య భక్తి సంపన్నుడైన తన ఇంటిముందు తన ఆలస్యమున నడచిన ఈ ఘటన వచ్చినాయన సరిబెట్టుకొని యుంటె ఇంతటి సమస్యగా మారుచుండలేదు ఆ మహా జంగముని కృపను పడయుటయే ముందున్న కార్యమని ఎంచి దుఃఖముతో తన మీదనె తాను విసుగుకొని విన్నవించుచున్నాడు

**బసవణ్ణ**

ముమ్మాఱు వచన దినంబుల సాధనము జేసి కదన
మందు చేజూచుచున్నట్లయ్యె నా భక్తి, ఎంత కాలము
లింగార్చన జేసిన నేమయ్యా నా మనమునందు దృఢంబు
పట్టదెంతవరకు? బిందెకుండాలు పడవేసి ఉరి పాలనెత్తుట
కగునె కూడల సంగమదేవా? ౧౯

మరియు

ఎంత కాలము నీళ్ళ యందున్న రాయి కరుగునే?
మృదువౌనే? అయ్యా, ఎన్ని దినములు మిమ్ము బూజించి
ఏమైతినయ్యా? నా మనమందు దృఢము లేకున్నంతవరకు?
నిధానము గాచిన బేతాళుని వలె నాయెయ్యె చూడుమా
కూడల సంగమదేవా! ౨౦

మరియు

నాదు తప్పు అనంతకోటి, మీ సైరణకు లెక్క
లేదయ్యా! ఇక మీద తప్పితె మీ ప్రమథుల పాదమె ఆన
కూడల సంగమ దేవయ్యా మీ ప్రమథుల ముందు కిన్నర
బొమ్మయ్యల పాదంబె సాక్షి ౨౧

**వివేచనము**

తనకు తానె కొరతయైనపుడు తనకు గావలసిన వారిని సాక్షి బెట్టుట వ్యవహార ధర్మము బసవన్న తాను జేసిన అపరాధము చెప్పినంతవరకు, విప్పి చూచినంతవరకు బృహత్తుగా పెరిగింది తప్పేమొ సామాన్యమైన దాన్ని అసామాన్యులైన పెద్దవారు జేసినప్పుడు వారి ఘనతబట్టి పెద్దదగును సామాన్యులకు ఇది సాధారణము ఎవరు అంతగా పట్టించుకొనరు

బసవన్న చాలా కిందికి దిగినాడు ఏమి చేయుటకు తోచుటలేదు ఎన్నో నాళ్ళు కసరత్తులు నేర్చి యుద్ధ రంగములో శత్రు ప్రయోగములను ఎదుర్కొనుట మరచినట్లైనది అష్టవిధార్చన షోడశోప చారముల లింగపూజలు ఎన్నాళ్ళు జేసిన ప్రయోజనమేముంది? నేలమీద హాయి చల్లుకొని ఊడ్చుటకు పోయినట్లైనది

నిజమే రాయిని నీళ్ళముంచి ఎన్నాళ్ళుంచినా అది మెత్తబడనట్లు, భేతాళుడు నిధిని గాచినట్లు నా లింగపూజ ఆహా బసవా, కొనకేమైతివయ్యా? లేదు లేదు దీనికి పరిహారములేదు, స్వామి అల్లమ ప్రభుదేవా! నా తప్పులు వెయ్యి గాదు, లక్షగాదు, అనంత కోటులు మీ సైరణకు లెక్కలేదు ఐతే, ఇక ఇప్పుడు జేసిన తప్పు మరి జేయను మీ ప్రమథులాన, మహా శరణుడు కిన్నర బొమ్మయ్య

పాదసాక్షి మన్నించు దేవర దేవాయని బసవన్న వేడుకొనుచున్నది చూచి కిన్నెర బొమ్మయ్య అనునయముతో అల్లమున కిట్లను చున్నాడు

**కిన్నెరయ్య**

తనువు పాన్పు మనసు లింగమైన మీద మరి వేరె
పరికింపనేల? కాయమె బసవన్న మనంబె ప్రభుదేవుడను
ఘనము చేకూరిన మీదట గుణావ గుణము యోచించ
తగునే? మహాలింగ త్రిపురాంతక దేవా, సంగన బసవణ్ణ
యందు మీ పాదంబులందు సంశయమున్నదే? వేంచేయు
మయ్యా ప్రభూ! ౨౨

**వివేచనము**

నా మనవి ఆలకించండి ప్రభుదేవా! తమ సందర్శన సౌభాగ్యోన్నత్యములో పరవశులమైన మాకేమి చెప్పుటకూ మాటలు రావు దానిలో బసవేశ్వరునకు తమకు ఉన్న సంబంధాన్ని గురించి చెప్పుటకేమున్నది? రెండయితే చెప్ప వచ్చును అది ఇదియని విడివిడిగా వర్ణించవచ్చును గీతముగా పాడుకొన వచ్చును ఏకమేవా ద్వితీయమై యుండు మీరు రెండై కనబడినా ఒకటియే కదా!

తనువు పర్యంకము మనసు లింగమై యుండిన మీద భేదమెక్కడుంది? మీ తనువు బసవన్న, మీరు బసవన్నకు ప్రాణము, ఇది అవినాభావ సంబంధమై యున్నపుడు, ఇది గుణము దోషమను లెక్కడిది స్వామి? విచ్చేయండి ఇప్పటికే తడవైనది తమ కృపతో ఈ భక్తి భవనాన్ని నింపవలెనని శరణులందరి పరంగా వేడుకొనుచున్నాను అని కిన్నెర బొమ్మయ్య నయ వినయ సంపన్నుడై విన్నవించినది అల్లముడు విని సిద్ధరాముని జూచి మెల్లగ ఎంత మధురాతి మధురమైన వాక్కు అని మెచ్చుకొని ఈ రీతి యనుచున్నాడు

**అల్లమ ప్రభు**

జంగమపు ఇంగితాకారము గని లింగమని
ఎరిగిన సద్ భక్తులు మనంబులు కూడిన కూర్మ శిశు
స్నేహమటు దానికెమున్నె తెరువు లేకుండవలయు
జూడుమా! వచ్చిన రీతి గానక నిలిచిన విధము తెలియక

నిరర్థకముగా అహంకరించిన వారిని మా గుహేశ్వరు
డొల్లడు చూడయ్యా, కిన్నెర బొమ్మయ్య! ౨౩

**వివేచనము**

అయ్యా కిన్నెరయ్యా, సమర్పకంగా మాటలాడినావు నీ కిన్నెర పలికినట్లు చాల ఇంపుసొంపుగా నున్నది ఐతే నడతయందుండవలె గదా! లింగ జంగమ సంబంధాలు మాటలలో లేవు సద్భక్తుడు తన సమ్యకమును ధృతి నుంచి ప్రమాణించును అప్పుడు రాయి లింగమౌతుంది మనిషి సర్వాంతర్యామియైన జంగముడగును చూడు ఉదాహరణ, మనసు మనసు కూడిన రీతి నీవు చెప్పినావు గదా! అటులగుటకు తాబేలు, దాని కూనయున్నటులుండవలయు ఎట్లనిన తల్లి ఎక్కడో పిల్ల ఎక్కడో పిల్లకు ఆకలైతే తల్లిని జ్ఞాపించుకొంటె కడుపు నిండుతుంది తల్లికి పాలిండ్లు లేవు మానసిక వ్యవహార సంబంధమిది ఒకటన్నవారు ఇట్లుండవలయును నా బసవన్న పీలాటి శరణుల సమూహములో గొప్పవాడె లోకమంతా ఆయనను 'బసవా'అందే భవము లేదనుచున్నది నె నడ కాదనను అట్టి మహా భక్తుని జూచుటకే గదా పిలువని పేరంటమై వచ్చినది. అయిన అటుల వచ్చినవారినే గమనించలేదు గదా! అతిథిగా వచ్చిన వారిని పిలువ సంస్కారమే లేదనుట తెలిసి ఆ గొప్పతనానికి మా దౌర్భాగ్యానికి దొరకిన చిన్నతనానికి మేమనడానికేముంది? ఈయన మహా యోగీశ్వరుడైన మహా క్షేత్రాధి నాయకుడైన సిద్ధరామేశ్వరుడు భూలోక శంభుడు బసవన్నను చూడవలెనని ఎంతో సంబరమున వచ్చినాడు చూచింది బసవన్నను గాదు అహంకార అపరావతారిని అని ప్రభుదేవుడు బసవన్నగారి భక్తి పటలాన్ని పేలిక పేలికలుగా చించి పారవేసినాడు

బసవన్న భూమిలో దిగిపోయినాడు తన అహంకారానికి సజ్జనుడైన సంగీత మహా విద్వాంసుడైన కిన్నెరయ్యను సాక్షిగా పెట్టినది తప్పులో తప్పైనది. వినయ పరాకాష్ఠుడై విన్నవించుకొనుచున్నాడు

**బసవణ్ణ**

సత్య సదాచార సంబంధమైన భృత్యాచారంబు
నాకు లేదయ్యా! ఏను మిమ్ము స్మరింప భక్తి లేదయ్యా!
కరుణించి కృపజేయుమా కూడల సంగమదేవా! ౨౪

**వివేచనము**

నిజము, మీకు భృత్యుడ నగుటకు తగను నా అహంకారమే మీ పాద దర్శనము పొందక అడ్డగించినది మిమ్ము తలప భక్తి లేదు మీ కృప రక్షించితె మాత్రము ఈ బసవడు, లేకున్న నిరర్థకుడు అనుచు మరియు ఇట్లనుచున్నాడు

కరగించి నా మనసునందున్న కాళికను (చీకటిని)
తొలగించుమయ్యా! ఒరకు వన్నెకు తెచ్చినన్ను పుట
ముంచి చూడయ్యా! తెగనరికి కొట్టి సాగదీసి తెచ్చి నన్ను
శిలను జేసి మీ శరణుల పాదంబున కాభరణంబు జేసి
పాలించుమయ్యా, కూడల సంగమదేవ! —౨౩

**వివేచనము**

అల్లమదేవుని ఒక నిర్వంచక కంసాలిగా జేసుకొని తాను దోషపూరిత బంగారమని పోల్చుకొనుచు అత్యంత కావ్యమయంగా చక్కని ఉదాహరణలతో మరి చెప్పుట కింకేమియు, ఈ చెప్పేది దానిమీద యుండదన్నట్లు బసవయ్య అల్లమునికి వందనం బాచరించి, అయ్యా, నా మనసులో గడ్డ గట్టియున్న దోష బద్ధ అజ్ఞానపు బంగారు నీ కృపా మూసలో బెట్టి కరగించు గీటురాయికి పెట్టి చూడు వన్నె రాకున్న మరల కరగించు కత్తిరించి చూడు సాగగొట్టి చూడు, నిష్కల్మషమైనదని నీవు ఒప్పితె బంగారును మీ శరణుల పాదాభరణముగా జేసి నన్నుద్ధరించుమని బసవన్న చెప్పినప్పుడు ఆహా, ఎంత మనోహర భక్తి మాధుర్య గీతమిది యని శరణులు మెచ్చుకున్నారు ఔర, ఇట్లుండవలె భక్తియని సిద్ధరాముడు తలూపెను. అల్లముడు బసవన్న జేసుకున్న సర్వార్పణ భావము నకు నవ్వి ఇట్లనుచున్నాడు

**అల్లమ ప్రభు**

తనువునందు తనువు తరుగదు, మనమునందు
మనము తరుగదు, ధనమందు ధనము తరుగదు, భక్తి
యుక్తి మాట నీ కేల చెప్పుమా బసవయ్యా? మాట కూట
మను కీర్తికి చిక్కి జంగమమె లింగమనుట మరచితివి

గాదే బసవా! గుహేశ్వరుని శరణుల త్రికరణంబు
లొప్పించు నంతవరకు భక్తుడగుట తగదు రసుమా
సంగన బసవన్నా! —౨౬

**వివేచనము .**

ప్రధాని బసవేశా! నీవు వివేకశాలివి లౌకిక విషయాలు, ధర్మతత్త్వ విషయాలు తెలిసిన సర్వవిదుడవు నీవు బంగారుగా, నన్ను కంసాలిగా ఎన్ను కొని దోషయుక్త బంగారాన్ని షుద్ధీకరించి శరణుల పాదముల కాభరణములు చేయ చెప్పుకొన్న మాట చాల సుందరము, సౌశీల్యము, సమంజసముగానే యున్నది అతే, కంసాలికి బంగారమే ఇవ్వక కరగించు టెట్లు? ఆభరణము చేయుటెట్లు?

తను మన ధనములు నీవిగా యుండునంత వరకు భక్తిని గురించి యుక్తీకరించుట తగునేమయ్యా బసవరాజా! నాది నే జేసితినను కీర్తి కాంక్షకు చిక్కితివి ఎందుకింతటి ఉదాసీనము? జంగమమే లింగము గదా, ఏమైన శరణు లకు తను మన ధనార్పణము చేయక భక్తుడు కాడు బసవదేవా!

సర్వ సాధారణంగా వ్యంగ్యంగా కొనియాడినట్టు ఆడి వెక్కిరించిన ప్రభుదేవుని మాటల అర్థములు బసవన్నకు పోల్చి చెప్పేవి గావు శరణులకు అసమాధానమైనది బసవన్న జాగృతుడై దిట్టతనముతో ఇట్లనుచున్నాడు

**బసవణ్ణ :**

సంచితము నందొక రేకు, చీరయందొక పోగు,
ఈనాటికి, రేపటికి కావలెనన్న మీ యాన, మీ ప్రమథు
లాన! మీ శరణులను గాక మరియొకటెరుగను, కూడల
సంగమదేవా, మీ యాన! —౨౭

మరియు

కాయమడిగిన నిచ్చెద, మన మడిగిన నిచ్చెద,
ధన మడిగిన నిచ్చెద మీ శరణులకు, నాకు కావలెనన్న
భావంబు మనమందు దోచిన, ఘన మహిమా మీ పాద

మాన మన వచన కాయమందు మీరుగాక మరియొక్క-
టెరిగితి నన్న కూడల సంగమ దేవా, భవ ఘోరంబు
నందుంచుమయ్యా! ౨౭

**వివేచనము** •

తప్పి మాటాడితిరని పెద్దవారికి చెప్పతగదు వారే దయతలచితె చిన్న వారిని అనుగ్రహించినట్టు అయ్యా, ప్రభు సర్వోత్తమా! సంపాదించిన బంగారు నందొక రేకు బట్టలోని చిన్న దారము నాదంటె మీ యాన ఉన్నదంతా శరణుల సొత్తు దాన్ని రక్షించే నేను వారి తొత్తు మరియొకటెరుగను అది నాది యని నాలుక గోసినా అననయ్యా!

ఏమి కావలయునో వేడుము తను మన ధనంబులిచ్చెద మీ శరణులకు మన వచన కాయమందు వారే యున్నారు మీరుగాక నా కింకొకటి లేదు విరిగినా, ఎరుగకపోయినా మి చెరగులో ముడిపడినవాడను అడుగండి, ఇయ్యక పోతే భవాంబుధిలో వేయండి

బసవన్నకు కొంచము వేడి ఎక్కినది ఇదివరకున్న దైన్య భావములో ధైర్యము రూపుగొన్నది ఇచ్చుచుండుటయే ఆయన స్వభావముగాన అల్లముని అడుగుమన్నాడు ఈ బసవన్న మనఃప్రవృత్తి ఎంత పరిశుభ్రము? అదెంత తీవ్రము? దీన, ధీర భావాలు ప్రయోగించడములో దిట్ట బసవడు తన జంగమ తత్త్వాన్ని కొంచము పక్కకు తొలగించితె అతని భక్తి, శక్తి, యుక్తికి నిలువ గలిగిన వారెవరని అనుకొనుచు, మరియొకరీతి ఎత్తుగడ ఎత్తి అల్లముడు ఆక్షేపణీయంగా ఇట్లనుచున్నాడు

**అల్లమప్రభు** .

మేరు పర్వతములన్నియు ప్రమథుల సొత్తు
రజతగిరులెల్ల పురాతనుల సొత్తు చతుర్దశ భువనంబు
లెల్ల లింగైశ్వర్యము పృథ్వి యనునది కర్తారుని కమ్మ
టము అచ్చుల మేకులవంటి ఇల్లు తను, మన, ధనంబు

అన్ని మా గుహేశ్వర లింగని సొమ్ము నీవేమిచ్చి భక్త
డైతివో చెప్పుమా బసవన్నా? ౨౯

మరియు

తను అర్పితమన్న గురుద్రోహము మన మర్పిత
మన లింగద్రోహము ధన మర్పితమన్న జంగమ
ద్రోహము ఇటులీ తను మన ధనంబులను అనిత్యమును
నిత్యమున కర్పించి, భక్తుడైతినన్న అది అజ్ఞానంబు
చూడుమా! ఏలికకు ఉండ విరిచిచ్చి నే భక్తుడైరి నను
మాట సమ్యక్ శరణులు మెచ్చుదురె? మా గుహేశ్వర
లింగనికి నీవు ఏ దానియందు ఏమిచ్చి భక్తుడైతివి
చెప్పవె సంగన బసవణ్ణా? ౩౦

**వివేచనము .**

అభినందనీయంగా వుంది నీ మాట బసవయ్యా! లోకములో ఈనాటికీ ఇచ్చినవారి కధలు ఉన్నాయి ఐతే, ఇచ్చినవారు తమదనుకొని ఇచ్చిరేగాని తమకిచ్చిన వారెవరని ఎరుగలేదు. ఎవరు ఈ మర్త్యానికి వచ్చునప్పుడు ఇచ్చితి మన్నది తీసుకొని రాలేదుగదా: ఇచ్చువాడు పుచ్చుకొనువాడు ఇద్దరూ ఉత్త చేతులతో వచ్చినారు ఇక్కడున్నది బలవంతుడైనవాడు తనదిగా ముద్రించు కొని, అడిగిన వారికిచ్చి కీర్తి పొందిరి ఇచ్చినది తమ సొత్తా? బలి, కర్ణ, శిబి, దధీచి, రంతిదేవ మున్నగువారు మహా త్యాగధనులని, భగవత్కృపకు పాత్రు లైరని ఖ్యాతి గాంచిరి వారిదని అనుకొన్నదిచ్చిరి గాని వారిదియ్యలేదు

ఇప్పుడు నేనిచ్చెద అడుగుమనుచున్నావు నీవు నేనడుగ రాలేదు అడుగు మన్నావు అడిగెద మొదట నీవేమిచ్చెదవో చెప్పు శివభక్తులలో ఇచ్చువారు పుచ్చుకొనువారు లేరు ఇచ్చినాతడు పెద్దకాదు పుచ్చుకొన్నాయన చిన్నకాదు. వీరి రీతి నీతి వ్యవహారమే వేరు నీ ఇష్టము చెప్పు మేరు పర్వతములు ప్రమథుల సొత్తు రజతగిరులు పురాతనుల సొత్తు భూమండలమంతయు లింగదేవుని సొత్తు పృథ్వి మొదలగునవి కర్తవి అంటె ఈ సృష్టిని సృష్టించిన యజమాని కార్యాగారము అంతా అచ్చులు సృష్టి పనిముట్లు అయనవి చీమ మొదలు

ఏనుగుతో సహా ఆయా అచ్చులో అవి పుట్టును ఒకదానిలో ఒకటి పుట్టదు ఇక తను మన ధనంబులు లింగము సొమ్ము దీనిలో ఏదిచ్చెదవు?

ఎచ్చరిక తను మన ధనము లిచ్చెదనన్న అది మొదటనె గురు లింగ జంగమార్పితమైనవి అది ఎరుగక ఇచ్చెదనన్న త్రివిధ ద్రోహము, చూడు బసవదేవ! ఈ అనిత్యాన్ని నిత్యానికర్పించితె భక్తుడు కావచ్చునా? చెరువు నీరు చెరువున పారబోసి గంగమ్మ పూజ జేసితినన్న అజ్ఞానమది ఇంటి యజమాని పిల్లలకు వారి యింటి వుండనే తినిపించి, నే పెట్టితి ననుదానివలె భక్తుడనన్న శరణులు మెచ్చుకొనరయ్యా? నీవు నీదైనదేమిచ్చి భక్తుడైతివో చెప్పు బసవ దేవా!

అల్లముడు అల్లుకొని వచ్చిన ఈ తర్కము ఒక బలమైన అడ్డు తడక నిలబెట్టినట్లైనది మహా మహా దాతృవులు పడిపోయినట్టయినది బసవన్నదింకేమో యని శరణుం కనిపించినది సిద్ధ రాముడు "మజు బాపురే!" అనుకొన్నాడు చెన్న బసవణ్ణ అల్లముని సమంజస తార్కికానికి తలూపినాడు ఏమీ చెప్ప పోలేదు బసవన్నకు తోడు నీడ లేక ఒకడై అనుతాపముతో అల్లముని ఆక్షేప ణను కాదనడానికి తోచక వ్యధ చెంది అనుచున్నాడు

**బసవణ్ణ :**

నువ్వులు లేని గానుగ చుట్టిన ఎద్దువోలె యుండె
నా భక్తి! ఉప్పు అప్పులోనద్ది రుచిగాంచినట్లయ్యె నా భక్తి!
కూడల సంగమదేవా! నేను చేసితినన్న అగ్గి నన్నె గాల్చి
యుండె! ఇది చాలదా అల్లమ దేవయ్యా! ३౧

మరియు

నేను భక్తుడు గాను నేను యుక్తుడు గాను నేను
ముక్తుడు గాను కపట వేషంపు దాంభికుడ నేను కూడల
సంగమ దేవా! నాదు భక్తి ఉత్తదన్నది మీరు చూప
వచ్చితిరి గాన నేనిందు తెలిసికొనయ్యా! ३౨

**వివేచనము :**

నిజము నిజము జంగమ దేవా! జ్ఞానమైన క్రియయైన తెలిసి ఆచరింపు టలో ఎంత వివేకమున్ననూ చాలదను మాట తనకన్న పెద్దవారిని చూచినపుడు స్పష్టము కాగలదు అట్టి మహానుభావుల సందర్శనము కలుగుట మహా భాగ్యము నేనెటులున్నానని మీరెరిగినారయ్యా! నువ్వులు లేని ఉత్త గానుగ తిరిగిన ఎద్దుకు శ్రమ తప్పలేదు నూనె రాలేదు సిళ్ళలో ఉప్పువేసి నాకినట్లు శివ శివా, నేను ఇచ్చెదనన్నది ఎంత ప్రమాదమైనది? ఇంటి దీపమును ముద్దిడు కొన్న మూతి కాలినట్లు నా భక్తియైనది ఇది చాలదేమి అల్లమ దేవయ్యా?

నేను భక్తుడనే కాదు యుక్తుడు మొదలే కాదు కపట వేషముల దాంభికు డను వంచకుడను, అహంకారుడను స్వామి! ఇది యంతయు మీరు వచ్చితిరి గాని తెలిసినది లేకున్న ఇదియే భక్తి యని అనుకొనుచుంటిని అని బసవన్న కింకుర్వాణమున విన్నవించిన అల్లముడు నవ్వుచు ఇట్లు విడంబించుచున్నాడు

**అల్లమ ప్రభు**

సజ్జన సన్నిహితమైన భక్తి పొద్దు కొక్కొక్క
తీరుండునె చెపుమా? ఒకతూరి అహంకారము, ఇంకొక
తూరి కింకరత్వమా? మనంబునకు మనమె సాక్షిగాన,
ఆచరించు భక్తునందు గుహేశ్వరుడుండు గాని లోకంబు
నందుండడు కనుమా కూడల సంగన బసవన్నా! 33

**వివేచనము :**

బసవ దండాధీశా! వెనుక ముందు లరయక సునాయాసంగా సమయ మెచ్చినట్లు తిరుగు చాకచక్యముగల రాజకీయ దురంధర్యులకు మా యట్టివారు సాటి కాగలమా? శరణుల మెప్పుగొన్న సద్భక్తి సమయ మెచ్చినట్లుండదు సమయాతీతమది ఒకతూరి రాజసమున ఏమడిగెదవో అడుగుమను అహం కారము, తరువాత ఇచ్చుటకేమియూ లేదని కింకరత్వము ఈ చాంచల్యము భక్తునకుండరాదయ్యా! ఎవరు చెప్పునదేమి, నీ వర్తనము ఇట్టిదని నీ మనము చెప్పుచుండలేదా! ఆ హిత బోధ విను మార్గమెరుగనివాడు భక్తుడెట్లగును? ఒక్కతూరి జంగమమే లింగమని నమ్మిన మీదట చలింపకుండవలయును

అట్టివానియందు గుహేశ్వరుడుండునయ్యా సంగన బసవయ్యా యని బస వన్నది చంచల భక్తియని నిరూపణ చేయగా బసవన్న వెంటనే ఉపాయము గానక అల్లమునకు విన్నవించుకొనుచున్నాడు

**బసవణ్ణ**

ఎంచకు మెంచకుము, ఎంచిన మంచిలేదు, జిల్లేడు
చెట్టు కాయయందేమి వెదకెదరు? మీ యుత్తమిక చూప
రయ్యా సంగమ దేవా! 34

మరియు

నాదు చిత్తము పత్తిపండు జూడుమా! విచారించిన
సారంబు లేదు ప్రాపంచిక దాంభికమునందు నన్నొక
రూపు జేసి మీరుంచితిరి కూడల సంగమ దేవా! 35

**వివేచనము :**

వద్దు, వద్దు విడదీసి చూడకండి లెక్కబెట్టి భాగించకండి జంగమదేవా! ఏమున్నది? ఎటు జూచిన దాంభికము, వంచనము, కీర్తికాంక్ష, సంసార వ్యామోహము శాంతి దాంతి లేని చిత్తము నేను నేనను అహంకారము ఇట్టి దుష్కల్మషనిలో లోపముంటుంది స్వామి! ఈ ప్రపంచము మాయా వృత మహా పాప సంభూత దుష్కర్మ సంజాతము ఇట్టి లోకములో నన్నొక మనిషి బొమ్మను జేసితిరి దీనిలోనే యుండుమంటిరి ఉన్నాను ఇప్పుడు మీ పరీక్షకు లోనైనాను ఉత్తీర్ణుడనయ్యేది ఎట్లు చెప్పు గురుదేవా?

బసవరాజు వినయమును పలుకుటలో మయామయ ప్రపంచము పుట్టించినవాడు నీవనియు, దానిలో తన్ను మానవునిగా పుట్టించినవాడే నీవనియు, ఇక ఇట్టి దానిలో మంచివాడగుటకు తెరువేది? యన్న ఆక్షేపణ పర్యాయంగా అల్లమునిమీదనే బెట్టినపుడు, అల్లముడు ఎటు తిరిగితె అటు నన్ను బంధించు మహా మేధావి బసవన్న యనుకొనుచు ఇటులనుచున్నాడు

**అల్లమ ప్రభు :**

కూర్మని శిశు స్నేహముస్నరీతి యుండరాదా
సంగన బసవన్నా? కాక పిక సంధానమట్లుండరాదా
సంగన బసవణ్ణా! కొమ్మ తప్పక లంఘించు మర్కట
మట్లుండరాదా సంగన బసవణ్ణా! నీరు క్షీరంబు భేదించి
తీయు హంస యట్లుండ రాదా సంగన బసవణ్ణా!
గుహేశ్వర లింగమందు అవధానంబు తప్పి మరల
వెదకిన సరియగునె సంగన బసవణ్ణ చెప్పవె? ౩౬

**వివేచనము :**

బసవరాజా, లోకస్వభావమే నీవు చెప్పినది తను జేసిన తప్పును కాన రాని ఏ విధిమీదనో కర్మము మీదనో లేదా దైవము మీదనో వేసి దానిలో తన దేమియు అపరాధము లేదన్నట్టు సృష్టిలో వర్తించుచున్న ఒక మానవుడే ఇట్టి ఆక్షేపణలు చేయుచున్నాడు అన్ని జీవులకన్న సృష్టి మనుష్యున కిచ్చిన స్వాతంత్ర్యఫలమిది ఇట్టి ఊహలు, ఇట్టి సమ్మరపు మాటలు మానవ ప్రగతికి ప్రమాదము చూచుచున్నాముగదా బసవయ్యా సృష్టి తన్నుతానేమియు మరుగు పరచుకొనలేదు అంతయు విస్పష్టముగా నున్నది తాబేలు తన పిల్లకిచ్చుటకు అన్ని ప్రాణులలాగ పాలిండ్లు నాకివ్వలేదని అంటున్నదా? సృష్టియు దోషికాదు పిల్ల ఎక్కడున్న తల్లిని తలచితె అప్పుడె కడుపు నిండే విధానము నిర్మించింది. కాకి గూటిలో కోకిల పెరుగుతుంది దానికి దీనికి ఒక పక్షిజాతిత్వసంబంధమే గాని, స్వభావములో ఏలాటి సంబంధము లేదు ఐన కాకిగాని, కోకిలగాని ఈ సంబంధానికి అతృప్తి జెందక ఎవరిని ఏమనకుండ యుండును ప్రూనుకొమ్మనున్న కోతి మరో కొమ్మ దూరముందని చెట్టును గాని, చెట్టును పెంచినవానిని గాని అనదు కొమ్మకు తనకు ఉన్న దూరము తెలిసి లంఘించును అది తనకు దూరమని ఆక్షేపించదు నీరు క్షీరాన్ని వేరు జేసి నీరు విడచి పాలనే తాగు హంసము నీరును గాని నీరు కలిపినవారిని గాని తిట్టదు సంగన బసవణ్ణా! ఆ విధానము ననుసరించి మనిషి లేడు తానేమొ సృష్టికన్న గొప్పవాడనుకొని సృష్టిలో తప్పులెంచును నీవేమొ చెప్పితివి అది యుక్తమా చెప్పుము? తప్పు తప్పేగద! ఆతప్పు మరియొకరి మీద మోపితె ఒప్పౌనా? మా గుహేశ్వర లింగ

డొప్పడయ్యా బసవేశా! యని సవిస్తారముగా సృష్టి జీవుల విమర్శ జేసి బసవన్నకు చేసిన తప్పులు అందించి చూచుకొమ్మనగా బసవన్నకు అప్పుడు తన తప్పు ఎక్కడ మిగిలి యుండినది స్ఫురించి అల్లమ దేవునకు విన్నపము జేయుచున్నాడు

**బసవణ్ణ**

ధ్యాన మౌనమను శస్త్రంబు పట్టనొల్లక అహం
కార ధార మొనగల శస్త్రంబు బట్టి చెడితినయ్యా! కల
వరమం దెదనయ్యా! జంగమ లింగమను బాస సంచలన
మయ్యె ఇక జంగమ మను శిక్షా శస్త్రమున నన్ను కొట్టి
తిట్టి రక్షించు కూడల సంగమదేవా! 32

**వివేచనము :**

అయ్యా మహాదేవా, తెలిసితి. విషయ సమర్థన వాదము, వాదము పెంచును నిర్ణయము తెలియనీయదు. అందున పెద్దవారిముందు వాదమే తగదు. ధ్యాన మౌనాస్త్రమే భక్తుడు పట్టవలసిన ఆయుధము దాని నుంచి అసాధ్యము సాధ్యమౌను అహంకారాయుధము ఏ దానిని తెలియనీక అన్నియు తానని కొనకు పట్టినవానినే బలిగొనును ఈనాడు దానివలని ప్రమాదము తప్పించి జంగమమే లింగమనుట చూపించితిరి ప్రభుదేవ! ఎంత ఎరిగిననూ ఎరుగుట మిగిలి యుండునన్నది తెలియజేసినారు దండించ మనలేదు ఇక బసవడను వాని దాక్షిణ్యము వద్దు ఏ దాని యందు తప్పెనో ఆ జంగమ శిక్షా శస్త్రము నుంచి మీ ఇష్టమొచ్చినట్టు బుద్ధి వచ్చునంతవరకు ఎవరడ్డు వచ్చినా విడువక గౌరవాదరణ లెంచక దండించండి స్వామి! యని సాష్టాంగ వందన మాచరించగా అల్లముని డెందము మెత్తనై కారుణ్యమున కరగినది తోడనె బసవన్నను ఎత్తి కౌగిలించి, నిష్కల్మష చిత్తుడు బసవన్నను కఠినంగా మాటలాడి నొప్పించితినేమో యని అనునయంబున తాను అనుకొన్నది ఇప్పుడు చెప్పుచున్నాడు

**అల్లమ ప్రభు :**

వేశ్యను, వ్యభిచారి యని నిందించు వారెవరు
చెప్పుమా? పతివ్రత తన పురుషుని గాక మరిమొకరి

ముఖము చూచిన ఆమెను చండాలస్త్రీ యందురు లోకంబు
లందు కీర్తి వార్తలకు చేయు భక్తుడు తప్పిన అది
ఎంచదీ మనము సజ్జన సద్భక్తుడు తప్పిన దానిని
సైరించరాదు చూడుమా! మా గుహేశ్వర లింగమునకు
ఆదినుంచట్టు నీవె భక్తుడైన కారణమున నొప్పిగొని
యుండె మనము కనుమా సంగన బసవణ్ణా! ३०

**వివేచనము**

బసవేశా! నిను శిక్షజేయ నా తరము గాదు. శిక్షను రక్షను నీవు ఎర్ర ఎందుకనిన, నీవు సద్భక్తి సంజనిత సదాచార వీరవ్రత షట్స్థల వీరశైవము మొదలు ఆధార స్తంభమవై సన్మాననీయుడవై యున్న గురు లింగ జంగమ మూర్తివి లోకములో వేశ్యకు శీలము లేదను ఆక్షేపణ ముండదు అది యుండునది పతిని నమ్మిన పతివ్రతకు ఆమె తప్పి నడచినపుడు శీలానికే అవమానముగును లోకము సహించదు అట్లే ఖ్యాతికై భక్తుడైన వానిని నా మనసు గమనించదు లోకాని కాదర్శ భక్తుడైనవాడు తప్పితె తత్త్వమునకు కాధారమెక్కడిది? లోకము నడువ వలసినదెట్లు? అందుకె కొంచము నీ లోపము గని నా మనసు నొచ్చినది నిజము నా గుహేశ్వరునికి అనాదినుంచి నీవె భక్తుడు గదా, బసవయ్యా! నీవు తప్పు తప్పితివని గాదు, అవధానము తప్పినదంతె, యని అల్లముడు బస వన్నకు సమాధానము చెప్పినపుడు అక్కడున్న శరణులకు ఏదో ఒరువు దిగి నిరాభారమైనట్లయినది సిద్ధరాముడు వాదము ముగింపయ్యెనని సంతోషించి నాడు చెన్న బసవన్న మందహాసము చేసినాడు బసవన్న సమాధానముతో లింగపతి శరణసతి భావంబున ఇట్లనుచున్నాడు

**బసవణ్ణ**

కన్ను కోపమునకు ముందుగానక పలికితినయ్యా!
మానసము మీ తటుముందై కంటినయ్యా! సఖి లేకున్న
సుఖముండునో నాదు చిరుకోపము నా యందె అడగె
ఇక రావయ్యా ప్రభుదేవ, కూడల సంగమదేవా! ३९

**వివేచనము**

ఏమొ చూచి తెలియక ఆలసించితిని మనసంత మీ యందే మగ్నమై యుండె ప్రాణనాయక! ఆ మాటా ఈ మాటలు జరిగినవి జరిగిన మాటల

కర్తృమేముంది? సఖిలేని పురుషునకు సుఖము లేదు గాన అన్ని కోపములు, తాపములు ముగిసినవి ఇక నా మనవి మన్నించి లోపలికి దయచేయవలయునని బసవన్న లింగపతియైన జంగముని సతియైన భక్తుడు పిలిచినాడు సిద్ధరాముడు ఈ వాద ముక్తాయము ఎంత సులభముగా ముగిసింది, ఎంత భావయుక్తంగా కొనయైనదని అల్లముని చూడగా ఇంకను అయన ముఖ కమలము పూర్ణముగా వికసించలేదు సిద్ధరాముడు ఇట్లనుచున్నాడు

**సిద్ధరామయ్య**

ఓహో! అయ్యా వినుము వినుము ఆది అనాది
లేనపుడు బసవన్నయే భక్తుడు నాద బిందు కళలు
లేనపుడు నీవె జంగమము శివశక్తు లుదయించకమున్న
బసవన్నయే భక్తుడు సురాళ నిరాళంబులను శబ్దంబు
పుట్టకమున్న నీవె జంగమము ఈ ఉభయంబునందు
భేదముండునే? కపిలసిద్ధి మల్లినాథయ్యా! బసవన్న యెవ
రన్నది మీరె తెలిసి చూచి కృప చేయుమా ప్రభుదేవా! ౪౦

**వివేచనము**

అయ్యా ప్రభుదేవా! మీకు బసవన్న కున్న సంబంధము లోకమెరుగును. శృతి స్మృతు లెరుగును కాదన్నటుల మాటల వివాదము ఎంత పెంచినా అంత సంబంధమూ దాని వలననే మరింత దృఢపడుతుంది ఆది అనాదులు లేనప్పుడు బసవేశ్వరుడొక్కడె భక్తుడైతె నాద బిందు కళలు లేనప్పుడు మీరు జంగములు ఇంకను శివశక్తులు పుట్టి యుండలేదు అప్పుడు బసవన్నయే భక్తుడు ఆకార నిరాకారములు లేనప్పుడు మీరె జంగములు విడదీయరాని ఇట్టి భక్త జంగమ సంబంధముండ బింకము కొత్తతనము ఆక్షేపణలు ఇవియంతా ఎందుకో వినోదమునకైన ఒక హద్దుంది ఇది ఏనాటిదో పాత సంబంధము ఎక్కువ లాగుట చాలించి బసవన్న మాట మన్నించి కృప చేయండి

చక్కగా సిద్ధరాముడు పూర్వాపరాల సంబంధ బాంధవ్యాలు వివరించి అల్లమునకు నివేదించగా శివశరణులు ఆనందించినారు మడివాళ మాచిదేవుడు విన్నవించుతాడు

**మడివాళయ్య :**

శరణు శరణార్థి, నాదు విన్నప మవధరించ రయ్యా బసవన్నయే గురురూపు ధరియించి మర్త్యమున కొచ్చెను చెన్న బసవేశ్వరుడు లింగరూపమై మర్త్య మున కొచ్చెను ప్రభుదేవ, మీరు జంగమ రూపియై మర్త్య మున కొచ్చితిరి భక్తి పెంపొందింప బసవణ్ణ కారణికు డయ్యెను జ్ఞానాభివృద్ధికి చెన్నబసవణ్ణ కారణికుడయ్యెను ఈ ఇద్దరిని లోగొన్న మహా ఘనంబునకు మీరు కారణికు లైతిరి ఇటుల గురు లింగ జంగమము ఒక్క భావమె గాని భిన్న భావముండునె? బసవన్న చెన్న బసవన్న విన్నపము మీరక వేం చేయుమయ్యా కలిదేవర దేవా! ౭౧

**వివేచనము :**

అల్లమ ప్రభూ, శరణు, శరణార్థులు సిద్ధ రామదేవుడు చాలా వెనుక నుంచి, ఊహాకందని నాటి నుంచి, బసవన్నకు మీకున్న సంబంధము వివ రించినాడు నాకును అటులనే తోచుచున్నది మీరు, బసవన్న, చెన్న బసవన్న, మర్త్యానికి కారణిక పురుషులై, ఒకరు భక్తి అభివృద్ధికి, మరొకరు జ్ఞానాభివృద్ధికి ఇంకొకరు వైరాగ్య వివేకమునకై వచ్చితిరిగాని, ఇతర జీవులవలె కర్మపాశ బద్ధులై రాలేదు ఈ కాల పురుషుకు సంగ్రహించుకొన్న ఆదెంతో పుణ్యరాశి ధర్మరాశి నుండి మీ యందరిని తన లోకానికి తెచ్చుకొన్నాడు స్వామి! ధన్యత! వర్తమాన జీవులైన మా వంటి వారిది ఇది అసామాన్య దృశ్యము భూలోక జీవోద్ధారమునకు ఒక మహనీయుడొచ్చుట అగాధమై యుండగా మీరు ముగ్గురు ఒక చోటనే ఉద్భవమందినది లోకపావనము దయచేయండి అల్లమస్వామీ!యని మడివాళుడు సయుక్తికంగా, సరాగంగా ఆహ్వానించినపుడు చెన్న బసవన్న దరహసిత వదనారవిందుడై ఇట్లనుచున్నాడు

**చెన్నబసవణ్ణ :**

శరణు శరణార్థి మహా దేవరదేవా! శరణు శర ణార్థి పరబ్రహ్మ స్వరూపా! శరణు శరణార్థి నిరాకార

తత్త్వ స్వరూపా! మీరె గతి మతి మీ చరణంబులకు
శరణమయ్యా! సతిపతుల స్నేహంపు విరస సరసములు
అతి మనోహరము జూడుమా! మీ శరణుండు బసవన్న
పైని అనురాగము, కోపము నా మనంబునకు సంశయము
చూపదు జూడుమా! సంతలోని గుంపునందు అభిమా
నంబు మాటలమ్మ తగునె? వీధియందు నిలిచి యాడు
అనుభావంపు మాట నగుబాటు గాదె? సంగన బసవన్న
యందు మీ యందు భేదంబు లేదని నీవె ఎరిగెరిగి మరల
రాననుట ఉచితమె? కూడల చెన్న సంగని శరణ బస
వన్నయే మీ ప్రాణమై యుండ ఇంకవెరి మీద కోపము?
కృప చేయుమా ప్రభుదేవా! ౪౨

**వివేచనము :**

ఆహా! ఎంత సంతసము, సమాధానము అల్లమ బసవన్నగారి వాదోప వాదములు ఎంత తత్త్వ విచార విమర్శల వివేకముల శాస్త్రములైనవి అంతే గాదు శాస్త్రము నీరసమని,లింగపతి శరణసతుల సంభాషణము ఆలుమగల అంగ సంసారము వలె రసభరిత వాక్ కలహము సుందర కావ్యమై రసికుల కానంద భరితమైనది వినోద సంజనిత సమాహ్లాద కరమైనది దానికే లోకములో దాంపత్యానికున్న ఘనత ఏకాకికి లేదు ఒంటరివాడు దిక్కులేని సన్యాసియని అందరి ఉదాసీనతకు గురియై అపహాస్యానికి లోనైనాడు

ఒక మాట అల్లమస్వామి! మీరు ఇక్కడకు సిద్ధరామదేవునితో ఎందుకు వచ్చినారో తెలుసు వచ్చినవారు ఊరకుండక తగవుబెట్టి ఇంత కపట నాటక మెందు కాడినారో తెలుసు దీనిలో మీ పాత్రము అమోఘము, బసవన్న పాత్ర వివిధరస భక్తి భావోన్నత మహాభినయము మీకన్న సౌందర్య సౌశీల్య రసా నందము మహాస్వామి, మీరెంత పురుషోత్తములైన ఈ దృశ్యము కొనలోతమరే ఓడినారు అదెంత రమ్యమొ బసవన్నకు తెలుసు, మీకు తెలుసు

నాకు తెలుసునంటె ఈ బయట సంతలో సంప్రదాయము గలవారు గౌరవనీయులు సరస సల్లాపాలాడరు ఇంటిలోకి వెళ్ళి ఎంతైన మాటలాడు కొనండి యని కవిగా విమర్శకుడుగా, కలా విదుడుగా అంతవరకు జరిగినదంతా నాటకముగా ఎంచి ముక్తాయ బుద్ధి వాదముతో భరత వాక్యము పలికిన యువ కుడు, విచారధీరుడు, వినోదప్రదుడు చెన్నబసవన్న మాటలు అల్లమున కామోద భంతమైనవి బసవన్న తలవంచినాడు శరణులు బాపురేయన్నారు సిద్ధరాముడు ఆనంద భరితుడైనాడు అల్లముడు ఇట్లు గీతము పాడుకొనుచు ముందు కడుగు బెట్టినాడు అందరు అనుసరించినారు

**అల్లమప్రభు**

ఆయతమందు పూర్వాచారిని గంటి స్వాయత
మందు పూర్వాచారిని గంటి సన్నిహితమందు పూర్వా
చారిని గంటి,గుహేశ్వర లింగమందు పూర్వాచారి సంగన
బసవని శ్రీ పాదములకు నమో నమో యందును ౪౩

**వివేచనము**

ఇష్ట లింగము, ప్రాణ లింగము, భావ లింగములకు మొదటున్నవాడు పూర్వాచారి బసవన్న గుహేశ్వర లింగమందు పూర్వాచారి యని స్తుతియించిన ఇట్లనును

(సిద్ధ వీరణ్ణొడెయుల గద్యము)

నిత్య బసవన్న, నిరంజన బసవన్న, సచ్చిదానంద, నిత్య పరిపూర్ణ బసవన్న, అఖండ పిండ బసవన్న, అనంతకోటి బ్రహ్మాండంబులకు ఆధార రూపు బసవన్న, శివాచార చక్రవర్తి బసవన్న, సర్వాచార సంపన్న బసవన్న, షట్స్థల బ్రహ్మరూపు బసవన్న, సర్వాంగ లింగమూర్తి బసవన్న, స్వానుభావ సారోద్ధార బసవన్న, జంగమ ప్రాణి లింగైక్య బసవన్న, ఆరూఢి దాసోహి

బసవన్న, నిస్సంగి నిజరూపు బసవన్న, శివసమయ ప్రతిష్ఠాచార్య బసవన్న అనుచు గుణగానంబు జేసి అల్లముడు తృప్తుడై నాడు

- ० -

ఇది కృపామూర్తులైన శ్రీ మృత్యుంజయప్పగారిని, స్వప్న బోధామూర్తులైన శ్రీ ఎర్రి తాతయ్యగారిని స్మరించి, సకల శివశరణులను వందించి, శూన్య సంపాదనలోని "ప్రభువు కల్యాణమునకు వచ్చిన సంపాదనము" నకు సంగ్రహముగా జెప్పిన వ్యాఖ్యానము సంపూర్ణము.

శ్రీ గురు బసవ లింగాయ నమః

# శూన్య సంపాదనము

## మరుళ శంకరదేవుని సంపాదనము

౧

కం వరబసవదండనాథుని
నిరహంభావమును మెచ్చి నెరయం ప్రభుడా
మరుళ శంకరుని నైక్యము
చిరమిచ్చినది శరణజనసిరికి తెలిపెదన్

శివశరణుల జయఘోషతో, మంగళగీతములతో, అల్లమ ప్రభుదేవుని సిద్ధరామేశ్వరుని సహితంగా బసవన్న మహా మందిర ద్వారము నుంచి లోపలికి వచ్చి ప్రభు పాదములు కడిగి తడియొత్తి చేయూత నిచ్చి ఆనంద రసావేశ పరవశుడై స్తోత్రంబు జేయుచు రెండవ ద్వార సమీపమునకు వచ్చునప్పుడు, పక్కనుండు ప్రసాదకుండములో నుంచి మహాశరణుడు మరుళ శంకరదేవుడు వచ్చుచుండుట జూచిరి అంతవరకు అక్కడ ఆ శరణుని ఎవరుచూచి యుండ లేదు ఆయన గుప్తభక్తుడు ప్రభుదేవుని ఆగమనానికి వేచియుండె మహా నందమున వచ్చి సాష్టాంగవందనం బాచరించి ఇట్లనుచున్నాడు

**మరుళ శంకరయ్య**

జయ జయ త్రాహి త్రాహి గర్భమందున్న శిశువు
నవమాస మవధిని గాచినట్లుంటివయ్యా! నాదు జన్మంబు
సఫలంబయ్యె శుద్ధశిద్ధ ప్రసిద్ధప్రసన్నప్రభూ! శాంత

మల్లికార్జున దేవయ్యా, బసవరాజుని దయవలన ప్రభు
దేవుని శ్రీమూర్తిని గని బ్రతికితిని మీ ధర్మము మీ
ధర్మము శరణు శరణార్థి సకల పురాతనులకు ౧

**వివేచనము**

జంగమదేవా, జయము జయము గర్భంబునందున్న శిశువు బయటి కొచ్చుటకు నవమాసములు నిరీక్షించునట్లు, తమ సందర్శనానికై బసవ దేవుని ఈ మహా ప్రసాదగుండమందు దాగియుంటిని ఈనాడు నా కోరిక నెరవేరినది బసవేశ్వరుని కృపాపరమున మీ దర్శనమై బ్రతికితినని ప్రార్థనజేసి, మరుళ శంకరదేవుడు శరణులందరికి వందించగా అందరు ఆశ్చర్యభరితులైనారు మహాతేజస్వియైన ఈ శరణుని ఎవరూ ఎప్పుడు చూడలేదు ఈయన వున్నరీతి ఎట్టిది? ఈయనెక్కడివాడు? వాకిలి పక్కనే యుండి కానకుండ యుండుటొక మహిమగానున్నది ఏమో ఎవరెవరున్నారో భక్తుని అంగణమే కైలాసము అన్నమాట నిజమైనదని అందరు ఆయనకు వందన మాచరించినారు అల్లమ దేవుడు బసవన్నను జూచి ఇట్లనుచున్నాడు

**అల్లమప్రభు**

చూచితివా బసవన్నా! కంటిలో నున్న బొమ్మ సూత్ర
మందిన యట్లు, కుందన మందలి మృదుచ్ఛాయ యట్లు
వెన్నయందడగిన సారంబు చవి యట్లు, అంగము లేని
గురుతు భావంబులేని బయలు వెలుగొందని జ్యోతిని
కంటివా! గుహేశ్వర లింగమందు మరుళశంకర దేవుని
సంగన బసవణ్ణా! ౨

**వివేచనము**

ఆహా మహా విభూతి పురుషుడు మరుళ శంకర దేవుడు చూచితివేమయ్యా! ప్రసాదంబు మరుగున మహాప్రసాదమై, నీ భవనము ముందు గుప్తభక్తితో నీ పవిత్రతను రక్షించుకొనుచున్న మహనీయుని చూడలేదుగదా? ఔను చూచి చేయునదేమి, తెలియునదేమి? లోకములు అన్నియు వ్యక్తీకరించవు కంటిలోని బొమ్మ మనెము మాయితె గాని కనబడదు గదా! అట్లనె కుందనములో మృదు

ఛాయ, వెన్నలోని చెప్పరాని స్వాదము ఎటులనో అటులే ఆయన అంగము ఒక గురుతుగా ఆకారమైనది వెలుగు దాక్షిణ్యము లేని వెలుగు జ్యోతి మహా సద్భక్తి రత్నము నీ యంగణమునందే ఉన్నాడు భళీ! ఇట్టివారు ఎందరున్నారో నీ యాశ్రయమున! నీకే తెలుసునప్పా బసవప్పా! అని తన మనసులో మరళ శంకరదేవుని మహిమను నుతియించిన అల్లమదేవుని మాటవిని ఆశ్చర్యపోయి ఏమో చెప్ప నుద్యుక్తుడైనపుడు మరుళ శంకరయ్య అడ్డువచ్చి తనను పొగడి నందుకు సమాధానము చెందక విన్నపించుకొనుచున్నాడు

**మరుళ శంకరయ్య**

సింబికి రంభతనుండునో సంభ్రమముల దిగ
జారిన దానికి నవయౌవనపు తనువు కలుగుండునె
డింగరులకు (కింకరులకు)సమమను సంభ్రమ ముండునె?
పరుషంబు దెసనుంచి పాషాణ జాతి తెగినట్టు నీవు వచ్చిన
వయ్యా! శుద్ధ సిద్ధ ప్రసిద్ధ ప్రసన్న ప్రభువౌ శాంత
చెన్న మల్లికార్జున దేవయ్యా, ప్రభుదేవుని కారుణ్యమున
బతికితిని 3

**వివేచనము :**

ఎక్కడ నుంచెక్కడ ప్రభూ? పరుల ఇంటికి పొట్టకూటికై నీళ్ళు మోసె దాసిని దేవలోకములోని సౌందర్య నిధి రంభయన్నట్లున్నది ఒడలంతా తోలు దిగజారిన ముడుకాళ్ళ ముసలిని మన్మథుడన్నట్లున్నది భృత్యుని ప్రభువుతో సమాన మన్నట్లున్నది మీ కృప మీ సందర్శన సౌభాగ్యమున రాయి పరుష మైనట్లు బతికితినయ్యా యని మరుళ శంకరుడు దాసోహం భక్తిని వెల్లడించిన ఆహా, ఎంత సాధించినాడీ మహానుభావుడు దేహమెక్కడుండిన నేమి ఏ స్థితి చెందిన నేమి ముఖ్యమైనది మనోనైర్మల్యము నేనెక్కడ చూడలేదు ఇటులుండుట సాధ్యమా యనునది నా యూహ కందనిది చెప్పినను నమ్మకున్నది ఈనాడు చూచిన దెంత విశేషమని మనమారి అల్లముడు తన ధన్యతను తానె కొనియాడు కొనుచు ఇటులనుచున్నాడు

## మరుళశంకరదేవుని సంపాదనము

**అల్లమ ప్రభు**

కంటిని గదా మలినంబు లేని కలిని; కంటిని గదా యౌవనములేని నెనరును! కంటిని గదా కైదులేని కలితనము; కంటినిగదా పూవులేని గంధమును! కంటి కంటి గుహేశ్వర లింగమందు మరుళ శంకరుడను నామము!! ౪

**వివేచనము**

భళిరే! కంటిని మోహ మమకార ఆశాపాశములు లేని పరిశుద్ధుని పరమ పవిత్ర స్నేహము యౌవన చంచలత లేనిది కంటి ఆయుధములేని స్వయం శూరుడు లోకబంధాలను తెంచిన చిదానందవీరుడు ఈనాడు బసవన్నని కరుణ వల్ల చూచిన అపూర్వ దృశ్యమని కొనియాడగా, మరుళ శంకరుడు స్వామి స్వామి అల్లమదేవా నిలువండి నా మనవి వినండని ఇట్లనుచున్నాడు

**మరుళ శంకరయ్య :**

కొండను నమ్మి మాను తోయు టొక ఆశ్చర్యమా? ప్రాణమునకు భరవస యుండ యుద్ధమాడు టాశ్చర్యమా? పరకాయంబున ప్రవేశించి యుండ ఆశ్చర్యమా, అతి తొందరయా? మీదు కారుణ్యమై యుండ నా కెక్కడనూ సుఖంబె? శుద్ధ సిద్ధ ప్రసిద్ధ ప్రసన్న ప్రభూ, శాంత మల్లికార్జున దేవయ్యా! ప్రభుదేవుని వల్ల బ్రతికితిని ౫

**వివేచనము**

అయ్యా, తమరు కొనియాడునంత ఘనత నాకు లేదు మీపాద సేవకుడ నేను మీ కృపావలంబనముచే బతికిన పేద నేను కొండ ఆసరాతో ఎంత పెద్ద చెట్టునైన నరికి కిందికి వేయవచ్చు ప్రాణానికి ప్రాణమై తోడుగా యున్నపుడు యుద్ధానికి వెళ్ళి పరాక్రమము చూపుటొక వింతయా? పరకాయంబు తొడిగి యున్నపుడు కష్టకార్పణ్యములుండునె? మి కారుణ్యముచే నాకంతా సౌఖ్యమే స్వామి! అది-ఇది యనుకాలము-కర్మము అను నిర్బంధములు లేవు అని

వినయంగా మరుళ శంకర దేవుడు నుడువుచుండ శివ శరణులంతా వెరగై చూచుచుండగా, ఆశ్చర్యముతో బసవరాజ దేవుడు మరుళ శంకర దేవుని మహిమను కనుగొని చింతాక్రాంతుడై ఇట్టి శరణుడు వాకిలి లింగమై యుండి ఇది వరకు చూచే కన్నులు నాకు లేకపోయెనే, నేనెంత దౌర్భాగ్యుడను అని అనుతాపముతో అనుచున్నాడు

**బసవణ్ణ**

అయ్యా, మీ శరణులు వచ్చి నా ప్రాంగణము
నందు రక్షించెదమని యున్న, నే నెరుగక యుండి
చెడితినయ్యా! నే చెడిన చేటుకు కొనయుండదయ్యా!
కూడల సంగమదేవా, నాదు భక్తి వెయ్యి వ్రతముల జేసి,
ఒక్క వ్యభిచారమందు నాశమైనట్టు అయ్యెనయ్యా! ౬

**వివేచనము**

అల్లమదేవా! అనుగ్రహించుటకై వాకిలి ముందున్న మహిమను కనుగొన లేని నా భక్తి యెందుకు? అది కీర్తికాముకము పెద్దరికాల దాంభికము ఒక నాడు కాదు, నెల కాదు, పన్నెండు సంవత్సరములు ఆహా, నా కన్నుల గట్టిన కర్మపు మసి గుడ్డ అదెంత నలుపో నన్ను చూడనీయలేదు లోకము సూర్యుని వెలుతురులో కనుగొనునట్లు ఈనాడు జ్ఞాన భాస్కరుడై తమరు విచ్చేసినందున మీ వెలుతురులో చూచే భాగ్యమబ్బినది ఐతే, ఇన్నాళ్లు చూడకున్న అపరాధాని కేమి దండన ప్రభూ! అన్ని రీతుల నే చెడితిని ఎన్ని వ్రతములు జేసినా ఒక రంకుతో కొట్టుకొనిపోయినట్టయినది

ఆవేగముతో బసవన్న ఒక రీతి గాక నానా రీతుల తన్ను తాను నిందించుకొని పరితపించుట జూచి బసవన్నకు కాలములో నున్న పరిపక్వతను ఉదాహరణంగా చెప్పుచు ప్రభు అనునయించుచున్నాడు

**అల్లమ ప్రభు**

కసుగాయిదెంచి ఒత్తి పండుజేయబోవ పండౌనా
పరిమళంబు లేని మొగ్గ వికసింప జేసి తలయందుంచు

కొన్న సౌరభంబు కలుగునే? శివశరణుల గతి కానవచ్చు
కాలమునకు కానగు ఎల్ల కాలంబునందు కానగునే?
కాగల కాలమునకు తానె యగును గుహేశ్వరుని శర
ణుల రీతి, కన్న మీద, మరపు వెలుగుగన్న చీకటియట్లు
తెగును చూడుమా సంగన బసవణ్ణా! ౭

**వివేచనము**

బసవయ్యా దీనికి పరితపించుటెందుకు! అన్నిటికి కాల నియమములున్నవి కాయ మనకు కావలసినప్పుడు పండుకాదు వికసించే వరకు పూవుకు వాసన రాదు ఆ రీతిగనే శరణులు మహాత్ములు జ్ఞానులు మన అవసరాలకు లభ్యము కారు ఆ కాలము వచ్చినపుడు దర్శనమియ్యగలరు ఏ వానికైన నీ లోపల నున్న నిదను జ్ఞానానికన్నా కాల ఘటన నుంచే వివేకము జనించును అంత వరకు అది ఏమి చేయను రాక సుప్తముగా నుండును శరణుల దర్శన భాగ్య మబ్బిన తరువాత అజ్ఞానాంధకారముండదు నీవు అందరి లాగ సామాన్యుడవు గావు లోకోన్నతాదర్శ పురుష పుంగవుడవు గాకున్న ఇట్టి మహిములు నీ వాకిలికి కావలి యుందురే యని బసవన్నకు అల్లయ్య సమాధానము చెప్పినపుడు మరుళ శంకరదేవుడు అంతవరకు తన యింటి ముందున్నను చూడకయుండు తన అపరాధమును క్షమించుమని బసవన్న ఇటుల వేడుకొనుచున్నాడు

**బసవణ్ణ :**

మేఘంబు మరుగున నున్న మెరుపట్లు, కాయంబు
మరుగుననున్న ఆత్మయట్లు, నేల మరుగుననున్న నిధాన
మట్లుండు మీదు మహిమ నెవరెరుగుదురు? దేవా మీదురీతి
ఎంతో కాలము నుంచి కని కని కడగాంచి మరచి మతి
చెడి మరులైతిని నే చేసిన తప్పుకు కడలేదు కనుమా!
త్రాహి త్రాహి త్రోవుమయ్యా కూడల సంగమదేవా! ౮

**వివేచనము :**

మహనీయ గుప్త చరితా! శంకరదేవా! మన్నించు ఇంత కాలము మా కండ్ల కగోచరుడవై ఈ ప్రసాద గుండమందుండి ఎవరి కెరుకకు రాక ఉండిన

దెందుకో మాకెవరికి తెలియదు స్వామి! మేము జేసిన అపరాధమేమొ మా పరివారము వారు లోపలకు రానీయలేదా స్వామి? ఎవరు ఎక్కడనుండి కల్యాణాని కొచ్చినా ఈ బసవనికి దర్శనమిచ్చి కరుణ ప్రసాదముతో ఉద్ధరించిరి తమ సంపర్కమునకు మేము నోచుకోనలేదన్నప్పుడు ఇక పూజా ప్రసాదానుభవము లెక్కడిది?

మొయిలు మరుగున్న మెరుపువోలె, అంగంబు మరుగున్న ఆత్మవోలె, నేల మరుగున్న బంగారు నిధివోలె ఇక్కడున్న మీరు దౌర్భాగ్యులకు దొరకుదురా? నే జేసిన తప్పు క్షమించరానిది అయ్యా! ఇకనైన కృపజేసి లోపలకువచ్చి కృతార్థుని చేయండి అని వినమ్ర భావాతిశయమున తన తప్పు నివేదింపుకొన్న తరువాత అల్లమునకు మరుళ శంకరదేవు డిట్లనుచున్నాడు

**మరుళ శంకరయ్య**

ఏకబీజం సమం వృక్షం ఏకలింగంతు పూజనం
ఏక ధ్యాన సమం చిత్తం ఊర్ధ్వలింగంతు పూజనం
ఏకాక్షరం తు పూజానాం మహాలింగం తు దర్శనం

ఇట్లున్న కారణంబున మీ శరణ బసవదేవుడు
లోకమునందున్న మర్త్యుడనిన అఘోర నరకంబు
చూడుమా! శుద్ధ సిద్ధ ప్రసిద్ధ ప్రసన్న ప్రభూ శాంత
చెన్న మల్లికార్జున దేవయ్యా, మీ శరణ బసవన్న తీరేమో
మీకే ఎరుకగాని నాకెక్కడెరుకయ్యా? మీ ధర్మము
మీ ధర్మము

**వివేచనము .**

అయ్యా! బసవేంద్రా, నేనెక్కడ? లోకోద్ధరణకార్యకారణ కర్తవై, మర్త్యాని కొచ్చిన మీరెక్కడ? మీరు చూచునంతటివాడ నేను గాదు మీ శరణులకు చూడరానివాడ గాన మరుగై యుంటిని మహానుభావ మీ, కరుణచే శరణ ప్రసాదము లభ్యమైనది దానికే అష్టనిష్ఠానమునుంచి వచ్చితిని ఒకే బీజాని కొక వృక్షము బీజమున్నట్లు వృక్షము ఏక లింగము ఏకాంగము సమచిత్త ధ్యానము

పై సంచారము పూజలు, బీజాంకురము ఓంకార మొక్కటే కదా బసవయ్యా! ఇవన్నియు నీవై యున్నందున, అవన్నియు శరణుల ప్రసాదములోనున్నందున నీ అనుజ్ఞ లేక ప్రసాదగుండ పుండుండిగాన తమరు క్షమింపవలె మిమ్ముల మానవలోకానికొచ్చిన యాపుడన్నవారికి అఘోర నరకము ఈ రోజు అల్ల ముడు వచ్చినందున నా గుప్త వ్రతము వెల్లదయినది సర్వాంతర్యామియైన జంగమునిముందు ఏ వ్రతము చెల్లదు అల్లముని యనుగ్రహము మీ యను గ్రహము సకల పురాతనుల అనుగ్రహము ఈ పుణ్యసమయమున దొరికింది అని చెప్పి యిట్లనుచున్నాడు

> నాదు జ్ఞానాత్మక చేతనుడయ్యా ప్రభుదేవుడు
> నాదు పరమాత్మక చేతనుడయ్యా సిద్ధరామదేవుడు నాదు
> చిన్మయాత్మక చేతనుడయ్యా సంగన బసవేశుడు నాదు
> నిర్మలాత్మక చేతనుడయ్యా షడుస్థలబ్రహ్మ చెన్న బస
> వేశుడు నాదు మహాత్ముని చేతనుడయ్యా బసవని నిజ
> సుఖి అప్పణ్ణదేవుడు నాదు జీవాత్ముని చేతనుడయ్యా
> మడివాళ మాచరాజు నాదు జ్ఞానంపు చేతనాత్మకుడయ్యా
> కిన్నరి బ్రహ్మయ్యగారు ఇటుల ప్రమథుల కారుణ్యంబున
> శుద్ధసిద్ధ ప్రసిద్ధ ప్రసన్నప్రభూ శాంత మల్లికార్జున
> దేవయ్యా, బతికితి చూడుమా! మీ ధర్మము మీ ధర్మ
> మయ్యా! ౧౦

**వివేచనము :**

అలభ్య భాగ్యలక్ష్యము మీ సేవ చేయకనే నాకు దొరికింది నా పుణ్యరాశికి మేరలేదు అల్లముడు చిత్ సూర్య ప్రభా భాసమానుడై బసవని భక్తిశక్తికి లోనై ఈ బయలుగా దుదయించినారు చెన్న బసవ, సంగన బసవ, అప్పన్న, మడివాళ మాచయ్య, మహా సంగీత విద్వాంసుడైన కిన్నరయ్య మొదలగు శరణులంతా ఇక్కడ చేరినారు మీ ప్రసాదము మీ పాదస్పర్శముచె నేనేగాదు ఇక్కడున్న క్రిమికీటాలు పవిత్రమగును నాకు సెలవిప్పించవలెను నా దేశము అఘని స్థానమును భ్రాంతియు లేదు ఏ అభిమానములు ఏ ఆశలు ఏ భావములు లేక

ఎసవన్న ప్రసాదమునుంచి మీఎల్లర కృపా కటాక్షమునుంచి ప్రసాద స్వరూపము గాంచితని అందరికి సాష్టాంగ వందన మాచరించి బసవధ్యాన పరాయణుడై ఇటు_నుకొనుచున్నాడు

మహాలింగి త్రయోలింగం త్రివిధం షడ్విధం ముఖం
త్రివిధైక ముఖం లింగం మహాలింగం తు దర్శనం

ఇట్లున్నడిగాక, ఒకటిని మూడు జేసుకొనెనయ్యా మా బసవయ్యా మూడు ఆరు చేసుకొనెనయ్యా మా బసవయ్యా ఆరు మూడు జేసెకొనెనయ్యా బసవయ్యా ఈ విధము సర్వావధానియయ్యా మా బసవయ్యా ఇటుల సర్వసంగ పరిత్యాగియియ్యా మా బసవన్న ఇటుల సర్వకరణ నిర్ముక్తుడయ్యా మా బసవయ్యా ఇటుల కారుణ్య ప్రసాదియయ్యా మా బసవయ్యా ఇటుల సర్వాంగి లింగియయ్యా మా బసవయ్యా ఇటుల సర్వ నిర్వాణియయ్యా మా బసవయ్యా ఇట్టి బసవన్న మహిమ మీరె ఎరుగుదురు అసంఖ్యాత మహా పురాతనులు ప్రభు దేవులు ముఖ్యమైన వారి శ్రీచరణంబులకు నేను శరణార్థి శరణార్థి యని శబ్ద ముగ్ధుడై అగ్ని మింగిన కప్పురము వోలె మీ చరణంబు జొచ్చితినయ్యా శుద్ధ సిద్ధ ప్రసిద్ధ ప్రసన్న ప్రభువా శాంత మల్లికార్జున దేవయ్యా! మీ శరణ బసవన్న ప్రసాదంబు గొని నేను బసవయ్య ముందు బయలైతినయ్యా, మీ ధర్మము మీ ధర్మము ౧౧

**వివేచనము**

బసవరాజు మహిమ నేను పొగడుటకు సాధ్యము కాదు బన నాకు తోచి నట్లు చెప్పుకొనెద మహాలింగ మొక్కటే యున్నపుడు అది ఉపాసనకు రాదని ఇష్ట ప్రాణ భావలింగాలుగా విభజించి స్థూలకాయమందు ఇష్టలింగము, సూక్ష్మ కాయమందు, ప్రాణలింగము కారణ కాయమందు, భావలింగము లుంచెను ఈ మూడు లింగాలను ఆచార లింగము గురు లింగము దీప లింగము జంగమ

లింగము ప్రసాదలింగము మహాలింగము - ఇట్లారు లింగములుగా జేసి మూడు తనువులు ఆరింద్రియముల పరిశుద్ధ చేష్టకు మార్గక్రమము ఏర్పరచినాడు ఇది గాక మరి ఆ యారు మూడు, ఆ మూడు ఒకటిగా జేసి సర్వావధాని, సర్వసంగ పరిత్యాగి, సర్వాచరణ నిర్ముక్తుడైన బసవన్న మహిమ మీకే తెలియును అసంఖ్యాత మహాపురాతనులు, ప్రభుదేవులు ముఖ్యమైన మీ యందరి శ్రీచరణార విందములకు శరణార్థులు బసవన్నగారి కరుణ ప్రసాదంబున శబ్దముగ్ధుడనై బయలయ్యెద మీ ధర్మము మీ ధర్మమిది బసవలింగాయ నమ అనుచు కాయంబుతో మరుళ శంకర దేవుడు మాయమవుట జూచి శరణులు బసవన్న మొదలగువారు ఆశ్చర్యభరితులైనారు

బసవన్న అనుకొనుచున్నాడు బయలంటె ప్రాణంబుతో బయలు ఆకారముతో మరుళ శంకరుడు బయలైనదెట్లు? స్థూలమునుంచి సంస్కార రూపంగా సూక్ష్మాని కిచ్చుకొనవచ్చుగాని ఆ స్థూలాన్నే సూక్ష్మములో చేర్చుటెట్లు? నిర్మాయకాయులు శరణులను మాట యున్నది బనను కాయమే బయలునందు కలుపు టెందుకు? కాయసహితము కైలాసమున కేగుట కాయసహితము ముక్తి జెందుట ఇవి మహనీయుల విశేషములా? లీలావినోదములా? యని ఆ సమయ సన్నివేశాన్ని గురించి యోచించు బసవన్నకు చెన్న బసవన్న సమాధానము చెప్పుచున్నాడు

**చెన్న బసవన్న**

కాయము నశించితేమి? కాయమున్ననేమి? కాయంబు
బయలైననేమి? మనసు మనంబు లయమై ఘనంబునకు
ఘనమైన శరణుల జూచిన కూడల చెన్నసంగని యందు
శబ్దముగ్ధుడై యుండవలె గాని చోద్యంబునకు కారణ
మేమి చెప్పవే సంగన బసవన్నా ? ౧౨

**వివేచనము**

బసవదేవా, దీనియందేమి ఆశ్చర్యమున్నది? ప్రసాద కాయము శర ణుని ఇచ్ఛామాత్రంగా యుండవచ్చును పన్నెండేళ్లు మరుళ శంకరదేవుడు కాయముతో నుండి కూడ ఎవరికి కనబడక యుండలేదా? ఈనాడు తన ముక్తాయ

మని ప్రభు సందర్శనానికై కనబడి శరణులందరికి మనవిజేసి శరీర ముతో ముక్తుడైనాడు శరీరపు స్థూలాన్ని బరువును క్రియానుక్రియలను సూక్ష్మంగా చేయవచ్చు ఆ కాయము అంటె మనోలయమై ఘనమైన శరణుని కాయము కన దినసూ అంతె కనబడక ఎయలులో బయలైనను అంతె దాని యందేమి విశేషము లేదని చెన్నబసవయ్య చెప్పగా అందరు సంతోషించినారు

— ౦ —

ఇది కృపామూర్తులైన శ్రీ మృత్యుంజయప్పగారిని స్వప్నబోధామూర్తులైన శ్రీ ఎర్రి తాతయ్యగారిని స్మరించి సకల శివశరణులకు వందించి శూన్య సంపాదనలోని "మరుళ శంకరదేవుని సంపాదన"మునకు సంగ్రహముగా చెప్పిన వ్యాఖ్యానము సంపూర్ణము

శ్రీ గురు బసవలింగాయ నమః

# శూన్య సంపాదనము

## బసవేశ్వరుని సంపాదనము

౭

కం॥ ఆదిమనాదుల భేదము
నాదరత తెలిపి జంగమ ప్రాణంబనకున్
మోదపు మార్గము తెలిపెను
మేదిని బసవనకు ప్రభుడు ప్రేమాదరతన్

మరుళ శంకర దేవుడు బయలైనది అందరికి చోద్యమై ఆ శరణుని కొనియాడుచు అల్లమ దేవుడు ప్రమథ గణంబులతో గొప్ప నెరవుచు బసవన్న ముందు నడవగా రెండవ మహా ద్వారము లోపలి అంతర్భాగమందు వేదికపై శివశరణులతో సుఖాసీనుడైన దరహసిత వదనారవిందుడై శాంత గంభీర మూర్తియై శివయోగతేజోవిలాసియై వెలుగుచున్నది జూచి పరమానందభరితుడైన బసవరాజు తన్నుతాను మరచి పరవశుడై వినుతించుచున్నాడు

**బసవణ్ణ :**

అయ్యా, మీ మహానుభావుల సంగంబున నాదు
తనువు శుద్ధమైయుండె మనసు శుద్ధమైయుండె ధనం
శుద్ధమైయుండె నాదు సర్వాంగంబు శుద్ధమై యుండె
వారి శిలబొమ్మ నాలింగించి నట్టులైయుండె కూడల
సంగమదేవా, మీ శరణ ప్రభుదేవుని కృపనుంచి నాకు
చేకూరినఘనత నేమని ఉపమింతునయ్యా॥ ౧

**వివేచనము**

జంగమనాయకా! మీరు లీలామూర్తులు నేనొక చిన్నమొక్క మీరొక మహాసాగరము అనిరీక్షితంగా ఎంత పయయో ఆ మొక్కపై జంగమ కృపా సాగరము పారివచ్చింది సుదినము అలకించండి దేవా! మీ శరణుల సంగముచే నా తనుమనధనంబులు శుద్ధమయ్యె నా సర్వాంగము శుచియయ్యె వడగళ్ళ ప్రతిమ నప్పుకొన్నట్లులయ్యె స్వామి! మీరు నన్నుద్ధరించిన దేమని పొగడవలెనో చెప్పలేనని అత్యంత సంతసముతో తన ధన్యతను తాను పొందిన కృపా సౌఖ్యము చెప్ప ఇదివరకు అనువు దొరకి యుండలేదు ఇప్పుడు శరణ సమూహముతో శాంతవాతావరణమున్నందున అల్లమునకు బసవన్న విన్నవించినప్పుడు అల్లముడు ముదముతో ఇట్లనుచున్నాడు

**అల్లమప్రభు :**

కాయంబుతోడ పుట్టినవారు దేవుడైనగాని, ధాత్రైనగాని మాయను సాధించి గెలుచుటరుదు చూడుమా! మనసు మబ్బును గెలిచి స్మరించి సుఖియైతినన్న వారిని వెన్నంటి వేధించుకర్మ గుహేశ్వరలింగని మెత్తమెత్తగా స్మరించిన మొత్తిమొత్తి వేధించుచూడుమా మరపు! సంగన బసవన్నా, నీవు జేసిన స్మరణ అందరియట్లు కాదు చూడుమా! ౨

**వివేచనము :**

కృతార్థతి చేబట్టియే ఈ లోకాని కొచ్చిన పరమకృతార్థుడవు ఇక ఇక్కడ పొందునదేమి? సర్వజీవదయావారియై ఇచ్చుచున్నావు నీవెవరిదగ్గర ఇంకేమియు పుచ్చుకొను అవసరమేముంది? ఐనా, ఈ మర్మము తీరే వేరు ఇక్కడున్న మాయా ప్రాబల్యములో ఎట్టివారైన గాని హరిహర బ్రహ్మాదులాదిగా మన్ను మెక్కిన కథలు చెప్పుచున్నారు చూడచూడ నాకు అట్లనే అనిపించును ఎంతెంత లింగస్మరణ ఎక్కువైతే అంతంత కష్టాలు వచ్చుననునది లోకస్వభావము అయ్యది నీకు వర్తించదులే ఇతరుల మాట చెప్పితినన్న అల్లముని వ్యంగ్యోక్తి బసవన్నకు ఒక చుట్టుచుట్టినట్లే చుట్టి మరల విప్పి లోకముపై వేసినాడు ఇది మహామేధావియైన బసవన్నకు తెలిసి నవ్వుతు ఉత్తరమిచ్చుచున్నాడు

**బసవణ్ణ**

గిరి ఘనము అంకుశము చిన్నదనవచ్చునే
అయ్యా! గిరి ఘనము వజ్రము చిన్నదనవచ్చునే అయ్యా!
తమంధము ఘనము జ్యోతి చిన్నదనవచ్చునే అయ్యా!
మరపు ఘనము మిమ్ము ధ్యానించుట చిన్నదనవచ్చునే
కూడల సంగమ దేవా? మీ కృపాఘనము మీకే ఎరుక

**వివేచనము :**

స్వామి అల్లమప్రభు! తమరే మాటాడినను అడ్డుకొనుట కష్టము మీరు చెప్పినట్లే లోక స్వభావముండుట నిజము అదియొక ప్రశ్నగా వాడుకొన్నారు మనముందు వివరించినారు ప్రశ్నయున్నచోటనే పరిహారముండు నన్నది తమకు తెలియనిదికాదు పెద్దగా మాయను వర్ణించారు సరియే అది ఉన్నట్లుండి జీవియై ఈ మర్త్యానికి వచ్చుట దాని రహస్యాన్ని తెనుగొనుటకే కదా? లేకుంటె ఏ భోగ, దేవలోకాల్లోనైనా ప్రతిలేని దివ్యశరీరియైయుండి వచ్చు ఆదివ్యత్వము ప్రయోజనము లేనిద ప్రయోజన ముందునదంతా ఈ మాయావృతమర్త్యము లోనే స్వామి! ఏనుగు చాలా పెద్దది అంతటిది చిన్నమొన అంకుశానికి మెత్తబడి వంగుతుంది వజ్రమెంత? కొండయెంత? ఒక గీత గీచినచాలు పగిలిపోతుంది మబ్బున్నంత దీపముండవలెనా? చిన్నదీపముంటె చాలు అట్లనే అజ్ఞానము పెద్ద దనిన మీ ధ్యానంబు చిన్నదిగునేమయ్యా? ఏమో మీరు పెద్దవారు కృపజేయు వారు ఆ కృపయెట్టిదో మీరే ఎరుగుదురు

బసవన్న చక్కని లోకపు ఉదాహరణలిచ్చి అల్లముని మాయా మహిమ బెదరింపునకు సయుక్తికంగా సమాధానము చెప్పినపుడు ఊరకుండక అల్లముడు ఇట్లనుమన్నాడు

**అల్లమ ప్రభు :**

స్మరించెదనన్న మనంబునకు చిక్కదు తెలిసెద
నన్న గురుతుకు రాదు కంటి నన్న మూర్తిగాదు
తనువులో లేని మనంబులో లేని ఘనము నీ మనసుకు

వేద్యమైన తెరగేది? గుహేశ్వరుడను లింగము జగము
కంటికి అంధకారంబు నింపి తాను మరుగైన భేదంబు
నీ యందడగిన రీతి ఎట్లు చెప్పవే సంగన బసవణ్ణ

**వివేచనము :**

బసవేశా! నీవు భక్తి భాండారివి ఆ భక్తి శక్తికి అందనిదేముంది? అయితే స్మరణకు రాని, గురుతుకురాని ఆలాగు ఫలవంతమైన వక వస్తువు అనువుగాక మనము భావంబులు గాక యున్నది కదా? అట్టి చిదాత్మను, బయలు బయలైన దానిని నీ వెటుల ఎరిగితివో? ఎటుల సాధ్యమైనదో? ఏ ఉపాసన కందినదో? ఆ బ్రహ్మమనేది లోక నేత్రానికి అజ్ఞానమను చీకటిని నింపినాడు కద? బసవ రాజ, ఎవరికి దొరకరాదని తనంత తానున్నాడు గదయ్యా! అట్టి గజదొంగను నీవు పట్టినదెట్లో చెప్పు అని అల్లముడు మాయాతీతుడై జగమునకు సంబంధమే లేక అవతలవతలుండు వానిని నీ వెట్లు పట్టితివని అడిగినాడు మొదట మాయను పెద్ద జేసి అడిగితె బసవన్న సమర్పకంగా ఉత్తరమిచ్చిన మీద, ఇప్పుడు మాయ కతీతుని తెలిసినదెట్లని అడిగినందుకు బసవన్న చాల నెమ్మదిగా ఇట్లను చున్నాడు.

**బసవణ్ణ**

జగము చుట్టియుండె మీదు మాయ జూడుమా!
మిమ్ము చుట్టియుండె నా మనము కనుమయ్యా! నీవు
జగంబునకు పెద్ద, నీకు నేను పెద్దనయ్యా! ఏనుగు
అద్దమునందడగినట్లు న యందడగితివి కూడల సంగమ
దేవా! ౨౫

**వివేచనము**

అగాధము అగమ్యము అగోచరము అతర్క్యము అప్రమాణములని ఈ పద వాక్యములు జ్ఞానులు ఆ పరబ్రహ్మను గురించి చెప్పుకొన్న ప్రలాపములు స్వామి వారు చెప్పినదేదియు భక్తులకు తెలియదు ఎందుకంటె, అంత ఎత్తుకు వ్యాపకానికి పోయి చూచుటకు ఇచ్ఛగించరు అది గాక, అవి ఏమి జేసినను తెలియనప్పుడు దాని నుంచి ఏ ప్రయోజనము వుండదు ప్రయోజనము లేని

దానిని పొందుట వ్యర్థము అందున జీవి ఉపాసనకు సులభము గాదు తమరు చెప్పినది నిజమె భక్తుని మార్గమది గాదు

జగత్తులో అణురేణు తృణకాష్ఠములలో చుట్టినది మీ మాయ అట్టి మిమ్ము చుట్టినది నా మనము చూడయ్యా! నీ ఘనత జగమునకు పెద్దదైతే, నీ పెద్దతనమునకు నా భక్తి పెద్దదయ్యా! ఎట్లాఅంటె, దాని సులభము గొప్పదానిని గొప్పగా పట్టుట కష్టము చూడు, ఏనుగంత అద్దముండ నక్కరలేదు ఒక చిన్న ముక్క అద్దములో ఏనుగు పెద్ద ఘటాన్ని ప్రతిబింబించినట్లు నీ ఘనతను నా అంతరంగమందుంచుకొంటినయ్యా! నీవెంత పెద్దవాడైతెనేమి యని బసవన్న భక్తికి జ్ఞానానికున్న అంతరార్థాలను విప్పి జూపించి అత్యంత సులభంగా ఉత్తర మిచ్చినపుడు శివశరణులు సిద్ధరాముడు శహబాష్ భళే అన్నారు ఆ ప్రశంస విని అల్లయ్య అద్వైత తత్త్వము ముందుంచుకొని ఇట్లనుచున్నాడు

**అల్లమ ప్రభు :**

అంతరంగమందడగి యుండెనన్న, భావమునకు
పూజ్యంబు గాదు బహిరంగమందడగెనన్న, క్రియా
బద్ధంబు గాదు జ్ఞాన మందడగి యున్నదన్న మతి కను
కూలంబుగాదు భావ నిర్భావ నిశ్శూన్యమును గాంచు
విధమెట్లు చెప్పుమా! కాంచి తనలోన దాచుకొను రీతి ఏది?
గుహేశ్వరుడను లింగము నెరిగి కూడి సుఖియగు విధ
మెట్లు చెప్పవే సంగన బసవణ్ణా!

**వివేచనము .**

అయ్యా, జగద్భరిత పరతత్త్వానికి అంతరంగము బహిరంగము అందు నేమయ్యా! అది అఖండము దానిని నీవు ఖండించి రెండుగా జేసుకొన్నావంటె దానినుంచి ప్రయోజనమేముంది? అంతరంగములోనున్న దనిన ఆ ఉన్నదానికి పూజ్యత లేదు బహిరంగమున గుట్టుతో నుంచుకొనినన, ఆచారానికి రాదు ఇక జ్ఞానము దానిలోనున్నదంటె బుద్ధికి అందదు ఇటు లున్నపుడు నీవేమొ భక్తిని గొప్పజేసుకొని చెప్పిన మాటలు రమ్యములే గాని సాధ్యములా? భావ - నిర్భావ

నిశ్శూన్యముల గాంచుట సాధ్యము కాదన్నప్పుడు నీవేమొ లోపల పెట్టుకొన్నానని అన్నావు దానికేమైనా అర్థముంటె అనుభవానికి వచ్చియుంటె కొంచెము తెలియపరచెదవా సంగన బసవన్నా? అని అల్లముడు మరియొక చిక్కు పెట్టిన బసవన్న ముదముతో అంటున్నాడు

బసవణ్ణ

నాదు తను మనంబుల రెండునూ గురువు దీసి
ఏకంబు జేసెగాన నా అంతరంగ బహిరంగమను రెండు
మీవె జూడుమా! మీ యంతరంగ మందు మిమ్మందు
కొనెద మీ బహిరంగమందు మిమ్ము మీరై పూజజేసెద
మీ ఎరుకనుంచి మిమ్మెరిగెద చూడుమా కూడల సంగమ
దేవా! ౭

వివేచనము.

అల్లమప్రభు! నా తనుమనములు ఒకటిగా జేసిచాడు శ్రీగురుడు అఖండమై ఏకమైయుండు వారు మీరే అపుడు రెండైనారు చూడయ్యా! సర్వాంతర్యాములైన మిరుగాక మరి ఎవరుందురు? నాదియను అంతరంగ బహిరంగాలు మీవిగా ఉండినపుడు, నేనను అస్తిత్వము లేక, అంతరంగ బహిరంగ క్రియలు మీరై మీకు పూజాక్రియలు జరుగును మీ జ్ఞానమున మిమ్ము ఎరుగనగును మీరు లేక ఏ క్రియయు నడుచుటలేదు నడచిన జ్ఞానక్రియలు అంతరంగ బహిరంగాలు మీవిగానే యున్నాయని నిరహంభావముతో తా ననునది నీ వని ఉత్తరము సమర్పకంగా విన్నవించుకొన్నపుడు అల్లము దిట్లనుచున్నాడు

అల్లమ ప్రభు

సంగమందై యుండె తనువు తనువునుండై
యుండె మరపు ఆ మరపునుండై యుండె జూడుమా
నీవు నేననునది నీవను బహిరంగ మట్లుండని నేనను
అంతరంగ మట్లుండని ఈ ఉభయభావంబుగాక నీనుంచి
నిన్నెరిగితి నన్నది విపరీత భావము ఈ జ్ఞాన మజ్ఞానపు

భ్రాంతియాట తొ ప గుహేశ్వరలింగము నీయందు
నిలిచిన రీతి యదేమొ చెప్పుమా సంగన బసవన్నా! ౮

**వివేచనము**

అయ్యా బసవయ్యా! ఒక మాట గమనించు సంగముచే ఈ దేహము పుట్టును ఆ దేహము తోడనే అజ్ఞానముండును ఆ యజ్ఞానము నుంచియే నేను నీవనె విభేద మేర్పడును నీవు నేనను అంతరంగ బహిరంగాలు అట్లుండగ నీనుంచి నన్నెరిగితి నన్నావు గదా! ఇది విపరీత భావము ఎరుగుట మరచుట న్న ఈ నాటకపు భ్రాంతిలోనే తిరుగుతున్నటులనిపించును ఇట్లుండ లింగనివాసము నీయందైన రీతి ఎట్లో చెప్పవయ్యా బసవదేవా! యని అల్లముడు సృష్టియందున్న దోషాలు పుట్టుకతోనే వచ్చుట వచ్చుదానిని నిగ్రహించు విధానమెటులన్న బసవన్న ఇట్లనుచున్నాడు

అయ్యా అల్లమదేవా! జ్ఞానాజ్ఞానములు నీవె ఆదమొగి రెండును నీవె. మాయయు నీవె భ్రాంతుని భ్రాంతి నీవన్నప్పుడు అల్లముడు నవ్వుచు ఇదేమయ్యా, బరువెత్తేవారి మీదనె బరువుమోపినట్లున్నది నీ మాట అంతా శివునిదంటె శివ జ్ఞానులు మెచ్చుతారేమయ్యా? శివ శక్తి రెండును నీవె యనుచున్నావు మహాను భావులు ఒప్పుకొనవలెను గదా! తానెవరనునది ఎరుగక అంతా బ్రహ్మమంటే మా గుహేశ్వరుడు ఈ కర్మకల్మషమును ఒప్పునే? యని అల్లముడు అన్నపుడు బసవన్న సమాధాన మిస్తున్నాడు

స్వామి అల్లమేశా! వినండి జ్ఞానముచే జ్ఞానమెరిగి ఆ జ్ఞానము నీవను భ్రాంతి లేదు అట్లనే అజ్ఞానముగాని దేహప్రాణాదులుగాని మీరను భ్రాంతి నాకు లేదు భ్రాంతి సూతకి నేనుగాదు తెలియండి మిమ్మెరిగిన ఎరుగ భిన్నమంటె మీ యాన అని బసవన్న దిట్టంగా తన తత్త్వాన్ని నిరూపించినపుడు అల్లముడు అడుగుచున్నాడు

ఏమయ్యా బసవయ్యా! అంగాశ్రయమందు లింగముంది లింగాశ్రయ మందు కాయముంది ఎరుకనునది మాటనుబట్టి యుంది ఆ మాటతో కనబడు

అంగముంది లింగాంగములు నీలో ఏకైక్యమవును? స్వరముఒట్టి శబ్దమున్నది దేవుడు భక్తుడు అనే విభేదముండ తద్గత మనుదానికి అర్థమేమన్నప్పుడు అల్లమునకు బసవన్న ధీరగంభీరభావస్థైర్యమున పలుకుచున్నాడు

**బసవణ్ణ .**

ఘన గంభీరమైన మహా ఘనమునందు ఘనంబు
నకు ఘనమైయుంటినయ్యా! కూడలసంగుడను వెలుగులోన
వెలుగైయుండి శబ్దముగ్ధుడై యున్నది నేనేమందునయ్యా ౯

**వివేచనము**

మహా జంగమోత్తమ అల్లమ ప్రభుదేవా! ఔను మహాగంభీర పరబ్రహ్మానికి గంభీరమైనవాడు ఘనంబునకు ఘనంబైనవాడు వెలుగుకు వెలుగైనవాడు కూడల సంగునిలో శబ్దముగ్ధుడైనవాడు అన్యము కాదు అన్నియైన అన్యము, అని బసవన్న తన నిజమును ఏ అడ్డు ఆతంకాలు లేక ఏ తర్కానికి అనువీయక నిర్ధరించి వివరించినప్పుడు అల్లమదేవుడు చాల సంతసించినాడు ఆయనకు ఇట్టి నిర్ణయమే కావలెనను ఇచ్ఛయుండెను బసవన్న దాసోహం భావములో ఒక నిర్ణయము తెలియక, ఇంతవరకు వాదాన్ని పెంచుకొనివచ్చి, బసవన్నను సోహంభావానికి ఉపాయము పన్నినపుడు, తన గురువుకు గురువైన బసవన్నలో నున్న గుట్టు బయటపడినది తన గురువు అనిమిషుడు ఏమి బోధించలేదు తనకు తానే ఎంత సమాధానము చెప్పుకొన్నను అసమాధాన ముండనేయుండె అదిప్పుడు బయలైనందున ఆనందముతో బసవన్నను స్తోత్రము జేయుచున్నాడు

**అల్లమప్రభు :**

ఆది లింగము చూపిన అనిమిషుని కంటినయ్యా
నేడు కృతయుగపు స్కందుడను గణేశ్వరుని కంటి
నయ్యా నేడు త్రేతాయుగపు నీలలోహితుడను గణేశ్వరుని
కంటినయ్యా నేడు ద్వాపరయుగపు వృషభుడను గణేశ్వ
రుని కంటినయ్యా నేడు కలియుగంబున అనిమిష బసవన్న
యను గణేశ్వరుని కంటినయ్యా నేడు నన్ను కన్నవారిని
నిన్ను కన్నవారిని నేడు కంటి జూడా గుహేశ్వరా! ౧౦

**వివేచనము :**

ఆహా, నా భాగ్య మపూర్వము నా గురువు అనిమిషదేవునికి లింగమను గ్రహించిన గురుదేవ బసవ ప్రభునిగాంచు పుణ్యము ఈనాడు నా కబ్బినది కృత, త్రేతా, ద్వాపర యుగములలో ఈ బసవన్న స్కందుడు నీలలోహితుడు వృషభగణనాయకుడై యుండునది తెలిసినది ఈ కలియుగమున ఈ నా కండ్ల తోనే దివ్యతేజో ధర్మమూర్తియైన బసవరాజును జూచుచుంటిని నిన్ను నన్ను కన్నవారిని ఆప భాగ్యమందరికి దొరుకునా? అది కృప కలుగుతె మాత్రము లభించునని తృప్తుడై ప్రభు బసవన్నను ప్రార్థించగా బసవన్న భక్తితో ఇట్లను చున్నాడు

**బసవణ్ణ**

జననంబులేని జనితుడవు నీవు చూడయ్యా! జని యించి సంసారమెరుగని నిర్వికారి నీవు చూడయ్యా! భవ బంధనంబులేని, నిత్యనిజ తత్త్వంబు నీవు చూడయ్యా! మీ పాదసేవ జేసి, నా భవంబు త్రెంచవలె నంచుంటిని గాని మీ మనం బెంతను బెరుగ జూడయ్యా! కూడల సంగమ దేవా! మీరు పొగడ నేను ప్రాప్తుడనె? చెప్పుమా ప్రభురాయా! ౧౧

**వివేచనము**

మీ స్తోత్రానికి నేను తగుదునా స్వామి? నే నెక్కడ మీ రెక్కడ? జనన బాధకు చెందినవాడ నేను జననమే లేక పుట్టిన మహానుభావుడవు నీవు సంసార బంధములో నున్నవాడ నేను దానికి చిక్కని నిర్మోహి నీవు అయ్యా అయ్యా, పొగడుట, నాపై భారముంచుట వద్దువద్దయ్యా! మీ చరణ సేవచే ఈ సంసార బంధాన్ని మోహాన్ని తెంచుకోవలయునను నా కాంక్షను వినుతిచేసి చెరపకండి, యని బసవన్న మరలి దాసోహం భావానికే దిగినాడు ఆయన స్వభావమే అది. సోహం అంటె కొంచము తాకి కిందకు వచ్చుట అక్కడనే యుండు చోటుగాదు అల్లముడు బసవన్న స్వభావ మెరిగినవాడు ఐనా, ఉన్నది లేనట్లు సమయ మొచ్చినప్పుడు చెప్పుట సరిగాదు గాన, వినయముతో బసవన్నని మహిమ స్తోత్రము చేయుచున్నాడు

**అల్లమప్రభు :**

ఆది గురుస్థలము, లింగస్థలము, జంగమస్థలము, ప్రసాది స్థలము, పాదోదక స్థలంబుల ఎవ్వరెరిగి యుండి రయ్యా? ఆదిని చూపెను అనాదిని ఎరిగించి నాదబిందు కళల భేదంబు భేదించి కనబరచె పుట్టినది ముట్టకచూపించె పుట్టక యుండుట ముట్టి చూపించె నా యంతరంగము శుచిజేసి నిజలింగము నిలువజేసెను గుహేశ్వరుని శరణ సంగన బసవణ్ణ నుంచి సకల సమమతంబెరిగితి నయ్యా! ౧౨

**వివేచనము ·**

అదెందుకు, నీకు జననమున్నదంటె నమ్మే వారెవరయ్యా? నిన్ను స్మరించువారికి జననమే లేదను లోకోక్తి కల్లయా? మాయ నీ ఇష్టముతో మెలగు తుంది నీ కిక మాయావృత మోహాదులెక్కడ? చూచితివా, నేనేమొ కానిదానిని చెప్పినట్లు ఆదరిపడుచున్నావు ఉన్నదే నే జెప్పుట మొదలు గురు, లింగ, జంగమ, ప్రసాద, పాదోదక స్థలము లట్టివని తెలిపిన వారెవరు? జీవుల సులభతకు ఆ ఐదు స్థలములు ఉపాసనకు తెచ్చి, అంగి లింగ సామరస్య మెరిగించిన వారెవరయ్యా! మొదటిది చూపితివి (ఇష్టలింగము) అనాదిని తెలిపితివి (ప్రాణలింగము) ఆటు తరువాత నాదబిందు కళల భేదపు ప్రవృత్తి నివృత్తుల మార్గము బోధించితివి ముఖ్యమేమిటిదనిన పుట్టినది - అనిన అది కనబడునది ముట్టి ఇదియని చూప నవసరము లేదు గాన ముట్టి చూపలేదు పుట్టక యుండు సకీలు ఇదో ఇక్కడున్నది చూడని ముట్టి తట్టి చూపితివి బసవా! నా అంతరంగ శుద్ధిచేసి గుహేశ్వర లింగాన్ని స్థిరముగా నెలకొల్పితివి ఇదంతా కాదనుట కెవరికి సాధ్యము? నే నెవరిదో చెప్పలేదు నా స్వానుభావము చెప్పుకొన్నదే స్తోత్రమయినదని అల్లమదేవుడు తన జంగమత్వాన్ని మరచి శిష్యభావంబు వహించి గురుని, గురుస్వామియని విన్నవించి తన సద్భక్తిని వెల్లడించినపుడు బసవరాజు ఇట్లనుచున్నాడు

**బసవణ్ణ**

లింగ జంగమ, జంగమ లింగ మన్నది నాకు చూపిన వారెవరయ్యా! లింగము పూజించిన, భవము

తెగటారు జంగమ ముఖ లింగమై వచ్చి శిక్షించి
రక్షించితివి నాదు ఆది అనాదులు జూపి, ప్రాణలింగ
జంగమ మనుచు నాకు ప్రతిష్ఠించి చూపితిరి గాన, కూడల
సంగమదేవా ! మీ నుంచి నే బ్రతికితిని కనుమా
ప్రభురాయా! ౧౩

**వివేచనము :**

మహాస్వామి, ప్రభుదేవా! నే నెరిగితి నన్నది మీరు చెప్పినదె నా కెక్కడ ఆ భక్తిజ్ఞానాలు? లింగమే జంగమము జంగమమే లింగము అను అవినాభావైక్యత జూపినవారు మీరు ఎంత లింగపూజ జేసిన జన్మనివృత్తి గాదని చెప్పి, మీరె జంగమ ముఖమై వచ్చి బుద్ధిగరిపినారయ్య! అదిగాక ప్రాణలింగమే జంగము దన్న రహస్యాన్ని జెప్పి రక్షించుకొన్నారు గాన నేను బసవడై బతుకుతున్నందుకు మీరె కారణకర్తలు అని బసవన్న ప్రభుదేవులు తమ తమ సంబంధాలు, అంటే అంగ సంసారములో రక్తసంబంధాన్ని బట్టి లౌకికంగా సంబంధ బాంధవ్యాలు, సమీప దూరపు చుట్టరికాలు, కాబోవు కొత్త బంధుత్వాల మాటల లాగె, లింగ సంసారము కట్టుకొన్న శివశరణులు తమ ఆత్మసంబంధాలు గురు లింగ జంగమముల వర్తనలు తప్పొప్పులు అనుష్ఠాన మార్గానుసంధానములు తాము గన్న అనుభవాలు ఇతరులకు పంచుట ఇతరుల అనుభవాలు మననానికి తెచ్చుకొనుటయే యైనది గాన ఈ రీతి అందరు లింగాంగ సామరస్యముతో సంతోషము పొందిరి

—o—

ఇది కృపామూర్తులైన శ్రీ మృత్యుంజయప్ప గారిని, స్వప్నబోధామూర్తులైన శ్రీ ఎర్రి తాతయ్యగారిని స్మరించి సకల శివశరణులను వందించి, శూన్య సంపాదనలోని "బసవేశ్వరుని సంపాదనము"నకు సంగ్రహముగా జెప్పిన వ్యాఖ్యానము సంపూర్ణము-

శ్రీ గురు బసవలింగాయ నమః

# శూన్య సంపాదనము

## చెన్న బసవేశ్వరుని సంపాదనము

౧

కం॥ ఆచార భక్తి ఎఱుకల
సూచకమును ప్రాణలింగ శుభసమరసమున్
గోచరపరచెను ప్రభుడిల
శ్రీచెన్న బసవున కద్ది సెప్పెద పేర్మిన్

అల్లమ ప్రభుదేవుడు, బసవేశ్వరులు తమ తమ పూర్వోత్తరములు లింగ జంగమ సంబంధములు, ఆచరించిన ఆచరణములు, అనుభవములు, ఒకరి కొకరు తమ మనసులు విప్పిచెప్పుచు తెలుసుకొనవలయునను జిజ్ఞాసతో వాద రూపకమగు ప్రశ్నోత్తరాలతో చాలా రమ్యంగా సమరసంగా మాటలాడుకొను చున్నది విని శరణులు ఆనందించినారు చిక్కదణ్ణాయకుడు, చెన్నబసవేశుడు, చక్కని విమర్శకాగ్రేసరుడు బసవన్న ప్రభు ఆడుకొన్న మాటలలో ఎంతటి సామరస్య జ్ఞానమున్నదో చూడవలెనను పరీక్షా ధోరణిలో ఇట్లనుచున్నాడు

**చెన్నబసవయ్య :**

ఒకటొక్కటి సమ్మంధము మరియొక్కటికి
కూడదు పసికందుని కల చెప్పనగునె? చంద్రకాంతపు
శిలయందు రత్నము కంటినన్న అహంకారము సీకెందుకో
శరణా? చేతిగురుతు పోవదు నోటిమాటలకు సాటిలేదు
కూడల చెన్న సంగయ్యనందు బసవడూ, ప్రభువు
ఇద్దరు మరులైరి ౧

మరియు

ఉన్నదన్నది బసవన్న బట్టె లెదన్నది అల్ల
ముడు బట్టె ఎవరినొనందు? ఇంకెవరిని కాదందు? వీరి
ద్దరు ఛలంబునకు సంపన్నులైరి గాని లింగ సంపన్ను
లని కాన; కూడల చెన్న సంగమ దేవా! —౨

**వివేచనము**

అయ్యా: మీరిద్దరు పెద్దవారు మీ వాదము పెద్దదే వాదానికనువైన విషయాలు గొప్పవే అయితే ఒకదాని కొకటి సంబంధమే లేదు ఇదివరకు వినినవారికి కూడా భ్రాంతి జనితముగా నున్నది ఎవరి మాట నిజమొ, మరెవరి మాట అబద్ధమొ ఇద్దరు సత్యశుద్ధ ప్రమాణ పురుషులు కావున నాయట్టి ఎరుక లేనివాడు చెప్పుట కేమి యున్నది స్వామి! మాకేమియు తెలియదన్న కొరత నుంచి ఈ మాట తమకు నివేదించుచున్నాను బసవన్న భక్తి సంపన్నుడు అల్లమ స్వామి! మీరు వైరాగ్య సంపన్నులు, చిన్న శిశువుకు తను రాత్రి గాంచిన కలను చెప్పుటకు ఎట్లు రాదో అట్లే ఐనది మహాస్వామి! ఒక మాట చంద్రకాంత శిలయందు కనబడుతున్న నీటి బిందువును రత్నమనుకొన్నారు ఎందుకు? మీరు పొందిన అనుభవము ఇట్టిదేనా? చేతిలో గురుతు పట్టుకొన్నారు పట్టుకొన్నామని తెలియకనె చర్చించు మీమాటలు సాటిలేనివిగా వున్నవి భ్రమకు కారణమైనవి కోపగించకండి ఒక్కరి మాట మరియొక్కరు ఒప్పుకొనక తర్కించుచున్నారంటె మీమాటలే గెలుపొందాలని తలచినారో యేమో! మీరిద్దరు ఛలానికి సంపన్నులు కాని భక్తి సంపన్నులు కారు అని నిర్దాక్షిణ్యంగా నిశితార్థ భావముల మొనతో గ్రుచ్చి విడంబించిన చెన్న బసవేశ్వరునికని ఇద్దరూ అదరిపడినారు ఆహా, ఎంత మహా జ్ఞాన సంపన్నుడు! వయసు చిన్న దైతేనేమి అభిప్రాయము గొప్పదే గదా అని శివ శరణులు మెచ్చుకొన్నారు సిద్ధరాముడు వెరగు కన్నులతో చెన్న బసవన్నను ఊరకనే చూచుచు నిలువ బడినాడు అప్పుడు అల్లమ ప్రభు దేవుడు చెన్న బసవన్నని నిశిత పరిజ్ఞానమును వివేకించుకొనుచు, బాపురే! ఇట్లుండవలయును అని మందహాసముతో ఇట్లు ఉత్తరమిచ్చుచున్నాడు ఆ ఉత్తరం ఎట్టిదో, అభిప్రాయమేమొ విను కుతూహలంబున భక్తి భండారి బసవన్న ఊరక చూచుచున్నాడు

**అల్లమ ప్రభు :**

అంగ సంసారంబు లింగ సంసార మం దింకి,
నామమను సంబంధ సంశయము వదలి నిస్సందేహియై
యుండె కనుమా బసవేశుడు! ప్రాణ భావమను సందే
హము మొలకెత్తక నిస్సందేహ నిజైక్యమై యుండె
చూడుమా బసవేశుడు! ఆ బసవన్న అంతరంగమందు
నిశ్చింత నివాసియై యుంటి ఆ బసవన్న బహిరంగ
మందు నిరాలంబ జ్ఞానియై యుంటిని నేను బసవని
లోపల నశించి నివసించితి బసవన్న నా యంతరంగ
మందు నిజనివాసియై యుండె ఒకదాని కొకటి విప్పి
వేరుజేయరాదు కనుమా గుహేశ్వరుని శరణ సంగన
బసవ ప్రభువను ద్వైత భావ భ్రాంతి నాశమై మిగిలిన
భ్రాంతి కెడ మిచ్చెనయ్యా చన్న బసవయ్యా! 3

**వివేచనము :**

చెన్నయ్యా! బసవన్నను నన్ను వేరువేరు జేసి చూడకు చూచు కన్నులు రెండైన దృష్టి ఒకటే యైనట్లు మే మిద్దరము ఒకటేనయ్యా! పుట్టుకతో అంగాని కంటుకవచ్చు ఇంద్రియ సంసారమొకటి తరువాత ఆ ఇంద్రియములబట్టివచ్చు లోకసంసారము రెండు సంసారములు బసవన్న లింగసంసారమందు సంశయ సమ్మంధములు లేక మిళితము జేసినాడు అట్టి నిస్సందేహ నిజైక్యుడైన బసవని అంతరంగమందు నేననుట మరచి నివాసియైయుంటి బహిరంగమునందు నిరాలంబియైయుంటి బసవన్న నా యంతరంగములో నిజనివాసియై యుండె గాన బసవప్రభు వను భ్రాంతి విభ్రాంతియైనది రెండనుటయే లేదు ఉన్నదంటె లోకవ్యవహారానికి మాత్రము మాటలు మాటల కర్థములు విభేదమైనవిగా తోచవచ్చునే గాని, ఆ మాటలు ఒక్కవస్తువును గురించియే యున్నవి నీవు చెప్పినట్లు వినువారికి ఔను - కాదను భ్రాంతియగుట నిజమే నీవు కుశలమతివి మమ్మిద్దరికిని కాదని వాదించు మహాజ్ఞానివి వద్దయ్యా చెన్నా! అట్లు వివేచించకు మని అల్లమదేవుడు చెన్నబసవన్నతో వాదించుట సులభము కాదని చెప్పినపుడు చెన్నబసవన్న నవ్వుచు అనుచున్నాడు బసవరాజు శరణ సమూహము వినకుతూహలులైనారు

**చెన్న బసవణ్ణ :**

భక్తజంగమ, సకీలు సంబంధ మెట్లన్నది ఎవ
రెరుగుదురయ్యా! అది ఉపమాతీతము భక్తునియందు
జంగముడుండెనన్న, భక్తుడై క్రియానిష్పత్తి జెంది సమ
రస సుఖియైయుండె జూడుమా జంగముని యందు భక్త
డుండిన కర్తృభృత్య భావంబు లేక సంబంధ సంశ
యము తలపోయక ఎరుకెండి మరపారి స్వతంత్ర శివా
చారియై యుండవలె జూడుమా! ఈ ఉభయ భావంపు చేరిక
పరిణామంబుగని, కూడల చన్న సంగయ్యయందు, బసవ
ప్రభుదేవుని శ్రీపాదమునకు నమో నమో యనుచు బతికి
తినయ్యా! ౪

**వివేచనము :**

జంగమస్వామీ! మీరు వివరించిన భక్తజంగమ సంబంధమెవరెరుగుదురు? ఆ సంబంధమే దానికి ఉదాహరణీయము గాదు బసవణ్ణగారి నెరుగుట, అతని దాసోహంభక్తిని నిర్ణయించుట తరముగాదు తమ మహాజంగమ తత్త్వార్థము తెరుగుట, వైరాగ్య వైశాల్యము నందుకొనుట అసాధ్యము ఇట్టి చిదానందైక్య భక్తి జ్ఞానముల విధాన - పరిణామములు కనుగొనుట సామాన్యముగాదు జ్ఞాన క్రియలు ఆకారము దాల్చిన భక్తజంగమ మొదురు అపుడు రెండుగా కనబడి ననూ తమరు సెలవిచ్చినట్లు ఒకటే యగును జ్ఞానములో క్రియ జేరిన కార్య రంగమేర్పడును ఆ క్రియలో జ్ఞానము జేరిన నిష్క్రియయౌను ఇట్టి అవినా భావసంబంధముగల బసవన్న మీయొక్క సామరస్యముగని నేను శరణందును

ఇట్లు చెన్నబసవేశుడు నుడువగా అతని మహాజ్ఞానమున కానందించి అల్లముడు బసవన్నను గురించి విశేషంగా తెలియవలెనను కుతూహలముతో ఇటులనుచున్నాడు

**అల్లమప్రభు**

ఆదిని జూపితివి అనాదిని తెలిపితివి ఇహము చెడిపి
తివి పరము నిలిపితివి కాయప్రసాదము, భావప్రసాదము

జ్ఞాన ప్రసాదంబు లేకముగా చూపితివి పరము చేకూర్చి పరిణామ మందుంచితివి గుహేశ్వరుని శరణ బసవన్నని పూర్వా పరంబులు జెప్పి నన్నుంచుకోవయ్యా చెన్న బసవయ్యా! ౫

**వివేచనము :**

చెన్నబసవేశా! నీవు ప్రాజ్ఞుడవు అగతానాగత వేదివి నిర్భయ వివేచనా శీలుడవు పిన్నతనమనునది అంగంబునకు, జ్ఞానంబునకు కాదు ఆది అనాదుల మర్మము, ఇహపరముల భిన్నాభిన్నములు, కాయ, భావ, జ్ఞాన ప్రసాద సమ్మిలనములోని అంతరార్థములు తెలిపితి వప్పా! ఇంకొకటి, బసవన్న మూలము తెలుపుము నన్ను నీవానిగా జేసుకొనుము అని అల్లమస్వామి వినయంబున అడిగినప్పడు చెన్నబసవయ్య ఆనందపరవశుడై సుజ్ఞాన తేజోవిలాసుడై ఇట్లు చెప్పుచున్నాడు

**చెన్నబసవణ్ణ**

ఏదేదీ లేనియపుడు నందివాహనుడుండ లేనపుడు, వెనుక పదునాల్గు భువనంబులు లేనియపుడు, అపుడెవరూ లింగము కన్నవారు లేరు అందు లింగముకని, చెప్పిన అతడె అద్వైతియందు అందు కూడల సంగయ్యా నందు బసవన్న ఒక్కడే ఉదయమైయుండె చూడా ప్రభుదేవా! ౬

మరియు

కృతయుగంబునందు దేవుడు దేవాసురుని చంపునపుడు ప్రమథుడను గణేశ్వరుడై యుండెను గజాసురుని చర్మంబు ఒప్పి శివుడు కప్పుకొనునప్పుడు ఉగ్రుడను గణేశ్వరుడై యుండెను అసురుల శిరోమాల కంఠంబునందు ఉరంబునందు హారంబుగా ధరియించి జగంబునకు భయంకరుడై యుండినపుడు శంకలేని నిశ్శంకుడను గణేశ్వరుడై యుండెను సమస్త దేవతలకు కరుణామృతంబు గురియించి సుఖమిచ్చి రక్షించునపుడు

శంకరుడను గణేశ్వరుడై యుండెను జాలంధరుడను అసురుని సంహరించినపుడు జాణుకు జాణయై విచిత్రుడను గణేశ్వరుడై యుండెను

త్రేతాయుగంబునందు కాళాంధరంబులో శివుడు నిజమందిరమై యున్నపుడు కాలారుద్రుడను గణేశ్వరుడై యుండెను పీతాసురుడను దైత్యుని చంపి జగము రక్షించునపుడు మాతాపితుడను గణేశ్వరుడై యుండెను తాళాసురుడను దైత్యుని వధించి జగము రక్షించి సృష్టిని కల్పించి బ్రహ్మాండ భారంబు ధరించునపుడు తాళ సమ్మెళనమను గణేశ్వరుడై యుండెను జలప్రళయంబున జగన్నాథుడు చావకున్నప్పుడు జననమరణ వర్జితుడను గణేశ్వరుడై యుండెను జగమంతా శూన్యమనిన నేనె సృష్టించితినని ఆది గణనాథుడను గణేశ్వరుడై యుండెను సురాసురులు అహంకారంబునందు హెచ్చి మేరపట్టినపుడు గిత్తయై పోరాడి అందరిని చీల్చి చొక్కి మూలకొత్తి అధిగమించి నంది మహాకాయుడను గణేశ్వరుడై యుండెను అగ్గికన్ను తెరచిన మండిపోవు లోకంబు ననుచు జగంబు వెనుక వుంచి వంద్యుడను గణేశ్వరుడై యుండెను ఉమాదేవి కల్యాణమందు, కాలలోచనుడను గణేశ్వరుడై యుండెను అంధకాసురుని వధించునపుడు నీలలోహితుండను గణేశ్వరుడై యుండెను త్రిపుర దహనంబు చేయునపుడు స్కందుడను గణేశ్వరుడై యుండెను బ్రహ్మ కపాల విష్ణు కంకాళము పట్టునపుడు నీలకంఠుండను గణేశ్వరుడై యుండెను

ద్వాపరంబునందు లింగప్రాణ సంగియై వృషభుడను గణేశ్వరుడై యుండెను ఇటుల నాల్గుయుగముల పదునెనిమిది యుగంబులు చచ్చి పుట్టునపుడు నందికేశ్వరుడను గణేశ్వరుడై యుండెనయ్యా!

కలియుగంబు నందు గురులింగ జంగమ పాదోదక ప్రసాదముల పూర్వాశ్రయములు తొలిగించి

లింగమై కుల స్థలంబు లెరిగిన మహాంత కూడల చెన్న
సంగుని మహా మందిరమందు సర్వాచార సంపన్న బస
వన్న యను గణేశ్వరుడై యుండె వినుమా ప్రభు
దేవర దేవ! ౭

**వివేచనము :**

ఏమీ ఏమియు లేనపుడ -అనిన కనబడు సృష్టియు, చూచే దృష్టియు లేనప్పుడు నందియు లేదు, నంది వాహక శివుడు లేడు భువనాలు లేవు, భవనాలు లేవు పదునాల్గు లోకాలుండలేదు ఈ నిశ్శూన్య స్థితియందు ఉన్నదేదో లేనిదేదో చెప్పగల వారెవ్వరు? అపుడుండె అద్వైతి బసవ దేవుడు ఇది లింగమని కను గొని చెప్పె మొదటికి మొదటున్న బసవన్న ప్రభు దేవయ్యా!

ఆటు తరువాత జగంబయ్యె యుగంబులయ్యె కాలమానంబులయ్యె కర్మ నిర్మాణమయ్యె సకల చరాచర జీవకోటియయ్యె ఈశ్వరుని లోక లీలా వినోదంబునకు కావలిసిన దంతయునయ్యె యుగ ప్రమాణంబుల ఆధారము గొని నడచుచు వచ్చిన ఆయా కాల సన్నివేశాల ననుసరించి శిక్ష రక్ష విధానములకై కృతయుగంబున ప్రమథ, ఉగ్ర, నిశ్శంక, శంకర, విచిత్రి గణేశ్వరుడై యుండెను

రెండవ త్రేతాయుగమందు కాలాగ్ని, మాతాపిత, తాళసమ్మేళ, జనన మరణ వర్జిత, ఆదిగణనాథ నంది మహాకాళ, వంద్య, కాలలోచన నీలలోహిత, స్కంద, నీలకంఠ గణేశ్వరుడై యుండెను

మూడవ ద్వాపరయుగంబునందు వృషభ, నందికేశ్వర గణేశుడై యుండెను (నాల్గుయుగంబులు పదునెనిమిది సార్లుచుట్టి చుట్టి పుట్టు నందకేశ్వరుడై యుండెను)

నాల్గవ కలియుగంబునందు, బసవన్న యను గణేశ్వరుడై యుండెను ఇటుల మొదటి యుగమందు ఐదు రెండవయుగంబునందు పదునొకండు, మూడవ యుగంబున రెండు, నాల్గవ యుగంబున ఒకటి, పందొమ్మిదిసార్లు గణా ధీశుడై అవతరించి ధర్మోద్ధరణకార్యమూర్తియై రక్షించెనని చన్న బసవన్న

సవివరంగా అల్లమ దేవునకు బసవన్నని పూర్వాపరంబుల విన్నవించగా అల్లమ స్వామి వెరగంది చెన్న బసవన్నని కొనియాడుచు ఇట్లనుచున్నాడు

**అల్లమ ప్రభు :**

ఆనాటి మాట కానాటికి జ్ఞాపకముండదు ఏనాటిదో గడచి పోయిన యుగ ప్రళయంబు లెరిగిన వారెవరయ్యా? ముందు వచ్చెడి యుగ ప్రళయంబులు తెలిసిన వారెవరయ్యా? బసవడు ఆదియందు లింగ శరణుల కను భేదంబు జూచి ఎరిగిన వారెవరయ్యా? లింగ జంగమ ప్రసాద మహిమకు బసవడె ఆదియైన దెరిగెన స్వయంభూజ్ఞాని గుహేశ్వర లింగమందు చెన్న బసవ డొక్కడే ౮

**వివేచనము :**

ఆహా! కాలమానముల కతీతమైన యుగయుగాల సృష్టి ప్రళయాల సంగతులు నిర్ధరించి చూచినది చూచినట్లు చెప్పుట కెవరికి సాధ్యము? బయలు కన్నా ఘనమైన మహా జ్ఞానము కల చెన్న బసవన్నకు మాత్రము సాధ్యము ఆ మహానీయుని వల్ల బసవేశుని గణావతారములు, అతని లోక కార్యనిర్వహణలు విని కృతార్థుడనైతినని అల్లముడు సంతోషచిత్తుడై ఇప్పుడు ప్రత్యక్షముగా నున్న బసవన్నని నిత్యాచార క్రమంబు తెలియవలయునని చెన్న బసవన్నని అడుగగా ఆయన ఇట్లనుచున్నాడు

**చెన్నబసవణ్ణ :**

ఆచారంబు అంగసంబంధమైనపుడు శ్రీగురు సన్నిహితము ఎరుగుమనంబు లింగ సంబంధమైనపుడు శివలింగ సన్నిహితము ఈ ఉభయ సన్నిహితమై యుండు జంగమ సన్నిహితము ఇది కారణంబు కూడల చెన్నసంగా, మీయందు త్రివిధ సంపన్న శరణుడు సంగన బసవడు ౯

**వివేచనము**

షట్స్థల భక్తి అంగసంబంధమై అది నిత్యనడతయందు చరించుచుండగా సద్గురుని కూడి యుండును జ్ఞానము మనంబు వ్యాపించి లింగసంబంధమైనపుడు సర్వమంగళదాయక శివలింగమై వెలయును ఈ ఉభయము సమన్వయమైనపుడు జంగమ సన్నిహితము అల్లమదేవా! బసవదేవుడు ఇటుల మీయందు త్రివిధ సంపన్నాచరణుడై యున్నాడు అని నుడివిన చెన్నబసవణ్ణకు దాసోహంబున నీవు జెప్పిన రీతి బసవన్న నడచుకొనుటెట్లని అల్లమయ్య విమర్శగా అడుగుచున్నాడు

**అల్లమప్రభు :**

లింగమే అంగమై, అంగవిరహితుడన్న ఫలమేమయ్యా? జంగమునందు సన్నిహితమై దాసోహంబుజేసి ఫలమేమయ్యా? నీవు నేనను భావమున్నంత వరకు జంగము నందు సమయాచారియై యుండునంత వరకు, భక్తికి భిన్నము గుహేశ్వర లింగమందు సంగన బసవన్నకు ఆచరణ తెలియదు చూడుమా చెన్న బసవన్నా! ౧౦

**వివేచనము -**

చెన్నయ్యా, బసవేశ్వరుని గురించి నీవు వివరించిన విధానమేమో గమనార్హమే గాని లింగము అంగమై అంగిభావము లేదన్నా, జంగమమునందు చేరి దాసోహము చేయుటన్న ఫలమేమి? దాని పరిణామమేమి? చేయుట, చేయించుట, భిన్నత, నేను నీవను భావము భక్తికి సమకూరుటెట్లు? అభిన్నత జ్ఞానమేగాని ఆచారముగాదు సంగన బసవన్నకు నిజాచరణ తెలియదని అల్లముడు కొంచము నిర్దాక్షిణ్యంగా పలికిన చెన్నబసవేశుడు బసవేశుని శరణతత్వ దర్శనము గురించి విస్తారంగా ఈ రీతి పలుకుచున్నాడు

**చెన్నబసవణ్ణ**

సంగసహితుండైనా సంగి గాడు, శరణుండు సంగసూతకి గాదు లింగ పరిచితుని సంగవంతుం

దనకయ్యా! శరణుడు మనసొచ్చినట్లు మెలగగలడు
వెదకి సకలాచార్యుడౌను ఔను కాదనునది లేదు
చూడయ్యా, కూడల చెన్నసంగా! మీ శరణ బసవన్న
సంగి గాదు నిస్సంగి గాదు ౧౧

మరియు

నే నన్నది లేదయ్యా! లింగమను మహాంతుడు
చావడు బతుకడు చూడా! మెరుపు గుచ్ఛంబు లట్లు
వెనుక రూపమై గోచరించుమందును శరణుడు కాయంబు
గొన్న సామాన్యుడె? ప్రకృతి గుణ భిన్న భావి గాడు
కూడల చెన్నసంగా! మీ శరణుడు బసవన్న రీతి వేరు ౧౨

మరియు

అనాయాసంబున ఇల్లు గట్టి సునాయాసంబున
పరమ సుఖి రూపించుటందు రూపాధికుడు చూచుటందు
చూపు ఘనము ఇట్టి సహజ సంగుని విధానంపు తెరగు,
నీటియందున్న బిందు ఉదయరత్నంబు గాంచురీతి కూడల
చన్నసంగా! మీ శరణుని విధము వేరు ౧౩

మరియు

శరణుడు దృష్టాదృష్టం బెరుగడు సావయ నిర
వయ మేమని వివరించి పలుకడు తాను స్వతంత్రు
డైనందున భావరహితుడు వికృత వేషంబున సుకృతంబు
చేకొనడు ప్రకృతి గుణము పొంది మూర్తియైన ఉపజీవి
గాడు కూడల చెన్నసంగా! మీ శరణుడు సాకార
సనుమతుడు ౧౪

మరియు

దేహి గాదు, నిర్దేహి గాదు క్రోధకుడు గాదు,
నిర్క్రోధకుడు గాదు కామి గాడు, నిష్కామి గాడు ఆస
బట్టి వచ్చిన అనిమిషుండు గాడు అవగుణము లేని
నిర్గుణి జూడయ్యా! కూడల చెన్నసంగా, మీ శరణుండు
కనుమా! ౧౫

మరియు

మూర్తియును గాడు అమూర్తియును గాడు
లింగమందు ప్రాణ సంచితము ప్రాణమందు ప్రసాద
సంవరణము ప్రసాదమందు కాయాశ్రితుడు లో-
లౌకిక ప్రకాశోదయుండు గాడు కూడల చెన్నసంగా,
మీ శరణుండు ౧౬

మరియు

శరణుండు దృష్టాదృష్టము కనుమయ్యా! ముట్టక
ముట్టును చూడయ్యా! ఐన దానికైనది వినవయ్యా!
భేదమునకు భేదము జూడయ్యా! ఎరుకకు ఎఱుక
చూడయ్యా! లింగమందు ఎడబాటు లేని బిందుపు కూడల
చెన్నసంగా మీయందు ఒపవన్న కనుమా ౧౭

మరియు

సకల నిష్కలుడయ్యా! నిష్కల సకలుడయ్యా!
సకలుడై సంసారి గాడు, నిష్కళుడై విరాగి గాడు
సంసారి గాని సంగము వైరాగ్యంబు గాని నిస్సంగము
ఉభయ సంగమము నుంచి మహాత్ముడై యుండె గాక
'స్థావరం జంగమశ్చైవ ద్వివిధం లింగముచ్యతే' అన్నది
గాన కూడల చెన్నసంగడు ఎటులున్న నటులుండెగాక
మీ శరణుండు క్షీణుండు గాడు ౧౮

**వివేచనము .**

లింగవంతుల షట్ స్థల సిద్ధాంతములతో శరణ స్థలము ప్రాముఖ్యమైనది అది భక్తి స్థలమునుంచి మాహేశ్వర స్థలాన్ని అందుకొని తరువాత ప్రసాద స్థలమై దాని మీద ప్రాణలింగ స్థలమై విస్తరించి శరణ స్థలంగా స్థిరముగొని ఐక్య స్థలముగా పరివర్తించుచున్నది ఆరు మతముల వారు జీవైక్యమే కొనయని నిర్ణయించినట్లు లింగవంతులు కూడ ఐక్యాన్ని అంగీకరించినా అది వారికి ముక్తాయముగాదు. ప్రవృత్తి నివృత్తుల అనుసంధానములో వీరశైవులు మాధ్యమాన్ని అంగీకరించినట్లు వ్యక్తమౌచున్నది గాన,ముక్తియను

గది అంతగా అపేక్షణీయమైనదిగాక ఆ స్థంము ఎప్పుడు ఉండదగినది గాక శరణస్థలమె సర్వవిధమున జీవజాగ్రతలో నుండు విధానము ఐక్యమటుగాదు అది జీవసమాధి నిష్క్రియ ఈ నిష్క్రియ వీరశైవానికి నిషేధముగాదు అదొక విశ్రాంతి, అంటె క్రియావిశ్రాంతి స్థానముగా ఎంచుకొన్నారు సంగీత జ్ఞుడు పై షడ్జాన్ని తాకి కింది షడ్జానికి దిగడమేగాని అక్కడే స్థాయిగా నిలువడు ఆయన నిర్దాణము క్రింద శ్రుతిషడ్జమే దానిని భక్తిగా ఉంచుకొన్న లింగ వంతుడు పై ఐక్యాన్ని సంగీతజ్ఞునివలె భావించుతాడు గాన ఐక్యస్థానము క్రింద నుండు 5 (౫) వ స్థానము శరణ స్థానమే అగ్రగణ్యమని ఆ శరణశిరోమణి బసవన్నను గూర్చి చెన్నబసవన్న విస్తారముగా ప్రభుదేవునకు వివరించు చున్నాడు

శరణుడు సంగసహితుడని ఆక్షేపణ చేయరాదు ఆ సంగము లౌకి కుల వ్యావహారిక దోష సంగముగాదు ఎందుకనిన, శరణుడు సంగసూతకి గాడు కాక లింగధారిని సంగవంతుడని అనరాదు శరణుడు తన మనసుకొచ్చి నట్లు చరించును వెదకి వెదకి సకలాగమాచార్యుడునూ ఔను ఔను కాదనునది ఉండదు మీ శరణబసవన్నుడు సంగిగాదు, నిస్సంగి గాదు

నేననుట లేదయ్యా,లింగవంతుడగు మహాంతునకు. ఎందుకంటె, ఆ మహా నీయుడు పుట్టడు గిట్టడు రెండునులేని సృష్టి స్థితి లయాలకు అవతలుండువాడు మెరుపు మెరసినట్లు రూపంబులై కనబడుచుండును శరణుడు లోకమువలె కాయము ధరించిన సామాన్యుడని ఎంచకుమయ్యా! లోకప్రకృతికి విభిన్నుడు గాదు-విరోధిగాదు మీ శరణ బసవన్నుని రీతియే వేరు అల్లమయ్యా!

శరణుని నడతలే చోద్యములు అయినను అంతే సహజములు ఏ ప్రయత్నములు లేక అనాయాసముగా జీవమను ఇల్లుగట్టి, దానియందు నిరాయా సంబున పరమ సుఖముగా నుండును రూపుధరించుటందు అధికాధికుండు చూచుటందు చూపులు ఘనంబులు ఇట్టి సహజ స్నేహమయుని విధము ఇట్టిదని చెప్పరాదు ఉదయమందు ఉదకమందు సూర్యకిరణంబు తాకినపుడు ఆ నీటి బిందువు రత్నసంచయముగ కనబడునట్లు - అయ్యా, మీశరణుని పద్ధతి వేరు

శరణుండు దృశ్యమని అదృశ్యమని భావించడు ఇది అవయవమని,ఇది నిరవయవమని ఎంచడు అతనికి రెండూ ఒకటె భావార్థమేమిటనిన దృశ్యమూ అతడే, అదృశ్యమూ అతడే ఆకారము అతడే, నిరాకారము అతడే ఎందుకనిన, తానే స్వతంత్రుడుగాన భావరహితుడు లోకముపలెగాక వికృత వేషంబులనుంచి వంచనల సుకృతంబు సంపాదన చేయజాలడు మరియు ప్రకృతి గుణంబుల నుంచి మూర్తియై ఉపజీవనము సేయువాడు కాదు మీ శరణుండు సారసంగ్రహుడయ్యా!

మరియొకటి మనవి జేసెద అల్లమస్వామి! ఆలకించండి దేహిగాదు. నిర్దేహిగాదు అనిన దేహమున్నదని ఎంచుటకు రాదు లేదని భావించుటకు రాదు ఎందుకనిన, ఉన్నదనిన లేనిదిగా మారును లేదనిన ఉన్నదని చూపును అట్లనే ఆ శరణుండు ఎవరికి బోధించు గురువు గాదు కాదంటె నిర్బోధకుడు కాదు. అనిన బోధలు చేయక ఊరకుండు వాడును కాదు చెప్పుట కేమున్నది? ఆ మహిముడు కామి గాడు, నిష్కామి గాడు అది కావలెనని ఆశలతో వచ్చిన అనిమిషుడు కాదు (ఆశతో వచ్చిన అనిమిషుండు గాదు. అని చెప్పిన విషయ మేమిటంటె, దాహమైనప్పుడు తన చరలింగము తనతోబాటు లేనప్పుడు ఆ లింగ దర్శనము నుంచి దాహ బాధను నివారించుకొనుటకు ఆశతో చూచుచుండెనన్న చాళుక్య వృషసేనుని కథ ఈ సమయమందు స్మరించవచ్చు)

గుణములే లేని (గుణావగుణ) నిర్గుణియయ్యా నీ శరణుండు ఒకచోట నుండు మూర్త స్వరూపుడు గాడు అమూర్త స్వరూపుడును గాడు లింగమందు ప్రాణ సంచితము ప్రాణమందు ప్రసాద సంచితము రెండూ సమ్మిశ్రములు. సమానములు. ఒకదాని నుంచి ఇంకొకటి పూర్ణమగును ఇదిగాక ప్రసాదమునకు కాయాశ్రితుడు లోక లౌకికముల ప్రకారములకు చెందినవాడు గాదు మీ శరణుడు

అయ్యా! ప్రభుస్వామి! ఆలకించుచున్నారు కదా? శరణుడు కనునది కాననిది రెండు తానే జూడు. ముట్టక ముట్టును జూడు ఐనదానికి మూలమైనది భేదానికి భేదమైనది ఎరుకకు ఎరుకయైనది లింగంబునందు విడదీయరాని బిందువు నీయందు శరణ బసవన్నుండు

కనబడును కానరాక యుండును కానక కనబడును సకలుడైన సంసారి గాదు కాసకున్నను విరాగి కాదు సంసారి గాని సంగము విరాగి గాని నిస్సంగము ఉభయ సంగంబు నుంచి మహాత్ముడై యుండెగాన "స్థావరం జంగమశ్చైవ ద్వివిధం లింగముచ్యతే" అన్నది గాన కూడల చెన్నసంగుడు ఎట్లున్న అట్లే యుండును అల్లమదేవా! నీ శరణుండు సంకోచిగాదు క్షీణుండు గాడు

అమోఘమైన శరణ తత్వ దర్శనాన్ని చెన్నబసవయ్య అల్లమయ్యకు వివరించిన, అది బసవన్నయే యని చూపిన, అల్లముడు ప్రసన్నచిత్తుడై బసవన్నను గురించి తానెరుగవలసిన సంగతులన్నియు ఎరిగి ధన్యతజెంది చెన్నబసవన్న వివేక జ్ఞాన సందోహములకు మెచ్చి ఇట్లు కొనియాడుచున్నాడు

**అల్లమ ప్రభు**

అంగమను సంసారమందు సమసిన వారందరు
శివుని తెలియుదురె? మనమను సంకల్ప ప్రపాతంబులో
బడిన వారందరు మాయయను దావాగ్నిని దాట గలరె?
గుహేశ్వర లింగమందు సర్వసందేహములు సమయించిన
చెన్నబసవన్నకు నమో నమో యందును ౧౯

**వివేచనము :**

బాగు బాగు శరణ తత్వార్థాన్ని విశదీకరించి, బసవేశుని సహజ స్థితిని తెలియునట్లు జేసితివయ్యా చెన్నయ్యా! ఇదంత ఎవరెరుగుదురు? దేహేంద్రియ, చిత్తచాంచల్య, మాయా సంసారములో మునిగి, దిక్కులేక లోకము భ్రాంతిలో చుట్టుచున్నది నీ మహాజ్ఞానాని కందని విషయమే లేదు సర్వసందేహ వివర్జితుడైన నీ పాదారవిందములకు తలవాల్చి నమో నమో యందును అని అల్లమ దేవుడు కొనియాడినపు చెన్నబసవన్న మీ యనుగ్రహము నుంచి సంసార బంధము మాయమయ్యెనని స్తోత్రము చేయగా అల్లముడు సర్వసంగ విరాగి చెన్నబసవన్న కెక్కడి సంసారము? అతడు నిస్సంసారి యని మరి మరి కొనియాడుచుండ, చెన్నబసవన్న అల్లముని నుతిని నిలిపి ఎవరు ఎవరని కొనియాడగలరు? మేమిద్దరము ఒకచేయను శిష్యబాంధవ్యమెత్తి ఇట్లనుచున్నాడు.

చెన్న బసవన్న :

కాయమొకటి ప్రాణమొకటి భావమొకటి నిర్భావ
మొకటి ఒకటి గాక రెండున్నవే? గురువొకటి లింగ
మొకటి ఉపదేశ మొకటి కూడల చెన్న సంగయ్య శరణ
బసవని గరిడి యందు ఇద్దరికీ ఒకే అభ్యాసంబు కనుమా
ప్రభుదేవా! ౨౦

వివేచనము .

అయ్యా అయ్యా, అల్లమయ్యా! మేమిద్దరమూ ఒకటే గురుని శిష్యులము ఆ గురువు బసవేశ్వరుడు మనిద్దరు సాముజేసిన గరిడి ఇల్లు ఒక్కటె యని అన్నప్పుడు అల్లముడు ఔనా, అదెట్లు చెప్పవయ్యా చెన్నయ్యా? యని ప్రభువు ఇట్లడుగుచున్నాడు

అల్లమ ప్రభు :

ఒకటి చేయబోయిన మరియొక్కటయ్యెనను
మాట దిటమయ్యె జూడా! మీ చెలిమి యను భావంబున
గురు ముఖంబు సాధ్యమయ్యెనయ్యా! గుహేశ్వర లింగ
మందు నాకు నీకు ఉపదేశంబు ఒకటైన భేదంబు
చెప్పుమా చెన్న బసవన్న! ౨౧

వివేచనము .

ఓహో, ఇది విశేషము నేనేమి అడిగిన దానికి అడుగనిది ఎదురయ్యె అది మనకు ఒకటే గురు ముఖారవిందము. ఇది ఎంత వింత! ఎంతటి భాగ్యము చెన్న బసవయ్యా! నీ జ్ఞాన భాండారమున ఎన్నెన్ని విశేషములున్నవో తెలియరాదు చెప్పవయ్యా నీ కథయని అల్లముడు కుతూహలావిష్టుడై అడిగినపుడు చెన్న బసవన్న అతని పూర్వాపరము అంగ సంసార విరహ సంతప్తతలో మునిగి కొనకు తన ప్రాణ త్యాగము చేయ బోయినపుడు గురు సందర్శన భాగ్యమబ్బిన విషయములు వివరంగా చెప్పుచు ముందు విషయము ఇట్లను చున్నాడు

**చెన్న బసవన్న :**

అనిమిషయ్యకు లింగమిచ్చినతడు బసవడు ఆ లింగము నీకు చేరినది గాన బసవని సంప్రదాయపు శిశువు నీవు జూడుమా! భక్తి భరమందు చెన్న సంగమ నాథుడను లింగంబు సంగ్రహించితి గాన బసవని సంప్రదాయపు కుదురుండ జూడుమా! నేను ఇట్లిద్దరికి ఒక్క మూలస్థలమైన కారణమున కూడల చెన్న సంగు నందు బసవని మహామందిరము నందు ప్రసాదంబు ఇద్ద రికి ఒకటె చూడుమా ప్రభుదేవా! ౨౨

**వివేచనము**

అల్లమదేవా! ఒక గురువు, ఒక దీక్ష, ఒక సాధన, ఒక సంప్రదాయానికి చెందిన వారము మేము అనిమిషయ్యకు పూర్వము లింగమిచ్చినాతడు బస వేశుడు ఆ లింగము నీ కరస్థల మలంకరించినది నా చెన్న సంగమ నాథుని ఉపాయాంతరమున బసవన్న కృపచే పొందితిని మేమిద్దరము ఒక్కసంప్రదాయ మునకు చెందినవారము నీవు నా యన్న. నేను నీ తమ్ముడను మా ఇద్దరికి ప్రసాద మొకటే అల్లమయ్యా యని మృదంగతారుడై కామిత అంగ సౌఖ్యము నుంచి లింగసౌఖ్యము చెందినంతవరకు విస్పష్ట విస్తరిత అల్లముని వృత్తాం తము అద్దము ముందుంచి చూచుకొమ్మని తన ప్రసంగము నంతయు అల్లము నికి చూపించిన చెన్నయ్యకు ఆనందభరితుడై అల్లముడు ఇట్లనుచున్నాడు

**అల్లమప్రభు :**

పిన్నవారైననేమి? పెద్దవారైననేమి? తెలివికి చిన్న పెద్దగలదే? ఆది అనాదులు లేకమున్న అజాండ బ్రహ్మాండ కోటు లుదయము కాకమున్న గుహేశ్వర లింగమందు నీవొక్కడవే మహాజ్ఞాని యన్నది కానవచ్చి నది జూడుమా చెన్నబసవన్నా! ౨౩

వివేచనము

వయసు చిన్నదైతేనేమి పెద్దదైతే నేమి అది జ్ఞానమునుంచి లోకంబునకు నిర్ణయమగును చెన్నబసవయ్యా! మొదలు ఏమేమియు లేనపుడు నీ వుంటి వనియు ఇప్పుడు నీవు చెప్పగా మహాజ్ఞాని యని విశదమైనది నీవు అద్వితీయ పురుషుడవు అని అల్లముడు తనకన్న వయసున చిన్నయైన చెన్నబసవన్నని మహాజ్ఞానియని కొనియాడిన దీనికంతయు మూలము బసవేశుడని అతని సంగ సుఖమును కొనియాడుచు చెన్నుడు ఇట్లనుచున్నాడు

చెన్నబసవణ్ణ

సమసుఖ సంధానములేని సంగంబు జూడా! నేను
తానను నిరోధములేని సంగముజూడా! ఎవరి కనుభావంబు
లేని సంగముజూడా! కూడలి చన్నసంగయ్య యందు
లింగలీనమైన సంగము జూడా! ౨౪

వివేచనము

ప్రభుస్వామి! తమ ప్రశంసకు నేనర్హుడకాను సుఖమనునది సమరస మనునది భావవిభావ సంగములు లేకనే స్వలీలానందముతో నున్న బసవేశుడు నీవు నేనను అహంకార నిరహంకారముల విరోధ నిరోధములు లేని సహజ సంగుడు బసవేశుడు ఎట్టి వారినుంచియు ఏదియు బడయక భావానుభావ విభేదంబు లేని నిర్భావసంగసుఖి బసవేశుడు. లింగలీయుడాతడు అతని కరుణ ప్రసాద మున ఎరుగరానిదేదియు లేదని స్తోత్రము జేసినపుడు అదివరకు వారి వాదోప వాదాలు వినుచు హర్షచిత్తుడైన బసవన్న తన ప్రశంస విని ఇట్లనుచున్నాడు

బసవన్న

అయ్యా, మీ శరణులు నన్ను పావనమ్ముజేసి, [illegible]
గించి తమ యట్లు నన్ను జేసినవెనుక నన్ను ఉద్ధారుంచిన
ట్లుంటినయ్యా! నేనొక్కడు మీ శరణుల [illegible]గ్గరివాడనుద్ధ
కూడల సంగుని శరణులు మెచ్చి నన్ను [illegible]లచిరి నేను
బదికితి! గాన సమరస సంగమునకు సరియా చెప్పుమా
చెన్నబసవన్న?

వివేచనము

చెన్న బసవరాజా! నను గూర్చి స్తోత్రముఖంగా వివరించిన విషయము అమోఘము అది నీ మహాజ్ఞాన పరిమితికి అందినదే గాని దానికి నేనర్హుడ గాను నీ శరణులు పావనముజేసి తెలిపి తమరీతిగా నన్ను ఆదుకొని ఉద్ధరించిరి నేనొకడ ఆ శరణుల పాదారవిందముల సన్నిధిలో కూర్చున్నబంటు నీవు జెప్పిన సమరస సంగమునకు నేను అర్హుడను కాదయ్యా అని వినయాతి విన యంబున నుడివినప్పుడు ఆహా, మహాజ్ఞానంబు సాధించవచ్చుగాని బసవరాజు వంటి దాసోహం భావంబును పెరవారికి సాధించుటగునే! అది బసవన్నకే తగు నని చిక్కదణ్ణాయకుడు వినమ్రతతో ఇట్లు విన్నవించుకొనుచున్నాడు

చెన్న బసవణ్ణ :

భూమి ఆకాశంబులు లేనినాడు అనల పవనజల కూర్మంబులు లేనినాడు, చంద్రసూర్యుల వెలుగు లేని నాడు ఆత్మస్థలము అనుభావంబునకు రానినాడు, నిత్య నిజలింగము నెరిగిన వారెవరయ్యా మీరుగాక? మహా ఘనంబునకు ఘనంబై అగమ్యస్థలమందు నిలచి భరించు వాడై యుండు వారెవరయ్యా మీరుగాక? మీ కొనకు మిగిలిన శేషప్రసాదపు కారుణ్యము శిశువై ఒడలందున్న ప్పుడు విభూతి పట్టంబుగట్టి హస్తమస్తక సంయోగంబు జేసి నన్నుద్ధరించిన వారెవరయ్యా మీరుగాక? కూడల చెన్న సంగమదేవుని సాక్షిగా నేను మీ కారుణ్యపు కుమా రుండనునది మూడు లోకంబు లెరుగును కనుమా సంగన బసవణ్ణా! —౨౬—

వివేచనము :

మహాప్రధాని బసవ రాజేంద్రా! ఏమియూ తెలియని రీతి తమరు శెలవిచ్చిన నేనేమందును అనాదినుంచి అట్టిట్టు ఏమియు లేకున్నప్పుడు ఇంకనూ ఆత్మస్థలము అనుభావానికి రాకున్నప్పుడు ఇది లింగమని చెప్పినవాడు నీవు బసవన్నా ఘనమునకు ఘనమై అగమ్యమందు నిలిచి సర్వ భరితమైన మహాత్ముడు నీవు

బసవన్నా నీ శివప్రసాద కారుణ్యపు కుమారుడనై తల్లిగర్భంబున నున్నప్పుడు విభూతి పట్టంబుగట్టి హస్తమస్తక సంయోగంబుజేసి నీవుగదా నన్నుద్ధరించితివి బసవన్నా ఇది రహస్యమేమియు కాదు. మూడులోకంబు లెరుగు అని తన నుద్ధరించిన బసవన్నను హృదయమలర చెన్నబసవేశుడు కొనియాడుచుండ అల్లమ ప్రభుదేవుడు మొదలైన శివశరణులు హర్షభరితులైరి

—o—

ఇది కృపామూర్తులైన శ్రీ మృత్యుంజయప్పగారిని స్వప్నబోధా మూర్తులైన శ్రీ ఎఱ్ఱి తాతయ్యగారిని స్మరించి, సకలశివ శరణులను వందించి శూన్య సంపాదనలోని శ్రీ చెన్న బసవేశ్వరుని సంపాదనమునకు సంగ్రహముగా జెప్పిన వ్యాఖ్యానము సంపూర్ణము

శ్రీ గురు బసవ లింగాయ నమః

# శూన్య సంపాదనము

## మడివాళయ్యగారి సంపాదనము

కం॥ గురు హర వర సాహిత్యపు
వరుసల సుజ్ఞాన నియతి వడిలింగైక్యం
పు రమణత ప్రభుడు మడివళు
కెరుక పరచినది పలికెద నెల్లరు వినగా

చెన్నబసవ, బసవేశుండు స్వానుభావ సద్గోష్ఠి యందున్నపుడు అల్లమ దేవుడు ఇదివరకు మౌనంగా ఆలకించుచుండిన భూలోక వీరభద్రుండైన, నిర్మల నిజ భావ సంజనిత శరణ స్వరూపుడైన, మడివాళ మాచిదేవుని జూచి అతని వర్తనము తెలియ కుతూహల చిత్తుడై ఇటులను చున్నాడు

**అల్లమ ప్రభు**

గురు విది లింగ మిది జంగమ మిది యను భేద మేకంబుజేసి నీకు చూపిన వారెవరు చెప్పవయ్యా? ఆది అనాదుల నొకటిజేసి భావ నిర్భావము చెప్పిన వారెవరు చెప్పవె? దీక్ష శిక్ష స్వానుభావంపు రీతి జూపి నిజపద మందు నిలిపిన వారెవరు చెప్పుమా? గుహేశ్వరుని లింగ మందు నీ ఆయతము చెప్పవే మడివాళ మాచయ్యా? ౧

**వివేచనము**

శరణుడు శరణుని యోగక్షేమంబు లడుగు విధానమిది కేవలము లౌకిక వ్యవహార లాభాలాభము లడుగక తల్లి, తండ్రి వంశము మొదలగు దేహ

సంబంధ మడుగక, ఆత్మసంబంధము నుంచి ఆర్జించిన ఆయత మేమని అల్లముడు మడివాళుని అడిగెను సుసంస్కృతి సంప్రదాయ మెంత మంచిది! ఆది గురు లింగ జంగమమును చూపి దాని మార్గసాధనము తెలిపిన గురువెవరు? ఆగురు నిరూపణ నుంచి నీవు రాబట్టుకొన్న ఆధ్యాత్మిక సంపాదన మేమి? చెప్పుమనగా మడివాళ మాచిదేవుడు అల్లముని మాటల కలరి సంతసమున ఇట్లను చున్నాడు

**మడివాళయ్య :**

భక్తిభేదంబంతయూ, కూటభేదంబంతయూ, నేను
మీకు విన్నవించెద శీలభేదంబంతయూ నేను మీకు విన్న
వించెద వినరయ్యా! నీవు కర్తవుగాన, నేను భృత్యు
డుగాన, అవధరించుమయ్యా, అన్ని భేదంబులు బసవన్న
జేసెను ఆది అనాదులను బసవన్న జేసెను సాధ్య
అసాధ్యములు బసవన్న జేసెను లింగమును జంగమ
మును బసవన్న జేసెను నాదు సర్వస్వాయతమును
బసవన్న జేసిన కారణమున ఆ బసవన్నను స్మరించి
బతికితిని చూడా కలిదేవరదేవా ౨

**వివేచనము**

అల్లమదేవా! బసవరాజు నిజమెరిగి చెప్పుట తరముగాదు అది శివుని కైనను అగాధమే బసవన్నమహిమ బసవన్నకే తెలుసు నేనిపుడు చెప్పెద నన్నది బసవన్న కృపాకటాక్షము నా మీదెంతయో అంత అతడు భేదాభేదములకు మూలము సాధ్యాసాధ్యాల కనువు అతడేది నిర్దేశించిన అది యగును గురువంటె గురువగును లింగమంటె లింగమగును జంగమంటె జంగమమగును అతడు సర్వసమర్థుడు సర్వస్వతంత్రుడు. అట్టి మహనీయుడు నాతను మన ధనంబులందు ఆయత, స్వాయత, సన్నిహితముల నెలకొల్పి సర్వస్వాయత సమన్వయుని జేసినందున అతని సద్భక్తివల్లనీరు యందు బతికి సుఖియైతినని మడివాళ మాచిదేవుడు చెప్పగా విని ఇట్టి కృతార్థతనిచ్చి పోషించిన బసవరాజు వినుచు ఎదురుగా నున్నందున శిష్యుని గురించి ఆయనేమి చెప్పనోయని బసవన్నతో అల్లముడు ఇట్లనుచున్నాడు

అల్లమ ప్రభు

మనము మనము కూడి సమరతి సంగమందు
సుఖము చెందిన శరణుల సంగసుఖము ఆ శరణులే
తెలియ గలరు గాన, దూరముండు వారికెరుక యగునె?
నిజగుణభరితులు శివశరణుల విధము కనెదమన్న కాన
నగునె? గుహేశ్వర లింగమందు మడివాళ మాచయ్యరీతి
నీకెరుక నాకొకసారి చెప్పవే సంగనబసవన్నా! 3

వివేచనము :

బసవ ప్రధానీ! నా దొడ్డ కోరిక మాచి దేవుడు రూపారియై నిన్ను చక్కగా మలచి రూపించినాడు? ఆయన రూపించిన నీ మూర్తి అవయవాలను కవిగా వర్ణించినాడు నిన్నింత తెలిసినతడు ఎట్టి మహాసీయుడో నీనుంచి తెలియవలెనను కుతూహలము హెచ్చినది శరణ-శరణుల సంగ సమరతి సుఖానందము శరణులకే ఎరుక ఇతరులకు తెలియదు ఇక్కడి శరణానుభవ కూట మపూర్వము నేసినాడె చూచు భాగ్యమబ్బినది గాన తెలియకోరుచున్నాను మడివాళుని అనుభవ విభవమేమొ చెప్పవలయునని బసవన్నను అడుగగా వింతగా అల్లముని జూచి బసవన్న ఇట్లనుచున్నాడు

బసవణ్ణ .

అయ్యా! నేను దాసోహంబు జేయుదుగాని సమ
యంబు తెలియదు అయ్యా! నేను భక్తి జేసెదగాని భావ
మెరుగ స్థలకుళంబుల విచారించిన నా యందేమియు
సారము లేదు. మీ శరణుల స్పర్శ నంది శుద్ధుడైతిని
కూడల సంగమ దేవుని సాక్షి మడివాళ మాచి తండ్రి
గారి శ్రీ పాదములకు నమోనమోయని బతికితిని ४

వివేచనము .

ఎక్కడి మాట మడివాళ దేవునెరుగుట సామాన్యము కాదు అల్లమదేవా! నేనేమొ నా దాసోహమేమొ జేసుకొనుచున్నాను ఇతర సమయ విధులుతెలియవు భక్తి జేసెద గాని బాస భావమెరుగ విశేషము అడిగితే సామాన్యమే తెలియ

రాలివాదను నేనేమి జెప్పగలను నా భాగ్యవశంబున శరణుల సంసర్గము దొరకినది నాకేమియు తెలియదు మడివాళుని పాదములకు శరణని ఒదిగిన ని బసవన్న తన దాసోహం భావమునుంచి సూది మొనయంతైన కదలక నుడి విడి విని అల్లముడు దిగ్భ్రాంతుడైనాడు ఇక ఆయనను అడుగ వ అవ కాశమే లేదు దిక్కు తోచక మరల మడివాళుని ఇట్లడుగుచున్నాడు

**అల్లమ ప్రభు :**

యుక్తి నడిగిన భక్తిని జూపె భక్తినడిగిన
యుక్తిని జూపె నిత్యంబు చెప్పమన అట్టిట్టు జారెను
గుహేశ్వరుని శరణ బసవడు మరుగునకు మరుగొడ్డి
మరుగయ్యెను బసవని తీరు ఎట్లు చెప్పవే మడివాళ
మాచయ్య ౫

**వివేచనము :**

మడివాళయ్యగారూ! పెద్దవారి విషయమే విచిత్రము తెలిసినను తెలియ దని చెప్పిన అది కల్లగాదు ఎందుకంటె ఆయన దాసోహంభావము కల్లను రక్షించుచున్నది అతని సంగమదేవుడే సాక్షిగా నిలిచినప్పుడు ఎవరేమి చెప్ప గలరు? భక్తికి యుక్తి, యుక్తికి భక్తి చూపి మరుగైనాడు పెద్దవారి విషయము ఎక్కువ చర్చింపరాదు మరల నిన్నే అడిగెద బసవన్నగారి విశేషమహిమలు వినగోరెద చెప్పు మడివాళదేవా యని అల్లము డడిగినప్పుడు ఉత్సాహముతో మడివాళ మాచిదేవుడు ఇట్లనుచున్నాడు

**మడివాళమాచయ్య :**

బసవన్న నడత పరుసము బసవన్న పలుకు
పరుసము బసవన్న దృష్టి పరుసము బసవన్న హస్త
పరుసము బసవన్న భావ పరుసము బసవన్న మనసు
పరుసము తనుమన ధనంబు నివేదించి నతడు బసవడు
బసవన్నను స్మరియించుటే లింగార్చనము బసవన్నను
తలచుటే పరతత్వము. బసవన్నను స్మరియించుటే కల్యా
ణము వాని కలిదేవయ్యా, నీ శరణబసవడు ఇంతటి
మహిముడు చూడయ్యా! ౬

**వివేచనము :**

స్వామి! లోకములో పరుసవేది (స్పర్శవేది) ప్రసిద్ధి చెందినది అది తాకిన లోహము బంగారమగునట ఐతే కొన్ని వస్తువులను మాత్రము బంగారు చేయు గుణము కలది గాని, మన్ను, రాయి, కట్టెను బంగారు చేయజాలదు బసవన్నగారి భక్తి పరుసము నడతయందు, మాటయందు, దృష్టియందు, హస్త మందు, మనభావంబులందు మిళితమై, అడిగినవారికి ఏమడిగినను ఇచ్చు భక్తి భండారి ఎన బసవన్నను ఒకతూరి 'బసవా' అన్న చాలు, అది లింగార్చనం బగును బసవా అన్నచాలు అది పరతత్వమగును అల్లమదేవా! ముఖ్యముగా బసవని తలచుటయే నిత్య కల్యాణంబు మీ శరణ బసవని మహిమ చెప్ప ఎవరికి తరమయ్యా యని పరమోత్సాహముతో మడివాళుడు భక్తి పరవశుడై చెప్పగా అల్లమదేవుడు ఆనందభరితుడైనాడు, బాగ బాగు మడివాళా, నీ జ్ఞానము అమోఘము అని పులకాంకితుడై బసవరాజును మడివాళదేవుని ఇద్దరిని గూర్చి ఇట్లు కొనియాడుచున్నాడు

**అల్లమ ప్రభు :**

మంచు బొమ్మను కౌగిలించినట్లయ్యె, అగ్గిమీదున్న
ముసుకు ఓసరించిన కర్పూరం బట్లయ్యె మబ్బులో
వెలుగు జొచ్చినట్లయ్యె గుహేశ్వరుని శరణ మడివాళ
మాచిదేవుని కృపనుంచి బసవణ్ణా నిన్ను మడివాళుని సీ
వనియే కంటినయ్యా! 2

**వివేచనము :**

బసవరాజదేవా! నిన్ను గురించి మడివాళ దేవుడు వినుతించునపుడు మడి వాళుడు దానిలో లీనమైనాడు ఎరుగుట, భావించుట, స్మరించుట, సాధించుట, సిద్ధించుట ననునవి సామాన్యుల మాటలు కావు వర్తనలు కావు నీవెట్లనో మడి వాళుడూ అట్లనే, మడివాళుడెట్లో నీవునూ అట్లె అనునది తెల్లమైనది మంచు బొమ్మను కౌగలించునట్లు, అగ్గిమీదున్న బూడిదను కర్పూరము తొలిగినట్లు, అంధకారములో దివ్యప్రభ జొచ్చినట్లు నాకు విస్పష్టమైనది బసవన్నా! నీవు

మడివాళుడు నీవే యని తెలిసితి. దాపరిక మెందుకు! అని తేట తెల్లముగా బసవ రాజును మడివాళ దేవుని ఒకటిగా గొనియాడినప్పుడు బసవన్న తన సహజ దాసోహం భావముచే మడివాళ మాచిదేవుని గూర్చి ఇట్లనుచున్నాడు

**బసవణ్ణ**

కోటి రుద్రులు మరణించిరి అనంతకోటి బ్రహ్మ విష్ణువులు మరణించిరి. నరులు సురులు గరుడ గంధర్వులు మరణించిరి వారి మరణముతో తాను గాక తానొక క్రొత్త తెలుపుమడి (మధుపర్కం) జేసి నాకు కట్టనిచ్చి నన్ను బ్రతికించుకొన్నతడు మడివాళుండుచూడా కూడల సంగమ దేవా! ౭

**వివేచనము :**

అయ్యా అల్లమస్వామి! మడివాళుని మహిమ ఆయన పేరునందే యున్నది. బ్రహ్మాండమున రుద్రులు బ్రహ్మ విష్ణువులు యుగయుగాంత ప్రళయములలో మరణించినా ఈతడు మడియని మడివాళుడయ్యా! ఇక లోక జీవుల ఆత్మ నైర్మల్యము కడుగు మడివాళుడు బట్ట లుతికే చాకలియై లోకానికి కనబడు చున్నాడు ఎవరి దోషమును సహించడు అప్పుడప్పుడే ఎంతటి మహనీయ శరణు డైనా సరియె ఉదికి శుచిచేసి వదలును మడియు వారలతో మడియువాడు కాదు ప్రళయములకు దూరము. ఇట్టి పరిశుద్ధ మతి జేము మడివాళుడు నాకు నిత్య నిర్మల చిత్ ప్రకాశంబను నిష్కల్మష ధవళవస్త్రము కట్టనిచ్చి,నన్ను పవిత్రుని జేసి బతికించుకొని రక్షించగా మీ యట్టివారి సేవ కనువైతినని మడియను మడి యందు దావుబతుకుల విలక్షణార్థముతో శ్లేషతో మడివాళుని మెచ్చుకొని వర్ణిం చిన బసవరాజు పాండిత్యవైఖరినిగని అల్లముడు ఆశ్చర్యచకితుడైనాడు

మడివాళుడు ఖిన్నుడైనాడు తన్నింతగా పొగడదగినదేముండెనో ఇది తగదైనా బసవన్న మాట కాదనరాదు. ఐనా ఒప్పుకొనుటయు గాదని వినయ మున మడివాళుడు ఇట్లు విన్నవించుచున్నాడు

**మడివాళయ్య :**

బిందువును తెంచి, నాదంబు తొలగించి, కళ
వెలుగు సాధించి అసాధ్య సాధకుడైతివి గదా బసవన్న!
కాయంబు పట్టక, మాయను సోంకక నిరాళుడై నిలిచితివి
గదా బసవన్న! నే నిన్ను ననుగ్రహించి, నీవు నన్ను
ననుగ్రహించి సందు భేదములేనప్పుడు కొనియాడ తగునె
బసవన్న? కలిదేవరదేవుని కాయముగొన్నది నీనుంచి ఏ
నెరిగితి జూడా సంగన బసవన్నా! ౯

**వివేచనము :**

నాదబిందువుల దాక్షిణ్యములేని కళలె త్తి మూర్తిభవించి భవజీవ సంద్ర మునకు నావయైన బసవన్నా! కాయ, మాయల దూరీకరించి నిరాళుడై నిలిచిన బసవరాజా! నీ యనుగ్రహావరణ కొలనులో మీ శరణుల వస్త్రములుదికి మడి జేయువాడ. నాయందు మీరు, మీయందు నేను విడదీయరాని సంబంధము వేరు జేసిన నన్ను నీ పొందులేదన్నట్లు పొగడుట ఇదేమి న్యాయమయ్యా? మీకు వేరై బతుకగలనె స్వామి! బతె ఈనాడు కలిదేవుడు మీనుండి ప్రత్యక్షమయ్యెనని మడివాళుడు వినయంబున నుడువుచుండగా బసవరాజు అడ్డువచ్చి నిలునిలుమని అల్లముని కిట్లనుచున్నాడు

**బసవణ్ణ :**

కల్పితము చెడిపి అకల్పితము తెలిపెను మనము
మరపి ఘనము నాపెను అంగము మరపి స్వరూపంబు
స్థాపించెను అంతరంగమందు మహాజ్ఞానంబు నింపె,
బహిరంగమందు సదాచారము నిలువజేసె మీరీతి వివర
వివరంబుగా జెప్పిచూపి నన్ను మీ శ్రీ పాదములకు
యోగ్యునిజేసె కూడల సంగమ దేవయ్యా, మీ మహా
మందిరమున మడివాళుడు నేను సుఖంబున నుంటిమయ్యా! ౧౦

**వివేచనము :**

వేరు గాదు మాచయ్యా! ఎందు కింత సంకోచము? ప్రభుదేవా, వినండి ఈ మహనీయుడు నా అండనుండి నన్ను శరణ కార్యరంగమందు తగువానిగా దిద్దుకొనుచు వచ్చుచున్నాడు కల్పితములేని అకల్పితము తెలిపి, మనమందు ఘనము నిలిపి అంతరంగ బహిరంగంలో తానెయై యున్నాడు మీ విషయము వివరించి మీ సేవకు యోగ్యుని జేసినాడు ఇదంతయు ఊరక కొనియాడుట గాదు స్వామి! చూడండి మీ అనుగ్రహ మంచిరమందు నేను, మడివాళయ్య పరమ సుఖంగా వున్నాము అని బసవన్న మాచయ్యకు తనకున్న సర్వ సమన్వయ తత్త్వార్థము ఆనందమున బసవన్న జెప్పిన అల్లమదేవుడు హర్ష భరితుడై ఇట్లనుచున్నాడు

**అల్లమ ప్రభు :**

ఒకటి చేయబోవ మరియొకటైన దనుట నా కయ్యె జూడుమా! మడివాళుని తీరు ఒరపెట్టి తెలియబోయిన నీ పూర్వాపరంబు నాకు తెలియవచ్చె నీదు పూర్వాపర సంగతి ఎరుగబోయిన, నాదు పూర్వాపరంబు బయట పడియె జూడుమా! మహాజ్ఞానుల సంగమున ఉభయ సంగసిద్ధి యనునది దిటమయ్యెనయ్యా బసవన్నా! గుహేశ్వరుని శరణ మడివాళుని పాదంబులకు నమో నమో యనుచుంటిని ౧౧

**వివేచనము .**

ఇదియొక చాల రసవత్తరమైన ఘట్టము బసవయ్యా! అనుకొన్నది ఎరుక గనుటలో అనుకొనని ఎరుక బయలుపడుట విచిత్రము చూడు, మడివాళుని విషయమేమొ తెలియుటలో నీ పూర్వాపర రహస్యము తెలిసినది. నీ పూర్వాపర మేమో తెలియబోయిన దానిలో నా పూర్వాపర సంగతి విశదమైనది పెద్దవారు శివశరణుల గోష్ఠిలో వాదమాడినను, తర్జన, ఖర్జన ఆక్షేపణ లెంతజేసిన, అంత మహాజ్ఞానము తెలియవచ్చును ఇట్టి మహత్తర జ్ఞానమిచ్చి నన్ననుగ్రహించిన మడివాళ మాచదేవు [illegible] శరణార్థులని అల్లముడు వినయమున నుడివిన,

కొనకు మడివాళుడు తన సమన్వయ జ్ఞాన సంపాదన జెప్పుకొనుచు ఇట్లను చున్నాడు

**మడివాళయ్య**

నా కాయ మాచార మందు సంగన బసవన్నను
కంటిని నా మానసం బెరుకలోన చెన్న బసవన్నను
కంటిని నా భావంపు కొనమొనయందు అల్లమ ప్రభుదేవుని
కంటిని ఓ కలిదేవయ్యా, మీ శరణుల ఘనమును నాదు
సర్వాంగంబునందు గని నమో నమో యనుచుంటిని ౧౨

**వివేచనము**

అయ్యా! అయ్యా! మహనీయ శరణ శిరోమణులారా! విన్నపము ఆలకించి బ్రోవండి కాయ మాచారము బసవన్న గాన బహిరంగ శుద్ధుడనైతిని నా మనోనైర్మల్యము చెన్నబసవన్న గాన అంతరంగ శుద్ధుడనైతిని నా భావము నిర్భావము అల్లమప్రభుదేవుడు గాన నా సంకల్ప వికల్పములు బయలయ్యెను. మీ శివశరణుల కరుణా కటాక్షమున నా సర్వాంగము శుద్ధమయ్యె గాన నమో నమో యనుచుందును అనుచు వినయవిధేయతలతో మడివాళ మాచిదేవుడు శరణ సమూహమునకు వందన మాచరించగా అందరు సంతసించిరి

—o—

ఇది కృపామూర్తులైన శ్రీ మృత్యుంజయప్ప గారిని స్వప్నబోధా మూర్తులైన శ్రీ ఎర్రి తాతయ్యగారిని స్మరించి సకల శివశరణులను వందించి శూన్య సంపాదనలోని మడివాళయ్యగారి సంపాదనమునకు సంగ్రహముగా జెప్పిన వ్యాఖ్యానము సంపూర్ణము

—o—

శ్రీ గురు బసవ లింగాయ నమః

# శూన్య సంపాదనము

## సిద్ధరామేశుని గురుకరుణ

౧౦

కం॥ శివయోగి సిద్ధరామున
కవిరళ శివలింగదీక్ష నతిమోదముతో
భువి మెచ్చ చెన్న బసవుం
డు విధినొసంగుట తెలిపెద నుర్వియె పొంగన్

అల్లమ ప్రభుదేవుని వెనుక వచ్చిన సిద్ధరామదేవుడు కల్యాణమందున్న బసవేశ్వరుని మహామందిరపు ముందుభాగమునందు నడచిన శివశరణుల గోష్ఠులను ఆలకించి సంతసించినాడు ముఖ్యంగా బసవన్న మహాప్రధాని, దండనాయకుడు, అర్థ మంత్రియై రాజ్యాధికారంబులందు ఉన్నతకీర్తి గడించినట్లు, ఆధ్యాత్మిక తత్త్వరంగములో అసమాన అనుభావియై శివశరణులతో శివాద్వైత తత్త్వనిష్ఠాపారంగతుడై యుండుట పరమాశ్చర్యకరమని ఎంచినాడు

ఎక్కడి రాజకీయము! ఎక్కడి ఆధ్యాత్మిక సద్విచారము! రెంటికి లోక ప్రవృత్తులలో సమకూడని విషమ సంబంధాన్ని సమకూర్చుకొన్న బసవేశ్వరుడు ఈ కాలపు పరమాశ్చర్యకర వ్యక్తియని, శక్తియని, సిద్ధరాముడు తలచినాడు. మడివాళమాచిదేవుడు చెన్నబసవన్న మున్నగు వారి శరణ సమూహమునుజూచి ఒకే చోటనే ఒకే సారి అలౌకిక ఆధ్యాత్మిక సౌందర్యవికాసమును జూచినట్లయి సంతసించినాడు ప్రభుదేవునితో ఇష్టలింగమును గూర్చి అడుగవలసిన ప్రశ్నకు ఇంతటివరకు నడచిన విషయములలో ఆ లింగపు ప్రస్తావనయే రాలేదు ఇప్పుడు

మడివాళ మాచిదేవుడు శరణులకు వందనం ఆచరించి ఊరకున్నప్పుడు ఇదియే సమయమనుకొని అల్లమ ప్రభుదేవునితో ఇష్టలింగమును గూర్చి ఇట్లు ప్రశ్నించు చున్నాడు

**సిద్ధరామయ్య**

ఆయ్యా! కాయలింగమొ, కాయముపైనుండు లింగ
లింగమొ! ప్రాణలింగమొ, ప్రాణము నందుండు లింగ
లింగమొ! జ్ఞానలింగమొ, జ్ఞానము మొనయందు వెలుగు
లింగలింగమొ! లింగమే ప్రాణమో! ప్రాణమే లింగమో!
ఎట్టులనుట? నేనెరుగను మీ కాయపు కరస్థలంబు చేరిన
లింగము ప్రాణమందు వేద్యమైనరీతిని ఉపదేశించి కృప
జేయుమా ప్రభూ! కపిల సిద్ధమల్లికార్జునా! ౧

**వివేచనము :**

శరణ సమూహము కుతూహలముతో వినుచుండగా నిత్యము ఆరాధ నీయమైన ఇష్టలింగమును గురించి సిద్ధరామదేవుడు ప్రశ్నించినపుడు జాగరూ కతతో అతనివంక చూచినది అయన అడిగినది శాస్త్రీయంగా సాపేక్షికంగానే ఉండినది ఎరిగిన అల్లమదేవుడు ఉచిత ప్రశ్నయని బసవరాజునకు సిద్ధరాముడు అడిగిన లింగవిషయమును ప్రస్తావించి, కాయలింగమొ! కాయముపై ధరించినది లింగమొ! ప్రాణలింగమొ ప్రాణమున ధరించిన లింగ లింగమొ? కాక లోపల నున్న జ్ఞానమే లింగమో! జ్ఞానముపై ధరించిన లింగ లింగమో! ఏది లింగము? లింగమే ప్రాణమొ! ప్రాణమే లింగమో! చేతియందున్న ఇష్టలింగమునకు లోపల నున్న ప్రాణలింగము యొక్క అనుసంధానమెట్లు? అని సిద్ధరాముడడుగు చున్నాడు ఈ ప్రశ్న లింగవంతులందరు వివేచించవలసినదే బసవేశా! దీనికి సమాధానము నీవు చెప్పవలె నన్నప్పుడు ఆ బసవేశుడు సిద్ధరామదేవుని అంగముపై లింగము లేదని యెరిగి ప్రభుదేవునకు నమస్కరించి ఇట్లనుచున్నాడు

**బసవన్న :**

నా కాయపుకరస్థలమందు అల్లమ ప్రభు దేవుని
కంటిని నామనఃకరస్థలమందు చెన్నబసవన్నను కంటిని

నా యెరుకయొక్క కరస్థలమందు మడివాళయ్యని కంటిని లోపలి - బయట, బయట - లోపలలో భేదమెరుగలేక యుంటిని కూడల సంగమదేవయ్యా! మీ శరణులు నన్ను పావనము చేసిన పరిణామమును అటులిటు లనలేక నమో నమో యనుచుంటిని ౨

**వివేచనము :**

నేనేమి చెప్పుదును స్వామి? కాయ మందు మీరు, మన మందు చెన్న బసవన్న, జ్ఞానమందు మడివాళయ్య కనుపించినారు, లోపల - బయటల భేదము లేకుండ యుంటిని మీ శరణులు పావనము సేయగా నమస్కరించెదను. కాని, చెప్పియే తీరవలెనన్న మీ ఆజ్ఞకు బద్ధుడనై ఒక్కమాట చెప్పెదను

సమయ విరుద్ధమునకు వెరచి వినయంబున నుడి వెదను చంపిన చంపుము ఉంచిన ఉంచుము. మన వారని మనసునకు పట్టదు కూడల సంగమదేవా! ౩

**వివేచనము**

నా అభిప్రాయమని చెప్పుట కాదు అల్లమదేవా! మతధర్మము ప్రకారము మనవారని చెప్పుటకు మనసురాదు మీరేమి శిక్ష విధించినను సరియేయని బసవన్న అల్లమునకు విన్నవించినప్పుడు సిద్ధరాముడు ఆ మాటను విని ఇట్లను చున్నాడు.

**సిద్ధరామయ్య .**

వెలుగు వెలుగు లొసగుచుండ చీకటి యుండ గలదే? శరణులు మహానుభావమగు గోష్టి సలుపుచుండ సంగమమందుండు వారల అజ్ఞానంబు నశించి నిజమును గనెదరయ్యా! మీదు మహానుభావపు సోంకు (సంసర్గపు) చెరగు నందుండి నేను పరమ సుఖినైన, మడివాళుని పాదమందే నా మనసు లగ్నమైనది కనుమా ప్రభూ! కపిల సిద్ధ మల్లికార్జునా! ౪

**వివేచనము :**

సిద్ధరామదేవుడు అల్లముని గూర్చియే అడుగుచున్నాడు మొదటగా ప్రశ్నించినది ఆయననే ఇతర శరణుల చనువులేకనో, అక్కడనే లింగ విషయము తెలియగలదని తనను సొన్నలిగనుండి కల్యాణమునకు పిలుచుకొని వచ్చినందున, అల్లముడే ఈ విషయానికి ముఖ్యుడని ఎంచినందునను, బసవని ఆక్షేపణకు సిద్ధరామునకు తన అభిప్రాయమును అల్లమునకు తెలుపుచున్నాడు

అయ్యా! ఎందులకీ విభేదము? మనిషిని మనిషి నావాడు కాదనుట మానవతత్త్వము తెలిసిన పెద్దలకు తగునా? వెలుగు ప్రసరించిన చోట చీకటి యుండునా? సజ్జన సత్పురుష శరణుల సంగతి యందుండువారికి అజ్ఞాన ముండునా? మీయట్టి మహనీయుల మహానుభావ గోష్ఠియను పవిత్ర సంసర్గపు సోంకునందుండు నేను పరమ సుఖినైతిని. మడివాళ మాచిదేవుని పాద దర్శన మందు సంయోగినైతిని అని అందరి శరణులలో గడివోవని భక్తి-నిర్దాక్షిణ్య - శక్తులకు మెచ్చి ఉదాహరించిన మాట సరిరాక చెన్న బసవన్న సిద్ధరాముని ఇట్లు ప్రశ్నించుచున్నాడు

**చెన్న బసవన్న :**

అంగముమీద లింగము లేకున్నంతవరకు ప్రాణ మందు లింగపరిణామంబు చెందురీతి ఎట్లయ్యా! అంగ త్రయమున్నవారు లింగత్రయ సంపన్నులై యుండ వలయును ఒక్క అంగమైన, లేనివారు గలరే? కన్నుల చూపునకు దూరమేది? ఒక్క అంగము విడిచిన వేరొండు అంగము కానరాదు గనుక సందుభేదంబులేని మడివాళుని విధము కూడల చెన్న సంగునందు నీకెట్లు సాధ్య మయ్యెనో సిద్ధరామయ్యా! చెప్పుమా! ౫

**వివేచనము :**

సిద్ధరామదేవా! నీవు మాకు మాన్యుడవు అల్లమప్రభు దేవుని కృపా సంపాదనమునకు చెందిన మీరు వారితో ఇక్కడకు విచ్చేయుట మా శరణ సమూహమునకు సంతసము కలిగించినది మీరు మానవోద్ధరణకు చేయుచున్న

క్షేత్ర నిర్మాణ కార్యములు గూర్చి విని సంతోషించినాము మీరిప్పుడు వీరశైవ తత్త్వార్థ లింగమును గురించి అడిగిన ప్రశ్న సాధువైనది.మానవ సమానత్వాన్ని గురించి ప్రస్తావించి, మీరు జూపిన వినయము శ్లాఘనీయమైనది అయినను, మడివాళ మాచిదేవుని మీతో సమన్వయించుకొన్నది మాత్రము సమంజసముకాదు.

స్థూల సూక్ష్మ కారణ శరీరములందు ఇష్టప్రాణ భావలింగములు ధరించి అంతరంగ బహిరంగ భేదములేని పరిపూర్ణుడు మడివాళయ్యగారు మీకు రెండంగములందు లింగముండి స్థూలాంగమునందు లింగము లేకుండి భవ భావము పొందియుండ మడివాళునితో మీకెట్లు సామరస్యమబ్బును? మూడంగము లను మూడు లింగములతో నుండవలయు ననునది శివాద్వైత సిద్ధాంతము. ఈ సిద్ధాంతమునకు మీ మాట సమ్మతి లేని మాట సూక్తము కాదు అని చెన్న బసవన్న వినయ వివేచనములతో ఖండించినప్పుడు సిద్ధరామయ్య గారు బ్రహ్మా ద్వైత సిద్ధాంతమెత్తి ఈ రీతిగా ఉత్తరమిచ్చుచున్నాడు.

**సిద్ధరామయ్య :**

తనువు ఉన్నదను భావము మనము నందు
లేదయ్యా! మనము ఉన్నదను భావము ఎరుక యందు
లేదయ్యా! ఎరుక ఉన్నదను భావము మాటలో లేదయ్యా!
ఇటుల తను మన జ్ఞానములను త్రివిధంబు ఏకార్థమైన
తరువాత, ఏ తనువు మీద స్వాయత్తము జేయుదును?
నా తనువే బసవన్న నా ప్రాణమే ప్రభు దేవుడు
కపిల సిద్ధ మల్లికార్జుననందు-లోన-బయటఅన్నది లేదు
చెన్న బసవన్నా! ౬

**వివేచనము :**

వాదములో అద్వితీయుడు, సిద్ధుడు అల్లముని ఎదిరించి ఇష్ట లింగమును నష్ట లింగమని నిర్వచించిన దిట్ట అంగలింగ విషయంగా మావారను నిర్ణయ మును చెన్న బసవన్న విమర్శకు అసలు అంగమే లేదు అను వాదమెత్తి ఇట్లు సమర్థించుకొనుచున్నాడు చెన్నదేవా! నీవు ప్రతిభా జ్ఞానములు గల అనుభావివి నీకు తెలియనిది లేదు నాకు తోచినది చెప్పెదను

ఏదయిన ఉన్నదని భావించినచో అస్తిత్వ భావనయే కలుగును "యద్భావం తద్భవతి" అను సూక్తి లేదనిన లేదు ఇపుడు నాకు 'తనువు ఉన్నది' అను భావము మనములో లేదు మనమున్నదను భావము జ్ఞానములో లేదు. జ్ఞానమున్నదను భావము మాటలో లేదు అన్నప్పుడు తనువు లేదు, మనము లేదు, భావించు భావము లేదు ఇవి మీరు చెప్పినట్లు స్థూల సూక్ష్మ కారణ శరీరములు ఒకదాని నుండి మరొక దానిలో లయించు శరీరాలన్నవి కల్పనలు మాత్రము గాన లింగధారణము ఏ శరీరమందు చేయవలె? ఒకమాట నాకున్న శరీరమందు బసవన్న, నా ప్రాణము నందు ప్రభుదేవుడు నిండి యుండగా అంతరంగ బహిరంగ విభేదములు లేవు

సిద్ధరామదేవుని వాదతీవ్రతకు శరణులు వెరగు పొందినారు తదుపరి చెన్న బసవన్న విచక్షణా వివేకముతో సిద్ధరామునకిట్లు బదులు పలుకు చున్నాడు.

**చెన్నబసవణ్ణ :**

అంగంబు లేదనుట చేతనే అంగశంక విడిపోదు
లింగమున్నదనుట చేతనే లింగశంక విడిపోదు లేదను
టకు కారణము ఉన్నదన్నది మరచుటయే ఉన్నదన్నది
విడిపోయిన గాని ప్రాణలింగ సంబంధము స్వాయము
గాదు కూడలి చెన్న సంగయ్యయందు ప్రాణలింగ
సంబంధము నీకెక్కడిది? సిద్ధరామయ్యా! చెప్పవలయును ౭

**వివేచనము**

అయ్యా! సిద్ధరామదేవా! నీవు ఏది లేదనుచున్నావో అది అక్కడనే ఉన్నదని నిరూపణ మగుచున్నది నీవిప్పుడు లేదనుటకు పూనుకొన్నా, అక్కడ నీవు చెప్పు వస్తువు లేకుండినను లేదని చెప్పుటకు కారణము లేదు ఉన్న వస్తువు కాలాంతరమున నాశనమైన తరువాతనే లేదనుట నిర్ణయమగును అట్లనే ఉన్నదనుటకు వెనుక అది ఉండలేదనియు ద్యోతకమగుచున్నది విచారించి చూచినచో, లేదని చెప్పుటకు ఉన్నదనునదియే అజ్ఞానము ఇంకొకటి ముఖ్యముగా గ్రహించి అనుష్ఠానమునకు తెచ్చుకొనవలయునన్న ఉన్నదనునది

నశించి మిగిలినది ఏమి యున్నదో అది ప్రాణలింగమగును అది స్వయం సంపన్నము ఆ సంబంధాన్ని పొందని నీకు ప్రాణలింగ సంబంధ మెక్కడిది?

చెన్న బసవన్న సిద్ధరాముని తర్కమునకు సరియైన సమాధానమిచ్చి నప్పుడు సిద్ధరామదేవయ్య మరియొక ఎత్తుగడతో ఇట్లనుమన్నాడు

**సిద్ధరామయ్య**

తనువున్నను తనువు లేదు మనమున్నను మనము
లేదు భావముండియు భావమను బుద్ధిలేదు 'నీవు' అనుట
ఉన్నది, యైనను భృత్యాచారంబు లేదు 'నేను' అనుట
ఉన్నది యైనను అహంకారంబు లేదు కపిల సిద్ధమల్లి
నాథయ్య యందు లింగ సంగ నిర్లేపమన్నది ఎదుట
మాటాడి చెప్పరాదు సుమా, చెన్నబసవన్నా! ౮

**వివేచనము .**

అయ్యా! చెన్నబసవేశా! నీ వన్నట్లు తనువున్నదని కనుచూపున కంది నది ఉన్నదనిన ఉన్నది లేదనిన లేదు ఇక దానిలోనున్న మన మనునదియు భ్రమాత్మకము భావము మూడవ శరీరము ఈ రెంటికి కారణమని చెప్పుటకు కారణము మీకుండవచ్చును కాని నాబుద్ధియందు లేశమాత్రము లేదు ఈ శరీర త్రయము సంగతి ఇట్లున్న ఇక మీ లింగత్రయమున కాధారమేదో తమకే తెలి యును ఇంకొకటి చెప్పెదను ఈ తను సంబంధాల ననుసరించి 'నీవు', 'నేను' అను పదములు వాడబడుచున్నవి 'నీవు' అనినచో భృత్యాచారము కాదు 'నేను' అనినను అహంకారము లేదు మీరు చెప్పు లింగాంగ సంబంధ సమ న్వయ మన్నది ఏదో తెలియదు అని పరిహాస ధోరణిలో సిద్ధరాముడు తర్క మును సాగించుచు వచ్చునపుడు అల్లమదేవుడు "వాదము పెరుగుచు వచ్చు చున్నది ఇట్టి వాదము పరమత ఖండనమునకు, స్వమత మండనమునకు అర్హ మైనను, ఉభయులకు సామరస్యము కుదురుట అరుదు ఇక్కడ ఇద్దరూ అస మాన పండితులే స్వమతనిష్ఠాపరులే వాదవైఖరీ వైభవోపేతులే నిశ్చల నిర్మల మతులే కాని వారివారి అభిమతానికి విరుద్ధముగా సుంచకూడ"దని చెన్నబస వేశుని చూచి, ప్రభు విట్లనుచున్నాడు

**అల్లమ ప్రభు**

మిమ్మెరిగిన శరణునకు శివపూజసేయు కష్టం బదెందుకయ్యా? ప్రేమ సమ్మేళనమునకు శయ్యాసౌలభ్య మెందులకు? తామలాలసునకు సిగ్గేమిటికి? అపరంజికి గీటురాయి ఎందులకు? గుహేశ్వరుని లింగమే ప్రాణమై యున్న సిద్ధరామయ్యకు గురు తెందులకో, చెన్న బసయ్యా! ౯

**వివేచనము :**

చెన్న బసవేశా! సిద్ధరామదేవుడు మావాడు శరణ తత్త్వమెరిగిన వాడు స్నేహము చేయుటకు ముందు గుణావగుణ విభేద వివేచనముండునుగాని నిర్మల స్నేహ మలవడిన అదియిదియను తారతమ్యములేదు అంతయును స్నేహ మయము గదా? మనవారు కానప్పుడు సిగ్గు, సంకోచము, అనుమానములుండును బంగారము నందు దోషమున్నంతవఱకు ఒరగల్లు యొక్క అవసరముండును వాద మునకు ప్రతివాదము రంజకముగా సుండినను, తనుత్రయ, లింగత్రయ వాద విషయమై సిద్ధరామయ్య అంగీకరింపక పోయినను, శరణులందు అవిధేయత చూపలేదు కదా? బసవన్నయే నా కాయమన్నాడు - అల్లముడే నా ప్రాణ మన్నాడు మొట్టమొదటగా మడివాళుని దృఢమైన ఆదర్శశరణ తత్త్వాన్ని ఒప్పు కొని శరణుడైన అతనికి, లాంఛన మెందులకు? పూజా ప్రయాస యెందులకు? సీమలేని నిస్సీముడు, సంగరహిత నిస్సంగి అని ఏకధాటిగా సిద్ధరాముని లింగ వంత శరణులతో పోల్చి చెప్పిన అల్లమునకు ఆవేశముతో బిరుసైన మాటలతో చెన్న బసవన్న ఇట్లనుచున్నాడు

**చెన్న బసవణ్ణ :**

ఆకాశము నందాడెడు గాలిపటంబునకైనను మూల సూత్రముండ వలెను కలియైనను ఖడ్గముండియే తీర వలె భూమిలేక బండి నడచునే? అంగంబునకు లింగ సంగంబు లేక నిస్సంగత్వ మలవడదు కూడల చెన్న సంగమదేవుని యందు సంగమములేక నిస్సంగియని నుడువతగునా అల్లమా? ౧౦

**వివేచనము**

జంగమస్వామీ! ఏటి మాటలివి? సిద్ధరామదేవుడు పెద్దవాడు కాదని ఎవరన్నారు? పెద్దవారు కానివారు మీ వెనుక వచ్చుటకు సాధ్యమా? వచ్చినను అభిప్రాయభేదమంతయు తనుత్రయ లింగత్రయ ముఖ్య సంబంధమై వచ్చినది ఆయనగారు లింగములే కల్పనలని సాధించుచున్నారు కాని వీరశైవ సిద్ధాంతము ఒప్పదు మూడంగములందు మూడు లింగములుండవలె ననుట సరియైనది - తత్త్వపూర్ణమైనది అసంపూర్ణమైన స్థూలకాయమునకు లింగావసరము లేదు - అన్నవాదము తమకు తెలిసినట్లు అసమంజస వాదము ప్రాణలింగానుసంధానమునకు ఇష్టలింగ ముండవలయును ఇది ఇట్లుండగా, మన వాదనలే కల్పనలన్న సిద్ధరాముని వాదము విచిత్రమైనది అతని వాదమెట్లున్నను మన ధర్మానుసారము నడచుకొనుట మన కర్తవ్యము మన మతమును ఆయన గొంతునకు కట్టు అవసరము మనకేమియు లేదు దానినుండి మన కొనగూరు లాభమేమియులేదు మా ధర్మము గురించి అభిప్రాయ భేదము వచ్చినప్పుడు వాదము పెరిగినదేకాని సిద్ధరామయ్య చిన్నవాడని ఉదాసీనత చూపలేదు స్వమత నిష్ఠను ఆయనపై రుద్ది నొప్పింపలేదు ఆయన మహనీయ యోగసిద్ధుడని తెలుసును అని చెన్నబసవన్న తన వాదార్థముయొక్క సదుద్దేశ్యమును పైన చెప్పిన వచన భావమును తెలుపుచు, సంగమము లేక నిస్సంగి యని తమరు చెప్పరాదు-అన్న ఆక్షేపణను తెలిపినప్పుడు అల్లముడు అంతయు విని ఇట్లను చున్నాడు

**అల్లమ ప్రభు**

కాయమే సకలము ప్రాణమే సకల నిష్కలము
భావమే నిష్కల లింగమైయుండు, మరి వేరొండు
ఆయత స్వాయత సన్నిహితమన్నది లేదుకదా! శివశక్తి
సంబంధమే దేహిదేహమై యుండ, మరల గుహేశ్వర
లింగమందు వేరొక్క చిహ్నంబుబట్టి తెలియుట అనున
దేమిటయ్యా, చెన్నబసవన్నా! ౧౧

**వివేచనము :**

చాలా సంతోషము చెన్న బసవన్నా! నీ యువశక్తి శివాద్వైత సిద్ధాంతము ను తీవ్రతరముగా శాస్త్రోక్తముగా వెల్లడించినది నీకిది సహజమే శరణ తత్వానికిని సహజమే సృష్టినిర్మాణ సహజతను ఒక మత పరముగా యోచింపక జీవోత్పత్తి విధానమును గూర్చి చర్చించిన దేహ దేహి సంపుటియే శివశక్తి సమ్మేళనముగదా! పుట్టుకతోడనే సకలలింగమై పుట్టినదీకాయము సకలనిష్కల లింగమై పుట్టినది ఈ ప్రాణము నిష్కలలింగమై జనించినదీభావము ఇట్లు సృష్టికి మూలములగు సకల-అంటే కనబడునది-సకల నిష్కలమనిన కనబడియు పట్టుబడని ప్రాణము-నిష్కలమన్న కానరానిది-ఈ మూడు మహాతత్వములు శివశక్తి కూటమునుండి జనించి ఇచ్ఛామాత్రముచే సృష్టిస్థితిలయాదులుగా కలుగుచున్నవి ఇవి మూడు లంగములుగా, కాయములుగా వీరశైవము సాధనా క్రమమునకుంచుకొన్నది

కల్పనయని సిద్ధరాముడన్నను, నీవు కాదనియన్నను, ఉన్న తత్త్వమిదియే కదా! వీరశైవు లుంచుకొన్న లింగపు గురుతు స్థూలకాయమున లేకున్నచో ఆక్షేపణ ఎందులకు? అని అల్లముడు ఒకరీతిగా లింగము లేని కాయము నిరాక్షేపణీయమన్నటులైనది శరణులు దిగ్భ్రాంతులైనారు ఇది-లింగము లేని కాయమును సమర్థించినట్లును, లింగకాయములను ఆక్షేపించినట్లును ఐనది ఇది విచిత్రము, లింగమున్న జంగమయ్యగారే నిరూపించిన తత్త్వము సిద్ధరామ చెన్నబసవన్నల బ్రహ్మాద్వైత శివాద్వైతముల మధ్య శివశక్తిసంపుటవాదము రెంటిని చీల్చుకొని వచ్చిన ఇంతకు మున్ను మతంగా అంగీకరించి ఆచరించుచు పురాతనముగా ప్రసిద్ధమైన వీరశైవ తత్త్వానుష్ఠానముల గతి ఏమిటి? ఇది కట్టుకొన్న లింగవంతులకు పరీక్షయా? వచ్చిన సిద్ధరాముని శ్రేష్ఠతయా? అల్లమునితో వాదులాడువారెవరు? బసవన్న మౌనముగా నున్నాడు సిద్ధరామయ్య తననుగూర్చి అభిప్రాయము వెల్లడించిన అల్లముని మాటకు సంతసించలేదు ఆయన వాదానికై రాలేదు బసవన్న సలుపు మానవతత్వాభివృద్ధిని కనుగొనుటకై వచ్చినాడు ఆ మానవత్వము లింగముఖముగా సాధించియుండిన అది ఎటులని తెలియుటకు మాత్రమే వాదమెత్తు సంతలో ఈ రీతిగా సాగి వచ్చినది అంతగా హితకరమైనది కాదేమోయని యోచించుచుండగా చెన్నబసవన్న ప్రభుదేవునితో నిట్లు నుడువుచున్నాడు

**చెన్న బసవన్న**

అంగముమీద ఆయితమైన ఆచారమే ఇష్టలింగము
ఆ ఇష్టలింగమును పట్టినదే ప్రాణలింగ స్వాయతము
ప్రాణలింగ ముదయించినగాని ఇష్టలింగము కానరాదు
ఈ భేదమును భేదించినపుడు కూడల చెన్న సంగునందు
లింగైక్యమును కనుమా ప్రభూ! ౧౨

**వివేచనము .**

మహాస్వామీ! ఆయత స్వాయత సన్నిహితములు పుట్టుతోడనే సృష్టి ననుసరించి స్థూల సూక్ష్మ కారణములుగా అవతరించినవని అర్థము వెల్లడించుచు ఇక వానిపై లింగధారణము లెందుకని ఆ లింగములను ధరించిన జంగముదవై అడుగుట పరమాశ్చర్యకరము మీరు చెప్పినట్లు సృష్టి నిర్మించినదో లేదో మనకిప్పుడు అనావశ్యకము స్థూల సూక్ష్మ కారణములపై ఇష్ట ప్రాణభావ లింగములు వీరశైవ ధర్మానుసారముగా ఉండవలయుననియే మత సిద్ధాంతము మిమ్ములను విమర్శింపవలెనని కాదు మీరు లింగవంతులను పరీక్షసేయవలయునని ఈ విరుద్ధాభిప్రాయమును వెల్లడించినచో, దానికి నే నొక మాట మనవి చేసెదను సృష్టిలోని స్థూల సూక్ష్మ కారణ శరీరములున్నను సృష్టి దోషయుక్తముగా మాయావరణముతో కూడియుండినందువలన, అవి మీరు చెప్పినట్లు లింగములైనను శ్రీ గురువుచేత సంస్కరింపబడలేదు కావున స్థూల శరీరముపై ఇష్టలింగముతో గురు సంస్కరణము, మిగిలిన రెండు శరీరాలకు తెచ్చుకొని నిజమును కనుగొనుటయే శివాద్వైత సిద్ధాంతము మీరు చెప్పిన అర్థములోని తనుత్రయము ప్రవృత్తి గురువుచే సంస్కరింపబడిన లింగత్రయము నివృత్తి దీనినే లింగవంతులు లింగైక్యమంటారు మరియొక్క మాట దేహముపై ధరించిన ఈ ఇష్టలింగము కేవలము పూజకొరకు కాదు ఆ పూజ లింగాచారముగా పరిణమించుటయే కర్తవ్యము ఆ ఆచారము సూక్ష్మశరీరంలో ఉన్న జ్ఞానానికి చేతన మిచ్చుటయే ప్రాణలింగము ఈ రెండును సామరస్యము పొందుటయే శుద్ధాత్మలింగము ఈ పరిణామమే వీరశైవుల నిత్యసత్య తత్త్వ నిర్ణయము

ఇట్లు నిరాఘాటముగా నిర్భయముగా వీరశైవ తత్త్వార్థమును వివరించు చున్న చెన్నబసవేశ్వరుని జూచి శరణులందరు జాగృతులైనారు లింగవంత ధర్మమునకే ముప్పువాటిల్లు వాదము మహాజంగముడని ప్రసిద్ధిచెందిన అల్లముడే ఈ రీతిగా ఖండించినప్పుడు వారి వారి ముఖాలలో క్రోధ సూచకాలు వెలువడు చుండగా చెన్నబసవన్న చూచి ఉత్తేజితుడై అందరి పరముగా తిరిగి ఇట్లను చున్నాడు.

గణసాక్షిగా వివాహము గాక యున్నంతవరకు
సతి సంగమము అతి సౌఖ్యమన్ననేమి? కన్ను కనబడు
నన్నచో దీపము లేకుండు నంతవరకు మబ్బులో కన
బడునే? సూర్యప్రకాశమందు జూచి నేనే కంటినను
లోకవార్త యట్లయ్యెను అంగము విడచి ఆత్మయుండునే?
శక్తిని విడచి శివుడుండునే? ఇది కారణము స్థూల సూక్ష్మ
కారణములను తనుత్రయము ఉండగా ఇష్టప్రాణ భావము
లను త్రివిధలింగ సంబంధము వద్దనిన అసంఖ్యాక
ప్రమథ గణంబు లొప్పుదురే? ఇది కారణము కూడల
చెన్న సంగయ్య యందు ఇష్టలింగ సంబంధము లేనివారి
ముఖములు చూడరాదయ్యా! ప్రభురాయా! ౧౩

**వివేచనము :**

విచారము ఆచారమునకు రాకపోయినచో ఇటు లౌకికమునకును, అటు ఆధ్యాత్మికమునకును ప్రయోజనము లేదు మాటలలో సతి సంగమ సుఖమును వర్ణించిన కలిగెడు సుఖమేమి? ఆ సుఖమును పొందువాడు వివాహితుడై పొంద వలెను. అప్పుడు వానికా సుఖము అనుభవమునకు వచ్చి ఆనందము కలుగును కన్ను చూడగలుగు నన్నచో చీకటిలో చూడగలదా? అంగము విడచి ఆత్మ-శక్తిని దూరముగా నుంచి శివుడు ఉండగలరా? ఈ కారణమున అంగత్రయ మందు లింగత్రయము లేకున్న శరణులు మెచ్చరు ఎంత చెప్పినను స్థూలాంగ మందు లింగము లేనివారు వారెంత పెద్దవారైనను వారి ముఖములను జూడ రాదు ఖండ తుండముగా చెన్నబసవన్న చెప్పినది విని కాశ్మీర దేశము నుండి

వచ్చిన కష్టైలమ్మ కాయమందున్న (మహాదేవ భూపాలుడు) మోళిగయ్య శిష్ట దృష్టులతో ఇట్లనుచున్నాడు

**మోళిగయ్య**

నువ్వుగింజను మర్దించి నూనెను పొందునటులు, ఫలములో నున్న రసమును వెలువరించి ఆస్వాదించు నటులు, మరుగున నున్న రూపమును తెర తొలగించి కాంచునటులు, ఇష్టము-దాని మరుగున నున్న దృష్టము-ఉభయమును నిశ్చయించుకొనునటులు ప్రాణలింగి సంబంధ ముండును నిష్కళంక మల్లికార్జునా! ౧౪

**వివేచనము :**

ప్రభు దేవా! అది కాదు మీరు చెప్పిన దానిని వీర శైవ ధర్మము సమ్మతింపదు ఇష్ట లింగము లేని కాయము పరిశుద్ధి పొందదు తిలములో తైలమున్నదనిన ఉపయోగమేమి కలదు? దానిని మర్దించినపుడె నూనె బయటికి వచ్చి పదార్థమున కనువగును ఫలములో తియ్యని రసము ఉండును ఆ ఫల మును పిండి రసమును వెలిదీసినపుడే అది ఆస్వాద్యమగును నాటకమందు తెర వెనుక పాత్రధారి యున్నాడనిన ఎవరికి సంతసము కలుగును? తెర తొలగించి పాత్రధారిని చూచిననే సంతసము కలుగును అటులనే ఇష్టము మరుగున నున్న దృష్టమును నిర్ణయించుకొనిననే ప్రాణలింగాను సంధానమగును ఇష్టములేని వానికి దృష్టము లేదు దృష్టము లేక ప్రాణ లింగము లేదు అంగ మున్నదనిన లింగముండియే తీరవలెను చెన్నబసవన్న నిశ్చయించి చెప్పిన మాట మాన్యమని మోళిగయ్య నుడువగా రాయసం మంచన్న తన వినోద శైలితో ఇట్లనుచున్నాడు

**రాయసం మంచన్న :**

కురువ వచ్చి నోరు మరచితినని మొరపెట్టు తెలివి మాలిన వాని తెరగయ్యెను ఎరుకను ఎరుగుమనుచు గురుతు తెలిపినను ఆ గురుతును మరచి ఎరిగితినన్న కురువని (మేకలగాచువాడు) వలె నున్నది జాంబేశ్వరా! ౧౫

**వివేచనము :**

అయ్యా! స్వామి! ఏమిటిది చమత్కారము, చర్చించుటకిది యొక ప్రశ్నయే కాదు కదా! లేని ప్రశ్నకు ఉత్తరముల వాదోపవాదము లెందులకో తెలియరాకున్నది. ఇది ఎటులున్నదనిన ఎవడో భోజనమునకు వచ్చికూర్చొని అయ్యో, నోరు మరచి వచ్చినా ననెడు వెర్రివానివలె నున్నది కావయ్యా తెలుసుకొమ్మని తెలుసుకొను గురుతును శ్రీగురు వీయగా ఆ గురుతును మరచి ఎరిగితినన్న కురువని వలె నున్నది అని హాస్య గర్భితముగా నిజతత్త్వమును చాల సూక్ష్మముగా వివరించి నప్పుడు, ఔను అది సత్యమని ఆముగి దేవయ్య గారు ఇట్లనుచున్నాడు

**ఆముగి దేవయ్య :**

సత్క్రియ నాచరింపలేనంత వఱకు ఎఱుక నుండి
ఎఱుకను తెలిసికొనిన ప్రయోజన మేమయ్యా? స్మరించి
నంతమాత్రమున కానగునె, ఆ ఎఱుక కార్యమందుగాక?
గ్రుడ్డివాడు దారి కానడు కుంటివాడు దారి నడువలేడు
ఒకటి లేకున్న ఇంకొకటి నిష్ఫలము జ్ఞానములేని క్రియ
జడక్రియ క్రియలేని జ్ఞానము భ్రాంతి ఇది కారణము
సిద్ధసోమనాథునందు రెండును కావలెను. ౧౭

**వివేచనము :**

నా మనవిని ఆలకించుడు ఊరక వాదము పెంచుటకు అవసరమేమియు లేదు శరణధర్మము జ్ఞానపు మరుగున నుండునది కాదు అది బాహిరంగా ఆచరణీయము కేవలము జ్ఞానముతో జ్ఞానము నెఱిగిన అది వట్టి జ్ఞానమై పెరిగి, దాని తోడనే విశేషముగా తర్కము పెరుగును - కాని నిజమైన కార్యరంగ మేర్పడదు అది-ఇది చేయవలయునని అనుకొనుచుండు నంతవఱకు అదియునుగాదు-ఇదియును గాదు కన్నులు లేనివాడు మార్గము చూడలేడు చూడగలిగినను అంగహీనుడు నడువలేడు వారిద్దరు కూడిన కాళ్ళుగల గ్రుడ్డివాడు కన్నులున్న కుంటివాని నెత్తుకొని మోసికొని పోవుచున్న ఎపుడో ఎటులనో గమ్యస్థానము చేరుకొనుట కవకాశము కలదు అటులనే జ్ఞానముండియు క్రియలేకున్న ఆ జ్ఞానము నిష్ప్రయోజనమగును పనికిరాకపోవును క్రియయుండి ఆ

క్రియోద్దేశము నెరుగుట కు జ్ఞానములేకున్న అది భ్రాంతిగనే మారును కావున రెండును సమముగా ఉన్నప్పుడే సామరస్యతత్త్వ మలవడునని ఆముగి దేవయ్య జ్ఞానక్రియల సంబంధమును చక్కని ఉపమానములతో ప్రతిపాదింపగా విని, తనకు తెలిసినది తెలియజేయుట లింగవంతుని కర్తవ్యమని యెంచి తెలుగు జొమ్మయ్యగారు నుడువుచున్నాడు

**తెలుగు జొమ్మయ్య :**

గురుని కారుణ్యము పొందినందులకు గురుతు ఏమి
టనిన అంగంబు మీద లింగంబు స్వాయత్తమై యుండవల
యును అంగముపై లింగస్వాయత్తము లేకుండగ గురు
కారుణ్యము కలిగెననిన అది ఎట్లు పొసగును? లింగహీన
తకు గురుని కారుణ్య మెచట కలుగును? ఎంతటి కారు
ణ్యము? లేదు ఆమాట వినరాని మాట దీనికి కారణము
లింగధారణమున్ననే సదాచారముండును, లేనిచో అనా
చారమందునయ్యా తెలుగేశ్వరా! ౧౨

**వివేచనము :**

మా స్వామివారు కొంచెము తమ పాండిత్యమును అవతల ఉంచి ఈ పామరుని అభిప్రాయము వినవలెను గురువు అనుగ్రహించినాడు అనినచో తనువుపైన లింగముండవలెను - పెండ్లియైన మహిళకు మెడలోని మాంగళ్యమువలె అదిలేకయే తాను వాంభికమునకు గురుపుత్రుడ ననిన గుర్వనుగ్రహమైన ధర్మము, సమాజము, మతము ఒప్పవు ఊరక నేను మీవాడ ననవచ్చును పతివ్రత అందరను ఆదరించును గాని తన పురుషుని యట్లుకాదు అటులనే లింగము లేనివారు, ఉన్నవారు అందరు మనుష్యులే కదాయని మతాచారమును విడువరాదు అయ్యగారు! లింగధారణ లేని మనుజుడు అనాచారి ఉన్నవాడు సదాచారి నాకు తెలిసినది ఇంతయే అని తెలుగు జొమ్మయ్య - అతనితో బాటు అక్కడనున్న శివశరణులు తమ తమ తీవ్రాభిప్రాయములతో ఖండించుచు, లింగములేని ఆ సిద్ధరామయ్యను వెంటబెట్టుకొని, ఇక్కడకువచ్చి ఎట్టి సంకోచము లేకయే లింగవంతులమైన మమ్ములను వెక్కిరింపమన్నారు వెక్కిరింపు

మీచేతి లింగముతోడనే వచ్చిన దనినచో ఇదియొక అవివేకమని శరణులు వేసరి పాటు చూపినపుడు, ఊరకుండుటకు ఓపికలేని బసవన్న బిరుసెక్కిన గొంతుకతో ఇట్లనుచున్నాడు

బసవన్న :

గురువు చూపిన లింగము మన సన్నిహితమై
యుండ పవన భేదంబున నెరిగితినన్న అదియే ద్రోహము.
ఇడా పింగళ సుషుమ్న నాడుల ద్వార తెలిసితి ననినచో
కూడల సంగమదేవుడు ముక్కు గోయకుండునే? ౧౮

వివేచనము :

లింగవ్యాఖ్యానము శరణుల మనసులకు కష్టము కలుగునంత వరకు పోగుట కవసరము లేదు. ఎప్పుడు శ్రీగురువు అనుగ్రహించెనో ఆ యనుగ్రహమే ప్రాణలింగమై మనకు సన్నిహితమగుచుండ అది కాదని పవనాధార యోగంబున నెరిగితి ననిన అది గురుద్రోహమగును మరియు ఇడా, పింగళ, సుషుమ్నా నాడులే ముఖ్యములని తెలియుట దాని నుండియే యని నిర్ణయము చేయువారి ముక్కులను గోయక మానడు మా కూడల సంగమ దేవుడు ఇధమిత్థముగా యోగమార్గమును ఖండించి బసవరాజు పలికిన మాట సిద్ధరామునికే కాక అల్లమునకు కూడ అన్వయించి నట్లున్నది సిద్ధరాముడు లింగము పొందలేదు. అయన యోగమును లింగసహితముగా ఖండించుట కంత అనువు లేదు లింగమును జేబట్టకమున్ను అల్లముడు యోగాభ్యాసిగా నుండె నన్నది ప్రతీతి దీనిని గురించియే బసవన్న లింగాంగ యోగమును అల్లమునకే చెప్పెననుట స్పష్టమని తోచుచున్నది అదియు గాక యోగపవనమునకన్న లింగ సంగమే సులభని సిద్ధరామునకు ఈ నెపముతో చెప్పినట్లగును, ఏమైనను బసవన్నకొనకు ముక్కుగోయువఱకు వచ్చినందున అల్లముడు చకితుడై ఈ వాదమును విరమింప జేయవలెనని ఇట్లనుచున్నాడు

అల్లమ ప్రభు :

సువ్వగింబులకు లేని పరిమళము నూనె కబ్బునే?
దేహమందు ఇష్టలింగస్థాపనముగాక ప్రాణలింగ సంబం

ధము కాదు గుహేశ్వర లింగమందు ఇష్టలింగ సంబం
ధము లేక ప్రాణలింగ సంబంధము లేదు! కనుమా సిద్ధ
రామయ్యా! ౯

**వివేచనము**

వివేకవంతుడవు సిద్ధరామయ్యా! శరణుల అభిప్రాయమును వినినావు కదా! సొన్నలిగలోనే నా ఇష్టలింగపు గురుపరంపరను నీవడుగగా చెప్పినాను విశేషముగా వీరశైవ ధర్మరహస్యమును తెలియుటకు కుతూహల ముండినది. సమాజ సమ్మతియు, ధర్మసమ్మతియు, సంప్రదాయ సమ్మతియు ఒక మతము నకు లభింపవలెననిన ఆ మతధర్మకర్తల యోగ్యత, ఆచరణములపైన ఆధార పడి యున్నది నీకు తెలియని విషయము లేదు క్రొత్తగా నీవేదియు పొంద నవసరము లేదు నీవు మహాయోగ సిద్ధుడవు వీరశైవధర్మ సౌలభ్యమును మహానుభావులైన బసవన్న ఈ కాలపు జీవోద్ధరణకు అవకాశముగా ఇచ్చినాడు మహాజ్ఞాని చెన్నబసవన్న, మడివాళ మాచయ్య, అప్పన్న, సొడ్డళ, మోళిగ దేవుడు మున్నగువారి శరణ సమూహమును నీతోబాటు నేనీనాడే చూచి తెలిసి కొనినాను నీ క్షేత్రనిర్మాణ కార్యరంగము ఈ జీవక్షేత్రములో నిర్మించుట సులభము నీ మొదటి రచన ఈ రచనకు సహకారిగా ఉంచుకొనవచ్చును

ప్రకృతి సిద్ధముగా గింజకు లేని గుణము నూనెకు రాదు తత్త్వము స్థూలము నుండియే సూక్ష్మకారణములకు వ్యాపకత జేయుట మంచిపద్ధతి గాన నీ ఇష్టమే నీ లింగమౌనని సిద్ధరాముని గొప్పతనమునకు శరణుల మతధర్మము నకు లోటు రాకుండ అల్లముడు నుడివినప్పుడు అందరు సంతసించినారు

సిద్ధరాముడు ఉదాత్తతత్త్వానుకూల కార్యరచనారంగమునకు ఉపకరించు అల్లముని వాక్యమును విని యోచించినాడు అల్లముని యందు మొదటినుండియు ఆరాధ్యభావంబున నడచుకొనుచు వచ్చి ఇపుడు ఆయన ఆజ్ఞ తిరస్కరణీయము కాదని "నీవారు నావారుగా సులభులగుటకు అనుగ్రహించు" డని ఇట్లను చున్నాడు

సిద్ధ రామయ్య

కావించుమయ్యా నాకు మీవారి సంగము చేయించుమయ్యా నాకు మీ వారి యానందము మీవారైనటుల కలిగించు మీవాడను భావముకలిగించు చూపించుమయ్యా మీవారితోడ సంగము చేయించుమయ్యా నాకు వట్టి భక్తినిప్పించుమయ్యా! నాకు పాదోదక ప్రసాదపుముడు పిప్పించుమయ్యా! మీవారితోడ కలిపి యుంచుమయ్యా! మీవారి పాదములక్రింద నిత్యుడనై యుండ నన్ను భవ భవంబున రావించుమయ్యా! కపిలసిద్ధ మల్లికార్జునయ్యా! నీవిటుల నా భవభవముల జన్మమును నశింపజేయుమయ్యా! ౨౦

వివేచనము

గురుదేవా! అనుగ్రహించుడు మీవారిలో నొకనిగా నన్ను చేకొని ఉద్ధరించుడు అని పై వచనార్థము ముందుంచి సిద్ధరాముడు తన సత్సంకల్పమును అల్లముని మూలముగా శరణ సమూహమునకు నివేదించు కొన్నప్పుడు శరణులు హర్షభరితులైనారు ముదముపొంది సదయ హృదయ ముతో అల్లముడు చెన్నబసవన్నను చూచి ఇట్లనుచున్నాడు

అల్లమ ప్రభు .

రత్నదీప్తియైననేమి? బంధించిన కుందన మందే యుండ వలయు! స్వాదురసము రుచినీయుఫలమన్ననేమి వృక్షము లేనంతవరకు! చిత్రసౌందర్యము చూపునకు సుఖమన్ననేమ భిత్తి పట ముఖ్యస్థానము లేనంతవరకు! అంజనసిద్ధి నిధిని కన్ననేమి సాధనక్రియవలన సాధ్యంబు కానంతవరకు; ఇదికారణము! కాయము కర స్థలమునకు ఇష్టలింగ సాన్నిహిత్యములేకున్న నిరవయజ్ఞానయోగంపు కూటంబుగాదు గాన క్రియాలింగ సంబంధమే భక్తునికి మతము

ఇదియె దేహశౌచము మాగుహేశ్వరుల శరణుల
మనంబు నొప్పునట్లు లింగసాహిత్యము గూర్చుమా చెన్న
బసవన్నా! ౨౧

**వివేచనము :**

కుందనమందు పొదగకున్న రత్నమెట్లు రాణింపదో, వృక్షము లేకయే ఆ వృక్షపు రసము ఆస్వాదనీయము ఎట్లు కాదో, భిత్తిక పటము లేక చిత్రము ఎటుల రంజనము చేకూర్చదో, అంజన సహాయమున నిధిని దర్శించినను, ఆ నిధిని బయటకు తెచ్చు సాధనము నెరుగకున్న అది యెటుల స్వాధీనము కాదో, అటులనే కాయముపై ఇష్టలింగము లేకున్న వట్టి జ్ఞానయోగము పనికిరాదు. సిద్ధరాముడు మనవి జేసుకొన్నాడు అయనకు లింగధారణము జేయుమని అల్లముడు చెన్న బసవన్నకు చెప్పగా, దీక్షావిధు లెఱిగినవాడు కావున, శరణుల సహాయముతో అల్లమ జంగమ సాక్షిగా, సకలోపకరణములను సమకూర్చుకొని, దీక్షావిధిని శాస్త్రోక్తముగా నిర్వహించుచు గురుస్థానమునందుండి చెన్న బసవన్న ఇట్లుపదేశించుచున్నాడు

**చెన్న బసవణ్ణ**

ఆణవమల, మాయామల, కార్మికమల మను మల త్రయంబును పోనాడి, ఆజ్ఞాదీక్ష, ఉపమాదీక్ష, స్వస్తికారోహణ, కలశాభిషేక, విభూతిపట్ట, లింగాయత, లింగస్వాయత - ఈ ఏడును కాయంబున కుపదేశంబు చేయవలయును

సమయ, నిస్సంసార, నిర్వాణ, తత్త్వదీక్ష, ఆధ్యాత్మిక, అనుగ్రహ సత్యశుద్ధ - ఈ ఏడును ప్రాణంబున కుపదేశంబు చేయవలయును

ఏకాగ్రచిత్త, దృఢవ్రత, పంచేంద్రియార్పిత, అహింస, మనోలయ, లింగ నిజ, సద్యోన్ముక్తి - ఈ ఏడును మనంబున కుపదేశంబు చేయవలయును

ఈ క్రమంబెఱిగి చేయుట కూడల చెన్నసంగయ్య యందు సహజదీక్ష - అయ్యా! ౨౨

**వివేచనము :**

మూడు శరీరములకు అంటుకొనియున్న మలములను పరిశుద్ధి చేయుటయే దీక్షావిధి లక్ష్యము తదుపరి క్రియా, జ్ఞానముల అనుభవముచే చేతన మిచ్చుట ముఖ్యము. కారణ తనువు నందు ఆణవ మలము, సూక్ష్మతనువు నందు మాయా మలము, స్థూలతనువునందు కార్మిక మలములుండును కార్మిక మలమునకు క్రియాదీక్ష, మాయా మలమునకు మంత్రదీక్ష, ఆణవమల నివారణకు వేధాదీక్ష ఆగత్యములైనవి ఇవి ఏడు-ఏడు ఉపదీక్షలు కలిగి పై వచనమున చెప్పినవిగా నుండును ఈ దీక్షావిధానములో ముఖ్యముగా గమనింపవలసినది గురువుచేయు సంస్కారవిశేషము ఈ విశేషమునకే "నగురోరధికం" (గురువునకు మించి అధికులు లేరు) అన్నారు పిండజన్యమును జూచి మంత్ర ప్రాణ పవిత్రుని జేయుచున్నాడు గురువు తాను గురువు అనుగ్రహమువలన తెలిసికొనినది. శివ్యుడై గురుహస్తమస్తక సంయోగముచే పొందిన పరిణామమును సిద్ధరామయ్య మననీయముగా స్తోత్రము జేయుచున్నాడు

**సిద్ధరామయ్య :**

అధ్యాత్మము అధ్యాత్మమని పలుకుదురు అధ్యాత్మ
మెవ్వరికి? శ్రీగురుస్వామి అంత్యమే లేని శివలింగమును
సూక్ష్మంబుజేసి కరస్థల మందిచ్చిన పిమ్మట వేరే యోగ
మున్నదా? హస్తమును మస్తకము పైనుంచి వాయు
ప్రాణమై యున్నదానిని చంపి లింగ ప్రాణముగా జేసిన
పిమ్మట అక్షయమగు మాయనుండి (అక్షరములైదుచే)
ముక్తుని జేసిన తదుపరి మరల యోగమున్నదే! శివయో
గము కాక? లింగార్చనము జేసి జంగమ ప్రసాదంబు
గొన్న పిదట మల జ్ఞానంబు పట్టియోగమున కబ్బునా?
ఇట్టివన్నియు విడదీసి శుద్ధ శివయోగిని జేసినవాడు చెన్న
బసవన్న. మహాలోకంబు నందున్న ఆద్యక్షరద్వయ
మును భేదించి తెచ్చి కరస్థలమందుంచి, ఇది ఉత్తర పద
మని చూపించి నన్ను తననుగా జేసెను గురువు చెన్నబస
వన్న నేను చెన్నబసవని కారుణ్యముచే అభ్యాస

యోగంబు విడనాడి, శివయోగమందు నిత్యుడనై, భక్త,
మహేశ, ప్రసాది, ప్రాణలింగి, శరణ, ఐక్యములను
షట్థ్సలముల కధికారినైతిని, మీవారి స్నేహమునకు
పాత్రుడనైతిని గురు కపిల సిద్ధమల్లికార్జునా! చెన్నబసవని
కృప నన్నిట్లు కృతార్థుని జేసియుండెను సుమా! ౨౩

**వివేచనము :**

శ్రీగురు చెన్నబసవన్న దీక్షావిధానములను ముఖ్యముగా ఇట్లిట్లని వివరించి చెప్పినాడు. వాని కీలకములను దెలిపినాడు శిష్యుడైన సిద్ధరాముడు గురుకరుణా పరిణామమును తాను పొందిన రీతి ఇట్టిదని విస్పష్టముగా సవివరముగా జెప్పి గురువందన మాచరించినాడు మొదలు తానాచరించుచు వచ్చిన అధ్యాత్మయోగ మునకు శివయోగమునకు ఉన్న శ్రేష్ఠతను తెలుపుకొన్నాడు "లింగమధ్యే జగత్సర్వం" అన్న నిగమ వాక్యమును "భక్తహస్తే జగత్సర్వం"గా జేసి అంత లంతలై ఎంతెంతగనో యున్న లింగమును ఇంతింతగా భక్తహస్తాంతర్గతముగా జేసి గురువు కరుణించినాడు వాయుప్రాణిగా నున్న శిష్యుని తన కరమందలి లింగ ప్రాణిగా మార్చినాడు అభ్యాసయోగము నుండి తొలగించి శివయోగిగా జేసినాడు భక్త మహేశప్రసాది ప్రాణలింగి శరణ ఐక్యములను షట్‌స్థలంబుల కధికారిగా జేసి చెన్నబసవ గురువు నన్ను తనవానిగా జేసికొని శరణుల సుఖ సన్నిధానమును కలుగజేసెనని బహురీతులుగా గురుస్తుతి చేయుచున్న సిద్ధరాముని నిరహంకార, నిర్మాయ, నిశ్చలతత్త్వమునకు శ్రీగురువు చెన్నబసవన్న ఆశ్చర్య భరితుడై "ఆహా! గుర్వనుగ్రహము ఇట్టివారికి నెపము మాత్రము ఎంతలో ఎంత మహత్తుగా ఎదిగినాడు నా సిద్ధుడు" అనుకొనుచు, కలిగిన సంతోషము పట్టజాలక ఇట్లనుచున్నాడు

**చెన్న బసవణ్ణ :**

ఔనౌను అంగమునకు లింగమును వెదుకవలె
గాని లింగమునకు లింగమును వెదకుదురే? ప్రాణంబు
నకు జ్ఞానమును వెదుకవలెను గాని జ్ఞానంబునకు జ్ఞాన
మును వెదుకుదురే? రెంటిని నొకటి జేసితి ననవచ్చును

గాని, ఒకటిని రెండుగా జేయరాదు కూడల చెన్న
సంగమ దేవునందలి సిద్ధరామయ్య దేవుని శ్రీపాదములకు
నమో నమో యనుచు బ్రతికితిని సుమా ప్రభు దేవా! —౨౪

**వివేచనము :**

ఆనంద భరితుడై తాను గురువను మాట మరచి, సిద్ధరాముడిప్పుడే తన శిష్యుడై ఉపదేశము పొందెననుటయు ఎంచక అతడు గడించిన మహా స్థితిని మెచ్చుకొని, "ఆహా, ఇది ఎంత తీవ్రమైన స్థితి! ముట్టియు ముట్టక మునుపే తాను తానైన ఈ లింగమునకు లింగమెందులకో! అనంత కాలము లింగ పూజలు చేసినను లింగమునకు దూరముగా నుండి తమ శరీరమును ముందు గొని నడుచుచున్నారు వినోద పూజా సంభ్రమముల విభ్రాంతిని పొందెదరు ఇందు సిద్ధరామయ్య లింగమైన రీతి మిక్కిలి ఆశ్చర్యకరము లింగమునకు లింగము గట్టినట్లు, ప్రాణమునకు జ్ఞానమబ్బినట్లు రెండొకటియైనది నేడు చూచి ధన్యుడనైతిని" అని ఉల్లాసముతో స్తోత్రము జేయుచు ప్రభు దేవునకు తన భాగ్యమును వెలుపుకొనుచు సిద్ధరాముని పాదములకు నమో నమో యనుచున్న చెన్న బసవన్న మాట విని బసవన్న భక్తి భరితాంతరంగుడై ఇట్లనుచున్నాడు

**బసవణ్ణ**

అడుగడుగునకు స్థాన నిధి అడుగడుగునకు
దివ్య క్షేత్రము అడుగడుకునకు నిధియు నిధానమునూ
కనుమా! కూడల సంగుని శరణుండు స్వతంత్రుడు
గావున ఆతడుండెడి ప్రదేశము వారణాసి, అవిముక్త
క్షేత్రము —౨౫

**వివేచనము**

బసవన్న సిద్ధరామునిట్లు కొనియాడినాడు మానవోద్ధరణకై అవతరించిన మహా పురుషుల కారణ క్షేత్రములు వేరు వేరుగా నున్నను పరిణామ మొక్కటియే మంచి రాయిలో దైవీశక్తి నావిర్భవింపజేసి జీవులకు భగవద్భక్తి కలిగించుట సిద్ధరాముని దైనచో, మానవత్వమునందే లింగముఖముగా స్వతంత్ర ఉపాసనాశక్తిని పెంచుకొని తనను తానెరుగు పరమార్థమును ప్రాప్తింపజేయుట బసవన్నగారిది

ఆకస్మికముగా అల్లముడు సొన్నలిగికు వచ్చుట, అచ్చట గర్భాణీయ క్షేత్రకార్యము నుండి ఇష్టలింగమునకు తిరిగి కల్యాణపదవిని కట్టబెట్టుట, విస్తృతముగి ఇష్టలింగ చర్చ కొనసాగి సిద్ధరాముడు లింగధారియై శరణాగ్రగణ్యుడగుట జూచి బసవరాజునకు చాల సంతసమైనది. ఔనౌను ఒకచోట నిర్మాణము పొందుచున్న క్షేత్రము ఇప్పుడు అంతయు తానెయై ఎచ్చట పాదముంచిన అచ్చట ఆధ్యాత్మ స్థానమగుచున్నది దివ్యక్షేత్రము, నిధి నిధానము - ఆహా! సంగా! మా సిద్ధరాముడున్న చోటు వారణాసియే కాదు, ఆతడు ధరయందున్న పవిత్ర క్షేత్రాలకు దివ్య చేతన స్వరూప క్షేత్రజ్ఞుడని బసవన్న కొనియాడుచుండ అల్లమదేవుడు పులకాంకితుడై ఆ సన్నివేశము నిట్లు వర్ణించుచున్నాడు

**అల్లమ ప్రభు**

పరిణామము లందు మనసు యొక్క పరిణామమే
చెలువము సంగమము లందు శరణులతోడి సంగమమే
చెలువము కాయమొంది పుట్టిన మూఢులెల్లరు చావని
మర్మము నెరుగుటె చెలువము గుహేశ్వరా! ౨౬

**వివేచనము :**

జగత్తులో అనంత సౌందర్యము లున్నవి ఆ సౌందర్యములను జూచి ఆనందించువారెందరో! దానిచే మనసు పరివర్తితమును పొందుటయు, దానిలో తనను తానెఱుగుటయు ఎంత సుందరము! ఈ సౌందర్య మబ్బినవారికి వికారము లేదు అదియునుగాక అన్ని సౌందర్యములకు ముసలితనము, వికారము కలుగుట సృష్టి నియమము ఈ పరిణామము సౌందర్య సృష్టి కతీతము ఆహా! ఈనాడు సిద్ధరామునిలో గన్న పరిణామ సౌందర్యము నా కెక్కడ దొరకును? నే నెంత భాగ్యవంతుడను! శరణుల సంగము సౌందర్యమునకు సౌందర్యము, ఎందరో పుట్టి లోటులేకుండ లోకమును నింపుచున్న మూఢులు, చావులేని మార్గమెరుగుట అన్నిటికన్న సౌందర్యము నా సిద్ధుడు సౌందర్యనిధి అని అల్లముడు కావ్యరీతిలో ఆధ్యాత్మిక సౌందర్యమును వర్ణించినప్పుడు అక్కడనున్న శరణుల ముఖ సౌందర్యము వికసించిన కమలములవలె విరాజిల్లినది

సిద్ధరామయ్య శరణ సమూహమునకు ప్రణమిల్లి చివరగా ఇట్లనుచున్నాడు

**సిద్ధరామయ్య**

భక్తిరూపు బసవన్న క్షమారూపము బసవన్న
గురురూపము బసవన్న ప్రసాదరూపము చెన్న బస
వన్న కపిలసిద్ధ మల్లికార్జునయ్యా! ప్రభువుగా వచ్చి
బసవన్న చెన్నబసవన్న యిచ్చిన ప్రసాదముగొని
జంగముడయ్యెను. —౨౭

**వివేచనము :**

ఆహా! మహాదానందము బసవన్న, చెన్న బసవన్నలందు క్షేత్రము పవిత్రమైనది. అల్లమదేవుడు జంగముడైనది వారి ప్రసాదము వలననే నా గురువు చెన్నబసవన్ననుండి నేనంతయును కనుగొంటిని ధన్యుడనైతిని

———

ఇది కృపామూర్తులైన శ్రీ మృత్యుంజయప్పగారిని, స్వప్న బోధామూర్తులైన శ్రీ ఎఱ్ఱి తాతయ్యగారిని స్మరించి, సకల శివశరణులను వందించి, శూన్య సంపాదనలోని "సిద్ధ రామేశుని గురుకరుణ"కు సంగ్రహముగా జెప్పిన వ్యాఖ్యానము సంపూర్ణము

———

శ్రీ గురు బసవలింగాయ నమః

# శూన్య సంపాదనము

## ప్రభుదేవుల పూజాస్తుతి

౧౧

కం॥ పరమ గురుడు ప్రభుదేవుడు
వరబసవని యంతిపురము పదమిడ ముదమున్
శరణులు భజియించిన విధి
విరచించెద భక్తులెల్ల వేడుక గనగా

ఇట్లు శరణుల సద్గోష్ఠులతో కాల మతిక్రమించినదే తెలియక హడపద అప్పణ్ణగారి హెచ్చరికవలన లింగార్చనవేళ నెరిగి బసవన్న తన శరణ సమూహముతో అత్యంతాదరణతో అల్లమదేవుని, సిద్ధరాముని, లోపల బసవరాజు తన పరిమిత గృహమునకు వచ్చుటకు చేయూతనిచ్చి భయభక్తి భావంబులతో లోపలకు వెళ్ళుచు మెత్తగా అడుగులు పెట్టించుచు ఉత్సాహభరితుడై ఇట్లను చున్నాడు

**బసవణ్ణ :**

మదియొడయడు ఇంటికివచ్చిన బంగారుతోరణము
గట్టి, షట్సమ్మార్జనము జేసి, రంగవల్లులు బెట్టి ఉఘే,
చాంగు భళాయందును కూడల సంగమదేవా! మీ
శరణుడు ప్రభుదేవుడు వచ్చిన ఉబ్బి తబ్బిబ్బయి సంత
సించెదనయ్యా!

**వివేచనము .**

ఆనందభరితుడై అల్లముని ఆగమనము విని సుందర మణిఖచితములు, ముత్యాల వల్లరులు ప్రేలాడగా ముత్తయిదువలు దెచ్చు కలశ దర్పణ సుగంధ ద్రవ్యములతో ముంజేతి కంకణములు కళకళలాడగా తోడ్తెచ్చి, పన్నీటి స్నాన మాడించి, ఏకాంత మఠమునకు పిలుచుకొని వచ్చి ఉన్నత పూజా పీఠమున గూర్చుండబెట్టి బసవరాజు, ఇతర శరణులు ఖమలై వచ్చి కూర్చొనగా, బసవేశుడు పాదార్చనము సేయుచు కొనియాడి అభివర్ణించుచు, తన భాగ్యమునకు తానె పొగడుకొనుచు పరవశుడై నివాళులెత్తి మధురముగా మంగళమును పాడుచున్నాడు

**రాగము - లలిత**

జయ జయ శ్రీ మహాదేవ జయ జయ శ్రీ మహాదేవ
జయ జయ శ్రీ మహాదేవునికి శరణును నా మనము ॥పల్లవి॥

ఓం భూః ఓం భువః ఓం సువః అనుచున్నదీ మనము
భర్గో దేవస్యధీమహి శరణును నా మనము ౧

యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ
తస్మై శ్రీ గురవే లింగమా శరణును నా మనము ౨

దేహ రూపం కాయ సంబంధం గురురూపం ప్రాణసంయుతం
ఆశరీరాత్మ సంబంధం గురులింగ చరానుగ్రహం అన్నదిగాన ౩

దీర్ఘదండ నమస్కారం నిర్లజ్జం గురుసన్నిధౌ
శరీర మర్థం ప్రాణం చ సద్గురుభ్యో నివేదయేత్ అన్నది గాన ౪

భవ రోగ వైద్యుడనుచు నమ్మను నా మనము
కూడల సంగమదేవునకు శరణును నా మనము ౫

ఇటుల బసవరాజు ప్రభుదేవునకు అష్టవిధార్చన, షోడశోపచారములు చేసి, అభివందన మాచరింపగా, తదుపరి (చిక్కదణ్ణాయకుడు) చిన్నదణ్ణాయకుడు ప్రభుదేవునకు శరణనుచు పాదార్చనము సేసి పాదోదకముగొని నుతించు చున్నాడు

**వచనము**

అంగము మీద లింగమున్న దంతయు సంగమ
నాధుడను భావంబు బసవన్నకై యుండె నాకా భావము
లేదు సుమా లింగైక్యుల శరణుల గనిన నమ్మి నచ్చి వారి
పాదములకు నా మనము వందనం బాచరించు వారిని కనిన
కరుణామృతమును గురియును నాకు మనము వారి
పాదములకు అష్ట విధార్చనము షోడశోపచారంబులం
చేయును కూడల చెన్నసంగమదేవా! మీ ప్రభువను
జంగముని గని పూజించి, పూజించి ఆయాసము పొంద
దీ మనము ౨

ఇటుల చెన్నబసవన్న పూజచేసి కొనియాడిన తరువాత మడివాళ మాచయ్య, సొప్పళ్ళ బాచిరాజు, సిద్ధరామన్న, హడపదప్పణ్ణ మఱియు కల్యాణములోని శరణులు వచ్చి అల్లమ దేవుని ఆరాధించి వరములను బడిసి ప్రసాద స్వీకారానంతరము కథాసుఖసంవిధాన వినోదమున ప్రభుదేవుని ఒడ్డో లగ మిచ్చియుండిరి

—o—

ఇది కృపామూర్తులైన శ్రీ మృత్యుంజయప్పగారిని, స్వప్న బోధాయూర్తులైన శ్రీ ఎర్రి తాతయ్యగారిని స్మరించి సకల శివశరణులను వందించి శూన్య సంపాదనలోని 'సిద్ధరామేశుని గురుకరుణ' కు సంగ్రహముగా చెప్పిన వ్యాఖ్యానము సంపూర్ణము

—o—

శ్రీ గురు బసవలింగాయ నమః

# శూన్య సంపాదనము

## ఆయ్దక్కి మారయ్యగారి సంపాదనము

౧౨

కం॥ పిడికెడు బియ్యం బేరుచు
జడియక దాసోహ మమర శరణులకెల్లన్
నడపిన ఘనుడగు మారయ
కడు విమలంబైన దివ్య గాథను వినుమా!

కల్యాణ పట్టణములో ఎవరికివారే పరాధీనులై యుండి బ్రతుకక తమకు ఇష్టము వచ్చిన కాయకము చేయుచు, వచ్చిన సంపాదనము నుండి గురు లింగ జంగమములను తృప్తిపరచి ప్రజలు సుఖముగా జీవించుచుండిరి ఇట్టి వారిలో ఆయ్దక్కి మారయ్య అను శరణుడు తన భార్య లక్కమ్మతో శివశరణుల వీధులందును, సందు గొందు లందును జల్లబడిన బియ్యపు గింజల నేరుకొని వచ్చు కాయకముతో నుండువాడు ఇతరుల కది కష్టమనిపించిన ఎవరి వస్తువును దోచుకొనక, ఎవరిని అడుగక, శివశరణులు మరపున జల్లిన పిడికెడు గింజలేరుకొని వచ్చు కాయకముతో జీవించుచుండు వాడు ఆ పని ఆయన స్వభావమున కనుగుణముగా సులభముగనే యుండెడిది

ఇట్లుండగా ఒకనాడు అల్లమదేవుడు ప్రమథాది శివశరణులతో అనుభవ మంటపమునందు కొలువుదీరి యుండగా ఆయ్దక్కి మారయ్య వచ్చి సభకు శరణార్థము లర్పించి", నాదొక మనవి వినుడు'' అని ఇట్లనుచున్నాడు

**అయ్దక్కి మారయ్య**

కాయకంబునందు నిరతులైనపుడు గురు
దర్శనంబైనను మరువవలయు లింగపూజనైనను
మరువవలయు జంగముడు ముందున్నను దాక్షిణ్యము
లేకుండ నుండవలయు కాయకమే కైలాసము
ఆ కారణముచే అమరేశ్వరలింగమైనను కాయకములోనే ౧

**వివేచనము :**

మహానుభావా! బసవేశ్వరా! నా పేరు మారయ్య ఈ కల్యాణ పట్టణము లోనే భార్య లక్కమ్మతో బియ్యపు గింజ లేరుకొను కాయకమునందుండి గురు లింగ జంగమ దాసోహంబు చేయుచున్నాను అవలంబించుకొన్న నా కాయక మాచరించుకొనుచున్నాను నా కాయకపుటాచారపద్ధతిని చెప్పెదను ఆలకించండి

నేను కాయకమున నిమగ్నుడనై యున్నప్పుడు గురుదర్శన వేళయైనను గమనించను లింగపూజకు వేళయైనను ఆతురత పొందను జంగముడు వచ్చి ముందు నిలబియున్నను చేయు పనిని వదలిపెట్టి ఆయన పాదములకు వందన మాచరించను ఇది గురు లింగ జంగమ తిరస్కారమని భావింపను నా కర్త వ్యమును పనివేళలో నిష్ఠతో చేయుటయే ముఖ్యమని యెంచెదను ఈనాడు కాయకమే కైలాసమని తలచి శరణులు తమ కాయకము చేయుచుండగా నేనును దానినే అనుసరించినాను

ఇదిగాక మరియొక మనవి

నేమంబులు జేసికొనుచు భక్తుల ఇండ్లకువచ్చి
కాయకమును తుడిచి రూకలు వస్తువులను కోరెదననుట
సద్భక్తునకు కష్టముకదా! అనుసరణీయము కాదుకదా!
ఆ గుణము అమరేశ్వర లింగమునకు దూరము ౨

**వివేచనము .**

"నాకును నియమమున్నది ఎవరికిని అవసరములేని గింజల నేరుట అను నియమము దానివలన నె నెవరికిని కష్టము కలిగింపను. కాయకములో

స్వతంత్రత ముఖ్యమైనది ఏ నియమములైనను కాయకమందు అవలంబించు టకు ఏర్పరచుకొనుటకు స్వాతంత్ర్యముండును అయినను ఆ నియమములను ఇతరులపైన మోపి ధన సంగ్రహము చేయుటకు ఎవరికిని అధికారము లేదు దానము పొంది ఆర్జించినది కాయకము కాదు ధర్మమునకనుచు, పుణ్యమున కనుచు భక్తులను బలవంతము చేయుటయు కాయకము కాదు కష్టార్జితమే కాయకమని పెద్దవారి సేవ చేయుచున్నాను" అనినాడు మారయ్య ఎందులకో ఏమో కాని ఆ దినము కాయకమునకు వెళ్ళక-తాను ఆచరించు కాయకము శ్రేష్ఠమని చెప్పుటకై అనుభవ మంటపమునకు వచ్చినాడు పైరీతి తన ఆచరణమును చెప్పగా ఆయన కాయక నిష్ఠను శరణులు మెచ్చుకొన్నారు అల్లముడు సంత సించినను సందేహము కలిగినందున ఇట్లు ప్రశ్నించుచున్నాడు

**అల్లమ ప్రభు**

కన్నుల ముందున్న గురిని పీడి, కామ్యము
ముందున్న చిత్తమును విడిచి చేసితి నన్నమాట కూటపు
చిత్తమున నిలచిన గాని స్వాస్థ్యత లేదు అటులగాక
గుహేశ్వర లింగము కానరాదు అయ్దక్కి మారయ్యా! 3

**వివేచనము .**

అయ్యా! నీ కాయకనిష్ఠ ప్రశంసనీయమే గురు లింగ జంగమములకు మించినది ఈ కాయకము కైలాసమనుకొని నందువల్ల నీవు చేయు కాయకము కష్టకరమైనను ఆనందముతో చేయుటచే అభినందనీయమే ఒక మాట ఎంత వఱకు చేసెదనని చెప్పుచుందువో అంతవఱకు నెమ్మదిరాదు చేయుట, చేసి సంపా దించిన దానిని వినియోగించుట, అది ఇది చేసితినని దాని గుణదోషము తెంచక ఇతరులగుఱించి చెప్పుకొనుట తప్పదు ఈవిధానము కాయకమున కంత సమర్ప కము కాదు ముందున్న కార్యరంగము, వెనుకనున్న జ్ఞానరంగములోని అహం కారము సమసిపోయి, చేసితి నన్నమాట, కూటములు నిర్వంచకత్వమును పొంది చేసినది మరచినపుడు కాయకము కైలాసము కాగలదు అని అల్లమదేవుడు మారయ్యకు చెప్పినప్పుడు అతని వాదము విచిత్రమై తోచగా దానికి సమాధాన మేమి చెప్పవలయునో కొంత తడవు యోచించి మారయ్య ఇట్లనుచున్నాడు

అయ్దక్కి మారయ్య :

తొడిమ విడనంతవరకు - మరి వేరుల ఆసర యుండవలయు. మర్త్యభావమున్నంత వఱకు సత్య శరణుల సంగమము, నిత్యజంగమ సేవాకృత్యము ఉండవలయును - అమరేశ్వర లింగమును తెలియునంత వఱకు ౩

వివేచనము :

అది ఎట్లు స్వామి? చేయుట అనునది ఎంతవరకుండునో, చెప్పుట అనునది అంతవఱకుండును చెప్పుట దోషమా? చేయుట దోషమా? లోక వ్యవహారముండు నంతవఱకు, అది యిది యని భేదముండు నంతవఱకు వానిని వదలుట ఎట్లు? తమకు ఎదురు చెప్పునంతటి తెలివి నాకు లేకున్నను, తెలిసికొనుట కడుగుచున్నాను

చెట్టు నుండి పండు పక్వమై రాలునంత వఱకు ఆ చెట్టుతో సహాయ ముండవలెను దీనికి విరుద్ధముగా చెట్టే తనకు కావలెనని చెట్టును నరికిన, ఉన్న ఫలమునకు కాబోవు ఫలములకు తావెక్కడిది? ఎన్ని నాళ్ళు మనము ఈ లోక మునకు దాసులమై యుందుమో, అంతవఱకును శరణ సంగమము, జంగమ సేవ నిత్యకృత్యములుగా చేయవలయును గదా! ప్రభు దేవా! అని చేయుటను గూర్చి అయ్దక్కి మారయ్య చెప్పినది విని అల్లముడు ఇట్లనుచున్నాడు

అల్లమప్రభు :

చేయు చేతనుండియే వేరొండు తెలియవలయును
తెలివికి నమ్మకము చేకూర వలయును తెలివికి నమ్మకము
చేకూరిన వెనుక బయలను భ్రాంతి విడిచి మా గుహేశ్వర
లింగమందు నిజపదంబు చెందవలయు మారయ్యా! ౪

వివేచనము

అయ్యా! మారయ్యా! నీవు చెప్పినది సరే! అ అర్థములో నేను చెప్ప లేదు చూడు, నీవు చేసితినని చెప్పునంతవఱను 'నేను-నేను' అను అహంకారము

ఎంతలేకున్నను చేసినదాని శ్రేష్ఠత ఉండియే యుండును కావున చేయుదానిలో తననెఱుగు విధానము నెఱుగవలయును ముఖ్యముగా ఆ ఎఱుకయందు నమ్మకమును పెంచుకొనవలయును తదుపరి నమ్మకము స్థిరమైనపుడు భ్రాంతి దూరమగును అప్పుడు నీవు గురులింగజంగమ విషయముగా కాయకముతో పోల్చి చెప్పినది నిజమగును అని అల్లమ దేవుడు చెప్పుచువచ్చిన కాయక విచారము వినగా వినగా క్రొత్తదయినట్లు తెలిసికొని, చేయునంత వఱకు నిజము తెలియదు నిజము తెలిసికొనక మరణ పర్యంతము చేయగా కలుగు ఫలమేమిటి? యని ఆయ్దక్కి మారయ్య అల్లమదేవునకు ఇట్లు మనవి చేయుచున్నాడు

**ఆయ్దక్కి మారయ్య**

ఔనుగదా! చీమలు పెట్టుకొన్న పుట్టలు పాములకు
ఇరవైనయట్లు నే నక్కడి ధనమును దెచ్చి ఇక్కడ
చేయగా నాకింకెక్కడ ముక్తి కలుగును? ఘన మహిమ
గల శరణుల సంగమ మందు ఘనమునకు గల ఘనము
వేద్యమైన వెనుక తెలివి జారి మరపు నష్టమై అమరేశ్వర
లింగమందు నిజ పదమును చేకొని ప్రభు దేవుని శ్రీ పాద
ములకు నమో నమో యనుచుంటిని ౬

**వివేచనము** •

అహా! ఇన్నాళ్లకు నిజము తెలిసినది ఎన్నాళ్లయినను ఏమి చేసినను ప్రయోజనము లేదు. ఎక్కడ నుండియో ఎవరిదో నాది అనుకొని తెచ్చికొని ఇక్కడ దాసోహము చేయగా వచ్చునది ఏమి కలదు? చీమల పుట్ట పామునకు ఇరవైనట్లు ఇదియు -దనంతే నన్ను నేనెఱుగు సాధనమనిన శరణుల నిత్య సహవాసమున దొరకును తత్త్వ చింతన యందు గల ముక్తి బియ్యపు గింజలో నున్నదనిన నగుబాటు కాదా! చేయుట-చేయుట అనునది ఎన్నటికిని ముగియదు కాయక మనిన గొప్ప విషయమే-కష్టము చేయవలసి యుండును గదా! యని ఇంకేమేమియో క్రొత్త భావాలు తెలిసికొనినట్లు ఆనంద పరవశుడయి శరణ గోష్ఠిలో చేరినాడు అచ్చట లక్కమ్మ కాయకము చేసి భర్త వచ్చు వేళ మీరి నందున అనుమానముతో అచ్చట నచ్చట వెదకుచు, అనుభవ మంటపమందు

నిశ్చింతగా కూర్చొని యున్న మారయ్యను జూచి, నిజము తెలిసికొని శరణ సమూహమునకు దండ ప్రణామము లాచరించి భర్త దగ్గఱకు పోయి మెల్లగా ప్రియముగా నిట్లనుచున్నది

**అక్కమ్మ :**

కాయకము నిలిచె పోవయ్యా నా ఏలికా! భావశుద్ధి
కొని మహా శరణుల తిప్పల ప్రక్కలందు బియ్యపు
గింజలేరి తెచ్చుట నిశ్చయ బుద్ధితో చేయవలయు
మారయ్య ప్రియ, అమరేశ్వర లింగమునకు, వేగమే
పొమ్ము మారయ్యా! ౭

మఱియు

అంగంబు మరచి, ఎఱుక అను అంగంబు నందు
కోరిక తీరిన హస్తమందు తండులము లేరి తెచ్చి
యుక్తమై అర్పింప, ప్రమథుల ప్రాంగణములకు వేగం
బున పోయి కొని రావయ్యా, మారయ్య ప్రియ
అమరేశ్వర లింగమునకు, మారయ్యా! ౮

**వివేచనము :**

కల్యాణ పట్టణములో లక్కమ్మ ఒక లెక్కకువచ్చు మహిళకాదు ఐనను ఆమెయందు నిక్షిప్తమైయున్న జ్ఞానభండార మపూర్వము ఆ కాలమునందు వచనరచనలు చేయు శరణ సమూహ మందు ఆమె ఒకతె ఏదో వేసరికతో చేయు కాయకమును విడిచిపెట్టి జ్ఞాన విచారమును వినుచు కూర్చొనిన తన మగని దగ్గఱకు వచ్చి "నన్నేలుకొన్న దొరా! నా భాగ్యమైన సిరి - కాయకము నిలచిపోయినది ఇది శివానుభవగోష్ఠి విను సమయముకాదు నీవు చేయు పనియే శివానుభవము లెమ్ము వేళ మించిపోయినది నీవెన్నడును ఈ విధముగా చేయలేదు మాకై మేము కాయకము చేయుచుండుట లేదు ఇది తెలివియను అంగముతో ఆశలేని హస్తమందు గింజలు తెచ్చి గురు లింగ జంగ మార్పణముగా చేయుచున్న కాయకము దీనిని విడచుటకు వీలులేదు తండులము లేరుకొనిరమ్ము" అని! నమ్రతతో పలుకగా మారయ్య మారు మాటాడ లేదు సతీపతుల రహస్యసంభాషణ మెవ్వరికిని తెలియదు మారయ్య లేచిపోయి

నాడు లక్కమ్మ ఇంటిత్రోవ పట్టినది దీనిని బసవన్న గ్రహించి తగు ఏర్పాటు చేసినాడు అల్లమప్రభుడు చెప్పిన దానిని క్షణములో మాయముజేసి లక్కమ్మ మూల కాయక తత్త్వమును చెప్పినది అనుష్ఠానమునకైనది, క్రొత్తదాని నేమియు ప్రభుదేవుడు చెప్పియుండ లేదు వేరుగా తెలిసికొనున దేదియు లేదను విషయము లక్కమ్మ చెప్పినప్పుడు తెలిసినది.

అర్దయక్కి మారయ్యకు ప్రొద్దు చాలదు అక్కడ నిక్కడ జూచి బసవ రాజు వంటసాల భవనమునకు మారయ్య పోయినాడు అక్కడి అంగణములో బియ్యపు గింజలు పడియుండగా చూచినాడు అవసరముగా (వేవేగముగా) ఆ బియ్యపు గింజలను మూటకట్టికొని ఇంటికి వచ్చినాడు అట్లువచ్చిన మారయ్యను చూచిన తోడనే లక్కమ్మకు కాయకమునకు భర్తను పంపిన సంతోషమంతయు చెదరిపోయినది తనభర్త బసవన్న ఇంటిదగ్గఱనున్న బియ్యమును తెచ్చినందు లకు చాల నొచ్చుకొని లక్కమ్మ ఇట్లన్నది

**లక్కమ్మ :**

సందడించి మనసులోని హర్షాతిరేకముతో బస వన్న అంగణమునకు పోయి తిప్ప ప్రక్కనున్న బియ్య మును మూట కట్టుకొని చాల సొగసుగా అధికముగా తెచ్చితివి కదా! ఎప్పటిరీతి బియ్యపు గింజలే చాలు మిగిలిన గింజలను కొనిపోయి తెచ్చిన చోటనే చల్లు మారయ్య ప్రియ, అమరేశ్వర లింగమిచ్చిన కాయకమే చాలు మారయ్యా! ౯

మరియు

అంగమునకే పేదరికము గాని మనసునకు పేదరిక ముండునా? కొండ బలమైనదైనను, ఉలి మొనయందు దారిద్ర్యమున్నను (చిన్నదైనను) తెగకుండునా? ఘన శివభక్తులకు దారిద్ర్యమ్ము లేదు సత్యవంతులకు దుష్కర్మమ్ము లేదు నాకు మారయ్య ప్రియ, అమరేశ్వర లింగమున్నంతవరకు నా కెవరి దయయు నక్కరలేదు మారయ్యా! ౧౦

మరియు

ఉన్న మనసును విడచి పర మనసుతో తెచ్చితిరి
ఇది మీ మనసో లేక, బసవని అనుమాన చిత్తమో! ఇది
మారయ్య ప్రియ అమరేశ్వర లింగమునకు చెల్లని కూడు
దానిని అక్కడనే పడవైచి రమ్ము మారయ్యా! ౧౧

**వివేచనము :**

ఎవరును అనుకరించలేని విశేషమైన కాయకము మీది మా లింగయ్యకు ఆ కాయక ప్రసాదము నందే మిక్కిలి ఇష్టమేమో! అది నాకెంతో సంతోష మగును. ఈనాడు నేను చెప్పిన వెంటనే మారు మాటాడక కాయకమునకు వెళ్ళితిరి. బసవన్న ఇంటికి పోయినను తప్పని కాదు బీదవారని ఒకరికి నిర్ణ యించిన బియ్యమును తెచ్చుట సరియైన పని కాదు గింజ లేరుకొనుట మన కాయకతత్త్వము గాని, కుప్పలను మూటగట్టుకొని తెచ్చుటకు చెల్లదు ఉన్నవారు చల్లవచ్చును దానిని గువ్వ, కాకి, కోడి తినునట్లు మానవుడు తినవచ్చునా? అందునను పేదరికమే లేని శివుని నమ్మిన సద్భక్తుడు ఆ విధముగా ప్రవర్తిం చుట ఎంత హీనమైనది! మీరు తెలియనివారు కాదు కదా! బసవన్న ఇంటి అంగణములో వీనిని ఎక్కడినుండి తెచ్చినావో అక్కడనే చల్లిరా

పేదతనమనునది దేహమునకే గాని మనసునకు కాదయ్యా! ఉలిమొన చిన్నదైనను బలమైన కొండను చీల్చివేయదా? శివభక్తులేనాటికిని దరిద్రులు కారు. లోకమున నశించు పదార్థవిశేషములను ఐశ్వర్యమని యెంచి వానిని సంగ్రహించిన వానిని శ్రీమంతుడందురు అనశ్వరుడైన ఈశ్వరుని నమ్మిన వాడెట్లు లేనివాడగును? సత్యవంతులను దుష్కర్మ మంటగలదా? నా మారయ్య ప్రియుడు అమరేశ్వర లింగమున్నంతవఱకు ఎవరి అసట అవసరములేదు

కాయకమునందు ఒకే మనసుండవలయును ఆ మనసుతో తెచ్చినదే లింగార్పితము మనసు చలించి తెచ్చినది ప్రసాదము కాదు ఈనాడు తెచ్చినది మీ మనసో, లేక బసవన్నగారి చిత్తమో! ఏమైనను లింగార్పితముగాని ఈ బియ్యము మనకు వద్దు తెచ్చిన చోటనే పడవేసి నిత్యకాయకమట్లు ఏరు కొని తెమ్ము- అని లక్కమ్మ మారయ్యగారి ఆపను ఉపసంహరించి లింగైక్య

భేదమును హెచ్చరించినప్పుడు ఆమెయొక్క సూక్తాభిప్రాయమును మెచ్చుకొని, ఏదియో జ్ఞాపకమునకు రాగా ఆయ్దక్కి మారయ్య ఇట్లనుచున్నాడు

**ఆయ్దక్కి మారయ్య**

*గంగవాళుక సమాన రుద్రులందఱు తాము
తాము వచ్చిన చోటునకు త్రోవ కనుగొనిరి ప్రమథ
గణంబు లందఱు ప్రమాణమున్న త్రోవ బట్టిరి
అమరేశ్వరలింగమందు నాకు జ్ఞానంబు నిలుచు తావెక్క
డనో చెప్పవే! ౧౨

**వివేచనము :**

కాదనరాని దానినే చెప్పితివి అగాధమైన ప్రజ్ఞావంతురాలవని నాకు తెలియలేదు తెలివినే భార్యగా పొందిన భాగ్యవంతుడను. ఒకమాట మొదటిది నీయొద్దే చేసెదను అసంఖ్యాకులైన సమాన రుద్రులు, ప్రమథ గణములు అప్పుడే తాము వచ్చిన చోటుకు పోవగా తగు వ్యవస్థలు చేసికొనుచున్నారని వినియున్నాను నిజమైనను, కాకపోయినను, ఏనాటికైననూ ఒకనాడు ఇక్కడ నుండి కదలవలెనుగదా! అప్పుడు నాకు నిజముగా స్థిరమైన తావు ఎక్కడ గలదో అది నీకు తెలియును గావున దాని నడుగుచున్నాను. అని తన భర్త పెడత్రోవ త్రొక్కినందులకు వేసరపాటుపొంది లక్కమ్మ కొంచెము కఠినముగా ఇట్లనుచున్నది

**లక్కమ్మ .**

చేయుపని యున్నంతవఱకు వేరొక్కపదవి గొడవ
ఎందులకు? దాసోహమను సేవను వదలిపెట్టి చేతగాక
కైలాసమను ఆసవద్దు మారయ్యప్రియ అమరేశ్వరలింగ
మున్న స్థానమే కైలాసము ౧౩

* గంగా తీరములో గణింపరాని ఇసుక (శరణ వాఙ్మయమందు లెఖ్ఖ లేనిది అను మాటకు ఉపమానముగా వాడుకొను పారిభాషిక పదము)

మఱియు

చేసిపోసి పోయెదనన్న కైలాసమేమి చేకూలియే?
ముందొంటి కల్పింపక, వెనుకనొకటి భావింపక నిశ్చ
యముగా నున్నప్పుడే మారయ్య ప్రియ అమరేశ్వర
లింగమున్న స్థానమే కైలాసము ౧౪

వివేచనము

అదెందులకు కైలాసము త్రోవ త్రొక్కినారు? చేతి నిండుగా పని యున్నది కదా! ఈ రోజు కాయక నియమము తీరలేదు చేసిన పొరపాటును దిద్దుకొనలేదు దాసోహము చేయరాని చేతకానితనము కైలాసమును జ్ఞప్తికి తెచ్చును. స్వామి! ఆ నిశ్చేతనపు కైలాసము వద్దయ్యా! నా రాజా!

చూడుము ఇక్కడ చేసిన పనికి ఎక్కడనో చూడని కైలాసమా? కాయకశీల శరణుడు ముందు వెనుకలు చూడడు క్రిందుమీదు లెక్కింపడు ఎక్కడ మీరు నిశ్చలముగా నిలబడుదురో అక్కడనే కైలాసము మఱి యొక భావము పామరత్వము అని లక్కమ్మ నిర్ణయముగా కైలాసమును, ఇక్కడ చేసిన కార్యమునకు రాగల కామ్యైక కైలాసమును ఖండించి నిజ కైలాసార్థము చెప్పినప్పుడు మారయ్యకు దిక్కుతోచలేదు మరల కైలాసమును గురించి అడుగుటకు వీలులేదు అడుగునది లింగాంగ సామరస్యము అదెట్లు సాధ్య మగునో అడుగవలయునని మారయ్య అప్యాయముగా ఇట్లనుచున్నాడు

అయ్యుక్కి మారయ్య

అంధునకు జీవమున్నను కన్నులతో కని నడువ
గలడా? నీవు సతివై నేను పతినై ఉభయుల ప్రాణము
లేకరూపమై యోగాంగనా, అమరేశ్వర లింగమును
జూపవే! ౧౫

వివేచనము

లక్కీ! నా మాటవింటావు కదా! చూడు నీవన్నియు తెలిసిన దానవు గ్రుడ్డివానికి జీవమున్నప్పటికిని చూడలేడు పోవలసిన చోటుకకు పోజాలడు

మనమిద్దఱము ఒకటే ఐనను నీవు మహాయోగాంగనవు నా భవిష్యత్తు తెలిసిన దానవు ఆ కైలాసపు గొడవ నీవు చెప్పినట్లు వద్దుగాని, ఈ లింగము అంగములో సామరస్యము పొందు రహస్యమైనను చెప్పుము అని మిక్కిలి ప్రియముగా మారయ్య అడిగినప్పుడు అక్కమ్మ ఇట్లనుచున్నది

**అక్కమ్మ**

పూజసేయునంత వఱకు పుణ్యఫలము కానసగును
మాటము (చేయుట యనునది) న్నంత వఱకు మహా
ప్రమథుల సేవా సన్నిధి భాగ్యంబు దొరకు మాటము
లేని వాని భక్తి పాడూరు వంకరకు కోలబట్టినట్లయ్యె
చేయునంత వఱకు ఉభయమును మాని చేసినట్లయిన
అది మారయ్య ప్రియ అమరేశ్వర లింగమును చేరుచోటు ౧౬

మఱియు

ఏ విత్తనమును చల్లినను మొలచు మొనకు వెనుక
ముందులుండునే? నీవు మఱచితివనినను, నే నెఱిగితినని
నను వేరొక కాయమున్నదే? మూలము నష్టమైన మొల
కెత్తకుండు కూటమునకు సతి-పతియను నామములు కాని
ఎఱుకకు మఱియొక కాయముండునే? వేఱొక అడుగిడ
వలదు-మారయ్య ప్రియ అమరేశ్వర లింగమును తెలియ
వలెననిన ౧౭

**వివేచనము .**

ప్రియ మారయ్యా! మీకు చెప్పునంతటి జాణనుకాను తెలిసి తెలియని వానివలె ముగ్ధుడవై అడుగుచున్నావు కాయకము చేయుటలోనే తెలివిడియున్నది లింగపూజలు చేయునంతవఱకు పుణ్యఫలము లుండుట సహజము ఆ ఫలమును జంగమార్పణము చేయుటయే మంచిది లేకున్నచో ఫలము - పదము రెంటిని అనుభవించుటకు జన్మము రాగలదు ఎంతవఱకు చేయుట యుండునో అంత వఱకు శరణ సంగభాగ్యముండును ఇది చేయకుండినచో పాడుబడిన ఊరి వాకిలికి కావలియుండి నట్లగును చేసెదననుట,చేయననుట ఈ రెంటిని మానినపుడే లింగైక్యము

ఇది ప్రకృతి చిత్రము రైతు ఏ విత్తనమును మొలకెత్తు దిక్కుచూచి చేనులో విత్తడు ఎట్లు విత్తినను మొలకెత్తును గదా! అటులనే నీవు మరచిన నేమి, నేనెఱిగి యుండిననేమి వేరొండు ఒడలున్నదే? ఇంకొక విషయము విత్తనముపై పొట్టుదీసి నాటిన మొలకెత్తదు ఇంకేమి చెప్పవలయును? కూటము నకు సతిపతియను పేరులున్నవిగాని వేరేమున్నది? ఇంకొకదానిని తలచవలదు. నీ నిర్మల చిత్తము నిలచినచోటనే లింగైక్యమున్నది ఈ విధముగా బోధాత్మక ముగా కాంతాసమ్మితముగా చెప్పుచు వచ్చిన లక్కమ్మ పలుకులు విని హర్ష భరితుడైన మారయ్య త్రివిధదాసోహమే సచ్చిదానంద బ్రహ్మమని అవగతము చేసికొని పరమ శాంతభావంబున పరవశుడై యున్నప్పుడు లక్కమ్మ తన ఇష్టము నెరవేరినదని యెంచి ఇప్పుడే తన యుద్దేశము నెరవేరగలదని యెంచి గోముగా మగని కిట్లనుచున్నది

**లక్కమ్మ :**

బసవన్న చెన్నబసవన్న ప్రభుదేవుడు మొదలగు
నియమ నిత్యకృత్య సర్వ సమూహ నిత్య నియమ
జంగమ భక్తులు గణంబులు మున్నగు సమూహ సంప
దంబునకు నైవేద్యవేళయైనదని చెప్పిరావయ్యా! మారయ్య
ప్రియ అమరేశ్వరలింగని మహా గృహమందు పదార్థము
సిద్ధమైయుండె ౧౮

**వివేచనము :**

పోయి ఈ తండులములు బసవన్నగారి ప్రాంగణము నందే చల్లి వారితో పాటు లక్ష తొంబది యారువేల గణ సమూహము తోడను, ప్రభు చెన్న బసవన్న మొదలగు వారలకు అమరేశ్వర లింగ భవనమునకు ప్రసాదమునకు రావలయునని విన్నపము చేసి రమ్మని లక్కమ్మ ఒకే ధాటిగా చెప్పినపుడు మారయ్య అదరిపడినాడు రక్త చలనమే నిలచినట్లయినది మారయ్య వెరగు కన్నులతో 'ఇది నిజమేనా?' అని యడిగినాడు నిర్వికారముగా లక్కమ్మ తల ఊపింది శివ శివా ఇదేటి మాటయని మారయ్య ఇట్లడుగుచున్నాడు

**ఆద్యక్కి మారయ్య .**

గణ సమూహమని కూడి, (చర్చలు) చేయుచుండ
సమయపు నొప్పి కెడమై, మాటము (కాయకము) నందు
సందేహంబు పొంగి, మాటకు లోనై సదన్న భక్తి, నీతి
చిక్కియుండె, అమరేశ్వర లింగమునకు దూరమై
యుండె ౧౯

**వివేచనము**

లక్కీ! ఇది సాధ్యమా? ఊరకుండక మన యోగ్యతను మించిన ఈ పెద్ద పని చేయుటకు పోయి సమయమునకొక మాట - మాకొక మాట చెప్పుచుంటివి మన ఇద్దరికిని చాలని ఈ చిన్ని కుటీరము అంత గణ సమూహమునకు సరి పోవునా? పేదవారమైన మనకు లేనిపోనిది సాధ్యము కానిది చేయబోయి ఉన్న మానమునకు హాని చేసికొనుట కన్న దీనికి ఏ ఫలితమున్నదో నీవే చెప్పుము ఇది మన భక్తికి తగునా? మా కాయక నీతికి సరిపడునా? అని మారయ్య ఇంకను భీతితో చెప్పబోవుచుండ కోపముతో లక్కమ్మ గద్దరించినది

**లక్కమ్మ .**

మనశ్శుద్ధి లేని వానికి ద్రవ్యంపు దారిద్ర్య
ముండును గాని, చిత్తశుద్ధిచే కాయకము చేయు సద్భక్తు
నకు ఎక్కడ జూచిన అక్కడనే లక్ష్మి తానై యుండును-
మారయ్య ప్రియ అమరేశ్వర లింగము సేవ యున్నంత
వఱకు ౨౦

**వివేచనము .**

అమరేశుని నమ్మి పొమ్మని ఎన్నిసారులు చెప్పినను సత్యమొకటె దౌర్బ ల్యమే దారిద్ర్యము ధృతియె ఐశ్వర్యము శివభక్తులు పేదలు కారు ఎవరిని మన మారాధించెదమో వారే మనకన్ని సదుపాయములు కల్పింపగలరు చిత్త శుద్ధితో మెలగువారికి ఏ కొరతయు లేదు ఎక్కడ జూచిన అక్కడనే లక్ష్మి యుండును ఎందఱు వచ్చినను అందఱకు అమరేశ్వరుని మందిరము చోటు నొసగి ఆదరించును అనగా, ఆద్యక్కి మారయ్య భార్యపలుకు ధైర్యముగల

మాటలను విని అనుమానమును విడచి అక్కడనుండి బిరబిర పోయినాడు లక్కమ్మ బసవాది ప్రమథులను స్మరించి, ఎవరెవరికి యే యే ప్రసాదములు నియమములు కలవో తెలిసికొని అమరేశా, నీ యిష్టము అని తనపనిలో తాను న్నది అప్పుడు వచ్చిన మారయ్య బసవన్న ఇంటిముందు బియ్యపు గింజలు చల్లి చేతితట్టిలో విభూతి నుంచుకొని ఎలుగెత్తి ఇటుల పిలచుచున్నాడు

**అయ్యక్కి మారయ్య :**

సత్యమను పళ్లెరమందు చిత్తశుద్ధియను విభూతిని
గుప్తపఱచి, సర్వసంపద ప్రమథులు మొదలుగాగ అమ
రేశుని లింగ మూర్తియ మందు ప్రసాదము స్వీకరింపగా
రండయ్యా సంగన బసవన్నా! ౨౧

**వివేచనము :**

ఆహా! అది యెంత సుసంస్కృతమైన అహ్వానము! ఆ యాహ్వానమునకు సత్యమే పళ్లెరము చిత్తశుద్ధియే విభూతి సర్వగణ సమూహము అమరేశుని శివనమునకు ప్రసాదమునకు రావలయును ఎక్కడను తన ప్రసంగము లేదు. తన పేరును లేదు పిలుచువాని పేరు అయ్యక్కి మారయ్య అమరేశుని బంటు ఈ పిలుపు విని బసవన్న బయటకు వచ్చి చూడగా మారయ్య, శరణార్థి యన్నాడు బసవన్న మారయ్య శరణు శరణని మఱియొకసారి విన్నవించు కొన్నాడు బసవన్న జంకినాడు శంకతో తనలో తానె మెల్లగ ఇట్లనుకొను చున్నాడు

**బసవన్న :**

కాదని అనరాదు ఔనని అనరాదు కూడల
సంగుని శరణుల సంగము గరగసము (రంపము)
మొనల యట్లు అతికఠినమయ్యా! ౨౨

**వివేచనము :**

అనుమానచిత్తుడై "మారయ్య పిలిచినందులకు కారణము లేకపోలేదు ఈతడు కుటీరవాసి గింజలేరు కాయకము. అహ్వానము పరమాద్భుతము...

ఏమో! తెలియదు పిలచునాతడు శరణుడు వీరి సంగమును సంశయముతో జూచిన - రెండు మొనలున్న అంపమయ్యేదరు" అని అనుకొనుచుండగా మారయ్య ఇట్లనుచున్నాడు

**ఆద్దకి మారయ్య**

సమయమునకు వచ్చెదనని కందక, రానని
కుందక ఉభయపు భేదము లేకయుండిన అమరేశ్వర
లింగము తానే —౨౩

**వివేచనము**

బసవరాజా! మీరు పెద్దవారు తమకు సంశయము తగదు గణ తింతిణితో (సమూహముతో) దయచేయవలయును ఎక్కువ విన్నపమునకు వేళలేదు శరణార్థియని ఆద్దక్కి మారయ్య ఆతురతతో వోవ బసవన్న తోడనే అల్లమప్రభు, చెన్నబసవన్న, మడివాళ మాచిదేవుడు మున్నగు లక్షా తొంబదియారు జంగమ సమూహంబుతో బయలుదేరి ఆద్దక్కి మారయ్య కుటీరమును సమీపింపగా మారయ్య దంపతులు వినయ విధేయతలతో ఎదురేగి సాష్టాంగ వందన మాచరించినారు ఆద్దక్కి మారయ్య ఇట్లనుచున్నాడు

**ఆద్దక్కి మారయ్య :**

విశ్వమయ రూపమై వచ్చితివయ్యా! భక్తికి
నా మనంబునకు భిన్నంబు లేక నిలిచిన నిలుగడ అమరే
శ్వర లింగమునకు కూటమయ్యె —౨౪

**వివేచనము**

ధన్యుడనైతిని విశ్వమునకు భక్తి జూపవచ్చిన విశ్వభక్తి భండారమవు బసవేశా! నాకు మాటలు వచ్చుట లేదు దయచేయండి అని అందఱను ఆహ్వానించి ఉచితాసనములపై కూర్చుండజేయగా- లక్కమ్మ మారయ్య పాదపూజలు చేసి బియ్యపు గంజి వడ్డింపగా వారివారి ఇష్టలింగములు కోరిన రుచులు ఆ

గంజిలోనే నిండి అందఱకు తృప్తి నీయగా అల్లమదేవుడు బసవన్నకిట్లను చున్నాడు

**అల్లమప్రభు .**

వారి వారి నేమంబులకు చెందియుండెను ఇచ్చా
భోజనము తృప్తియైయుండెను మనము ఘనంబు కంటివా
సంగన బసవన్నా! గుహేశ్వరలింగమునకు వింతయయ్యె ౨౫

**వివేచనము :**

తృప్తుడైన అల్లముడు "ఆహా! భక్తిలో ఎంతటి మహత్తరమైన శక్తి యున్నది! ఇందఱు తృప్తిపొందు పదార్థములే మున్నవి? - ఒక్క గంజి తప్ప! దీనికి తోడు దంపతుల భక్తి అన్నిటిని సమకూర్చినది చూచితివా బసవా? ఇట్టి భక్తి ఈనాడే చూచితిమి కదా? ఇల్లు చిన్నదైననేమి, మనసు మంచిది యుండ వలెననునది లోకోక్తి" అందఱకు తృప్తియైన దని అల్లముడు ప్రశంసింపగా బసవన్న ఇట్లనుచున్నాడు

**బసవణ్ణ .**

ఇల్లు చూడ బీదలు, మనసు జూడ సంపన్నులు
ధనము చూడ కడు దరిద్రులు, మనమున సంపన్నులు
కూడల సంగుని శరణులు అసహాయ శూరులు, ఎవరికిని
ఉపమింపరాదు ౨౬

**వివేచనము .**

నిజము ప్రభుదేవా! శరణుల తీరే వేరు వారికి సహాయ సంపత్తులు అవసరము లేదు సహజ నిజగుణానంద సంపదలు కలవారు అపార వినయ సంపన్నులు అయ్యా! నేను పొరబడితిని మొదట మారయ్య పిలిచినప్పుడు సందేహించి మహాపరాధంబు జేసితి మారయ్య దంపతులకున్న మన స్తత్వము నాకు లేదు లేనివారని తలచి ఉన్నదాని దోషంబునకు గురియైతిని ఈ రోజు లక్కమ్మతల్లి హస్తామృతము వలన బ్రతికితిని ఆమె కొడుకునై పరిశుద్ధుడనైతిని బసవన్న నుడవుచున్నది విని నమస్కరించి ఆయ్దక్కి మారయ్య ఇట్లు నుడువు చున్నాడు.

**ఆయ్దకి మారయ్య**

అహంకారము లేని, బింకమడగిన, అనవరత
శివుడవు నీవు నా కరస్థలములోని కళనీవు, నా మనో
మధ్యమందుండు స్వయం జ్యోతివీవు అమరేశ్వర లింగుని
విమల కళవు నీవు సంగన బసవన్నా! ౨౬

**వివేచనము .**

స్వామి! బసవదేవా! మీరెక్కడ? కడుపు ఆకలితో అమరేశ్వరుని పేరిట బ్రతుకుమెమెక్కడ? నిర్దోషమైన సద్భక్తి ప్రకాశంబున వెలుగుచున్న తమపాద మెక్కడ? దోషములేని శివుడవు నీవు నా కరస్థల లింగమవు నీవు. మహానుభావుల ప్రసాదమువలన కృతార్థుడనైతిని నా కాయకము నేడు సార్థకమైనది శరణార్థుడను, అని నమస్కారము చేయుచు ఆయ్దక్కి మారయ్య లింగైక్యుడు కాగా, పతితోడనే శరణ సమూహమునకు శరణార్థములర్పించి లక్కమ్మ లింగము నందైక్యము పొందినది

బసవాది ప్రమథులు ఆ పుణ్యదంపతులను కొనియాడుచు, వారి భక్తి కాయకమును ఆదర్శమును మెచ్చుకొని తమ తమ నెలవులకు ఆనందముతో వెడలిరి

—o—

ఇది కృపామూర్తులైన శ్రీ మృత్యుంజయప్పగారిని, స్వప్నబోధామూర్తులైన శ్రీ ఎర్రి తాతయ్యగారిని స్మరించి సకల శివశరణులకు వందించి శూన్య సంపాదనలోని ఆయ్దక్కి మారయ్యగారి సంపాదనమునకు సంగ్రహముగా చెప్పిన వ్యాఖ్యానము సంపూర్ణము

—c—

శ్రీ గురు బసవలింగాయ నమః

# శూన్య సంపాదనము

## మోళిగయ్యగారి సంపాదనము

౧౩

కం॥ వరహాల సంచి బసవన
మరి పేదగ దలచి, యుంచ, మారయ ఇంటన్
చిరునగవున కట్టెల బం
గరు సేయుచు దానమిచ్చు కరణిని గనరే!

ప్రకృతి రమణీయతచే విరాజిల్లు కాశ్మీర దేశమునకు రాజైన మహాదేవ భూపాలుడు బసవన్న సమకాలీనుడు జంగమారాధకుడు కల్యాణములో జీవుల కల్యాణ కార్యమునకు పూనుకొన్న బసవ రాజు కలచుర్య బిజ్జళుని దగ్గర ఉన్నతాధికారియై ఉండియు పరమ దాసోహం మూర్తియై 'నాకన్నను చిన్న వారు లేరని, జంగమారాధన చేయుట, అనుభవ మంటపములో శివానుభవముల చర్చ జేయుట, ఆ చర్చలు ఒక రీతి వచన రచనలో నడచుట, కాయకాన్ని కైలాసంగా మార్చి శత్రు భీతి లేని వాతావరణమును కల్పించినది విని, మహా దేవి పట్టపు రాణితో కొడుకునకు రాజ్యమప్పగించి, బహు దూరము నుండి బసవన్న భక్తి చైతన్య ప్రభావానికి లోనై, కల్యాణమునకు వచ్చి, ఊరి వెలుపల ఒక చిన్న గుడిసె కట్టుకొని కట్టెలమ్మి కాయకమును నిష్ఠతో జరుపు చుండెను చాల వఱకు కాయకము సేయు వారికి ఆ కాయకము పేరు చేర్చి వారి పేరు చెప్పుట వాడుకైనది* అందులకే ఆయనకు మోళిగె (కట్టె) మారయ్య అను పేరువచ్చినది

---

* ఈనాటికిని ఇట్లు కర్నాటకములో చెప్పుకొను అలవాటుంది

అల్లమ ప్రభు దేవుడు, సిద్ధరామ దేవుడు కల్యాణమునకు వచ్చిన తర్వాత శివానుభవ చర్చలో కాయకానుభవముల గురించి విచారములు జరుగుచుండెను ఆయ్దక్కి మారయ్య లక్కమ్మగారల లింగైక్యము తరువాత కాయకమునకు ఒక ఉన్నత స్థానమేర్పడి కల్యాణ రాష్ట్రమందు ఎక్కువ ఘనత కెక్కినది

మోళిగె మారయ్య ప్రతి దినము అడవికి పోయి ఎండిన మ్రాను కొమ్మలు నరికి తెచ్చి, నిర్ణీతమైన ధరకమ్మి, ధాన్యము తెచ్చి, జొన్న సంకటి జేసి జంగమ దాసోహము చేయుచుండిరి మోళిగయ్యగారి జొన్న సంకటిలో రుచితో కూడ తృప్తి యుండెను అక్కడ సంకటి త్రాగిన జంగములు వచ్చి పొగడినది విన్నాడు బసవయ్య తాను ఆ ప్రసాదము స్వీకరించాలని ఆలోచన చేసి, ఒక రోజు గుప్తంగా జంగమయ్యగా వెళ్లినాడు వెళ్ళుచు తనలో ఇట్లనుకొనుచున్నాడు

**బసవణ్ణ**

నిష్ఠతో లింగమును పూజించి, మరియొక పథ
మెఱుగని శరణులు పాము తలయందున్న మాణిక్య
మట్లుందురు భూషణులై అద్దములోని ప్రతిబింబమట్లు
వెనుకాడకుందురు కూడల సంగమదేవా, మీ శరణులు!

**వివేచనము**

ఇది నిజము నిష్ఠతో, ఆశలేకుండ ఎవరు ఇష్టలింగారాధనము సేతురో ఆ శరణులు ఫణీంద్రుని ఫాలతలమందున్న మాణిక్యమట్లు శోభిల్లుదురు దర్పణములోని ప్రతిబింబమట్లు కదలకుందురు మహనీయ గుణావతంసుడైన, ప్రోజ్జ్వల శివభక్తి యశోవిశాలుడైన, జంగమారాధనానంద చిత్తుడైన, సర్వదక్ష పక్షరహిత రాజ్యరక్షణా ప్రజాభ్యుదయుడైన, సర్వాంగసుందరి కాశ్మీర లక్ష్మీరమణుడై యున్న మహాదేవరాజు రాజ్యమును వదలి భార్య మహాదేవితో ఈ కళ్యాణమునకేల వచ్చినాడో! అందరూ తిరస్కరించే దారిద్ర్యలక్ష్మిని ప్రేమించి పిలుచుకొని వచ్చినాడు ఆయనకిది ఎంతసంభ్రమమో నాకు తెలియదు

నిశితఖడ్గంబు బట్టి శత్రువుల నిగ్రహించు రణవీరుడు గొడ్డలి చేబట్టి కట్టెకొట్టుటన్న కాయకము స్వీకరించిన శరణతత్త్వమును ఏమనగలను?

మహావైరాగ్యశాలి అంబలి రుచికి గాదు నేను వెళ్ళునది ఆ మహాసీయుని భక్తి ప్రసాదము దొరికిన నేనంతటివాడనై శరణసేవ చేయు భాగ్యమబ్బునని వెళ్ళి నాను నేను వెళ్ళినప్పుడు ఆయన ఉండరాదు ఏమో, ఇంత దారిద్ర్యము నాకు పట్టుకున్నది అని వచ్చునప్పుడు తెచ్చిన రెండు వరహాల సంచులు చూచుకొని ఊరిబయటనున్న మోళిగయ్య కుటీరావరణమునకు వచ్చినాడు చూచినాడు భక్తి పులకాంకితుడై వందించి ఇట్లనుచున్నాడు

పాతకము మహాపాతకము చేసినవారు సద్భక్తుల యింటికి వెళ్ళి వారి మిగిలిన ప్రసాదంబు స్వీకరించిన సకల బ్రహ్మహత్యాది పాతక పరిహారమగు నొక్క మారు వేడికొని భుజించిన

పాతకేషు మనః ప్రాప్తౌ శివభక్తగృహం వ్రజేత్
యాచేత చాన్నమమృతం తదలాభే జలం పిబేత్

ఇది కారణము కూడల సంగమదేవా! మీ సద్భక్తులకు నమోనమో యందును ౨

**వివేచనము**

చూచి పవిత్రుడనైతిని ఆ చిన్న కుటీరములో ఎంత భక్తి భండారమును నింపుకొనినారో! ఎవరు తెలియగలరు? ఎటువంటి పాతక మహాపాతక బ్రహ్మ హత్యలు చేసినవారు ఇట్టి సద్భక్తుల ప్రసాదంబున సర్వపాప వివర్జితులై శివ భక్తులగుదురని బసవన్న మెల్లగా కుటీరమునందు ప్రవేశింపగా మహాదేవి ఆద రించ లింగార్చనము చేయించి ప్రసాదంబున తృప్తిపఱచిన బసవన్న ఆనంద భరితుడై ఒక మూల కట్టెలుండుట చూచి అందు తాను తెచ్చిన రెండు వరహాల సంచులను పెట్టి వెళ్ళిపోయినాడు

కొంతసేపటికి మారయ్య కట్టెల మోపుతోవచ్చి గుడిసెలో కట్టెలున్న చోటనుంచిన, ధనము చప్పుడు విని, ఏమని చూచినప్పుడు, ధనపు సంచులను రెంటిని జూచి ఆశ్చర్యము పొంది, భార్యనడుగగా, ఆమె ఎవరో భక్తులు ఇప్పుడు వచ్చి ప్రసాదంబు సేవించి పోయిరని చెప్పగా, యోచించి బసవన్నయే యీ పని చేసినాడని వేసరిల్లి ఇట్లనుచున్నాడు

మోళిగ మారయ్య

అత్మ తేజంబు విడిచినప్పుడే గురువు నెఱుగును
మనో వికారంబు విడనాడినప్పుడే లింగంబు నెఱుగును
ధన వికారంబు విడిచినపుడె జంగముని ఎఱుగును ఇటులీ
త్రివిధంబు నాస్తి కానివానికి గాని నిష్కళంక మల్లి
కార్జుననందు సహజభక్తుండు కాడు 3

వివేచనము :

ఆహ్వానములేని ఆతిథ్యముతో భక్తి భండారి బసవరాజు మా కుటీరమును పవిత్రము జేసిపోయినది మా భాగ్యము బస, అపవిత్రమని కాశ్మీరములోనె విడిచివచ్చిన లక్ష్మి నిక్కడనుంచి అపవిత్రత తలపెట్టెనెందులకో? ఏమి చేసినను, ఎంతవాడైనను రాజాధికార చేష్టలనుండి తప్పించుకొనుట కష్టము జీవియందు దయతలచుట చులకనగాదు ఆ దయ ఆ జీవికి అవసరమున్నపుడు చూపిన ప్రయోజనముండును గుర్వనుగ్రహము కలుగవలెనన్న ఆత్మాహంకార వర్జితుడై నేనను అభిమానమును విడువవలెను కట్టుకొన్నంత మాత్రము, పూజలు చేసినంత మాత్రముననే లింగమునే లింగము తెలియదు మనసులోనున్న చంచలత్వమును వదలవలెను ఇక ధనవికారము అన్నిటికన్న పెద్దది దానిని వదలుకొను వఱకు జంగిమతత్వ మెఱుగరాదు ఈ మూటిని ఎఱిగిన వాడు బసవన్న గదా! ఎందులకీ మోహము పట్టినది? ఆయన పెద్దవాడు తప్పితే మాయట్టి వారికి ఆదర్శమేది? అని చింతించి తత్క్షణము రెండు సంచులను చరమూర్తుల కిచ్చినాడు

మహాదేవిని పిలిచి 'సర్వము సిద్ధము చేయుము జంగమ స్వాములను ప్రసాదమునకు పిలుచుకొని వచ్చెద'నని వెళ్ళిపోయెను యజమాని అభిప్రాయమును గ్రహించి జొన్నఅంబలి చేసినది లక్షాతొంబదియారువేల గణ సమూహముతో వేగమే మోళిగయ్య వచ్చినాడు సర్వసన్నాహములు దంపతుల నిర్మల భక్తిచే సమకూరినవి జంగమ పాదోదకము చల్లి, కట్టెలను బంగారముచేసి తృప్తులైన వారికిచ్చినాడు పరమ తృప్తిచెందినాడు. మారయ్యను ఆశీర్వదించి జంగములు వెళ్ళిరి ఈ విషయము తెలిసి తానుచేసిన తప్పునెఱిగి క్షమాభిక్షకై బస

వన్న చెన్నబసవన్న, హడప దప్పన్న మొదలైన శరణులను వెంటబెట్టుకొని మోళిగయ్య కుటీరమునకు వెళ్లెను త్రోవలో బసవన్న శరణులతో ఇట్లను చున్నాడు

**బసవణ్ణ**

> ధనమందు శుచి, ప్రాణమందు నిర్భయము-ఇవెవ్వ
> రికి వశమగునయ్యా? గుప్తనిధి వచ్చునన్న వద్దనువారు
> లేరు ప్రమోదము కలిగినపుడు కల్ల చెప్పనివారు లేరు
> నిరాశా నిర్భయములు కూడల సంగమదేవా, నీ కృప
> యున్నచో శరణునకు గాక వేఱొకరికి చేకూడునే? ౪

**వివేచనము** ·

చెన్నా! ఇదికదా శరణత్త్వము, పరధనము తాకకుండుట, ప్రాణము నందు నిర్భయముగా నుండుట- ఈ రెండు గుణములు లోకములో ఉత్తమోత్తమ గుణములు ఇవి శివకృపాలబ్ధులకు లభించును మోళిగయ్య యందు నేనొక పొరపాటు చేసితిని అదే ఆయన నివాసము అనుచు అంచలతో వందన మాచ రించి బసవన్న ఇట్లు విన్నపము చేయుచున్నాడు

> ఇంటిని జూచిన పేదలు మనసును జూచిన ధీరులు
> స్పర్శయందు పవిత్రులు సర్వాంగ ధీరులు పదార్థములు
> చూడ నేమియు లేవు సమయంబున కన్నియు సమకూరు
> కూడల సంగమదేవా! మీ శరణుండు సర్వాంగ ధీరుండు
> మోళిగ మారయ్య తండ్రి ౫

**వివేచనము**

ఇతరుల దృష్టిలో నే నెంత వివేకశాలినో నా దృష్టి యందంతటి వివేకహీను డను నా సంగడు నన్ను బంగారు సంకెల వేసి దూరము చేసినాడు మారయ్య ఆ సంకెలలను తన రాజ్యలక్ష్మికే తొడిగించి ఇంతదూరము వచ్చిన వీరావతంసుడు ఎంత చూచినను అక్కడ ఏమున్నది? ఆదొక గడ్డి గూడు లోన నేమి కలదో ఎవరెఱుగుదురు? ఆత్మ స్థైర్యమున్న వారికి బలమైన కాయముండ నవసరము

లేదు. సర్వాంగధీరుడు తనకు తానే స్వతంత్రుడు నా దయా స్వభావము మహా దేవి అమ్మగారి అమృత హస్తప్రసాదముచే ఉత్తేజితమై హద్దుమీరి ధనమిచ్చి నది అని వినయముగా చెప్పుచుండునపుడు మారయ్య గుడిసె నుండి బయటకు వచ్చెను బసవన్నను చూచినను వందించి ఆహ్వానింపలేదు 'లేనివాడని నాకిచ్చె గదా ఈ బసవన్న' అను రాజసము మోళిగయ్యను విడచియుండ లేదు రక్త గత గుణమది ఎంతగా విడిచితి నన్నను ఏ మూలనో అంతయైన ఇంతయైనను ఉండకపోదు కాన జ్ఞానధీరుడైన చెన్నబసవన్నపై అత్యంతాభిమాన మున్నందున అయనను జూచి బసవన్నను లోక వృత్తములో జేర్చి ఇట్లనుమన్నాడు

మోళిగ మారయ్య

బసవన్న మొదలైన మహాభక్తులందరు కని
రయ్యా! మహా కైలాసమను వెండికొండ నెక్కి, ప్రధాన
పదమందు పారవశ్యము చెంది, అధికమని మెచ్చియుండ,
ఆ వెండికొండ కల్లోలమైనప్పుడు అక్కడుండు వారి
నెవ్వరిని కానలేదు వీరికింకెక్కడి ముక్తి? జల్లలో*
నుండి ఏరుదాటినట్లయ్యె వీరందరు జ్ఞానవంతులే, జ్ఞాని
చెన్న బసవన్న కాక? వీరందఱను నేనొల్లనంటి తెలిసిన
వారి తెలిసియున్నవాడు నిష్కళంక మల్లికార్జునా! ౬

వివేచనము

చాల వెక్కిరింపుతో కూడిన రాజస విడంబనము వెండి కొండ యొక టున్నది దానికి అధిపతి శివుడు కోరినవారికి, పుణ్యములు చేసినవారికి తన కైలాసమను కొండయందు ఆయా ఫలానుసారముగా సుఖస్థానము లేర్పఱమను ఇది ఈ లోకములో అనుకొను మాట ఈ మాటను బట్టి బసవన్న మొదలైన మహా మహా భక్తులందరు ఆ ఎత్తయిన శివస్థాన కైలాసమెక్కి, అక్కడి సుఖ ములలో మైమరచి యుండగా, మహాప్రళయము వచ్చినప్పుడు కొండపై శివునితో బాటు అక్కడనుండు భక్తులందరు ఏమగుదురో? అక్కడ ఏదియు ఉండదు

* వెదురుతో నేసిన, బండిపై నుపయోగించు, రంధ్రములతో కూడిన రవాణా సాధనము

శివుడే ప్రళయానికి లోనైనపుడు ఇక ఆయన ఆశ్రిత భక్తులకు ముక్తియెక్కడ? సందులున్న జల్లిలో ఏరుదాటు అవివేక దృశ్యమట్లుండును వీరి చర్యలు ఇట్టి వారిని ఏమనవలెను? నిజ జ్ఞాని చెన్నబసవేశుడొక్కడే ఇతరుల నే నొల్ల'నని తన నిశిత విమర్శతో బసవన్నను లెక్కసేయక సామాన్యునివలె యెంచినది శరణులకు సమాధానము కాలేదు ఎవరేమనుటకును జంకిరి చెన్నబసవన్నకు బసవన్న ఇట్లెందుకు చేసెనో! ఆతని సహజ దయా గుణము మోళిగయ్యకు పట్టదు అతడు రాజ్యమేలిన రాజు భక్తిపరివర్తితుడై జంగమారాధన జేయ వచ్చినవాడు ఎంతయినను రాజస సంస్కారముండును నొచ్చుకొన్నాడు తగు సమాధానము చెప్పవలయునని చెన్నబసవన్న ఇట్లనుచున్నాడు

**చెన్న బసవన్న .**

ఆకలి దప్పుల విషయములను కర్మంబులను గాంచి పరిణామమను గొడ్డలిచే తుత్తునియలు జేసి, కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యంబుల తెగనఱికి పెట్టి నొక్కచోట పంచేంద్రియ, షడ్వర్గ, సప్తధాతు, అష్టమద మను తీగల జీల్చి, ఏడు కట్టల కట్టెను మోసి నడచె నయ్యా! ఆశ అమిష తామసమను తురగ మెక్కి ఆతుర మను తురగము పోనాడెనయ్యా! ఈ మహా మహిమునకు లోకవంచకి, వ్యభిచారిణి, పదునెనిమిది కులముల ఇండ్ల దాసియైన, శివద్రోహి యైన దానిని లింగవంతుల ఇంటిలో దూరనిత్తురే? అయ్యా! లింగ తండ్రి! జడము బట్టి చెడుదురే భక్తకులం బెఱుగక? అయ్యా! లింగాజ్ఞా కారకా! లింగ సన్మతా! లింగైక్య ప్రతిగ్రాహకా! కూడల చెన్న సంగు నందు మోళిగ మారయ్య తండ్రిగారి పాదములకు నమోనమః జయ జయ జయ 3

**వివేచనము .**

అయ్యా! మోళిగ మారయ్యగారి కాయకము చూచుటకు సామాన్య కాయకము, దీనిలో నున్న సామాన్య తత్త్వార్థము తెలియుట సులభము కాదు కాయ

కమే కైలాసము కాయకమే కైలాసమని శరణులాడు మాటల కర్థమొకటియైన మారయ్య తన కాయమునే కాంతారముగా జేసికొని దానిలోనున్న పేరాసలు, భోగలాలసతలు, అరిషడ్వర్గాలు, అష్టమదాలు అనే కట్టెలను తన మనసను గొడ్డలితో నిర్దయతో తుత్తునియలుజేసి, సప్తవ్యసనాలను తీగతో బంధించి, ఆతురమనెడు చిత్తచాంచల్యమను గుఱ్ఱమెక్కినను, శాంతితో కట్టెమోపు మోసి కాయకము చేయుచున్న ఈ నిరాశా నిర్భయ నిర్ణిత సత్కాయకశీలుని కుటీరములో, సిగ్గునెగ్గులేని, రీతి నీతి లేని న్యాయాన్యాయములు లేని, ఒకచేతినుండి మఱొకని చేయిపట్టు దుర్జాతి వ్యభిచారిణివోలె లక్ష్మిని ఇట్టివారి ఇంటిలోనుంచి పోవ తగునా స్వామీ! అని బిడియము లేకుండగా చెన్నబసవన్న బుద్ధివాదము చెప్పగా బసవన్న ఖిన్నుడైనాడు అక్కడనుండు శరణులు "ఈ ఘటన ఇంత పెద్దదిగా పెరుగుట కవసరము ఉండలేదేమో! ఆయన కాశ్మీరపురాజు రాజస మెక్కడకి పోవును?" అని అనుకున్నారు కొందఱు సరేయన్నారు

అప్పుడు దీనికంతయు నా మొరటుతనమే, శరణాగ్రణి బసవన్నను, శరణులను నొప్పించెనని తెలిసికొని, బసవన్నను జూచి సామాన్యానుకరణీయ ధోరణిలో మోళిగ మారయ్య ఇట్లనుచున్నాడు

మోళిగ మారయ్య

బయలుబత్తలైన కప్పువారెవ? గట్టు నీరు త్రాగిన
విడిపించు వారెవరు? మహా మేరువు నడచి వచ్చిన త్రోవ
నిచ్చువారెవరు? ఎఱిగిన యాతడే మఱచిన ఎఱుకజెప్పు
వారెవరు? మీ నిజము మీకే తెలియును నే వెఱచెద
నిష్కళంక మల్లికార్జునా! ౮

వివేచనము :

పెద్దవారికి చెప్పునంతటి పెద్దవాడిని గాను నేను బసవరాజదేవా! భక్తికి నీవే దిక్కు నీవు తప్పిన భక్తికి తావెక్కడ? చలియని బయలు అడిగినచో పచ్చడము గప్పువారెవరు? పైరున కుపయోగమని గట్టు కట్టిన ఆ గట్టే నీరు త్రాగిన వద్దనువారెవరయ్యా? ఉండినచోటు వేసరికయని మేరు పర్వతము మఱియొక చోటునకు పోవలెనన్న తెరువిచ్చెడివారెవరు? తెలిసిన నీ యట్టివారే

ఇట్లయిన చెప్పువారెవరు? అని బసవన్న ఆదర్శమును గుఱించి మాటాడి విన యముగా సామాన్యతకు ఆదర్శ మేమని అడిగిన మోళిగయ్యకు బసవన్న ఇట్లనుచున్నాడు

**బసవణ్ణ :**

అర్థ ప్రాణాభిమానంబు లొప్పించిన భక్తుడగునె?
కాదు ఆది రుద్రుని కూతురు ఆదిశక్తి. ఆదిశక్తి
కొడుకు విష్ణువు విష్ణువు భార్య లక్ష్మి ఈ దాసికి
దాసియైన కడుదాసి దోషి నొప్పించిన భక్తుడగునె?
కాదు నా మనసునకు ఒడయడు మహాదేవుడు మీ
మనము మీ కొప్పించి నేను శుద్ధుడనైతిని సుమా! కూడల
సంగమ దేవా!

**వివేచనము :**

మహాదేవ భూపాలా? నేను జేసిన పని సరికాదని దృష్టాంతముగా జూపినావు. ఔను చెన్నబసవన్న తమ కాయక రహస్యమును చక్కగా తెలిసికొన్నాడు నా కది తెలియలేదు తప్పు చేసితిని విడచిన వ్యభిచారిణిని మరల కూర్చితిని అయ్యా? నా యట్టివాని కలభ్యమైనను, మహాదేవిగారి ప్రసాద హస్తమునుండి దేవతకైన లభ్యముకాని ఆ భాగ్యము - అంబలి నాకబ్బినది పవిత్రుడనైతిని నే నిచ్చినది నాది కాదు అది తమరిచ్చిన మనః ప్రసాదరూపముగా తమకే ఇచ్చినను నే నిచ్చినదను నెపమైనది క్షమింపవలెను

ఆదర్శమును నాయట్టివాని నుండి పొందకుడు అన్నిటికిని తమరు పెద్దవారు త్యాగశీలురు దొరలైనవారు బీదలై శరణ తత్త్వ కాయకమును గ్రహించి బహుదూరమునుండి ఆదర్శమును ప్రసాదించుటకు ఏతెంచినవారు అని వినయమున బసవన్న విన్నవించినప్పుడు మోళిగయ్యగారు ప్రసన్న వదనులై ఇట్లనుచున్నారు

**మోళిగ మారయ్య :**

నాదు చిత్తమునకు 'న'కారమై వచ్చితివయ్యా!
బసవన్నా! నాదు బుద్ధికి 'మ'కారమై వచ్చితివయ్యా!

బసవన్నా! నాదు అహంకారమునకు 'శి'కారమై వచ్చి తివయ్యా! బసవన్నా! నా మనంబునకు 'వ'కారమై వచ్చి తివయ్యా! బసవన్నా! నాదుజ్ఞానంబునకు 'య'కారమై వచ్చితివయ్యా! బసవన్నా!

నా మతికి 'ఓం'కారమై వచ్చితిరయ్యా! బసవన్నా!
నా నాదంబునకు 'అ'కారమై వచ్చితిరయ్యా! బసవన్నా!
నాదు బిందువునకు 'ఉ'కారమై వచ్చితివయ్యా! బసవన్నా!
నా కళకు 'మ'కారమై వచ్చితివయ్యా! బసవన్నా!

నా భవసంహారమునకై 'బ'కారమై వచ్చితివయ్యా! బసవన్నా! నాదు శక్తికి 'స'కారమై వచ్చితివయ్యా! బసవన్నా! నా వచస్సునకు 'వ'కారమై వచ్చితివయ్యా! బసవన్నా!

ఇటులున్న మహాప్రణవంబులే బసవన్నయై ఆ బసవన్నయే మహాప్రణవంబులై తన మరంబునకు తానె వచ్చి భక్తి వస్తువు నిచ్చిన, దానిని నేను నిష్కళంక మల్లికార్జునుని భక్తులకిచ్చి బ్రతికితినయ్యా? ౧౦

**వివేచనము :**

భక్తి భండారి బసవేశా! నీ దాసోహంబుతోనున్న రహస్యమును ఎఱుగ లేదు ఏది విడచి ఎంత దూరమునుండి వచ్చిననేమి? వెనుకటి సంస్కారము విడచుట కష్టము ఏదియైనను విడువవచ్చును నేను దానిని విడచితినినన్న అహంకారము తొలగించుకొనుట కష్టము దాని ప్రతీకారము కట్టెలను బంగారు జేసి జంగముల కిచ్చిన తామసముచాలదా బసవరాజా! నీ విచ్చినది భక్తి సంచయ మని తెలిసియుండినచో ఈ రీతిగా అయియుండెడిది కాదు గదా! ఒక వస్తువును తిరస్కరించుటకన్న వాడుకతో సార్థకత పొందరాదా?

ఈనాడు నా కుటీరము పవిత్రమైనది దంపతులము పవిత్రులమైనాము. నీవు ఓంకార స్వరూపుడవు నా సర్వాంగ సర్వేంద్రియములందు నిండినావు 'బసవ' అనిన చాలు భవభవాంతరముల కర్మనాశమై భవరహితుడు కాగలడు అని ఓంకార ప్రణవాక్షర స్తోత్రముచే నుతించినందులకు శరణులు మోళిగ దంపతులకు వందన మాచరించి ఇట్టి మహామహితులున్న కల్యాణ పట్టణము ధన్యతమమని కొనియాడిరి సంతోషచిత్తుడై బసవన్న శరణులతో తమ నెలవునకు వెళ్లెను

**మోళిగ మారయ్యగారి స్వగతము -**

వెనుకటి విషయము జరిగిన తరువాత కొన్నినాళ్లకు మహాజ్ఞాని, జంగమారాధకుడు, కాయకశీలుడు, ఆనాడు ఏమనుకొన్నాడో కాయకానికి పోలేదు ఎన్నెన్నియో ఆలోచనలు కలతవెట్టినందున కుటీరములో కూర్చొని ఇటులను కొనుచున్నాడు

**మోళిగ మారయ్య :**

'ఓ' యనిన నిరాకారవస్తువైతివి గాదె! 'ఓరి'
అనిన సాకార వస్తువైతివిగాదె! "తత్త్వమసి" యనిన
తత్త్వరూపంబై జగము రక్షించెదనంచు కర్తృరూపి
వైతివికాదె! మీకు మర్త్యుల పని ఎంతవఱకు? నాకు కట్టు
పని గుత్తయే? నేను కట్టెలమోసి శివభక్తులింటికి మీ
రిచ్చిన కాయక కృత్యంబు ఇంకెన్ని దినములు? చెప్పవే
నిష్కళంక మల్లికార్జునా! ౧౧

**వివేచనము**

విశ్వనాద మయంబగు 'ఓం' కారము 'అ'కార, 'ఉ'కార 'మ' కారములచే గూడియున్నది అది నాదబిందు కలాత్మకమగును అకార ఉకారములు కూడియున్నను అవ్యక్తముగనే యుండును అది పైన చెప్పిన 'ఓ' మాత్రమే దాని ప్రక్కన సున్న చేర్చునంతవఱకు అ, ఉ లు కనబడవు 'ఓం' అను ప్రణవాక్షరము పూర్ణమైనది అప్పుడు తత్ త్వం అసి - తత్త్వమసి అనినచో అది

నేను, అంతయు నేను అను సృష్టి కలుగును ఆ సృష్టి విస్తృతి పొందును దానిని తగురీతిలో రక్షించు కర్తవై, ఎడతెరపిలేని కార్యమునందు మగ్నుడవై, ఈ జగమే నీకొక రమణీయ నాటక రంగ భూమియైన వినోద విహారివై చరించుదువు

అయ్యా! పరశివా! ఈ ప్రపంచ జీవన నాటక వినోదము నీకు ఎంతవఱ కయ్యా? నీ పనిని అడుగుటకు నాకు స్వాతంత్ర్యము లేదు అయినను మిరిచ్చిన నా పని-ఈ కట్టెలు మోయు కాయకము-ఎంతవరకని అడుగు స్వాతంత్ర్యము లేదా? దీనికేమైనను ఇన్నినాళ్ళను అవధి ఉన్నదా స్వామి? కాలము గతించెగాని కాయకమునకు విరామము లేదు కాలముతో స్పర్థవహించిన దేమో అనినటుల పని అగాధముగా ఉండనేఉన్నది వారు వీరు పెద్దపెద్ద శివభక్తులు తమముందు నెలవులను కనుగొన్నారను వార్త ఇన్నినాళ్ళ శరణుల ఇండ్లకు కట్టెలు మోసిన నా గతి యేమిటి? నెలవు నా కెక్కడ? ఒక్కమాట——

కాయసమాధిని ఒల్ల స్మరణ సమాధికి నిలువ
కైలాసమను భవసాగరము నొల్ల నన్ను అక్కడ
కిక్కడకని లాగి త్రిప్పక నీయందు కూటస్థుని చేయుమా
నిష్కళంక మల్లికార్జునా! ౧౨

కదలాడక రాయివలె కూర్చొనియుండు కాయసమాధి నాకు వద్దు నిశ్చల ముగా ఒకేరీతి పరవశించునట్లు మనసు నిలబెట్టుట నాకు వద్దు పుట్టుక చావుల కాటపట్టయిన నీవుండు కైలాసమనే లోకానకు రమ్మనుట చాలించి నన్ను నీలో స్థిరముగా నుండునట్లు చేసికొమ్ము తండ్రీ, సదాశివా!

## విశేష విన్నపము

అన్నిజీవుల రూపములు కొను స్వభావముకల సకలుడవు నీవు అక్కడ నన్నుంచుకొనిన ఒక్కచోటనుండుటకు నాకు చేతకాదు కాన పుట్టుకయందలి స్వభావము నీదయియున్నది దానిలో ఒకమూలచోటిమ్మా!

ఇంకొక నీ స్వభావమేమంటే,పరీక్షకు గురిసేయుట దానిలో నీవు ఒప్పితే మాత్రం నీలోనేకముజేసుకొనుట-అనువులేకపోయిన భవచక్రమునకు తగిలిం చుట ఈ ఘాతుక పరీక్షలకు నన్ను గురిసేయబోకు అది యంతయు మోసము, వంచన

నిర్మల నిశ్చల నిర్ద్వంద్వమైన నీ హృదయకమలం మధ్యభాగపు తెరవిప్పు అక్కడ శక్తి యుండకూడదు లేనిదంతయుతెచ్చి, కానిదింతయు చేయించెడు మాయ అది చూడుమయ్యా! ఎన్నడైనను నిన్ను కోరు కోరిక ఇది - మహాదేవా, నన్ను ముక్తుని చేయవలయునని ఇంకేమేమియో మోళిగయ్య గారు కుటీరములో తనలో తాను ఎన్నడును చెప్పుకొనని దంతయు చెప్పుకొనుచుండగా, మహాదేవి యమ్మ బయటికి పోయి వచ్చి వినుచు వాకిలి చాటున నిలచి వింతపొందినది

తాను చేయు కాయకమునకు వ్యతిరిక్తముగా ఈ కోరిక యేమిటి? కాయకము కాదు - ఈ అవివేకపు కోరిక నెరవేరదు బాగుగనే యున్న నా యజమాని బుద్ధి ఎటుల చలించి చెడినది? ఇది వినునది కాదని మహాదేవి లోపలకు ప్రవేశించి తన్మయతతో నున్న భర్తను జూచి ఇట్లనుచున్నది

**మహాదేవి :**

అదెందుకయ్యా, శివునందు కూడుకొను కుతూహలము? ఇది భక్తుని సత్యవర్తనము కాదు ఇంకెవరి నడిగి ఇంకెవరికి జెప్పవలె నీవు చేయు కార్యమును? మొదట నీవెవరివయి యుంటివి? చెప్పవే! ఆ భావమెఱిగి నిన్ను నీవె తెలిసికొనుము నా అయ్య ప్రియ ఇమ్మడి నిష్కళంక మల్లికార్జునా! ౧౩

**వివేచనము :**

మహాప్రభూ! పనిలేని తనమునకు పసచెడిన యోచన రాజరీవి జ్ఞాపకమునకు వచ్చినదేమో! ఎందులకీయోచన? కానరాని శివునందు కూటస్థుడవై యుండు నవసర మేమి కలిగినది? చేతిలోని పని ఎవరికిచ్చెదరు? ఇది భక్తుని కర్తవ్యమా? మొదట మీరెవరనుకొని ఇంకొకరు మీకేమగుదురని తెలిసి చెప్పెదరు? కొంచెము నెమ్మదిగా యోచించుడు ఇంకొకమాట,

కట్టెను బంగారు చేసితినన్న ఘాతుకత్వమేనా మీ
భక్తి? సకల దేశకోశవాస భాండారములను, సవాలక్షలగు

సంబంధ స్త్రీలను విడిచి వచ్చితి నన్నదానికి చేసిన
కూలియా మీ భక్తి? బసవన్న, చెన్న బసవన్న, ప్రభు
దేవులు మొదలైన ఏడునూర్ల డెబ్బది అమర గణంబుల
భావమున్నటుల మీ అందోళన మెందులకు? మీ తెలివికి
ఎదుట కూడెదనన్న భిన్న భావముండునా అయ్యా!
కర్పూరాటవి కాలిన బూడిదను బొగ్గటంచు లక్షింప
దగునే? మీదు భావంబును మీయందె స్పష్టంబుగా గనుడు
మీదు కూటంబునకు నాదు సిగ్గు విడిపించిన రీతి తెలుసు
కొనుడు. శక్తిమాటను ధిఃకరించ వద్దు బయట కూడుదు
నన్నది మీ జ్ఞానంబునకు హాని నాయయ్యా! ప్రియ
ఇమ్మడి నిష్కళంక మల్లికార్జునా! మీ శరణుల తావు
మీరే చూచుకొనుడు ౧౪

ఈనాడెందులకో క్రొత్త త్రోవ త్రొక్కినారు అందఱు శివశరణులుండు నట్లుండక కైలాసమేమిటి? శివుడేమిటి? అక్కడి నిత్యసుఖమేమిటి? దానిలో మీకై మాయాశక్తిని తొలగించిన విశ్రామధామ మేమిటి? ఇవి మీ కోరిక లైనచో మీరు భక్తులుకారు అజ్ఞులయినచో దొరలు కారు ఈ రెండును కానప్పుడు కాయక మనునది మొదలే లేదు

గురులింగ జంగమ ప్రసాదలబ్ధములైన తనుమనధనాదులుగలవాడె భక్తుడు ఆ భక్తునకు తనదిగా మిగులునదేదియు లేనపుడు ఏదానికయి కైలాసములో మీకు విశ్రాంతి కావలెను ఆ విశ్రాంతికి నిత్యత్వము కావలయునను కోరిక ఎందులకు? శక్తి విష్ణువు శివుడు అన్నపుడు చావు పుట్టుకల కారణమును విసర్జించు మనుటకు నీవెవరవు? జగమంతయు ఆయన సంతానమను మాట శరణులకు తిరస్కరణీయము కాదు.

మొన్న కట్టెలను బంగారము చేసితి నన్న అహంకారము, కాశ్మీర సామ్రాజ్యాధిపత్యము వదలితి నన్న రేంకారము మీ సహజ స్థితికి అడ్డు వచ్చినవి. చేతిలో లింగముండగా ఎదుట మఱియొకటి తలపదగునె? కర్పూరపు అడవికి అగ్గిపడి కాలిన బొగ్గు లేరుటకు పోదురే? మీ భావన మీలోననే చూచు

కొనుడు మనము విజాతీయులమై ఆలుమగలుగా సంసారము చేయు మొదటి కూటమిలో 'నేను నీవు ఒకటే' యని చెప్పినా క్రొత్త దశలోని సిగ్గు విడిపించిన గుట్టేమియో తెలుసుకొనుడు శక్తి మాటను ఉదాసీనము చేయకుడు శక్తి లేక శివుడే లేడు ముఖ్యముగా నీ వేమి కోరితివో దానితో కూడియే యున్నావు. బయట చేరుట అనుట అజ్ఞానము మీ శరణుల మర్మము మీకే ఎఱుక అని మహాదేవి భర్తకు వివరించి చెప్పు విషయమును మననము చేసికొనుచు మోళిగయ్య లింగైక్య విషయము నిట్లు అడుగుచున్నాడు

**మోళిగ మారయ్య :**

భక్తియున్నంత వరకు ఇష్టలింగము హంగుండ
వలయు ఆత్మ యున్నంతవరకు జ్ఞానమనునది విచారించ
వలయు మర్త్యమనుట నే తెలిసినంత వఱకు కర్కశ
మైన జగము ఇది కారణముగాన, కైలాసమార్గంబు
వెదుకవలెనె నాదు సత్యమునకు, నాదు భక్తికి, నాదు
మనసునకు, నాదు ముక్త్యంగన! నా కొక నిశ్చయపు
గురుతు చూపు నిష్కళంక మల్లికార్జునుడు ఎక్కడుండె
చెప్పుమా? ౧౭

**వివేచనము .**

మహాదేవి! నీవు చెప్పినది భక్తితత్వము కాదనరాదు మేము అనుసరించు చున్నది అదియే కాయక మూలముగా కైలాస మన్నారు శరణులు ఏ మతమున నైన సిద్ధిపొందుటకు సాధనామార్గాలు ఆయామతాల వారి కనుగుణముగా ఉండుట నియమము. ఆ నియమాలు, సాధన ఉండువఱకు ఉండునవే భక్తి యున్నంత వఱకు ఇష్టలింగముండవలెను కదా! ఆత్మ యున్నంత వఱకు విచారణము సేయు తెలివి యుండియే తీరవలెను వాస్తవముగా ఈ నరలోకము కంటె కఠోర తరమైన మఱియొక లోకము లేదు ఇక్కడనుండి జారుకొను లోపల ఏదయి నను దీనికన్న మంచి లోకవాసము చూచుకొనవలయునని ఈ లోకములోన వాడుకలోనున్న కైలాస మన్నాను అది అంత బాగులేదనినచో లింగవంతులు లింగములో ముక్తులగు సులభోపాయము చెప్పెదరు కాని, అది అందఱకు

తెలియదు నీవు నా ధర్మమవు, నా పుణ్యమవు, నా ముక్త్యంగనవు ఇప్పుడు చేయుచున్న కాయకము కాయమున్నంతవఱకు జరుగుచుండును ఆ తరువాత నాకొక చలనము లేని స్థానము కావలెను. ప్రాజ్ఞురాలవు నీవు ఆ చోటును చూపుము అని మోళిగయ్య అడిగినప్పుడు మహాదేవి ఇట్లనుచున్నది

**మహాదేవి :**

కాయ విభ్రాంతి నుండి కైలాసము జీవ విభ్రాంతి నుండి మహామందు కూటము కాయము జీవము భేదం బెఱిగిన అట్టిట్టు లనుచు మఱి యోచించవలదు ఇది నిశ్చయ కూటము నా అయ్య ప్రియ ఇమ్మడి నిష్కళంక మల్లికార్జును నందు ౧౬

**మఱియు**

సుమనస్సు బుద్ధి శక్తి స్థలము, మల, అమల మహేశ్వర స్థలంబు అజ్ఞాన సుజ్ఞాన ప్రసాది స్థలము. ఉభయ కూటస్థమనునది పరిహరించిన ప్రాణలింగి స్థలము స్తుతి నిందాదులందు కాయమెఱుగ కుండుట శరణ స్థలంబు ఇటుల ఈ పంచభేదంబుల గుట్టు ఎఱిగి, చలనంబు లేక, పరుష పాషాణ మట్లు భిన్నభావంబులేక, ఎఱిగించుకొను గురుతు ఏకమైనపుడు ఐక్య స్థలంబు నాప్రియుడవు నీవు వాడు నీదు షట్స్థలంబు దీనికి భిన్నభావంబు లేదు అది మా ఇద్దఱి కూటసుఖం బట్టు దీనిని బాగుగా తెలిసిచూచు కొనుడు అక్కడని ఇక్కడని గెలిచెడు ఛలము వలదు అట్లనుచోటనే బయలుగావలయు నా యయ్య ప్రియ ఇమ్మడి నిష్కళంక మల్లికార్జును నందు ౧౭

**వివేచనము :**

భ్రాంతి నిరసనకు ఎంత సంస్కారము తెచ్చుకొన్నను తక్కువేయగు నన్నది నిజము ఇది సృష్టిలో నున్న ప్రధాన విషయము అన్ని భ్రాంతులకు సమాధానము చెప్పి, మఱి ఆ భ్రాంతులు రాకుండ యుండవలయునని శ్రీ గురువు

లింగమును గొంతునకు గట్టి జంగముని కాపల యుంచినను, కైలాసము మీది భ్రాంతి పోవలేదు. పరమ పదమంతే కాయభ్రాంతి కైలాసమైన జీవభ్రాంతి కైవల్యము ఈ రెంటి మర్మమెఱిగిన అది ఈ శరీరానంతరము పొందునది ఎక్కడనో పైనున్నదను సందేహము నివృత్తియగును అప్పుడు నేను కోరుకొన్న చోటుననే యున్నానను నిజము తేటతెల్లమగును

షట్స్థలములు పట్టిన భక్తునకు ప్రత్యేకముగా ముక్తి దేహానంతరము వచ్చు పదవియుగాదు ఐక్యమనిన ప్రత్యేకించి రెండుగానుండి అవి కూడినపుడు చెప్పుకొను మాట నేను మీరు అట్లు సంసారము చేయుచుండుట లేదా? అది మన షట్స్థలము కాదా? ఎక్కువగా విపర్యాసయోచన చేసినచో తెలిసిన తత్త్వము, తెలియనిచో ఉన్మాదము ఒంటబట్టుతుంది స్త్రీ తత్త్వమును శక్తిగా నెంచి అది పరమపదవికి చేటనినారు కాదు ఇతర విషయాలు అట్లుండనిండు. ఎన్ని నాళ్ళ నుండియో మన సంసారానుభవమున్నది కదా! నేను (శక్తిని) తమకు చేసిన అన్యాయ మేమిటి? బాగుగా ఆలోచించండి. అక్కడ, ఇక్కడ చూడకుడు, సర్వము మీలోనే యున్నది. సావధానంగా ఆలోచించండి అని మహాదేవి వివరింపగా మోళిగయ్య ఒక నిర్ణయమునకు వచ్చి భ్రాంతిని విడనాడి నిశ్చల చిత్తుడై ఇట్లను చున్నాడు

మోళిగ మారయ్య :

వివిధ రూపంబులు వ్రాయు చేతి కుంచె భేదం
బట్లు మనసు ఎఱిగి, కన్నుచూచి చేయి కుంచెను బట్టి
లక్షించునట్లు, స్థల మందు నిలచి, జ్ఞానమునం దాశ్ర
యించి, ఇష్టవిశ్వాసము భక్తియందడగి, వ్యక్తి వస్తువు
నందు లేపమైయుండ నిష్కళంక మల్లికార్జున లింగము
నిర్లిప్తమైయుండె ౧౮

వివేచనము :

నిజము తత్త్వపూర్ణత్వాన్ని ఒక దృష్టితో చూచిన సందేహముల కవకాశ ముండును. దానివలననే వివిధ శాస్త్రార్థములు మతములు పుట్టినవి మానవు లలో వర్గీకరణములు పెరిగినవి ఏమైనను ఎన్నివైవిధ్యములు కనబడినను

బీజరూపమువ ఉందునది ఒకటియే చిత్రకారుడు ఎన్ని చిత్రములు గీచినను ఎన్ని వర్ణములు రంజింపజేసినను గీచిన కుంచెయొకటే చిత్రకారుడు చిత్రింప బోవు చిత్రమును భావంబునుండి కల్పనచేసికొని, మనసునందు నిర్ణయించు కొని, ఆ నిర్ణయచిత్రమును లక్షించి ఏకాగ్రతతో చిత్రించుచున్నటులే, భక్తుడు లింగమందు నిలచి, విశ్వాసమున తనను తానునమ్మి ఆరాధించినపుడు ఎక్కడకు చేరవలయునను భావమే పుట్టదు అనేక తటాకములందు వేరువేరుగా కనబడు సూర్యుడొకడే అటులనే వీరశైవ సిద్ధాంత సర్వసమన్వయమును అంగీకరించి శరణులు ఆచరణకు తెచ్చుకొనినది నిజము కొందఱు శరణులకైక్యనామ నిర్దే శము లుండినను, ఆ నామములకు కైవల్యమునకు సంబంధము లేదు ఆ నామ ములు తమ క్రియావిశ్రాంతి స్థలములకు గురుతు "మహాదేవి! నిన్ను ధర్మ పత్నిగా మొదటపొందిన భాగ్యవంతుడనుకొన్నాను ఈనాడు నా భ్రాంతి నిర సనకు, లింగవంతుల సమన్వయ సిద్ధాంతము నెఱుకపఱచినందున నిన్ను గురువుగా పొంది శిష్యుండనై ధన్యుండనైతిని" అని మోళిగమారయ్య భార్యా గుణగానము చేసినపుడు సిగ్గుపొందిన మహాదేవిని అలింగనము చేసికొని చిర కాలము కల్యాణ పట్టణములో భార్యతో సుఖముగా నున్నాడు

—o—

ఇది కృపామూర్తులైన శ్రీ మృత్యుంజయప్పగారిని, స్వప్నబోధామూర్తు లైన శ్రీ ఎర్రి తాతయ్య గారిని స్మరించి, సకల శివశరణులను వందించి శూన్యసంపాదనలోని "మోళిగయ్యగారి సంపాదనము" నకు సంగ్రహముగా చెప్పిన వ్యాఖ్యానము సంపూర్ణము

—o—

శ్రీ గురు బసవ లింగాయ నమః

# శూన్య సంపాదనము

## నులియ చంద్రయ్యగారి సంపాదనము

౧౪

కం॥ *నులియపు చంద్రయ్యనువా
డిలలో చేయించె తనదు లింగము చేతన్
సలలిత మతి కాయకమును
ఫల సంపద భక్తుడతడు సకలావనిలోన్

కాయకము (పని) ఒక ధర్మముగా, ఆత్మతత్త్వముగా మారి, జీవనానుభవమునకు స్వాతంత్ర్యము శాంతినిచ్చి, సత్య, అహింస, అవరోధములచే సమాజమందు జాతిమత వివక్షలులేక, దురాశలకు తావీయక, ఎవరెవరు ఏయే పనుల యందుండిరో ఆ పనులు నలుగురి సహకారమునకు మూలమై, కుటుంబ నీతిని సమాజనీతిని అనుసరించి నడచుచుండినది ఈ సన్నివేశము బసవన్న - బిజ్జళుల ఔదార్యము ప్రజావాత్సల్యముల నుండి నెమ్మదిగా కొనసాగుచుండెను ఆర్థిక శాస్త్ర విశారదుడైన బసవన్న మంత్రియై యున్నందున దారిద్ర్య - ఐశ్వర్యాలకు ఎక్కువ విభేద దోషమును కలుగనీయక సమాజము సదా తన కాయకములో నిరతమై యుండినందున ఈ విషయము రాజకీయములో ఎక్కువ చర్చనీయాంశముగా నుండలేదు

రాజ్యములో ఏ కార్యములు జరిగినను, దైవధర్మముల స్మరణము మరువకుండగా నడచుచుండెను. మొదటగా ఆయ్దక్కి మారయ్య, మోళిగయ్యల

---

* నులియపు = (పగ్గ కణులు) ప్లేవెడు

కాయక తత్త్వములు శరణ సమ్మతిని పొందినవి ఉన్న కాయక శీలురందఱు అనుభవ మంటపములో చర్చించుటకు సాధ్యము కాలేదు ఐనను చందయ్య అనునాతడు గణనీయుడు పగ్గముల్లి పగ్గమునకు రెండణాలకు తక్కువగాక ఎక్కువగాక, అమ్మి వచ్చు ధనముతో ఆ రోజుకారోజు గురులింగ జంగమ దాసోహము చేసి తృప్తజీవనము నడుపుచుండెడివాడు ఈయనకుసంసారము లేదు

ఇతడు గురులింగమునకంటె జంగముని భక్తియందే నిష్ఠగలవాడు తన కాయకమందు కించిన్మాత్రము కొరతలేక, ఎవ్వరి దయాదాక్షిణ్యములకు తల వంచక తాను ఆరాధించు గురువును గాని లింగమును గాని అభిప్రాయ భేదమైనపుడు ప్రతిఘటించునట్టి దిట్ట ఏమైనను జంగమభక్తి విడువని కట్టడి కలవాడు అతడు కల్యాణ పట్టణమందు సామాన్యుడుగా నులక చందయ్య పేరుతో ఉండెడివాడు

ఒకనాడు చందయ్య నారు తెచ్చుటకు పోయి కోయుచుండగా ఎడమ చేతికి కట్టుకొన్న వస్త్రము వదులైనది చందయ్య భద్రముగా కట్టుకొనినాడు. పని సాగినది ' వదులైన వస్త్రమును కట్టుకొనునపుడు పక్కనున్న కొలనులో లింగము జారి పడినది లింగయ్య జారిపడుటకు కారణములున్నవి జంగమనిష్ఠ ఎంతటిదో చూడవలెను ఆ నిష్ఠను బసవాది ప్రమథులలో ప్రసిద్ధికెక్కించవలెను ముఖ్యముగా ఇన్నినాళ్ళు తన కాయకములో లింగమునెంతో పూజించినాడు ఆ పూజకై లింగమాతని సేవ చేయవలయును ఈ మూడు కారణములచే లింగము నీళ్ళలో మునిగినది చందయ్య చూచి తెలుసుకొనినాడు ఈ గొడవ నాకెందుకని కోసిన నారు మోసుకొని పోయినాడు

తనను చేబట్టక పోవడని అనుకొనిన లింగయ్య నీళ్ళలో నుండియే పిలచినాడు ఆ పిలుపును వినిన చందయ్య నిలువకుండ పోవుచుండగా లింగము తన గోళాకారమును వదలి మనిషియై వచ్చి చందయ్య ధోవతిని పట్టుకొని నిలిపినాడు నన్ను విడచి నీకు పోదగునా యని లింగయ్య అడుగగా 'అయ్యా! నిన్ను నేను విడువలేదు నీవే విడిచి నన్ను దూరమున్నా' వని చందయ్య ముందుకు పోవ ప్రయత్నించగా, నన్ను విడచిపోవ సాధ్యము కాదని విడువకుండిన, జంగమ దాసోహమునకు అలస్యము కాకాదని ఉపాయము పన్ని,

చందయ్య స్వామి, "ముందు కాలువ దగ్గఱ మడివాళ మాచయ్య శరణుల గుడ్డలు ఉతుకుచున్నాడు రమ్ము ఆయన చెప్పినట్లు చేయుదము" అని ఇద్దఱు మాచయ్య దగ్గఱకు వచ్చి వివాద కారణమును జెప్పిరి ఓహో! ఇది లింగలీలా విలాసమని నవ్వుకొని చందయ్య దిట్టతనమునకు మెచ్చి మడివాళ మాచయ్య ఇట్లనుచున్నాడు

**మడివాళ మాచయ్య**

వచ్చెదనన్న సుఖమును వద్దు పొమ్మనగలరె?
కనుగొన్న నిధానమును తొలగుమని యందురే? సుఖము
నకు సుఖము తోడైన వద్దనగలరే? కలిదేవయ్య వచ్చెద
నన్న వద్దనుటేల చందయ్యా? ౧

**వివేచనము**

అయ్యా! వచ్చెదనన్నది దయ్యము కాదు నీ ఆరాధ్య చందేశ్వర లింగము వద్దు వద్దనుట ఎంతటి అవివేకము! ఎదుట వలచి నిలచిన సిరిని త్రోవకడ్డు తొలగుమనెదరే? కాదు చందయ్యా! సౌఖ్యమునకు సౌఖ్యము వచ్చిచేరిన ఎంతయు సంతసించుదురు గాని ఈసడించి పొమ్మందురే? ఆహాహా! వచ్చెద నన్నమాట ఎంత సుఖమో! నేనేనాడు ఇటువంటి సంఘటన చూడలేదు వద్దనరాదు నీకు పూజనీయుడు నీ పుణ్యపుంజమును భక్తితో స్వీకరించు" మని మడివాళ మాచి దేవుడు చెప్పగా చందయ్య ఇటులనుచున్నాడు

**చందయ్య :**

అటుపోయి ఇటు వచ్చెద ననుచుండు ఈ కపటంబు
సేయ చొప్పునే? ఘన లింగ మెక్కడనున్న అక్కడనే
పరిపూర్ణము లింగము పోయెనన్న సందేహము నాకుండిన
లింగము మిగలగలదే? ఆత్మలేక ఘట మెట్లుండును?
జంగమ మున్నంతవఱకు చందేశ్వర లింగమునకు తావు
లేదు కనుమా మడివాళయ్యా! ౨

**వివేచనము .**

మాచిదేవయ్యగారూ! తమరు ఖండితవాదులని విన్నాను ఈ లింగయ్యగారిది అంతయు,విన్నారుకదా! ఇక నాకు చెప్పుటకేమున్నది? ఎవరు ఎవరిని విడిచి నారను మాటమీద న్యాయమున్నది నన్ను విడచుటకు ఏమి కారణమో లింగయ్య నడుగవలె గాని నన్నుగాదు పోయిన ఆయన మఱలి నా దగ్గరకే రావలసిన అవసరమేమియు లేదు లింగస్వామి జగద్భరితుడు గాన ఆయన ఎక్కడ ఉండినను అక్కడే పరిపూర్ణుడు లింగము పోయెనన్న సందేహము నాకు లేదు అటులనే లింగము పోయిన అంగమెట్లుండును? నేను జంగమారాధకుడను జంగమములో నేను అంతయును గాంచు భక్తుండను. ఈ లింగయ్య నా యిష్టము ప్రకారము ఉండ నొల్లడు తన ఇష్టము వచ్చినట్లు ఉండుట లింగమనిపించదు ఆయన సహవాసము సమంజసము కాదని చందయ్య అవసరమవసరముగా జంగమకాయకమునకు వేళమించుచున్నదని పలుకు మాటలకు, అతని దిట్ట తనమునకు తల ఊపి ఈయన సామాన్యుడు కాదని మెత్తగా మడివాళుడు ఇటుల చెప్పుచున్నాడు

**మడివాళ మాచయ్య :**

దాసోహ మక్కఱ ఉన్నంతవఱకు ఈశ్వరపూజ
ఆచారమందుండవలయు చేయనన్న నేమము వద్దు
చేసెదనన్న కృత్యము వద్దు ఈ ఉభయ సమ్మ
తము చేకూఱెనన్న కలిదేవయ్యకు భావశుద్ధమై యుండె
కనుమా చందయ్యా! ౩

**వివేచనము :**

దాసోహము చేయు నవసరములో వాదము వద్దు చందయ్యా! లింగము లేకుండగా జంగమ దాసోహము చేయరాదు అది లింగవంతుల ఆచారముకాదు ఒక మాట విను భక్తుడైనవాడు చేసెదనని చెప్పరాదు చేయననియు అనరాదు రెండును దాసోహమునకు కళంకములే ఈ రెంటిని మరచిన భావశుద్ధి చేకూఱును అని మాచయ్యగారు- లింగము విడువరాదు. దాసోహము వదలరాదు లింగసాక్షిగనే నడువవలసినది అని చెప్పిన మాటలు చందయ్య సమ్మతింపక 'అట్లనుచున్నాడు.

చందయ్య :

లింగమనునది గురుని హంగు గురువనునది
లింగము హంగు ఈ ఉభయంబున కతీతము జంగమ
లింగ దాసోహము అది చందేశ్వర లింగమునకు నియ
మంబు సుమా! మడివాళయ్యా! ౪

వివేచనము :

మడివాళయ్యగారూ! కారణము లేకుండా నీళ్లలో మునిగిన లింగయ్యకు ఒక్క బుద్ధి కలిగించు మాట అయినను చెప్పక, నాకడనే దోషమున్నటులు నాకే చెప్పుచున్న మీ న్యాయమార్గమెట్టిదో నాకు తెలియకున్నది

గురు-లింగ-ఉభయుల కతీతము జంగమ లింగ దాసోహము నా చందేశ్వర జంగమ లింగము ఇందులకు సమ్మతించను లింగదేవుని లీలలు ఏ విధముగా ఉండినను ఇప్పుడు నాకు వేళలేదు జంగమ దాసోహము నియమిత కాలమున జరుగవలెను అని చందయ్య దాక్షిణ్యములేకయే ముందునకు పోవుచుండగా లింగయ్య ధోవతి బట్టి నిలిపినపుడు "ఈ భక్త-లింగ లీల లింగపతి శరణసతి సంసారమువంటిది, ఒకరిని విడిచి రెండవవారు ఏమిచేయుటకును కాదు" అని మడివాళ మాచయ్య సౌమ్యముగా ఇట్లనుచున్నాడు

మడివాళ మాచయ్య

జంగమ సేవ లింగవిరహితమై యుండవలెనా?
లింగమనునది జంగముని అంగము ఆ అంగము లేక
ప్రాణముండునా? లేని ఫల రుచిని కోరినట్లు నీదు
కాయక క్రియ యంతయు లింగమై యున్న మీదట,
మరేమి భావ భిన్నత కలదా? నీ వనినటులే కానిమ్ము
ఏమయినను నీ మనము నిర్మలము. కాని దీనికి కలి
దేవయ్య సాక్షి, పిలుచుకొని పోవయ్యా! నా ఒడయని!
చందయ్యా! ౫

వివేచనము :

చందయ్యా! నీ జంగమ దాసోహము శ్లాఘనీయము లింగ సహితముగా చేయుట విధ్యుక్త ధర్మము లింగమునకు జంగమమునకు భేదము లేదు లింగమే జంగమాంగము ఆ అంగము లేనప్పుడు ప్రాణ మెక్కడ ఉండును? పండు లేక రుచిని మాత్రమే కోరినట్లున్నది కాయక మంతయు చందేశ్వరునిదై నడచు ననెడి నీ భావమునకు, చందేశ్వర లింగము లేక దాసోహము నడచుట ఎట్లు? నీ ఇష్టమే లింగము యొక్క ఇష్టము నన్ను ఆ లింగమే విడచె ననిన దానికి ఇంత చర్చ ఏల? ఏమైనను భక్తుడు విడువరాదు వచ్చెదనని వెంటబడి నాడు కదా! విడచినవాడు ఆ మాటను అనగలడా? నీకును కాయకము నాకును కాయకము కలదు ఎక్కువ మాటలు వలదు లింగయ్యను పిలుచుకొని పొమ్మని చందయ్యకు మడివాళయ్య గారు వివేకించి చెప్పగా చందయ్యకు ఏమి చేయుట కును తోచక, పెద్దవాడు మాచయ్య మాట మీరరాక ఇట్లనుచున్నాడు

చందయ్య :

ఇష్టమనునది గురుని హంగు ఆ గురువునకు,
ఇష్టమునకు జంగమమే ప్రాణమని తెలిసికొన్న పిదప
ఆ గురువు, ఇష్టము జంగమమందే అణిగి యుండె
కనుమా! ఆ గురువు లింగము జంగమాధీనులు ఈ
కారణముచే చందేశ్వర లింగమునకు పగ్గము నేయుటకు
వచ్చెద నన్నారమ్మా నా తండ్రి! ౬

వివేచనము :

స్వామి! మడివాళయ్య గారూ! బసవన్న గారు కూడ మీ మాటను మన్నించెదరని వినియున్నాను మీ మాట మీరరానిది తమ నమ్మకము మీద లింగమయ్య యథారీతి లింగమై పూజలు చేకొననీ నా జంగమ కాయమందు సహాయకుడై ఉండనీ, గురు లింగములకు జంగమమే ప్రాణమను విషయమును వారిద్దఱును జంగమమునందే నివసింతురను విషయమును తమకు తెలియనివి కాదు. పగ్గములమ్ము కాయకమునకు నే చెప్పినటులు రెండజాల కొక పగ్గము అమ్ముకొని రావలయును అటులైనచో రమ్ము అని పిలువగా లింగయ్యకు

ఎంతయో ఆనందమై చందయ్య మోసికొని వచ్చుచున్న నారు మోపును తన తలపై మోసుకొని వెళ్ళినాడు

మడివాళ మాచయ్య నవ్వుకొన్నాడు లింగపతి - శరణపతి వ్యాజ్యము ఎంత తీరనిదిగా సమస్యయై యున్నదో -అది ఒక్క క్షణములో ఏమియులేనట్లు పరిష్కారమై వెనుదిరిగి చూడక ఇద్దఱు పోయిరి కదా! లోకవర్తన మెంత విచిత్రము! అది కాదు, ఇది కాదు, ఇది ఉండవలెనని మానవులు శ్రేష్ఠములని వేనిని చేర్చుకొన్నను అది సంసారముగా మారును కదా! అనుకొనుచు శరణుల వస్త్రాలను మడిజేసికొని మడివాళ మాచయ్య వెళ్ళినాడు

కొంత కాలము తరువాత-

చందయ్య చెప్పినట్లుగా కొంత కాలము పగ్గములమ్ము కాయకములో లింగయ్య సేవా కార్యము చేసినాడు ఆయన తలచిన భక్త సేవా కార్యము దొరికినది ఆయనిట్లనుకొనినాడు భక్తుని కాయక నిష్ఠ కల్యాణ పట్టణములో ప్రసిద్ధికెక్కవలెను ఇట్లు ఎంత కాలము చేసినను ఈ మహా శరణ సమూహమునకు తెలియరాదు అనుభవ మంటపమునకు పోవు ఉపాయము నాలోచించు చుండగా ఒక చక్కని ఉపాయము తోచి, ఒక దినము బసవన్న ఇంటికి పోయి "మహా భక్తుడు చందయ, గారి పగ్గాలు" అను కేకపెట్టగా బసవన్నయే విని బయటకు వచ్చి నమస్కరించి పగ్గములన్నియు తీసికొని వేయి రూకల సంచి నీయగా, లింగయ్య అత్యంత సంతోషముతో చందయ్య దగ్గఱకు వచ్చి సంచిని ముందు పెట్టగా నియమ శీలుడైన చందయ్య దిగ్గునలేచి "ఏమిది, ఎచ్చట ఈ ధనమును దొంగిలించితివి? నా మాటలను తిరస్కరించి జంగమ దాసోహమును అపవిత్రము చేసితివి" అని కోపాక్రాంతుడై ఇట్లనుచున్నాడు

**చందయ్య**

బాధించి, బంధించి, బలవంతముచేసి, కన్నకన్న
వారిని వేడి తెచ్చినది జంగమలింగంబునకు అర్పించెద
నన్న, చేయు కష్టమునకు, నైవేద్యమునకు పనికిరాదు
తనువును కరగించి, మనసుమ ఐడలించి, వచ్చిన తెర
గెఱిగిన సంశయావకాశమేలేని జంగమ లింగమునకు

దాసోహమే కార్యము కాయకము నుండి వచ్చిన కాకర
కాయి యైనను లింగమున కర్పితముగాని, దురాశనుండి
వచ్చినది అనర్పితము ఈ కారణముచే సత్యశుద్ధ కాయ
కమే నిత్యద్రవ్యమై చందేశ్వర లింగమునకు నైవేద్య
ముగా అర్పణమై యుండెవినవయ్యా! —౨

**వివేచనము**

ఇక్కడ నుండి ఈ క్షణమునందే వెళ్లిపొమ్ము నీవు లింగడివైననేమి? శంభుడవైననేమి? క్రమము తప్పినవాడు పనికిరాడు సత్యశుద్ధమైన జంగమ పవిత్ర కాయకమునకు నియమభంగముచేసి, నియమిత ద్రవ్యమున కన్న ఎక్కువ తెచ్చి పరద్రవ్యాపహరణ దోషంబు కాయమున కంటగట్టినావు ప్రతిదినము పోవు చోటునకు పోవక ఈనాడు బసవరాజు ఇంటికి ఏల వెళ్ళినావు? దీనిలో ఏదియో వంచన, మోసము ఉన్నవి కష్టార్జితము కానిది కాయకము కాదు, కైలాసముకాదు అవి అంతయు నాకెందులకు? మొదట గురువు ఇచ్చిన ఆకారము వీడిన నీవు గురుద్రోహివి గురుని నియమ ప్రకారము నడుచుకొనక భక్త ద్రోహము చేసినావు ఆదియును గాక మహాశరణుడు మాచిదేవయ్య ఇచ్చిన నమ్మికను చెడగొట్టిన మహాద్రోహివి నీ ముఖమును చూడరాదు పొమ్ము అని చందయ్య గర్జించినప్పుడు లింగయ్య "బసవన్న ప్రసాదించినది తిరస్కరించ రాదు నన్ను పొమ్మనిన ఎక్కడకు పోదును? తీసుకొని వచ్చిన ఈ రూకలతో మడివాళ మాచయ్య ఇంటికి పోయి జరిగినది చెప్పి, ఆయన ఎట్లు చెప్పిన అటు లనే నడుచుకొనుట మంచిది" అని లింగయ్య చందయ్యను బలవంతముగా పిలుచుకొని మడివాళయ్య మఠమునకు వచ్చినాడు

మాచయ్య న్యాయము అర్థము తిరిగినదని ఆలోచించగా చందయ్య లింగయ్య చేసిన కాయక భంగమును తెలుపుచు, "ఆయన మొదటనే చెడిన వాడు మీరిచ్చిన మాటచే నా కాయకము చెడినది" అని బసవన్న ఇచ్చిన రూకల సంచిని దృష్టాంతముగా చూపినాడు "లింగస్వామి చేసినది తప్పయినట్లు కనిపించినను అతడు తప్పు చేయడు ఈ తప్పును సాకుగా తీసికొని ఏదియో మంచిని వెల్లడించుట కుద్దేశించినట్లున్నది ముందు బయట పడనున్నది చెప్పి చూచెదను" అనుకొని మాచయ్య ఇట్లనినాడు

**మడివాళ మాచయ్య**

కాయకము చేయు శరణునకు సేవకుల తప్పు పట్టెదనన్న కాయకము నడచుటెట్టులు? అవ గుణమునకు కోపగించవలె గాని, లాంఛనమునకుగా కోపించుదురే? వశమునందున్న గుఱ్ఱము కాలు కత్తిరించు వారుందురే? నల్లి కుట్టిన ఇల్లు కాల్తురే? కలి దేవర దేవునందు తప్పు పట్టరాదు చందయ్యా! ౮

**వివేచనము**

'చందయ్యా! ఒక కార్యమును పూనుకొని చేయునాతడు తన పని క్రమముగా సాగుటకునయి పరిచారకులు సేయు పొరబాట్లను ఓపికతో సహింప వలెను ఆతురత కార్య హాని కలిగించును నీ లింగయ్య నీ కాయక సేవా కార్యమునకు దొరికిన భాగ్యము ఈ కల్యాణ పట్టణములో ఇంతటి శరణ సమూహమున్నది కదా - ఎవరికి ఈ భాగ్యము దొరికినది? చందయ్యా! దేవునకు సేవజేయు వారున్నారు దేవునితో సేవ చేయించుకొనుచున్నవారు నీవు గాక మఱెవరున్నారు? బసవన్నకు నీ పగ్గాలిచ్చినాడు పవిత్రముగా భావించి బసవన్న చందయ్యకు తన కానుక నిచ్చినాడు లింగయ్య తెచ్చి నీకిచ్చినాడు లింగయ్యకు భక్తులలో తరతమ భావము లేదు ఇద్దఱును భక్తులే వారి ప్రసాదములు వినియోగించినాడు" అని లింగయ్య చేసిన నియమ భంగమును కావ్యముగా వర్ణించుచున్న మాచయ్యగారిపై కోపము వచ్చి చందయ్య ఇట్లనుచున్నాడు

**చందయ్య :**

ఆడిన మాటకు చేటు వాటిల్లిన, ఇచ్చిన బాసకు భంగము కనుమా! చేపట్టిన పనికి హాని కలిగిన, దేహము నుంచుటటే భంగము కనుమా! ఈ కారణముచే మాటలు నడతలు శుద్ధములు కానపుడు చందేశ్వర లింగమైనను చేసిన తప్పునకు నేనొప్పను కనుమా, మడివాళ మాచయ్యా! ౯

**వివేచనము :**

"స్వామీ! తమరెంతటి పెద్దవారైనను ఏకపక్షముగా న్యాయము చెప్ప రాదు లోకములో ఎవరేని ఆడినమాట తప్పక ఉండవలయును అదియే ఉత్తమోత్తమమగు నీతి ఆ నీతియే గురులింగ జంగమత్వము ఇంత పొడవుగా నా భాగ్యమును, లింగయ్యగారి సేవాశ్రేష్ఠతను పొగడినారు ఎందులకో తెలియ లేదు నిష్ఠురవాదులని పేరుపొందిన మీరు ఇంతటి మెత్తదనము పొందుటకు కారణమేమైనను ఉండనీ కాని, నాకు ఈ నియమభ్రష్ట లింగ సహవాసము వద్దు మీకును గౌరవము రాదు నాకును గౌరవమురాదు" అని చందయ్య కోపముతో పరుషముగా మాటలాడినపుడు మడివాళుడు "ఇది పైవారి న్యాయము నాకు సాధ్యము కాలేదు ఏదైనను అంతయే అంగ సంసారమైనను, లింగ సంసారమైనను ఒకతూరి పొరపొచ్చెము కలిగిన అది పెరిగి పెద్దదగును" అని యనుకొని అనుభవ మంటపమునకు పోవుటయే మేలని ఇట్లనుచున్నాడు

**మడివాళ మాచయ్య :**

గురుపూజ నెఱిగితినని లింగపూజను విడువరాదు
లింగపూజ నెఱిగితినని జంగమపూజను మరువరాదు
జంగమపూజ నెఱిగితినని శరణుల సంగము మరువ
రాదు. ఈ కారణముచే శరణుల సంగిసమ్య జ్ఞానము
లేక కలిదేవయ్యను కూడు కూటము కానరాదు పోవుదము
రమ్ము చందయ్యా!

**వివేచనము :**

భక్తునకు గురు లింగ జంగములు సమానముగా ఆరాధనీయులు ఎందుకనిన, ఒకే తత్త్వము మూడు విధములుగా భక్తుని భక్తి వికాసమునకు మూలము గురుపూజలో లింగపూజను మరువరాదు లింగపూజలో జంగమపూజ విడువరాదు జంగమపూజ కరగతమైనదని శరణుల సమాజమును దూరీకరింపరాదు వారి సమ్మతిని పొందినగాని భక్తినిర్ణయము కాదు

ఈ లింగాంగ న్యాయము మనలో సరిపడలేదు అనుభవ మంటప తీర్మానమునకై మీరు వచ్చిన మంచిది నిర్ణయమగును అనుచుండగా లింగయ్య

దిగ్గున లేచి "నడవండి స్వామి మీ సహాయమునకు మాకెంతయో మెచ్చు కొన్నది" అని చక్కాలు చూచుచు కూరుచున్న చందయ్యను రెట్టపట్టి లేపి మడివాళునితో కలిసి వెళ్లెను ఇంతలాగా లేనిపోనిదంతయు నాటకముగా రక్తి కట్టినదని లింగయ్య సంతసించినాడు "ఇదంతయు ఏమిటో! మన పనిని మనము చూచుకొనకుండ రచ్చకెక్కించె ఈ లింగయ్య" అనుకొనుచు నిదానముగా చందయ్య లింగయ్య వెంబనే వెళ్లినాడు "చందయ్య చెప్పినట్లు లింగము లేకనే జంగమ దాసోహము చేయవచ్చుననిన, బసవన్న చేయు దాసోహము గతి యేమిటి? ఇదియొక విచిత్ర సమస్య పరిష్కారము చేయుటే మత ధర్మమునకు యోగ్యము" అనుచు మాచయ్య ముందు నడచెను

**అనుభవ మంటపము**

అల్లమ ప్రభుదేవుని ఆధ్వర్యమున నిరాడంబరముగా బసవాది ప్రమథులు ఒక భాగమున, శరణు లొక భాగమున కూర్చొని తమ అనుభవములను చర్చించుకొనుచుండ మడివాళ మాచయ్యతో చందయ్య లింగయ్యగారు సభా ప్రవేశము చేసి దీర్ఘదండ నమస్కారములు చేయుగా, సభాగమనము చేసినవారిని గమనించుచున్న బసవరాజు దగ్గఱకు లింగయ్య పోయి పగ్గములకని తన కిచ్చిన ధనపు సంచిని ఎదుట నుంచెను ఇట్లుచేయుట యెందులకో ఎవరికిని తెలియలేదు ఎపుడైనను ఆ సభలో అనుభవముల వ్యవహారమే కాని ధనపు సంచి ప్రసంగము నేరుగా బసవన్నకే సంబంధించినది ప్రభుదేవునకు కుతూహలము కలిగించు విషయమయ్యెను మడివాళునకు తెలుసునని అంద ఱనుకొనుచున్నప్పుడు ప్రభు కనుసన్న నెఱిగి జరిగిన లింగాంగి సంసారపు కథను స్వారస్యముగా చెప్పగా అందఱును ఆశ్చర్యభరితులైనారు

అప్పుడు చందయ్య లేచి శివశరణు లందఱకు శరణార్థు లర్పించి, తాను నిత్యము సేయు జంగమ దాసోహమును గుఱించి వివిధరీతుల వర్ణించి చివరకు ఇట్లనుచున్నాడు

**చందయ్య :**

సంసార సాగర మధ్యమందు పెరిగిన ఏనుగు
గడ్డి కోసితెచ్చి, దాని చిక్కుదీసి, పగ్గమల్లి, ఇహపరము

లను ఉభయమును ముడివేసి, కొనయందు కార్యకూట
మను మనోగుణికయే నాకు కాయకమై యుండె ఈ
కారణముచే చందేశ్వర లింగమను భావంబు నాకు లేదు ౧౧

**వివేచనము**

మహనీయులారా! జీవనమను మహాసాగర మధ్యమందు కామ, క్రోధ, లోభ మోహ, మద, మాత్సర్యాది అరిషడ్వర్గాలు, సప్తవ్యసనాలు, త్రిమలాలు, క్లేశ పంచకాలు మొదలగునవి దట్టముగా పెరిగిన ఏనుగుగడ్డిని కోసి తెచ్చి, దానిని శుభ్రముచేసి పగ్గముగా అల్లి, ఇహపరములను రెంటిని ముడివేసి చివరకు కార్యకూటమనెడి బంధము కూర్చి కాయికము చేయుచున్నాను గురులింగ జంగమాంతర్గత భావము నెఱిగి జంగమమే ముఖ్యమని ప్రతిదినము నేఁజేయు దాసోహమిది శ్రేష్ఠమని చెప్పుచున్న చందయ్య భావమెఱిగి అల్లమప్రభు విట్లను చున్నాడు

**అల్లమప్రభు** :

పరుసమైనను ఒకదానియందు ఉంచవలయును
రత్నవిశేషమైనదైన కుందనమున బంధించి యుంచవల
యును లింగమును పట్టి యుండుటకు పూజించు అంగ
ముండవలయును ఈ కారణముచే గుహేశ్వర లింగ
మెఱింగి మరువరాదు సుమా, చందయ్యా! ౧౨

**వివేచనము**

అయ్యా చందయ్యా! నీ కాయకమునకు జంగమత్వమే ముఖ్యమనునది కాదనరానిది. ఐనను లింగము లేక జంగమత్వము ప్రధానమెట్లగును? లోక వృత్తమే కానిమ్ము, శరణతత్త్వమే గానిమ్ము- అవి ఒకటిగా ఒంటరిగా శోభిల్లవు. రత్నము కానిమ్ము లేక అమూల్యమగు పరుసవేది కానిమ్ము దాని కనుగుణమగు ఇంకొక వస్తువుతో జత కూడిన గాని రాణింపవు ఉపయోగమున కును పనికి రావు. నీవు శ్రేష్ఠత గనిన జంగమమూ లింగాంగమే కదా! ఒక ముఖ్యమైన మాట! ఆరాధనీయమైన లింగమును ఒకమారు తెలిసికొనిన తరు

వాత మరువరాదు అని జంగమమే ముఖ్యమనిన దానికి లింగ సమన్వయమును ప్రభువు చెప్పినప్పుడు చండయ్య దానికిట్లు బదులు చెప్పుచున్నాడు

**చందయ్య**

గురుసేవ చేసిన ఇహమందు సుఖము లింగసేవ
చేసిన పరమందు సుఖము జంగమ సేవ చేసిన ఇహ
పరంబులు నాశనము ఇది చందేశ్వర లింగ భావంబు
కనుమా, ప్రభుదేవా! ౧౩

**వివేచనము :**

"ప్రభుదేవ! తమకు తెలియనిదేమున్నది? ఈ గురు లింగములు ఫల దాయకములు గురువును కొలచిన ఈ లోకములో భోగైశ్వర్యములు, లింగ పూజ చేసిన పరలోకములో సౌఖ్యములు కలుగును ఇవి రెండును లేనిది జంగమ సేవ ఇహపర సుఖములు భవబంధాలు కావున, ఇది చందేశ్వరలింగ భావమే"యని చందయ్య తన జంగమ కాయకమును నిరూపించినపుడు అల్లమ స్వామి ఇట్లనుచున్నాడు

**అల్లమ ప్రభు :**

అంగమున్నంత వఱకు లింగపూజ చేయవలయు
,లింగమను మూర్తి యున్నంత వఱకు ఎడతెగక
అర్పణము సేయవలయు అంగము నశించినను
లింగమను భావమును విడువకుండవలయును అది
గుహేశ్వర లింగమందు తీరు చందయ్యా! ౧౪

**వివేచనము .**

కాయకమందు ఫలాఫలముల విభజనము సేయరాదు గురు లింగజంగమ సామరస్యానందమే నిజ జీవనమునకు మూలము ఇహపరముల సంబంధము కాదు సామ్యము కాదు అంగమున్నంత వఱకు లింగపూజ చేసియే తీరవలెను లింగమున్నంత వఱకు ప్రసాదార్పణ ముండవలయును అంగనాశనమైనను, లింగభావము నిత్యము. ఇది నిజ గురు లింగ తత్త్వమని నిర్ణయముగా ప్రభువు

చెప్పినప్పుడు చంద్రయ్యకు సమ్మతి కాలేదు ఎక్కడ తిరిగినను గురు లింగముల ప్రశంస ఉన్నది ఎంతటి పెద్దవారు చెప్పినను ఉన్నదానికంటె ఎక్కువగునా? అని చందయ్య ఇట్లనుచున్నాడు

చందయ్య :

గురువునకైనను కాయకంబుననే జీవన్ముక్తి
లింగమైనను కాయకము నుండియే రాయియను గుణుతు
నష్టమగును జంగమమైనను కాయకము నుండియే తన
వేషదోషంబు తెగును గురువైనను జంగమ సేవ చేయ
వలయు లింగమైనను జంగమ సేవ చేయవలయును
ఈ జంగమమైనను జంగమ సేవ చేయవలయును ఇది
చందేశ్వర జ్ఞానంబు వినుమా ప్రభుదేవా! ౧౫

వివేచనము.

"గురువు బ్రహ్మస్వరూపుడు ఐనను, కాయకము చేయవలయును ఎందులకనగా, మానవ చంచలత్వ దోషమును నిగ్రహించి పరిశుద్ధుడై జీవన్ముక్తిని పొందుటకు ఆ కాయకమే మూలము లింగము ఱాయి అను దోషము నుండి విముక్తి చెందవలెననిన కాయకము చేయవలయును జంగమునీకుండు వేష దోష నివృత్తికి కాయకమే పరిహారమార్గము గురువుకాని, లింగము కాని జంగమసేవయందుండవలెను జంగమమే శ్రేష్ఠమని కాదు, ఆ జంగమమును జంగమసేవ చేయవలయును ఇది చందేశ్వరుని అనుగ్రహము" అని చందయ్య లింగము అంగముపైన విధిగా ఉండు తత్త్వమును ముఖ్యమని ఎంచబోయినను కాయకములో సమత్వమును సమర్థించినాడు లింగప్రాశస్త్యము అంగముపై నుండక ఏ కార్యమును కాదనుదానిని చందయ్య లక్షింపక పలికిన పలుకులు శరణ సభకు సమ్మతము కాలేదు అప్పుడు అల్లమదేవుడు సభను తిలకించి ఇట్లనుచున్నాడు

అల్లమ ప్రభు

ఎవరెవరి భావం బెరుగు తోచినటుల, ఆ భావమునకు
సుఖినైయుండును పట్టిన వ్రత నియమములను విడువక

యుండవలయు తాను చేయు ఎప్పటి నియమంబులందు
భావశుద్ధుడై యుండిన గుహేశ్వర లింగమునకు అన్య
భిన్నంబు లేదు మడివాళ మాచయ్యా! ౧౮

**వివేచనము :**

మాచయ్యా! చెప్పునదేమి? చేయునదేమి? నీవు అనుభవ మంటపమునకు తెచ్చిన న్యాయమే (వివాదమే) విచిత్రము. సామాజిక వివేచనముకన్న వైయక్తిక విచారము చందయ్య ముందుగొని శరణ సమూహము ఇష్టానిష్టముల గొడవ లేక తన నిష్ఠను ప్రతిపాదించుచున్నాడు శరణులు దీని నంగీకరింపక యుండి నను అతని గమనము ఆ కడ లేదు ఇది శివాద్వైత తత్త్వము ఒక్కొక్క రొక్కొక్క రీతి ననుసరించుటకు మత మొప్పదు శరణులు గమనించండి. చందయ్య తన కాయకములో నిష్ఠాగరిష్ఠుడు పరమ జంగమ దాసోహము తన చందేశ్వర లింగము విడువలేదు ఆ లింగ క్రియను మరువలేదు గురు లింగ జంగమ కాయకమందు జంగమ కాయకమే పరమోత్కృష్టమని చేయు నిరూప ణములో గురు లింగ ప్రాధాన్యత కంత తావు లేదు

మన మేమనినను ఆయన నమ్మిన భావము అచంచలము. నమ్మిన దాని యందు నిశ్చయబుద్ధి యుండిన చాలు ఆ నిశ్చయమునకే కాయకము చేయుట అతని ఇష్ట మెటులో అటులే యుండనిండు " అని అల్లమ ప్రభుదేవుడు వీరి శైవమత ధర్మపద్ధతిని కచ్చితముగా చెప్పక ఉదాసీనము చూపినపుడు మడి వాళుడు దానిని ఒప్పక తన అనుభవమునే ముందుచేసి ఇట్లనుచున్నాడు.

**మడివాళమాచయ్య :**

అంగము క్రియ లింగ నిజము లింగ నిజమే
జంగమము ఆ జంగమ క్రియ యంతయు లింగ
మయము జంగమ సేవయే లింగపు కళ లింగపు
కళయే జంగమము జంగమము నుండి వచ్చినదే ప్రసా
దము ఆ ప్రసాద ఫలమే లింగైక్యము ఈ గురువు
నుండి నేను నిజము సాధించితిని మా కలిదేవుని దేవ
బసవన్న నుండి వినవయ్యా చందయ్యా! ౧౯

**వివేచనము :**

నిత్య సదాచారమునందు పవిత్రములైన అంగక్రియలు లింగ నిజము నకు మూలములు. ఆ లింగము నిజమై వెలుగుటయే జంగమముగా పరిణ మించును. ఆ జంగమ పరిణామ మంతయు లింగమయ మగును లింగ కళో త్కృష్టతకు జంగమ సేవయే ప్రధానము ఆ ప్రధాన లింగము వెలుగే జంగ మము ఆ జంగమ కృపాలబ్ధమే ప్రసాదము ఆ మహా ప్రసాదము నుండియే లింగైక్యము నేను నా గురువు చూపిన మార్గమునుండి నిజము కనుగొంటిని" అని మడివాళయ్య గురు లింగ జంగమ సమత్వమును సాధించిన అనుభవమును జెప్పినపుడు చందయ్య ఇట్లనుచున్నాడు.

**చందయ్య :**

శిష్యునకు గురువు ఉపదేశించునపుడు తన్నుతాను
మఱచి లింగమీయవలయును. లింగ సంగ స్మరణం
బైన ఆ లింగమునకు తినిపించునోరు జంగమమైన కారణ
మున, ఆ జంగమ లింగ దాసోహమున కన్న వేఱొక
అంగంబు లేదు సంగన బసవన్న ప్రియ చందేశ్వర
లింగము విడువని భావంబు కనుమా మడివాళయ్యా! ౧౮

**వివేచనము :**

శ్రీ గురువు శిష్యునకు ఉపదేశించి లింగదీక్ష చేయునపుడు నేను గురువు నను అహంకారము తాల్చిన ఆయన గురువు కాదు ఇచ్చినది లింగమునూ కాదు లింగచేతనము జంగమము ఆ లింగమునుండి ప్రసాదము స్వీకరించు నది జంగమము కావున జంగమ లింగ దాసోహమే ముఖ్యము సంగన బస వన్న యొక్కయు చందయ్య యొక్కయు భావ మిది యని చందయ్య తన కాయకములో బసవని ప్రస్తావన చేసినపుడు నిర్ధరించి అల్లమప్రభు డిట్లను చున్నాడు

**అల్లమ ప్రభు**

అంగమునందు అలముకొనిన ఆచారమే లింగం
బని ఎఱిగెను మనము నందు వెలుగుచున్న ఎఱుక

జంగమమని తెలిసెను ఈ రెంటి సంగమమే తానని
ఎఱిగెను చేయు దాసోహమే లింగ జంగమంబని ఎఱి
గెను మా గుహేశ్వరు లింగమందు సంగన బసవనిరీతి
ఎఱుగవలెను సుమా చందయ్యా! ౧౯

**వివేచనము**

చందయ్యా! బసవన్నను తెలిసికొనుట ఎవరికైనను సులభము కాదయ్యా! బసవన్నను ఆవరించుకొని యున్నదే లింగము అది ప్రత్యేకముగా లేదు మనమునందున్న ప్రకాశమే జ్ఞానము అదియే జంగమము ఈ జ్ఞాన క్రియలకు తను మనములకు తానే మూలము ఈ రీతిగాచేయు దాసోహమే లింగ జంగమ దాసోహము కొంచెము సావధానముగా విచారింపవలెను పరిశుద్ధాచారమునకు పరిశుద్ధ విచారణమే కారణము, అని చందయ్యను హెచ్చరించి, బసవన్నను జూచి అల్లముడు "అయ్యా బసవదేవరాజా! చందయ్య తన జంగ మారాధనకు నీ ఆదర్శము తెలియదు ఆ శరణునకు నీ అనుభవము చెప్పవలె" నన్నపుడు బసవన్న ఇట్లనుచున్నాడు

**బసవన్న**

"మెల్లమెల్లగా భక్తాదిషట్స్థలైక్యంబు కాంచుదు
నంచు తామసజ్ఞానము నందుంటివి దానికి నీవు నిత్యంబు
పడసి వచ్చితివా?" అనుచు నిలచిన స్థలమందె నిజ
షట్స్థలంబడగకున్న జంగమ దాసోహమేలయని నిజము
తెలిపెను గాన లింగ జంగమ భేదంబు చెన్నబసవన్నకు
తెలియును నేను ఆతడుంచినట్లుండెదనయ్యా! ఈ కారణ
ముచే కూడల సంగమదేవునందు చందయ్యకు శరణని
శుద్ధుడనైతినయ్యా, ప్రభురాజా! ౨౦

**వివేచనము :**

ఇంకొకరికి చెప్పుటకు నాకేమి తెలియునయ్యా? భక్తస్థలము, మహేశ్వర స్థలము, ప్రసాదస్థలము, ప్రాణలింగిస్థలము, శరణస్థలము, ఐక్యస్థలము అను ఆరు స్థలములలో ఒకదాని తదుపరి మఱియొకస్థలము సాధనము చేయవలసిన

స్థితియుండగా, చెన్న బసవన్నను జూచి ఒక్కొక్క స్థలమును సాధించుటకు ఆయుష్యము చాలదుకదా! ఈ ఆరు స్థలములను సాధించుటకు నీవేమైనను బ్రహ్మాయుష్యము పొందివచ్చితివా? అది కాదు సాధనాపద్ధతి నీవు ఏ స్థలమందు నిలచితివో అచటనే నీతోడ మిగిలిన ఐదు స్థలములు కూడి యుండవలయును వెనుకటి పద్ధతి క్రమసముచ్చయము వదలి సరళమైన సమసముచ్చయ పద్ధతిని చెప్పినాతడు ఆయనే చెన్న బసవన్న ఇంకొకటి చాల మార్మికము, సులభము అనగా ఒక గురుతు నిలచిన స్థలము ఆరు స్థలముల కలయిక కాకయున్న జంగమ దాసోహమేలయని చెప్పినాడు అతడు నిజమును కరుణించిన మహాను భావుడు ఆయన చెప్పగల సమర్థుడు నేనున్నానని ఆయన ఉంచినట్లున్నాను ఇక చందయ్య మహాభక్తుడు అతడు సర్వమును జంగమముగా ఆరాధించు కాయక శీలుడు అతనికి శరణు అని బసవన్న ఏమియు తెలియనట్లు పలికి నపుడు చందయ్య తన జంగమ మాహాత్మ్యమును ఘనముగా కొనియాడుచు ఇట్లనుచున్నాడు.

**చందయ్య**

జంగమ నమస్కారమే గురుపూజ జంగమ
పూజయే లింగపూజ జంగమ తృప్తియే తనకు ప్రస
న్నతాగణము తనకు ప్రసాదమైనదే నిత్య ప్రసాద
ఫలము చెన్నబసవన్న ప్రియ చందేశ్వర లింగమునకు
నియమంబుసుమా సంగన బసవన్న ప్రభుదేవా! ౨౧

**వివేచనము**

"అయ్యా! శరణులారా! నా క్రమంబిది మహనీయ జంగమంబునకు నమస్కారము జేసిన గురుపూజ చేసినట్లగును జంగమపూజ చేసిన లింగ పూజయు కాగలదు దీనినుండి జంగమ తృప్తియే ప్రసన్నత జంగమ ముఖ ముగా వచ్చినది నిత్యప్రసాదము" అని చందయ్య చెప్పినప్పుడు శరణ సమూహమున కొక సందేహము కలుగుట కవకాశమైనది చందయ వాదాభి ప్రాయములో జంగమమునుండి లింగము, లింగము నుండి గురువుగా ఎంచుట కలదు ఎడమ భాగమునుండి కుడి భాగముగా ఎంచినపుడు జంగముడు కొన

వాడగును జంగమము నుండి వచ్చిన జంగముడే మొదటివాడగును ఉపాసనా విధియందు జంగముడే ముక్తిస్థల మగును అయన ఆనందమూర్తి యనియు, భోగమూర్తి యినియు సిద్ధాంతము రీతి చెప్పబడును కాయక క్రమములో జంగమదాసోహమే యని చేయబడును ఇది తప్పుకాదని ఎంచినను గురువును, లింగమును విడచి, ఆరెంటిని జంగమమునందే భావించి దాసోహము చేయవచ్చు నను అభిప్రాయమును వ్యక్తీకరించినాడు

వీరశైవమత సామాజిక సాధనాక్రమములో గురు లింగ జంగమ పూజ యందు సహజాచరణము, సంబంధాచరణము అని రెండాచారములు గలవు గురు జంగమములు లేనపుడు లింగమందే వారిపూజ చేయవలెను దీనినే సంబంధాచరణ మందురు గురు జంగముల పూజ చేసినపుడు సహజాచరణ మందురు ఈ రెండాచారములకు లింగమును మధ్యమముగా ఉంచుకొన్నారు. ఆ లింగములో ఉంచుకొనిన సంబంధాచరణము జంగమమునందుంచుకొని కాయ కము చేయవచ్చుననియే చందయ్య భావము తన వచనములలో వెల్లడించినాడు. అటుల వీరశైవ సిద్ధాంతము లేదనునది ఇచిపటికే చర్చనీయాంశముగా వచ్చినది ఇదంతయు వినిన అల్లమ ప్రభువు చందయ్యకు ఒకసూచన చేయుచున్నాడు

**అల్లమ ప్రభు :**

కన్ను కనకున్నచో మనము స్మరియించదు
ఆ మనము స్మరించు తావునకు కాలు నడవదు కాలు
నడవకుండిన కార్యంబు కాదు కాలన్న నీవు చరించు
వర్తనము ఆ వర్తనాచార మంతయు లింగము ఈ
కారణమున లింగమును విడిచిన కార్యము, ముడుపుకట్టని
ఇంటిదేవుని పండుగవలె మా గుహేశ్వర లింగమునకు
ఇదియే రహస్యము - శౌచము వినుమా చందయ్యా! ౨౨

**వివేచనము ◦**

పైన వివరించిన బాలపారమువంటి వచనార్థమును వివరించి చెప్ప నవస రము లేదు ముఖ్యార్థమిది లింగమును విడచి ఏ కార్యము చేయరాదు అని అల్లమదేవుడు నిర్ణయముగా చెప్పినపుడు మబ్బు తొలగిన బాల భాస్కరుని వలె చందయ్య అల్లమునితో ఇట్లు మనవి చేయుచున్నాడు

**చందయ్య :**

నాదు సత్క్రియ బసవన్న నాదు విజ్ఞానము చెన్న బసవన్న రెంటి ఏక భావము ప్రభుదేవుడవు నీవె మీ యందలి నిష్ఠ నిజము మడివాళయ్య ఇటుల చతుర్విధ ముగా నాకు అగు కారణమున సంగన బసవన్న ప్రియ చందేశ్వర లింగమందు ఇష్టలింగ నిజమె దాసోహమనునది చెన్నబసవన్న నుండి తెలియపఱచునట్లు చేయుమా ప్రభు రాయా! —౨౩

**వివేచనము :**

అల్లమ ప్రభూ! తమ మాట వేదము బసన్న, చెన్నబసవన్న, తమరు, మడివాళదేవుడు ఈ నలుగురి నిజనిష్ఠను కోరుచున్నాను తెలియక వాదము పెరిగినది. తమ కృపవలన నాకు నిజము తెలియుటకు మూలమైనది చెన్న బసవేశునుండి తెలియగోరెదనని చందయ్య వినయముగా పలికిన అల్లమదేవుడు సంతసించి చెన్నబసవన్నకు చెప్పగా ఆయన ఇట్లనుచున్నాడు

**చెన్నబసవన్న**

శ్రీ గురుకరుణంబె లింగము లింగపు నిజమె జంగమము ఇటుల ఇది బహిరంగవర్తనము ఇక అంత రంగ జ్ఞానమె జంగమము ఆ జంగము నడుపు సత్క్రి యయే లింగము ఆ ఉభయుల ఏకత్వ సిద్ధియే గురువు ఈ కారణమున అంగత్రయమందు లింగత్రయ సంబంధ మైనపుడు జంగమ దాసోహము జంగమ దాసోహము లేకున్న లింగ తృప్తిలేదు అంగముపైన లింగము లేకున్న ఆ జంగమసేవకైకొనడు ఈ కారణమున ఒకటి విడచి మఱొకదానియందు నిలచిన అంగము లేని ఆత్మ యట్లు శక్తిలేని శివునట్లు దీపము లేని ప్రకాశమట్లు ఒక అంగము శూన్యమైన భక్తియుండునే? అవయవ హీనుండు రాజపట్టమునకు తగునే? లింగహీనుడు భక్త్యా చారమునకు తగునే? అది దేవత్వంబునకు చెల్లదు మా కూడల చెన్న సంగయ్యయందు త్రివిధ సన్మతమే చర సేవయయ్యా! చందయ్య ప్రభూ! —౨౪

**వివేచనము :**

చందయ్యగారూ! వింటున్నారు కదా? ఇది నా అభిప్రాయము కాదు పురాతన శరణ సందోహము నడచిన పవిత్ర శివాద్వైత సిద్ధాంత మార్గమిది నీకు తెలియనిది కాదు మొదట ఇష్టలింగ ముఖముగనే జంగమ దాసోహము నడపినావు నీ లింగయ్య నీ సేవ చేయవలయుననియు, నీ ప్రసిద్ధివి గవి సంత సింపవలయుననియు ఈ దృశ్యము కల్పించినాడు భక్త జంగములను ఆలు మగల వివాదములకు ఇంకొకరు చెప్పుటకు కాదు ఎక్కువ చెప్పుట కేమియు లేదు గురులింగము నీ పుట్టినిల్లు జంగమ లింగము నీ భర్తయిల్లు భర్తతో లింగాంగ సామరస్యము పొందుటయే భక్తసతికి పరమోపాయము వివరించ లేను ఐనను ఇంకొకమాట చెప్పెదను

జంగమ నీమ పరమని ఎఱిగిన వేమి? ఆ జంగ
ముని అంగము గాదే లింగము? ఆ లింగ చైతన్యపు
జ్ఞానమెల్ల జంగమంబు గాదే? అంగము లేని జీవము,
ఆత్మ లేని అంగమునకు సర్వభోగ సుఖమున్నదే?
మన్ను లేక మ్రానుండునె? మ్రాను లేక పండుండునె?
పండు లేక తీపి యుండనె? దీని నెఱుగు క్రమంబిది
అంగమే మన్ను లింగమె మ్రాను జంగమమె పండు
రుచియె ప్రసాదము ఈ కారణమున కూడల చెన్న
సంగునందు సాకార లింగమే జంగముని అంగమయ్యా,
ప్రభు దేవా! —౨౩

**వివేచనము**

చదరపు స్థల నిర్ణయము సేయువారు సరియైన కొలత బద్దను నిర్ణ యించుకొని నాలుగు ప్రక్కల సమతను సరిజేసుకొనుచటుల ఎట్టి సాధకులైనను తాము సాధించు లౌకికమునైనను, తాత్వికమునైనను నలు దిక్కుల నుండి పరీక్షింతురు పెద్దల అనుభవమును కూడా కూర్చుకొనెదరు నీవు జంగమము లోనే గురు లింగమున్నదని, ఆ జంగమ పూజలో గురు లింగము చేరునను మాట కాదనరాదు ఉపాసనా రీతిలో సమాజ సంప్రదాయములో అది కొరత పడును లింగ సంబంధాచారమునకు, జంగమ సంబంధాచారమునకు వ్యత్యాస మున్నది పూజా సంబంధమునకు ప్రసాద సంబంధమునకు సామరస్యము లేదు. అన్వయము చేసికొనుట కొక మార్గము చూపుదును మన్ను నుండి చెట్టు, చెట్టు నుండి పండు, పండు నుండి రుచి కలుగు క్రమమునే మన మతమునకు పోల్చుకొనిన ఈ దేహమే మన్ను, లింగమే మ్రాను, జంగమమే ఫలము, ప్రసాదమే

రుచి ఒకదానిని విడచి మఱియొకటి ఉండదు సిద్ధాంతపు విచారములు ఎంత పెరిగినను ఆచరణకు రానివానినుండి వ్యక్తికి గాని, సమాజమునకు గాని ఎట్టి ప్రయోజనము లేదు నీవు కాయక యోగివి చెన్న బసవన్న సౌమ్య రీతిలో చెప్పినపుడు లింగయ్య సంతసించినాడు చందయ్య ఆనంద పరవశుడై ఇట్లనుచున్నాడు

**చందయ్య**

నా అంగంపు సత్క్రియ బసవన్న నా లింగంపు సత్క్రియ చెన్న బసవన్న నా ఎఱుక సత్క్రియ ప్రభువు నీవె నాదు దాసోహంపు నిష్ఠయే మడివాళయ్య ఈ కారణముచే నా అంగ లింగ జ్ఞాన దాసోహములు మొదలైన సమస్తమూ పురాతనములు చెన్న బసవన్న కృప ఇట్లుండిన, నేను మీ పాదంబు చేరి వేఱొండు గాక నిజమును పొందితిని చెన్న బసవన్నా చందేశ్వర లింగమందు శరణుల సమ్యక్ జ్ఞానము నాకు కలిగెనయ్యా! ప్రభురాయా! ౨౬

**వివేచనము .**

ధన్యుడనైతిని ఈనాడు మడివాళ మాచిదేవుడు శరణుల అనుభవ మంటపమునకు నాలింగయ్య పెట్టిన చిత్త విభ్రమ వివాదము తేగా విశేష సమన్వయ జ్ఞానానుభవము పొందు మహాభాగ్యమబ్బినది అని తన సౌభాగ్యంబు చెప్పుకొనుచు వచ్చునపుడు బసవన్న లేచి వచ్చి తానిచ్చిన ధనపు సంచిని చందయ్యముందుంచి చేతులు జోడించి "స్వామి! బసవుడు ఇచ్చును గాని ఇచ్చినది పుచ్చుకొనడు అనుగ్రహించవలెను " అనిన బసవన్న అవధానమునకు అందఱు సంతసించిరి మహా ప్రసాదమని ఆ రొక్కము లింగయ్య పట్టుకొని వెళ్ళెను

— ౦ —

ఇది కృపామూర్తులైన శ్రీమృత్యుంజయప్ప గారిని, స్వప్న బోధా మూర్తులైన శ్రీఎర్రి తాతయ్య గారిని స్మరించి, సకల శివ శరణులను వందించి శూన్య సంపాదనలోని 'నులియ చందయ్య గారి సంపాదనము'నకు సంగ్రహముగా చెప్పిన వ్యాఖ్యానము సంపూర్ణము

— ౦ —

శ్రీ గురు బసవలింగాయ నమః

# శూన్య సంపాదనము

## ఘట్టి వాళయ్యగారి సంపాదనము

౧౩

కం॥ అనఘుండు ఘట్టివాళుడు
ఘనమగు పెనుగుండు తనదు కరలింగముగా
నొనరగ జేసిన నెటిమన
సున కథ నచ్చెరువు కలుగ సుజనులు వినరే!

పరమ వైరాగ్య శీలుడు, నిష్ఠురవాది, ఘట్టివాళ ముద్దన్న అను శరణుడు కల్యాణ పట్టణమందుండెను ఎక్కడనుండి వచ్చెనో తెలియదు సిద్ధవీరన్నగారు కైలాసము నుండియే వచ్చినాడని తన శూన్యసంపాదనలో చెప్పినారు ఈయన కథ కొంచెము భైరవేశ్వర కావ్యములో దొరుకుతుంది మొదట సంసారిగా ఉండి భార్య నడత సరిపడక విడిచిపెట్టినాడు దాని విషయమంతగా తెలిసికొన దగినది కాదు ఏదయినను తెలిసికొనుట తప్పు కాదనుకొనువారికి - కథ ఇటు లున్నది

ముద్దన్న భార్య సద్గుణసంపన్నురాలు కాదు అది తెలిసియుండినను దాని సవరణకు ముద్దన్నకు తన శరణ తత్త్వానుష్ఠానములో అవకాశము దొరక లేదు ఇట్లుండగా తన పుట్టింటికి పోవుటకు మగని యూరిలో తన ప్రియకరుని బండి కట్టించుకొని వెళ్ళునపుడు నేనుకూడా వచ్చెద నన్నాడు ... హము లేక మూతివిరుపుతో 'ఊ' అన్నది వెళ్ళు త్రోవలో ముద్దన్నను ... ప్రయత్నము సాగలేదు నీళ్ళ దప్పిక యగు బావిలో దిగినపుడు పెద్ద ...

తలమీద వేయగా మునిగిపోయినాడు చచ్చెనని ముద్దన్న భార్య తన ప్రియునితో సరసాలాపము లాడుచు పోయినది

నీటిలో బడిన ముద్దన్న బాధను సహించి మరునాడు మామ ఇంటికి వచ్చినాడు అతనిని చూచిన భార్య లోపల దొడ్డిలో మరుగైనది వచ్చిన అల్లునకు అత్త ఉపచారములు చేసినది అంతలో ఆ యూరిలో నున్న మొదటి ప్రియుడు తన ప్రియురాలు వచ్చినదని విని ఇక్కడకు వచ్చినాడు ఇంకొకనితో వచ్చిన సంగతి తెలిసికొని కలహమునకు దిగినాడు ఇది యేమిటని ఎక్కడ నుండియో వచ్చిన ముద్దన్న తెలుసుకొని "మహనీయులారా! తగవులాడుట వద్దు ఏ ఆడదియైన మగవానికి అర్ధాంగియె అని పరమశాంత మూర్తియై భార్య దేహమును రెండు భాగాలుగా చీల్చి ఇద్దఱకు చెరియొక భాగమిచ్చి పొమ్మన్నాడు కథబాగుగనే యున్నది అది ఎట్లున్నను అప్పటినుండి ఘట్టివాళ ముద్దన్న ఏకాకిగా జీవించుచున్నాడు మద్దెల వాయించి శరణవచనము పాడుచుండెననియు, అవియే అతని కాయకమనుటయు కలదు కాని ఇప్పుడు చెప్పినవి ఏవియు ఈ సంపాదనములో రావు

ఒకనాడు బసవ భవన మహా ద్వారములో దాసోహమునకై లోపలకు పోవు వారిని బయటకు వచ్చు వారిని జంగమ సమూహము చూచి సహింపక, కూటికై ఈ జంగములు పడు ఆస, ఆయాసములను జూచి ఓర్చుకొనలేక పట్టరాని కోపముతో ఎవరి దాక్షిణ్యమునకు లోను గాని ఉద్దండుడు ఘట్టి వాళయ్య బిరుసెక్కిన గొంతుతో ఇట్లు విడంబించుచున్నాడు

ఘట్టివాళయ్య

హీన దేహంబునందొక నీచ జీవంబు పుట్టియుండె
గాన పేరాస తీరదు సందేహము పోదు ఇదేమో!
ఇదేమో! దుర్బలుల ముందు వచ్చి వేధించుటదియేమో?
ఇదేమో! వీరులు శూరులు మరులుగొనిరి చిక్కయ్య
ప్రియ సిద్ధ లింగుడు లేదులేదనెదరు ౧

మరియు

కాయ జీవంబు నెఱిగితి నను వారందఱు పోయిరి
గదా చెడుదారి బట్టి మన్ను మానిన హేమంబులకు

పోరాడు వారందఱు బసవని వాకిలి యందు బంధితులై
నొప్పిగొన్న, వారికెందులకు చిక్కయ్య ప్రియ సిద్ధ
లింగము? లేదు లేదనెదను ౨

**వివేచనము .**

అయ్యో! అయ్యో! ఇదేమి? జంగమత్వమునకే సిగ్గుచేటు ఒకనాటిది కాదు ఎన్నియోనాళ్ళ నుండి ఈ లాగుననే జరుగుచున్నది లక్షా తొంభైయారు వేలు ఒకనాడు కూడ ఈ సంఖ్య తక్కువ కాదు ఇంత మంది జంగములకు ఎక్కువ తక్కువ కాని అజ్ఞానము సమానముగా పట్టియుండ వచ్చునా? లేక, బసవన్న పట్టిన ఈ సంఖ్యా నియమ దాసోహ ప్రభావముండునా? కల్యాణములో ఎన్నో దాసోహ మఠములున్నవని విన్నాను కాని చూడలేదు నేను బికారినిగాని కూటికై కన్నవారి నాశ్రయించు బికారిని కాను నా సిద్ధలింగుడు ఇల్లు లేక ఇల్లాలు లేకుండగా జేసి తనవానిగా నన్నుంచుకొన్నాడు.

ఈనాడు భక్తిభండారి బసవయ్యగారి పెద్ద మఠమునకు వచ్చిచూచిన చాల అసహ్యమైనది హీనదేహము ఆకలికై ఆరాట పడుచున్నది దానిలో చేరుకొన్న నీచతరమైన జీవము ఆసలు ఆమిషాలను నింపుకొన్నది ఇదెట్టిదియో తెలియదు ఈ జంగమ సమూహములో తెలిసివారు, తెలియనివారు ఉన్నారు ఇద్దఱకు పట్టిన భోజనపు పిచ్చియొక్కటే

కాయమని, జీవమని, భక్తజంగములని, జ్ఞానక్రియలని లింగస్వరూపములని కనుగొన్నఘనులే దిక్కుకానరాని త్రోవలోపడి పోయిరి గదా! ఏమాశ్చర్యము! భూమికై, భామినికై, బంగారుకై పోరాడువారు బసవన్న దాసోహ ద్వారబంధములో చిక్కిరి కాయకమే కైలాసమని చెప్పువారువీరే ఆరాధనకు ఈగలు మూగినట్లు మూగువారును వీరే బసవన్నయే చేయు ఈ దాసోహమున కర్థమేమి! భోజనమే కాయకమా! ఏమో? ఎక్కువగా తెలియదు అని అనేక రీతులుగా జంగములను హేళనము సేయుచున్న ఘట్టివాళయ్య జంగమ నిందాలాపములు విని కొందఱకు కోపమువచ్చి పట్టుకొని తన్ని, లింగమును తీసికొనిరి మండిపడి ఘట్టివాళయ్య ఇట్లనుచున్నాడు

**ఘట్టివాళయ్య**

గోకులమంతయు కూడి అందఱు గోపతియన్న
ఇంటికి కుడుచుటకు వచ్చిరి నేను పీసమంత కూడడిగిన
వేషధారులు నన్ను నొప్పించిరి జగదీశ! నీకే తెలుసు
చిక్కయ్య ప్రియసిద్ధ లింగ! లేదు లేదంటివి ౩

**మఱియు**

పొడుచుట, నఱుకుట, చంపుట మలదేహంబు లకు
గాని, నిర్మలదేహం కుండునే? సమయము సముద్రమ
ట్లుండ వలయును, తప్పెరిగి శిక్షించునంత వఱకు నర
ధూర్తుల కులంబునకు శివరూపముండునే? ౪

**వివేచనము :**

వీరు మనుష్యులే కాదు వీరిని జంగములనుకొని దాసోహము జరుపు చుండుట పరమాశ్చర్యకరము మహాజ్ఞాన జంగమ తత్త్వమునకు, వీరికీ సంబంధమే లేదు బసవన్నకు పంచపరుషాలున్నవని విన్నాను ఆయన తాకిన వంకాయలు లింగములైన వనుచున్నారు ఎన్నినాళ్ళయినను వీరు మాత్రము ఉన్నట్లే ఉన్నారు. వీరి మీద పరుసవేది పారలేదు గాన వీరు పశువులలో కొంచెము నయమైన గోవులని చెప్పినయెడల, చెప్పకయే బసవన్న గోపతి వృషభేశుడు అనిన బసవడని (ఆబోతు) పిలిపించుకొనుట తప్పదు వీరికి నిజమే అక్కర లేదు జంగిమ వేషములే జంగమ మనుకొన్నారు వారను కొనినదే అందఱును అనుకొని ఆరాధించవలె ననినది వీరి వినూతన వివేకరహిత జంగమతత్త్వము బసవన్నగారే వీరి అభిప్రాయ వేష తత్త్వమును పోషించు చుండగా లోకమే తమ పాదము క్రింద ఉన్నదను కొన్నారు దానికి తార్కాణముగా నన్ను తన్ని లింగమును తీసుకొన్నారు కదా! లింగమనిన నేమో, గురువనిన నేమో మత తత్త్వ ప్రారంభ పారమేమో తెలియదు

ఆహా! ఎంత అజ్ఞానము! నా గొంతులో నున్న లింగము తమ దను కొన్నారు ఏమయ్యా జగదీశ్వరా! దీనికి నీ వేమనెదవు? అందఱు కూడి తన్నినను నీవు ఊరకున్నావు తన్నిన నొప్పి నీదా? నాదా?

హొడుచుట, కొట్టుట, చంపుట అనునవి మలదేహధారులై తామసగుణ ముండు వారివి నిర్మలదేహులైన జంగమములకు చెందినవి కావు సమయ మనిన సముద్రము వలె విశాలముగా నుండవలయును ఇక్కడ ఇందఱున్నారు ఔను కాదనరు తప్పు ఎవరిదో తెలియుటకు ఓపిక లేదు ప్రొద్దు తల మీదకు వచ్చినది ఎవరి ఆకలి వారిది

జల పాతమువలె వాగ్ధోరణి ఘట్టివాళయ్యగారి బయటనే గాక, లోపలనున్న బసవ, చెన్నబసవ, ప్రభుదేవాదులు పెద్దవారు ఈ కలకలమును విని బయటకు వచ్చి జరిగిన విషయమును తెలుసుకొనినారు లింగ ప్రహరణము మంచిదికాదు అవివేకమునకు అవివేకము జరిగినది జరిగినది ఏమియు చేయరాదు ఐన, ఘట్టివాళయ్య ధాటికి ఆగువారు ముందంజ వేయకున్నపుడు ప్రభుదేవుడు దగ్గఱకు వచ్చి మెత్తగా బుద్ధి వాదము చెప్పుచున్నాడు

**అల్లమ ప్రభు .**

> ఎఱుక నెఱుగుదు నంచు కఠినముగా పలుకుదురే?
> సత్య మెఱిగిన వానికి మిథ్యా భావముండునే? తథ్య
> మిథ్యలను ఉభయ భావంబులు లేక ఉండవలయు సమయ
> మనునది సంపాద్యము అది నీ కన్యమగునా? సర్వమయ
> సంపన్నుడైనపుడు గుహేశ్వర లింగమునకు తథ్య
> మిథ్యలు లేవు ఘట్టివాళయ్యా! ౫౫

**వివేచనము**

అయ్యా! సైరింపుము తెలిసినంత మాత్రమున బిరుసుగా మాటాడతగదు కోపము కలిగించు ప్రసంగము నడచినను, శరణుడైనవాడు శాంతముగా వర్తించిన తప్పు దిద్దుకొనుటకు ఉపయుక్తమగును సమయమున్నపుడు అది, ఇది యుండును సముద్రమునందు అన్నియు రత్నములే ఉండవు అపాయ కరములగు తిమింగిలము లుండుటయు సహజము నీ వన్యుడవు కావుకదా! లింగ సమాజమునకు చెందియున్న నీవిట్లు భవులు వెక్కిరించునట్లు వివరించుట

తగదు నీవు జ్ఞానివి ఐనను తప్పు సైరింపని విచక్షణా విమర్శకుడవు సమాజమునకు మీయట్టి గట్టితనము కావలెను "స్వామీ! సైరించండి" అని అల్లముడు మెల్లగ మెత్తగ చెప్పినపుడు ఘట్టివాళయ్య వెక్కిరింపుటుత్తర మీయుచున్నాడు

ఘట్టి వాళయ్య .

పామునకు కోకిలకు తగని ఇల్లున్నదే? నాకు
హెచ్చు తగ్గులను మిథ్యాభావంబు లేదు చిక్కయ్య ప్రియ
సిద్ధలింగా లేదు లేదందును —

వివేచనము .

"ఏ విభేదములును లేవు అల్లమయ్యగారూ! ఇల్ల నిజములు లేవు పాములకు, పికములకు స్వంతమనే తావేలేదు ఎక్కడనున్న అక్కడ ఉన్నంతవఱకు అది తనది అంతే నేనుకూడ అట్లనే ఇల్లు వాకిలి ఇల్లాలులేని పాముజాతి నాది ఎవరి హంగును నాకులేదు" ఘట్టి వాళయ్య తనను పాము కోకిలలకు పోల్చుకొని చెప్పి మఱియు ఇటులనుచున్నాడు

బంగారము కొనునపుడు దాని వన్నె సరియైనదని
గఱుతుగని, అది తన కొప్పిన కొనును లేనియెడ
కొనడు దీనికి యోడుటేమి? గెలుచుటేమి? చిక్కయ్య
ప్రియ సిద్ధలింగా లేదు లేదనెదను ౨

ఎందుకు స్వామి! తమరు ధర్మము మతమని చెప్పుచున్నారు సరియె తమ బోంట్లు ఇట్లు చెప్పుటకు తగుదురు నేనిపుడు మీ చెప్పు చేతలలో లేననునది తమకు తెలియును అయినను చెప్పవలెను చెప్పుచున్నారు ఏమి ప్రయోజనము?

బంగారము కొనువాడు దాని వన్నె చూచి, బంగారమని యొప్పికొనిన తీసికొనును లేనియెడల తీసికొనడు ఇక్కడ వాణిజ్య ధర్మమొకటి యున్నది అంగడి యజమాని ఎంతటి పెద్దమనిషి యని పేరు పొందినా, గీటురాయితో పరీక్ష చేసి బంగారమును కొనుచున్నారు కాని అంగడి యజమాని మాట ప్రకారము కాదు అటులనే లోక వ్యవహారము గాని, ధార్మిక శ్రేష్ఠత గాని,

అనుసరించుటకు, స్వీకరించుటకు ఎవరికైనను స్వాతంత్ర్యము కలదు" అని తానిపుడు లింగవంతుడై లేడు గాన అంతగా వినవలసిన అవసరము లేదను అభిప్రాయమును నిర్దాక్షిణ్యముగా ఘట్టి వాళయ్య చెప్పగా, "జంగముల నడత సరికాదని ఘట్టి వాళయ్య నొమ్చుకొన్నాడు" అని అనుకంపముతో అల్లమయ్య ఇట్లనుచున్నాడు

**అల్లమ ప్రభు ·**

అయ్యా! సమయంబు విడువదగునే? చేసిన వంట
కైనను కలిపెడు చేయి, తినెడు నోరు ఉండవలయు
తిననని సందేహము లేకున్న సమయ మేదియు లేదన
వలెను గుహేశ్వరుడనునంత వఱకు బంధ మోక్షము
తెలుగవలయు ఘట్టివాళయ్యా! ౮

**వివేచనము .**

వివేక శాలియైన ధర్మనిరతుడు సమయమును విడచి యుండునే? ఘట్టి వాళయ్యా! నీవు నిశితమతివి లింగమతత్త్వ రహస్యము తెలిసిన జంగమోత్త ముడవునీవు నీవు చెప్పిన జంగమత్వమే జంగమములకు తెలియనందున ఈ రీతి యైనది లోకములో జీవుల సంస్కారమునకు ఎన్నియో మతములున్నవి ఆ మతములలో నున్నవారందరు తెలిసినవారు కారు కొందరు మాత్రముందురు వారి సంసర్గమున తెలియనివారు కాలాంతరమున తెలియగలరని లాంఛనముతో నుందురు వారి నడత ననుసరించి మతమును తిరస్కరించరాదు

మనిషికి మతము అనివార్యము వండిన అన్నమును కలుపుటకు చేయి, తినుటకు నోరు ఉండవలెను ఆకలి యుండునంతవఱకు ఈ క్రియ సహకార సమన్వయముగా నుండవలెను ఆకలిలేదనిన చేయి నోరుల హంగు అవసరము లేదు మతమనునదియు అటులనే ఎంతటి ప్రాజ్ఞుడైనను మతములో నుండ వలయును ఆని అల్లముడు వివేకము చెప్పగా ఘట్టివాళయ్య ఇట్లనుచున్నాడు

**ఘట్టివాళయ్య**

కాలినమ్రాను బొగ్గగుగాని కట్టెయగునే? క్రిందుగా పారు కాలువ తటాకంబు జేరునే? ఎఱిగి మఱచిన వానికి సమయ సంబంధముండునే? చిక్కయ్య ప్రియ సిద్ధలింగా లేదు లేదందును ౯

**మఱియు**

కూటమున కూడినాననిన సమయంపువాడ నేగాదు మాటింబు ఐక్యము (సమూహము) చేసితినన్న వెనుక ముందు గల సందేహముల వాడను గాదు సమయంబునకు మొదటనేకాదు ఎవరేమన్నను సరియె చిక్కయ్య ప్రియ సిద్ధలింగా లేదు లేదందును ౧౦

**వివేచనము :**

అయ్యా, అల్లమయ్యా! చెప్పువారికి చెప్పక నాకెందులకు చెప్పెదరు? తమ ధోరణి, సద్బోధ, సమాధానము ఎట్లున్నదనిన కాలిపోయి బొగ్గు మసియైన చెట్టును తిరిగి చెట్టును జేసి ఓగురింపజేయు సాహసముగా నున్నది చెఱువు క్రింద పారు కాలువను చెఱువులోనకు త్రిప్పు విచారమట్లున్నది తెలిసిన తెలివిని మరచినవాని కింకెందులకు సమయ సంబంధము?

ఇప్పుడు మీ కూటములోని వాడనేకాదు ఇక నాకు మీ సంబంధమేమి? నాకే సంశయమును లేదు మీవాడు ఇతరుల వాడనునదియు లేదు మీరేమనుకొన్నను నేను మీవాడను కాను మీ సమయమువాడను కాను అని అల్లముని మాటకు మాటగా ముల్లుతో పొడిచినట్లు ఏ అనుమానము లేక పలికినపుడు అల్లమయ్య ఇట్లనుచున్నాడు

**అల్లమ ప్రభు**

గుఱుతున్నంత వఱకు అది సమయంబున కధీనము ఎఱిగితి నన్నంతవఱకు ఆత్మకు హంగు జ్ఞాను కాదనునంత వఱకు అందఱి హంగు గుహేశ్వరుడను నంతవఱకు లింగపు హంగు కావలెనయ్యా, ఘట్టి వాళయ్యా! ౧౧

**వివేచనము**

నీ గట్టితనము మెచ్చతగినది ముద్దన్నా! ఐనను ఈ సమయానికి తగదు. మత నియమము లెప్పుడును సరిగా నుండవు లోకములోని ఏ వ్యవహారమైనను అంతయే ఎంతవఱకు ఒక సమయము లాంఛనముగా చేరి యుండునో అంత వఱకు విరుద్ధముగా ఉండతగదు నేను జ్ఞానినని యనుకొను నంతవఱకు ఆత్మకు హంగు తప్పదు అదియునుగాక ఔను కాదనునంతవఱకు అందఱి హంగులో (అధీనములో) నుండియే తీరవలయును నేనెవరివాడను కాను మీవాడను కానని కోపము వచ్చినప్పుడు ధిఃకరింపవచ్చును గాని అట్లుండుటకు వీలులేదు ముద్దన్నా! విరోధము వద్దు సరిపెట్టుకొనిన అంతయు సమయమునకు మేలగును అని అల్లమయ్య మృదువుగా చెప్పిన మాటవిని ఒప్పుకొనని ఘట్టి వాళయ్య తన బాధను చెప్పుకొనుచు ఇట్లనుచున్నాడు

**ఘట్టి వాళయ్య**

స్థావరంబై భూమియందు పూజలందుకొనునది
శైవలింగము చరమై భూమియందు పూజించుకొనునది
ఇష్టలింగము ఎఱుక మనము మొనయందు నిత్యనివాసమై
పూజించుకొనునది వీరశైవలింగము ఇటుల లింగత్రయ
ముల ఆది ఆధారమెఱుగక పోతిరి గదా త్రోవతెలియక
ఇంకెవరికి జెప్పుదు? చిక్కయ్య ప్రియ సిద్ధలింగా లేదులే
దందును ౧౨

మఱియు

ఆశకై వేషంబు దాల్చి తిరిగెడి వేషధారుల
గండడు ఈషణత్రయమునకై ఈశుని పూజించుదాసుల
గండడు ఇష్టమెఱిగి తనువునకు ఆపచేయు భావకారుల
గండడు - నేను వెఱచెద త్రివిధపు హంగు లేని వారికి
నేను బంటునకు బంటును చిక్కయ్యప్రియ సిద్ధలింగమా
లేదులేదంటిని ౧౩

**వివేచనము :**

అయ్యా, అల్లమస్వామిగారూ! తమకంతయు తెలుసును నాకెంత తెలుసు నన్నది తెలిపెదను శైవులు ప్రత్యేకముగా గుడి గోపురములందు స్థాపించి పూజించు లింగము స్థావరము చరమై పూజగొను లింగము వీరశైవలింగము (శైవులు అంగమునందుగాక పెట్టెయందుంచుకొను లింగము) జ్ఞానమువలన ప్రాణలింగమనిపించుకొని అంగమందు ధరించు లింగము ఇష్టలింగము ఈ లింగముల విభేదమును అనాదులెఱుగరు జంగములని మీయట్టివారి పేరు చాటున ఎంత పెద్దవారైనది ఈనాడు తమ సమక్షములోనే నిర్ధారితమైనది నేనేమందు?

మీరు కాని, బసవన్న కాని, ప్రమథాది శరణులు కాని, ఏమనినను నా నమ్మకమును విడువను అయ్యలారా! అందఱు ఆలకించండి నేనొక సామాన్యుడనను కొని ఇక్కడ జరిగిన లింగాపహార దౌష్ట్యమునకు జంకను ఆశల వేషాలవారికి దండధరుడను ఈషణ త్రయమున (ధనదారాపుత్రులు)కై శివుని పూజించు వారలకు గండరగండడను ఇష్టము (గురులింగ జంగమార్పితమైన లింగము) ఉండగా ఇచ్చిన బాస మఱచి తను సుఖాల కాస చేయువారి చావునకు గండమును. ఈ త్రివిధములకు ఆసపడని శరణులకు బంటులబంటును అని ఆవేశమున అక్కడనుండు ఒక పెద్దగుండును తెచ్చి బసవన్న మహా మందిర ద్వారమున కడ్డుపెట్టి, గడ్డి త్రాడొకటి ఆ గుండునకు చుట్టి, దానికొనలు తన గొంతునకు కట్టికొని, వీరభద్రునివలె ఉగ్రుడై, ఘట్టివాళయ్య ఇట్లను చున్నాడు

అండజ ముగ్ధురాలి బిడ్డలారా? అగ్నివాన కురియు
చుండ, మీ భార్యలతో దిక్కులేని భ్రష్టులై తిరి గదా!
జంగమనుటకు సిగ్గులేదా? మీ కన్నులను సతులు
తినుటను మీరెఱుగరు ఆమె ఒకతూరి తినును మరి
యొకతూరి కరుణించి విడచును ఆమె తిని తిని ఉమ్మిన
నోటిలోనిదంతయు జంగమమా? లోకమంతయు ఆమెయే
ఆమెలేని జంగమ మెవరయ్యా బసవన్నా? ఆమెలేని
భక్తులెవరు బసవన్నా? ఆమె తనయులు అందఱు

మీ చేయినుండి ఆరాధించుకొను జంగమమును చూడ
వయ్యా బసవన్నా! ఆమె లేకున్న చిక్కయ్య ప్రియ
సిద్ధలింగయ్యగాక నిలువలేడు వీడు ౧౪

అయ్యలారా! వృత్తాకారమగు బ్రహ్మాండములో ఒక మోహనాంగి పుట్టినది. ఆమె చంచల వికార విలాస వినోద విభ్రమ విశాల కపట కటాక్షములో ఈ లోకము అనంత జీవకోటితో ఆవిర్భవించినది ఇట్టి కుటిల కుహక లోక మాతృకను 'మాయ' అని అన్నారు అందు నుండి పుట్టిన వారే అందఱును దానిలో మీరనుకొన్నదేదియు లేదు ఆమె మిమ్ముల నాడించు నాట్యవతి మీరు, మీ పెద్దతనము, జగద్భరిత జంగమత్వము, ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తులు అగ్గి వానలో బూడిద ఐనవి మిమ్ముల నమలి మ్రింగును లేక ఉమియును

అయ్యా, బసవేశా! ఆ మాయ నమిలి ఉమిసిన ఉచ్ఛిష్టమును పవిత్ర జంగమమని ఆరాధించెదరు ఎందులకో చెప్పగలరా బసవరాజా? తమ ప్రఖ్యాతి ఈ దాసోహము నుండియే పెరిగినదందురు అనేకులు దానినే అనుసరించిరి నా మాట రాయి కన్నను కఠినము ఎవరికిని రుచింపదని నాకు తెలుసును ఎటువంటి లోక భయము నాకు లేదు నా సిద్ధలింగుడు మాయాతీతుడు నిర్భయుడు అని ఒకే రీతి ఆతంక రహిత కఠినాతి కఠిన వాక్కుల వాన ఘట్టివాళు నుండి హద్దుమీఱి కురియుచుండ అక్కడ నుండు వారు వేసతిల్లినను, కొందఱు బుద్ధివాదము నిట్లు చెప్పుచున్నారు

**సమయము** •

ఫలము సేవించునంత వఱకు తొక్కు గింజ
రెండును ఉండవలయును సారమును చవిజూచిన యంత
సమయము మిగిలి యుండదు అట్లు ఎఱుగవలయు
ఘట్టివాళయ్యా!

**వివేచనము** .

ఘట్టివాళ్ళయ్యగారూ! తెలిసినవారు మీరు తెలియని వారి యందు జాలి యుండవలె కాని కోపముండరాదు చూడండి ఫలమును తినువాడు పైనున్న తోలు వలచి రసమును గ్రోలి, లోనున్న గింజను పారవేయును

ఎంత తియ్యని పండైనను దానిలో తినునదియు పారవేయునదియు నుండును పారవేసిన బీజము కాలాంతరమున వృక్షమై మఱల ఫలోత్పత్తికి కారణమగును పైనున్న తోలు చెట్టు పెరుగుటకు ఎరువుగా మారును ఈ సర్వ సమన్వయముండని ఫలము మధురముగా నుండవలెనన్న అది ప్రకృతిలో లేదు అట్లనే మతములోనున్న వారందఱు సర్వశ్రేష్ఠులుగా ఏ మతమునందును ఉండరు ఉన్న శ్రేష్ఠతను స్వీకరించి, కనిష్ఠతను సవరించుకొనుచు మతాభి వృద్ధికి పాటు పడవలసినది మీ వంటి వారి కర్తవ్యము అని ఘట్టి వాళయ్యకు సమాధానము చెప్పినపుడు ఘట్టి వాళయ్య ఇట్లనుచున్నాడు

**ఘట్టి వాళయ్య :**

మొదటనే ఆచారమునకు బయట నేననాచారినైన
కారణమున మీ వంటివాడ గాను సమయంబునకు
దూరము జంగమునందు నా జ్ఞానంబు నాకు మీ
సమయము మీకు బువ్వ పెట్టునాతడువాకిలి వేయునేమో
పొందు అన్నలార! సదాచారులు అనాచారి ముఖమును
జూచి చెడకండి హీనంబును చెనకకండి చిక్కయ్య
ప్రియ సిద్ధలింగయ్య! లేదు లేదనెద ౧౬

**వివేచనము :**

అన్నలారా! మీరు చాల పెద్ద ఆచారవంతులు సదాజలముతో పరిశుద్ధులు నేను మీ వలె కాదయ్యా! ఎన్ని మాటలాడినను అంతె మీ మతము మీకు, నా తెలివి నాకు పొందు నాతో వాదులాడుట ముఖ్యము కాదు భోజనము పెట్టు దాత వాకిలి మూసిన ఆకలికి మీరేమి చేసెదరు? పదండి పదండి, స్వామి గార్లు ఈ అనాచారి ముఖములో ఏమున్నది? మడివంతులు అశుచిని తాకరు పొండి - అని ఘట్టి వాళయ్య నిష్ఠురము లాడగా సమయము వారికి వేసరమైన దానిలోని జంగమయ్య ఒకాయన ఇట్లనుచున్నాడు

**సమయము .**

అడుగుటయే దోషమా? మాటాడిన శాపమా? మీ
జ్ఞానంబునకు మాహాత్మ్యమునకు పదవికి ఎదురున్నదే? మీ
ఎఱుక భేదంపు దౌష్ట్యము చెప్పుమయ్యా! ౧౭

**వివేచనము**

ఇదేమి అయ్యగారూ! మీ పేరులోని ఘట్టి తనమంతయు మా పైన ఈ రోజు విసరికొట్టినారు పెట్టిన పేరో, లేక లోకమిచ్చిన బిరుదో దానికి చ్యుతి రాకుండ ఉంచుకొన్నారు మిమ్ము౯ల నడుగుటయే దోషము మాటలాడిన శాపము కలుగునయ్యా! పెద్దవారు కనుక మాకు భయము మీ మహిమము, జ్ఞానము ఊహాతీతము మీ నిజములోనున్న దౌష్ట్యభేదమేమో తెలియజేయుదురా ముద్దన్న గారూ? అని మతములో నున్నాయన వెక్కిరింపు మాటలాడినది విని ఘట్టి వాళయ్య వాదము ఈలాటి వారితో తగదని శాంతముగా ఇట్లనుచున్నాడు

**ఘట్టి వాళయ్య .**

సమాధానమునకు నేను పలుకుదును అంతవఱకే
కాని నేను పాండిత్య కళాకారుడను కాను మత్సరము
నకు పోరాడుదుననిన కరణేంద్రియముల పుట్టపు
మొత్తము వాడనుగాను మఱియు సమయంబునందు
కూడి యుండెదనన్న సంసారంపు మబ్బులోని వాడను
గాను నా నిశ్చయము గుండు నాదు బట్టబయలు
వెలుగు చిక్కయ్య ప్రియ సిద్ధలింగయ్య లేదు లేదందు ౧౮

**వివేచనము :**

అయ్యా! శరణులారా! నేను వాదమునందు పండితుడను కాను ఇక మాత్సర్యమునకు పోరాటము జరుపు వాచాలుడను గాను ముఖ్యముగా మీ మతములో లేనిది - తిరిగివచ్చుటకు నాకు ఇల్లు వాకిలి సంసారము లేదు నా నిశ్చయము ప్రకారము ఈ గుండే నా లింగము మీ హక్కులుగాని బాధ్యతలుగాని నాపైన సమయము వారి వేవియులేవు అని ఘట్టి వాళయ్య ఏ ఆతంకము గమనింపక నిర్ధారముగా పలికినపుడు సమయము వారిలో మఱియొక జంగమ స్వామి ఇట్లు అనుచున్నాడు

**సమయము ·**

లింగము నీదైనచో అరచేతియందెందులకు అమరదు?
నీవు మంగళమయుడవైనచో సంసారపు అంగముండుట
ఎందులకు? అది లింగపు మెప్పుకాదు భ్రాంతియోగి! ౧౯

**వివేచనము .**

అయ్యా! నోటిమాటను శాస్త్రము మెచ్చవలెను వర్తనమును శరణులు మెచ్చవలెను ఈ రెంటికిని సంబంధములేని గుండును లింగమనుట సమయము ఒప్పదు ఆ గుండు ప్రమాణము కాదు గురులింగము ప్రమాణము ఆ ప్రమాణము ఆరచేతిలో ఇముడవలయునని సమయము వారు నిర్ణయమును పలుకగా ఘట్టి వాళయ్య ఆ గుండును సంబోధించి పిలిచి సమయమునకు సమాధానము చెప్పుచున్నాడు

**ఘట్టివాళయ్య :**

లీలకై బయటకు వచ్చిన లింగమా! రావయ్యా
నా అంగమందడగుము శ్రుత - దృష్ట - అనుమానము
లతో చూచువారందఱకు అతీతుడవగుము అగుమనుటకు
మున్నె ఆ గుండు కాయపు కరస్థలమందు నిర్భావమై,
కాయమడగి భావమను భావంబు బయలై యుండె
చిక్కయ్య ప్రియ సిద్ధలింగ లేదు లేదనుటకు మొదలే! ౨౦

**వివేచనము :**

అదివఱకు విడంబనకారుడై తన సమయముపై నిశిత విమర్శాశస్త్రమెత్తిన ఘట్టివాళయ్య ముద్దన్నయై ప్రశాంత వదనంబున దివ్యతేజో దృష్టిని గుండుపై నిలిపి "గుండయ్యా! నేనన్నమాట శరణులు ఒప్పరు జగమంతయు నీవేయని వారికి తెలిసినను గురూపదిష్ట ప్రమాణ ఇద్ధమగుదానిని లింగమందురు రా! రావయ్యా! వారొప్పురీతిగనే నా అంగము మీద ఉండుటకు వేగమేరమ్ము సమ్మతి సుఖము కాదయ్యా! శ్రుతదృష్టములగు అనుమానములకు పరీక్ష ఈయవలెను రమ్ము" అని పిలచిన తోడనే గుండు లింగమై ఘట్టివాళయ్య కరస్థలము నందడగినది

ఉగ్రవాద పరిస్థితి పెద్దపెద్ద వారిపై ప్రభావితమై జటిల సమస్యయై పరిష్కారమునకు అల్లమదేవునకు అసాధ్యమని అనిపించియుండగా క్షణార్థములో పరిసరము శాంతముగా మారినది ఘట్టివాళయ్య ఎంత సమర్థుడో అందఱకు ఇప్పుడు తెలిసినది ఘట్టివాళయ్య లోపల ఉన్న లింగమే గుండుగా మారి

జంగమ నిజతత్త్వమును నిరూపించి, మఱల బయటనుండి ఇష్ట ప్రాణ భావ లింగములుగా నిజచైతన్యమును పొందినది అసామాన్యమైన ఈ ఘటన అవ లీలగా కల్పించిన మహామహితుడు ఘట్టివాళయ్యను అల్లమ స్వామి ఇట్లు ప్రశం సించుచున్నాడు

**అల్లమప్రభు** •

అంగము మీద లింగము లేనివానిని భవి అందురు
అంగము మీద లింగమున్న వానిని భక్తుడందురు అంగ
మందు మిళితమైన లింగంపు తెలివు ఎఱుగక! లింగము
లేక ఒక్కక్షణమైన ఒక్క అంగము చలించునే లోకం
బున! అంగములోని లింగమును వదలిన వారికి భవమాల
ఉండును వదలనివారికి భవమాల ఉండదు గుహేశ్వరా। ౨౧

**వివేచనము :**

లింగ ముఖ్యతనుబట్టి చూచిన-అంగమందు లింగమున్న భక్తుడందురు. లేకున్న భవి యందురు అన్నవారు, అటులున్నవారు అంగము లోపలినున్న-లింగము నెరుగరు ఆ లింగమే లేకున్న ఈ దేహ మొక క్షణముండదు ఘట్టి వాళయ్య గారు వివరించి చూపినారు కట్టుకొన్నదే లింగమగుట, జగమంతయు గోళాకార లింగమనియు, అందఱకు దృష్టాంతము చూపినాడు. అదియేకాక బసవరాజు చేయు జంగమ దాసోహమును తుత్తునియలుగా ఖండించినాడు జంగమ తత్త్వమును కాయకమను అద్దములో స్పష్టముగా చూపినాడు బయట నుండు లింగము నుండి లింగాయతు డన్నను లోనున్న లింగమును ఎఱుగ కున్నచో భవము (పునర్జన్మ) ఉండును. అంగముమీద నున్న లింగోపాసనము లోనుండు లింగము నెఱుగుటకు సాధనమని వీరశైవుల నమ్మకము ఈ రోజు ఘట్టివాళయ్య వలన అందఱకు ఎన్నియో విషయములు తెలిసినవని అల్లమయ్య సంతసించి వినుతింపగా చెన్నబసవరాజు ఉత్సాహభరితుడై ఇట్లనుచున్నాడు.

**చెన్న బసవన్న**

అంగము మీది లింగము పోయినదని ఆత్మఘాత
కము చేసికొనుచున్న అజ్ఞానులు అంగమేది - లింగమేది
యను దాని నెట్లు తెలియుదురు? అంగమే ఆత్మ లింగమే
సంవిత్తు ఈ రెంటి సంబంధ రహస్యము తెలియక
అంగ లింగము నష్టమైనదన్న వారికి ప్రాణ లింగము
లేదు ప్రసాద మెక్కడి దయ్యా, కూడల చెన్న సంగమ
దేవా? ౨౨

**వివేచనము :**

ఈ రకనే లింగమును సంప్రదాయకముగా కట్టుకొనినారు గాని ఆ లింగ నిజమేమియో కనుగొనరు మతిమాలినవారు కొందఱు ఎప్పుడైనను స్నానము చేయునపుడు బావిలో లింగము జారిపడిపోయినపుడు, లింగము దొరకకున్న బావపలయ నని చెప్పువారున్నారు అంతియేకాదు చచ్చిన వారును ఉన్నారు అట్టి వారి అవివేకమును గ్రహించనివారు లింగప్రాణుని సమాధికట్టి పూజింప మూఢులు ఉన్నారు అంగమే ఆత్మయనునది తెలియదు - లింగమే సంవిత్తు అనునది ఎవరెఱుగ గలరు? అంగ లింగముల కెక్కడి భేదము? ఈ రహస్య మెవరికి తెలియదో వారికి ప్రాణలింగమే లేదు

దృష్టాంతముగా ఘట్టివాళయ్య చూపినాడుకదా! జంగములు ప్రజ్ఞానమున లింగము హరించగా హరించి పోయినదా? పెద్ద గుండు ప్రమాణ లింగము కావలెనని పుడు కాకుండ ఉండినదా? భక్తుని నిష్ఠకు ఇష్టమునకు లోకములో అసాధ్యము లేదు భక్తుని ఇచ్ఛయే లింగదేవుని ఇచ్ఛ అని ఘట్టివాళయ్యగారి మహిమను చెన్నబసవన్న కొనియాడగా ఇతర శరణులు ఆనందభరితులై స్తోత్రములు జేసినారు.

## ఘట్టివాళయ్యగారి లింగైక్యము

ఘట్టివాళయ్య తనువు మద్దెల వాయించి నర్తించు కాయకమున స్వేచ్ఛగా నుండి కొన్ని నాళ్ళకు కల్యాణ పట్టణములోని రాజ వీధిలో పడిపోయినాడు బసవన్న శరణుల తో పోవుచుండ ఘట్టివాళయ్య దిక్కులేని స్థితిలో వీధియందే

పడియుండుట పరీక్షించగా ప్రాణము లేదని తెలిసి అతనికి అంత్యక్రియలు చేయుటకు శరీరము నెత్తుకొనబోవగా ఆ లింగశరీరము శరణుని చేతులలోనే బయలైనది బసవన్నగారు ఇది చూచి ఆహా! శరణుల మహిమ తెలియరాదని ఘట్టివాళ ముద్దన్నను ఇట్లు ప్రార్థించుచున్నాడు

**బసవణ్ణ**

చచ్చి పుట్టువాడు కాడు సందేహ సూతకి కాడు
ఆకార నిరాకారుడు కాదు చూడుమయ్యా! కాయవంచకుడు
కాడు జీవ వంచకుడు కాడు నిరంతరము సహజుండు
చూడమయ్యా! శంకలేని మహామహిముడు కూడలసంగుని
శరణుడు ఉపమాతీతుడును చూడుమయ్యా! ౨౩

**వివేచనము**

ఈ శరణుడు చావడు పుట్టడు ఔను కాదను సందేహము లేని నిర్మలుడు కనుపించువాడు కాదు కానరాకయుండు వాడును కాదు ఇచ్ఛామాత్రములు, దృశ్యాదృశ్యములు కాయములో గాని జీవములో గాని వంచనలేని మహనీయుడు అని బసవన్న బయలైన ఘట్టి వాళయ్యను స్తోత్రము చేయుచుండి శరణులతో వినమ్రుడై ఆ బయలు సమాధికి చేతులు జోడించి ఇట్లు పాడుచున్నాడు

**రాగము - జౌళి**

దేహగుణములు వీగి లింగదేహియైన శరణుడు
బహిరంగము వాడక మాయ మోహమును దూరును ॥పల్లవి॥
భావబ్రహ్మమైన యతికింకేమి వేషమెందుకో?
దేహలింగమైన మీదింకేమి పదవులెందుకో? ౧

మలము కడుగుటెరుగక మలజలము కడిగెదనందువు
లోన బయట లింగముండ అంసి సొలయు చేలనో? ౨

ముత్యము రత్నసిత ఘృతమునకు మరల పూర్వక్రియలు గలవ
నిత్యముక్త శరణుని కున్నదే మరల పూర్వచరితము ౩

బ్రహ్మవిష్ణు రుద్రపదము పేర్మలను ఎంచక
నిర్మల లింగంబునందు సంబంధించిన శరణుడు ౪

అప్రతిమ నగమ్యునందు నిష్పతిగా నుండిన
అప్రమాణ గుహేశ్వరునిలో నుండ గమ్యశరణుడు ౫

— ○ —

ఇది కృపామూర్తులైన శ్రీ మృత్యుంజయప్ప గారిని, స్వప్నబోధామూర్తులైన శ్రీ ఎర్రి తాతయ్య గారిని స్మరించి, సకల శివశరణులను వందించి శూన్య సంపాదనలోని "ఘట్టి వాళయ్య గారి సంపాదనము" నకు సంగ్రహముగా చెప్పిన వ్యాఖ్యానము సంపూర్ణము

— ○ —

శ్రీ గురు బసవలింగాయ నమః

# శూన్య సంపాదనము

## మహాదేవి అక్కగారి సంపాదనము

౧౬

కం॥ అనుభవమంటపమునకున్
చని యల్లము మెప్పుదాల్చి సద్విమలయశో
ధనరాశి మహాదేవి శ
ర్వానిలో జేరెనదియు యుచితము పొగడన్

ఉడుతడి గ్రామములో మహాదేవి అక్క నవయౌవన సౌందర్య రాశియై వెలుగుచుండెను ఆ తరుణి చిన్నతనములోనే ఆధ్యాత్మిక తత్త్వ విచారములో ఎక్కువ ఆసక్తి కలిగి యుండెను శివలింగాచార సంపన్న కుటుంబములోని నిర్మల - సుమతి యను వారికి ఏకైక తనూజాత మహాదేవి అందఱివలె తన వయసు వారిలో యౌవన విలాస కాంతులతో నున్నను, తన అంతరంగములో ఏదియో అవ్యక్త చిదాత్మ సౌందర్యము పెరుగుచుండుట తెలిసికొని తెలిసిన అనుభావుల సేవించి తెలియవచ్చినంత తెలిసికొన్నది యౌవనతనుకాంతి యువక లోకమునకు విభ్రాంతిదాయకముగా వర్థమాన మగుచున్నది తల్లిదండ్రులకు, లోకులకు తెలిసినంతగా మహాదేవి తెలియని ముగ్ధురాలైనది అంతరంగములోని ఆత్మకళలు ఒకటొకటిగా వికసించుచుండుట తన విచక్షణా జ్ఞానమునకు తోచుచుండగా లోకజ్ఞానము మందమైనది

ఉడుతడి రాజధాని కౌశికరాజు ఏలుబడిలో నున్నది (ఇప్పుడు కర్ణాటక రాజ్యమున శివమొగ్గ జిల్లాలో ఉన్నది ) ఆ రాజు ఒకనాడు ఏనుగు నెక్కి మితపరివారముతో విహారమునకు పోయి మఱల పట్టణమునకు వచ్చునప్పుడు

మిద్దెపైకెక్కి రాజవైభవమును తిలకించుచున్న వారిలో మహాదేవియు నున్నది మహాదేవి కుతూహలముతో చూచుచుండగా, రాజు తనను పరికించుచున్న ప్రాయంపు పిల్లలను వినోదముగా చూచుచు వచ్చుచుండి, మహాదేవిని చూచి మోహ విభ్రాంతిని పొందినాడు

అవసరమున విహారము చాలించి ఆ నవతరుణి ఎవరని విచారించి తెలిసికొనినాడు పెండ్లి ప్రయత్నములు జరిగినవి మహాదేవి రాజాంతఃపురములో చేరినది తల్లిదండ్రులకు రాజువలన కీడు కలుగరాదని రాజభవనము చేరినది మహాదేవి "లింగధారణము చేసికొనిన నేను మిమ్ములను కర్పణ చేసికొందును" అని రాజుతో నన్నది కౌశికుడు జైనమతస్థుడు 'నా మతము విడరానిది' అన్నాడు 'అట్లే నా మతముకూడ' అన్నది మహాదేవి రాజవైభవములు, విలాసములు పదవి, భోగములు, కొనకు రాజ్యమును ముందుంచినపుడు మహాదేవి తిరస్కరించినది వివేకవంతుడైనను రాజునకు మోహాంధకారము వ్యాపించి మహాదేవిని బలవంతపఱచినాడు అప్పుడు అక్క ప్రతిఘటించినపుడు దివ్యాంబరము జారినది నిడివిగా పెరిగిన శిరోజములు దిగంబర దేహమును కప్పినవి

ఈ ఘటనలో మహాదేవి అక్కగారి ముఖారవిందము రవితేజముతో వెలిగి సుజ్ఞాన ప్రసారమైనట్టుంగినిన రాజు అటులే నిలబడి భ్రాంతితో చూచు చుండగనే మహాదేవి మెల్లమెల్లగా రాజభవనమునుండి వెడలిపోయెను తెలివిగల కౌశికుడు సన్నివేశమును గ్రహించి నెమ్మదిగా సమాధానచిత్తుడయ్యెను

కౌశికుని రాజాంతఃపురమే మహాదేవికి తీవ్రవతర వైరాగ్య ప్రపంచములో ప్రవేశించుటకు గురుమందిరమైనది విధిలో వెడలిపోవుచున్న మహాదేవి ఇంటిని తల్లిదండ్రులను బంధువులను ప్రియమైన స్నేహితులను, ఆప్తులను, కొనకు తన జన్మభూమి ఉడుతడినికూడ విడిచిపోయినది పోవుటనగా అది ఏమంత సులభముకాదు- ఎన్నెన్నియో మోహ బంధాలు అడుగడుగున అడ్డమున్నవన్నియు త్రెంచివేసి ముందునకు నడచినది

లోకమునకు ఇది విచిత్రము ఇంత చిన్న ప్రాయములో అన్ని బంధాల నుండి వదలిపోయిన తరుణి మరొకరు లేరని అంచలు అనుకొని ఆమె లీల వ్యవహారములలో జొచ్చినారు అటులనే తల్లియు తండ్రియును అనుకొనినారు మహాదేవి తాను ఆరాధించు చెన్న మల్లికార్జున లింగముతో ఎక్కడెక్కడనో సంచరించినది

దిక్కు తెన్నులులేని తన యాత్రయందు ఎంతయో భక్తి జ్ఞాన వైరాగ్యములను సంగ్రహించి చిద్రూప చిద్విలాసానందమున తేలియాడుచు రాను రాను యాత్రలో బసవన్న నివాసం నిర్మల కల్యాణ పట్టణమునకు వచ్చుచుండెను

కల్యాణములో శరణ సమూహంబున సుఖముగా శివానుభవములో నుండ మహాదేవి అక్క వచ్చుచుండుట లింగముఖంబునందెఱిగి చాల సంబ రముతో మడివాళయ్య, చెన్నబసవన్న, అల్లమప్రభు,కిన్నరయ్య, హడపదప్పన్న మున్నగువారితో బసవన్నగారు "నా కన్నతల్లి మహాదేవి వచ్చుచున్నది ఈనాడు కల్యాణము పరమ పవిత్రము" అని చెప్పిన మాటనే మఱల మఱల చెప్పుచుండగా - ఇక్కడ అక్క కల్యాణ నామ ప్రదేశమునకు వచ్చినది ఉత్సాహ మధికమైనది ఎంతయో దూరము నుండి నడచి వచ్చిన శ్రమ ఎఱు గక కల్యాణ కటకమునకు వచ్చినది మహితాత్ముడు భక్తి భండారిని తన కడుపులో చల్లగా నుంచుకొని లోక కల్యాణము చేయుచున్న ఈ కల్యాణ పట్టణానిది ఎంత భాగ్యము! ఇది ఎంత పుణ్యము చేసినదో యని చేతులెత్తి నమస్క రించి ఇట్లు అనుచున్నది

**అక్క మహాదేవి :**

కల్యాణ మన్నది ఎవ్వరు పోజాలరు, పోజాలరు
పోజాలరు అసాధ్యమయ్యా! ఆస ఆమిషము లేనివానికి
గాక కల్యాణము దెస కాలుంచరాదు లోన, బయట శుద్ధ
మైన వారికి గాక కల్యాణము పోవరాదు నేననుట మఱ
చిన వానికి గాక కల్యాణము పోవరాదు లోపల ఎఱిగి

చెన్న మల్లికార్జునుని కొలిచి ఉభయంపు లజ్జ వీడితిగాన
కల్యాణమును గాంచి నమో నమో అనుచుంటిని ౧

**వివేచనము :**

అంతరంగమందు నాత్మనుంచుకొన్న దేహము నమస్కారమున కర్హమైనట్లు, దేవుని తన గర్భములో నుంచుకొన్న దేవాలయము వందనమున కర్హమైనట్లు, భక్తి భండారి బసవన్న యున్న కల్యాణ పట్టణము మహాదేవి అక్కగారి నమస్కారముల కర్హమైనది ఇంకొక రీతిగా మహాదేవి చెప్పుటలో మహార్థమున్నది శివశరణులున్న కల్యాణము, మానవోత్తముడైన భక్తి భండారి యున్న కల్యాణము మానవుల నుద్ధరించు కార్యరంగమే కల్యాణము పాప పుణ్యములను భ్రాంతిని నిరసించి, ఫలాఫలములు ఇహలోక పరలోకముల కాంక్షలను త్రెంచి, కాయకమే కైలాసమని చూపునది కల్యాణము భక్తుడుండు చోటే కైలాసమని నిర్భయానంద శివామృత ప్రసాదమనియు ఈ కల్యాణము నకు సామాన్యులు పోవరాదు దుష్ట దుశ్చింతలు ఆశ ఆమిషములున్న వారు పోజాలరు అంతరంగ బహిరంగ శుద్ధులు కాని వారు పోవ నసువు కాదు నా చెన్న మల్లికార్జున దేవుని కృప నేను ప్రవేశింతును

మహాదేవి అక్క చెప్పినది ఆధ్యాత్మికములో కల్యాణార్థమును బెట్టి ఇట్లు చెప్పినది కల్యాణము చాళుక్య చక్రవర్తుల రాజధాని మహా వైభవోపేత మైన పట్టణము అక్క వర్ణించినపుడు కలచుర్యవంశ సంజాతుడైన చంద్రవంశపు శూరబిజ్జళుడు మహా చక్రవర్తియై యుండెను ముఖ్య ప్రధాని, దండనాయకుడు, ఆర్థిక మంత్రియై సర్వతోముఖముగా బిజ్జళ భూపాలుని రాజ్యాభివృద్ధికి కారకు డైన బసవరాజుండెను రాజకీయ కార్యకలాపముల కెందఱెందరో నిత్యము ఎడ తెగక వచ్చిపోవు వారిని గుఱించి కల్యాణ పట్టణమును అభివర్ణించలేదు

ఆమె వచ్చిన రీతికి తగినట్లు పవిత్ర భావమున బసవరాజు దర్శనాపేక్షియై పట్టణ రాజవీధిలో పోవుచుండు ఎవరికి వారే అక్క గారి వైరాగ్య ప్రకాశ ప్రభావమునకు నమస్కరించి నిరాతంకముగా వెళ్ళుచున్న ఆ మహితాత్మురాలికి తెరు విచ్చుచుండిరి అంతయు మొదటనే చూచియుండెనేమో అనినట్లు నేరుగా బసవన్నగారి అనుభవమంటపమునకు వచ్చి శివానుభావుల సభకు సాష్టాంగ

నమస్కార మాచరించెను అల్లమ ప్రభుదేవుని ఆధ్వర్యమున కూడిన సభ కుతూహలముతో జూచుచుండ బసవరాజును జూచి అక్క ఇట్లనుచున్నది

**అక్కమహాదేవి :**

అయ్యా! మీ సజ్జన సదాచారంబు గాంచితి గాన
నా కన్నుల పటలంబు చినిగెనందు అయ్యా! మీ సజ్జన
సద్భావుల శ్రీచరణంబుల కెరగితి గాన నాదు నొసట
లిఖితంబు మాసెనిందు చెన్నమల్లికార్జునయ్యా! మీ శరణ
సంగన బసవని పాదముల కని పొంగి పొంగి నమో
నమో యనుచుంటిని ౨

**వివేచనము**

అన్నయ్యా! బసవేశా! కృతార్థురాలినైతి ఇదివఱకు వినిన సజ్జన సద్భక్తిని గని నా నమ్మకమున కాధారము దొరకినది ఈనాడు తమ సందర్శనమై నా అనుమానపు మబ్బు కన్నుల పటలము తెగినది అదియు గాక మీ సద్భక్తి శివశరణుల చరణారవిందముల కెరగితి గాన నా నొసటి పైని లిఖితము మరుగయ్యెను మీ చరణములకు నమో నమో యందునని మహాదేవి బసవన్నగారికి వందన మాచరించినపుడు బసవన్న ఆనంద భరితుడై ప్రభుదేవునితో ఇట్లనుచున్నాడు

**బసవన్న :**

కాయంపు లజ్జ కల్పితము చెడిపి, జీవంపు లజ్జ
మోహంబు తుడిచి, మనసను లజ్జ స్మరణంబు గాల్చి,
భావకూటము దిగంబరంబని తలచి ఆతుర స్నేహంబు
వ్యవహారమునకు చెల్లదు కూడల సంగమదేవయ్యా! నను
గన్న తల్లి మహాదేవి అక్కగారి రీతి చూడవయ్యా ప్రభు
దేవ! ౩

మఱియు

రూపు లేని వాని వలచిన వారికి తనుచేరిమి
యుండునే? మనము లేని వాని మెచ్చిన వారికి అభిమా

సంపు హంగుండునె? దిగంబరునకు నచ్చినవారికి కౌపీ
సంపు హంగుండునె కూడల సంగమదేవయ్యా! మహా
దేవి అక్కయను భక్తురాలికి ఏ భారంబు లేదు సుమా,
ప్రభుదేవా! ౪

**వివేచనము .**

చూచితిరి కదా నాయమ్మను ప్రభుదేవా! లోకరీతికి విభిన్నమని తలచి ఉదాసీనము చేయదగదు చూచి తెలియుదానిలో అవ్యక్త విషయాతీత తత్త్వము లెన్నియో రక్షింపబడుమండుట తమకు తెలియనిది కాదు నిజమే ఇంత చిన్న వయసులో లజ్జాగారమైన స్త్రీత్వములో ఇంత నిర్లజ్జ నిశ్చయమును నింపి మనకు చూపి ఆశ్చర్యము కలిగించు కాలపురుషుడు ఏమయినను చేయగల డనునది అందఱకు తెలియ వచ్చినది ఐన, స్వామీ! ఇది కృత్రిమము కాదు సహజమే!

ఆమెకు కాయముండినను, నాదను సంకోచము, సిగ్గు లేదు జీవి మనసులో మోహాభిమానములు లేవు ఇక భావమున్నది సంకల్ప వికల్పములు లేక పోయినప్పుడు బయలు చేయుట కేమియు నుండదు మరుగుపఱచుట కేమియు లేదు గాన ఉన్నది ఉన్నటులు దిగంబరమై యుండును ఇంకొక విశేషము మా అక్క వట్టి నిర్మల స్నేహితురాలే కాని లోకవ్యవహారి కాదు

ఇంకొక రీతితో జూచిన తాను వలచిన మగనికి తనువు లేదు తనువు లేనపుడు మనమెక్కడ ఉండును? దిగంబరుని మెప్పుపొందినది కాన వస్త్రపు హంగులేదు దేహ మనో భావములు ఇంద్రియాది గుణదోషముల భారమేమియు లేని నిరాధారి మహాదేవి!

శరణ శరణీయుల సమూహ మంతయు అక్కమహాదేవి దిగంబర లింగోన్మాద దివ్యాంగము చూచినారు దాని నిజార్థము బసవన్న చెప్పగా వినినారు అందఱు ప్రభుదేవుడు ఏమనునో యను భావమునే వినకుతూహలులై ఉన్నపుడు అల్లమప్రభువు బసవన్న వివరించిన విషయ మంతయు లింగపతి శరణ సతిత్వమునకు చెందిన భక్తస్థితి యని తెలిసి, శరణులుండు రీతికి భిన్నముగా నుండు కారణమేమో తెలిసికొనుటకు మహాదేవి అక్కను ఇట్లు ప్రశ్నించు చున్నాడు

**అల్లమ ప్రభు**

ఉద్వేగ మదమెక్కిన జవ్వనపు సతివీవు ఇక్కడ
కెందులకు వచ్చితవ్వా సతియన్న సైరింపరుమాశరణులు
నీ పతి గురుతు చెప్పిన వచ్చి కూర్చుండము లేనియెడల
పొమ్ము తల్లీ! మా గుహేశ్వరుని శరణులందు కూడి
యుండు సుఖము కావలెనని నీ పతి ఎవరనుచది చెప్పు
మమ్మా!

**వివేచనము :**

అమ్మా! నీ ఘనత గురించి బసవరాజుగారు చాల రమ్యముగా వివరించి నారు ఇక్కడి వారికి నిన్ను జూచుట ఇదియే మొదటిసారి ఇంత చిన్నతనములో యౌవన విలాస కళలు చెలువార ఏకాంగివై ఇక్కడి కెందులకు వచ్చితివో తెలియదు నీవు వచ్చిన రీతి శివశరణులకు ఉచితముగా లేదు - నీ భర్త యెవరో ఆయన పేరు చెప్పి వచ్చి కూర్చొనుము మా శరణుల సమ్మతి సహవాసము కావలెనని ఇక్కడకు వచ్చియున్నచో నీ పరిచయములోని ముఖ్యభాగము నీ పతి పేరు చెప్పు తల్లీ!

అల్లమ ప్రభుదేవుడు శరణీయులలో ఉన్న సంశయమును తెలిసికొని, శరణ సంప్రదాయమునకు వ్యతిరిక్తముగా నున్న ఆమె తను వైరాగ్య లాంఛనము చూపుచుంక అడిగినాడు గొంతులో మాంగల్యము లేదని కనుగొన్నాడు మహాదేవి నిశ్చల భావముతో రసవంతముగా ఇట్లు పలుకుచున్నది

**అక్కమహాదేవి :**

శంకరా! నీవే నాకు భర్తవు కావలెననుచు అనంత
కాలము తపసుంటిని సుమా! పెండ్లి పీటల మాట అడుగ
చంద్రధరు నొద్ద కంపిరి మా వారు భస్మంబు పూసి
కంకణము కట్టి చెన్నమల్లికార్జునుడు తనకు నే కావలె
ననుచు,

మఱియు

మరకతమణివేదిక, కనకపు తోరణము, వజ్రపు
స్తంభము, పగడంపుపైపందిరి కట్టి పెండ్లిజేసిరి మావారు
నా పెండ్లిజేసిరి కంకణము చేదారము తలంబ్రాలు పోసి
చెన్న మల్లికార్జున పతికి పెండ్లిజేసిరి ౭

మఱియు

గురువె బంధువయ్యె లింగమె పెండ్లికొడు
కయ్యె నే పెండ్లికూతురనైతి ఈ భువన మంతయు తెలియ
అసంఖ్యాకులు నాకు తల్లిదండ్రులు ఇచ్చిరి ప్రభువు
నింటికి సాదృశ్యమగు వరుని జూచి ఇది కారణంబ చెన్న
మల్లికార్జునుడు నాకు భర్త ఇతర లోకపు భర్తల సంబం
ధము లేదు ప్రభుదేవా! ౮

**వివేచనము :**

"అల్లమ ప్రభూ! నా మగని పేరు చెన్న మల్లికార్జునుడు లోకములోని పురుషుడు కాడు లింగమూర్తి విధియుక్తముగా శ్రీగురువు సమాజ మందున్న శరణులు కూడి అత్యంత సుందరముగా నా వివాహము చేసిరి నను కనిపెంచిన వారు తగువరుని శోధించి అతనికి తగురీతి నాకునేర్పి చిరసుఖానంద లింగాంగ సంబంధముచే పవిత్రము చేసిన తల్లిదండ్రులు, బంధు బలగమంతయు శివ శరణులు నాకే కొరతయు లేక భౌతిక సాధక బాధకములు లేక సుఖంబుగా నున్నాను. మీ యందఱి దర్శనము వలన తెలియదగినది తెలియగా కుతూహల ముతో వచ్చి చూచి ఆనందించితిని" అని అక్కమహాదేవి చెప్పగా అందఱు విన్నారు సంతోషించినారు ఒక్క సంశయము మాత్రము మిగిలినది అది అక్కకైకొనిన దిగంబరత్వము ప్రభువుకళ్యాణమునకు రాకముందు ఉడుతడిలో కౌశికరాజునకు మహాదేవికిని జరిగిన ఘటన సూక్ష్మముగా తెలిసియుండెను ఐన ఈ దిగంబరత్వ కారణము తెలిసియుండలేదు అందఱు కుతూహలముతో తన వైపు చూచుచుండుట ఎఱిగినను అక్క నిశ్చల భావము సహజముగానే యుండెను ఆమె కది విశేషమనిపించి యుండలేదు మఱియు లోకమునకు ఆక్షేప కారణం బనునదియు తెలిసియుండలేదు లోకములోని ఏ పదార్థములను కాని వస్త్రముతో మఱుగు పఱుమట సాధ్యము కాదనునది ఆమె తెలిసియుండెను

అక్క మహాదేవిగారి అలౌకిక వ్యక్తిత్వము అపూర్వము అంతైన ఇంతైన తెలియవలెను లోకమునకిది విశదము కావలెనని అల్లమదేవుడు మెల్లగ ఇట్లనుచున్నాడు

**అల్లమ ప్రభు:**

తప్పుమోపి వచ్చితివన్నది సత్యమా? తనువు చీర
వీడి నిర్వాణమైయుండ మనసు భ్రాంతి నిశ్చయము
కాదు కేశమను చీర అంగమునకు మరుగై యుండె
అవమానమెటుల పరిహరించు? అది గుహేశ్వర లింగము
నకు చెల్లని వేషము ౯

**వివేచనము:**

"అక్కా! ఒక్క విషయము వినినది - మీయూరిలోని రాజు కౌశికుని విషయము ఆయనపైన ఏదియో తప్పుమోపి వచ్చినది నిజమా? ఏమయినను కానిమ్ము నీ దిగంబరత్వము వీరశైవ తత్త్వసమ్మతము కాదు ఇది దిగంబర మని దిగంబరులై యున్నవారిని గమనించినప్పుడు ఆ దిగంబరము ఆక్షేపము కాదు దిగంబరవై చీరకు బదులుగా నీ తలవెంట్రుకలు కప్పినావు అది సరి యైనది కాదు" అని కొంచెము స్పష్టముగనే పలికిన అల్లమునకు మహాదేవి ఇట్లనుచున్నది

**అక్క మహాదేవి**

కాయము నల్లగ కందిననేమయ్యా? కాయము
ఎఱ్ఱగా మెఱసిననేమయ్యా? అంతరంగము శుద్ధమైనమీద
చెన్న మల్లికార్జున లింగము ప్రేమించిన కాయము ఎటు
లున్ననేమయ్యా? ౧౦

**వివేచనము**

అయ్యా! మహనీయా! అల్లమయ్యా! మీయట్టివారి చూపులు ఈ కాయము కప్పియున్నను చర్మపు వన్నెలు చూడగా నిచ్చగించునే? ఏ వన్నె యున్ననేమి? అంతరంగశుద్ధియే ముఖ్యము నా నాథుడు మెచ్చినమీదట ఇతరుల ఆక్షేపణము లేల?

ఉడుతడి ప్రసంగమును అడుగుట అక్కకు సరిపడలేదు ఆ ప్రసంగము వీరి కెందులకు? అతిథిగా వచ్చిన వారిని ఆదరించు పెద్దవారి విధాన మిదియేనా? ప్రస్తుతము తెలిసినవారు గమనింతురు ఎందులకో స్త్రీని లోకము చూచు విధానమే విచిత్రము ఈ అనుభవ మంటపము అట్టి విచిత్రమును కొంచెము ఉంచుకొన్నదని అక్క వేసరిల్లి, ఆ విషయమును విడిచి, అంతరంగ పావిత్ర్యతను ముందునుంచి, బయటనున్న చర్మపు వన్నెలను ఛేదించి నిజమైన తన లింగాంగ దాంపత్యమును చక్కగా తెలిపినది అసాధ్యమైన తత్త్వ జ్ఞానము తెలిపి యుండుటయే కాక, నిర్భయముగా నిరూపించు వాగ్వైఖరి అక్కకు ఉన్నదని తెలిసికొని అల్లమస్వామి ఆధ్యాత్మిక సంసార విషయమునే అడుగుచున్నాడు

**అల్లమ ప్రభు :**

దేవుడొలిచె నీ వొలచితి వనుట అది ఎందు
కక్కా? భావ శుద్ధమైన, వస్త్రంబు వదలి వెంట్రుకల
ముసుగు చేయుట యెందుకు? అది అంతరంగపు సిగ్గు
బయటు చూపుచుండె అది గుహేశ్వర లింగమునకు
ప్రియకరంబు కాదు ౧౧

**వివేచనము**

"అక్కా! అతడు నీ వెటులున్నను ప్రేమించినాడు నీవు కూడ అత డెట్లున్నది చూడక వలచినావు. అనుకూల దాంపత్యమైన పరస్పరము ప్రేమించుకొను టెందులకో! పోనీ, అటులుండనీ నీవేమో చెప్పుచున్నావు కదా: ఆ భావ శుద్ధత యుండిన చీరముసుగు తీసి కేశముల ముసుగెందులకు పెట్టినావు? ఇది లోకపు నడతకు సంభావ్యము కాదు ఏమయినను, ఏ దాని నుండి యయినను నీ శరీరమును ముసుగుపఱచినావు అంతరంగములోని సిగ్గుని అది వ్యక్తము చేయుట లేదా? శివశరణులు ఈ నీ విపర్యాసవేషము ఒప్పరు" అని అల్లముడు శరణుల నడుమబెట్టి మహాదేవి దిగంబరత్వమును ఆక్షేపించిన చూచి మహాదేవి విచింత పొందక గంభీర భావముతో పలుకుచున్నది

**అక్క మహాదేవి :**

ఫలము లోపల పక్వంబు చెందినగాని బయట
సిప్ప (తొడుగు) ఒప్పు చెడదు కాముని ముద్రగని
మీకు నొప్పియగు నేమోయంచు ఆ భావంబున మూసితి
ఇందుకు నొప్పెందుకు? బాధించకన్నా! చెన్నమల్లికార్జున
దేవర దేవునిలో నున్నదానిని ౧౨

**వివేచనము :**

అయ్యా! స్వామీ! లోనైన పరిణామమును నైసర్గికము బయట చూపుట లేదా? ఎందుకింత కాతరము? ఇటులే ఫలములోని పరిపక్వతను ఆ ఫలము నంటికొని యున్న త్వక్కు (తోలు-చర్మము) తెలుపుచుండును గదా స్వామీ! మీ ప్రశ్నలు ఉచితానుచితములను మీరుచున్నవి ఐనను ఉత్తర మిచ్చెదను లోకము! లోకములో మీ యట్టివారున్నారు అనవసరముగా మీ కెందుకు బాధ కలిగించుట యని మాత్ర మందిరమును మూసినాను దానిని కాముని ముద్ర యని చూచి, తలచి, వలచి, వేదన చెందువారు లోకులున్నందున మఱుగు చేసినాను అడదానిని అని బాధించుట మీయట్టి వారికి తగదు నా చెన్ననిలో నున్నదానిని అని మహాదేవి బాధతో ఉత్తర మిచ్చినది గమనించినను, ఆమె చివరలో 'చెన్ననిలో ఉన్నా'నను మాటను పట్టుకొని దానిని విడదీసి చెప్పుటకై అల్లముడు ఇట్లడుగుచున్నాడు

**అల్లమప్రభు**

నీవు దేవునందో, దేవుడు నీ యందో అనుస్థాన
మెఱుగవు తొడుగు ఒప్పు చెడిన పండు రసము క్రుళ్ళి
పోవును అది గుహేశ్వరు డొప్పని మాట ౧౩

**వివేచనము :**

ఎక్కడి మాట నీ వాడునది, అక్కా! దేవునిలో నీ వున్నావో! నీలో దేవుడున్నాడో తెలియవు ఆ స్థానము, ఆ భేదాభేదాలు నీ కర్థము కాలేదు దేవ దాంపత్య సుఖాలు అటులిటులని చెప్పుచున్నావు చూడుము దేవుడు నీయం దున్నపుడు భక్తి యనిపించును రెండును భిన్నములే సామరస్యము లేనిది

అదియనుగాక ప్రకృతి విధానముతో చెట్టు, దాని ఫలము నుదాహరించినాపు తొడిమెను వదలిన పండు రసము చెడియుండుటయు కలదు

ఇట్లు అల్లమయ్య కొంచెము తీవ్రముగా మహాదేవి దిగంబరత్వ విషయముపై జరిగిన చర్చలో వచ్చిన విషయములు అంత అపేక్షణీయము లుగా నుండలేదు అక్కమహాదేవికి విసుగు జనించి ఇట్లనుచున్నది

**అక్కమహాదేవి**

గుణదోషము లెంచునంత వఱకు కామపు దేహము
క్రోధంపు ప్రాణము, లోభంపు వాసము, మోహంపు
మందిరము, మదావరణము, మత్సరపు పుట్టలుండును
ఆ భావంబు వదలునంత వఱకు చెన్నమల్లికార్జుననే
యడుగ తావులేదయ్యా, ఓ అన్నలారా! ౧౪

**వివేచనము :**

"స్వామి! ఎందుకింత వాదము? పైనున్న వన్నెలను జూచి మీయట్టి వారు వృధావాదము నెందులకు పెంచెదరో తెలియకున్నది మఱ్ఱి చెట్టునకు ఇతరము లైన చెట్ల వ్యాపకత్వమున కాశ్చర్యముండునే? మహానుభావులు మీరు, మీకు తెలియనిది ఉన్నదే? ఒకమాట నేను తెలిసి చెప్పితినని కాదు ఇది లోకవృత్తము. మనిషి కామ క్రోధలోభాల వశుడై ఎంతవఱకుండునో అంతవఱకు వక్రబుద్ధి పరనిందానందముల మంచి చెడ్డ లెంచుట సహజము దోషావసరము లేక గుణ గ్రాహియగునంత వఱకు ఈశ్వరు నెఱుగు అవకాశము శూన్యము ఊరక లేన్ని పోని ప్రపంచ వ్యవహార మంతటికిని తానే కర్తయనినట్లు పెద్దవారు వ్యవహ రింపరు" అని లోకవృత్తములోని స్వభావములు దిట్టతనముగా మహాదేవి ముందుంచినపుడు అల్లముడు వాదమున కంటుకొనియే ఇట్లనుచున్నాడు

**అల్లమప్రభు**

కామంబు నుండి కందయు, క్రోధంబు నుండి అస్థి,
లోభంబు నుండి సకల విషయంబులు, మోహంబు నుండి
చూచితి ననిన దంతయు కాముని వల లోన కాముని గెలి
చిన తావేది చెప్పుమా గుహేశ్వరలింగునకు! ౧౫

**వివేచనము**

"అక్కా! నీ మధుర సంభాషణము కర్ణామృతము నీ పలుకులలోని తీపితో వ్యంగ్యపు చేదు కూడ విషయ సమ్మతము లోక సమ్మతముగా నున్నది వేస రము పడకు ఈ శరీరము ప్రకృతి నిర్మితము గుణ దోషముల మిశ్రణము తోడనే పుట్టును దేహములోని ఎముక క్రోధమునకు తావు మాంసము కామము నకు నిలయము లోభము నుండి ఇతర దోషములు ఉండును గదా! నీవు చెప్పి నది నమ్మలేదని కాదు అగాధమైన కామమును ఈ విశ్వములో శివుని మినహా గెలిచినవారి మఱియొకరి పేరు లేదు ఇట్లుండగా నీవు ఆ కాముని గెలిచిన స్థాన మేదియో చెప్పెదవా?" అని అల్లముడడిగినపుడు మందహాసముతో మహాదేవి అక్క చెప్పుచున్నది

**అక్కమహాదేవి** ·

కాలిన శవమట్లు, సూత్రము తప్పిన బొమ్మయట్లు,
నీరెండిన తటాకమట్లు, కాలిన దారమట్లు, మఱియు
వెనుకటి అంగమున్నదా యేమి అన్నా, చెన్న మల్లి
కార్జునుని అంగ మాశ్రయమైనదానకు? ౧౬

**వివేచనము :**

"ఇదేమి ఇట్లడుగుచున్నారు మహాప్రభూ! శివశరణులు కామమునకు లొంగు తావెక్కడునున్నది? శ్రీ గురు కరసంజాతులకు కామమోహములనునవి యున్నవే? మీ రడుగునది మాంస పిండపు మాట అదిసరి వీరశైవ షట్స్థల తత్త్వార్థప్రకారము అది వెనుకటి జన్మము గురుదీక్షా సంస్కార మంత్ర దేహ మునకు సంబంధములేదు అది కాలినశవము సూత్రము తెగిన బొమ్మ ఎండిన చెఱువు ఏమియు ప్రయోజనము లేనిది కామారి చెన్నమల్లికుని అంగమే నా యంగమైనదానిని " నిరర్గళముగా తన కామ విజయ విలాసమును చిత్రించినది మఱియు నేదియో చెప్పుటకు జ్ఞాపకమునకు వచ్చినందున అక్కమహాదేవి ఇట్లను చున్నది

"చావులేని, చెడుగు లేని, రూపులేని సుందరుని
భవములేని, భయములేని నిర్భయుడగు వలపుగానిని నే

వలచితినయ్యా! చెన్న మల్లికార్జునుడే మగడు నాకు
ఇతర లోకంపు మగలు- వారి సంబంధము లేదయ్యా! ౧౭

అన్నా, అల్లమదేవా! చూడు చూడుము నా మగడు అందఱివలె గాదు లోకములో నుండు మగలు నా కక్కరలేదు సంబంధములేదు నా మగడు చావు లేనివాడు చెడువాడు కాదు పుట్టి చచ్చువాడు కాదు నిర్భయుడు వాని చేయి పట్టితినయ్యా! తండ్రీ, ఇంకేమి చెప్పుదును? చెప్పండి" అని యా దేవి ఉద్వేగముతో అనినపుడు అల్లముడు తల ఊపి ఇట్లనుచున్నాడు

**అల్లమ ప్రభు :**

రూపంబునకు చేటుండు నిరూపమునకు లేదు
రూప నిరూపంబులు చేరియుండుటెట్లు చెప్పుము చెల్లీ?
అసంబంధము సంబంధమైయుండె దేహేంద్రియములమ
జాత సూతకములుండ గుహేశ్వరలింగుని ముట్టరాదు
వినుమమ్మా! ౧౮

**వివేచనము**

"అసంబద్ధ ప్రలాపము, అమ్మా! నీకు రూపమున్నది నీ ప్రియునకు రూపము లేదు రూపు ఉన్నట్టులే యుండదు వివిధావస్థలకు లోనగును. ఏ అవస్థయు ఏ కీడు మేలులు లేనిది అని నిరూపింపలేము ఇవి రెండును కూడు టెట్లు? ఆదియుగాక నాశమొందును, అపవిత్రమగు దేహేంద్రియ సూతకముండగా దేవుని తాకరాదు గదా! నీవు తెలిసియు ఈ భావన నుంచుకొనిన దాని కాధారమేమి?" అని అల్లముడు వ్యంగ్యముగా ప్రశ్నించినాడు వినిన మహాదేవి దిట్టతనముతో ఇట్లనుచున్నది

**అక్క మహాదేవి .**

పాము పళ్లుదీసి పాము నాడించు టెఱిగిన పాము
సంగమే మేలు గదయ్యా! కాయంపు సంగము వివరించి
తెలిపిన కాయంపు సంగమే మేలు కనుమయ్యా! తల్లి
రక్కసియైనట్లు కాయ వికారము చెన్న మల్లికార్జునయ్యా!
నీవు వంచిన వారిని కాయమున్న వారనరాదు. ౧౯

**వివేచనము**

"స్వామీ! పాము చెడ్డదని చంపుదురు చంపువారు పాములోని చెడ్డ తన మెక్కడుండునది యెఱిగి, జీవుల జంపు విషపు కోరలను తీసి వేసిన తరువాత ఆ పాము వాడని పూలహారమని ఆడుకొనవచ్చును పామంతయు చెడ్డది కాదు అటులనే మనుష్యుని మనసులోని కిల్బిషము నశింపజేసినపుడు శరీరము విన్న ఉపయుక్తమగు వస్తువు లోకములో లేదు మనిషిని గుఱించి తెలియుట అంత సులభము కాదు మీరిప్పుడు విమర్శించినది నిజమే కన్నతల్లి రక్కసిగా మారి నట్లు ఈ కాయ వికారములును అంతే అవి-ఇవి లోకమునకు కావలసిన గుణ దోషములున్నవి ఆ విషయమట్లుండనిమ్ము-స్వామీ! తమ కృపా కటాక్షమునకు చెందినవారు కాయమున్నవారని అనరాదు" అని అక్క చక్కని ఉదాహరణ ముతో గుణ దోషముల గుఱించి శ్లాఘనీయముగా వర్ణించినప్పుడు అల్లముడు ముదమొంది ఇట్లనుచున్నాడు

**అల్లమ ప్రభు**

కాయ శుద్ధమైనదన్న లింగ మక్కడుండదు జీవ శుద్ధమైనదన్న లింగమక్కడుండదు భావ శుద్ధమైనదన్న లింగమక్కడుండదు గుహేశ్వర లింగమందు శుద్ధ జాగ్రత నుంటినన్న నిజము సాధ్యము కాదు విను మమ్మా! ౨౦

**వివేచనము**

"ఇంత వాద నైపుణ్యము ఈ వయసులో ఎక్కడ నేర్చితివో! శ్లాఘనీయు రాల వక్కా! పాము, మనిషి, సంస్కారముల గుఱించి నీవు చెప్పినది కొంతమట్టుకు నిజమే గురు సంస్కారము పొందిన భక్తుని విషయములో నిరహంభావపు నడత లేకపోయిన గురు సంస్కారము ఫలించదు కాయము, జీవము, భావము శుద్ధములైనవని చెప్పికొనినపుడు ఆయా తావులు ఇష్ట ప్రాణ భావ లింగము లుండుటకు వీలులేదు ఎందుకనిన, అవి చెప్పుకొను లింగములు కావు సహ జముగా నడతలో చేరి నడచినదంతయు, ఉన్నదంతయు లింగిమై యుండుటయే లింగాంగతత్త్వము" అల్లముడు అక్క చెప్పినది ఒప్పుకొనినను, కాయమును

గుఱించి చెప్పినదానికి ఇంతటి విమర్శ చేసినపుడు మహాదేవి ఇట్లు సమాధానము చెప్పుచున్నది

**అక్కమహాదేవి :**

కాయము లోపల అకాయమై యుండె జీవంబు
లోపల నిర్జీవమైయుండె భావంబు లోపల నిర్భావమై
యుండె నా మనంబునందు ఘనము స్మరణకు వచ్చి
యుండె నాదు కొప్పు పాలిండ్లు జూచి రక్షించితిరి గాన
చెన్న మల్లికార్జునుని ధర్మంబు దాన ౨౧

**వివేచనము**

"ప్రభుదేవ! తమరు చెప్పినట్లు కాయ జీవ భావము లుండినను అక్కడ లింగము లుండవని చెప్పినను, ఆ కాయ జీవ భావములు లింగాంశములు కానివి కావు కాన అహంకార మున్నపుడు వ్యక్తములు కావు లింగవంతుల శరీరములు గురుప్రసాదిత శరీరములు నిరహంకారముచే సర్వము సమన్వయ మగును స్వామి! నా మనమందు ఘనమైన చిదానంద తత్త్వమున్నదని తెలిసినందున నా కాయములో అకాయమాయెను జీవములో నిర్జీవమాయెను భావములో నిర్భావమాయెను ఈ రీతి నా కయినదనిన నేను ఏమియు నెఱుగని దిక్కులేని బిడ్డనని రక్షించితిరి కాన చెన్నమల్లికార్జునుని దాసనైతిని" అని అక్క చెప్పినది విని అల్లముడు ఇట్లనుచున్నాడు

**అల్లమ ప్రభు**

చేరరాని ఘనము చేరు తీరదెటులవ్వా? చెప్పినచో
దాని దానికే కొఱత గుహేశ్వర లింగమును వేరుజేసి
కూడించుట ఎట్లు చెప్పుమా తల్లీ ! ౨౨

**వివేచనము :**

ఏకస్వరూపమైన, ఏదియు కాదగినదైన, చేరరానిదైన, ఆ మహా ఘనమును చేరుకొను తెరువేది? అది కూడితినని చెప్పరానిది అది అద్వైతము అనగా కూటమియే ఏకత్వము ద్వైతమైనగాని చెప్పుటకు రాదు నీవు చెప్పు

చున్నది నమ్ముటెట్లు? అని అల్లముడు ఆక్షేపమెత్తినపుడు అక్క ఉత్తర మిచ్చు చున్నది

**అక్కమహాదేవి :**

గట్టిగనున్న నెయ్యికి, కరిగిన నెయ్యికి హంగు న్నదే అయ్యా? దీపమునకు దీప్తికి భేదమున్నదే అయ్యా? అంగమునకు ఆత్మమునకు భేదమున్నదే అయ్యా? నా యంగమును శ్రీ గురువు మంత్రంబుజేసి చూచెగాన, సావయవ నిరవయవములకు భిన్నంబు లేదయ్యా! చెన్న మల్లికార్జున దేవుని పొంది మతి చెడిన దాని నెందులకు మాటాడించెదరయ్యా, అల్లమయ్యా! —23

**వివేచనము .**

స్వామి! మతి చెడిన, లోకమున కడ్డుపడిన ఈ ఆడుబిడ్డ నెందులకు విప్పి విప్పి చూచెదరయ్యా? నే చెప్పిన విషయముపై ద్వైతాద్వైతములను దెచ్చి పడ వేసినారు సూక్ష్మాతి సూక్ష్మతత్త్వముల మొనలతో పొడిచినారు అయ్యా! ద్వైతా ద్వైతములు వాదమునకు, వక్రచర్చలకు, ఎదుటివారి నోరుగొట్టుటకు అత్యంత రంజములే కాని వానిలో నిరంజనత్వము లేదు రెండు కూడినది ఊరకున్న అద్వైతము చెప్పిన ద్వైతము - అని తమ ఆక్షేపణవలన తెలియ వచ్చుచున్నది ఈ రెంటిని తెలియుటకు మీరు చెప్పు ఉపాయమేమో చెప్పలేదు చెప్పలేరు

ద్వైతాద్వైత మెట్లున్నదనిన సావయవ నిరవయవముల వస్తువులు ఆధారములైయుండును సావయవము ద్వైతము నిరవయవము అద్వైతము అన్నిటికిని మన కన్నుల ముందున్న అనుభవమే ముఖ్యము నేయి వాతా వరణము చల్లబడినప్పుడు గట్టిపడును ఉష్ణముగా నున్నపుడు ద్రవముగా కరుగును గట్టిపడినపు డొకవన్నె ఆకారమగును కరిగినపుడు అదేమియు నుండకయుండును రెండుగా మాఱు వస్తువు ఒకటియే నేయికదా స్వామీ? దీపము-వెలుతురు, అంగము-ఆత్మ వేఱువేఱుగా నుండగలవా? నే చెప్పినదానినే నా అనుభవమునే చెప్పెద శ్రీగురువు నా కాయమును మంత్రించినందున సావయవ నిరవయవములకున్న భేదంబు నాశనమైనది

అక్క సులభముగా జటిలమని తలచిన పెద్ద తత్త్వములను నేయిలో కలిపి చూపినది ఈ లోకదృష్టాంతము ఆ మహాతత్త్వమునకు పోల్చి అల్లమ ప్రభువువంటి మహాయోగిని ముందు పెట్టినపుడు అల్లముడు అచ్చెరువడినాడు ఐనను ఆమె చెప్పినది ఎట్లు సాధించునో చూడవలయునని ఇట్లు అడుగుచున్నాడు

**అల్లమప్రభు .**

నే చచ్చితినని పీనుగు కూయుచున్నదే? దాచిన
నిధి పిలచుట యున్నదే? తోడుబెట్టిన పాలు తీపియగునే?
ఈ మాట ఒప్పితము గాదు గుహేశ్వర లింగమునకు —౨౪

**వివేచనము :**

"సరిసరి అక్కా! నీవు సమర్థురాలవే! సంతోషము చూడు, నీవు చెప్పినది అనుభవానికి వచ్చిన, చచ్చిన పీనుగు నేను చచ్చినానని వాయెత్తి పలుకునా? భూమిలో దాచిన ఐశ్వర్యము రమ్మని పోవువారిని పిలచునా? పులుపు కలిపిన పాలు తియ్యనగునా? ఏటి మాటలో! లోకములో లేనివి ఆశ్చర్యము కాని, అధికృతములా?" అని తీవ్రముగా ఆక్షేపమెత్తిన అల్లమునకు అంతే తీవ్రముగ అక్కమహాదేవి ఉత్తర మిచ్చుచున్నది

**అక్కమహాదేవి .**

చచ్చిన పీనుగు కూసిన దున్నది దాచిననిధి పిల
చిన దున్నది తోడుబెట్టిన పాలు గట్టియై తీపైన దున్నది
దీనిని నిశ్చయించి చూడుమా చెన్న మల్లికార్జును నందు —౨౫

**వివేచనము ·**

అల్లమ దేవా! ఆతురము వలదు తమకు తెలియదని చెప్పను ఎందులకో నామీద అలిగి ఇట్లు ప్రశ్నించుచున్నారు కానిది, లేనిది, లోకమునకు సంబంధము లేనిది నేను చెప్పలేదు అనుమానముతో మీరడిగిన ప్రశ్నలకు ఉత్తరములు దృష్టములున్నవనినపుడు అల్లముడు ఆశ్చర్యమున ఇట్లనుచున్నాడు

**అల్లమప్రభు :**

ఇది నాకు ఆశ్చర్యము చెప్పవమ్మా! కాయములని
సుఖము, జీవము లేని భవము ఆ రావు ఏమనుచు
గుహేశ్వర లింగునకు చెప్పవే చెల్లీ! ౨౬

**వివేచనము**

ఆహా! ఆహా! ఆశ్చర్యము! ఇదివఱకు ఎవరి నుండి వినలేదు నాకు తెలియలేదు ఇది కాయపు హంగు లేక సర్వసుఖాలు పొందుట ఎంత వింత? జీవము లేక భవానుభవాలు పొందు మార్గము, భళిరే! అక్కా! నీవెంతటి సాహసురాలవు? ఓహో! లోకమున కాశ్చర్యము! అదెట్లో చెప్పు తల్లీ! అని అల్లముడు చోద్యముతో అడుగగా అక్క మందహాసమున ఇట్లనుచున్నది

**అక్క మహాదేవి**

నిదురలేచి కనినకల చెప్పినపుడు చచ్చిన శవంబు
లేచి యుండె తనదనిన ఋణనిధానము పిలిచియుండె
తోడుపెట్టిన పాలు గట్టిపడి ఘృతమై మధురమై యుండె
ఇందులకు తప్పు సాధించుటేల? చెన్నమల్లికార్జున దేవర
దేవులన్నలార! ౨౭

**వివేచనము**

ఆశ్చర్యమేమున్నది స్వామి? నిద్రలో చనిపోయినట్లు కనిన కలను లేచిన తరువాత చెప్పుట లేదా? ఇది అందఱు ఎఱిగినదియే? చావనిస మఱి పుట్టుట చచ్చుట ఎవరికి సాధ్యము? ఏమో మీ వంటివారికగును కాలమునకు వయస్సునకు వచ్చు చావునందు దేహము పతన మగును ఈ సూక్ష్మశరీరము (స్వప్నము) చావులో చావదు చచ్చిన అనుభవమును పొందును తరువాత స్థూలశరీరావలంబియై జాగ్రదవస్థకు వచ్చి నపుడు చెప్పునది చావుకాదా? అది చచ్చిలేచిన శవముకాదా? ఇక భాగ్యవశమున సిరివచ్చు కాలములో గుప్తనిధులు వారివారిని పిలచిన ఉదంతము లెన్ని లేవు? పులుసు పిండిన పాలు గిట్టిపడి పెరుగై తరువాత మథనము నుండి నవనీతమై కొనకు ఘృతమై మ౼ంర మగుట

లేదా? అయ్యా! జీవ లోకములో ఇవి నిత్యకృత్యములుగా అనుభవవేద్యమై యుండగా దీనిని పెద్దగా జేసి తెలియరాని తత్త్వముగా జేసి భ్రాంతి పుట్టించెద రెందులకు అల్లమదేవా? అని మహాదేవి అరటిపండు ఒలిచినట్లు సహజముగా లోకానుభవ దృష్టాంతములు ముందుంచగా భళీ అని అల్లముడు హర్షోత్సేకమున ఇట్లనుచున్నాడు

**అల్లమ ప్రభు**

ఇది బాగు బాగు నిండిన లెక్కకు మఱియొకటి
యని కొనగాంచునట్లు స్థాణువు మఱుగున నున్న చోరుని
యట్లు సాగరంబుపై నున్న విహంగమట్లు ఎక్కడ వచ్చి
నను గుహేశ్వరుడను భావమొక్కటయి యుండె ౨౮

**వివేచనము**

ఔరా! ఇది మహోన్నతము మహానుభవము సర్వతోముఖ సత్యము అక్కమ్మా! నీవు పూర్ణమును సాధించినావే తల్లీ! నినుబోలు వారు విశ్వమున అరుదు నిండిన లెక్క అనగా శేషము సున్న అది కూర్చినావు ఐనను ముగించక ఆ శూన్యమునకు లెక్కపెంచుటకు సంఖ్య చేర్చినావు ఇపుడు సంఖ్య నీ స్వాధీనమై యున్నది మొండిమ్రాను మరుగున్న దొంగ స్థాణువై కనబడును (స్థాణుడు అనిన రుద్రుడనియు అర్థము) సముద్రము పైనున్న పక్షికి ఎటు జూచినను సముద్రమే కనబడును అటులనే నీవు నిజమును కనుగొన్నావని మెచ్చి అల్లమదేవుడు ప్రశంసింపగా మహాదేవి తలవ్రాల్చి వినమ్రయై ఇట్లను చున్నది

**అక్కమహాదేవి**

నాకెందుకయ్యా? నేలోకపు బొమ్మను మాయంపు
మల భాండమును అవసరపు భవ నిలయమును నీటి
కుండ క్రింది మొలుచు గడ్డి, గుడిసె కెందుకు? చేయెత్తిన
తాటిపండు తిననగునే? బీజమంతయు జీవంబు దాని తెర
గొప్పదు నాకు నా తప్పు ఒప్పించుకొనుము చెన్నమల్లి
కార్జున దేవర దేవుడవు మీరే అన్నలారా! ౨౯

**వివేచనము .**

శివ శివా! అల్లమ దేవా! ఇంత ప్రశంస నాకు తగునా? నీరు [illegible]గని గొంతుకలో కుడుమును త్రోసినట్లు నేనెంతటి దానను? నా యోగ్యత యెంత? మీ విమర్శకు తగుదును గాని ప్రశంసకు తగను ఈ లోకములో నే నొక కీలు బొమ్మను మాయ మల మదమత్సర భాండమును చచ్చి పుట్టు భవచక్రమును దుర్విషయరసమొనరు కుండను నేను దోరకాయను గాని, కసుగాయను కాని ఒత్తిడిచే ఒత్తి పండు చేయుటకు కాదు కాలము దూరముగా త్రోసినది స్వామి, విత్తంతయు జీవమే శివపంట పండదు ఎందులకును కొఱగాని దానిని జూచి చూచి మీరు పొగడుచున్న తాళజాలనయ్యా! ఎంతయినను ఎట్టి విషయము లైనను చర్చించి నన్ను తిరస్కరించుమన్నా? ఇంకను వలదు ఈ ముద్దరాలు మీ కొనియాడు భారము మోయజాలదు అని మహదేవి అక్క తన దేహ మంతయు ఒకచోటకు చేర్చి వినయపు ముద్దయై విన్నవించినది విని బసవన్న మహానందము పొంది ఇట్లనుచున్నాడు

**బసవన్న :**

చిన్ని తనయ (కుమారి) యంగము గంటిరె
పురాతనులా! బాల తన మంగంబు చూచితిరే పురాతనులా!
బ్రహ్మంబు నాచరించి తన్ను తామరచి యుండుట చూచితి
తిరే లింగవంతులా! తనయందు తాను నిశ్చయమై భాష
తప్పక యుండు ధ్రుతి కూడల సంగమదేవు నందు మా
మహాదేవి యక్కకై యుండె 30

**వివేచనము :**

ఆహా! చిత్కళయే ఆకారము దాల్చి వచ్చినది చూడరయ్యా! పురాతను లారా! బాల్యమందే భవ్య దివ్యోన్నతి నుంచుకొని భయవివర్జితయై లోకమున కభయప్రదాయియై వచ్చినది చూచితిరే, పురాతనులారా! బ్రహ్మంబె సాకార నిరాకారములకు సాక్షియై త్రైలోక్య విజితమాయా వివర్జితయై బ్రహ్మచరణయై తాను బ్రహ్మంబనుటయే మఱచి సాధారణంబు గైకొని వచ్చిన చిన్న కూతురు సురూప సౌందర్యరాశిని చూడరే లింగవంతులా! గురులింగ జంగమములకు

తను మన ధనాదులిచ్చిన బాసకు సాక్షియై హస్తమున తన చెన్న మల్లికార్జున లింగముంచుకొని వచ్చిన లింగాంగము చూడరే శివశరణులు! లజ్జ అనుమాన ములు లేక తనయందె తానె నిశ్చయమైన మహాషట్స్థల తత్త్వమాతృక అక్క మహాదేవి లింగ పాతివ్రత్యమును తెలియరే, మహామహులు! అని బసవన్న హృదయ కమలంబు వికసించి అక్క పొందిన మహాలింగ సిద్ధి శిఖర సౌందర్య మును వర్ణించినాడు అనుభవ మంటపము దివ్యతేజోప్రభ లావరించి ప్రజ్వ రిల్లినది ఆ తేజములో శరణశరణియులు ఆనందరసాస్వాద చిత్తులైయుండ మహాదేవి శరణ సభకు సాష్టాంగాభివందనము సేసి వినమ్రయై ఇటులను చున్నది.

**అక్క మహాదేవి :**

నా భక్తి మీ ధర్మము నా జ్ఞానము ప్రభు దేవుని ధర్మము నా పరిణామంబు చెన్న బసవని ధర్మము ఈ మువ్గురు ఒక్కొక్కటిచ్చిన నాకు మూడును భావమై యుండె ఆ మూడు మీ యందు సమర్పించిన మీదట నాకే జంజాటము లేదు చెన్న మల్లికార్జున దేవుని స్మరణ మందు నీదు కారుణ్యంపు శిశువను నేను, కనుమా సంగన బసవన్నా! ౩౧

**వివేచనము**

అన్నయ్యా! నా యందు నాదిగా నున్నదేదియు లేదు నా భక్తి మీ రిచ్చిన ధర్మము నా జ్ఞానమనునది అల్లమ ప్రభు దేవుడు ప్రసాదించిన ధర్మము ఇక నా పరిణామమనునది చెన్న బసవన్న కరుణించిన ధర్మము ఈ త్రిమూర్తు లొక్కొక్కరిచ్చిన క్రియా రత్నములు నాకు భక్తి భావము, జ్ఞాన భావము, పరిణామ భావములుగా నన్నుద్ధరించినవి తరువాత వీరిచ్చినవి మీ కిచ్చి నిరాధారినై మీ శిశువునై యున్నాను అయ్యా! నా కెందుకు స్వాతంత్ర్యము? చెన్న మల్లికార్జునుడున్నాడు ఇతని స్మరణలో మీరందరు ఉన్నారు అని మహాదేవి బసవన్నకు వచన ముత్యాల హారంబు వేసినటులైన శరణులందరు సంతసించిరి చెన్న బసవన్న ఊరకుండక మహాదేవి ఇదివరకు చెప్పిన

ముత్యాలు రత్నాలవంటి వింతలయిన భావార్థములు, తత్త్వములు వ్యక్తీకరించు వచనములు విని చాల ఉత్సాహవంతుడై ఇట్లనుచున్నాడు

**చెన్న బసవన్న :**

అయ్యల అరువది వచనంబులకు దండ నాయకుని
ఇరువది వచనములు దండ నాయకుని ఇరువది వచన
ములకు ప్రభు దేవుని పది వచనంబులు ప్రభు దేవుని
పది వచనంబులకు అజగణ్ణుని ఐదు వచనములు అజ
గణ్ణుని ఐదు వచనంబులకు కూడల చెన్న సంగుని
యందు మహాదేవి అక్కగారి ఒక్క వచనము నిర్వచ
నంబు కనుమా సిద్ధ రామయ్యా! ౩౨

**వివేచనము**

చెన్నబసవన్న అనుభవ మంటపములో శరణులు చెప్పు వచనముల యందున్న తప్పొప్పులు సవరించి వచనభండారాధికారి శాంతరసునకు శుద్ధప్రతి చేయుట కిచ్చు ఏర్పాటుండెనని చెప్పుదురు అప్పుడపుడు ప్రభుదేవుడు పాల్గొను చుండెనట కాన చెన్నబసవన్న షట్స్థల నిర్ణయ చక్రవర్తి యని పేరు పొందిన విద్వాంసుడు కావున పైన చెప్పిన వచనార్థ ప్రకారముగా చూచినచో మహాదేవి అందఱి వచనముల కన్న తక్కువగా చెప్పిన వచనములు ఎక్కువ ప్రశంస నీయములనియు, శివాద్వైత తత్త్వసారములనియు శరణ సభ మెచ్చగా చెన్న బసవన్న నిర్ణయాత్మకముగా పలికినాడు దాసోహం భావమున కనుసారముగా తన వచనాలు సర్వశ్రేష్ఠములని పొగడ్తకన్నను తనదితాను చెప్పలేదు

మహాదేవి అక్కను బసవన్నగారు కూడ పరీక్షాదృష్టితో వాదమునకు దిగినప్పుడు దిట్టయై తన 'లింగపతి శరణసతి' తత్త్వము విస్తరించి చెప్పినది ఇంకొక ప్రశ్న బసవన్నగారి నుండి వచ్చినది

**బసవన్న**

అంగమందు లింగ సంగము, లింగమం దంగ
సంగము చేసితినననిన సందుభేదంబు వదలు రీతి చెవుమా!

అంగమందు లింగ సంగంబు చేసితినన్న ముందు జెడిపి
వేధించు శివుడు కామమను కాంక్షయందు అడలించు
బడలించు శివుడు లింగమందు అంగము నిక్షే
పించితినంచే అంగము నుండి జారి దూర దూరమౌను
శివుడు ఆడది మగవాడైన సంగంబునకు కూడడు శివుడు
కూడలసంగమదేవుని చేరుటన్న భిన్నంబులేని పీరుదౌట
వినుమా చెల్లీ! 33

**వివేచనము :**

అమ్మా! సమవధానివై వినుము అంగలింగ, లింగాంగ మనిన ఒకటి తరువాత మఱియొకటియన్న భిన్నమేర్పడునుగాన ఒకటి అన్నది లేదు ఇక అంగమందు లింగంబు కూర్చితిననిన నీ మనోమార్గమునకు అడ్డమై ముందు తెలియనీయక వేధించును శివుడు అదిగాక 'లింగపతి - శరణసతి' అనిన భేదమున్న నుండును గదా! లింగమందంగంబు అంగమందు లింగముంచు నీ రీతికి అసాధ్యుడై కనుగొనెదనని నీ వెంత సాహసించి తలపింప బోవ బోవ అంతంత దూరమౌను ఆ శివుడు చూడుము ఒక మాట! మాటకాదు ఇది భిన్నభువము. స్త్రీ పురుషుడైనపుడే గెంతి (పక్షివలె ఎగిరి మీదపడి) వలపున ఆలిం కించు కూడలసంగుని కూటము అభిన్నకులితనంబై ( భిన్నముకాని రాశియై ) ప్రభవింపవలెనమ్మా!

బసవన్న ఈ రీతి ముఖ్యమైన "శరణసతి - లింగపతి' దాంపత్య విచారము ఎంతవఱకు సాధనమందుంచుకొనుట? ఈ సాధనలోనున్న ద్వైతము-అద్వైతముగా సిద్ధి పొందగలిగిన విధానము ఏది?" అని అడిగిన ప్రశ్న అనుభవ మంటపములో అదివఱకు అల్లమాది శరణులు అక్కగారి సాధనను గుఱించి వాదము సాగించిరి అది సమర్పకముగా ముగిసినది ఇప్పుడు బసవన్న గారి ప్రశ్నకు శరణులందరు కుతూహలులై వినుచుండ మహాదేవి ఇట్లనుచున్నది

**అక్కమహాదేవి**

కాముని గెలిచితి నయ్యా బసవన్నా! మీ కృప
నుంచి, సోమధరుని పట్టి తెచ్చెదనయ్యా బసవన్నా! మీ

కృపనుంచి పేరునకు ఆడురూపుగాని, భావించిన మగ
రూపు చూడగా బసవన్నా! మీ కృపనుంచి అతికామి
చెన్న మల్లికార్జునునకు చిక్కువెట్టి కూడి, రెండని ఎంచక
మరచితినయ్యా బసవన్నా, మీ కృపనుంచి 34

**వివేచనము :**

"అన్నయ్యా! లోకమెఱిగినట్లు కాదు నేను పురుషుండను అంగ చిహ్నములున్నను నేను స్త్రీని గాను మీ దయవల్ల కాముని గెలిచితి చంద్రావతంసుని చేబట్టి తెచ్చెద అంగ వికారములను కాల్చి అతికామి చెన్న మల్లికార్జునుని బంధించి స్థిరచిత్తనై నా సర్వాంగమున ఐక్యము చేసికొని, ఆత్మస్థైర్యంబున అధ్యాత్మరంగమందు వీర విక్రమశాలినై కైవశంబు జేసికొంటిని బసవన్నా! అన్నిటికిని నీ దయయే కారణము రెండు విడిచితిని. ఒకటి మఱచితిని."

ఇటులనుచు అగాధము అగమ్యమైన తన సాధనా శక్తిని విస్తరించి పరమావేశ భరితయై మఱల బసవన్నకు ఇట్లనుచున్నది

"బసవరాజయ్యా! మీ దయా వీర ధర్మమునకు మెప్పు తెచ్చిన వీర వనితను నేను అన్నయ్యా! చూడు చూడుము ఊర్జిత భావనా సాగర తరంగములు వాతా ఘాతమువలన అనంతాద్భుత తరంగాలుగా మేర మీరి ప్రపంచమునే ముంచునేమో యనినట్లు భయంకరమగును మరుక్షణములో గాలి నిలచినప్పుడు ఏమియు కాలేదనినట్లు మెత్తని సజ్జనుని వోలె శాంతమై యుండును

అంగ గుణంబులు నావి కాదనినపుడు ఆ అంగము నీదగును అవి ఇవి యను షడ్రుములకై కోరికలు అంతరించినపుడు అభిన్నమై లింగరుచిగా మారును అప్పుడు మొదట నా మగని చంపి ఆ మీద నే చచ్చెద ఇది నా లింగాంగ సామరస్య ప్రతిజ్ఞ

ఈ వీరభక్తురాలి ప్రతిజ్ఞ విని శివశరణులు ఆశ్చర్యచకితులై ఉత్సాహమున నలరారి కొనియాడుచున్నపుడు మహాదేవి తలవంచుకొన్నది స్తోత్ర

మామెకు పట్టదు బసవన్న అక్క కనుగొనిన, పొందిన లింగపతి-శరణసతిని, తత్త్వ సాధనయందు నిర్ణయంబైన సిద్ధిని విమర్శించి, "అదివఱకు సాధనకు సులభము కాని దానిని సాధించి నీవు-నేను భేదములు భక్తి స్థలములో అనివార్యమైనను మహేశ, ప్రసాద, ప్రాణలింగ, శరణ స్థలముల వఱకు నీవు నేననుట తప్పదు బనను అది వీరశైవ షట్స్థల తత్త్వమునకు విరోధి కాదు ఈ విరోధము ఐక్యస్థలమునకు మాత్రమే" అనినాడు

ఆనంద పరవశముతో బసవన్న శరణ సమూహమును వీక్షించి అక్కమహాదేవిని జూచి తన సిద్ధిగుఱించి చెప్పినదానిలో మఱియొక విషయము జ్ఞప్తికిరాగా ఇటుల అడుగుచున్నాడు

**బసవన్న :**

చావడు బ్రతుకడు ప్రళయంబు మున్నెఱు
గడు. కలవర రహితుడు ఉభయకుల వర్జితుడు తెలివి
మఱుగు బెట్టి మెఱయు గమనుండు గాడు కూడల సంగ
ముడను శబ్దముగ్ధుని భావంపు బదలికతో గెలువ నగునే
చెప్పుమమ్మా॥ 32

**వివేచనము :**

అక్కమ్మా! భావావేశంబున చోద్యంబు పలికితివి నీవు చంపెదనని నది నాశ- అవినాశల కతీతము దానికి ప్రళయమే లేదు అది అంగము కాదు లింగము కాదు నీవు కాదు నేను కాదు జ్ఞానము కాదు అజ్ఞానము కాదు అది ముద్రాంకిత మహత్తు ఏమియూ కానిదానిని ఏమని నిర్ణించెదవు? దీనిని చంపెదననిన దివ్యర్థమైన భావంపు బదలిక గదా చెల్లీ! అని బసవన్న బ్రహ్మతత్త్వమును బట్టి అడుగ మహాదేవి మర్మమెఱిగి సమాధానము చెప్పుచున్నది

**అక్కమహాదేవి :**

అంగమునందంగమై అంగలింగైక్యము జేసితి
మనమందు మనంబై మనము లింగైక్యము జేసితి
భావంబునందు భావమై భావలింగైక్యము జేసితి తెలివి

లోన తెలివియై జ్ఞానలింగైక్యము జేసితి అన్ని క్రియలు
వదలితిని క్రియాతీతమై నివృత్త లింగైక్యమైతి నేననుట
పోకార్చి నీవనుట చెరిపి చెన్న మల్లికార్జునునందు ఉభయ
లింగైక్యమైతి ౩౬

**వివేచనము :**

అన్నా! అవధరించుము చంపెదననినది ఏమియుకాని బ్రహ్మంబుకాదు ఆ బ్రహ్మంబునుండైన సకలంబును గూర్చి ఆడినమాట ఇది అది కానప్పుడు నే మాటలాడు టెక్కడిది? నా విన్నపమింతయే ఈ శరీరమైనది యేదో దాని యందు నేను లేకుండ చేసినదాని కిచ్చి లింగైక్యమైతిని. మనసు భావజ్ఞానము లను కూడ అదేరీతిగా దానిది దానికిచ్చి లింగైక్యమైతిని కార్యకారణ కల్పితము లన్నియును క్రియా బాహిరంబుజేసి నిర్భయనైతి నేను నేననుట త్రుంచి నీవనుట కాల్చి ఉభయము లింగైక్యము జేసితి బసవదేవా! చెన్నమల్లికార్జునునందు నిర్యాణమైతిగాన తరువాత లింగంబను మహత్తు నాయందు లయమయ్యె చూడుమా! సంగన బసవన్నా!

బసవ డడిగిన విశిష్టాద్వైత తత్త్వములోని లింగపతి శరణసతి, నాశ రహితమైన బ్రహ్మను నశింపజేసి ముక్తినందితినన్నదెట్లని అడిగిన ప్రశ్నలకు శాస్త్ర సిద్ధాంత సమ్మతముగా, శివశరణులు ఔననగా, నిర్ణయాత్మకముగా పలికి, మహాదేవి అల్లముని గెలిచినట్లు బసవన్నను గెలిచి, అసదృశమైన తన అను భవమును అనుభవ మంటపములో అఖండ జ్యోతియై వెలుగునట్లు చేసినది అంతయేకాక మానవ లోకజీవుల వెలుగై ప్రకాశించినది (ప్రాయము చిన్న దైనను అభిప్రాయము చిన్నదా?)

పరమానందభరితుడై బసవన్న ప్రశంసాన్వితముగా ఉచ్చ కంఠస్వర మున ఇట్లనుచున్నాడు

**బసవన్న**

చిన్న అమ్మాయి (చిన్నపాప) అంగంబు చూడరే,
పురాతనులు! పసితనపు అంగంబు చూడరే, పురాతనులు!

బ్రహ్మ మాచరించి తన్ను మఱచినది చూడరే, లింగ
వంతులు! తనయందు తాను నిశ్చయమై పంతంబు
వ్యర్థంబు గాకయున్న స్థితి కూడల సంగమదేవునందు
మహాదేవి అక్కకై యుండె 32

**వివేచనము :**

పరవశంబున బసవరాజు శరణ సమూహమును సంబోధించి మహాదేవి అక్కగారి దివ్యానుభవమును వివిధరీతుల వర్ణించినపుడు శరణులతోబాటు అల్లమ ప్రభుదేవుడు ఆశ్చర్యభరితుడైనాడు ప్రభువాదమున కంటె బసవన్న వాదము మహాదేవిని ప్రజ్వలింపజేసినది అక్కకు ఈ ప్రశంస వలన ఏమియు తెలియక వాదమును విరమించువఱకు ఇదే రీతియని బసవన్నను చూచి ఇక చాలనినట్లు తలవంచి ప్రణామంబు జేసినది తనచివరగతి ఎక్కడని ప్రభువుతో విన్న వించుకొనుచున్నది

**అక్కమహాదేవి**

లింగసుఖ సంగమందు మనము వేద్యమైయుండె
ఇంకెక్కడయ్యా నాకు మీయందు నిరవయవము? ఇంకె
క్కడయ్యా మీయందు చేరుట? పరమ సుఖ పరిణామ
మనము మేరదప్పి నేను నిజమగు రావు చెప్పుమా, చెన్న
మల్లికార్జునయ్యా! 33

**వివేచనము :**

తండ్రీ! సెలవీయండి నా కొన ఎక్కడ? మీయందు తద్గతమై యుండు టెన్నడు? లింగసుఖానంద సంగము తెలిసితిని పరమసుఖము పరిణామమగు స్థాన మెక్కడ? నా ముందున్న దేమని చెప్పరయ్యా! అని మహాదేవి అల్లముని అడిగినది ఇదివఱకు శరణులతో నడచిన తత్త్వములు, సాధనలు, సిద్ధులు వివిధ రీతులుగా చర్చింపబడినవి దానిలో అక్కగారి జీవన మపూర్వమైనదన్న భావము ప్రభువు మొదలగువారు ఒప్పుకున్నారు అయితే ఇప్పుడు అల్లము డడిగిన అక్కమ్మ భావమేమని తెలియుట సామాన్యము కాదు శరీర మున్నంత వఱకు దాని చేష్టలందుబెట్లో ఆత్మ యుండునంతవఱకు సాధనాసిద్ధుల తగు

లాటములు (పీకులాటలు) సహజ మనునది ఈ మహాదేవి యక్క వెల్లడించిన అభిప్రాయమున తెలియనగును

మహాదేవి తనను వెదకుచు ఇక్కడకు వచ్చినదని అల్లముడు ఎఱిగినాడు వెనుకటి జన్మమందు మాయాదేవి పేరున తనను గెలుచుటకై వచ్చి ఓడిపోయి ఈ జన్మమున మహాదేవియై వచ్చి నన్ను గెలుచుకొన్నది (చామరసుని ప్రభు లింగలీలా కథనము) అని తనలో తలచి మందహాసమున అల్లముడు ఇట్లు ఆదేశ మిచ్చుచున్నాడు

**అల్లమ ప్రభు :**

నీవు నేనను ఉభయ సంగమువర్జించి తాను
తానైన త్రికూటమను మహాపర్వతము కొట్టకొన కెక్కి
చూడ బట్టయలు కాననగును సుమా! ఆ బయలులో చేర
వలెనన్న త్రికూటగిరి యందొకటి కానరాని కదళీవన
మున్నది సుమా! కదళీవనము ముందఱకుపోయి చూడగా
వెల్లవెలుగు జ్యోతియుండును వినుమా! పొమ్మక్కడకు
తల్లీ! గుహేశ్వరుని లింగమందు పరమ పదము నీకు
స్వయమగును చూడుమా! ౩౯

**వివేచనము :**

నీవు నేననునవి రెండును భిన్నత్వమునకు మూలము ఈ భిన్నత్వము ఏకత్వము నుండియే ఆవిర్భవించినది భిన్నమే ప్రపంచమునకు మూలము ఆ భిన్నమే ప్రపంచ రాహిత్యము కాన భవాంకుర బీజాలైన నేను నీవనునది మొదలు ఆమూలాగ్రము ఖండించి తనలో తానే నిశ్చయమై - త్రికూటపర్వత మనిన (దేహములోనున్న) భ్రూమధ్యము, బయట శ్రీశైల శిఖరము, కొట్టకొన (లోపల) శిఖాచక్రము బయట మల్లికార్జునుడు, మఱి అవతల నుండునదే బయలు ఆ బయలునందొక త్రికూటము (శివ, శక్తి, జగత్తు) అదే శూన్యము లోని శూన్యము నిశ్శూన్య నిరాళము అక్కడ కదళీవనము (అరటితోట) అక్కడ ఒక అఖండజ్యోతి వెలుచుండును అక్కడకు పొమ్ము, నీవు స్వయమగుదువు

ఈ గురుతులు వానినైజము అనుభవములోనికి తెచ్చుకొనవలెను శ్రీగిరికి ఈ దేహమునకు పోలికలున్నవి అక్కడనున్న కదళీవనమును ముఖ్యముగా దృష్టి యందుంచు కొనవలెను ఆ కదళి ముందఱ వెలుగుజ్యోతి ఆత్మచిజ్జ్యోతియే యని ఎఱుగవలెను దాని ప్రజ్వలనము ప్రభావము ఎక్కడ సచేతనముగా నుండునో, ఆ మర్మమును ప్రభువు తెలిపినాడు అక్క గ్రహించి సంతోషభరితురాలై, శరణ సమూహమునకు దండప్రణామ మాచరించి చేతులు జోడించి ఒకతూరి అందఱను చూచినది వారందఱు తనవారను సాత్విక మమకారము మెల్లగ కుసుమ కోమల స్త్రీ హృదయములో చేరుకొన్నది పరమ రహస్యమెఱిగి ఈ ప్రపంచ వ్యవహారమునకే దూరము కాబోవుచున్న అక్కకు మరు లెక్కినది శ్రీగిరి తన మగనిల్లు ఇప్పుడు తన పుట్టినిల్లు విడిచి తన క్రొత్త లింగాంగ సంసారానికై వెళ్ళు చున్నది అంగ సంసారమునకు అన్ని సహకారములు పుట్టినిల్లు ఆడు బిడ్డకు సమ కూర్చును ఈమెది అట్లు కాదు ప్రపంచ వ్యవహారమునకే దూరము పంపువారు లేరు పిలిచెడువారు లేరు లింగవంతులకు పుట్టినిల్లు మగనిల్లు ఒకేచోటు, అది భక్తాంగము అగలికలేని (వేరుపడుటలేని) సంసారము ఇక్కడ, అక్కపోవు మగనిల్లు కనబడని శ్రీగిరి కదళీవనములోని నిర్బయలు(నిరాకారమైనది) అక్కడ తాను పొందునది అల్లము నుండి తెలిసికొనినదానికి శరణ సమ్మతి యుండునా యను అనుమాన ముద్భవించుట సహజము సమాధానమునకు వచ్చినపుడు వైయక్తిక మని చెప్పవచ్చును గాని సామాజిక సిద్ధాంతమున కంత సమ్మతి కాదు కొందఱి జీవనపు కొనలు మహాదేవి అక్క అభిప్రాయమువలె నున్నవి

ఏమయిన నుండనిండు మహాదేవి అక్క ఎంత ఎత్తులో నిలచి వీరశైవ తత్త్వమును నిర్భయముగా నిరూపించెనో అంత క్రిందకు దిగి కింకరత్వమున తనలోని నిర్మల ప్రేమను బయలుచేసి ఇట్లనుచున్నది

**అక్కమహాదేవి**

పుట్టితి శ్రీగురుహస్తమందు పెరిగితి అసంఖ్యాకుల
కరుణమందు భావమను పాలు, సుజ్ఞానమను నేయి, పర
మార్థమను చక్కెర పెట్టిరి చూడగా ఇట్టి త్రివిధామృత
మును అలయుపట్లు పెట్టి పోషించితిరి నన్ను వివాహము

చేసితిరి సరియైన మగనికిచ్చితిరి ఇచ్చిన ఇంటికి పంప
వలె నంచు అసంఖ్యాతు లందఱు కూడి వచ్చితిరి బస
వన్న మెచ్చునట్లు కాపురము చేసెద చెన్న మల్లికార్జునుని
చేబట్టి మీ తలకు పూవు తెచ్చెదను గాని ముల్లు తేను
అవధరించండి మీ పాదములు మఱల రావంయు శరణు
శరణార్థి ౪౦

**వివేచనము**

పుట్టినిల్లు తన జీవిత మహోత్సవమునకు ఇచ్చిన దంతయు స్మరణకు తెచ్చుకొన్నది కనిన కక్కులతకు(కక్కూర్తి, ప్రీతికి)పాలు వెన్న పెట్టి పెంచినది పెద్దగా చెప్పుకొన్నది వెనుకటి దేదియు సంబంధము లేదు ఇప్పుడవి స్మరణీయములు కావు వెనుకటిది పిండజన్మము ఇప్పటిది శ్రీగురుహస్తమందు జన్మించిన మంత్రపిండము దీని సంబంధము గుఱించియే అక్కయ్య పలుకుచున్నది లింగవంతుల మతదీక్షా సంస్కార ప్రకారముగా గురుహస్తము పుట్టినిల్లు లింగమే మగనాలి యని గుఱుతు మగడే తాను వలచిన జంగముడు ఇప్పుడు ప్రాయమునందున్న తాను భర్త యింటికి పోవుటకై అందఱకు చెప్పుచున్నది లోకమునకు ఆమె సంసారము విభిన్నమైనను తాత్త్వికమునకు సమ్మతము వలచిన మగని ఇంటికి పోవు ఉత్సాహము పుట్టినింటి వారిని విడిచి పోవలె కదా యనిన విషాదము ఆ నిర్మల యువతి భావములో పలుకు తడబడుచు రాగా గొంతు సవరించుకొని, గద్గదమును ప్రక్కకొత్తి గంభీరముగా తన పుట్టినిల్లు అభిమానము చూపి- "అయ్యలారా! విన్నపము మీరు పెంచిన కూతురు సామాన్యురాలు కాదు బసవన్నయ్య ఔననునట్లు కాపురము చేసెదను ఈ పుట్టినిల్లు దాటిన తలవాకిలిపై పూవు బెట్టెద, గడ్డి పోచను పెట్టను సెలవీయండి మగనాలు గాక పుట్టిల్లు బాలగా ఎన్నినాళ్ళుండుట కగును? శరణు, శరణార్థి" అని అందఱకు వందనములు చేసి తిరిగి విర బిర తన త్రోవ బట్టినది ఈ ఘటన లౌకికమైన పరమార్థమైన విషాదమే ఐనను, అనివార్యము

ఒంటిగా త్రోవ బట్టి పోవగా పోవగా, అలవాటు లేనిది కదా! తనకేమో మనసులో "అందఱను వదలి వచ్చితిని ఇక్కడ నా కెవరు దిక్కు?" అనిపించి

విశ్రాంతికై కనబడిన చెట్ల క్రింద కూర్చొనుచు మఱల లేచి శ్రీశైల పర్వత ప్రాంతమునకు వచ్చినపుడు వేసరిల్లి ఇట్లనుచున్నది

అయ్యా! మీ మహాంతుల (శ్రేష్ఠ వ్యక్తులను)
కూడిన సుఖము ఉపమానమునకు రాదయ్యా! అయ్యా!
మీ మహాంతుల కూడి విడచుట కన్న చావు మేలయ్యా!
చెన్న మల్లికార్జునయ్యా! మీ నిజమెఱిగిన మహా మహి
ముల వియోగంబు భరించలేనయ్యా! ౪౧

**వివేచనము :**

"అయ్యా, అయ్యా! తాళలేను ఏదియో ఆ సన్నివేశములో మీ అందఱి మెప్పుకై పలికితిని పలికిన పలుకుల కర్థము ఈ ఒంటరి తనము, పరదేశి తనము ఈ అరణ్యము చెప్పినవి ఔనయ్యా, చెన్నయ్యా! మీ వారితో నుండు నపుడు తెలియలేదు ఇప్పుడది యెంత కష్టమో వారి అనుభవామృతము త్రాగి బ్రతికిన నేను వీడి వచ్చి బ్రతుకలేని దుఃఖాక్రాంతురాలనైతిని "ఇట్లు అనేక భావాలు ఏవో చుట్టుముట్టినవి భావ స్పందనకు చిరుకోపమొంది దిగ్గున లేచి బిర బిర ముందునకు నడచినది చెప్పరాని దూరము ఇక్కడ దూరము దూరమే సమీప మనునది లేదు శిఖరాగ్రముల అఖండమైన శ్రీఖండమను కొండకు వచ్చిన వారు నడచినంత యుండును అక్క పర్వత మెక్కుచున్నది అపార సృష్టి సౌందర్య భయానకముగా జేకొట్టు కీకారణ్యము మహాదేవి ఒకచోట నిలచినది తనలో తాను ఇట్లనుకొనుచున్నది

ఇంద్రనీల పర్వతము నెక్కి, చంద్రకాంత శిలల
నప్పి కొమ్మొదుచు శంకరా, మిమ్ము స్మరించుచు ఎన్న
డుందునో! అంగ భంగ మనోభంగములు నశించి మీతోడ
నెన్నడు కూడి యుందునో, చెన్నమల్లికార్జునయ్యా! ౪౨

**వివేచనము :**

ఆహా! ఈ ప్రదేశమెంత ప్రశాంతమైనది! ప్రచోదనమైనది! ఇంద్రనీల పర్వతము అది ఆధార చక్రమునుండి ఉన్ముఖముగా వ్యాపకమైన ఇడ పింగళ

సుషుమ్న నాడుల కూటములోపల రెండు కన్నుల మధ్య కూడిన గిరి శిఖరము అది నీలవర్ణము అట్టి పోలిక లిక్కడ శ్రీపర్వతము బయలును జూచిన జ్ఞాపక మగును మనస్సు లయమైయుండు చోట శివధ్యానముతో జపము ఓంకారపు కొమ్ము ఊదుకొనుచు నిశ్చింతగా ఎన్నడుందునో శంకరా! నీ కృపయని మహా దేవి అల్లమ దేవుడు చెప్పిన సూచనల ననుసరించుకొనుచు మనసులో ఏమేమో తలపోయుచు, ముందునకు వచ్చునపుడు ఆకలియైనది అక్కడ ఫలముల కేమి తక్కువ? రకరకముల పండ్ల చెట్లు నిబిడముగా నుండగా ఆకలి తీర్చుకొని ముందడుగు వేయుచుండగా మనోద్వేగముతో తనలో అప్పుడే తోచిన భావమును ఇట్లనుకొనుచున్నది

ఒడలు కళవళపాటుకై అడవి జేరితిని చెట్టు చెట్టు
తిరిగి వేడితి నా యంగంబునకని అవి యిచ్చినవి తమ
లింగంబునకని ఏను వేడి భవియైతిని అవి యిచ్చి భక్తు
లైనవి ఇక వేడితినేని చెన్నమల్లికార్జునయ్యా! మీ యాన 93

**వివేచనము**

ఎంతటి వారైననేమి, ఎక్కడకు వెళ్ళిన నేమి? ఎంతటి శిఖరము నెక్కిన నేమి? ఆకలికై క్రిందకు దిగవలసినదే వచ్చినదేమో వెతుకునదేమో పొందుచున్న అనుతాపమేమో కొంచెమైనను ఆకలికి అక్కరలేదు లోకములో ఆకలియే గొప్పది జీవులు పడు తాపత్రయాలలోనే కాలము గడచిపోవును ఏమియు తన నెఱుగని వానికి కేవలము ఇక్కడకు వచ్చి భుజించి వ్యర్థముగా చచ్చినట్టులే అగును

"ఆహా! ఎంత చిన్నతనము! నాకు ఆకలియని ఇక్కడి వృక్షాలనడిగినాను అవి మనిషి దాచుకొనినట్లుదాచుకొనలేదు ఫలము లిచ్చినవి అవి నాకై కాదు తమలింగమునకని ఇచ్చినవి ఏమైతిని నేను?వేడికొని భవినైతిని ఆ చెట్లు భక్తులై నవి ఇక వేడను చెన్నమల్లా! నీ యాన! ఎన్నటికిని వేడను" అని ముందునకు రాగా ఖగమృగాలుండు వనాంతర ప్రదేశమునకు వచ్చినది పక్షులు, భృంగాలు తమలో ఏమేమో మాటలాడుకొనునట్లున్న చిలిపిలి ధ్వని వినినది అప్పుడు అక్కడ సమీపమునకు వచ్చి అడుగుచున్నది

అళిసంకులమా, మావి తరువా, ఓ చంద్రికా కోకి
లమా! మిమ్ము లందఱను నే నొక్కటి వేడెద నా స్వామి
చెన్నమల్లికార్జున దేవుని గాంచిన పిలిచి చూపరే! ౪౪

**వివేచనము :**

"ఓ తుమ్మెదలారా! మీరు ఇక్కడ ఉండువారు మీ ఝుంకారములో ఏమని పలికెదరో, దాని యర్థమేమో నాకు తెలియదు ఓంకారము తెలియ వచ్చును గాని ఝుంకారము తెలియనగుననే? అహా! ఎంత మధుర నినాదము! తియ్యదనమిచ్చి, తినిన వారి హృదయములను మధురముగా జేయుదువు చల్లని నీడ నిచ్చి (ప్రాణంబునకు హాయినిచ్చి) ఎంతయో సంతస మిచ్చు కోమల పల్లవరాజిత చూత తరురాజమా! మామిడి చిగురులు తిని కమ్మగ కూయు ఓ కోకిలమా! ధవళ ప్రకాశముతో చల్లని మనోహర కాంతినీయు చంద్రికా! మిమ్ముల నడిగెద నా మగడు మల్లికార్జును డెక్కడ? చూచియుండిన పిలిచి చూపెదరా? నేను అతని భార్యను క్రొత్తగా కాపురమునకు వచ్చిన దానను" అని మహాదేవి అడిగినదానికి ఉత్తరము రాలేదు కొంతసేపు నిలిచి ఆలించినది ఎక్కడ నుండియో చిలిపి ధ్వనులు వినవచ్చినవి "అహా! అక్కడ ఎవరో! ఏమో చప్పుడు! నా మల్లుని మాటయే అయి ఉండవచ్చును" అని అక్కడకు వచ్చినది పెద్ద చిలుకల గుంపును జూచి అడుగుచున్నది

చిలిపిలి యంచు చదువు చిలుకలారా! మీరు
కానరే? అలమికొని యాడెడు తుమ్మెదలారా! మీరు కానరే?
స్వరమెత్తి పాడెడు కోయిల లారా! మీరా కానరే? సరసి
యం దాడెడి హంసంబు లారా! మీరు కానరే? గిరి గహ్వ
రము నందాడెడి పుళిందులారా! మీరు కానరే? చెన్నమల్లి
కార్జునుం డెందున్నాడని చెప్పరే? ౪౫

**వివేచనము .**

అహా! ఈ పక్షుల కలరవమెంతో వినోదము ! ఈ రొదలో ఏ పక్షి చెప్పినది ఏ పక్షికి తెలియునో! ఆవేశము వచ్చినపుడు మనుష్యులు ఇటులనే శబ్దము చేయుట కద్దు ఇదో చూడండి చిలుకలారా! నేను మహాదేవిని క్రొత్తగా

ఇక్కడకు వచ్చినాను మీరు అత్తింటి వారలు చూపరా? నాంు తోటు ధార్మా? చెన్నని మీరు చూచియే యుందురు కదా? లేక ఆ భృంగములు, కోయిలలు, హంసలు, వేటకాంద్రుు,బోయలు-మీ యందఅలో ఒక్కరైనను చూచి యుందురు మా ఆయన వినోది సరసరసికుడు మనోహరుడు దయాకరుడు ఏ ప్రాణితో నైన ఉండగలడు ఆడుకోగలడు అయినను కొంచెము ముక్కు మీద కోపము కలవాడు చెప్పినట్లు వినిన చాలు తననే ఇచ్చుకొనువాడు అతని నివాస మెక్కడ? అతనితో ఇంకెవ రుందురు? ఇల్లు అనుకూలమే కదా? . పలుకులేని ప్రాణులను అత్యంత మమతతో పలికించినది బసవని అనుభవ మంటపములో శరణులతో చర్చచేసి తెలిసి వచ్చి పలుకని ఈ ప్రాణులను ప్రేమతో పలుకరించినది ప్రకృతికన్యగానై ప్రకృతితో మాటలాడినది

ప్రాణి వర్గమునుండి ప్రతిక్రియ రానందున ఖిన్నయై కూర్చొన్నది తన మగడు కనఒడడు అతనికి చెందినవారు ఎవరైన ఇక్కడ లేరా? అతనే దిక్కని మగనాలియై వచ్చిన ఆడు బిడ్డను ఆదరించని వారున్నచోట ఈయ నిక్కడ ఎందుల కుండును? ఇక్కడ ఎవరును లేరేమో! తన వారందఱు కల్యా ణములోని శరణులేమో! సూచనగా బసవన్న చెప్పియుండె నా ఉద్వేగములో వినక వచ్చితిని, అని అక్క వ్యాకులచిత్తయై ముందునకు నడచినది

చటుక్కున ఒక భావము స్ఫురించినది ఇంతవఱకు పిచ్చి తలకెక్కి చెట్టు చేమలను పక్షిమృగాల నడిగినది ఎంత అసంబద్ధము? మనుష్యులట్లు మాట లాడవని తెలిసియు అక్కడ ఇక్కడ తిరిగి అలసితిని అంతయు తానెయైు సర్వభరితుని వదలి ఇతరులను అడుగుట ఎంత నగుబాటని అక్కయ్య ఇట్లను చున్నది

వనమంతా నీవె వనములోనుండు దేవతరువులన్ని
నీవె తరువులోపల నాడు ఖగమృగములన్ని నీవె చెన్న
మల్లికార్జున, సర్వభరితుడవై నాకేల కానరావు? ౧౭

**వివేచనము .**

అయ్యా! నన్నెంత భ్రమ పెట్టితివి? అంతయు నీవేకదా! ఒకటి నీవు కాదని మఱియొకటి నీవని అనుకొన్నాను కదా? నా యజ్ఞానమున కంతులేదు వనము ఖగమృగాలు నీవై నా కెందులకు కానరావు?

మఱి అక్క మరులుగొన్నది సర్వము నీవు అనినది చూచినది నాకు కనబడవు అని ఆక్షేపమెత్తినది అనిన, కనబడినది తనది కాదనినట్లయినది ఔను సర్వమన్నను దానిలో కోరునది యొకటే తాను వలచిన చెన్నుని ఆ కనబడుదానిలో తన చెన్నుని కనుగొనుట కగుటలేదా? లేదు ఆమె రూపు కట్టుకొన్నది అంతరంగములో వేరే కనబడువానిలో అదిలేదు సమాధానము కాలేదు వేదాంతము చెప్పు మాటలు పెద్దవే అవి ఆచరణకు రావలెను అక్క ముందునకు పోవుచు ఒకచోట నలుదిక్కులు చూచి నిలిచి ఇట్లనుచున్నది

బయలు లింగంబందునా? శోధించి నడచిన పోయి
యుండె గట్టు లింగంబందునా? మెట్టి నిలిచిన పోయి
యుండె చెట్టుచేమలు లింగంబందునా? తఱచిన పోయి
యుండె లింగజంగమ పాదమే గతియంచు నమ్మిన
సంగన బసవన్న మాట వినక చెడితినయ్యా! చెన్న మల్లి
కార్జునా! ౪౨

**వివేచనము**

అంతయు బయలు బయలు నమ్మిన వారికి బయలులో బయలు నిర్బయలు (నిరాకారత) గాక మఱియేమున్నది? బయలులో ఉన్నది యేదియో చూచుకొని అక్కడ ఉన్నదని వచ్చువారలకు అక్కడకు వచ్చిన తదుపరి ఏమి ఉండును? ఇపుడు భ్రమించి ఆయాసపడి నా సర్వస్వము అక్కడ ఉన్నదని వచ్చిన ఉన్నది ఉన్నటులే యుండును పర్వతము దూరము నుండి చూచిన చాల పెద్దదిగా నుండును వచ్చి పైకెక్కిన ఏమియులేదు. ఇటులే కనబడున దంతయు లింగమనుకొనిన ఆ కనబడునది నశించిన లింగ మెక్కడ ఉండును? అక్కడ ఉండునదే ఇక్కడను ఉండును గురులింగ జంగమము వదలి పోవకు మనినాడు బసవన్న నేను వినక, చెన్నుని నమ్మి చెడితిని అని నిరాశపొంది ముందునకు పోవుచు తన ప్రియుని ఇట్లు వేడుకొనుచున్నది

పొందవలె ననిన వేగి కనిపించు బయటపెట్టవల
దయ్యా! మీ ఎడను చెల్లు తొత్తును నేను బయట పడి
వేయకయ్యా, చెన్నమల్లికార్జునయ్యా! మిమ్ము నమ్మి
వెంట వచ్చితిని చేరదీయుమయ్యా, వేగమె నను ౪౭

**వివేచనము .**

ప్రాణనాయకా! నిన్ను నమ్మి వలచి సర్వస్వము నివేయని వచ్చితిని ఎంత వేడినను, వేదన పొందినను, నీ దర్శనము కాలేదు స్వామీ! మీ సేవకు దాసినై వచ్చితిని ఒక్కపలుకు పలికి చేరదీసికొనుము నా నాథా! నే ననాథను వలచి వచ్చినదానను త్రోయకుము నీ పాద సన్నిధి సేవ కెడమిచ్చి రక్షించు స్వామీ! అని కంటినీరుతో ముందుముందునకు నడచి ఒక రమ్య ప్రదేశము చేరి చూచి ఇట్లనుచున్నది

వనమంతయు కల్పతరువులు చెట్టంతయు సంజీ
వని శిల లన్నియు పరుసములు (పరుసవేదులు) నేల
యంతయు అవిముక్తక్షేత్రము జలమంతయు నిర్ఝరా
మృతము మృగమంతయు పరుష (క్రూర) మృగము
తొక్కెడు ఇసుకంతయు చింతామణి చెన్నమల్లికార్జునుడు
మెచ్చిన గిరిని చుట్టి చూచుచు వచ్చి కదళీవనంబు కంటిని
నేను ౪౮

**వివేచనము :**

ఆహా! ఇదియే నా నాథుని నివాసము ఇదియే నా కదళీ కళావాసము ఇదియే నా జన్మసాఫల్యము ఎల్లెడల ఇక్కడున్న వన్నియు కల్పతరువులు సంజీవనులు పరుసవేదులు నిర్ఝరామృతము పరుషమృగములు చింతామణులు ఇది అవిముక్త క్షేత్రము అని వర్ణించి, తాను చూడవలసిన కదళీవనము గాంచి అక్క మహాదేవి ఉద్వేగియై నిబిడీకృతమై దట్టముగా పెరిగి వ్యాపించిన అరటితోటను జూచి లింగహస్త ముకుళితకరాంబుజయై చేయెత్తి ఎలుగెత్తి 'చెన్నా! చెన్నయ్యా! చెన్నమల్లా!' యని పిలువగా ఆ కదళీవనమంతయు కంపించినది దివ్యప్రభలు ఆవరించినవి చెట్ల మధ్యనున్న మబ్బులు కరగినవి అపుడు అరటి స్తంభములు జ్యోతి స్తంభములుగా మెఱసినవి దానిలో ఎక్కడ నుండియో విశేష విశాల

వికాస కళలు వెదజల్లుచు అక్క కోరిన జంగముడు ఆవిర్భవించినాడు చూచి మహానందరసావేగముతో ఇట్లనుచున్నది

మెఱయు చిరు జడలు మణిమకుటమొప్పు దంత
కాంతి నగుమొగము కన్నుల కాంతిచే పదునాల్గు భువ
నంబులు వెలుగు దివ్య స్వరూపుని గనిన నా కన్నుల
కఱవు తీరెనిందు మగలకు మగడైనవారిని మగువలుగా
నేలు శూరుని గంటి నేను జగదాదిశక్తియందు కూడి
మాటాడు పరమగురువు చెన్నమల్లికార్జునుని మేర జూచి
బ్రతికితిని ౨౦

**వివేచనము :**

మహాదేవి ఆ జంగముని పరశివ స్వరూపమును మనోహరముగా వర్ణించి ఈ దివ్యమయ వాతావరణమందు మాటలాడు పరమగురువు చెన్నమల్లికార్జును డని ఆ మహాత్మునకు సాష్టాంగ వందన మాచరింపగా ఆ జంగమోత్తముడు "భవము చెడి వచ్చితివే తల్లీ! ఇక మీద నేను నీవు వేరుకా'దని ఎత్తి తలనిమిరి సచ్చిదానందముతోడనే ఇద్దఱు అదృశ్యులైరి ఒక్కటియు లేదు బయలులో నిర్బయలు!

— ౦ —

ఇది కృపామూర్తులైన శ్రీ మృత్యుంజయప్పగారిని, స్వప్నబోధామూర్తులైన శ్రీ ఎర్రి తాతయ్య గారిని స్మరించి, సకల శివశరణులను వందించి శూన్య సంపాదనలోని "మహాదేవి అక్కగారి సంపాదనము"నకు సంగ్రహముగా చెప్పిన వ్యాఖ్యానము సంపూర్ణము

— ౦ —

శ్రీ గురు బసవలింగాయ నమః

# శూన్య సంపాదనము

## ప్రభువు దేశాంతరము పోయివచ్చిన సంపాదనము

౧౬

కం॥ ఎల్లగణంబుల పెద్దాని
అల్లముడల దేశపావనార్థము జనియున్
సల్లీలగ మోదంబున
నల్లదె కల్యాణపురము నరుదెంచెనుగా!

మహాదేవి అక్కగారు శ్రీగిరి కదళీవన మందు బయలైనదను విషయము కల్యాణ పట్టణమునకు తెలిసినది శరణ శరణీయులు సంతసించి ఆమె ధన్యతను కొనియాడినారు నిత్యనియమానుసారముగా అనుభవ మంటపములో చేరిన బసవాది ప్రమథుల జూచి అల్లమప్రభుడు ఇట్లనుచున్నాడు

**అల్లమప్రభు** •

ఇచ్చకు వచ్చిన సుఖపరిణామము చేకూరినంత
ఇక అనుభావమనునది లేదు అటులుండినది నీ వాక్య
సరళి శశిధరుడు చెప్పినపని చేయవచ్చినంత చెప్పినటుల
చేయవలయును అది తన లీల తాను చేరుకాలమునకు
చేరనిండు ఆ దినంబునకు వచ్చి చెప్పు నిర్ణయము గుహే
శ్వరలింగు నాజ్ఞ వచ్చునంతవఱకు శివశరణులందఱు
సంగన బసవన్న సహితము నిత్యులై యుండరయ్యా! ౧

**వివేచనము :**

అయ్యా, మహాశరణులారా! కోరిన కోరికలు తెలిసి సుఖాను భవము కరగతమైన తరువాత ఇక అనుభవ సభలు చాలు మాటంయందే ఎక్కువ కాలము గడపరాదు శివుని ఆదేశ ప్రకారముగా మనకు పంచియిచ్చిన పనిని మనము చేయుచుండవలెను అతడు చాలునన్నప్పుడు చేయుపనికి విరామము మేమిపుడు దేశాంతరము పోయి కొన్నినాళ్ళకు వచ్చెదము అంతలోపల వారి వారి సాధనములను వారు చేసుకొని సుఖముగా నుండుడని చెప్పగా, ప్రభువి యోగమునకు బసవాదులు ఖిన్నులైనారు అల్లముడు సమాధానము చెప్పి వచ్చు చుండ తనతో కల్యాణపురమునకు వచ్చి అంతవఱకు శరణానుభవమందున్న సిద్ధరాముడు "స్వామి! తమరు పోవుచున్నారు ఇక్కడకు వచ్చునపుడు మీతో డనే వచ్చినాను ఇపుడు నాకేమి చెప్పెదరు?" అని ఇట్లడగుచున్నాడు

**సిద్ధ రాముడు :**

స్వామి! స్వామి! మీరు చెప్పరయ్యా! నాకు గతి యేది? నాకు మతి యేది? మీ యందు సమరసమెట్లు, చెప్ప వయ్యా? మూడు తావుల ఎత్తయిన మేడ (మూడంతస్థుల మేడ) (కరుమాడ) మేలు వాకిలి (సింహ ద్వారము) ఇంటియందునా నేను ఉండుట? చౌక మధ్యమున అష్ట దళపు కొన మోహాలపు మధ్య మందిర మందుండునా నేను? కాముని కట్టు పంజరము విడిచి నిలిచి యుందునా, విడువక యుందునా? చెప్పు చెప్పుమయ్యా, నిర్ణయము ఓ కపిల సిద్ధ మల్లినాథయ్యా! ౨

**వివేచనము :**

నిలు నిలువుమయ్యా! నాకెక్కడ తావు? స్వామి! చెప్పండి కృప సేయండి మీ యందు-తద్గతుడనై యుండు విధానమును సెలవీయండి-మూడంత స్థుల ఈ దేహములో మేలు వాకిలి గల మేలంతస్తు (సహస్రార దళ చక్రము) నందుండుదునా? లేక, మధ్యమందున్న చౌకము వాకిలి (అష్టదళ చక్రము) అంతస్తులో నుండుదునా? లేక స్వామి! క్రింది భాగము-అది కామ నివాసము-

(ఆధార చక్రము) దానిని పట్టుకొని యుండుదునా? ఏది విహిత మార్గము? మిమ్ముల సదా కూడియుండు విధానమేది? తెలియజెప్పండి

సిద్ధరామ దేవుడు సహజ యోగీంద్రుడు ఆయనకు తెలియని రహస్య ములు దేహమునందు లేవు అతనడిగినది-బయట నున్న ఏ నిసర్గ పవిత్ర స్థల ములను కావు వానినుండి పొందు శక్తులను కావు కదళి కాదు కూడల సంగమము కాదు ఊళవి-మొదలగు స్థలాలు కావు చివరకు తాను నిర్మించిన సొన్నలా క్షేత్రము కాదు అన్నియును తన తను మందిరములోని మూడంతస్తు లలో ఇష్ట ప్రాణ భావ లింగములలో పెట్టుకొన్నాడు శరణులు అల్లముడు పోవుచుండగా వియోగ దుఃఖమునకు లోనైనాడు సిద్ధుడు కాలేదు ఉండు చోటు తానే, తన కాయమే బ్రహ్మాండమై యడిగినాడు. అప్పుడు అల్లముడు సిద్ధ రాముని ఉన్నత శివాద్వైతైశ్వర్యమునకు మెచ్చి ఇట్లనుచున్నాడు.

**అల్లమ ప్రభు**

గురుతత్త్వమందు బుట్టి, శివతత్త్వమందు పెరిగి,
పరతత్త్వమందు మగ్నుడయిన శరణునకు కాయము
నశించి నిర్బయలైననేమి? భారము లేని నిర్బయలైన
నేమి? కాయసమాధి కరణ సమాధి భావ సమాధి యైన
మీదట గుహేశ్వర లింగునందు బయలు భ్రాంతి వదలి
సుజ్ఞాన సమాధియందున్నచో అది నిజ సమాధి వినుమా,
సిద్ధరామయ్యా! 3

**వివేచనము** •

"సిద్ధరామయ్యా! ఇక్కడ అక్కడ అను విభేదా లెందులకు? ఎందుట ఎందులకు? మూలము గురుతత్త్వము ఆ గురు కరాబ్జమునందు పుట్టిన మీదట, అతని అనుగ్రహముచే శివతత్త్వములో పెరిగిన మీదట పరతత్త్వ మగ్నుడగు శరణునకు కాయ, నిష్కాయముల భేదముండదు కాయ, కరణ, భావ సమా ధులు కరగతములైనపుడు ఇష్ట ప్రాణ భావలింగములు సమైక్యత పొందినపుడు ఈ దేహమంతయు ప్రసాదకాయముగా నుండును క్రింద, నడుమ, పైన నీవు చెప్పిన యోగ మందిరాంతర్గతములగు అంతస్తులు, వాని నాడులు, చక్రాలు,

పరికరాలు అన్నియు గురు లింగ జంగమార్పితములై సమ్యక్ జ్ఞానముగా నిలచి యుండును అదియే శివయోగము, సహజము, పూర్ణమును నీవెక్కడ ఉండిన అదియే నిజ సమాధి" అని సిద్ధరామునకు వివరించిన అల్లముడు తన యాత్రకు బయలుదేరెను సిద్ధరాముడు సంతుష్టుడై సొన్నలాపురమునకు వెడలి పోయెను

ఇక్కడ అల్లమదేవుడు తన ఇచ్ఛామాత్రమున దేశదేశములలోనున్న ప్రకృతి రమ్యప్రదేశాలలో తిరుగుచు తనకు తోడునీడయైన గుహేశ్వర లింగునితో ఇట్లనుచు ముందునకు సాగుచున్నాడు

**అల్లమ ప్రభు :**

గిరిగుహా కందరంబుల, భూమి పొలముల ముట్టక
ఉందువు దేవా! ఎక్కడ జూచిన అక్కడనే నీవు దేవా!
మానసంబున కగమ్యమగోచరమై అక్కడ అన్నిచోటుల
నీవే ఉందువయ్యా, గుహేశ్వరా! మీ విస్తారమును విపు
లముగా కంటిని నేను ౪

**వివేచనము :**

గుహేశుడే విస్తారముగా సంచరించువాడు తాను ఆయన పోవు జాడలో పోవుచున్నాడు తన లింగయ్య ఎక్కడ నడచినను అక్కడ సోంకు (అంటు-యైన) లేకుండ యుండును అక్కడి కక్కడ పవిత్రత వ్యాపించును ఇక్కడ ఉన్నాడు - అక్కడలేడు అనుటకాదు ఎక్కడ జూచిన అక్కడ అంతయూ తానై యుండును చెప్పుటకు, తెలియుటకు అగమ్యము అగోచరముగా నుండు ననుచు అల్లముడు గుహేశుని యాత్రనుగను యాత్రికుడై లీలా వినోద భరితుడై యుండెను

## సిద్ధవీరన్న ఒడెయుల గద్యము

ఇట్లు సంచరించుచు వచ్చుచుండ ప్రభుదేవులు పొన్నాంబల నాథుని నిరీక్షించి, అక్కడనున్న సద్భక్తియుక్తులను, సదాచార సన్మార్గులను, శివ లింగార్చన పరాయణులను, శివధ్యానైకనిష్ఠులను, శివప్రసాద పాదోదక

సేవ్యులను, శివలింగాంగ సంబంధులను, శివానుభావ సంపన్నులను, శివాద్వైత వేద్యులను, శివజ్ఞానోదయ ప్రసన్నులను జూచి వారితో సద్గోష్ఠి సంబంధమున నుండి సర్వులను జీవన్ముక్తుల గావించి పూర్వ సముద్రతీరము వెంట రామేశ్వరమునకు వచ్చి ఆ రామనాథుని యందు సుఖసంకథా ప్రసంగము జేసి, ఆ రామనాథు నుండి పూజ గైకొని, అక్కడనుండి దక్షిణ సముద్రమును నిరీక్షించి, పశ్చిమాంబుధియందు నిలచి, మహాబలేశ్వరుని స్థానంబు జొచ్చి, స్వలీలుడై తిరిగి, ఉత్తరాభిముఖుడై సౌరాష్ట్రి సోమనాథుని జూచి, తన్నుకనిన, అడిగిన, పేరుగొని పలికి వందించిన సర్వజనుల భవపాశ బంధముల త్రెంచి, అక్కడే నుండి పోయి నానా పుణ్యక్షేత్రంబుల నిరీక్షించి, ఆ క్షేత్రములకు అగణ్య పుణ్య వరముల నిచ్చి, అష్ట షష్టి తీర్థములను సమస్తనికరమును మెట్టిజూచి, ఆ మహా తీర్థముల నుండి పూజగొని, తన పరమానందరసమును నిర్మలగంగాంబు కణములను ఆ సకల తీర్థములకు కరుణతో నిచ్చి, నిత్యనిర్మల పదవి నిచ్చి, అక్కడ నానాదేశంబులు తిరిగి వచ్చుచు, ఆ దేశంబులను పావనము చేయుచు, శ్రీకేదారమునకు వచ్చి, అత్యుత్కట హిమమును గెలిచి, సవాలక్ష పర్వతాలను తిరిగి, తద్గిరి గుహాంతరంబుల నచ్చటచ్చట విశ్రమించుచు, ఒక ఘనమైన గుహను కనుగొని, ఆ నివాసంబున స్వలీలతో పద్మాసనంబున గూర్చొని, ఏకాగ్ర చిత్తమున పవన జ్ఞాన ధ్యాన సమ్మత సమరస భావంబున, నిర్భావ పదవియందు నిలచి, నిశ్శూన్యమును తిలకించి, నిజసమాధి యందు మూర్తిగొనియుండిరి అదెట్లనిన-

.. . .. . . ... .
... . . .. . .... .. ..

పరశివ యోగంబునందు నిలచి నిరవయవుడయి అనంత కోటి బ్రహ్మాండములన్నియు తన మహాజ్ఞాన ప్రకాశంబున ఆలింగించి ప్రజ్వల తేజంబున విరాజిల్లు ప్రభుదేవుడు తమ లీలావసాన కాలమును వివేకమున తెలిసి, లేచి కల్యాణ పట్టణాభిముఖుడై వచ్చుచుండెను

.. ... . ....
........... . .. . .... .

ఇక్కడ బసవరాజ దేవుడు ప్రభుదేవుడు రావలెనంచు శూన్య సింహాసనమును రచించి నిరీక్షించుచుండెను

హడపదప్పన్నగారు బసవన్న తన షట్స్థల భక్తిభావానుభావాల సాధనా రీతులను కట్టుకొని గురుపాదార్పణమునకు తగురీతి భక్తి కానుకగా సమర్పించు సాంకేతిక శూన్య సింహాసనమును రచించిన రీతిని ఇట్లు వివరించుచున్నాడు

**అప్పన్న .**

లింగపు ప్రకృతి లింగమందు నశించి, మనసు వికృతి ఎఱుక యందు నశించి, జీవభ్రాంతి నిశ్చింత పదమందు నశించి, నిశ్శూన్య నిరామయమైన నివాసమునకు సదాచారమను పునాది రాయి బెట్టి, సర్వాచార సంపత్తులను పూవురాయి మూసి, అంతఃకరణ చతుష్టయమను నాలుగు స్తంభంబులు నిలిపి, జ్ఞాతృత్వమను గోడపై జ్ఞానమను శిఖరి గట్టి, జ్ఞేయమను బంగారు కలశము సింగరించి, బ్రహ్మరంధ్రపు ఊర్ధ్వ ద్వారమను నిజ ద్వారంబు జేసి, నిర్భయలు నందు స్థాపించి, బసవ ప్రియ కూడల చెన్న సంగయ్యని శరణుడు ప్రభు దేవుని రాకకై శూన్య సింహాసనము రచించి వచ్చు త్రోవను జూచుచున్నాడు నా పరమ గురువు బసవేశుడు ౨

**వివేచనము :**

బసవన్న రాబోవు తన గురువు అల్లమ ప్రభుదేవునకు కానుకగా అర్పించుకొనుటకై రచించుకొన్నదే శూన్య సింహాసనము దానిని గుఱించి అతని అంతరంగిక మిత్రుడు, భృత్యుడైన హడప దప్పన్న తన యజమాని నిర్మాణమును విస్తారముగా చెప్పినాడు అదంతయు షట్స్థల తత్త్వమునకు చెందినది ముఖ్యముగా సద్భక్తికి సర్వార్పణము - గురు నిరూపణమును అనుష్ఠానమున సాధించి సిద్ధి చేసికొని, ఆ సిద్ధిని అతనికే అర్పించి కృతార్థత చెందుట.

బసవన్న అర్పించునది ఏ పదార్థము కాని శూన్యము దానికి ఇంకొక పేరు సింహాసన మనినాడు ఇది సాహిత్యములో విరోధాభాసమని ప్రయోగించ రాని మాట యగును శూన్య సింహాసన మనునది ప్రపంచ చరిత్రలో లేదు ధార్మిక రంగములోనున్న పెద్దవారు జగద్గురువు లనెడి వారుగాని, రాజ్యము లేలు మహాచక్రవర్తులు గాని తమ అధికార పీఠమును శూన్య సింహాసనమన లేదు

శూన్యము కనబడనిది సింహాసనము కనబడునది ఇట్టి విపరీతమైన పీఠముపై కూర్చొనుట ఎట్లు? అను ప్రశ్నకు సమాధానమేది? ఇక్కడ బసవన్న గుర్వర్పణమునకు శూన్య సింహాసనమును రచించెనని అప్పన్న చెప్పిన వచనార్థమేమో దానిని కనుగొనుట యుక్తము

ప్రకృతి నుండి పుట్టిన అంగములోని వికృతులు లింగమందు లయమై, మనసులో నున్న చంచల స్వభావములు జ్ఞానంబునందు నశించి, నేను జీవము నను భ్రాంతి నిశ్చింతలో తొలగించినప్పుడు తన యొక్క మనోభావములను భ్రాంతులు ఇష్ట ప్రాణ భావలింగములుగా పరిణమించిన పరిణామమే నిశ్శూన్యని రామయము దానికి సదాచారమనునది చంద్రకాంతశిల సద్వాచారమనెడు పువ్వు శిలను కప్పుగా మూసి, మన చిత్త బుద్ధి అహంకారములను స్తంభములు నాటి, జ్ఞాతృత్వమను గోడకట్టి, జ్ఞానమను గోపురమును గట్టి, జ్ఞేయమను కలశమును సింగారముచేసి, దానిపైన బ్రహ్మరంధ్రమను ఊర్ధ్వద్వారమును నిజద్వారముగా జేసి నిర్బయలులో స్థాపించినాడు ఇది అప్పన్న చెప్పిన దానికి అర్థమని తలచినను సామాన్యుని తెలివికి జటిలముగా నున్నది

వ్యోమకాయుడైన అల్లమునకు ఇచ్చుట కిదియే తగినది తత్త్వ సిద్ధాంత బోధలు సేయు గురువులకు భౌతిక పదార్థముల నిచ్చి తృప్తిపఱచు గురుశిష్యుల విషయము దీనికి సంబంధించినది కాదు విత్తిన విత్తనమునే పండించు రైతు పద్ధతి బసవన్నది

తన గురువు ఏనాడు, ఏమయి, ఎక్కడనుండి రాగలడో తెలియు రహస్యము ఆ శూన్య సింహాసనము నందుండి యుండును ఎక్కడ ఉంచినను

ఎవరికిని కనపడక యుండునేమో! దానిని కనువారికి శూన్యమే కానుపించును ఆ షట్స్థల భక్తి పీఠమును కనుగొని ఎవరు కూర్చుందురో ఆయనయే తన గురువని గుర్తించుటకు సంకేతముగా పెట్టుకొన్నదే శూన్య సింహాసనమనియు, అంతరంగిక సాధనములన్నియు అదృశ్యము లనియు, వానిని బహిరంగముగా చూపుటకు శూన్య సింహాసనమని పేరు పెట్టి యుండవచ్చును ఈ పేరు చరిత్రలో వినూతనమైనది, విలక్షణమైనది

ఇట్లు పీఠమును సిద్ధము చేసుకొని, కొన్ని శుభ సూచనలను తెలిసికొని, అల్లముని ఆహ్వానించుటకు కల్యాణ కటకమును అలంకరించినారు ఆతురతతో గురుని రాకకై ఒక్కొక్క రోజు గడపుట బసవన్నకు కష్టము కాగా ఎదురు చూచుచున్నాడు ఒక రోజు శరణులందరిలో ఏదియో విషయము చర్చకు రాగా బసవన్నకు ఆ విషయము పట్టక తన భవనములో ఉదాసీనముగా దైన్యముగా ఆతురము పట్టలేక అందఱితో నిట్లనుచున్నాడు

**బసవన్న .**

నమ్మి పంద్రెండు వత్సరములు గడిచె ఏమి
జేసిన నేమయ్యా, నాయందు దిటము లేనంతవఱకు? ఏమి
తలచిన నేమయ్యా, నాయందు దిటము లేనంతవఱకు? నా
పుణ్యఫలము కూడల సంగమదేవా! వ్రత పూజాఫలము
నీటిలో కొట్టుకొని పోయినట్లయ్యె ఓ

**వివేచనము ·**

శరణపతి భావంబున లింగముఖుడగు జంగమ అల్లముని పతిగా భావించి, అక్కడనున్న శరణులు తోటి చెలులకు బసవన్న తన విరహ సంతాపమును చెప్పుకొనుచున్నాడు చూచితిరా? ఆనాడు పోయి వచ్చెదనని ఒకటి కాదు రెండు కాదు, పంద్రెండు సంవత్సరములు గడచినను అతడింతవఱకు రాలేదు కదా! ఇంత దీర్ఘకాలము సైరించి యుండుట నాకు సాధ్యము కాదు సంతప్త హృదయము తల్లడిల్లుచున్నది హతభాగ్యుడను నేను నా దోషమే అతడు రాకుండుటకు కారణమై యుండవచ్చును ఎంతయో సంబరమున చేయుటకగు పూజా

ద్రవ్యము లకస్మాత్తుగా ఏరు వచ్చి కొట్టుకొనిపోయినట్లయినది చెన్నబసవా! మడివాళా! మీ కేమని అనిపించుచున్నది? చెప్పరా? అని కన్నీళ్ల తో బసవన్న ఇట్లనుచున్నాడు

సాగరంబునకు చంద్రాగమనమే జీవాళ (జీవ
కళ) మయ్యా! ఎండిన కాసార కమలంబునకు ఉదకంబె
జీవాళమయ్యా! చకోరంబునకు చందురుని రాకయే జీవాళ
మయ్యా! కూడల సంగమదేవా! నాకు మీ శరణులు
వచ్చుటయే జీవాళమయ్యా! ౭

**వివేచనము :**

నాకిది కష్టము చంద్రాగమనము సముద్రమునకు పరమ హర్షదాయకము నీరులేక ఎండిన కాసారమున నున్న కమలమునకు నీరు పారి వచ్చినపుడు ఆ కమలమునకగు సంతసమును ఊహింపగలరా? అటులనే చకోర పక్షికి చంద్రుని రాక ఇవి ఒకదానికొకటి దూరముగా నుండజాలవయ్యా! ఉండిన బ్రతుకవు అటులనే నేను మీ శరణుడు రాకయున్న బ్రతుకజాలను అని ఆవేదనతో బసవరాజు ఏమియు తెలియని ముగ్ధురాలివలె మఱల ఇట్లనుచున్నాడు

ఎడమ చేతియందు పాలగిన్నె కుడిచేతియందు
శిక్షించుదండము ఎప్పుడు వచ్చునో మాయయ్య? కొట్టి
పాలు త్రాగించు తండ్రి'
"దండక్షీరద్వయం హస్తే జంగమో భక్తమందిరం
అతిభక్త్యా లింగతుష్టి రపహాసాచ్చ దండనం"
ఇట్లున్నది కాన కూడల సంగమదేవా! భక్తిపథము
ఎప్పుడు వచ్చునో చూపుము తండ్రీ! (౮)

**వివేచనము .**

నా తల్లితండ్రి సర్వస్వమైనవాడు ఎప్పుడు వచ్చునో! తండ్రికి దూరమైన కొడుకు బుద్ధినేర్చుటెట్లు? నన్ను మఱచినాడేమో! లేదు గదా? కొడుకు చిన్నతన

మున తల్లిదండ్రులను మఱువవచ్చునేమో గాని వారెట్లు మఱతురు? ఇంతవఱకును రాలేదుగదా! ఎప్పుడు వచ్చునో ఏమో? ఎడమ చేతియందు పాలగిన్నె, కుడిచేత త్తము బెత్తమెందుకనిన పిల్లవాడు నయముగా పాలు త్రాగడు కనుక బెత్తబె మెత్తినపుడు భయపడి పాలు త్రాగును అందులకు నా తండ్రి రావలెను వచ్చి ఇది ఈ విధముగానని భక్తికి త్రోవచూపవలెను

బసవన్న మొదలు సతిభావముతో చెప్పుకొని, ఇపుడు కేవలము శిశు భావమునకు వచ్చి, ఆతురతతో తన శరణ సతుల ముందర తన పెద్దరికమును మఱచి సామాన్యునివలె నుడివినప్పుడు ఉద్వేగోపశమనమునకై చెన్న బసవన్న ఇట్లనుచున్నాడు

**చెన్న బసవన్న .**

మనమున్నట్లు మంగళమన్నది తప్పదు సుమా,
బసవన్న! వెదకువాని కోరిక సాధ్యంబగుటతప్పదు సుమా!
బసవన్న! మీ మనమాతురముతీర కూడల చెన్న సంగమ
దేవుని శరణప్రభు దేవుడు వచ్చుట తప్పదు వినుమా,
సంగన బసవన్నా! ౬

**వివేచనము .**

ఎందుకింత కాతరము బసవయ్యా! ఆ ప్రభువు నిన్ను విడచియుండునే? నీవెటులనో, ఆయనయు అటులనే నీ మనసు మీరి యుండునా? మనసున్నట్లు మంగళముండును నీవు కోరిన కోరికకు కొరత కలదే? ఆతురము పడకుము ప్రభువు నిన్ను వెదకికొనుచు వచ్చుట తప్పదు, అని చెన్నబసవన్న సమాధానము చెప్పగా, మడివాళ మాచిదేవుడు సంతసుడైన బసవన్న కిట్లు అనునయము పలుకుచున్నాడు

**మడివాళయ్య**

చేయు భక్తునకు, వలచు దేవునకు భేదమున్నదే?
అయ్యా! కాయమందు కాయమై యుండు ప్రాణమందు
ప్రాణమై యుండు వెదకవలెననిన తానెయై యుండు

వెదకి కోరిన కరుణచే నడచి వచ్చును కలిదేవర దేవుని
రాక నిపుడే చూపెదను కనుమా, సంగన బసవన్నా! ౧౦

**వివేచనము**

బసవదేవా: తమకు అనుమానమా? తమ భక్తికి లోటు కలదా? నమ్మిన భక్తునకు దేవునకు భేదమెక్కడిదయ్యా? కాయమునకు కాయమై, ప్రాణమునకు ప్రాణమై యుండునుగదా! వేరు వేరని వెదుకబోవ వెదుకు నాతడే తానె యగును కరుణతో పిలచిన రాగలడు మీకు ఇప్పుడే చూపెదను ఎందులకంత వేదన? అని బసవన్నగారి వియోగావస్థను జూచి ధృతియుతముగా మడివాళయ్య పలికి నపుడు ఉత్సాహముతో బసవన్న ఇట్లనుచున్నాడు

**బసవన్న**

ఆకలిగొని ఏడ్చు శిశువునకు తల్లి చన్నిచ్చిన,
ఆ శిశువు జీవింపకుండునే? చెప్పవయ్యా! ప్రాణ వల్లభుని
వియోగముచేత ప్రాణవియోగమైనట్లుండు కాంతకు ఆప్రాణ
వల్లభుడు వచ్చిన విరహశాంతి కాకయుండునె? చెప్ప
వయ్యా! కూడల సంగమదేవుని సాక్షిగా ప్రభువు నా
ఇంటికి వచ్చిన నా కోరికతీరగా, చెన్నబసవని కారుణ్యపు
కందుడనై (బాలుడనై) మిగులుదును మడివాళయ్యా! ౧౧

**వివేచనము .**

మడివాళదేవా! నీకున్న ధృతి నాకు లేదయ్యా! నీవు చెప్పినటులైన ఆకలి గొన్న శిశువునకు తల్లిపాలు దొరికినట్లు అగలికచే (వియోగముచే) వేదనచెందు వియోగినికి ప్రాణనాయకుడు లభించినట్లు, అల్లముడు ఇంటికి వచ్చిన నా భాగ్య మేమని చెప్పుదును? మన చెన్నని కారుణ్యపు బాలుడనై బ్రతికెదనని బసవన్న ఉద్వేగముతో ఏమేమియో చెప్పుచున్నప్పుడు ఏదో ఎవరో చెప్పుకొనుచున్న మూఢ నమ్మకములు శకునములు తనకు కాగా ఇట్లనుచున్నాడు

అటుచేయి దురదబెట్టె నాకు కన్నులదరెనయ్యా:
నా ఇంటికి ప్రమథులు వచ్చెద రెందులకు? వచ్చెద

**వివేచనము :**

చెన్నబసవా! నీకు గా నీవే అంత చిన్నవాడ వగుటకు కాదయ్యా! అనుకొన్నను కాదు పుణ్యమున్న శత్రువు మిత్రుడు కాగలడు మన్ను బంగారము కాగలదు పాము ఒడ్డాణము కాగలదు అయ్యా! భక్తియున్న చోట పుణ్యము ఇల్లుగట్టుకొని యుండుటయే గాక అన్ని అపాయముల నుండి రక్షించును నీయందు సద్భక్తియు పుణ్యము ఆశ్రయించి యుండగా నేను శిక్షింపవలెనా? ఎంతమాట! నీ భక్తిపుణ్యముల ప్రభావమువలన నేను బ్రతికియున్నాను అని బసవన్న చెప్పుచుండగా శరణులు చూచితిమన్న ప్రభుదేవుని లీలావిలాసములు తాము కనినరీతి ఎంతగనో వర్ణించుచుండగా 'ఇదె వచ్చె-వచ్చుచున్నాడు' అని చాల సంతోషభరితుడై సొడ్డల బాచరస స్పష్టముగా ఇట్లనుచున్నాడు

**సొడ్డల బాచరస**

బాలుడగు నొకతూరి లోలుడగు నొక తూరి
వృద్ధుడగు నొకతూరి మత్తుడగు నొక తూరి మెరసి
గాంచు నొక్కసారి కాంచి కాన కొకసారి విశ్వంబు
జూచి వెరగొందుచుండ ఉన్నచోట నుండి వేరొక చోట
గాంచుచుండు సంప్రదాయంపు వారు బిర బిర వచ్చి
చెప్పుచుండ వేగమెరాగా సమీపమయ్యె బసవుని పెద్ద
యిల్లు తలయెత్తి చూచెను సందు మూలలు తప్ప చిత్ర
తరమగు నంది మంటపంబుల మేలు మిద్దెల భద్రంబులు
జూచి తల ఊపి కలిదేవుని దేవ! బసవని మహా మంది
రము ప్రదక్షిణము చేసి వచ్చి ద్వారభాగంబు ముందఱ
నిలిచియుండె ౧౬

**వివేచనము**

సొడ్డల బాచిదేవుడు బసవ భవనము ముందునకు అల్లముడు వచ్చెనని చెప్పెను అందఱు కనువిందుగా ఆ మహామహుని అపూర్వ లీలావినోదములు చూచి సంతసించిరి లీలలకు అర్థము లేమున్నవి? అర్థాతీతమగు ఆనందమే

ప్రభువు బసవ మందిరము చుట్టివచ్చి ముందు భాగములోని ద్వారమున ఏమి చూచుచు నిలచినాడో ఎవరి కెఱుక?

— ० —

ఇది కృపామూర్తులైన శ్రీ మృత్యుంజయప్పగారిని, స్వప్నబోధామూర్తులైన శ్రీ ఎఱ్రి తాతయ్య గారిని స్మరించి, సకల శివశరణులను వందించి శూన్య సంపాదనలోని "ప్రభుపు దేశాంతరము పోయి వచ్చిన సంపాదనము" నకు సంగ్రహముగా చెప్పిన వ్యాఖ్యానము సంపూర్ణము.

— ० —

శ్రీ గురు బసవలింగాయ నమః

# శూన్య సంపాదనము

## ప్రభుదేవుడు శూన్యసింహాసనమెక్కిన సంపాదనము

### ౧౮

కం॥ ప్రభు శూన్య పీఠమందున
విభవమ్మున గూరుచుండి విధి శరణులచే
శుభముగ పూజల నందెను
త్రిభువన మాశ్చర్యపడగ తెలిపెద నిజమున్

శరణ సమూహము కుతూహలముతో చూచుచుండగా, వచ్చినాయన విలక్షణ లీలా విలాసోన్మాదియై యుండగా, కొందఱకు గుఱుతు చిక్కలేదు. క్రొత్తగా కల్యాణమునకు రాలేదు ఇంతకుమున్ను వచ్చి అనుభవ మంటపాధ్యక్ష్యము వహించిన అల్లముడే అతడు చాల దినములు నిసర్గసహవాసమందు తపోధ్యానామష్ఠాన మందుండినవారికి ముఖనేత్రముల కాంతులలో దివ్యానుభూతి కళలు నిండి, దేహములో మార్పు కలిగియుండునని చెప్పుదురు అవియెల్ల అల్లమయ్య తన యందు నింపుకొని వచ్చి, క్రొత్తవాడు చూచినట్లు బసవన్న భవనము చూచుచు నిలబడి యుండెనని చెప్పిరి. మడివాళ మాచయ్య అల్లముని ముందురీతి ఇట్లని చెప్పుచున్నాడు

**మడివాళయ్య**

మలచి మెట్టుచు తను వొయ్యారమున, తల తూగి
మసు చలించిన భువన భువనేశ్వరుని వెనుక ముందులు
వీక్షించుచు నగుచు ముత్యాల తోరణములు త్రాకుచు బసవ
భవనంబు జొచ్చెను కలిదేవర దేవుడు

మఱియు

కుడి భాగంబునకు తిరిగె ప్రాకారపు టుత్తరపు
వాకిలి యందు తలవంచి వెడలె గతినియమంబు బట్టి ధవ
ళారమున పశ్చిమ ద్వారంబున త్రివిధగతుల శూన్య
సింహాసనమునందు ముక్తకేశుడు పరమ గురురాజు అధి
వసించె కలిదేవరదేవుడు ౨

**వివేచనము**

ఆహా! మహాస్వామి వచ్చె అక్కడ నుండి తనువు నక్కడి కక్కడికి త్రిప్పుచు, చూచి తల ఊపుచు, వెనుక ముందు ప్రక్కలు వీక్షించుచు, ముత్యాల తోరణములను త్రాకి కదిలించుచు వినోదమున బసవరాజు భవనములోనికి అల్లముడు వెళ్ళెనని మడివాళయ్య చెప్పుచుండెను

పోవుచు పోవుచు కుడిభాగమునకు తిరిగెను అక్కడ ప్రాకారపు టుత్తర భాగమున నున్న వాకిలి యందు తలవంచి ముందునకు పోయెను గతి పద్ధతి ననుసరించి ధవళాగారమను పశ్చిమద్వారము నుండి, అవతల త్రివిధ గతుల శూన్యసింహాసనము మీద పరమగురువు అల్లముడు శాంతమూర్తియై ఆసీను డయ్యెను. తలవెంట్రుకలు అటునిటు చెదరియుండెను

వెనుకటి సంపాదనములో చెన్నబసవన్నకు బసవన్న తన హృద్గతమును చెప్పినట్లు అల్లమస్వామి శూన్యసింహాసనారూఢుడయ్యెను శరణులు నోరార స్తుతించిరి బసవరాజునకు వెఱ్ఱి తలకెక్కినట్లయి సాష్టాంగ దండప్రణామ మాచరించి అనంతానందతుందిలస్వాంతుండై తన సంగతి నందఱు విన ఇట్లను చున్నాడు

బసవన్న .

నా మగడు రావలెనంచు నేను నా అంతరంగమను
ఇల్లును తెరవుజేసి, అష్టదళమను లోపలి ఇంటి యందు
నిజనివాసమను పరుపు పఱచి, ధ్యానమను పైగట్టు కట్టి,
జ్ఞానమను దీపంబు వెలిగించి, నిష్క్రియములను ఉపచా

రంబుల వ్యాప్తిగొనుచు, పశ్చిమద్వారమను వాకిలి దీసి,
కన్నులే ప్రాణమై నీ రాక నీక్షించుచుంటినయ్యా! నేను
రానంచు, పరితాపమొందితినంచు, తానె వచ్చి నా హృదయ
సింహాసనమందు (ఆసీనుడైన) మూర్తిగొన్న నా మనసు
కోరిక జయమయ్యె వెనుక పండ్రెండు వత్సరము
లందున్న గింత ఈనాడు నిశ్చింతయయ్యె కూడల సంగమ
దేవుడు కృపామూర్తియైన కారణమున నేను బ్రతికితిని 3

మఱియు

నా వచనమందు నామామృతము నిండి, నా నయన
మందు మూరితి నిండి, నా మనమందు మీ తలపు నిండి,
నా కర్ణమందు మీ కీర్తినిండి కూడలి సంగముదేవా, మీ
చరణ కమలమందు నేను నిండియుంటిని 4

మఱియు

ఆడి కాలు తనియదు చూచి కన్నులు తనియవు
పాడి మనసు తనియదు ఏమిజేతు నింకేమిజేతునయ్యా?
మిమ్ములను చేతితో తాకి పూజచేసి మనసు విసుగుచెందదు
ఏమిజేతు నింకేమిజేతును? కూడల సంగమదేవా! మీదు
ఉదరంబు భేదించి చొచ్చు భరము (తీవ్రకోరిక) నాకు 5

**వివేచనము :**

వచ్చే నా మగడు సుందరుడు అతని రాకకై ఎంతయో కాలమునుండి తపముంటిని వచ్చె ఈ రోజు, నా భాగ్యంపు పంటరోజు నేనంతయు ఆయనకై సిద్ధము చేసియుంటిని నా అంతరంగములో ఇల్లు, అష్టదళకమలములో సత్య సుందర మృదుల రంజిత తల్పము పఱచి, ధ్యానమను పైగట్టుకట్టి, జ్ఞానదీపంబు వెలిగించి, క్రియలుగాని క్రియల (చేయవలెనని చేయు క్రియలుకావు) ఉపచారంబులు చుట్టు పఱచి, పశ్చిమ ద్వారమను వాకిలి తీసి, కన్నులలో ప్రాణము పెట్టుకొని చూచుచుండ నా ప్రాణ నాయకుడు కరుణించి వచ్చినాడు అతడున్న చోటునకు నేను పోలేదు అలిగినదని తానె వచ్చినాడు నా హృదయ సింహాసనాసీనుడైనాడు అహా! ఇదెంత మనోహరము! నా కోరిక సమర్పకమైనది వెనుకటి

పం[డెండు వత్సరములు పడినవ్యథ సార్థకమయ్యె ఇక చింతలేదు కృపామూర్తి వచ్చినాడు నేను [బతికితిని

ఎల్లపుడు నీ వచన సామామృతములు నా హృదయ సరసులో నిండి యుండును నా నయనంబులందు నీ సుందరమూర్తి నిండియుండును నా మనసు నందు ఎడతెగని స్మరణము నిండియుండు నయ్యా! నా కర్ణంబులందు నీ కీర్తి చరితలు నిండియుండును కూడల సంగమదేవా! మీ చరణ కమలంబులోన భృంగమనై పాడుచుందును

అయ్యా! అయ్యా! ఉద్వేగము పట్టజాలను ఎంతగా నాట్య మాడినను కాళ్ళకు నొప్పిరాదు ఎంత బిగ్గరగా గొంతెత్తి పాడినను మనసునకు వేసరికము ఆయాసము రావు మిమ్ములను ముట్టి ముట్టి ఎంత పూజ చేసినను చేతులు సోలిపోవు, ఏమి సేయుదును? మఱేమి సేయుదును? ఏమి జేసినను నాకు అలగుట రాదు స్వామి! స్వామి! మీ హృదయమును భేదించి లోపలకు చొచ్చికొనిపోవుట నా అభిమతము ఇది యెంతవఱకు సరియో సరికాదో నాకు తెలియదు అని ఉన్మాద హృదయముతో, ఉచితానుచితముల గొడవ లేక, [భమ పొందిన బసవన్న ఇతరేతరములు మఱచి, శూన్య సింహాసనమున గూర్చుండిన అల్లముని పాదార్చనము చేసి స్తోత్రములు చేయుచుండగా శరణులు బసవన్న భక్తిలో పాలు పంచుకొనినపుడు, ఆ [ప్రొద్దు మధ్యాహ్నము మీరు వేళయైనది [పతి దినము లక్ష తొంబదియారు వేల జంగములకు ఆరాధనము జరుగుచుండెను ఆ [ప్రొద్దు నకు అల్లముడు వచ్చినందున దాసోహము యజమాని బసవన్న, ఇవతల చూడక వేళ కార్యము గమనించక [పవర్తించుట జూచి జంగములు కోపా[కాంతులై నోటికి వచ్చినట్లాడుచు లేచిపోయిరి ఇది యంతయును గమనించుచుండిన మడివాళ మాచిదేవుడు ఇట్లనుచున్నాడు

**మడివాళయ్య**

మంచి కంటివారిని జూచి మెల్లకంటివారు సైరించ
నట్లు, కొప్పున్నవారిని బోడిగుండువారు సైరించనట్లు,
రాజుని గని నిజ పురుషుని మఱచినట్లు జేసె నీ [వతగేడి
([వత సిద్ధుడు) బసవడు మహేం[ద జాలిక డొక్కని

ప్రభువని కూర్చుండబెట్టి, తన ప్రాణ లింగమని మా తట్టు
తిరిగి చూడడు అతని యందేమి మహిమగినెను?
మాయందేమి చెల్లనిది జూచెను? కంచు పట్టిక పెంకు
బట్టెను అనాచారి వాడొకడు వ్రతగేడి బసవడొకడు
వీరిద్దఱు పరలోక మర్త్యలోకములకు బయటనున్నవారు
వీరి ముఖము చూడరాదని పోయిరి కలిదేవుని శరణులు ౬

**వివేచనము**

లేవండి, పొండి స్వాములారా! ఇక్కడ ఉండకూడదు బసవన్నకు పిచ్చి తలకెక్కినది ఆయనెవరో గారడీడు లాగున్నాడు ప్రభు దేవుడని అతని ముందఱ పూజా స్తోత్రాలు చేయుచున్నాడు మనల దాసోహమే మఱచినాడు. ఇతర శరణులు అంతే అనాచారి వాడు వ్రతగేడి బసవడు, సరిపోయింది కంచు విడిచి పెంకు పట్టినట్లు, అందగాడిని చూచి తన పెనిమిటిని మఱచి వాని వెంట పోయిన వెలది యట్లు, ఇన్నినాళ్ళు మా దాసోహము వలన పెద్దవాడయిన బసవన్న నేమనవలె? వచ్చినవాడు, ఆదరించువాడు ఉభయులు దేవ మర్త్య లోకాలకు చెందరు వారి ముఖములు చూడరాదు పదండి అని వేగమే పోయి నారు జంగములు బోడి గుండువారు కొప్పున్నవారిని సైరింపనట్లు, మెల్ల కన్నువారు మంచి కన్నులున్నవారిని సైరింపనట్లు, అందఱు జంగములు వెళ్ళిరనునది విని చూచి వెరగయినారు అప్పుడు ఇదంతయు చాల రమ్యముగా చెప్పిన మడివాళుని గని 'అయ్యా! మాచిదేవయ్యా! నేను, బసవన్న ఇహ పరాలకు చెల్లరని పోయిన జంగమ స్వాములు సెలవిచ్చిరంటివి నిజమయ్యా?' అనుచు అల్లముడు శ్లేషభాషతో నవ్వుచు ఇట్లనుచున్నాడు

**అల్లమ ప్రభు**

అయ్యా! సాత్త్వికశరణుల మాట కల్లయే? అది
దిటము అది దిటము లోపల నున్నదే దేవలోకము
బయట నున్నదే మర్త్య లోకము ఈ రెండు లోకములకు
దూరమై మేముండ, ఈ రెండు లోకములందు వారినే
యుండనిమ్ము గుహేశ్వరా! ౭

**వివేచనము**

నిజము నిజము శివశరణులు అబద్ధము పలుకుదురేమయ్యా? వారు చెప్పినది నిక్కము అక్కడ, ఇక్కడ, క్రింద పైన ఉన్నవన్న లోకాలు జన జనిత వార్తలు అవి ఎక్కడను లేవు మనలోనే ఉన్నవి లోపల దేవలోకము బయట మర్త్య లోకము రెంటిలోను మేము లేము మా ముఖములు చూచు దురదృష్టము వారికి లేదు కాన మేము లేని లోకములో వారినే యుండనిమ్ము అని అల్లమదేవుడు వికటముగా నవ్వినాడు

ఈ ఘటన ఆనందయుతముగా శరణసముదాయమునకు, ముఖ్యముగా బసవరాజునకు మోదావహముగా నున్నపుడు ఈ జంగముల ప్రవర్తనము ఎంత నింద్యము? అపహాస్యకరముగా వర్తిల్లినదని కోపముతో చెన్నబసవన్న ఇట్లను చున్నాడు

**చెన్నబసవన్న**

వట్టి బోడులందఱు జంగములే? వేషధారులందఱు
జంగములే? జడ జీవులందఱు జంగములే? నిర్గమనంబె
జంగమము నిస్సీమజంగమము నిజైక్యుడే జంగముడు
ఇట్టి జంగమత్త్వము చలన మెఱుగక కూడల చెన్న
సంగమ దేవుడు తానె ప్రభువను జంగముండయ్యె ౮

**మఱియు**

భూమియందు సంచరించు లాంఛనధారు లందఱు
పదునెనిమిది జాతుల ఇండ్ల యందు తిని చెడిరయ్యా!
పర్వతవాసులై జడలు పెంచిన వారెల్లరు ఫలకందంబుల
తిని చెడిరయ్యా! ఎండుటాకులు నమలి తపమున్న వారం
దఱు గాలి భక్షణము చేసి చెడిరయ్యా! ఎఱుక ఇంద్రి
యంబులు గట్టి, గుఱుతుండు రాజ్యమునకు వచ్చి నర
కంబున దిగువారెని పెద్దవారనదు నా మనము ఈ కార
ణమున కూడల చెన్నసంగు డొల్లకున్న వారి వెనుక వెడ
లని నేను ప్రభుదేవుని విడువను ౯

**వివేచనము :**

తీక్షణమతి తీవ్రకోపావేశముతో చెన్నబసవేశుడు పోయిన జంగమములను విడంబించుటయే గాక నిజజంగమ తత్వ మెట్టిదనియు చెప్పినాడు ఎక్కడకును వెళ్ళలేనిది జంగమమన్నాడు జంగమమనిన అది సర్వభరితము (బయటకు) పోవుటలేదు వచ్చుట లేదు హద్దులేనిది జంగమము నిజమందుండునదే జంగమము ఇట్టి జంగమతత్త్వము తెలియని భూరిభోజనాల జంగములు పోయిన పోవనిమ్ము నిజమగు జంగముడు ప్రభువను జంగముడు వచ్చెను

చెన్నబసవన్న కోపము అక్కడతో శాంతించలేదు లోక ధార్మిక రంగముపై కురికింది అయ్యో! అయో! ఏమందునయ్యా? లోకములో అనేక ధార్మిక లాంఛనధారులు వృత్తులు చెడి, ధర్మమును పాడు జేసి, ఆకలికై ఎక్కడెక్కడనో ఎవరెవరినో వేడివేడి పాసిన కూడు దిని నాశనమైనారు కొంద గుహావాసులై, ఫలకందముల దిని దిక్కులేకుండ పోయిరి ఇంకను కొందఱు ఎండుటాకులు తినిరి మఱికొందఱు వాయుభక్షకులై చచ్చిరి వస్తువేదో, తత్త్వమేదో తెలియరైరి తమ కాయములోనే పరతత్త్వమును తెలియు ఇంద్రియము లున్నవనియు, తెలియుటకు ఈ లోక సృష్టియున్నదనియు తెలియరైరి తెలియుటకై వచ్చి తెలియు సాధనమును తామెయై,తెలివికి తామే లక్ష్యమని తెలియని వారిని పెద్దవారని నా మనసు ఒప్పుకొనదు వారే కావలెననిన చెన్నసంగయ్యను వారి వెనుకనే పోనిండు నేను ప్రభుదేవుని విడువను అని చెన్నబసవన్న వివరించి, వివేకించి చెప్పినది విని సొడ్డళ బాచిరాజు ఇట్లనుచున్నాడు

**సొడ్డళయ్య :**

విపినమందు మదకరుల గుంపు ఆనంద లీలలో
విహరించుచుండ, సింహంబు రాగా మదకరు లెల్ల చెదరి
పారునట్లు సాకార సొడ్డళా! మీ శరణ ప్రభుదేవుడు వచ్చి
నంతనే పారిరయ్యా కూడిన శివగణంబులు ౧౦

**వివేచనము .**

తమ కెదురు లేదని తమ కిష్టము వచ్చినట్లు అడవియంతయు విహరించు మదపు టేనుగుల సమూహము సింహము గర్జించుచు రాగా, ఎక్కడి ఏనుగు

లక్కడనే తొండములు ముడుచుకొని పారినట్లు, బసవాగారములో విచ్చలవిడిగా పంచభక్ష్య పరమాన్న భోజనానందమత్తులై తమ కెదురెవ్వరని దాసోహంభావి బసవన్నను సోహంభావముతో వేధించుచున్న జంగములు ప్రభుదేవ సింహంబు రాగా తల్లడిల్లి పారిపోయినారు అని సొడ్డళ బాచిరాజు చెప్పిన ఈ వినోదప్రసంగావధానము విని అందఱు నవ్విరి

ఉత్సాహ శిఖరమునందు ప్రభుని రాకకై లోకవృత్తినే మఱచి ఆనందమున నున్న బసవరాజు ఈ నడచినరీతికి నిరుత్సాహుడై ఖిన్నుడైనాడు జంగముల నిర్గమనమును హీనోపమానములతో అందఱు విడంబించువారలే కాని, చక్కబెట్టుకొను రీతి కెవరును రారైరి ఆరాధనీయులైన జంగములు పోయిరి నే కోరిన మహనీయుడు వచ్చినాడు తాను ఇంటియజమాని తాను పరవశుడైనను, అందఱివలె ప్రవర్తించరాదు అందఱిలోనున్న పరతత్త్వమును మఱువక అతిథితత్త్వమును బట్టి ఆదరించవలెను నావారిపుడు పెద్దదనుటలో మైమరచినారు నా సహాయమునకు రారు వచ్చిన నా ప్రభుని కరుణనే పొందవలెనని సమాజ సామరస్య తత్త్వవేత్త బసవన్న మెల్లగ ఇట్లు నివేదించుకొనుచున్నాడు

**బసవన్న**

గురువు కోపించిన ఒకనాడు తాళుదు లింగము
కోపించిన అర్ధదినము తాళుదు జంగము కోపించిన
క్షణమాత్రము తాళితినన్న నా ప్రాణము మొక్కపోవు
సుమా కూడల సంగమదేవా! ౧౧

మఱియు

రాజు కోపించి ఆ నాడులో నుండరాదు పతి
కోపించిన సతిగా నుండరాదు కూడల సంగమదేవా!
జంగమము కోపించిన నెట్లు బ్రతుకుదును? ౧౨

**వివేచనము**

ప్రభుదేవా! విన్నపము జరిగినదేదో జరిగినది అని వివేకము కాదనిన దిద్దుకొనుటకు రాదనినది కాదు దయ యుంచండి గురు లింగ జంగమములు వేసరిల్లి క్రోధము దాల్చినపుడు భక్తుడు శాంతము వహించి యుండవలయును గురు లింగముల కోపమునకన్న జంగమ కోపము తాళరానిది

లోకరూఢిలో రాజదండనకు గురియైనపుడు ఆ రాజ్యప్రజ వేరురాజ్యమునకు పోయి బ్రతుకవచ్చును భర్త తిరస్కరించిన భార్య ఇల్లువిడిచి వేరుచోట జీవింపవచ్చును జంగమకోప మట్లుగాదు జంగమము సర్వాంతర్యామి ఆ జంగమ మిచ్చట ఆరాధనీయమైనది ఇప్పుడు ధిక్కరించి వెళ్లినది నేనెటుల బ్రతుకుదును? మహాస్వామీ? సెలవియిండి అని బసవన్న దైన్యముతో సర్వత్వముతో పోల్చిన జంగముం కృప కలుగునటులనుగ్రహించండి అని అడిగినప్పుడు అల్లముడు ఆ మాటమీదనె జంగమ తత్త్వమునుంచి బసవన్నకు సమాధానముగా ఇట్లనుచున్నాడు

**అల్లమ ప్రభు :**

వెరవవలదు జంకవలదు పోయిన వారెవరు?
ఉన్నవారెవరు? మరులు! బసవా! ఒక్క ముఖమందున్న
దేవుడొక్కడే అఖిల ముఖమందున్న దేవుడొక్కడే నామ
ములు పెక్కులుగాని కార్యమొకటే సుమా? మనసు
నందున్న ఘనము కాయమును విడచునా? గుహేశ్వర
లింగమందు వియోగంబునకు తెరవులేదు వినుము
సంగన బసవన్నా! ౧౩

**వివేచనము .**

బసవరాజా! ఎందుకింత సందేహము - ఆతురము? ఎవరు పోయిరి? ఇక్కడ ఉన్నవారెవరు? అక్కడకు ఇక్కడకు పోవుటకు ఎట్లు? ఒక్కచోటననే ఉండుటకు అనువగును ఎక్కడ జూచినను అక్కడ నిండియున్నదానికి ఇంకెక్కడ పోవు చోటుండును? అది సర్వభరితము దానినే జంగమ మందురు ఉండుట పోవుట అనునవి భ్రాంతి మాత్రమే ఏకమందు అనేకము, అనేకమునందు ఏకము ఉండుననుట నీకు తెలియునుగదా బసవేశా! కాగలకార్యము నిర్ణీతమై యున్నది కదా! ఇదియుగాక మనసులో నిండిన ఘనము కాయమును విడిచి ఎక్కడకు పోవును? ఉండెను-పోయెను - వచ్చెను అను భిన్నములు సందేహమునకు కారణములు అల్లయ్య ఒకప్రక్క పోయిన జంగమ సమూహమును విడంబించి సమాధానమడిగిన బసవన్నకు కేవలాద్వైతమును తెలిపి, ఇక్కడ జంగమమె ఉండలేదు కదా! పోయిన వారెవరు? అది భ్రమ అన్నాడు ఎందుకనిన, గురు లింగముల

వియోగమునకు దినము - అర్ధదినము తాళుదు, జంగమ వియోగమునకు క్షణ మైనను తాళను అనునది, ప్రాణము మొక్కవోయి నట్లనినదానికి, సర్వవ్యాప కార్థములో జంగమార్థము బసవన్న చెప్పిన మాటలోనే యున్నదని అల్లముడు ఆ ఎత్తుగడమీద ఉత్తరమిచ్చినాడు వినిన బసవన్న - అల్లముడు తన మాటను శివాద్వైతముగా చెప్పక, కేవల అద్వైతమునకు పోల్చిచెప్పినది వాదనమునకు రంజకముగనే ఉండునుగాని భక్తిసంచయము కాదని వినమ్రతతో విన్నవించు కొనుచున్నాడు

**బసవన్న**

అద్వైతము నంతరంగమందెఱిగి, బయట దాసో
హంబు జేయకున్న ఎట్లయ్యా! ఉభయ సందేహమందు
నిజమగునే? మీ శరణుల మనసు నొప్పిగొన్న నే నెటుల
సైరింతునయ్యా? కూడల సంగమ దేవా! పాము చావక
కట్టె విరుగక ఉండునట్లు చేయుమా, మీ ధర్మము ౧౪

**వివేచనము**

ప్రభుదేవా! తమతో చెప్పుకొనెదను తమకు తెలియక ఏదియు ఎక్కడను జరుగదు అద్వైతములో నెఱిగి, బయట దాసోహము విడువరాదు లోనను బయటను సందేహముండిన యెడల నిజముండదు ఏమయినను మీ శరణులు నొచ్చుకొని వెళ్ళిపోయిరి తమరు సెలవిచ్చిన సర్వవ్యాపక శక్తికన్న వ్యక్తిత్వ జంగమత్వము ఉపయోగము వారు పోయిరి నేనెట్లు సైరింతునయ్యా? ఒక చిన్న విన్నపము ఎటులైనను పాము చావకుండగ, కట్టె విరుగకుండగ ఉండునట్టి రీతిన సరిచేయ గోరెదను అని వినయ విధేయతలతో బసవన్న అడిగినప్పుడు అల్లమప్రభు విట్లనుచున్నాడు

**అల్లమప్రభు .**

ఒకటయినది రెండగునె? రెండయినది ఒకటిఅగునె?
పరిణామపు వేళయందు సందేహము పుట్టనగునె? వచ్చిన
జంగముని భావమెఱుగక వెనుకనెంచి విస్తరింపగలరె?
ఈ ఒక్క నిలుకడకు పరిణామము చేయగలిగిన ఈ

లక్షతొంబదియారువేల జంగమములకు పరిణామ మౌను
సుమా! గుహేశ్వరుడను లింగము మూల మెఱుగక మరు
లైతివి కదా సంగని బసవన్నా! ౧౩

**వివేచనము .**

ఎన్ని నాళ్లనుండియో అనంతచింతా పరవశాపరాయణ మందు ఎవరిరాకకై తన ప్రాణమును కన్నులలో నుంచి నిరీక్షించుచుండెనో, ఆ మహాప్రభువు ఈనాడు వచ్చినాడు దినదినము ఆయన ప్రతీకముగా ఆరాధించు జంగమ సమూహము లేచిపోయినది ఇది బసవన్నకు ఒకటి చిక్కె మఱొకటి చిక్కక పోయినది ఆయనకు రెండును కావలెను ఒకదానిని పట్టుటయు మఱియొకదానిని జారవిడుచుటయు సరికాదు ఒకటి శ్రేష్ఠము, మఱియొకటి కనిష్ఠమని ఎంచరాదు

ఈనాడు అల్లముడు వచ్చిన సుదినము శరణులందఱకు పండుగ ఆనందము ప్రతిదినము ఈ వేళకు ఆరాధన మందుకొను జంగములు లేచిపోయినది అందఱకు వేసరికయైనది వారిని పిలుచుటకు ఎవరికిని మనసులేదు బసవన్న ఈ మహోత్సవమందు ప్రధానముగా భాగము వహించినను, జంగములు పోయినది చూచి జాగృతుడైనాడు నిజమైన భక్తికి మైమఱపు ఉండరాదు సదా అవధానముతో నుండవలెను బసవన్నగారి భక్తి అటువంటిది నిచ్చెన ఎక్కినవాడు క్రిందకు దిగుటకు నిచ్చెనను భద్రముగా నుంచుకొనును భక్తియు అటులనే బసవన్న దానిని తెలిసినవాడు కావున అల్లముని అడిగినాడు అల్లమునకు తెలియును బసవన్న భక్తిని వివిధ రీతులలో చూపవలయుననిన కుతూహలము ఆయనది బసవన్న భక్తి భండారి ఆ భండార ముద్రనే పడగొట్టి లోకమునకు విస్తరింపజేయు ఉపాయము అల్లమునిది అందుకే ఎదురు తిరిగినాడు

బసవా! ఒకటి-రెండు ఒకటి నుండి రెండయినదా? లేక రెంటి నుండి ఒకటి అయినదా? అనుట ఈ లెక్క వచ్చినవారిదగ్గఱ నా నీ ప్రశ్న? వేళయైనది నీ జంగములు నేను వచ్చినంతనే లేచిపోయిరి ఇదెంత విహితమో చెప్పరాదు దానికి నేనే కారణమా? అయ్యా! నీవు పెద్ద భక్తుడవని ప్రసిద్ధి పొందినావు నీ లక్షతొంబదియారువేల జంగములకు తృప్తి కావలయుననిన మొదలు నన్ను తృప్తిపఱచుట ఈ సమయమందు ఉచితము అని అల్లముడు ఉపాయము సూచింపగా మహదానందముతో బసవన్న ఇట్లనుచున్నాడు

**బసవన్న**

దేవ దేవా! మహాప్రసాదము మీ పాదాజ్ఞయైనట్లె గాని నాకు వేరు స్వాతంత్ర్యమున్నదె? సందు సంశయ ములున్నవె? అద్దంబులోని ప్రతిబింబము చూచు ముఖము నకు భిన్న భావమున్నదె? తిరిగి వచ్చు అనంత చలన మందు నీ వొక్కడవే నీలోన అనంతచలనము అడగి యున్నది మీకు జేసిన సంధానములు (వంటకములు) మీకు వడ్డించెదను అవధరించండయ్యా, కూడలసంగమ దేవా! ౧౬

**వివేచనము :**

మహాప్రసాదము మీ చరణాంబుజ మిచ్చిన అనుమతి మహదానందముగా నున్నదయ్యా! అద్దములోని ప్రతిబింబమునకు భేదమెక్కడుండును స్వామీ! ఔనౌను అనంతము నీవై యున్నావు ఆ అనంతములో అవ్యక్తుడవై యున్నావు మీరు భుజించినచో చరా చరములు తృప్తి చెందునని బసవన్న సంతసించి భోజనమునకు సర్వప్రయత్నములు చేయ, నాతని చూపుతోడనే అన్నియు సిద్ధ ములగుచున్నవి ఎక్కడ జూచినను సంభ్రమమే ప్రతి దినము జరుగు సమూహ దాసోహ సంభ్రమమున కన్న ఎక్కువగా విజృంభించినది శరణ సమూహము విజృంభించినది మొదటనే లక్షతొంబదియారువేల గణంబు లకు చేసిన పదార్థములు సిద్ధముగా నుండెను ఇదంతయు చూచిన అల్లమ స్వామి సంతోషస్వాంతుడై ఇట్లనుచున్నాడు

**అల్లమ ప్రభు**

పున్నమి వచ్చునంత వఱకు నోరు విప్పని చకోర మట్లుంటినయ్యా! భుజియింపరాదను శాస్త్రోక్తి చేత నున్న వాడను గాను భుజింపరాదను శాస్త్రమున్నదే లింగ వంతులకు? అహోరాత్రములు అష్ట భోగములను లింగం బున కిచ్చికొనవలయును చేసిపెట్టు నిజ భక్తులు లేని కారణమున నోరు విప్పకుంటిని చేసెదను-పెట్టెదను అను మాట సంతోష, మాప్యాయనముల చేకూర్చెనయ్యా, పెట్టుమయ్యా సంగన బసవన్నా! గుహేశ్వరునకు ౧౭

మఱియు

కొనలేని దేశంబు చుట్టితిని తెక్కలేని జోలెలు
తొడిగితిని ఆకలి లేని కప్పరము (పెద్ద హరివాణము
వంటి పాత్ర) పట్టి భక్తి భిక్షను వేడ వచ్చితి గుహేశ్వ
రుడు ఆకలిగొనె బువ్వ పెట్టుమయ్యా సంగన బసవన్నా! ౧౮

**వివేచనము :**

వెన్నెలనే తిని బ్రతుకు చకోర పక్షి పున్నమి చందురునకయి ఎటుల వేచి యుండునో అటులుంటిని భుజింపరాదని కాదు ఉపవాసమనునది లింగ వంతుల శాస్త్రములో లేదు వారు లింగ భోగోప భోగులు కాల కాలమునకు లింగమునకు నైవేద్యమిచ్చి ప్రసాదము స్వీకరించవలెను నేను నోరు తెరవ కుంటిననిన నాకు పెట్టువారు లేకుండిరి ఈనాడు పెట్టెదనని బసవన్న చెప్పి నాడు కదా! ఆహా! అది ఎంత అమృత వాక్కు! సంతోషము బసవయ్యా! ఆరగించెదను గుహేశ్వరునకు వడ్డించవయ్యా!

అయ్యా! నానాదేశములు తిరిగినాను ఎన్నో కౌపీనములు జోలెలు తొడిగి నాను ఆకలిలేని భిక్షాపాత్రను పట్టుకొని భక్తి భిక్షను వేడ వచ్చితిని అని సవినయముగా, సమాధానముగా, సముచితరీతిగా అల్లముడు అడిగిన రీతిని విని బసవన్న సంతోషచిత్తుడై ఇట్లనుచున్నాడు

బసవన్న

రూపులేని పదార్థంబు పెట్టెద రుచిలేనిపదార్థంబు
మథింపక పెట్టెద లింగమున కని లింగ పదార్థము
అంగముఖము విడిచి మీకు నివేదించెద కామింపక
కల్పింపక భావింపక భ్రమింపక మీదు కంచమునకు
(హరివాణము) వడ్డించెద సచ్చిత్త సమాధానంబున అవధ
రింప వలెనయ్యా, కూడల సంగమ దేవయ్యా! ౧౯

వివేచనము .

అవధరించండి ప్రభుదేవా! మీకు తగిన, మీరు కోరుచున్న పదార్థము గాని పదార్థమును ఆరగింపుటకు పెట్టితిని అది రుచికరము కానిది ఏ దాని నుండియు కాచి మధించినదియు కాదయ్యా! అంగమను భ్రాంతిలేని లింగమున కగు లింగపదార్థమే అది కామవికారములు, అనుమాన చిత్తములు, కల్పనలు లేని సమాధానము మీ జంగమ హరివాణమునకే వడ్డించెద బసవన్న అత్యంత ముగా ఉత్సాహయుక్తుడై నిగూఢ తత్త్వ సంచయమునే వడ్డన జేసెదనన్నాడు ఈ ప్రసాదము పదార్థార్పణము నుండి అగునది కాదు ప్రసాదము-ప్రసన్నము ప్రసిద్ధము నుండి కలుగునది పదార్థ కాయముల వ్యవహారము కాదు ఇక్కడ అర్పిత అర్పణములు భావతృప్తికి సంబంధించినవి అల్లముడు బసవన్న చెప్పిన ఆరోగణను (భోజనము) గురించి చెప్పినది విని సంతసించి ఇట్లు అనుచున్నాడు

అల్లమ ప్రభు

మీ లీల, మీ వినోదము, మీ రీతి, మీ సొగసు -
దానిని వద్దనను వేడను మేఘవహ్ని భూమి కోరగుచు
లోకము నడిగినదా? ఉదరాగ్ని వచ్చునపుడు భూతంబుల
నడిగినదా? గుహేశ్వర అల్లముని అనుపమ మహిమ
ఎటులుండెనో అట్లు నీవు చేయవలెగాని నేను దానికి
వేరేమియు నసను —౨౦

వివేచనము

కానిమ్ము కానిమ్ము బసవయ్యా! కానిది నీవు చేయవు నీవు చేసిన అంతయు కాగలదు నీ ఇష్టము, నీ చిత్తము, నీ మనోహరము, నీ కళానందము నీవేమి చేసినను నేను 'ఊఁ' అందును చూడు! ఆకాశము నుండి పడెడు పిడుగు భూమికి చెప్పిపడునా? జీవరాసులను అడిగి ఆకలి పుట్టునా? నీ ఆనందమే గుహేశ్వరుని ఆనందము అని అల్లమ దేవుడు ముదముతో అనుమతింపగా బసవన్న ఇట్లనుచున్నాడు

బసవన్న

చేయుట, చేయించుకొనుట ఈ రెంటి నడుమ
ఉపకారము భేదము ఉన్నదే దేవా? కాయ ప్రాణ సంగమ

మట్లుండునుగాని? తెలిసినట్లు చేయుము తెలిసినట్లు
పెట్టుము నాకు తెలియదనుట మీ కుచితమగునె? చేయు
నపుడు, ఇచ్చునపుడు చెప్పి చేయించుకొనవలెనుగాని
చేయి కలిపిన నోటికి హంగుండునే, కూడలసంగమదేవా! ౨౭

**వివేచనము**

స్వామీ! అటుల సెలవియకండి మీ ఇష్టము అనకండి నేను భోజనము పెట్టుట, తమరు వేరై భుజించుట, ఆ భేదము వద్దు తనకేది ఇష్టమో అవి చేయించుకొని ఆప్యాయముగా ఆరగించండి కాయమునకు ప్రాణమునకు భేద మెక్కడ ఉన్నది? క్రియకు భోజనము పెట్టువారు భుజించువారును ఒకే భావముతో ఉండవలె ఆ భావము తోడనే భుజించండి నోరును కలుపు చేతికి క్రియలు రెండున్నను తృప్తి ఒకటే కదా స్వామి! అని ఇంకేమేమియో పలుకుచుండగా మహా చాతుర్యము కల అల్లముడు తనకు మిక్కిలి ఆకలి ఐనదనినట్లు పలుకు చున్నాడు

**అల్లమ ప్రభు**

ఉన్నవారు పాతర తీయు లోపలనే లేనివారి
ప్రాణంబుబు పోయెనను గాథ నాకయినదయ్యా! మాటలు
పెంచి వర్ణించుటలో ప్రొద్దు పోవుచున్నదయ్యా!
నీకు మాటలకు వేసరిక (విసుగు) లేదు ఒకరిని జూచిన
అరువది మందిని జూచినట్లయ్యె నాకు శూన్య సింహాస
నము కదులుచున్నది ప్రాణము తలపైకి వచ్చియున్నది
గుహేశ్వరు డాకలిగొనియుండె పదార్థము వడ్డింపవయ్యా,
సంగన బసవన్నా! ౨౨

**వివేచనము :**

చాలు చాలు మాటలు చాలునయ్యా! వట్టిగా మాటలాడుచుండిన నీవు భోజన మెప్పుడు పెట్టుదువయ్యా? నాకు విపరీతముగా ఆకలి అగుచున్నగి కన్నులు పిత్తవికారమునకు గురియై, ఒకరిని జూచిన అరువది మంది కనబడు చున్నారు ఉన్నవాడు పాతర త్రవ్వితీయునంతలోనే లేనివానికి చావు వచ్చె నన్న కథ నాయందు నిజమగుచున్నది ఈ శూన్య సింహాసనము తల్లడిల్లుచున్నగి మాటలు చాలించి, నా ఆకలిని చూడుము భరింపరాని ఆకలియైనటులు అల్లముడు తొందరచేయగా బసవన్న పూజాసామగ్రి తెప్పించి అల్లముని స్నానకృత్యములు

తీర్చి, అష్ట విధార్చన, షోడశోపచారములతో లింగార్చనము చేయించినాడు శివ శరణులు ఆయన పాదార్చనలు చేసి హారతులు వెలిగించినారు చివరకు నాగ లాంబగారు హారతి ఇచ్చుచుండ మోళిగయ్యగారు ఆ సన్నివేశమును ఇట్లు వర్ణించు చున్నాడు

**మోళిగయ్య**

ఇచ్చిన ద్రవ్యములను తమ తమ లింగములకు
సమర్పణము జేసికొనుచు, తను భోగాది భోగంబుల
భోగించు చుండిరి గదా, బంగారు పళ్ళెరము లందు !
అనంత రీతుల గుగ్గిలపు ధూపము, దశాంగము వ్యాపించు
చున్నది శరంబున వచ్చి శూన్య సింహాసనము ముందు
నిలచిరి పంచ మహా వాద్యములు ఘోషింప, వారి వారి
చేతులలో హారతుల నెత్తుకొనుచు నాగాలు తల్లి నిష్కళంక
మల్లికార్జున ప్రభువునకు హారతు లెత్తుచుండెనయ్యా! ౨౩

**వివేచనము .**

బసవన్న జాగృతుడై భోజన పరికరములు సమకూర్చ సెలవిచ్చి, శర ణులు నందఱను ప్రభుదేవుని పూజకు పిలిపించి పూజలు జరిపినారు అందఱు పాదపూజ చేసి హారతులు వెలిగించి మంగళములు పాడినారు మంగళ వాద్య ములు మ్రోగినవి

—o—

ఇది కృపామూర్తులైన శ్రీ మృత్యుంజయప్ప గారిని, స్వప్నబోధామూర్తు లైన శ్రీ ఎఱ్ఱి తాతయ్యగారిని స్మరించి, సకల శివశరణులను వందించి శూన్య సంపాదనలోని "ప్రభుదేవుడు శూన్య సింహాసన మెక్కిన సంపాదనము" నకు సంగ్రహముగా చెప్పిన వ్యాఖ్యానము సంపూర్ణము

—o—

శ్రీ గురు బసవలింగాయ నమః

# శూన్య సంపాదనము

## ప్రభుదేవుని ఆపోశనము

౧౯

కll శూన్యాసనమున నుండియు
ధన్యుడు గురుమూర్తి ప్రభుడు అతిశయమొవ్వన్
పుణ్యపు భోజనమును కడు
మాన్యత నర్పించు తెరగు పలికెద ధ్రుతితోన్

బసవరాజు అల్లముని భోజనమునకు సకలము సిద్ధము చేయించినాడు, వడ్డించువారు సిద్ధముగా నిలచినారు బసవన్న, చెన్నబసవన్న, మడివాళ మాచిదేవుడు, హడపదప్పన్న, సొడ్డళ బాచిరాజు మున్నగు శరణులు తగిన కార్యాతురములందున్నారు బసవన్న అక్క నాగలాంబికతో పరికరములు పట్టి శరణీయు లున్నారు అల్లముడు అనంత జంగమ (లక్షాతొంబదియారువేలు) స్థానమున ఏకాంగుడై వారి ప్రతినిధియై తనను తృప్తిపఱచిన అందఱు తృప్తిపడుదురను అభయమిచ్చి ఆరగించుటకు సిద్ధుడై కూర్చొనినాడు బసవన్న ఐక్యమును తెలిసినవాడు, అనంతము తెలిసినవాడు గాన హర్షముతో సిద్ధుడై పెద్ద బంగారు పళ్లెరమును ముందుంచి విన్నవించుకొనుచున్నాడు

**బసవన్న**

అంగ మందలవరించిన లింగమునకు అంగమే
భోజనము ప్రాణంబుపై నున్న లింగమునకు మనమె
భోజనము జ్ఞానంబుపై నున్న లింగమునకు నిర్భావమె

భోజనము కూడల సంగమదేవయ్యా! ప్రభుదేవుల భోజ
నము సేయ భక్తి పరియాణంబు (పళ్లెరము) కాక వేరే
భాజనంబు కానను ౧

**వివేచనము :**

నా తండ్రి నా స్వామి అల్లమదేవునకు భక్తిపళ్లెరమే ఉచితము, ఉపయుక్తము అంగ ప్రాణ భావములను మూడు శరీరములపై నున్న ఇష్ట ప్రాణ భావలింగములకు అంగము ప్రాణము, భావములే ఆహారములు అయ్యా, కూడల సంగా! అవధరించండి ప్రభువు భక్తిభోజనుడు భక్తుని పదార్థ మాయనకు పరమార్థమని సంతసమున కంచము (పళ్లెములో) వడ్డించినపుడు ప్రభుదేవుడు ఆనందమున ఇట్లనుచున్నాడు

**అల్లమ ప్రభు :**

ఘనమైన పరియాణమందు (పళ్లెరములో) యుక్త
మైన బువ్వపెట్టి వివిధ పదార్థంబులు ఒక్కొక్కరీతిరాగ
చూడకమున్నె రూపు అర్పితంబై యుండె ముట్టకమున్న
తాకిడి (స్పర్శ) అర్పితంబై యుండె రుచి చూడకమున్న
సుఖం బర్పితమైయుండె అవధారు! అవధారు! లింగమా!
మీ మనంబునకు నీ వర్పించుకొన్న, నా మనంబునకు
నచ్చిన పదార్థము నీ కర్పించెద గుహేశ్వరా! నీకు
విందగు బోనము నలవరించి అర్పించువాడగాన నాకు
నీకును సంగన బసవని ప్రసాదము భుజింపుము దేవా! ౨

**వివేచనము :**

సంతోషముతో అల్లముడు - బసవన్న భక్తితోఁబెట్టిన పదార్థములు ప్రభువు చూడకమున్నే రూపార్పితములు (కనుపించినవని) అనుచున్నాడు, అటులనే ముట్టకమున్నే సోంకు (అంటు - స్పర్శ) అర్పితమైనదనుచున్నాడు వడ్డించిన పదార్థములు రసయుక్తములు, మధురాతి మధురములని రుచిచూడక ముందే, "గుహేశ్వర లింగయ్యా! నీ ఇష్టము వచ్చినట్లు ఆరగింపవయ్యా! నా కిష్టమైనది నీ కిచ్చెదను నాకును నీకును ఇది బసవన్న పెట్టిన సంపూర్ణ ప్రసాద

మయ్యా! మఱియొకచోట దొరుకుట కష్టము కడుపార భుజింపు"మని లింగార్పితము చేసి శరణార్థులకు బెట్టి అల్లముడు భుజింప ప్రార్థించెను

ప్రారంభమే ఒక వినూతనము విలక్షణము అసామాన్యము పదార్థములు మఱల వడ్డించు వేగమునకు, భుజించురీతికి, శరణులు ఒకరి ముఖము లొకరు చూచుకొన్నారు ఇవిచూచి సంతసమున బసవన్న అనుచున్నాడు

**బసవన్న** :

చేతనిండ బెట్టగా మనసు నిండి కుడుచుచున్నాడు ఔనౌను! స్వామి ఆకలి లోకమునకు క్రొత్తది కూడల సంగమదేవా! విపరీతమైన ఆకలి చేటలతో వడ్డన చేయండి

**వివేచనము**

స్వామికి విపరీతమైన ఆకలి ఆహా! ఈ ఆకలితో భుజించు అల్లమదేవుడు ఎంత ఆనందము పొందుచున్నాడు! పెట్టినది పెట్టినట్లే నోటిలోనుండును చేయి స్వామికి అవసరము లేదన్నట్లున్నది చేతిలో బెట్టు పదార్థములు చాలవయ్యా, చేట గంపలలో నింపుకొనిరండు అని బసవన్న చెప్పగా అట్లనే చేసినారు కాని అల్లముడు భుజించుటను అందుకొనలేదు బసవన్న చూచినాడు ఆశ్చర్యభరితుడైనాడు శివశరణులందఱు ఎన్నడును చూడని ఈ దృశ్యము విశేషరీతి యొకటియే గాదు వ్యక్తియై పరిమితియై ఇట్లారగించరాదు అల్లముడు వ్యక్తియు గాదు పరిమితియుగాదు తృప్తిపఱచుటెట్లు? బసవన్న భక్తికి మీరినది లేదని అనుకొన్నారు అప్పుడు బసవన్న ఆ పరిస్థితికి జంకి ఇట్లనుచున్నాడు

**బసవన్న** :

చే తాకిన పదార్థంబు చేతియందే ఐక్యము కన్నుల కందిన పదార్థము కన్నులం దైక్యము, నాలుక తాకిన పదార్థము నాలుకయందైక్యము వడ్డించు పరిచారకులు వేసరిల్లిరి కాని భుజించు దేవుడు ఏమన్నదియు ఎఱుగడు బ్రహ్మాండమును కాయమం దడగించుకొనుచు వచ్చిన

నాథుడు లేచిపోయెను వడ్డన చేసిన సంధాన మంతయు (ఒప్పుదానము) నిర్వయంయ్యె చేసి చేసిన సంధాన మంతటిని మఱల చూడలేదు ఇది యేమని చెప్పుదును? అనియమ చరిత్రము దీనినెట్లు ఉపమించెదనీ విస్మయ మును? కూడల సంగమదేవుని తృప్తిరీతి తెలిసిన చెప్ప వయ్యా చెన్నబసవన్నా! ౭

**వివేచనము**

స్వామి లీల విచిత్రమయ్యెను క్షణములో ఎంత ఆశ్చర్యకరమైనది! కానరాని పీఠముపై చెప్పుట కలవికాని పరవస్తు వాసీనమ గుట యేమిటి! కన బడు జంగములు లేచిపోవుట యేమి! నన్ను తృప్తిపఱచిన అంతయు తృప్తి పడునని అల్లముడు చెప్పినట్లు చేయగా ఆయన బ్రహ్మాండమునే మ్రింగువాడై తృప్తిపొందక యుండుట ఏమిటి! చెప్పుటకు అలవికాని చరిత్రలో చిక్కితి నయ్యా! కడతేరు ఉపాయమున్నచో చెప్పుమయ్యా చెన్నయ్యా! అని బసవన్న చిక్కుకొనిన చిక్కు విపరీతమని చెప్పగా చెన్నబసవన్న అనునయముతో ఇట్ల నుచున్నాడు

**చెన్న బసవన్న**

అనేక వత్సరంబులు గడచిన వారిని పెద్దలని చెప్పుదునే? చెప్పను వారు భూమి భారకులగాన ఏడు వర్షముల వృద్ధుడు సిరియాళుడు పంద్రెండు వర్షముల ముదుసలి మహాదేవి అక్క అండజ పిండజ మీనజు లనువారందఱు ఆనాటి కానాటి బాలకులు మీకు బుద్ధిజెప్ప నాకు బుద్ధిలేదు కూడల చెన్నసంగమదేవా! ౮

**వివేచనము :**

ఏమిటిది బసవేశా? నిన్ను నీవే మఱచిన తెలుపువారెవరు? నేను చెప్ప వలెనా? నాకేమియు తెలియదు ఎందరెందరో మహా ఘనులు బ్రహ్మ చచ్చినను చావని వారున్నారు వారు భూభారకులు తెలియవలసిన దేదియో అది వారి కింకను తెలియలేదు వారు పెద్దవారని చెప్పుట తగునా? సిరియాళుడు, మహాదేవి

అక్కకు ఎన్నేండ్లు? ఇతరులు సరిగా కన్ను తెరచుటకు రాని వయసువారు వయసులో లేదు వారు పుట్టుక తోడనే మరువము సువాసనతో పుట్టినట్లు పుట్టిన వారు బసవేశా! ధృతిని పోనాడుకొనకుము నీ భక్త్యాధిక్యత మీద మఱియే యాధిక్యము లేదు ఇదియొక లీల

పంచశతకోటి యోజన విస్తీర్ణ భూమండలము మొదలయిన నవఖండ పృథ్వియంతయు ఒక భువనంబులో చేరియుండె అట్టి పదునాల్గు భువనంబులు మిశితమైన మహాఘనంబునకు సంధానము పెట్టెనదనిన స్వామీ! నీ మరులు నేమందును? కూడల చెన్నసంగుని తృప్తి విధ మెట్లనిన "నీవు బోనము నే పదార్థము," దీనికన్న వేఱేమి ఘనము లేదు కనుమా, సంగన బసవన్నా! ౯

**వివేచనము :**

ఐదు వందలకోట్ల యోజనముల విశాలముగ నున్న భూమండలము తొమ్మిది విభాగములై ఒక భువనముగా నున్నది అట్టి పదునాల్గు భువనంబులు ఏకమై నిండుకొని యున్న మహా ఘనంబునకు బువ్వ పెట్టెదననిన మీ పిచ్చికి మేరయున్నదా స్వామీ? మార్గమిది కాదు ఈ పరాత్పర తత్త్వమును తృప్తి పఱచుట ఎంతటి వారికైన సాధ్యంబు కాదు చూడగా పదార్థ కాయమట్లున్న అల్లముడు లోపల బయలై యున్నాడు సావయవ నిరవయవము దాల్చి నిన్నీరీతి వేధించి పరీక్ష చేయుచున్నాడు ఇక వంటకము చేసి పెట్టుట చాలు ఒకే ఒక ఉపాయమున్నది అది మీకు తెలియును కార్యభరమున మఱచినారు అల్లమదేవుడు కేవలము తత్త్వప్రియుడే కాదు, వినోదప్రియుడు కూడ చూడండి విందులోనే ఎంత వినోద నాటకమాడుచున్నాడో! నీకు భ్రమ కల్పించినాడు చిన్న ఉపాయము "మీరే బోనము - నేనే పదార్థమును" అని అర్పణము చేసికొనుటయే పరమోపాయమని చెన్నబసవన్న రహస్య మెఱిగించిన విని పరమానందభరితుడై బసవన్న ఇట్లనుచున్నాడు

**బసవన్న**

నా కాయంపు మబ్బుపీడె చెన్నబసవన్నా! ఈనాటి నుండి నాను తను మన ధన లోభంబు ను విసర్జింతు చెన్న

బసవన్నా! ఇప్పటినుండి నన్నలముకొన్న అహంకారము
నిర్వాయలయ్యె చెన్న బసవన్నా! ఇప్పటినుండి కూడల
సంగమదేవుని తృప్తిపఱచు విధము నీవు చూపించితివి
గాన నేను బ్రతికితిని సుమా, చెన్న బసవన్నా! ౧౦

**వివేచనము :**

భళిభళీ! మహోత్తమమైన ఉపాయమిది చెన్న బసవేశా! బ్రతికితినయ్యా! ఔనుగదా! ఇంత తెలియలేదు! అహంకారము తెలియనీయదు 'వేడువారు లేకనే బీదనైతి'నని వచనము వ్రాసికొని డంగురము గొట్టించిన (దండోరా వేయించిన) దాంభికుడ నేను దానికి తగిన ప్రాయశ్చిత్తమైనదీనాడు చెన్నయ్యా! రహస్యము చెప్పి నన్ను బ్రతికించుకొన్నావు నాయనా! నీయట్టి మహితోత్తమ వివేకశాలిని నేను చూడలేదు ఈనాటినుండి నా తను మన ధనములు నీ కృపచే పరిశుద్ధములైనవి అహంకార వివర్జితుడనైతిని బ్రతికితి, బ్రతికితినయ్యా చెన్నబసవేశా! అని బసవన్న గంతులు వేసిన చెన్నబసవన్న చూచి నవ్వుకొని ఆతురమున అనుచున్నాడు

**చెన్న బసవన్న**

నన్ను పొగడుటకు మీకు అంతులేదు మిమ్ము
పొగడుటకు నాకు విరామంబు లేదు ఒకరి నొకరు
పొగడుటకు ప్రొద్దు పోయెగాని సంగమనాధుని తృప్తికి
పదార్థ మొసగలేదు కూడల చెన్న సంగునకు పదార్థంబు
ఒనగూర్చరే సంగన బసవన్నా! ౧౧

**వివేచనము :**

ఇది బాగున్నది! పరస్పరము కొనియాడుటలో సమయము మించిపోయినది తెలియరాలేదు సంగమ నాథుడు నవ్వుచు వెక్కిరించు రీతి చూచుచున్నాడు గంగాళముల పదార్థములు లేవు కొరత లేకుండ పెట్టుటకు హాని రాకూడదయ్యా, బసవేశా! తగు వ్యవస్థ కావలెను నీది కాక ఊరివారి దాసోహ మరములు, శరణుల యిండ్ల ధాన్యమంతయు తరిగిపోయినది అని చెన్న బసవన్నను జూచి బసవన్న నిర్ధరించి ఇట్లనుచున్నాడు

**బసవన్న**

ధనము సమసిన తనువర్పించెదను తనువు సమ
సిన మన మర్పించెదను మనసు సమసిన భావమర్పించె
దను భావంబు సమసిన నిర్భావ మర్పించెదను కూడలి
సంగమ దేవయ్యా! చెన్న బసవన్న బంధువైన పిమ్మట
నేను మీయందు కూడుకొని అర్పించుకొని శుద్ధుడన
య్యెదనయ్యా! ౧౨

**వివేచనము .**

ఇక జంకను చెన్న బసవయ్యా! ధనము తనువు మనముం సర్పించె దను అవి చాలకున్న భావనిర్భావముల నర్పించెదనయ్యా! అని బసవన్న కడు ధైర్యముతో పలుకుచు ఆవేశమున మఱియు నిట్లనుచున్నాడు

కాలంబు తాకని సంధానము (పదార్థము) కల్పి
తములేని సంధానము అనంతరతి యను తరుణి ముట్టని
సంధానము ఫాలలోచనుడను జంగమము ముట్టని సంధా
నము ఎక్కడ అంటని సంధానము మీ కర్పించెదను
ఆరగించవయ్యా ప్రభుదేవా, కూడల సంగమదేవా! ౧౩

**వివేచనము .**

అయ్యా! మహాప్రభూ! కాలము, కల్పన, మాయ ముట్టని పవిత్ర పదార్థ మును బెట్టెదను శివుడు జంగముడై వచ్చి తాకని పదార్థము ఏమేమియు తాకని పదార్థము గురులింగ జంగమార్చితమునుండి పరిశుద్ధికాంచి ఇంతవఱకు ఎవరికిని వడ్డించని పదార్థము బసవడే ఆకలిలేని మీ ఆకలితీర్చు పదార్థము అవధారు దేవరదేవా! ప్రభురాజా! మీ ఇష్టము వచ్చినట్లు సేవింప వేడెదను అని బసవన్న సర్వార్పణము చేసుకొన్నాడు అదివఱకు ఆరగించని జంగముడు, ఆరగింపజేయు భక్తుడు వేరువేరుగా నున్నారు ఈ భిన్నత ప్రకోపమై భిన్నాతి భిన్నమై భక్త జంగముల సామరస్యమునకు దూరమైయున్నది తృప్తికి దూరమైయున్నది చెన్న బసవన్న హెచ్చరికతో పెట్టునాతడు తననే వడ్డించు కొన్నాడు సకల తత్త్వార్థ సందోహ సమన్వయమైనట్లు అద్వితీయమైనది అప్పుడు చెన్న బసవన్న అల్లమరాయుని విశేషముగా స్తోత్రము చేయుచు ఇట్లు విన్నవించుకొనుచున్నాడు

**చెన్న బసవన్న .**

నీ వంటరించి యిచ్చిన పదార్థము మీ కర్పిత
మయ్యా! మీ ఆరోగణము (భోజనము) మహా ఆరో
గణము సకలేంద్రియములకు హితకరము కూడల
చెన్న సంగమదేవా! నీకు ఆకలి లేదుగాన నేను అర్ప
ణము చేయలేదయ్యా! ౧౪

మఱియు

గురువే బోనము శిష్యుడే మేలోగిరము లింగము
నకు పదార్థ మర్పితమయ్యా! ఘనంబునకు మనమే
అర్పితము మనంబునకు మహామే అర్పితము ఘనమందు
మనము లీనమైన పిమ్మట అర్పించు భక్తులెవరు? ఆరో
గించు దేవుడెవరు? నిత్యతృప్తుడు భుజింప నేర్చిన వేరొక
దానిని అర్పించుట కలదా? దేవా! కూడల చెన్న సంగమ
దేవా! బసవన్నయే బోనము నేను పదార్థమును మనసు
నెమ్మదింప భుజింపుమయ్యా! ౧౫

**వివేచనము :**

అయ్యా! మహాదేవా! మీభోజనము పరమాద్భుతము లోక మనోహరము అనువుగా తగురీతి నీవిచ్చిన పదార్థములు మీకే అర్పితములు ఈ అర్పితము సమస్తజీవుల ఇంద్రియార్పితము సకలేష్ట దాయకము స్వామి భోజనాభినయము రసభరితము ఆకలియే లేదు ఇక నేను అర్పణము చేయుట ఏమి యున్నది?

అవధారు దేవదేవా! గురువే బువ్వ శిష్యుడే అబువ్వ కనువగు పదార్థము ఇంకేమి కలదు? ఘనమునకు మనమే అర్పితము మనమందు ఘనమైక్యము స్వామీ! ఆకలి లేని మీరు తిన నేర్చితిరనిన పెట్టి తృప్తిపఱచ గలవారెవరు? బసవన్న యే బోనము నేనే పదార్థమను నెమ్మదించిన చిత్తముతో ఆరగించండి

బసవన్న, చెన్న బసవన్న, అల్లమునకు సాష్టాంగవందనములతో భోజన పదార్థములుగా అర్పించుకొన్నారు అక్కడ నేను, నీవను అహంకార మమకార ములు అర్పితములైనవి ఈ అర్పనమే సర్వార్పణము ఇంతకుమించి మఱియే అర్పణమును లేదు ఆక్షణమందే అల్లమునకు తృప్తి పెరిగి పెరిగి సకల జీవరాసు

లకు సమ్మోద భరితమైనది దానిలో పోయిన జంగముల ప్రత్యేకతలేక సంతృప్తి యైనది

అల్లమదేవుడు అపారమైన సంతృప్తిచెందినవాడు తాననుకొనినది లభ్యమైనది బసవన్న మొదట పెట్టిన పదార్థభిక్ష సంతసము నీయలేదు జంగము దాసించినది భక్తిభిక్షము బసవన్న చెన్న బసవన్న ఇచ్చిన భిక్షకు ఆనందపరవశుడై అల్లమప్రభు విట్లు కొనియాడుచున్నాడు

**అల్లమ ప్రభు.**

మనో ముక్తి వివేకమను వరిధాన్యమును గుప్తమను రోలులో నుంచి, అభిన్నమథన మను రోకలితో దంచి, కల్మషమను పొట్టు పారవేసి, సమతయను నీటి యందు కడిగి, అత్యాశలను ఊలుదీసి, దయామృతమను పాల బోనంబు (పాయసము) చేసి, సమరసమను రుచి కర పాకంబు జేసి, స్మరణ కుతూహలము అభిఘారమై (నేయి), నిర్మలమను శివదానంబు (మజ్జిగ) సంపాదించి కాపల ఉండిరయ్యా! పంచేంద్రియమను శునకంబు సోంకక (ముట్టకుండా) కాపలా ఉండిరయ్యా! షడ్వర్గమను తొత్తులు ముట్టకుండా కావలి ఉండిరయ్యా! అష్టమదము లను తనయులు ముట్టకుండ కావలి ఉండిరయ్యా! ఇట్లు ముఖ్యములగు హీనంబు లేవియు ముట్టకుండగా కావలి ఉండినారు గాన ఈ బోనము గుహేశ్వర లింగమునకు అర్పితంబై యుండె చూడుమా! చెన్నబసవన్నా! ౧౬

**వివేచనము**

ఆహా! ఇది ప్రమోద ప్రసాదము మా గుహేశునకు అపూర్వానందకర, సర్వరస సమాహిత, తత్త్వ సంభరిత, సర్వాచార సన్నిహిత, లోకోత్తర నిరుపమాన, నిర్వికార నిశ్చల పరిశుద్ధ భోజనము ఎట్టులనిన బంధన రహితమైన మనో వివేకమను బియ్యమును, రహస్యమను రోలులో వేసి, భిన్నము లేని రోకలితో దంచి, పొట్టు తీసి, సమాసమను నీళ్ళయందు కడిగి, దానిలో నున్న

కల్మషములను చిన్నిఱాల నేరి, శుద్ధము చేసి, దయామృతమను పాలతో బువ్వ చేసి, సామరస్యమను షడ్రుచులుగల చారు, పులుసు కూరలు చేసి, కుతూహలమనెడు స్మరణంబును బోనముపై ముందుగా వేయు నేయియై, నిర్మలంబను పెరుగు చిలికిన మజ్జిగను సంగ్రహము చేసికొని, పంచేంద్రియములను కుక్క ముట్టకుండ, షడ్వర్గములను పరిచారకులు ముట్టకుండ, అష్టమదములను బిడ్డలు ముట్టకుండ నిష్ఠతో కావలి యుండిరి లోకములోని యే హీన జంతువులు ముట్ట కుండ రక్షించి యుండిరయ్యా! అట్టి అమోఘమైన ఓగిర మెవరు పెట్టెదరయ్యా? తమ కాయములనే భాండములుగా జేసి, మనసు చిత్తము అహంకారము కర్మేంద్రియాలు జ్ఞానేంద్రియాలు తను వనునవి ఏమేమి యున్నవో వాని నన్నిటిని పదార్థములుగా జేసి వడ్డించిరి వడ్డన చేయువఱకు పరిశుద్ధతను రక్షించిరి శివ శివా! మా సంతోషమునకు మేరలేని మహా నైవేద్యమిది మహా పుణ్యదినమిది

భరిత (నిండుగా నున్న) బోనము భరిత బోన
మంచు భ్రమించి భ్రమితులైతిరి లోకమంతయు భరిత
బోనంబె దిటమైనదైన మర్త్యమున సంచరించుట ఉండునె?
నాల్గు విధములైన అర్పితములలోన ఏది భరిత మనునది
ఎఱుగ నందున గుహేశ్వరలింగమందు భరిత బోనంపు
టనువు చెన్నబసవన్నకై యుండె ౧౭

**వివేచనము**

నిండైన బోనమందురు లోకులు అది చేసి అర్పించుట ఎరుగరు కాయార్పణము, కరుణార్పణము, భావార్పణము, ఆత్మార్పణము- ఇవి నాలుగు అర్పణములు ఈ నాలుగింటిలో భరితార్పణమే చివరిది దీని నర్పించు నతడు చెన్న బసవన్న ముక్తమనము, ఐక్యార్థ భావము యోగాంగ భాజనంబున అర్పించు తత్త్వానుభావుడు అని అల్లముడు కొనియాడుచు-

భూమియందు బుట్టి అంతరమున పెరిగిన ఫలవృక్షము
సర్వులకు భూతహితమై ఫలరసంబుల నీయు నీవు
భూమివై నేను సస్యమనై పెరిగిన ఉత్తేజంబున గుహే
శ్వర లింగమను ఫలమైయుండె దాని ఎఱుకయే రసమై
యుండె సంగిన బసవన్న నుండి నా యంగంబు
బయలయ్యె ౧౮

**వివేచనము**

నా భాగ్యము నేమని చెప్పికొందును? సృష్టిశో క్రించి చెట్టు పెరిగి, పైన ఫలమైనట్టుల బసవన్న భూమియై నేను చెట్టయి పెరిగి అందులకు మోహావహ మగు ఫలమిచ్చితిని అదియే గుహేశ్వర లింగము దాని నెఱిగియుండుటయే రసమై యున్నది చెన్నబసవా! మాటలు చాలవు బసవన్న నుండి బయలైతిని అని హర్షోత్సేకమున పలికి మఱియు ఇట్లనుచున్నాడు

> ఈనాడు నా తనువు శుద్ధమైయుండె బసవా!
> ఈనాడు మనము శుద్ధమైయుండె బసవా! ఈనాడు నా భక్తి
> యుక్తి ముక్తి శుద్ధములై యుండె బసవా! ఈనాడు నా
> యవియన్నియు శుద్ధములైనవి బసవా! మన ఈ గుహే
> శ్వర లింగమునకు ఆద్యాధార మైతివి కదా సంగన
> బసవన్నా! ౧౯

**వివేచనము :**

"బసవన్నా! కృతార్థుడనైతిని, బసవా! అనిన చాలును తనువు శుద్ధ మయ్యెను మనసు శుద్ధమయ్యెను భక్తియు, యుక్తియే గాక ముక్తియు శుద్ధ మయ్యెను నా తండ్రి ఈ హస్తాబ్జంబునందున్న గుహేశ్వరునకు నీవే మూలాధారమ వైతివి" అని అల్లమ ప్రభుదేవుడు పరవశుడై బసవన్నను నోరార స్తోత్రము చేసినాడు "నా యందున్న గుహేశ్వర లింగము నీ యనుగ్రహమున అనిమి షయ్యవలన దొరికె"నను విషయము, 'మొదటి ఆధారము' అను మాటకు పర్యాయ ముగా తెలుపుచున్నది గాన 'నా గురువునకు గురువవు నీవు' అని కొనియాడి నాడు ఆ సమయమున శరణ సమూహములు హర్షభరితులైనారు తమ ఆదర్శ పురుషుడు, భక్తిభండారి, భక్తికి విజయపతాక మెత్తినాడని కొనియాడినారు చెన్న బసవన్న ఆ సన్నివేశమును యుక్తియుక్తముగా ఇట్లు వర్ణించుచున్నాడు

**చెన్నబసవన్న**

> మానినికై వచ్చి నాతండు కాడు మానునికై వచ్చి
> నాతండు కాడు చిన్నమునకై వచ్చినాతండు కాడు

సమునకై వచ్చినాతండు కాడు వ్యసనంబునకై వచ్చి
నాతండు కాడు కూడల చెన్నసంగునందు భక్తి పథము
చూపవచ్చెనయ్యా ప్రభుదేవుడు. ౨౦

**వివేచనము**

అల్లమ దేవుడు వచ్చినప్పటి నుండియు అంతవఱకు నడచిన స్థిత్యంత రాంకు చెన్నబసవన్న నిర్వచనముగా శరణ సభ మెచ్చునటులు పలికినాడు ఆలకించండి మహాశరణులారా! వ్యక్తికై చరించువాడు జంగముడు శక్తియై చరించకుండువాడు జంగముడు వ్యక్తి శక్తుల లీలా వినోదప్రియుడైన జంగముడు వ్యక్తియై జగత్తునందు సంచరించుట ఎందుకనిన సంసారబంధములో నున్న జీవులకు ముక్త్యుపాయమార్గమైన భక్తిమార్గమును చూపుటకొఱకు

చూచినాము కదా-ఈనాడు అల్లమస్వామి ఇక్కడకు వచ్చి, తన పరీక్షా చక్ర వ్యూహములో త్రిప్పి త్రిప్పి కొట్టి సాధ్యాసాధ్యముల కసాధ్యమైన చిత్త విభ్రాంతిని కలిగించి, మఱల అనుగ్రహించి, జంగమ స్వామి యనునది మఱచి, భక్తులకు భక్తుడై స్తోత్రములు చేసి, భక్తిరంగముపైననే నిలబడినాడు

ఆయనకు ఏమియు ప్రాపంచికములైన వస్తువు, వనిత, బంగారము, భూములు, భోగభాగ్యములు అవసరములేదు ఆయన కోరునది ఒకటే భక్తి భిక్ష బసవన్న సర్వ సమర్థుడు పెట్టినాడు జంగముని జోలె నిండినది మా కందఱకు సంతసమైనది

చెన్న బసవన్న చెప్పినదంతయు వినినాడు బసవన్న ఆ ప్రసంగములో వెడలిపోయిన జంగముల ప్రస్తావనము వచ్చునేమో యని తలచినాడు కాని రాలేదు మఱి యెవ్వరును ఆ విషయమును ప్రస్తావించలేదు అందఱకు సంతోషము కలిగినది ఒకరి నొకరు చూచుకొనుచు బసవన్నను పొగడు చున్నపుడు, ఖిన్నుడైన బసవన్న మొదలు అడిగినట్లుగా జంగమానుగ్రహము కలుగుటకు ఉపాయమడుగుచున్నాడు

**బసవన్న .**

చంద్రుడు అమృతకిరణుడైన ఏమి ఫలమయ్యా,
లోపలి కళంకమును పీడకున్నంతవఱకు? సూర్యుడు

మహా ప్రకాశవంతుడైన ఏమి గొప్పతనమయ్యా, సాయంతనమున అస్తంగితుడను హీనభావ శబ్దము పొందకున్నంతవఱకు? ఏను మీ కృపను పొందిన ఏమి ప్రయోజనమయ్యా, మీ శరణులు నాపైన అలిగిపోయిన మీదట? కూడలి సంగమదేవయ్యా! మీ శరణుల మనము లందు నాపైన దయయుంచి వచ్చునటుల అనుగ్రహింపుమయ్యా! ౨౧

## వివేచనము

ప్రభుదేవా! విన్నపము అంతయు, సంతసము సంభ్రమము నయ్యెను ఐన, ఒకటి మాత్రము కొరతగానున్నది అమృత కిరణ చంద్రునకు ఒక మచ్చ ఎంతగానో వెలుగు సూర్యునకు అస్తంగత్వము పట్టును ఇపుడు మీ కృపాకటాక్షమున ఎంత పెద్దవాడనైనను నా మీద కోపగించి పోయిన మీ శరణుల దయకు దూరమైతిని ఏమి ప్రయోజనము? నా మీద వారికి కృప కలుగు నటులు అనుగ్రహించండి అని బసవన్న దైన్యముతో వేడుకొనగా, అప్పుడు అందఱకు జంగములు జ్ఞాపకమునకు వచ్చినారు ఇది యేమని వేసరిల్లి అల్లముడు నుడువుచున్నాడు

**అల్లమప్రభు :**

నేనను అహంకారంబున నే కుడిచియున్న నా కదియే భంగము స్తుతి నిందలకు ఉబ్బినొచ్చితినననిన ఆలు చేతి యందున్న గుహేశ్వరలింగమునకు దూరంబు సంగన బసవన్నా! ౨౨

## వివేచనము

బసవన్నా! ఇదేమి నీ సందేహము? నేను ఆరగించినది నాకై కాదు సుమా! ఆ అహంకారమునకు నేను గురికాను స్తుతినిందలు నాకు వద్దు నన్నేమి చెప్ప మనెదవు? మోదాంతములో ఈ విషాదమెందులకు? ఘనమెంచబడు వస్తువు నందు గుణముండవలె గదా?

జంగమము ఘనమందునా? జంగమము యాచించి నపుడే చిన్నదయ్యె లింగము ఘనమందునా? వడ్డించు వాని చేతిలో చిన్నదయ్యె భక్తుడు ఘనమందునా? తను మన ధనవంచకుడై చిన్నవాడయ్యె ఇటుల ఈ త్రివిధము లందు పరిణామంబు లేదు పరమార్థంబు లేదు గుహేశ్వర లింగపు ఘనము తెలిసిన వారెవ్వరు? చెప్పుమా సంగన బసవన్నా! —23

**వివేచనము.**

ఆకలికై యాచించువాడు, వ్యసనాలకై అన్యులను పీడించువాడు జంగ మేమయ్యా? ఇచ్చిన వానిని ఈశ్వరుడని ఈయని వానిని శనేశ్వరుడను వాడు జంగమువేమయ్యా? అంత ఉన్నది వడ్డెరవాని చేతిలో ఇంతలైనది లింగ మేమయ్యా? ఒకని చేతిలో చిన్నదియైనది పూజనీయ లింగమేమయ్యా? (గురు సంస్కారము లేని లింగ పీఠము) భక్తుడు వంచకుడు తను మన ధనములను గురు లింగ జంగ మార్పణమని సాష్టాంగ నమస్కారము చేయుచున్న వాడు తానంత ఏదియు నీయడు ఇట్లు జంగముడు, లింగము, భక్తుడు ఈమూటిలో ఏ పరమార్థమును లేను ఊరకనే నీవు పోయిన జంగముల భ్రాంతిచే వ్యథపొందుచున్నావు అని అల్లముడు ఖండతుండములుగా జంగములతో బాటు లింగభక్తులను తునుకలై పడునట్లు మాట్లాడినాడు

సమాధానములో నున్న వాతావరణములో మరల ఈ జంగమ వివాద మను మమ్ము లేచినది బసవన్న ఆ సన్నివేశమును జూచి ఆతురముతో విమర్శిం చిన అల్లమునకు వినయముతో ఇట్లనుచున్నాడు

**బసవన్న:**

కులము చూడక, ఛలము చూడక, నిలుకడ చూడక కూడిన పిదప అక్కడ ఎక్కువ తక్కువ లెంచుట ఉన్నదే? ముందుగాని జంగమంబునకు మీ కారుణ్యా ముపదేశము చేసిన పిదప వచ్చినది వచ్చినట్లు సరిబెట్టుకొనవలె కాని, అట్టిటు లనరాదు వినుమయ్యా!

నీవు నిరాకార సాకారాములను రెండుమూర్తులను దాల్చి
యుంటివి కాన, ఒక దానిని నిందించి మఱొండు పట్టితి
ననిన అదియే కొరత సుమా! ప్రభురాయ! కూడల
సంగమదేవా! ౨౪

**వివేచనము**

కులఛలాదులు, వారి నీతిరీతులు చూడక ఒకటి అయిన తదుపరి అనుకొనుట కేమున్నది స్వామీ! జంగమమునకు మీ కారుణ్యోపదేశమైనది. ఇపుడు నిట్లు సమరించుకొనవలెను అది ఇది ఇట్లని తప్పుంతడక అల్లిన మనకే అర్థమగును. అయ్యా! తమరు నిరాకారులు, సాకారులును రెండుమూర్తులైనవారు, ఒక దానిని కాదని మఱియొక దానిని పొగడుట తమకు చెల్లునా? అది యొక లోపము కాదా? అని మెల్లగ లేచిపోయిన సాకారమూర్తివి నీవే ఇక్కడ నున్న నిరాకారమూర్తివి నీవే యన్నటులు సాకార నిరాకారతత్త్వము ప్రస్తావించ బసవన్న మెత్తగ అల్లమునకు బుద్ధివాదము చెప్పినది వినిన అల్లముడు దానికి సమాధానము చెప్పుటకింత మేలైన ఉదాహరణ లేదని తెలిసియున్నను ఇట్లు చమత్కరించుచున్నాడు

**అల్లమ ప్రభు :**

ఆకార నిరాకారములను రెండును నేనే ఔనౌను
తప్పదు వినుము ఆకారంబునకు భావమే ప్రాణము
నిరాకారంబునకు మహాజ్ఞానంబె ప్రాణము ఇటుల ఉభయ
స్థలంబులకు ఇది లక్షణము వినుమా! రెంటియందు ఏ
ముఖంబున నున్నవాడు ఆ ముఖంబున శుద్ధుడై యుండ
లేనంతవఱకు గుహేశ్వర లింగమునకు దూరంబు సుమా,
సంగన బసవన్నా! ౨౫

**వివేచనము .**

బసవేశా! నీవు చెప్పినది నిజము నిజము ఆకారముగా ఆవిర్భవించిన ఈ విశ్వమంతయు నేనే ఇదేమియు కాక నిరాకారము గైకొని బయలై యుండు వాడను నేనే అగుచో, ఈ రెండును ఒకటియే అయినను దాని దాని ఆవిష్కారములకు భిన్నతలున్నవి కనబడు ఈ సముదాయ ఆకారగుణ విశిష్ట చరాచరము

లకు భావమే మూలము దానిలో సంకల్ప వికల్పగుణాలనుండి ఇచ్ఛాజ్ఞానక్రియా శక్తులు విజృంభించును నిరాకారమునకు మహాజ్ఞానమే మూలము కనబడునది చూడబడునది రెండును తానరానివయి, కానని బయలుగా మారి, క్రియారహితమై, నిర్వయలై, నిజములో లయమగును ఇవి రెండు సాకార నిరాకారతత్త్వ లక్షణములు

దీనిలో గమనింపతగినదే మనిన - సాకారము కొనినపుడు దానికి తగిన విధ్యుక్త ధర్మములను అవధానముతో నెరవేర్చ వలయును నిరాకారములో నున్నపుడు దానికి తగిన నిశ్శూన్య మందుండి పరిగణించుటకు ఏ ఆధారములు లేకయుండవలయును ఇయ్యది నాటకములో పాత్ర పోషణమున్నట్లుండును ఏ పాత్రయుకాని ఔచిత్యమును మరచిన రసభంగమగును ఇప్పుడు జరిగినది నీవు ఆరాధించు జంగముల ప్రవర్తనము ఉచితమా? అని అల్లమస్వామి నిశిత విమర్శతో ఖండించినప్పుడు బసవన్న తనలో తాను నవ్వుకొని ఇట్లనుచున్నాడు,

**బసవన్న :**

> తెలివిలేని కాయమున్నదే? తెలివిలేని ప్రాణము న్నదే? తెలివిలేని నిలవు (స్థితి) ఉన్నదే? భావంబు లేని శక్తియున్నదే? కూడల సంగమదేవా! మీరు పరిపూర్ణులై యుంటిరి అవగుణంబునకు తెరవులేదు ( ౨౬ )

**వివేచనము :**

మహాస్వామి! విస్తారముగ తమరు సెలవిచ్చినది నిజము ఎఱుకలేని కాయముకాని ప్రాణముగాని ఉండుటకు సాధ్యమున్నదా? ఆ ఎఱుకయే తమరు కదా! అన్నపుడు అయినదంతయు తమరుకాక వేరు లేకున్నప్పుడు ఏదియై దేనిని ఆక్షేపించుచున్నారు? ఆ యాక్షేపణమునకు మీరే గురికదా? ఎందుకన, మీరు పరిపూర్ణులు అసంబద్ధ అవివేకములు ప్రస్తావించుటకు అవకాశము లేదు

పరిపూర్ణ తత్త్వమును ప్రస్తావించి నేరముగా బసవన్నగారు అల్లమ దేవునిపై విసిరిన వలలో అల్లముడు చిక్కుకొన్నాడు అదియుగాక ఇదియొకటే అయినవాడు అదియనుదానిని విమర్శింపవచ్చును అది - ఇది రెండూ అయిన వాడు అట్లనుటకు రాదు అని బుద్ధివాదము చెప్పినటులైనది అప్పుడు అల్లముడు "భక్తిలో ఎంతటివాడో యుక్తిలోనూ అంత పెద్దవాడు బసవన్న" అనుకొని నవ్వుచు ఇట్లనుచున్నాడు

**అల్లమ ప్రభు :**

ఔనౌను బసవన్నా! నీవన్నది కాదనతగునే? నా
మనసు నలుపు (చీకటి) తుడిచి, నిర్లేపనముచేసి, నన్ను
నిరవయవమందు (బయలు) నిలిపి ప్రతిష్ఠ చేయువాడు
నీవనుట సత్యము గుహేశ్వరుని మహాగణంబు లున్న
చోటునకు పోయి తెలుపుకొని రావయ్యా సంగన
బసవన్నా! ౨౭

**వివేచనము :**

కాని- సంతోషము నీది పరుష వాక్కు కాదనుటకు ఎవరికి సాధ్యమయ్యా బసవయ్యా? నీవలన నా మనసులోని మబ్బు తెగెనయ్యా! లేపనము లేక నిరవయలులో నన్ను బట్టి స్థాపించు ప్రాణప్రతిష్ఠాపనాచార్యుడవు నీవు. నీ యిష్టము. పోయి గణంబుల పిలచుకొని రమ్మని అని అల్లమయ్య మందహాసముతో అనుజ్ఞనీయగా బసవన్నకు మహదానందమైనది వెనుకనే అనుమానము వచ్చినది అలిగిన ఆ జంగముల నెట్లు సమాధానపఱచ వలయునో చెప్పవలెనని అడుగగా "ఎడమ కాలితో తన్నినపుడు కుడికాలు పట్టుకో కుడికాలితో తన్నిన ఎడమకాలు పట్టుకో త్రాహి త్రాహి తప్పునాదియని ఒప్పుకొని రమ్మని" అని బాలపాఠమట్లు బసవన్నకు నేర్పినాడు ఈ పెద్దవారి రసభరిత వినోదములు అర్థము చేసికొనుటకన్న ఆయా రసాభినయమునకు ఆనందము చెందుటే సముచితము

బసవన్న మహా చతురమతి "పోయినది - ఇక్కడున్నది - ఈ రెండును ఒకే వస్తువే ఇక్కడున్నది ఏకము అక్కడనున్నది అనేకము ఏదియో అవస్థపడి ఏకమును పఱచడమైనది అనేకమును తృప్తి పఱుమటెటులో! నాకా స్వాతంత్ర్యమెందు"కని ఏకమునే అడిగి నిశ్చయ చిత్తుడై లక్ష తొంబదియారు వేల జంగములున్న చోటునకు వచ్చి సాష్టాంగ నమస్కారము చేసి వినమ్రుడై విన్నపము చేసుకొనుచున్నాడు.

**బసవన్న**

తొత్తుకు తొత్తు మఱి తొత్తు మీద కోపించుట మీకు
గుణమే అయ్యా? మీ ధర్మంబు వాడనేనయ్యా! వెను
వెంటనే కృపజేసి కరుణించగయ్యా! కూడల సంగమదేవా,
ఎలుకకు భయపడి ఇల్లు కాల్చుకొను వారుందురా? ౨౮

**వివేచనము :**

"అయ్యా! జంగమోత్తములారా! తప్పు చేసినను, ఒప్పు చేసినను నేను మీ ధర్మమున్నకు చెందిన వాడను వెనుక ముందు చూడక నా తప్పు క్షమించండి. నేను మీ తొత్తుకు తొత్తును స్వామి మన్నించిన మాత్రము నేనుండుట సార్థకము. అయినది యేదో అయినది మీకు తెలియని ధర్మరహస్యములు లేవు ఇంటిలో నున్న క్షుద్రమైన ఎలుకకు భయపడి ఇల్లు కాల్చుకొనుదు రేమయ్యా?" అని వినయ విధేయతలతో ముకుళితహస్తుడై బసవన్న జంగములను వేడుకొనినపుడు సమాధానముగా ఎవరును మాటాడలేదు వారి పరముగా సొడ్డళ బాచిరాజు ఇట్లను చున్నాడు.

**సొడ్డళ బాచిరాజు :**

పట్టు విడిచిన మీద అట్టులే యుండవలయును గాని
పట్టు తప్పిన వస్తువును వెదకి పట్టగలరె? కినుకతోడ
పూవుతో విసరికొట్టి ఏనుగు నెక్కించెదననిన శివశరణుల
మనసు సైరింపదు సుమా! పగిలిన ముత్యంబు నాణ్యంబు
నకు రాదు విరిగిన పాలు అమృతంబు కాదు మేమెందు
కయ్యా మీకు? అనుచు సొడ్డళుని శరణులు నిరూపణమీయ
పరమారాధ్యులు సంగిన బసవన్న తెలుపుచుండె ౨౯

**వివేచనము .**

క్షుద్రులేనిది ఇపుడెందులకు? కోపముతోనుండి పూవుతో విసరిగొట్టి ఏను గెక్కించెదనన్నట్లున్నది ఇది మొదటి నున్నటులున్న చాలు నీ గౌరవాదరాలు, విన్నపాలు ఎవరికిని ఆవసరము లేదు ముత్యము పగిలిన పనికిరాదు పాలు విరిగిన, అమృతమగునా? మేమెందుకయ్యా మీకు? అని అనుచున్నారను జంగమాభి ప్రాయమును సొడ్డళుడు తెలుపగా బసవన్న ఖిన్నుడై విన్నవించుకొనుచున్నాడు

**బసవన్న**

ఎడమ పాదముతో తన్నిన కుడిపాదము పట్టెద
కుడిపాదముతో తన్నిన ఎడమ పాదము పట్టెద త్రాహి
త్రాహి తప్పు నాది క్షమ మీది కూడల సంగమదేవా!
మీ కరుణకు పాత్రుడను నేను ౩౦

**వివేచనము :**

"మీ పాద సన్నిధానమందుండు సేవకుడను నేను ఏ పాదశిక్ష ఇచ్చినను తాళుదను మీ కరుణకు దూరమై బ్రతుకజాలను స్వామి! తప్పంతయు నాది క్షమాపణమంతయు మీది మీరు కరుణింపక పోయినచో నే నెక్కడుందును? మీ బిడ్డను ఎక్కడనో యుండిన నేను మీ పితృవాత్సల్యమునకు కొరత యుండును కదా!" అని సాష్టాంగ ప్రణామము చేసి బసవన్న వేడుకొను చుండగా, అల్లముడు తృప్తుడై యుండినపుడే జంగములును తృప్తులై యున్నారు దానిని కొంత దాచి మర్యాద పూజ్యత ఆక్షేపము లెత్తిరిగాని కొనవలకు తృప్తిని దాచుటకు సాధ్యము కాలేదు ఒకరైన తరువాత మఱొకరు లక్షతొంబదియారు వేల జంగముల త్రేన్పులు బయటపడినవి అందఱు బసవన్న భక్తిలో నున్న సాకార నిరాకారములను తృప్తిపఱచిన మహిమను కొనియాడుచుండ చెన్న బసవన్న చాల సంతసమొంది ఇట్లనుచున్నాడు

**చెన్న బసవన్న**

ఎవరికి కలుగునయ్యా సద్భక్తి యన్నది? ఎవరికి తెలియునయ్యా శివజ్ఞానము జాడ? పరిశుద్ధ సింహాసనము మీద నిరవయంబు వచ్చి కూర్చొన్న ఆ నిరాకార పదార్థంబర్పించి ప్రసన్నత చెందె సాకార సింహాసనము మీద మూర్తిగొన్న సంగమనాథుడు కోపించి పోయిన, తనువునందు తనువై జొచ్చి మనమునందు మనమై, భావ మందు భావమై వేధించి, శివశరణుల మనసులోని అస మత్వమును తుడిచివేసి, తనయట్లు చేసికొని ప్రసన్నతను పొందె ఇటు లీయుభయనిర్ణయములందు నిస్సీముడయ్యె కూడల చెన్న సంగమ దేవుని శరణ బసవనికి త్రిజగము లందు ఎవ్వరిని సరిజూడను ౩౧

**వివేచనము**

ఆహా! మహదానందము మహిమాన్వితము ఇట్టి సమన్వయభక్తి లోక ములో ఎవరికి కలుగును? ఎవరికి శివ జ్ఞానంబు తెలియునయ్యా? నిరాశ (శుద్ధ మైన) సింహాసనమున ఆసీనుండైన నిరాకారమును, తదంశ సంభూత సాకార మును సమాధానము సేయువారెవరు? లోకమున సాకార నిరాకారములనుబట్టి తెగలై గుంపుగూడి శాస్త్రములు వ్రాసుకొని తమ తమ మతమే శ్రేష్ఠమని వాదు లాడుచున్నారు వారికి ఈశ్వరునిగుఱించిన తెలివి లేదు అతని సాకార నిరా

కారముల వివేకము లేదు మహాప్రజ్ఞాన సద్భక్తి భండారికి బసవన్నకు గాక ఇతరులకు తెలియదు నిరాకారమున కర్పించు ప్రసాదముగా అహంకారమమకార ములను అర్పించినాడు ఇది భక్తులైనను అందలకు అందనిది ఈయవచ్చును ఎంతటి ఘనమైన దానినైనను ఈయవచ్చును తుదకు తనను తానే అర్పించుకొన వచ్చును ఐన, 'అర్పించితిని' అనుకొనకుండుట బసవన్నకే సాధ్యము

నిరాకారమును సాధించుటకు సాకారమే ఉపాసనీయము లక్ష తొంబది యారువేల జంగమారాధనము చేసినాడు సాధించినాడు నిరాకారము సాకారము ఒక్కటైనను ఒకేసారి చూచుటకు సాధ్యము కాదు నాణెమునకుండు రెండుప్రక్క లను ఒకేతూరి చూచుటకెట్లు సాధ్యముకాదో అటులనే సాకార నిరాకారములను చూచుటకు వీలుకాదు సాకార నిరాకారములు ప్రత్యేకములు కావు నాణెమున కీప్రక్క చూచిన అది సాకారము ఆ ప్రక్క (రెండవవైపు) నిరాకారము అనిన అక్కడ ఏమియు ఉండదని అర్థము కాదు కనబడదనియే తెలియవలెను. ఆ ప్రక్క పరికించినపుడు ఈ ప్రక్క నిరాకారమగును దృష్టి కందినదే సృష్టి అందనిదే బయలు ఈ రెంటి సమ్మేళనము లేక ఆకారము లేదు జీవి తనను తాను చూచుకొనిన కనబడనిది ఎంతయో తనువులో నుండును

ఈ తత్త్వమెఱిగి, సాధించి, లోకానుభవమున కిచ్చిన బసవన్న ఎంత పెద్దవాడో చెప్పుట కలవికాదు అని చెన్నబసవన్న వివిధ రీతుల వర్ణించగా శరణులు ఉత్తేజితులై, మడివాళ మాచయ్యగారు, హడపదప్పన్నగారు, నాగాయి అక్కమ్మగారు, సొడ్డళ బాచిరాజుగారు, బహురూపి చౌడయ్య (ఈయన ప్రసిద్ధ ఏకపాత్రాభినయములతో శివ శరణుల విషయములు, చరిత్రలు ప్రచారము చేయుచు, విడంబనాభినయముతో సంతసింపజేయు సుశిక్షితుడైన అభినయ కళా కారుడు అతడు ఆ కాయకమునే చేయుచుండెను), కక్కయ్యగారు మోళిగయ్య గారు, ఏకాంత రామయ్యగారు శంకరదాసిమయ్యగారు, మేదార కేతయ్యగారు మొదలైన శివశరణులు ప్రార్థనలు చేసి శరణార్థు లర్పించినారు

— o —

ఇది కృపామూర్తులైన శ్రీ మృత్యుంజయప్పగారిని స్వప్నబోధామూర్తు లైన శ్రీ ఎఱ్ఱి తాతయ్యగారిని స్మరించి, సకల శివశరణులను వందించి శూన్య సంపాదనలోని 'ప్రభుదేవుని ఆపోశనము'నకు సంగ్రహముగా చెప్పిన వ్యాఖ్యా నము సంపూర్ణము

— o —

శ్రీ గురు బసవ లింగాయ నమః

# శూన్య సంపాదనము

## శరణుల అవసాన పరామర్శ

### ౨౦

కం॥ సంగన బసవన్నకు ఘన
లింగముతో కూడుటయును నితర శరణులకున్
మంగళ మవసానము ప్రభు
పుంగవుడు పలికిన నంత్య బోధలువినరే!

(సిద్ధ వీరన్న ఒడయుల గద్యము)

"ప్రభు దేవులు అందఱు గణములు తమ్ము స్తోత్రంబు జేయుచుండ ఆ ప్రభు దేవులు ఉత్తగా స్తోత్రంబు జేసిన ఫలమేమి? నిశ్శబ్ద బ్రహ్మము మాటల మథనంబునకు సాధ్యమగునే? అయ్యా అమరులారా! ఆదియందు పరశివుని సద్రూపమైన స్థూలతత్త్వమె మర్త్యలోకపు మహా మందిరము నుద్ధరించుటకని రుద్రగణ పమథ గణంబులు మొదలైన సమస్తగణ నికర సహితమై వచ్చి కల్యాణ కటకమును శివపురంబుజేసి రుద్రగణాది ప్రమథ గణమును అసంఖ్యాకులని పేరు బెట్టి పిలిచి, శివాచార ధ్వజంబు నెత్తి, శక్తికులస్థలంబుల శ్రుత దృష్టపవాడంబులు (అద్భుత కార్యములు) జూపి, శివలోక మర్త్యలోకంబు లకు తానె నిచ్చనై (స్థిరముగా) మెరసి మర్త్యమును పావనంబు జేసిన తరువాత ఇంక మర్త్యము హంగెందుకు? తనిరసంబు (మృదుమధురమైన రసము) నిండిన ఫలముతోడనే తొడిమె వదలిపోవునట్లు, వచ్చిన కార్యంబు పూర్ణమైయుండె చూడరే! అసంఖ్యాకులు ఇక మిమ్ము మీరే తెలిసి నిరాళమందు (ప్రశాంతతలో) నిజంబు కనుడు చచ్చువఱకు సామునేర్చిన అని సలుపుట ఎన్నడు? అని ప్రభు దేవుడు తమ అవతారపు అవసానము నిరూపించు ప్రస్తావన వచనము"—

**అల్లమ ప్రభు**

చచ్చువఱకు సాధన చేయుచుండిన కదనంబు
చేయు దినమేది? బ్రతికినన్ని నాళ్ళు భజియించుచుండిన
తానగు దినమేది? అర్థమున్నంతవఱకు తెలుసుకొను
చుండిన నిజము కాగల దినమేది? కార్యంబునకు వచ్చి
కార్యమయిన మీద ఇంక మర్త్యలోకంపు హంగు
ఎందుకు? తనిరసము (మృదు మధురమైన రసము)
నిండిన అమృత ఫలమాక్షణమె తొడిమె విడచు చూడరే
దృష్టాంతము బసవన్న, చెన్న బసవన్న మొదలైన
ప్రమథులు గుహేశ్వర లింగమందు నిజము పొంది
నిశ్చింతులై యుండుదయ్యా! ౧

**వివేచనము :**

“అయ్యా సత్య శరణులారా! ఇక లోక కార్య రంగమునకు విరామము మరణ పర్యంతము శస్త్రాభ్యాసము చేయుచుండిన కదన రంగములో పోరాడి జయము పొందు దినమేది? శివ శివా, హరహరా యని భజన చేయుచునే యున్న తాను శివుడగు దినమేది? ఈ పదమున కిది యర్థము, ఈ వాక్యమున కిది యర్థము అని శాస్త్ర కావ్య పురాణముల వివిధార్థములలో మునిగిపోయిన విజ్ఞ మునులు కనుగొను దినమేది? ఎవరెవరు ఏయే కార్యముల కొఱకు ఈ మర్త్యభూమికి వచ్చిరో ఆయా కార్యములైన పిమ్మట ఇక్కడ ఉండవలసిన పని యేమున్నది? చెట్టు నుండి మాగిన పండు క్రిందకు రాలు విధానము సృష్టి జీవులకు చూపుచున్నది చూచినారు గదా! చేసినారు గదా! అనుభవించినారు గదా! ఇక మీ మీ పూర్వ నివాసములకు వెళ్ళండి బసవన్న, చెన్న బసవన్న గార్లు! దయచేయుడు పరిపక్వ కాలము వచ్చినది” అని అల్లమ స్వామి ఆవేశమీయగా బసవరాజు తమ పూర్వ నివాస మెక్కడ, తమ లింగాంగ సామరస్యమెట్లని అడుగుచున్నాడు

**బసవన్న :**

దేవ దేవ! మహా ప్రసాదము అవధారు దేవా,
నాదు విన్నపము కాయమాయంపు పంజరమున పుట్టించి
తిరి నన్ను అది మీ లీలా వినోదము

ఆ కాయి మాయంపు తలంగిల్లి (తొలంగిపోయి) శ్రీ గురుని కారుణ్యము జేసి గురు లింగ జంగమములను త్రివిధ భక్తి ఘనంబు జూపి, మీ పాదోదక ప్రసాద మిచ్చి రక్షించితిరి అది మీ లీలా వినోదము.

పరవాది బిజ్జళుడు గీటురాయిగా (ఒరిపిడిరాయి) మున్నూట అరువది చచ్చిన ప్రాణులనెత్తి ముప్పదియారు కొండెములు పరిహరించి, ఎనుబది యెనిమిది పవాడములు (అద్భుత కార్యములు) మెరయించితిరి అది మీ లీలా వినోదము

నా మనఃకల్మషము కడుగవచ్చి, శూన్య సింహాసనమందు ఆసీనులై మీ నిజ మహిమ మెల్ల ప్రమథుల ముందు జూపి నన్ను పావనంబు జేసి షట్స్థలంబును నా సర్వాంగమందు ప్రతిష్ఠించి, నన్ను మీయటుల జేసితిరి అది మీలీలా వినోదము

కూడల సంగమదేవా! నాదుమర్మంపు కీలు మీ రెఱుగుదురు గాన, నాకొకసారి ఎఱుక పఱచి నన్నుంచు కొనుమయ్యా! ప్రభుదేవా! ౨

**వివేచనము**

పని ముగిసినది పొమ్మని సెలవిచ్చినారు పోవుట ఎక్కడకు? నా కోర్కె మునకై నేను వచ్చినవాడను కాను కార్యమున్నది, ముగిసినదియు తెలియదు ఇపుడు తాము చెప్పినప్పుడు తెలియవచ్చినది మీరు మీ కార్యాతురమున మాయా మనోహరమున పుట్టించితిరి తరువాత మాయకాయముల భ్రాంతులను గురు కృపచే పరిహారము చేసితిరి బిజ్జళ భూపాలుని పరీక్షలో పవాడములు (అద్భుత కార్యములు - చోద్యములు) మెఱయించితిరి ఈనాడు కరుణించి దయచేసి శూన్య సింహాసనమెక్కి మహిమతో సకల శరణుల నలరింపజేసితిరి షట్స్థలములను నా సర్వాంగము నందు నిలిపితిరి ఇదంతయు మీ విలాసము మీ మహిమ మగాధము సర్వస్వతంత్రులు మీరు లోకనాటక సూత్రధారులు ఆడిన ఆటల మరు

గుని మీరుంటిరి మీరాడించి నట్లాడిన బయటి బొమ్మను నేను ఎక్కడకు వెళ్ళుట? చెప్పండి ఎక్కడ ఏమయి ఆడుట అనునది మీకు తెలియును కరుణించి మీ వానిగా దగ్గఱ నుంచుకొమ్మని వేడెదను

బసవన్న వినయవివేచనతో కార్యాంతరమున వెళ్ళవలసిన చోటేలేదని అల్లముని అడిగినాడనగా బసవన్నకు తన మూలస్థానమే తెలియదా అనినట్లు అర్థమగును తెలిసియుండినను మఱి యే కార్యములున్నవో? లేవో? యజమాని కెఱుక ఉండవలసిన తావును ఆయననే అడుగుట ఉచితమని యెంచి బసవన్న అడిగినప్పుడు అల్లముడు ఇట్లనుచున్నాడు

**అల్లమప్రభు .**

కాయంబులోపల కాయమై, ప్రాణంబు లోపల ప్రాణమై, మనంబు లోపల మనమై, భావంబు లోపల భావమై, జ్ఞానములోన జ్ఞానసారమై అజ్ఞానము తోడి మోసంబులేక నిజపదంబు సాధ్యమైన మీద,ఏది మర్మంబు? మఱేది కర్మంబు? ఎయ్యది బోధ? ఎయ్యది సంబంధము? అని నే చెప్పలేదు నీవు వినలేదు అదేమి కారణంబన అడుగుటకు తెరవు లేదుగాన గుహేశ్వర లింగమందు లోన బయలన్నదేది చెప్పుమా బసవన్నా? 3

**వివేచనము .**

ఇదేమి! బాలపాఠము మొదలు పెట్టితివి గదా బసవన్నా! విద్యార్థి దశ దాటి సిద్ధార్థ దశలో నున్న నీ పారమార్థిక దశను మఱచితివా? అది కార్యావసానమున కార్యారంభమా? ఇది బాగున్నదయ్యా! కాయప్రాణ భావములు జ్ఞానము ఏకమై ద్వంద్వముకాని నిజపద సిద్ధి దొరకిన మీదట గురుశిష్యులు, పాఠశాల పాఠములు ఉండునా? పరీక్షలుండునా? ఏటిమాట బసవన్నా? మఱి ప్రౌఢస్థితిని మఱచి తల్లిపాలకై శిశువయ్యెదవా? నే చెప్పుటయు లేదు నీవు వినుటయు లేదు బోధబాధలన్నియు సమసిపోయినవి ఇంకేమిటికి బోధ? లోబయలు లన్నవే లేవయ్యా! అని అల్లముడనగా బసవన్న ఇట్లనుచున్నాడు

**బసవన్న** •

ఎఱిగితి ననిన ఎఱుక కసాధ్యంబు స్మరించెద ననిని స్మరణమున కసాధ్యము భావించెదనిన భావంబున కసాధ్యంబు వాఙ్మానసముల కగోచరమగు లింగమును తెలియు రీతి ఎట్లయ్యా! గురువు చూపనంత వఱకు? గురు శిష్యుల మధనమందు స్వయం జ్యోతిర్లింగము పుట్టునన్న శ్రుతి వాక్కు కలదే? కూడలి సంగమదేవా! మీ మహాను భావుల మధనంబు నుండి నా యందు నిజము నిలుకడ జేయుమయ్యా! ప్రభుదేవా! ౭

**వివేచనము**

పరతత్త్వము ఎట్లు తెలియును? తెలివికి అందనిది ధ్యానమునకు, భావము నకు, వాక్కునకు, మనమునకు అగోచరము గురువు చూపించెడు వఱకు ఎంత వారికైనను తెలియదు గురు శిష్యుల మధ్య మథనముచే జ్యోతిర్లింగమును కను గొన నగును అనునది శ్రుతివిదితము చేయు మాట అబద్ధమా స్వామీ? మీ మహా నుభావుల కృపచే నాకు నిజము పొందు మార్గమును వివరించుమయ్యా! అని బసవన్న అడిగిన మాట వింతగా నున్నదనుచు అల్లమయ్య అనుచున్నాడు

**అల్లమప్రభు**

మథనపు లీల యందు బుట్టునే బ్రహ్మంబు? శ్రుతి స్మృతులకు అలవికానిది సుమా! పృధ్విలో లేని అచల మగు లింగము సచరాచరంబు నిండియుండు నెట్లు? లేని లింగమును అక్కడ అక్కడ ఉన్నదను లింగపువార్త! గుహేశ్వరుడను లింగము సాధ్యము కాదయ్యా, సంగన బసవన్నా! ౮

**వివేచనము**

బ్రహ్మమెక్కడ? మథన మెక్కడ? మథించు నపుడు పుట్టునది అగ్ని విషయము నుండి మాట, మాట నుండి అర్థము, అర్థము నుండి వాద వివాద ములు పుట్టును ఇవి యన్నియు పదార్థజనితములు శబ్దసంజనితములు వీని

నుండి ఏర్పడు కాని బ్రహ్మము పుట్టుననుట తథ్యముకాదు ఏదియో అనుకొని జీవులకు సమాధానము చెప్పుకొనుట కగుమాటలు! ఇప్పుడున్న లింగము విశ్వములో ఎక్కడ ఉన్నది? లేని లింగమును ఉన్నదనియు, అది పూర్ణముగా సచరాచరమై యుండెననుటయు ఒక వెఱ్ఱినమ్మకము కదా? ఉపాసనలకై భక్తులు ఆరాధించునవియెల్ల దేవతలై యున్నారనుట, గుణాకార విశిష్టతల కల్పనలు, బ్రహ్మంబగునేమి? బసవయ్యా! కావున శ్రుతి స్మృతులకు అగోచరంబైనది, ఏ వస్తువుకానిది ఎట్లుచెప్పుట? తెలియుట ఎట్లు? అని అల్లముడు లింగమే పృథ్వియందు లేదనుభావనముందుబెట్టి ఉపాసనము కల్పన మని, అసలు లింగమునకే తెగతెంపులతో గర్హించి ఎసరు పెట్టిన అల్లముని మాటకు బసవన్న ఇట్లనుచున్నాడు

**బసవన్న**

ఎఱుకతో ఎఱిగితిననిన ఎఱుకకు అసాధ్యంబు ఎరుగక ఎరిగిన విధం బెట్టిదయ్యా? భావించి పొందగలననిన భావము నిర్భావమన్నది కావున మఱల భావింపకుండిన కానరాదయ్యా! అవాఙ్మానసగోచరమనినచో మాటాడకుండిన నడతకు సాధ్యమగు తెరగదెట్టిది చెప్పుమయ్యా! పలుకుల రీతి (తత్త్వసారము) ఒకటే అనిన మాటను గిడణంబు (సమూహమునందు) నందు నిజం బెఱిగిన వారు ఎవరు చెప్పుమయ్యా! మీ మాట పరతత్త్వంబు ఒకటికాక రెండుగా నున్నవే? కూడల సంగమ దేవా! కడముట్టి జూచిన మాట కెడ లేదు కృపచే కరుణింపుమయ్యా, ప్రభురాయా!

**వివేచనము**

ప్రభుదేవా! జ్ఞాన, భావ, మనో వాక్కులకు అగోచరంబు బ్రహ్మంబనిన కనుగొను మార్గమేది? ఏమికానిదియు, దేనివలనను తెలియదనిన, దానివలని ప్రయోజన మేమిటి? స్వామి! అది యంతయు అటు ఉండనిండు ఇది యంతయు చెప్పిన వారికైనను తెలిసియుండవలయును గదా! ఆ బ్రహ్మమే తనంతట తాను లోకమునకు తెలియజేసికొనినదా? తెలిసినవారుండిన ఇతరులకు చెప్పి చూపలేరా?

తెలియవలెనని సాధన చేసిన వానికి తెలియదా? అంతయు బ్రహ్మస్వరూప మను మాట ఉన్నది, దాని యర్థమేమి? మాటలవలని ప్రయోజనము లేని తెలియుట ఎట్లు? ఎన్ని మాటలాడినను కొనకు నిజమొకటే నిలచును మీరాడుమాట పర తత్త్వమేగాని, పనికిమాలిన మాట యగునె అయ్యా! సంగయ్యా! కొనకు వచ్చి నపుడు మాటకన్న మీ కృపయే ధన్యత కూర్చునది అని బసవన్న సద్విచార వినయ వివేకంబుతో విన్నవించుకొనిన రహస్యము అల్లమస్వామి కనుగొన్నాడు

అది ప్రాణ లింగము విషయమే తన అరచేతిలో నున్న గుహేశ్వర లింగము అతనిదే పూర్వము కైలాసములో వృషభుడైయుండి ఒకనాడు విహార మునకు పోయినపుడు ఒకచోట విపన్నావస్థలో నున్న యొకనిని చూచినాడు అతడు దప్పిచే బాధపడుచుండగా, నీరు దొరకినను కాని త్రాగవలె నిన లింగ దర్శనము కాక త్రాగరాదు ఆ లింగము బహుదూరములోని బిడారములో పెట్టెలో నున్నది అవసరమునకు కానిదైనది వేటకై వచ్చిన వసుషేణుడనెడి చాళుక్య వంశపు శ్రీమంతుడాతడు నీరు లభించినను లింగ దర్శనము లేక చచ్చుటకు సిద్ధముగానున్న ఈతనికి వృషభుడు తన లింగమును చూపినాడు ఆయన చూచుటయేకాదు లింగమును తీసికొనినాడు అన్నిటిని మఱచి వసుషేణుడు సమాధిలో మునిగినాడు లింగమీయలేదు తిరిగి వృషభుడు కైలాస మునకు పోవగా ద్వారపాలకులు లింగమును చూపుమనినారు వృషభుని దగ్గర లింగము లేదు శివుడు ఇది యంతయు విని, నీ ప్రాణ లింగమును తీసికొని రమ్మని పంపగా భూలోకమునకు వచ్చి బసవన్నయైనాడు ఆ వసుషేణుడు వృషభుని ప్రాణ లింగ మహిమ వలన భూమిలో మరుగైయున్నప్పటికిని బ్రతికియేయుండెను అతడే అనిమిషుడు అతని దగ్గఱనుండి తీసికొనినదే అల్లమయ్య చేతిలోని గుహేశ్వర లింగము ప్రమథులు శూన్య సంపాదనమును సంగ్రహించిన విషయమును శివగణప్రసాది మహాదేవయ్య చెప్పగా ఇతరులు ముగ్గురు హాలగి దేవుడు, గుమ్మళాపురము సిద్ధలింగదేవుడు, ఈ సంపాదన కర్త సిద్ధవీరన్న ఒడెయుడు- ఈ ప్రసంగమును సూక్ష్మముగా వివరించి సమన్వయము చేసినారు

ప్రాణలింగము మతొకరికి ఈయరానిది ఇది జ్ఞానమనియు, ఆత్మ యనియు, జంగమమనియు, మనసనియు, సూక్ష్మ శరీరమనియు పర్యాయ పదములతో సమయానుసారముగా అర్థ విన్యాసమునకు వాడబడుచున్నది ఈ ప్రాణలింగ ప్రతీకయే స్థూలాంగ మందు ధరించిన ఇష్ట లింగము దీనిని క్రియా లింగమనియు, ఆచార లింగమనియు చెప్పుదురు దీని యవసరము శివాద్వైత శాస్త్రరీతిగా ప్రాణములోని చంచలత, అనిశ్చిత దోషములు నివారణ కావలెననిన ఇష్టలింగోపాసన నుండియే యని నిర్ణయించి, శ్రీ గురువు లోపలనున్న ప్రాణ లింగము (జ్ఞాన లింగము) క్రియా లింగముగా హస్త మస్తక సంయోగముచే అంగముపైనుంచునది యని లింగవంతుల సిద్ధాంతము ఇష్టము (క్రియ) నుండి ప్రాణము (జ్ఞానము) నిశ్చలమైనపుడు కారణ శరీరమని పిలువబడు భావము సంకల్ప వికల్పముల ఉత్పత్తి రహితమై తృప్తిచెంది, తననుతాను తెలిసికొని ముక్తియగుననను నమ్మకమే వీరశైవ మతమునకు ముఖ్యము

వసుషేణునకు వృషభుడిచ్చినటులే, కూడల సంగమ క్షేత్రమున వృష భేశుడు కల్యాణమునకు బసవన్నను పంపునపుడు నాలుక నుండియే లింగ మిచ్చెను ఆ కాలములో లింగము (ఇష్టలింగము) నోటిలో నుంచికొని యుండుట ఆచారముగా యుండియుండవచ్చునేమో పరిశీలింపవలెను లింగమును కొందరు ఎడమచేతిలో నుంచికొనుటయు కలదు హరిహరుడు తన "బసవరాజదేవర రగళె"లో (రగడ అను పద్యము) చెప్పుచున్నాడు సమకాలీనుడైన పాలకురికి (పాల్కురికి సోమన) తన బసవపురాణములో ఈ విషయములు ఏ మాత్రము చెప్పక, భక్తినిర్ణయమునకై శివుని అనుమతిపై వచ్చినా డనునదే ప్రధానముగా చెప్పినాడు సింగిరాజు కూడ ప్రాణలింగముకై వెదకుటకు వచ్చినా డను చున్నాడు అనిన శివగణప్రసాది హరిహర సింగిరాజుల తరువాతివారు చెప్పిన దానికన్న పాలకురికి సోమనారాధ్యుడు తన బసవపురాణములో చెప్పినదే సూక్త మని (ఒప్పని) చెప్పవచ్చును ఐతిహాసికముగా బసవన్నను వర్ణించుటలోనే చాల కాలము గడచినది ఐతిహాసికముగా ఎంతయో పరిశీలింపవలసి యున్నది

ప్రసంగ వశమున ఇక్కడ కొన్ని విషయములు స్థూలముగా చెప్పక తప్పలేదు దానినుండి శూన్యసంపాదనములోని విషయమునకు కొంచె మంత రాయము కలిగినది బసవన్న చెప్పినదానిలోని అంతరార్థము తెలిసికొనిన అల్లముడు సమాధానముతో పలుకుచున్నాడు

**అల్లమప్రభు**

ప్రసాద లింగి ముండునంత వఱకు, ప్రాణలింగ
మను వార్త భంగంబు కనుమా, సంగన బసవన్నా! పీథి
యందు బిందెను పడవేసి, బయలు తుడిచిన ఏముకున్నదో
చెప్పుమా? గుహేశ్వర లింగమును వేరుజేసి వెదకుట
ఉన్నదే బసవన్నా? ౭

**వివేచనము .**

బసవరాజా! నీవు పొందు ఆవేదన నీ యట్టి మహాత్మునకు తగినది కాదు ప్రసాద లింగస్వరూపమైన నీకు ప్రాణలింగమునకై చింతించుట కొరత గాదా? సంగన బసవన్న ప్రసాదము లేక ప్రాణ ముండునా? తుదకు చేరుకొన్న ముక్తాత్ముడవు నీవు పాలబిందెను వీధిలో పడవేసి ఆకాశమును తుడువబోవుట యుక్తమా? గుహేశ్వరుని వేరుజేసి నడువుట నీకు తగునేమయ్యా? అని అల్లముడు అనునయ వాక్యములతో సమాధానము పలుక బసవన్న విన్నపము చేయు చున్నాడు

**బసవన్న .**

ఆదియందు సాధ్యమందునా అక్కడనుండి
అట్టెట్టు, అనాదియందు సాధ్యమందునా? అక్కడనుండి
అటువైపె సాధ్యాసాధ్యమను సూతక (పుట్టు) శబ్దమున
కతీతము ఆ లింగమే ఆలింగనమై అవిరళ సంపన్నం
బైన భేదభావంబు కలదందునే? అదియే భవంబునకు
బీజము నాదు ప్రాణలింగము నీవనియే యుంటినయ్యా,
కూడల సంగమదేవా! ౮

**వివేచనము :**

అయ్యా! అల్లమేశా! ఆది అనాదులకు బహుదూరముగా నుండు సాధ్యాసాధ్యముల జనించు అర్థములకు అతీతము మహాలింగము అభిన్న అవిరళ సంపన్నమైనది ఆ సద్భావలింగము అది అద్వితీయ లింగము ఆ లింగములో భేదమెంచతగదు ఎంచినచో అది మఱల పుట్టుటకు (భవమునకు) బీజమగును

దేవర దేవ! నేనేదియు సంకల్పింపను భావింపను నా ప్రాణలింగమే మీరు అని సుఖంబున నుండెదను ప్రభూ! అని బసవన్న పలికిన పలుకు అల్లమయ్యకు మహానందము కలిగింపగా బసవన్న ఘనతను గూర్చి అల్లముడు ఇట్లను చున్నాడు

**అల్లమ ప్రభు**

బసవన్నయే ప్రాణలింగమని భావించి, దృష్టి
నిలిపి, పరమాశ్చర్యకరమైనది కంటి కల్పించి మనసు
నందు నిలుపగా భయము లేకుండెనయ్యా, గుహేశ్వరా!
మీయందు సర్వ నిర్వాణ సంగన బసవన్నయే నా ప్రాణ
లింగమని యెఱిగి నీవు నన్ను లోగొన్న గురువువని
గాంచితినయ్యా! మీ ధర్మము మీ ధర్మము

**వివేచనము**

పరమాశ్చర్యము నాకు భాగ్యము సమకూర్చు ఐశ్వర్యము దృష్టి సారించి చూడ చూడ నా ప్రాణలింగమే బసవన్నగా కనబడుచుండె కంటిన్నీ మనసార కంటిని ఆనంద రసాంబుధిలో మునిగి తేలితిని అప్పయ్యా, గుహేశ్వరా! బసవన్న నీయందు నిబిడీకృతుండయ్యె నిజము నా ప్రాణలింగమని తెలియవచ్చినది నీవు నన్ను లోపల లోభంబున దాచుకొన్న సద్గురుడవని చూచు కొంటిని ఇవి యంతయు మీ ధర్మము మీ చిదానంద తత్త్వము

ఎక్కడెక్కడ చూచినను అక్కడక్కడ బసవన్న అను తీగ ప్రాకి యున్నది ఆ తీగను-

పట్టి యెత్తిన లింగమను గుచ్ఛము! ఆ లింగ
గుచ్ఛమును పట్టుకొని యెత్తిన భక్తి రసమయమైయుండె
నయ్యా! ఇది యెవరయ్యా అమలైక్యము చేయువారు?
(రెండిటిని ఒకటిగా చేయువారు) ఇదెవరయ్యా బయట
ప్రజ్వలించి చూపువారు? బసవగురువు నాకరస్థలలింగపు
ఆని నెఱిగించి చూపిన కారణమున, గుహేశ్వర లింగము

నెఱవు నీనుండి తెలిసితిని ఈ మిగిలిన లోకాది లోకంబు
లన్నియు నా ముఖంబునందు కించిత్తు (అల్పములు) ౧౦

మఱియు

'బ' అనుచోటు భవహరణంబయ్యేనయ్యా! 'స'
అను చోట సర్వజ్ఞానినైతిని 'వ' అనుచోట వచించెద
ననిన చైతన్యాత్మకుడనైతి ఇటులీ బసవాక్షరత్రయము
నా సర్వాంగంబునందు వెలిగి ప్రకాశించు భేద మెఱిగి
నేను బసవా! బసవా! అనుకుంటిని చూడుమా గుహే
శ్వరా! ౧౧

**వివేచనము**

ఓహోహో! పరమాద్భుతమిది ఉపమాతీతమిది దశదిశల నిండిన లీలా వినోదము ఎక్కడ జూచిన అక్కడ సందులేని బసవన్నయను తీగ దానినెత్తి చూచిన లింగముల నిబిడమైన గుత్తులు వానిని ఎత్తి చూచిన ఆహా! భక్తిరసామృతము ఇటులెవ్వరు సర్వవ్యాపకముగా ఉందురయ్యా? ఇటులెవ్వరు తమ భక్తిప్రకాశము ప్రజ్వలించి సకల జీవుల హితార్థమై చూపువారు? ఇట్టి మహిమామృతుడు బసవేశుడు అనుగ్రహింపగా గుహేశ్వరుని మర్మ మెఱిగితి

ఒకసారి బసవాయనిన చాలునయ్యా! భవాబ్ధిని దాటుటయే కాదు, ఆ అబ్ధియే ఇంకిపోవును బసవన్నను నమ్మి సర్వము తెలిసితిని బసవన్న నా తండ్రి యని సర్వ చైతన్యాత్మకుడనైతిని గుహేశ్వరా! చూచితివా నీ బసవన్న ప్రభావము? అల్లముడై ప్రకాశించుచున్నాడు బసవా! బసవా! యనుచు బ్రతికి యుంటిని అని అల్లముడు తన గురువు అనిమిషునకు గురువని మిక్కిలి హర్షముతో కొనియాడెను అది చాలక ఇంకను కొనియాడెను మఱచితినేమో యను సందేహమున మఱల మఱల పిచ్చిపట్టినట్లు స్తోత్రంబు చేయుచుండెను బసవన్నకు దిగ్భ్రాంతి కలిగినట్లైనది తాను అడిగినది మునిగిపోయినది తనను తాను మఱచి స్వామి తన ధన్యతలోనన్ను చేర్చి చిత్తము వచ్చినట్లు కొనియాడు చుండుటను జూచి బసవడు సాష్టాంగ వందనముతో నుంచ అల్లముడు బసవన్నకొక మాట ఇట్లనుచున్నాడు

కైలాసమునకు పోయిన వారెల్ల బంధితులైరి
లింగమందు లీనమైన వారందఱు చెరకు లోనైరి
సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యము గల వారెల్లరు
నడమ నాడుచుండిరి గుహేశ్వరా! మీ శరణ సంగన
బసవన్న జంగమ ప్రసాదియైన కారణమున స్వయం
లింగమయ్యె ౧౨

**వివేచనము :**

లోక వృత్తములో బసవన్నదే యొక తీరు మిగిలిన వారు కైలాస భ్రాంతులు వారక్కడ తమ భ్రాంతియను చెఱసాల యందుందురు అది పరమ సుఖమని తలతురు ఇక కొందఱు లింగములో ఐక్యమై బయటకు రాలేని ముక్తి బంధనశాల యందు తాయివలె అచలులై యుందురు ఇక సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యములే పరమ పురుషార్థము అని దిక్కులేక మర్త్యము నుండి కైలాసమునకు, కైలాసము నుండి మర్త్యమునకు తెరపిలేక పారాడు పరివారకులైరి. అదియే పరమ సుఖమనిరి స్వామీ, గుహేశ్వరా! మీ బసవన్న జంగమ ప్రసాదియై యున్నందున సర్వభరితమైన స్వయం లింగమయ్యె అని నిర్ణయమును అల్లముడు నుడువగా బసవరాజు కృతనిశ్చయుడై ఇట్లనుమన్నాడు.

**బసవన్న :**

తెలియునంత వఱకు పూజించితి తెలియునంత
వఱకు అర్చించితి తెలియునంత వఱకు పాడి కొనియాడితి
తెలివి చెడి, మఱపు నష్టమై, భావ నిర్భావమై నిజము
చేకూరె గాన కూడల సంగునియందు సర్వనివాసినై
యుంటిని ౧౩

**వివేచనము :**

ఇపుడేదియు లేదు చేయునంత వఱకు చేసితిని చేసిన కారణము తెలిసితిని పాడి భజించితిని మఱమనదేదియో మఱచితిని ఎఱుగునదేదియో ఎఱిగితిని నిజము చేజిక్కినది 'నిజము వేరు- నేను వేరు' అను చిక్కు విడిచిది కూడల సంగముని యందు సంగుడనై సుఖినైతిని అని బసవన్న శాంతి పొందినాడు

తరువాత ఇతర శరణులు తమ తమ ఇష్టార్థములు చెప్పుకొందురు

**చెన్నబసవన్న**

నే ననుటలేదు నీవనుట లేదు స్వయమనుటలేదు
పరమనుటలేదు జ్ఞానంబు లేదు అజ్ఞానంబు లేదు లోపల
అనునది లేదు బయట అనునది లేదు కూడల చెన్న
సంగముడను శబ్దంబె లేదు ౧౪

**వివేచనము**

చెన్నబసవన్న వచించిన దానిలో ఏమియులేదు క్రియా బాహిరమును వెల్లడించినాడు మూల జ్ఞానము లోనికి చొచ్చుకొని పోయినపుడు అది - ఇది - ఏదియు ఉండదని, సర్వనిరాలంబ స్థితిని మహా జ్ఞానియై వీరశైవ షట్స్థల సను సముచ్చయము నిర్ణయించి ఆచరణమునకు దెచ్చిన చెన్నబసవన్న తన నిర్యాణ మును తెలుపగా మడివాళ మాచయ్య తన అభిప్రాయమును తెలుపుచున్నాడు

**మడివాళయ్య**

తను నష్టము, మనసు నష్టము, స్మరణ నష్టము,
భావనష్టము, జ్ఞాన నష్టము-అను పంచ నష్టముల లోపల
నేను నష్టమైతిని ఆ నష్టమునందు నీవును నష్టమైతివి
కలిదేవర దేవుడను మాట 'నిశ్శబ్దం బ్రహ్మముచ్యతే' ౧౫

**వివేచనము :**

నేనుగా వ్యవహరించుటలో నీ వనునది వచ్చి నా దౌర్బల్యమున నీవు పెద్ద వాడవై, నేను చిన్నవాడనై, గురులింగ జంగమ శ్రేష్ఠతతో తను భక్తుడనై ఇంత వఱకు నామరూప గుణావరణముల క్రియలుగల తను మన జ్ఞప్తిజ్ఞాన భావములు నష్టమైనవి కాన నేను నష్టమైతిని దానితోపాటు నీవు నష్టమైతివి నిశ్శబ్దమే బ్రహ్మమనునది నిలిచినది మడివాళ మాచిదేవుడు తన ఐక్యమును శరణసమూహమునకు మనవి జేసినాడు తరువాత బహురూపి చౌడయ్య అను శరణ నాట్య కలావిదుడు ముందునకువచ్చి శరణులకు వందనం బాచరించి తన నాట్యకళ కన్వయముగా తన అవసా ము నిట్లు విన్నవించుచున్నాడు

**బహురూపి చౌడయ్య :**

ఈనాడు వచ్చిన బహురూపముల జూడరయ్యా!
గతిని పొందక, మతిని పొందక, స్థితిని చేరక, స్థానంబు
కూడక ఐదుగురు కట్టిన నిబంధనలు మీరి నేనాడుదు బహు
రూపు రేకణ్ణ ప్రియనాగినాథ బసవేశువలన బ్రతికితిని ౧౮

**వివేచనము**

ఆడితి. అయ్యలారా! బహురూపధారినై ఆడితిని షట్థ్సలముల చేకొని షల్లింగముల నెనరుంచి, ఇక్కడనున్న అల్లమప్రభు, బసవన్న, చెన్నబసవన్న, మడివాళ మాచయ్య, మోళిగ మారయ్య మొదలైన శరణుల గతిమతుల ననుసరించి ఆడితిని వెనుకటి శరణుల ఆకారములు ధరించి ఆడితిని బన, ఈనాటి నానాటిక పాత్రకు విముక్తి, గతి, మతి, స్థితి స్థానములు లేక, పంచభూతాత్మక తత్త్వముల త్రుంచి చిదానందావృత రూపము ధరించి ఆడెదను బసవన్న కృపతో బ్రతికి ఇంతవాడనైతినని బహురూపి చౌడయ్య తన హావ భావ విలాసములతో పలికిన తరువాత హడపదప్పన్న గారు ఇట్లనుచున్నారు

**హడపదప్పన్న :**

నా ఆచార విచారంబులు బసవన్న కల్పితము
లయ్యె నాదు అవధాన అనుభావంబు బసవన్న కల్పిత
మయ్యె నాదు సర్వాచర సంపత్తు బసవన్నయందు వేద్య
మయ్యె - బసవప్రియ కూడల చెన్నసంగమ దేవునందు
నిజనివాసియై యుంటినయ్యా! ౧౯

**వివేచనము :**

తన అస్తిత్వమే లేక బసవరాజు కార్యరంగమునందు వ్యవహరించిన అప్పన్నలాటి వారు మఱియొకరు లేరు బసవన్నకు అప్పన్న లేకున్న ప్రొద్దు పోదవదు, క్రుంకదు ఈ అవినాభావ సంబంధమును అప్పన్న వర్ణించిన పై వచనములో చెప్పుకొన్నదానిలో రవంతయైన తనను గుఱించి చెప్పుకొనలేదు బసవన్న పెద్దతనములో అప్పన్న గొప్పతనము అంతులేక దాగుకొన్నది

అంతయు సర్వాచారసంపత్తు బసవన్న కర్పించినాడు తరువాత సొడ్డళ బాచి రాజు తన విచారము (అభిప్రాయము) ఇట్లుచెప్పు చున్నాడు

**సొడ్డళ బాచిరాజు**

నాదు కాయమను సింహాసనమందు ప్రాణమను
లింగము మూర్తీకరించి, ధ్యానమను హస్తమందు ముట్టి
పూజించుచున్నపుడు, మెల్లమెల్లగ చుట్టముట్టిన సంసా
రంబు బయలు వెరసి నీవు నేనను భేదంబు వదలి మహా
దాని సొడ్డళునందు నిజలింగైక్యమై యుండె ౧౮

**వివేచనము :**

సొడ్డళదేవా! నీ కృప - నా కాయ సింహాసనమున ప్రాణలింగమును ప్రతిష్ఠించుకొంటిని అతడు కరుణాళువు సద్గురుడు ఆ ప్రాణలింగమును ధ్యానహస్తస్పర్శచే ముట్టి పూజించునపుడు, సంసారము చుట్టుముట్టుచుండగా నేను కనుగొని ధ్యానము తీవ్రగతిగా ఆక్రమింపజేసి సంసారమను కంటకమును బయలునందు కలిపితిని అపుడు నీవు నేనను భేద బంధము త్రెంచి ఏకమై నిజ లింగైక్యమైతినని సొడ్డళ బాచిరాజు తన ముక్తిని వివరించినపుడు బసవన్నగారి అక్క నాగమ్మ ఇట్లనుచున్నది

**అక్క నాగమ్మ**

నాదు తనువు చెన్నబసవన్న యొక్క బయలులో
చేరియుండె నాదు మనము సంగన బసవని నిజపదంబు
కూడియుండె నా ప్రాణము ప్రభుదేవుల బయలు చేరి
యుండె బసవప్రియ చెన్నసంగుని శరణులు ఒక్కొక్క
రొక్కొక్కటి పంచుకొనిన కారణమున, నాకేమియు
మిగులక మహాఘనమందు నిజనివాసము కైకొంటిని ౧౯

**వివేచనము :**

నా కాయము చెన్నబసవన్నకు మనము బసవన్నకు ప్రాణము ప్రభు దేవునకు శరణులు కూడి ఒక్కొక్కటి ఒక్కొక్కరు తీసికొనగా నాదనున దేదియు లేక మహాఘనమందు నిజనివాసి నైతిని అక్క నాగమ్మ శరణుల

కంతయు పంచిపెట్టి, సర్వసమన్వయ తత్త్వములో, ఏ గుఱుతు లేక సుఖనివాసి యైనదను విషయము చెప్పగా శరణులు అమె మహాజ్ఞానమును శ్లాఘించి 'శరణు' అన్నారు అపుడు కాశ్మీరపురపు దొరయై సకల భోగత్యాగధనుడై కట్టెలమ్ము కాయకమున కల్యాణ శరణ లోకమున జంగమభక్తుడై దాసోహము సేయువాడై ప్రసిద్ధిగాంచిన మోళిగ మారయ్య తాను రూపించుకొనిన ముక్తస్థితిని ఇట్లు విన్న వించుకొనుచున్నాడు

**మోళిగ మారయ్య**

నా జ్ఞాన మజ్ఞానంబు బసవన్న కర్పితములు
నా ఆచార విచారములు బసవన్న కర్పితములు నాభావ
నిర్భావములు బసవన్న కర్పితములు నా అంతరంగ
బహిరంగములు బసవన్న కర్పితములు నీవు నే ననునవి
బసవన్నకర్పితములు ఇటుల నన్ను బసవన్న కర్పించు
కొని, ఏ అవలంబనము లేక నిరాలంబమందు నిజనివాసి
నైతి నిష్కళంక మల్లికార్జునా! ౨౦

**వివేచనము :**

బసవన్నకు తనదంతయు మంచి చెడులేమున్నను నిశ్చంచలమనంబుతో సర్వార్పణము చేసుకొన్నాడు వారికి వీరికి అనుట లేదు తనదానితో మారయ్య రవ్వంతైనా ఇంకొకరి కీయలేదు ఉన్నదంత ఊడ్చిపెట్టినాడు బసవన్నను ఎంతగా ప్రేమించి ఆరాధించి యుండెనో ఎవరు చెప్పగలరు? ఉన్నదంతయు మారయ్య ఇచ్చినను తానిచ్చినచోట లేదు ఆ అవలంబము లేక నిరాలంబమందు నిజమైనాడు అనాడు అతని భౌతిక త్యాగము శ్లాఘనీయమైనది కీర్తిగాంచినది ఈనాడు ఆధ్యాత్మిక త్యాగములో కూడ ప్రపంచవ్యాపకతత్త్వమై వెలిగినాడు అన్ని త్యాగములలో పరమోత్కృష్ట త్యాగము 'నేను శివయోగిని' అనునది మఱచిపోవుట శరణులు కొనియాడుచుండగా డోహర కక్కయ్య ఇట్లనుచున్నాడు

**డోహర కక్కయ్య** (డోహర = చర్మమునకు పదునుపెట్టి రంగువేయువాడు)

నా కష్టకులము (నికృష్ట) సూతకము మీ హస్తంబు
తాకి బయలయ్యె శుక్ల శోణితముల వలని సూతకము

లింగమును సోంకిన (ముట్టిన) తోడనే బయలయ్యే
తట్టిన ముట్టిన సుఖంబులు లింగ ముఖంబున కర్పిం
చితిని గాన నా పంచేంద్రియములు బయలయ్యే నా
అంతరంగ మందు జ్ఞానజ్యోతి ఎడమిచ్చియుండె గాన
లోపల బయలైయుండె సంసార సంగమైన అవస్థ మీరిన
క్రియయందు పరిహారమై యుండెగాన (నిలచియుండెను
కనుక) బహిరంగము బయలయ్యె అభినవ మల్లికార్జునా!
మిమ్ము ముట్టిన కారణమున నేను బయలైతిని ౨౧

**వివేచనము :**

తక్కువ కులమందు పుట్టిన సూతకము బసవేశా! నీవు ముట్టినతోడనే బయలయ్యె నయ్యా! శుక్ల శోణితముల వలని సూతకము లింగమును ముట్టగా మునిగిపోయె లింగ ముఖంబున కర్పించిన అర్పణము నా పంచేంద్రియములను బయలు చేసెను జ్ఞానజ్యోతి నుండి అంతరంగము క్రియాశుద్ధత నుండి బహిరంగము బయలయ్యె మిమ్ము ముట్టితిగాన నేను బయలైతిని అని మాలజాతి కన్న తక్కువగా ఎన్నబడిన కక్కయ్య బసవుని అనుగ్రహముచే శరణులలో ముఖ్యుడైనాడు తరువాత అల్లమ ప్రభుదేవుడు తన విషయ మిట్లు పలుకు చున్నాడు

**అల్లమప్రభు .**

గురువు నుండి యైన కాయంబు వెరసి గురుని
ఎఱుగనైతి నయ్యా! లింగము నుండి యైన జీవంబు
వెరసి లింగంబు తెలియనైతి నయ్యా! జంగము నుండి
యైన మనము చేరి జంగమును ఎఱుగనైతి నయ్యా! ఈ
త్రివిధ భక్తిని తెలివి కిచ్చిన సంగన బసవన్నను చేరి
బతికితిని సుమా, గుహేశ్వరా! ౨౨

**వివేచనము •**

గురు లింగ జంగమ ప్రసాదితములైనవి తను మన ధనములు గాన, నా దేమనుట ఎఱుగనైతిని ఈ త్రివిధభక్తిని ఎఱిగించె బసవన్న ఆ మహాత్ము

నందు చేరి బ్రతికితిని అని అల్లముడు తాను పొందిన అనుభవము, దానిలో చేరు రహస్యము చెప్పెను

శరణులు తాము అర్చన, అర్పణ, అనుభవములనుండి సాధించిన రీతులను తమ తమ గతి- మతులను నిర్యాణమునకు ముందుగా అనుభవ మంటపములో తమ కార్యములు ముగిసినవని, తాము పొందు స్థల కులములను శివాద్వైత సిద్ధాంత రీతిగా చెప్పుకొనినది లోక మానవ చరిత్రలో అపూర్వము ప్రథమాదర్శము

చావునుగురించి ఎంతటి సమాధాన సామరస్యముతో నియతకాలమున్నకు, లోక కల్యాణమునకు, తొందర రాకుండ సమాలోచన చేసినారో, శరణుల, స్థైర్యమెట్టిదో వారు సాధించిన అనుభవాలు ఈనాటికిని మననీయములు మానవజాతికి సమాన సాధ్యములు

—o—

ఇది కృపామూర్తులైన శ్రీ మృత్యుంజయప్పగారిని, స్వప్న బోధామూర్తులైన శ్రీ ఎర్రి తాతయ్యగారిని స్మరించి, సకల శివ శరణులను వందించి శూన్య సంపాదనలోని "శరణుల అవసాన పరామర్శ"కు సంగ్రహముగా చెప్పిన వ్యాఖ్యానము సంపూర్ణము

—o—

శ్రీ గురు బసవలింగాయ నమః

# శూన్య సంపాదనము

## గోరక్షకుని సంపాదనము, సర్వశరణుల ఐక్యము

౨౧

క౦॥ గోరక్షకునకు ముక్తిని
గారవమున నిచ్చి ప్రభుడు గిరి బయలయ్యెన్
భూరి మహా శివశరణులు
ధారుణి నాపైన గనిరి తమ యైక్యములన్

అల్లమరాయుడు సర్వ శరణులతో నిర్వాణముల నిశ్చయ నిర్ణయములతో వారివారి సాధనాసిద్ధులు కనుగొని తృప్తుడైనాడు అపూర్వ వియోగ సన్నివేశము సమాధానముగా నడచినది సమావేశములో సిద్ధరాముడు లేడు ఈ వెనుక అల్లముని ఆదేశము పొంది తన సొన్నలాపుర క్షేత్రమునకు వెళ్ళిపోయినాడు

ఉండుటకు అవకాశము లేదు ప్రభుదేవుడు శ్రీశైలమందున్న కదళీ వనమునకు వెళ్ళవలెనను ఆతురము పొందియున్నాడు ఇంతకుమున్న మహాదేవి అక్క అక్కడ బయలయింది శరణులలో కొందఱి స్వభావములందు భిన్నములై ఆ చోటుకి ఈ చోటికి వెళ్ళినను, వారి నిర్వాణ తత్త్వమొక్కటియే-లింగమందు ఐక్యమగుట అందఱిముందు తాను వెడలిపోవు విచారమును అల్లముడు చెప్పుచున్నాడు

**అల్లమప్రభు**

అవధి గిడచె వ్యవధానముండె నిజమె నిజ
ములో నొనగూడె వినుమా బసవన్న! కలియుగమందు

ముందుండరాదు నిజశరణులకు పొమ్ము నీవు కప్పడి
సంగమునం దొదగూడుము ఉళవియందు నిజమౌటకు
పొమ్ము చెన్న బసవన్నా! మహాము చేరుము మడి
వాళయ్యా! సొడ్డళ బాచిరాజు మొదలగు ప్రమథులందఱు
నిజములో కూడియుండుడు- నిర్వలియ సమాధియందు
భేదించి చొచ్చి లింగమందుపోవువారు ఎల్లరు వెడలండి
కాయంబుతో కైలాసమునకు కాయసహితముగా పోవుటకు
మీ కందఱకు ఉపదేశమంత్రంబు తప్పదు మాకు కదళి
యందు జొచ్చి నిజమందు ఒడగూడుట పరిణామము ఇది
మా గుహేశ లింగమాజ్ఞ మీ యందఱకును ౧

**వివేచనము :**

గుహేశ్వరునకు సెలవీయండి శరణులందఱు మీ ఇష్ట నివాసంబులకు పొండు మర్త్యమునకు వచ్చిన మన కార్యము ముగిసిపోయినది లోక కార్యము మిగిలియున్నది అది నిరంతరము నడచు కార్యము నే చెప్పునది చెప్పినాను శ్రీశైలమునకు వెళ్ళెదనని బసవాది ప్రమథులందఱకు చెప్పి, వారి వీడ్కోలు గైకొని అల్లముడు కల్యాణమునుండి వెడలిపోయెను

అల్లమస్వామి శ్రీశైల పర్వతమెక్కి పరమాశ్చర్యమగు ప్రకృతి విలాసము జూచి సంతోషమున వచ్చుచుండ ఒక రమ్య ప్రదేశమున ఆజాను బాహుడై తేజశ్శాలియై విరాజిల్లుచున్న ఒకనిని జూచి నిలచి విచారించగా, అతడు నవనాథ సిద్ధులలో ప్రసిద్ధుడైన గోరక్షుడని తెలియవచ్చినది అతని కాయము వజ్రకాయము గోరక్షకుడు ఆ కాయసిద్ధియే నిత్యమన్నపుడు ప్రభువు తన పరిచయము చెప్పి నవ్వినాడు సిద్ధుని మాట కాదనరాదు కోపముతో చేతిలోని కత్తినిచ్చి కొట్టమన్నాడు సిద్ధుడు అల్లముడు వాని కత్తిని తీసికొని కొట్టినాడు "ఖణేల్" అను శబ్దమైనది ఒక రోమమును తెగలేదు అల్లముడు అదే కత్తినిచ్చి తనను కొట్టమనినాడు సిద్ధుడు కొట్టినాడు శబ్దమే రాలేదు గాలిని కొట్టినట్లైనది సిద్ధుడు వెరగందె చూచుచుండ అల్లముడు ఇట్లనుచున్నాడు

**అల్లమ ప్రభు**

అమృత సేవనజేసి ఆకలి ఘనమైనదని ఎఱిగితిని
పరుసవేదిని సాధించుటకు పోవ దారిద్ర్యంబు ఘనమయి
నది కంటిని సంజీవని పండు తిని చచ్చిన వారిని
కంటిని దీనినంతయు సాధింపపోయిన ఏమియు లేనిదై
యుండె నేను నిజము సాధించి బ్రతికితిని గుహేశ్వరా! ౨

**వివేచనము**

అయ్యా! సిద్ధనాథా! చాల కష్టపడి చావును గెలిచినను లోలోపలనే ఆ చావుకు సమీపమైనది తెలియకపోయినావు ఏది కొట్టిన శబ్దమగునో అది సరిం చును శబ్దము కానిది ప్రసాద కాయము నీ కాయమును కొట్టినప్పుడు శబ్దమై నది అది పదార్థ కాయము ఇప్పుడు తెగక పోయినను మృత్యు కరాళ దంష్ట్రి లకు బలియగును చూడుము అమృతము తాగినవారు ఆకలికి బలియైనారు పరుస వేదిని పొందబోయినవారు దారిద్ర్యమునకు బలియైనారు సంజీవని సేవించిన వారు చచ్చినారు ఇదంతయు నేను చూచినాను అయ్యా! గోరక్షా! నిజము తెలిసి నేను బ్రతికినాను అందులకే నా శరీరము నీ ఖడ్గమునకు శబ్ద మీయలేదు అని అల్లముడు చెప్పినపుడు సిద్ధుడు చోద్యమంది అల్లముని ఘనత సిద్ధియే నిజమేమో తెలియవలెనను ఆసతో మనవి చేయుచున్నాడు

**గోరక్షకుడు**

నేను నిన్నడిగెద నన్నా! నేను దేహిని, నీవు
నిర్దేహివి నేను నీకు చెప్పెదనన్నా! నేను సంగిని నీవు
నిస్సంగివి నీ యంగమును నా యంగమందు ప్రతిష్ఠించి,
మీ జ్ఞానము నా ఆత్మ యందు నిలిపి తెలియు నంత
వఱకు నాకును నీకును తగిన సంబంధము గోరక్ష
పాలక మహాప్రభు సిద్ధ సోమనాథుని లింగము సరియౌట! ౩

**వివేచనము**

అయ్యా, అల్లమ ప్రభూ! మీరు పెద్దవారు అష్టసిద్ధులలోనే మునిగి వాని తరువాత ఏమున్నదనుట ఎఱుగక వ్యర్థముగా కాయ సిద్ధియే నిత్యమనుకొని చాల కాలము గడిపితిని ఈనాడు తమ దర్శనము వలన సంతసమంది మీ

బోధను కోరుచున్నాను నేను కాయము గలవాడను నీవు కాయము లేనివాడవు మనమున్నవాడను నేను మనము లేనివాడవు నీవు ఏ పదార్థమును కాని ప్రసాదివి నీవు నాకును నీకును సంబంధమే లేదు తమరు కృప జేసి నన్ను నీ యంతటి వానిగా చేసికొనవలెనని పాదాభివందనము చేయ, కరుణాళువు అల్లముడు లింగాంగ సంబంధము, సాధనము సామరస్యము, గోరక్షకునకు, కుప దేశించి, పరమ పదమిచ్చి కదళీవనము జొచ్చినాడు అతని చాల కాలపు కోరిక తీరినది ఆనందస్వాంతుడై ఇట్లనుచున్నాడు

**అల్లమ ప్రభు**

కాయమను కదళిని జొచ్చి, ప్రాణమును గహ్వా
రంబున సకలేంద్రియములను కొట్టి కొట్టి నంది (గది
గదిలో) త్రిప్పుచు వచ్చిన మేరుమందిరము త్రికోణమందు
తెల్లవారె గుహేశ్వర లింగము రూపుగొనియుండె ॥

**వివేచనము :**

అల్లముడు ఆకాశకాయుడు అందఱి శరీరములవలె అతనిది ఉండలేదనుట నిజమే గోరక్షకునకు చూపిన పరీక్షలో ఇప్పుడే వ్యక్తమైనది ఇక్కడ కదళిలో ఆయన పొందు పదవి ఏమి యున్నది? అను సందేహమున కవకాశమున్నది అల్లముడు సావయవ నిరవయవ సమన్వయుడై యుండి యుండును సృష్టిలో తాబేలు అట్లుండుట క్రొత్తగాదు ఉండుటకు సాధ్యమగునను దృష్టాంతము కలదు అల్లముడు చెప్పుటలో అన్నియు కలవు కాయమున్నది ప్రాణమున్నది ఇంద్రియములున్నవి తాను ఆ కదళియను కాయమును జూచి ప్రాణమను గుహలోని చిన్న చిన్న ఇంద్రియములను గదులు దాటుచు వచ్చుచు, పైన సహస్రారమను మేరువులో నున్న త్రికోణమునకు వచ్చుటయందు జ్ఞాన సూర్యుడు వెలిగినాడు అతడే గుహేశ్వరుడనుచు ఆ మహనీయ కదళీవనములో బయలైనాడు మహాశక్తి లోకోద్ధారమునకై వచ్చి, మానవత్వములోనున్న పశుత్వమును, పాశబంధమును త్రెంచి, శివతత్త్వమును బోధించి, స్థాపించి, మరుగైనాడు లోకము పొందిన అమూల్య శివానుభవ తత్త్వమాణిక్యమును పోగొట్టుకొన్నది మఱి యెప్పుడో లోకమున కిట్టి మాణిక్యము లభ్యమగుట!

అల్లముడు కదళీవనమందు బయలైన విషయము కల్యాణ శరణులకు తెలిసినది అందఱు విషాదముతో అల్లముని గుణగణములెంచి స్తోత్రము చేసినారు సొడ్డళ బాచిరాజు లింగైక్యమైనాడు అప్పుడు బసవన్న శివ శరణుల మృత్యుతత్త్వ మెట్టిదనునది ఇట్లు చెప్పుచున్నాడు

**బసవన్న**

మా వారికి చావులేదు మావారు చావు నెఱుగరు
చావనునది స్వీయము కాదు లింగమందు ఉదయమైన
నిజైక్యులకు ఆ లింగమందు గాక వేరే మఱియొక తావు
లేదు కూడల సంగమ దేవుని శరణుడు సొడ్డళ బాచిరాజు
నిజలింగదేహమును భేదించివొచ్చిన ఉపమించు వారల 38
కానను

**వివేచనము**

సొడ్డళ బాచిరాజా శరణుడు జీవంబు వదలె చచ్చెనని చెప్పరాదు ఎందుకన, లింగోద్భవులు ఆ లింగమందే లీనమౌదురు ఇతర లోకులవలె వారికి చావులేదు మాంసపిండమునకు చావుండును గురుకర సంజాత మంత్రపిండులకు చావులేదు కాన మా వారికి చావులేదు మా వారు చావును గమనింపరు అదియును గాక, చావనునది మా వారికి సొంతము కాదు అని బసవన్న సమాధానము సూచించుటలో జీవికిని చావునకు నున్న రహస్య సంబంధము నిర్ణయాత్మకముగా వివేచించి లింగాంగ సంబంధము తెలిపి నిసర్గము తన సృష్టి నియమ పరిశుద్ధికి, మితికి ఉంచుకొనిన నియమమను భావమును వ్యక్తీకరించినాడు లింగవంతులు ఈ నియమమును ఎదిరించరు వారికి మృత్యుతత్త్వము తెలియును అందుచేకే 'మరణమే మహానవమి' యని సంతసించి లోకజీవుల భయమునకు అభయ మిచ్చినది బసవన్న తత్త్వములో ద్యోతకమైనది శరణుల తత్త్వవిచారము లిట్లుండెను

హరళయ్య మధురస బాంధవ్యమున పుట్టిన విరసము రాజకీయముగా వృద్ధియై పరవాది వర్ణాశ్రమముల వారి జాతివాదమునకు గుఱియై దండనము జరిగినది బసవన్న ప్రధానియై బిజ్జళుని ఆధిపత్యమునకు ఆధారమై నడచి

సను, జాతివాదము తగ్గదనిన బసవన్నమాట తలకెక్కలేదు రాజ్య భార ములో శరణులు ఎటువంటి ప్రతిబంధములకు రాక, రాజానుగ్రహమునకు చేయొడ్డక, తమ తమ కాయకముల వలన పరుల నొప్పింపక బసవన్న కట్టిన మానవ సమాజధర్మమును సర్వసమానతతో నడుపుకొని వచ్చిరి జాత్యతీతమును తమ శరణ తత్త్వముయొక్క అహింసా ప్రకారముగా ధార్మిక, ఆర్థిక, సామాజిక రంగములలో జీవించు విధానమును కాయకమే కైలాసమని, ఒక్కొక్కరు స్వతంత్రముగా జీవించు సదుపాయము కల్పించిరి బిజ్జళుడు ఈ కార్యమందు సహాయకుడై యుండెను

పెద్ద అధికారములో బసవన్న యున్నాడని బలవంతముగా లింగమత వ్యాప్తికై దౌష్ట్యమును చూపినట్లు ఎక్కడను కనబడదు వారివారి ఇష్టమేకాని పరులకు కష్టము కలిగించలేదు కల్యాణ పట్టణము శివశరణుల ధార్మిక రంగము లోని అనుభవమంటపము యొక్క శ్రేష్ఠతను విని ఇతర దేశముల నుండి వచ్చి మాతృభాషగా కన్నడమును నేర్చి వచనములు రచియించిరనిన ఆ శివానుభవ ధర్మము జీవులకెంత ఉపయుక్తమో తెలియుచున్నది

మాదార చెన్నయ్య తమిళుడు మోళిగ మారయ్య కాశ్మీరపు మహారాజు ఆదయ్య సౌరాష్ట్రమునకు చెందినవాడు డోహర కక్కయ్య మాళవ దేశమునకు చెందినవాడు మరుళ శంకరదేవుడు ఆఫ్ఘనిస్థానమువాడు తెలుగు జొమ్మయ్య, కిన్నర బొమ్మయ్య ఆంధ్రదేశమువారు హడప దప్పన్న ఆంధ్రుడే ఉరులింగ దేవుడు మహారాష్ట్రమునకు చెందినవాడు చేరముడు కేరళకు చెందినవాడు గోరక్షనాధునిది గోరఖ్‌పురము ఘన లింగదేవుడు ఆంధ్రుడు సుజ్ఞానిదేవుడు ఒరిస్సాకు చెందినవాడు ఇట్లు అనేకప్రదేశములు రాజ్యముల నుండి ఎందఱో వచ్చినట్లు ఇతిహాసకర్తలు గుర్తించినట్లు తెలియుచున్నది

ఇతర ధర్మమువారు శారీరక సంబంధములు చేసికొనినారు జైనులు లింగాయతులు వివాహాలు, ఇతరమతముల వారు తమ ఇష్టప్రకారము లింగదీక్షలు జరుపుకొన్నారు సొల్లాపురక్షేత్ర నిర్మాణకర్త సిద్ధరాముడు లింగదీక్ష పొందిన విషయము ఉదాహరింపబడినది అంతవఱకు అడ్డురాని బిజ్జళుడు ఈ వివాహ మును గూర్చి అంతగా దండోపాయము వఱకు పోయెననిన వర్ణాశ్రమముల

మాటను వ్యతిరేకించుటకు రాజు జంకినాడు హరళయ్య మాలవాడు మధువరసు బ్రాహ్మణుడు వీరిరువురు వీరశైవ దీక్షపొందినవారు వారి శరీరసంబంధమునకు ధార్మికముగా ఏ అడ్డులేదు రాజకారణమునకు దీనికి సంబంధమే లేదు కన్నులు తీయుట రాజ్యాంగ చట్టమునందుండి అమలులో నుండెనా యనుట కే యాధారములు లేవు రాజు యొక్క సొంత అభిప్రాయముతో జరిగినదని చెప్పవచ్చును

బసవన్న బిజ్జళులు కేవలము అధికార సంబంధమునకే గాక సౌహార్ద్ర హృదయులై మెలగుచుండిరి ఈ వర్ణాంతర వివాహమువలన ఉభయులు ప్రజలు అశాంతులైయున్న రాజ్యములో ఏ ఆందోళనము రాకుండ నిగ్రహముతో నుండిరి శరణులలోన కొందలు రాజును దండించుటకై తగు ప్రయత్నములు చేయుచుండిరి జగదేవమల్ల బొమ్మయ్యలను తీవ్రవాదుల గుంపు పెరిగినది బసవన్నగారి సమ్మతి దొరకుట సులభమైయుండలేదు

ధర్మ రంగములో ప్రభుదేవుడు భవిష్యత్తును నిర్ణయించి కలి యుగమునందు ముందు ఉండరాదని అందలు వెళ్ళుటకు సెలవిచ్చి, తాను మొదటిగా బయలయ్యెను బసవన్న కూడల సంగమమునకు పోవుటకు సంసిద్ధుడైయుండెను ఆ సమయమునందే రాజకీయ విప్లవ విచారములు అతనిని సందిగ్ధ స్థితికి తెచ్చియుండెను ఏదయినను పరిష్కారము కావలసియుండెను శరణుల తీర్మానము సూక్ష్మముగానే యుండెను లోకములో దుష్టత్వమును నిగ్రహింపక యున్న దయాధర్మాలకు అవకాశము లేదు శిష్టులకు, సజ్జనులకు రక్షలేదని బసవన్న యోచించినాడు జగదేవ మల్లి బొమ్మయ్యలు బిజ్జళుని వధించు కార్యమును వహించినారు కల్యాణ కటకమునకు చివరకు మంచికాలేదు లోక చరిత్రలో ముగింపు విషాదమని తెలియవచ్చుచున్నదని కూడల సంగమ క్షేత్రమునకు వెళ్ళుటకు ముందు ఇట్లనుచున్నాడు

**బసవన్న**

రాజ విచారములు, సిరిసుఖ సింగారములు స్థిర
ములు కావు వినరే! మర్త్య లోకమున చెడియుండె-కల్యా
ణము పాడగును కల్యాణము లోకంబెరుగ శివాచారంపు

అభిమానమున జగదేవమొల్లెయ బొమ్మనగారి చేతియందు
మరణించు బిజ్జళుకు కూడల సంగమదేవుకు తమ సంపు
టము చెలిచియుండె ౬

మఱియు

కర్త పంపిన మర్త్యమున మహా మందిరము
కట్టితి సత్య శరణులకు తొత్తు భృత్యుడనై సమసి బ్రతికి
తిని కర్త పిలుపు మఱి రావలెననిన కూడల సంగమదేవుని
నిరూపణమునకు మహాప్రసాదమంటి ౭

వివేచనము ・

రాజులు రాజసగుణము కలవారు వారి విచారములకు స్థిరత్వము లేదు రాచకొలువు నెన్నాళ్ల కొలిచినను కొలిచిన వారి మంచితనము లెఱుగని మంద బుద్ధులు వారికి కావలసినసినవి సంపదలు ఐశ్వర్యాలు మాత్రమే మనసులత్యంత చంచలములు ఈనాడు కుప్ప-రేపు తిప్ప రాజ్యముల భవిష్యత్తు కూడ అంతయే కల్యాణ కళలతో మానవ కల్యాణమునకు తావిచ్చిన కల్యాణము, అకల్యాణమై అశాంతమై మానవతత్త్వమునే నశింపజేయుటకు సిద్ధమై యున్నది బిజ్జళునకు మరణము సమీపించినది కల్యాణము కల్లోలములలో మునిగి నాశనమగును శివసంపుటమే నాశనము లిఖించినది

నే నేమి చేయుదును? శివుడు పంపగా ఈ భూమికి వచ్చితిని ధర్మ సమన్వయ మందిరము కట్టితిని శివశరణులందఱకు కింకరుడనై బ్రతికిని ఇపుడు నా యజమానుడు పిలువనంపినాడు ఉన్న కార్యమేది యున్నను అతనిది ఉన్నపుడు నడచినది మా పేరుతో జెప్పికొనినను, దాని కర్తృత్వమంతయు ఆ యుక్తి మానిదే పిలిచినాడు పోవలయును అని శరణులందఱకు వందనము చేసి చెప్పుచున్నాడు

శరణ సమూహమంతయు కరుణించి ఆలకించండి

రాగము - ఆహిరి

శరణు శరణయ్యా మీరు మమ్ము ఎక్కడకు పిలిచెదరు
గురులింగ జంగముల మిగిలిన ప్రసాదమున్నదె మాకక్కడ ॥పల్లవి॥

పన్నగధరు నుదరమందున్న స్వప్నము చెన్నబసవన్న కనిచాడు
ఇంకేమి జేతునయ్యా మా శరణులు పిలిచినారు 1

అచియందాడిన మాటను మీరు అపుడే మరచితిరి శంకరా
మేదినియందు గురులింగ జంగమభక్తి పెంపొంద జేయనీ 2

ఉత్సాహమున అర్చనంబుజేసి పిప్పివిసరివేసి నట్లయ్యేనయ్యా
నచ్చితిమయ్యా శరణుల సేవను తప్పించుటది గుణమా 3

చిత్రపు పనిగల బంగారాభరణము టంకము పీడిపడిపోయినట్లు
పశుపతి మీదు శేషప్రసాదము ఉన్నదె మాకక్కడ 4

సుచిత్తమందు శివలింగము పూజించి జంకి జేరినట్లాయెనయ్యా
నచ్చితిమయ్యా మీ శరణుల సేవను తప్పించ తగునా గురువా! 5

విన్నపము వినరే బాచిరాజయ్య మోళిగ మారయ్య మడివాళ తండ్రీ!
చెన్న బసవన్నని మీ చేతికిచ్చితిమి మీ శిశువని 6

ముడియందు కమ్మ చెవిలో ముక్కర గొంతులో కంకణము నడు
పట్టు కాలునందు
కడియము తలమీద పదకము లింతో తొడిగించిరి మావారు 7

విడలేను మర్త్య లోకపు రుచి విడలేను గుణసమూహమును
విడలేను గురులింగజంగముల నిర్మల శేషప్రసాదము 8

భక్తులందఱు సుమంగళులై మీదు చిత్తపు కందుని మరువకండి
ముక్తినీయండి బిజ్జళ రాయునికి భక్తుల హస్తమందు 9

హరుడు కోపించిన గురువుకావడు గురువుకోపించిన హరుడు కావడు
హరుని కన్నను గురునికన్నను జంగమమే అధికము 10

శరణుల సకల పురాతనుల పాదములకు శరణు ప్రభుపాదమునకు
శరణు సకలకూడల సంగుని పాదమునకు శరణుశరణు తండ్రీ! 11

**వివేచనము :**

అయ్యా, శివదేవా! కైలాసమునకు రమ్మనుచున్నావు సరియే మీమాట మీరరానిది వచ్చెద అక్కడ గురు లింగ జంగముల పవిత్ర శేషప్రసాదము దొరకునేమయ్యా?

ఆనాడు గురు లింగ జంగమభక్తి పెంచుటకు పంపినవారు మీరే ఇప్పుడు అధికాభివృద్ధియై భక్తిసామ్రాజ్యము వెలుగు అవకాశము వచ్చుచుండ ఆతురమున మఱి రమ్మను వారు మీరే నీకెంత స్వాతంత్ర్యమున్నను, నీ వెలుగు వెలిగించు భక్తుని కార్యరంగమునకు చీకటితెరదించుట ఏమి న్యాయమయ్యా?

ఇది ఎట్లున్నదనిన ఉత్తమార్చన పూజసామగ్రితో పరమోత్సాహమున దివ్యమంగళవాద్యములతో వైభవోపేతమైన పూజ చేయునపుడు అకారణముగా త్రొక్కివిసరివేసినట్లయ్యెగదా స్వామి! సర్వశ్రేష్ఠులైన మీ శరణులకు బంటునై చేయు నా సేవానందము అన్యాయముగా చెడిపితివి గదయ్యా!

కంసాలి తన చిత్రనైపుణ్యముతో అలంకరించిన బంగారు కంకణము అతుకు ఏ కారణము లేకయే ఊడిపడిపోయినట్లయ్యె ఓ పశుపతీ! నీకేదియు ఘనము కాదు పోనీ, నీ ఇంటిలో గురుజంగములున్నారా? దాసోహము జరుగు చున్నదా? వచ్చిన వారికి అంత ప్రసాదము దొరకునేమయ్యా?

అయ్యా, మహానుభావులారా! నా విన్నపము వినండి బాచి రాజయ్య, మోళిగ మారయ్య మడివాళ తండ్రీ! ఇప్పటినుండి మా చెన్న బసవేశుడు మీ శిశువు అన్నివిధముల చూచుకొనుచు రావలెను

ఏమేమియో పుట్టినింటివారు ఆభరణములు చేయించి ఇచ్చినారు చీర రవికలు జలతారు వస్త్రాలు ఇచ్చినారు కొరతలేదు నాకింకను అలంకరించు కొనుటకు చేతకాదు నా మగనికి కావలసినట్లు అలంకరించుకొనని ఆయనకెట్లో నాకట్లే

మీ రేమనుకొన్నను మిమ్ములను విడిచిపోవ బుద్ధి పుట్టలేదు మగనాలు పుట్టింట నున్న మీకు మర్యాద రాదు మీ ఎడబాటు కడు దుఃఖము కలిగించును ఐనను పోవలెను అక్కడెటులనో! గురులింగ జంగమ ప్రసాదము దొరకునో లేదో?

అయ్యా, భక్తులారా! చిరకాల ముత్తయిదువలై శివానుభవ సంసారము సాగించండి...నన్ను మాత్రము మరువకండి ఒక మాట! కాల వ్యత్యాసము వల్ల అట్లయినది మేము తలచినట్లు బిజ్జళుడు చెడ్డవాడు కాదు మా ధర్మమున కెంతయో సహాయము చేసిన సజ్జనుడు ఆయనకు మీరందఱు కృప జేసి ముక్తి పదవి సీయండి

మీ కందఱకు శరణు శరణార్థులు పోయి వచ్చెద సెలవీయండి అని నమ్రతతో శరణ సతి భావమున తోడి సఖులతో తనదంతయు బసవ దేవుడు సామాన్యులలో సామాన్యుడై చెప్పుకొనుచున్నాడు అది చాలక మఱియు విన్న వించు కొనుచున్నాడు

నేను మీ బంటులకు బంటునయ్యా! నేను మీ ఆప్త సేవకులకు సేవకుడనయ్యా! నేను మీ తొత్తుల ఎంగిలితీయు పడితొత్తునయ్యా! కూడల సంగుని శరణుల కందరకు సంగన బసవన్న విన్నపము కవిలెకు (శివుని చేతిలోని భిక్షా పాత్ర) చెందిన మీ నిజపదమందు కూడుమని కృప జేయుడయ్యా! ౧

మఱియు

నేను చేసిన తప్పులెంచవలెనన్న గణన లేదు నడచి తప్పెదను మాటాడి తప్పుదును చేసి తప్పెద, ఇచ్చి తప్పెద కూడి తప్పెద ఎఱిగి తప్పెద మఱచి తప్పెద నా తప్పు ఒప్పు జేసికొనుటయే గాని చిత్తంబు నకు తేవలదు కూడలి సంగమ దేవుడను మగడు నన్ను కూడవలెనంచు పిలువనంపినాడు శివ శరణులందఱకు శరణనుచు వీడుకోలిచ్చు తవకంబులో (కోరికలో) నుంటిని ౨

**వివేచనము**

ఎంత చెప్పినను బసవన్న చెప్పునది ఉండనే ఉన్నది బ్రతికినన్ని నాళ్ళు ఏ సుఖము పొందక సద్భక్తిసంచయము చేసికొన్నాడు బిజ్జళుని ప్రధానోద్యో గియై సంపాదించిన దంతయు దాసోహమునకై వెచ్చించినాడు మానవత్వముతో

సమానతను ప్రతిపాదించి, అదివరకుండిన వర్ణ పద్ధతిని సమయింప పాటుపడి నాడు రాజకీయములో ధర్మరంగమును సంబంధీకరణము చేసినాడు బిజ్జళుడు, బసవరాజు రాజ్య రక్షణ, ధర్మ రక్షణ, సామాజిక రక్షణ, ఆర్థిక రక్షణలో సమాన మానస వృత్తితో పనిచేసినారు కాలములోనున్న వంకరలు ప్రస్తుతము భిన్నతను తెచ్చిపెట్టి యున్నందున, బసవన్న అటు రాజకీయ విప్లవములను, ఇటు ధార్మిక వియోగమును అనుభవించుచు, తాను చేసినదియే కాదు - చేయని ఎన్నియో అపరాధములు ఒకదాని నొకటి బయటపెట్టి శరణుల కృపాశీర్వాద ములు చేకొని ప్రయాణమునకు మొదలు ఏర్పాటు లన్నియు చేసి కల్యాణము నుండి వెడలినాడు

అంతవఱకు అణగి యుండిన సంక్షోభము చెలరేగింది ఏ అడ్డు ఆటం కాలు లేకుండ, సభా భవనమందు సింహాసనమున రాజ కార్య పర్యవేక్షణలో నున్న బిజ్జళుని జగదేవ, మల్లిబొమ్మయ్యలు నిరాతంకముగా పోయి చంపినారు తరువాత తమను తామె చంపుకొన్నారు కల్యాణములోని మహామంగళమును క్షణములో మృత్యువు మ్రింగినది త్రోవలో బసవన్న విన్నాడు ఇది శివేచ్ఛయైన విషాదమని కూడల సంగమ క్షేత్రమునకు వచ్చినాడు

ఏమైనదో ఏమో, నీలాంబికను (బసవన్నగారి భార్య) ఈ తొందరపాటులో పిలుచుకొని రాలేదు తనతోవచ్చిన హడపదప్పన్నను పిలుచుకొని వచ్చుటకు పంపగా, అప్పన్న అల్లకల్లోలమైన కల్యాణమును జూచి విషాదముతో నీలాంబిక దగ్గఱకు వచ్చి బసవన్న ఆజ్ఞ తెలపగా వినిన నీలాంబిక తన ఇష్ట లింగముతో చెప్పుకొనుచున్నది

**నీలాంబిక :**

రాగము - నాదనామ క్రియ,

చూడు చూడు చూడు చూడు చూడు లింగమా!
చూడు బసవయ్య ఆడు నాటకము ॥పల్లవి॥

అక్కడికి నన్ను రమ్మనినారంటి
ఇక్కడ తాము లేరేమయ్యా సంగయ్యా
అక్కడిక్కడను ఉభయ సందేహము
సకలము నెఱిగిన వారికి ఇది గుణమా?

పుడమిలో భక్త గణంబులు కూడి
యుండిన శ్రీగురు కరమందు
దృఢచిత్తమైయుండి కూడితినన్న
ఒడయడు సంగమ నాథుడు నీవు కావా 2

సంగన బసవన్నయన్న నిరూపణకు
సంగతమున చేయెత్తి వందించి
సంగమ నాథుడె ఈతండనుచు
అంగలింగములో అడగెదను 3

**వివేచనము :**

"చూచితివేమయ్యా, నీ భక్తుడు ఆడిన నాటకము: భార్యను ఇక్కడ మరచు టేమి? అక్కడ ఎలుగుటేమి? పైగా అప్పన్నతో పిలువనంపుటేమి? చిత్రము అక్కడేమి? ఇక్కడేమి? ఎక్కడ ఉన్నను నీలోనే ఉండినట్లు కదా! శ్రీ గురు విచ్చిన లింగము హస్తములో నుండగా ఎక్కడకో పోవుటెందుకు? అప్పన్నా! నీ యజమాని యాజ్ఞ విమర్శింపరానిది క్షమింపుమని చెప్పుము" అని ధ్యానస్థురా లయి నీలమ్మ కన్ను మూయగా, అప్పన్న చేయునది లేక ఎక్కువ కాలము ఆ దురంత వాతావరణమందుండజాలక ఉన్న విషయము కూడలికి వచ్చి బస వన్నకు చెప్పినాడు బసవన్న మౌనముతో అంగీకరించినాడు సంగమనాథుని అర్చించి వందించి ఇట్లు నివేదించుకొనుచున్నాడు

**బసవన్న**

నానా భవదుఃఖమందు పుట్టిన ప్రాణమందు తెచ్చి
తివి ఇక పుట్టలేను చావలేను జనన మరణంబులను
రెంటికి దూరమైతి నేనయ్యా మీరు చెప్పిన పని చేసితిని
ఇక కూడుకొనుమా కూడల సంగమదేవా! ౧౦

**వివేచనము**

స్వామి! సంగమదేవయ్యా! ఇక చాలు ఎన్నో దుఃఖ నిర్మిత జన్మాలలో వచ్చినాను చెప్పిన పని చేసినాను మీలో కూర్చుకొనుము ఇది ఒక విన్నపము

శరణ సన్నిహితుండు ఐక్యము పొందువేళ హరి బ్రహ్మమొదలైన ముప్పదిమూడు కోట్ల దేవతలు ఉఘే ఛాంగుభళా అనుచుండ బసవన్నకు ఐక్యస్థాన మెక్కడనిన - అంగకళలందు కుడిభాగము బ్రహ్మస్థానము ఎడమ భాగము నారాయణుని స్థానము ఒల్లనయ్యా ఆ స్థానంబులను కంఠము గరళస్థానము నోరు నీరుండు స్థానము నాసిక వాయుస్థానము కన్నులు అగ్నిస్థానము జట గంగాదేవి స్థానము నొసలు చంద్రుని స్థానంబు వెన్ను సూర్యుని స్థానము చరణములు అష్టదిక్పాలకుల స్థానము గుహ్యము కాముని స్థానము హస్తంబులు త్రిశూల కపాల ఖట్వాంగ డమరుక స్థానములు ఇటుల అన్ని స్థానంబుల నొల్లనయ్యా! హృదయ కమలాంతరాళ మందున్న ఏక పీఠంబు సింహాసనము తెరపీయుమయ్యా కూడల సంగమదేవా! ౧౧

**వివేచనము :**

(గొ సి వీరన్న ఒడెయుల గద్యము)

ఇట్లనుచు బసవరాజదేవుడు అత్యంతాసక్తితో విన్నవించుండగా మన్మనో మధ్యంబున చిదాత్మలింగంబు వెలిగి కనిన ఆ క్షణమందు, మేఘమందు మెఱపు మెఱసినట్లు, దినకరుని కోటి ప్రభాపుంజము పైకొని వచ్చినట్లు, చంద్రకోటి తేజంబు సమకూడిన మూర్తి ధరించి ఆ సంగమేశ్వరుడు జంగమ స్వరూపంబున వచ్చి, ఆ బసవరాజదేవుని బిగియార కౌగిలించుకొని తమ హృదయ కమలమందడగించుకొని, ఆ లింగములో ఆ మూర్తి అడగిన ప్రస్తావన వచనము—

ధర-ఆకాశంబునడుమ ఒక్కమావి పుట్టియుండె ఆ చెట్టుకు కొమ్మలు రెండు, ఆకులు మూడు, పుష్పము-లు ముప్పదియారు, కాయ - ఒకటి పండయి రసముతో నిండినది ఏ మియుకాన ఆకులు రాలిన పండు తొడిమ వదలి పడియుండె ఆ పండును ప్రభుదేవుడు ఆరోగించి (భుజించి - తిని) నిజమందు నిర్వయలయ్యె

ప్రభుదేవుని కారుణ్య ప్రసాదము నేను స్వీకరించితి
గాన కూడల సంగమ దేవుడు ఇటు రమ్మనుచు తమ
హృదయ కమలమందుంచుకొనెను ౧౨

(గొ సి వీరణ్ణొడెయుల గద్యము)

**వివేచనము**

ఇట్లు బసవరాజ దేవుని తమ యందుంచుకొన్న గురుమూర్తి యాక్షణము నందే సాకారంబు వదలి నిర్వయలు కాగి, ఓహో! యనుచు ఎల్లకడల శివభక్తుల కీర్తనలు మొరసెను గాలిలో సుడిగాలి చేరినట్లు, నభమందు విరాజిల్లు మెఱపు నభంబుననే మెఱసి యడగినట్లు, ఉదకముననుండు వారిశిల ఉదకంబులో నడగినట్లు, కుసుమమందు పరిమళ మొదగినట్లు, పాలునందు పాలు కూడినట్లు, చంద్రునందు కళలుదయించి మఱల చంద్రునిలో చేరినట్లు బసవరాజ దేవుడు సంగమేశ్వరుడను గురుమూర్తి హృత్కమలమందు విశ్రాంతి పొంది, ఆ గురువే తానై యుండెను

బసవభానుడు అస్తంగతుడైనాడు శూన్య సంపాదనము సంపాదనా శూన్యమైనది దిన దినము సూర్య భగవానుడు లోకమునకు చూపుచున్నాడు - ఉదయముతో క్రియా సంపాదనమై, మధ్యాహ్నమున విరాజమానమై, సాయం కాలమున క్రియా రహితమై, జ్ఞానమై మిగులునన్నది ప్రపంచ చరిత్రలు ముక్తాయ మగునపుడు (ముగియుచున్నపుడు) ఇంతేనేమో! మానవ తత్వమును శివ తత్త్వ మున కెత్తి కట్టు కార్యరంగములో బసవన్న చేసిన కృషి అపూర్వము. అగాధము సమాజము సమాజాభివృద్ధి సర్వసమానత్వమునకు వచ్చుటకు 'నాకన్న చిన్నవారు లేరని' ప్రతి యొకరు తెలిసి ప్రవర్తించిన మాత్రమే సాధ్యమనినాడు లోక వక్రతను దిద్దు నాయకత్వము వహించుట కన్న ఒక్కొక్కరు తమలోని వంకర అవగుణము దిద్దుకొనిన, మానవ సమాజము ఆర్థిక, నైతిక, ధార్మిక, రాజకీయ, సామాజిక కార్యరంగములు నానా ముఖములుగా అభివృద్ధి కాంచగలవని చేయెత్తి చెప్పినాడు జీవనములో సులభ సరళతలు తెచ్చికొనినపుడు కృత్రిమ జీవనమునకు మానవత్వము బలికాక, సమన్వయము సమాజములో విరాజిల్లునని మనవి చేసినాడు

పరావలంబనము మనిషికి ఎంత మాత్రము తగదని, మొదట ఆర్థిక స్వాతంత్ర్యమును, కాయకమే కైలాసమను క్రొత్త కార్య రంగము నిర్మించి నాడు ఈ కార్య రంగములు ప్రభుత్వమునకు సంబంధించినవి కావు ఎవరికి వారె తమ పనులకు తామె ప్రభువులు సహకార సహానుభూతులు, సత్వగుణము ప్రజల యందు వెలుగొందవలెను అవి లేకపోయిన ఆ రాష్ట్రము అభివృద్ధికి రాలేదు ఇంకెన్నియో అభిప్రాయములు మానవ సంఘములో నెలకొల్పవలెనన్ని తలచి యుండగా, చాల చిన్న వయసులోనే ఓర్వని కాలము బసవన్నను ఈ లోకము నుండి మఱుగుపరచినది బసవన్న బయలైనపుడు నలుబది సంవత్సరముల లోపు వయసు వాడని చరిత్ర కారుల అభిప్రాయము

కూడల సంగమ క్షేత్రములో బసవన్న సంగమునిలో చేరెనననిన విషయము ఇంకను కల్యాణమును విడువని శరణులకు తెలిసినది ముఖ్యముగా బసవన్న భార్య నీలమ్మ దుఃఖాకులచిత్తయై ఇట్లనుచున్నది

**నీలమ్మ :**

నా కింకేమి మా యయ్య ఐక్యమైన మీద? నాకు
కాయము లేదు నాకు ప్రాణంబు లేదు నాకు హృద
యంపు హంగులేని పరిణామ ప్రసాదినైతిని సంగయ్యా! ౧౩

**వివేచనము :**

అప్పన్న వచ్చి పిలచినప్పుడున్న ధృతి, బసవన్న పోయిన తరువాత మిగుల లేదు సంసారమే సంగమ పూజా దాసోహ రంగముగా తానును బసవన్నయు అలసట లేని, సంచలనము లేని గురులింగ జంగమ దాసోహములో మునిగి యుండెడివారు తోడు నీడగా నున్న నీలమ్మ వంటి భార్య దొరికి నందున బసవన్న దాసోహము ఎన్నడను కొరత పొందలేదు నీలమ్మ చాల వ్యధకు గుఱియై, "ఇంకేమున్నది-నా కేదియు లేకపోయె"నని శోకించునపుడు చెన్న బసవన్న సమాధానముగా చెప్పుచున్నాడు

**చెన్న బసవన్న :**

శ్రీ గురువు తన సాకారము వదలి నిరాకారుడైన
సందేహము వలదు సాకారంబు నుండి ఉపదేశము చేసి

కాయము సమర్పించుకొని శుద్ధుని జేసెను ప్రాణమం
దడగి సిద్ధుని జేసెను ఆత్మ పదమందు నిలిపి ప్రసిద్ధుని
జేసెను ఇట్టు అవిరళ గురుతత్త్వ సంగన బసవన్న నీ
యందు పరిపూర్ణుడయ్యె కనుమా, కూడల చెన్నసంగమ
దేవయ్యా! ౧౪

**వివేచనము**

"అమ్మా! శోకమున కెడ మీయకుము శ్రీగురుడు లేడనరాదు అతడు సాకార నిరాకార సమన్వయుడు భక్తోద్ధరణమునకై సాకారుడై ఉపదేశమిచ్చి కాయమును శుద్ధి జేసెను ప్రాణమును సిద్ధి యొనర్చెను ఆత్మను ప్రసిద్ధము జేసెను అట్టి సంగన బసవన్న నీయందు పూర్ణుడై యున్నాడు తల్లీ! లేడని చెప్పరాదు" అని అనునయముతో చెన్నబసవన్న సమాధానము చెప్పగా విని నీలమ్మ ఇట్లనుచున్నది

**నీలమ్మ**

అడవియందు కన్ను చెడిన పశువై ప్రలాపించు
చుంటినయ్యా! అతి దుఃఖంబున మునిగిన శరణ చెన్న
డెఱిగి శివ శివాయను మంత్రము తెలిపి పరితాపము,
బడలిక ఉండకుండ పోగొట్టెనయ్యా! సంగమునందు
చెన్నబసవన్నకు నమో నమో అనుచుంటిని ౧౫

మఱియు

ఓ నా అయ్యా! కరస్థలము బయలైనది నాకు
కరస్థలము మనస్థ్సలమై యుండె సంగయ్యా! బసవయ్య
పోయిన చోటు నే నడిగితినయ్యా, నీ చెంత ౧౬

**వివేచనము**

చెన్న బసవన్న వచనామృతము నీలమ్మకు సమాధానమిచ్చినది అప్పుడు బసవని స్తోత్రము చేయుచు లింగమందు సమరసమైనది ఈ విషయము సొన్నలాపురములోనున్న సిద్ధరామదేవునకు తెలిసి ఖేదమందినాడు బసవన్న కట్టిన భక్తి భవనమునకు ఇంత శీఘ్రముగా ఇంతటి అంతరాయము కలిగి నందులకు,

బసవన్న బయలైనందున పరితాపమొందినాడు నీలమ్మ ఐక్యము గని అక్క నాగమ్మ వ్యథచెంది ఇట్లనుచున్నది

**అక్కనాగమ్మ**

అయ్యా! నే దిక్కులేని దాననయ్యా! చేయూత
ఇత్తురా అయ్యా! చిన్న దూడను పసికందును లాగుకొని
వెళ్లుదురె భక్తులు? అయ్యో అయ్యో అనుచుండ లాగుదురే
బసవన్న ప్రియ చెన్నసంగయ్యా! ౧౭

**వివేచనము :**

"అయ్యా! అయ్యా! నేను దిక్కులేనిదానను నా గతి యేమి? నాకు చేయూతనిచ్చికొని పోవుదురే? నాతండ్రి బసవన్న లేకపోయె నే ననాథనైతిని" అనినది బాల్యమున ఉపనయన వ్యాజమున తండ్రికొడుకులకైన వివాదముతో ఇంటిని తల్లిని సర్వబంధువులను విడిచి నిశ్శంకతో బసవన్న తాను పట్టిన ధర్మమే సర్వస్వమని వచ్చినపుడు తమ్మున కండగా వచ్చిన అక్క నాగమ్మ తమ్ముడు బసవన్న చిన్నవాడని కరుణతో వదలినంతయు వచ్చినది తానైయై అహర్నిశలు తమ్ముని మార్గానుసారియై ప్రతి కార్యమునకు సహకారియై నిలిచి, తన సంసారముతో బాటు, బసవన్న యొక్క పెద్ద సమాజ శరణ సంసారమును కూడ ఎచ్చరికతో (జాగృతితో) చూచికొని వచ్చుచుండెను

కొడుకు చెన్నబసవన్నను బసవని కార్యమునకే చేర్చెను ఇటులుండిన తనకు బసవన్న చెప్పకపోవుట అపరాధమని నాగమ్మ అనలేదు "ఎంత తొందర కలిగినదో! లేకున్న చెప్పకపోవునా?" యని అనుతాపములో మునిగి, "నీలమ్మయు ఐక్యమైన తరువాత ఇంకేమి కలదని" "తమ్ముడు బసవన్న నాగమ్మకు గురుస్వరూపుడు" అని అతని ధ్యానముతో లింగైక్యముసుతలచి ఇట్లనుచున్నది

ఆచారమనునది అగోచరము ఎవ్వరికిని సాధ్యం
బగాదు మర్త్యలోకమందు సదాచారమును పెంపొం
దించవలెనని బసవన్న వచ్చి భక్తిస్థలంబు చెప్పె గురు

లింగ జంగమ దాసోహ ప్రసాద పాదోదకమార్గ మెల్లరకు
చూపె శివాచారాభివృద్ధిని ఔను కాదని బిజ్జళుడు తర్కిం
చిన, అనంతముఖమునుండి సమ్మతి పరచి ఔననిపించె
వచ్చిన మణిహము (శరణాగతి సేవ) తీరెనంచు లింగ
గర్భమందు జొచ్చిన, వెనుక లోక మెఱిగి బ్రతుకవలె
నంచు బెరగిచ్చెను నేను వెనుక నున్నదాన నంచు
ముందు గతిని జూపి బసవన్న ప్రియచెన్నసంగుని
యందు తన ప్రసన్నతయందు కూడబెట్టుకొనెను నను
కిన్నతండ్రి సంగన బసవడు ౧౮

**వివేచనము**

బసవని గుణగానముతో అక్క నాగమ్మ లింగైక్యము పొందెను ఇతర శరణులు తమ తమ లింగమార్గానుయాయులై పోయిరి అన్నియు అన్ని కాలములలో నుండవు ప్రకృతి ఋతుధర్మము ననుసరించి క్రియాకాలములలో ఏయే పదార్థములు లభింపవలెనో ఆ నియమ ప్రకారమే అనుసరించునట్లు ధర్మమునకును ఒక ఋతుధర్మమున్నదేమో! ఆ అవధి తీరిన తరువాత మరియొక చెడు ఆ చోటునకు రాబోవును చెన్నబసవన్న, మడివాళ మాచిదేవుడు మొదలగు అసంఖ్యాత గణంబులు కల్యాణము వదలి ఉళవికి (ఎల్లమల) వచ్చిరి ఇంతయే ఈ శూన్యసంపాదనమునకు కావలసినది ఈ సందర్భమున ఎన్నియో ఏమేమియో జరిగినవని చరిత్రకారులు చెప్పుదురు అవేవియు అవసరములేని ముగింపును శూన్యసంపాదనాకారులు ఉళవికి తెచ్చుకున్నారు వారు చరిత్రకారులు కాదు తాత్విక సంబంధము ననుసరించియే చెప్పినారు

తరువాత ఉళవిలో చేయవలసిన కార్యములేవియోచేసి సర్వగణ నికరము తమ లింగానందములో ముక్తులైనారు ఇదియంతయు మడివాళయ్య చూచి తాను ముక్తుడగుచు ఇట్లనుచున్నాడు

**మడివాళయ్య :**

నిర్వాహమాయెనయ్యా బసవన్నకు కప్పడి సంగయ్య యందు అక్క నాగాయి, మిండ మల్లినాథ, హడప దప్పన్న, మొగవాడ కేశిరాజు, కోల శాంతయ్య మొదలైన శివగణంబు లందఱు బసవని బయలునందు బయలైరి ఆ బయలు ప్రసాదమునుండి నిరుపమ ప్రభు దేవుడు కదళి యందు బయలయ్యె ఆ బయలు ప్రసాదము నుండి మోళిగ మారయ్య, కక్కయ్య, పడిహారి ఉత్తన్న, కన్నపు మారన్న, కలికేత బొమ్మన, నులియ చందయ్య, హెండెద మారయ్య, శంకర దాసిమయ్య, ఏకాంత రామయ్య, మేదర కేతయ్య మొదలైన ఏడు వందల డెబ్బది అమర గణంబుల దండు కైలాసమునకు నడచియుండె వచ్చినపని ముగిసినది అందఱు పురాతనులు నా మనములోని మలినంబు కడిగిన కారణమున కలిదేవయ్యా, వీరందఱి పవిత్రపు ప్రసాదపు బయలు నాకు కలిగె ౧౬

**వివేచనము .**

శరణ సమూహములో ప్రచండుడైన, వీరభద్రావతారమని ఖ్యాతిపొందిన ఎవరి తప్పులైన సరియే, కొనకు బసవన్నను కూడ లెక్కపెట్టక విమర్శించిన సద్ధర్మమూర్తి మడివాళ మాచిదేవుడు శరణుల లింగైక్యములు స్తోత్రము లై వారి, గుణము లెంచి, కడకు వారి యనుగ్రహమున తాను బయలగుదునని చెప్పి బయలయ్యె

తరువాత చెన్నబసవన్న, బసవన్న చెప్పిన కర్తవ్యమును ముగించి తన ముక్తాయమును (ముగింపు) ఇట్లు చెప్పుకొనుచున్నాడు

**చెన్న బసవన్న**

పంద్రెండు ఆమడల విస్తీర్ణపట్టణమునకు-కల్యాణ మను ప్రణతి (ప్రమిదె) యందు మహత్తు అను నూనె వేసి, జ్ఞానమను జ్యోతిని వెలిగించి ఒప్పుచుండె నయ్యా! అక్కడ కాకయ్య, మౌడయ్య, కోల శాంతయ్య, మొగ వాడపు కేశిరాజయ్య, ఖండెయము బొమ్మన్న,మిండ మల్లి నాథ, హడపదప్పన్న, మడివాళయ్యలు, అవ్వనాగాయి సహితము వీరందరు సంగన బసవని బయలుగూడి చనిరి ఈ కారణమున కూడల చెన్న సంగమ దేవు నందు వీరందరి ప్రసాదంపు బయలు నాకయ్యె ౨౦

**వివేచనము**

శివశరణుల ఐక్యములు చెన్నబసవన్న వినుతించి తాను వారి బయలులో బయలయ్యె, ఒకానొక కాలమందు (12 వ శతాబ్దము) జరిగిన చరిత్రలు తరువాతి కాలమునకు దృష్టాంతములై, ముందు కాలమునకు మార్గదర్శకములుగా ప్రపంచ చరిత్రలో అగాధములై యున్నను, చరిత్ర రూపించిన మహామహులు అధర్మమును ఖండించి, ధర్మమును రక్షణము సేయుచు వచ్చినారు ఏది యెట్లుండ వలయునో అట్లు సరిదిద్దుకొని కాలపురుషుడు తనముందు ఎవరిదియు ఏమియు స్థిరముగా నుండదని చూపుచు వచ్చిన దానిలో పంద్రెండవ శతాబ్దమందు నడచిన శరణ చారిత్రము ఒకటని చెప్పుచున్నది

— o —

ఇది కృపామూర్తులైన శ్రీ మృత్యుంజయప్పగారిని, స్వప్నబోధామూర్తులైన శ్రీ ఎఱ్ఱి తాతయ్యగారిని స్మరించి, సకల శివశరణులను వందించి శూన్య సంపాదనలోని "గోరక్షకుని సంపాదనము మఱియు సర్వ శరణుల ఐక్యము" నకు సంగ్రహముగా చెప్పిన వ్యాఖ్యానము సంపూర్ణము

— o —

## సమాప్త వాక్యము

కం॥ గురు తోంటద (తోంటయొక్క) సిద్ధేశుని
చరణాంభోజాతము నిశ్చల కృతచిత్తో
త్కర సిద్ధ వీరయోగి
శ్వర శరణుల చెవికి వచన సద్బోధలిడెన్

ప్రభుదేవుల శూన్యసంపాదనము సమాప్తము

మంగళమహా

శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ

# పారిభాషిక పదకోశము

## (సంఖ్యానుక్రమము)

| | |
|---|---|
| నిరంజన | పరశివుని శిఖాచక్రములోని మహా చైతన్యమూర్తి లింగ మునికి అనాది పరవస్తువు |
| లింగము | పరాత్పర పరవస్తువు వీరశైవ ఆరాధ్యమూర్తి ఏలిక గుఱుతు |
| అంగము | శుద్ధాంతఃకరణమైన జనము శివాంశికమైన ఆత్మ |
| ద్వివిధ స్థలము | లింగస్థలము-అంగస్థలము (నిరవయవము - నిరామయము) |
| త్రివిధ సమాధులు | సంప్రజ్ఞాత, అసంప్రజ్ఞాత, సవికల్ప నిర్వికల్ప సమాధులు |
| త్రివిధ గురువులు | దీక్షాగురువు, శిక్షాగురువు, మోక్షగురువు |
| త్రివిధ లింగములు | ఇష్టలింగము, ప్రాణలింగము, భావలింగము |
| త్రివిధ జంగములు | స్వయ - చర-పర జంగములు |
| త్రివిధ దీక్షలు | వేధాదీక్ష, మంత్రదీక్ష, క్రియాదీక్ష, ఆయత, స్వాయత సన్నిహితములు |
| త్రివిధ మలములు | కార్మిక మలము, మాయా మలము, ఆణవ మలము, ధనము-స్త్రీ-భూమి |
| త్రివిధ తనువులు | స్థూల సూక్ష్మ, కారణ తనువులు, కనబడు కాయము, గంభీర కాయము, సత్కారణ కాయము |
| త్రివిధాంగములు | త్యాగాంగము, భోగాంగము, యోగాంగము, అంగము, అంతరంగము, ఉత్తమాంగము |
| త్రివిధావస్థలు | జాగ్రదవస్థ, స్వప్నావస్థ, సుషుప్త్యవస్థ |
| జీవత్రయము | విశ్వజీవము, తైజసజీవము, ప్రాజ్ఞజీవము |
| ఈశ్వరత్రయము | వైశ్వానర (సూత్రాత్మ), ఈశ్వర (విరాట్), హిరణ్య గర్భ (బ్రహ్మ). |
| గుణత్రయము | సత్వగుణము, రజోగుణము, తమోగుణము |
| భువనత్రయము | స్వర్గము, మర్త్యము, పాతాళము |

| | |
|---|---|
| కర్మత్రయము | సంచితము, ప్రారబ్ధము, ఆగామి |
| ఆత్మత్రయము | ఆత్మ, అంతరాత్మ, పరమాత్మ |
| మనస్త్రయము | మనము, సన్మనము, ఉన్మనము |
| రూపత్రయము | రూపము, చిద్రూపము, నిరూపము |
| హస్తత్రయము | తనుహస్తము (చేయి), మనహస్తము (ప్రాణము), ఆత్మహస్తము (భావము) |
| భావత్రయము | భావము, అనుభావము, నిర్భావము |
| తత్త్వత్రయము | శివతత్త్వము (1) విద్యాతత్త్వము (10) ప్రకృతి తత్త్వము (25) |
| తాపత్రయము | ఆధ్యాత్మికము, ఆధిభౌతికము, ఆధిదైవికము |
| కరణత్రయము | కాయము, వాక్కు, మనసు |
| ఈషణత్రయము | ధనేషణ, దారేషణ, పుత్రేషణ |
| త్రినేత్రములు | చంద్రుడు, సూర్యుడు, అగ్ని |
| దార్శనికత్రిపుటి | జీవము, జగత్తు, ఈశ్వరుడు |
| త్రిపుటి | జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయములు |
| త్రిపురములు | స్థూలతనువు, సూక్ష్మతనువు, కారణతనువు, ఇనుము, వెండి బంగారపు పురములు |
| త్రివిధ దాసోహము | గురు, లింగ, జంగమ దాసోహములు, (గురునకు తనువు, లింగమునకు మనసు, జంగమునకు ధనము అర్పించుట) |
| కాలత్రయము | భూతకాలము, వర్తమానకాలము, భవిష్యత్కాలము, ఉదయము, మధ్యాహ్నము, అస్తమానము |
| త్రివిధ పాదోదకములు | గురు లింగ జంగమ పాదోదకములు ధూళిపాదోదకము, క్రియాపాదోదకము, జ్ఞానపాదోదకము - కరుణజలము, వినయజలము, సమతాజలము - దీక్షాపాదోదకము, శిక్షా పాదోదకము, మోక్ష పాదోకము |
| త్రివిధ ప్రసాదములు | గురు, లింగ, జంగమ ప్రసాదములు, శుద్ధము, సిద్ధము, ప్రసిద్ధము |
| త్రివిధ ప్రసాదులు | అచ్చప్రసాది, అవధానప్రసాది, సమయప్రసాది |
| లింగార్చనా త్రిపుటి | చూచుట, చేయుట, చేరియుండుట |

| | |
|---|---|
| త్రివిధ భక్తులు | గురుభక్తి, లింగభక్తి, జంగమభక్తి |
| త్రివిధ లింగములు | క్రియాలింగము, జ్ఞానలింగము, భావలింగము |
| త్రివిధ సత్క్రియలు | అర్చనము, అర్పణము, అనుభవము |
| త్రివిధ భస్మములు | భూతి, విభూతి, చిద్భూతి |
| త్రివిధ రుద్రాక్షలు | రుద్రాక్షేపణము, రుద్రాక్షకళ, రుద్రాక్షభావము |
| త్రివిధ మంత్రస్వరూపములు | నాదము, బిందువు, కళ (చిన్నాద, చిద్బిందు, చిత్కళలు) |
| మంత్రత్రయము | మంత్రమూలము, మంత్రశాఖ, మంత్రభావము |
| త్రివిధార్చనలు | ధ్యానార్చనము, జ్ఞానార్చనము, మౌనార్చనము |
| పుష్పత్రయము | తరుపుష్పము, అంతరపుష్పము, పరపుష్పము |
| జపత్రయము | కరజపము, స్వరజపము, బయలజపము |
| త్రివిధార్పితములు | కాయార్పితము, కరణార్పితము, భావార్పితము |
| త్రివిధేంద్రియములు | కర్మేంద్రియము, జ్ఞానేంద్రియము, కరణేంద్రియము |
| త్రివిధ ముద్రలు | శాంభవీముద్ర, షణ్ముఖిముద్ర, ఖేచరీముద్ర |
| మార్గత్రయము | భక్తిమార్గము, జ్ఞానమార్గము, వైరాగ్యమార్గము |
| నాడీత్రయము | ఇడా, పింగళ, సుషుమ్నానాడులు |
| చతుర్యుగములు | కృతయుగము, త్రేతాయుగము, ద్వాపరయుగము, కలియుగము |
| చతుర్విధ మోక్షములు | సాలోక్యము సామీప్యము, సారూప్యము, సాయుజ్యము |
| చతుర్విధ పురుషార్థములు | ధర్మము, అర్థము, కామము, మోక్షము |
| చతుర్విధ ముఖ్యాంశ సంపత్తులు | గురువు, లింగము, జంగమము, ప్రసాదము |
| చతుర్విధ పరిణామములు | ధ్యానము, మౌనము, నేమము, నిత్యము |
| చతుర్విధయోగములు | మంత్రము, లయ, హఠయోగము, రాజయోగము |
| చతుర్వేదములు | ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదము |
| చతుర్విధ మహావాక్యములు | అహం బ్రహ్మాస్మి, అయమాత్మా బ్రహ్మ, ప్రజ్ఞానం బ్రహ్మ, తత్త్వమసి |

| | |
|---|---|
| అనుబంధ చతుష్టయము | అధికారి, విషయము సంబంధము, ప్రయోజనము |
| చతుర్వర్ణములు | బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య శూద్ర వర్ణములు |
| చతుర్విధములు | కారణత్వము, తుర్యత్వము, చిత్సూర్యత్వము, ధైర్యము |
| చతుర్విధ స్వరూపములు | సాధ్యము, వేద్యము, భేద్యము, ఆరాధ్యము, సద్భక్త లింగైక్య, సత్ప్రిమథ, ప్రమథ గణములు |
| అంతఃకరణ చతుష్టయము | చిత్తము, బుద్ధి, అహంకారము, మనము |
| చతుర్యోనులు | అండజము, స్వేదజము, ఉద్భిజము, జరాయుజము |
| అంగ చతుష్టయములు | అంగము, ప్రత్యంగము సాంగాంగము, ఉపాంగము |
| చతుర్విధ సంబంధములు | గురు సంబందము, లింగ సంబంధము, జంగమ సంబంధము, ప్రసాద సంబంధము (ముఖ్య సంపత్సంబంధములు) |
| పంచభూతములు | భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశములు |
| పంచభూత తన్మాత్రలు | గంధము, రసము, రూపము, స్పర్శము, శబ్దము |
| పంచ జ్ఞానేంద్రియములు | ముక్కు, నాలుక, కన్ను, చర్మము, చెవి |
| పంచ కర్మేంద్రియములు | పృష్ఠము, గుహ్యము, పాదము, పాణి, ముఖము |
| పంచప్రాణములు | ప్రాణము, అపానము, ఉదానము, సమానము, వ్యానము |
| నాగపంచకము (వాయువులు) | నాగము, కూర్మము, కృకరము, దేవదత్తము, ధనంజయము |
| ఆకాశపంచకము | మనము, బుద్ధి, చిత్తము, అహంకారము, ఆత్మ |
| పంచసదాఖ్యములు | కర్మ, కర్తృ, మూర్తి, అమూర్తి, శివ |
| పంచకళలు | నివృత్తి, ప్రతిష్ఠా, విద్యా, శాంతి, శాంత్యతీతములు |
| పంచవర్ణములు | పీతము, శ్వేతము, మాంజిష్ఠము, హరితము, కపోతము |
| పంచనాదములు | 1) తాళవాద్యము (కంపనమువలని శబ్దము) 2) తంత్రీ వాద్యము (వాదనమువలని శబ్దము) 3) చర్మవాద్యము 4) పిల్లనగ్రోవి, నాగస్వరము, శంఖము మొదలగువాని నుండి పుట్టు శబ్దము 5) వచన గీత రూప శబ్దము. |

| | |
|---|---|
| పంచాచారములు | లింగాచారము, సదాచారము, శివాచారము, గణాచారము, భృత్యాచారము |
| పంచబ్రహ్మములు | సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన |
| పంచద్రవ్యములు | భౌతిక ద్రవ్యము, తను ద్రవ్యము, మనో ద్రవ్యము, జ్ఞాన ద్రవ్యము ఆత్మ ద్రవ్యము |
| పంచ మహా పాతకములు | అన్య స్త్రీరతి, అన్యనింద, పరహింస, అన్యద్రవ్యాపహరణము అన్యదేవతారాధనము (గురు, లింగ, జంగమ, ఆచార, ప్రసాదముల ద్రోహము) |
| పంచ సూతకములు | జాతి, జనన, ప్రేత, రజస్, ఉచ్ఛిష్ట సూతకములు |
| పంచామృతములు | ఆవుపాలు పెరుగు, నెయ్యి చక్కెర, తేనె |
| పంచగవ్యములు | గోమయము, గోమూత్రము, గోక్షీరము, గోదధి, గోఘృతము |
| పంచపరుషములు | మనఃపరుషము, దృష్టిపరుషము, భావపరుషము, హస్తపరుషము, వాక్పరుషము |
| ఉపాసనాపంచకము | పటలము, పద్ధతి, కవచము, సహస్రనామము, స్తోత్రము |
| పంచకృత్యములు | సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహములు |
| శాక్తేయ పంచ మకారములు | మద్యము, మాంసము, మత్స్యము, ముద్రా, మైథునము |
| పరశివుని పంచ లక్షణములు | సత్, చిత్, ఆనంద, నిత్య, పరిపూర్ణములు |
| లింగము పంచ లక్షణములు | బాణ లింగము మట్టుకొలత, దాని యింత పీఠము, దాని కొలత ఎత్తు, దానియర్ధము గోముఖము, అర్ధబాణము మేలుండుట |
| శివయోగపంచకము | శివజ్ఞానము, శివభక్తి, శివధ్యానము, శివామృతము, శివార్చనము |
| పంచ నియమములు | అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము |
| పంచ నియ మాంగములు | శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము |
| పంచప్రత్యాహారములు | తను, కర్మేంద్రియ, జ్ఞాన, మన, బుద్ధి ప్రత్యాహారములు |
| కాముని పంచ బాణములు | అరవిందము, అశోకము, మావి, మల్లె, కమలము |

| | |
|---|---|
| పంచశుద్ధులు | ఆత్మశుద్ధి, భూతశుద్ధి, జీవశుద్ధి, మనశ్శుద్ధి, ద్రవ్యశుద్ధి |
| పంచవిధ ప్రసాదములు | ఆది ప్రసాదము, అనాది ప్రసాదము, గణప్రసాదము, సమయ ప్రసాదము, జంగమ ప్రసాదము |
| పంచగణాధీశ్వరులు | రేణుక, దారుక, ఘంటాకర్ణ, ధేనుకర్ణ, విశ్వకర్ణ— రేవణారాధ్య, మరుళారాధ్య ఏకోరామారాధ్య పండితారాధ్య విశ్వారాధ్య |
| పంచవిధ విభూతి | భసిత, భూతి, భస్మ, క్షార, రక్షలు |
| పంచక్లేశములు | అవిద్య, అస్మిత, రాగ, ద్వేష, అభినివేశములు |
| పృథ్వీజన్య పంచ పదార్థములు | అస్థి, మాంసము, చర్మము, నరము, రోమము |
| జలజన్య పంచకము | శ్లేష్మము, మూత్రము, పిత్తము, శుక్లము, రక్తము |
| అగ్నిజన్యపంచకము | క్షుధా, తృషా, నిద్రా, ఆలస్య, సంగమములు |
| వాయుజన్యపంచకము | నడచుట, ఎగురుట, చుట్టుట, వ్యాపించుట, లేకుండుట. |
| ఆకాశజన్యపంచకము | రాగము, ద్వేషము, భయము, లజ్జ, మోహము |
| పంచవైరాగ్యములు | శ్మశాన వైరాగ్యము, పురాణ వైరాగ్యము, ప్రసూతి వైరాగ్యము, పిత్త వైరాగ్యము, స్వానుభవ వైరాగ్యము |
| ప్రణవ షడాకృతులు | తారక, దండక, కుండల, అర్ధచంద్ర, దర్పణ, జ్యోతి |
| లింగషడవయవములు | వృత్తము, కటి, వర్తులము, గోముఖము, నాళము, చిత్పీరము |
| షల్లింగధారణ స్థలములు | కరము, కక్ష, ఉరము, శిరస్సు, ముఖసజ్జ, అమలైక్యము |
| షల్లింగములు | ఆచార, గురు, శివ, జంగమ, ప్రసాద, మహాలింగములు |
| షడంగములు | భక్త, మహేశ, ప్రసాది, ప్రాణలింగి, శరణ, ఐక్యములు, |
| షట్ప్రణవములు | నకార, మకార, శికార, వకార, యకార, ఓంకారములు |
| షణ్ముఖములు | ఘ్రాణ, జిహ్వా, నేత్ర, త్వక్, శ్రోత్ర, హృదయములు |
| షట్ఛక్తులు | క్రియా, జ్ఞాన, ఇచ్ఛా, ఆది, పరా, చిచ్ఛక్తులు |
| షడ్విధభక్తి | శ్రద్ధా,నిష్ఠా, సావధాన, అనుభవ, ఆనంద, సమరసములు |
| షడ్హస్తములు | సుచిత్త, సుబుద్ధి, నిరహంకార, సుమనస, సుజ్ఞాన, సద్భావ హస్తములు |

| | |
|---|---|
| షట్ ప్రసాదములు | సుగంధ, సురస, సురూప, సుస్పర్శ, సుశబ్ద, సుతృప్తి- |
| షట్చక్రములు | ఆధారము, స్వాధిష్ఠానము, మణిపూరము, అనాహతము, విశుద్ధి, ఆజ్ఞా |
| చక్రస్థానములు | గుద-గుహ్య-నాభి హృదయము-కంఠ-భ్రూమధ్యము |
| చక్రదళములు | 4 - 6 - 10 - 12 - 16 - 2 |
| షట్కరణములు | చిత్తము, బుద్ధి, అహంకారము, మనము, జ్ఞానము, భావము |
| అరిషడ్వర్గము | కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మత్సరము |
| షడూర్ములు | ఆకలి, దప్పి, సుఖము, దుఃఖము, జననము, మరణము |
| షడ్భ్రమలు | జాతి, వర్ణ, ఆశ్రమ, కుల, గోత్ర, నామములు |
| శివుని షట్ఛక్తులు | సర్వజ్ఞత్వము, నిత్యతృప్తి, అనాదిబోధాశక్తి, స్వతంత్ర శక్తి, అలుప్తశక్తి, అనంతశక్తి |
| షట్కర్మములు | శాంతి, వశీకరణము, స్తంభనము, విద్వేషణము, ఉచ్చాటనము, మారణము |
| షడ్ధ్వములు | వర్ణము, పదము, మంత్రము, కలా, భువనము, తత్త్వము |
| షడ్దర్శనములు | సాంఖ్యము, యోగము, న్యాయము, వైశేషికము, పూర్వ మీమాంస, ఉత్తర మీమాంస |
| షణ్మతములు | శైవ, శాక్త, వైష్ణవ గాణాపత్య, సౌర, కాపాలిక మతములు |
| షట్ స్పర్శనములు | కఠినము, మృదువు, ఉష్ణము, శైత్యము, మెఱుపు, మిశ్రమము |
| షడ్రుచులు | మధురము, వగరు, కారము, ఆమ్లము, చేదు, లవణము |
| షట్కళలు | నివృత్తి, ప్రతిష్ఠా, విద్యా, శాంతి, శాంత్యతీత, శాంత్యతీతోత్తర |
| షడ్గుణ సంపత్తి | శమ, దమ, ఉపరతి, తితిక్షా, సమాధాన, శ్రద్ధా సంపత్తులు |
| షడ్విధ వృత్తములు | గురు వృత్తము, లింగ వృత్తము, చర వృత్తము ప్రసాద వృత్తము,పాదోదక వృత్తము, భాక్తిక వృత్తము |
| సప్త ధాతువులు | రసము, రుధిరము, మాంసము, మేదస్సు, అస్థి, మజ్జా, శుక్లము |
| సప్త సాగరములు | లవణ, ఇక్షు, సురా, ఘృత, దుగ్ధ, దధి, జల సముద్రములు |

| | |
|---|---|
| సప్త వ్యసనములు | తను, మన, ధన, రాజ్య, విశ్వ, ఉత్సాహ, సేవకి వ్యసనములు - అభక్ష్య భక్షణము, అపేయపానము ద్యూతము, వేశ్యాగమనము, వాక్పారుష్యము, మృగయా విహారము, చౌర్యము |
| సప్త సూత్రములు | దొంగిలించ వద్దు చంప వద్దు కల్లలాడ వద్దు కోపగించ వద్దు తనను తాను కొనియాడు కొనవద్దు అన్యులపయి అసహ్య పడవద్దు ఎదుట నిందించ వద్దు (బసవన్న చెప్పిన నీతి సూత్రములు )-తనువు నందు నిర్మోహము ప్రాణమందు నిర్భయము, చిత్తమందు నిరపేక్ష, విషయి మందు ఉదాసీనము, భావమందు దిగంబరము, జ్ఞాన మందు పరమానందము (ఆదయ్యగారు చెప్పినవి ) |
| తాంత్రిక సప్త విషయములు | సృష్టి, ప్రళయము, దేవార్చనము, సర్వసాధనము, పురశ్చరణము, షట్కర్మము, ధ్యానయోగము |
| సప్త ద్వీపములు | జంబూ ద్వీపము, ప్లక్ష ద్వీపము, శాల్మలీ ద్వీపము, కుశ ద్వీపము, క్రౌంచ ద్వీపము, శాక ద్వీపము, పుష్కర ద్వీపము |
| సప్తర్షులు | మరీచి, అంగిరసుడు, అత్రి, పులస్త్యుడు, క్రతువు, పులహ క్రతువు, వశిష్ఠుడు |
| సప్త మాతృకలు | బ్రాహ్మీ, మాహేశ్వరీ, కౌమారీ, వైష్ణవీ, వారాహీ, మాహేంద్రీ, చాముండీ |
| సప్త భూమికలు | సుఖేచ్ఛా, విచారణము, అసంగము, వాసనాక్షయము, ఆనందిని, తుర్యము, తుర్యాతీతము |
| అష్టావరణములు | గురు, లింగ, జంగమ పాదోదక, ప్రసాద, విభూతి, రుద్రాక్ష, మంత్రములు |
| అష్టవిధార్చన | జల, గంధ, అక్షత, పత్ర, పుష్ప, ధూప, దీప, నైవేద్య ములు |
| అష్టమదములు | కుల, ఛల, ధన, రూప, యౌవన, విద్యా, రాజ్య, తపో మదములు |
| అష్టతనువులు | పృధ్వి, అప్, తేజము, వాయువు, ఆకాశము, చంద్రుడు, సూర్యుడు, ఆత్మ |

| | |
|---|---|
| అష్టసిద్ధులు | అణిమా, మహిమా, గరిమా, లఘిమా, ప్రాప్తి, ప్రాకామ్య ఈశత్వ, వశిత్వ సిద్ధులు |
| అష్టదళములు | . ఇంద్ర, అగ్ని, యమ, నిర్బతి, వరుణ, వాయు, కుబేర, ఈశానులు |
| అష్ట దిక్పాలకులు | ఇంద్ర, అగ్ని, యమ, నిర్బతి, వరుణ, వాయు, కుబేర, ఈశానులు |
| అష్ట భోగములు | గృహ, శయ్యా, వస్త్ర, ఆభరణ, స్త్రీ, పుష్ప, గంధ, తాంబూలములు |
| అష్టాంగ యోగము | యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధి |
| రాజసుని | |
| అష్టగుణ ములు | గర్వము, క్రోధము, అహంకారము, విషయసంగము, వాదము, అప్రియవచనము, దంభము, మత్సరము |
| అంతరంగ | |
| అష్టమదములు | సంస్థిత, తృణీకృత, వర్తిని, క్రోధిని, మోహిని, అతి చారిణి, గంధచారిణి, వాసిని |
| అష్ట ప్రమాణములు | ప్రత్యక్ష, అనుమాన, ఉపమాన, శబ్ద, అర్థాపత్తి, అనుప లబ్ధి, ఐతిహ్య స్వానుభావములు |
| అష్టైశ్వర్యములు | రాజ్య, భండార, సైన్య, గజ, తురగ, ఛత్ర, చామర, ఆందోలనములు |
| తామసుని | |
| అష్టగుణములు | అజ్ఞానము, మోహము, నిద్ర, చాపల్యము, హీనవృత్తి, పాపిష్ఠత పరనింద పరహింసయు |
| నవ లింగములు | ఇష్ట లింగము (క్రియాలింగము), ప్రాణ లింగము (జ్ఞాన లింగము) భావ లింగము, ఆచార లింగము, గురు లింగము, శివ లింగము, జంగమ లింగము, ప్రసాద లింగము, మహాలింగము |
| నవ చక్రములు | : ఆధార, స్వాధిష్ఠాన, మణిపూర, అనాహత, విశుద్ధి, ఆజ్ఞా, బ్రహ్మరంధ్ర (సహస్రార) శిఖాచక్ర, పశ్చిమచక్రములు. |

| | |
|---|---|
| నవ నాళములు | |
| నాడులు | శంఖినీ, లకుహా, అలంబుసా, పయస్వినీ, పూషా, హస్తి జిహ్వా, గాంధారీ, ఇడా, పింగళా |
| నవ బ్రహ్మలు | నిరంజన (సర్వశూన్య), నిశ్శూన్య, నిష్కల, నిస్సీమ, విజ్ఞాన, ఆనంద, సత్కలా, పిండ, మూర్తి బ్రహ్మ |
| నవరత్నములు | వజ్రము, వైడూర్యము, గోమేధికము, పుష్యరాగము, నీలము, మరకతము, మాణిక్యము, విద్రుమము, మౌక్తికము |
| నవవిధ భక్తి | శ్రద్ధా, నిష్ఠా, అవధాన, అనుభవ, ఆనంద, సమరస, పరిపూర్ణ, నిరంజన, నిశ్శూన్య - మఱియు - శ్రవణ, కీర్తన, స్మరణ, పాదసేవ, అర్చన, వందన, దాస్య, సఖ్య, ఆత్మనివేదనములు |
| నవశక్తులు | క్రియాశక్తి, జ్ఞానశక్తి, ఇచ్ఛాశక్తి, ఆదిశక్తి, పరాశక్తి, చిచ్ఛక్తి, ఆనందమయశక్తి, నిర్భ్రాంతిశక్తి, నిరామయశక్తి |
| నవవర్ణములు | పీతము శ్వేతము, హరితము, మాంజిష్టము, నీలము, చిఱుమెఱుపు, జ్యోతి, మహాజ్యోతి, అగణితజ్యోతి |
| నవాకృతులు | పై జాబితాలోని 6 ను మఱియు నిష్కల, నిరంజన, నిశ్శూన్యములు |
| నవప్రణవములు | షడక్షరములు, మఱియు అకార, ఉకార, మకారములు (ఙ ష హ) |
| నవనాదములు | భ్రమర, వీణా, ఘంటా, భేరీ, ప్రణవ దివ్య, సింహా, మహానాదములు |
| నవాంగములు | పృధ్వి, అప్, తేజస్, వాయు, ఆకాశ, ఆత్మ, త్యాగ, భోగి, యోగములు |
| నవాత్మలు | జీవాత్మ, అంతరాత్మ, పరమాత్మ, నిర్మలాత్మ, షద్ధాత్మ, జ్ఞానాత్మ, మహాత్మ, దివ్యాత్మ, చిన్మయాత్మలు |
| నవస్థలములు | పై జాబితాలోని ఆరు భక్తాది స్థలములు మఱియు నిష్కల, నిరంజన, నిశ్శూన్యములు |
| నవతనువులు | స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణ, ఆనంద, శుద్ధ, నిర్మల, చిద్రూప, చిన్మయ తనువులు |

| | |
|---|---|
| నవహస్తములు | పై జాబితాలోని మొదటి 6 మఱియు నిష్కల, నిరాళ, నిర్మాయలు |
| నవముఖములు | పై జాబితాలోని 6, మఱియు బ్రహ్మరంధ్ర, ఉన్మని, పశ్చిమ ముఖములు |
| నవప్రసాదములు | పై జాబితాలోని 6, మఱియు పరమానంద, పరిపూర్ణ, అవిరళములు |
| నవపూజారులు | బ్రహ్మ, విష్ణు, రుద్ర ఈశ్వర, సదాశివ, మహేశ్వర, నిష్కల, నిరంజన, నిశ్శూన్య |
| నవదేవతలు | బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివ, మహేశ్వర, పరశివ, సర్వేశ్వర, మహాదేవులు |
| నవకళలు | పై జాబితాలోని 6, మఱియు ఆనంద (అనాది), నిర్మల (నిర్నామ) నిర్వాచ్య (అనిర్వాచ్య)ములు |
| నవసాదాఖ్యములు | కర్మ, కర్తృ, మూర్త, అమూర్త, శివ, మహా, అగమ్య, అవిరళ (అగోచర), నిర్ముక్తి |
| నవలక్షణములు | సత్, చిత్, ఆనంద, నిత్య, పరిపూర్ణ, అఖండ, అనామయ, అగమ్య, నిర్వాచ్య (అగోచర) ములు |
| నవసంజ్ఞలు | పర, గూఢ, శరీరస్థ, లింగక్షేత్ర, అనాదివస్తు, మహా, అప్రమాణ, నిర్నామ, అవిరళలు |
| నవదిక్కులు | పూర్వ, పశ్చిమ, దక్షిణ, ఉత్తర, ఊర్ధ్వ, పాతాళ, హృదయ, హృత్కమల, దివ్యనాద ఘోషలు |
| నవవేదములు | ఋక్, యజు, సామ, అధర్వణ, అజప, శివగాయత్రి, గాంధర్వ, సావిత్రి |
| నవనిధులు | పద్మ, మహాపద్మ, శంఖ, మకర, కశ్యప, ముకుంద, నంద, నీల, ఖర్వములు |
| నవగ్రహములు | సోమ, మంగళ, బుధ, గురు, శుక్ర, శని, రవి, రాహు, కేతువులు |
| నవరంధ్రములు | కన్నులు రెండు, చెవులు రెండు, నోరు ఒకటి, ముక్కు రంధ్రములు రెండు, గుదము ఒకటి, గుహ్యము ఒకటి |
| దశవిధనాదములు | భ్రమర, శంఖ, మృదంగ, తాళ, ఘంటా, వీణ, భేరి, దుందుభి, సముద్రఘోష, మేఘగర్జన |

216 సకీలములు

భక్తుడు భక్తాది స్థలములందు ఆరు రీతులుగా షట్స్థలమందు 36 తీరులగును శరణుడు (1) సల్లింగిముఖకు (2) ముఖము (3) హస్తము (4) శక్తి (5) భక్తినుండి (6) అర్పణ చేయునపుడు 36 × 6 = 216 సకీలములు ఆచరింపబడును

ఇదియే ఇంకొక విధము

భక్తాది స్థలములు 6 త్యాగాంగ, భోగాంగ, యోగాంగములు 3 చేరి 9 అంగములు 1 ఆకృతి 2 ప్రణవ 3 నాద 4 చక్ర 5 వర్ణ 6 అంగ 7 ఆత్మ 8 స్థల 9 తను 10 హస్త 11 లింగ 12 ముఖ 13 శక్తి 14 భక్తి 15 పదార్థ 16 ప్రసాద 17 పూజారి 18 దేవత 19 కలా 20 సాదాఖ్య 21 లక్షణ 22 సంజ్ఞ 23 దిక్కు 24 వేదములు-ఇట్లు 9 × 24 = 216 సకీలములు

ఈ శబ్దకోశము మైలార బసవలింగ శరణులు వ్రాసిన త్రిపధములకు 'వీరశైవ దార్శనిక సిద్ధాంతము, వ్యాఖ్య' వ్రాసిన పండితులు పూజ్యులైన శ్రీ ని ప్ర జగద్గురు ముండరిగి సంస్థానాధీశులైన అన్నదానేశ్వర మహాస్వాముల అనుమతి పడసి ఇక్కడ పొందుపఱచడమైనది



| | |
|---|---|
| పంచవింశతి (25) తత్త్వములు | పంచభూతములు, పంచతన్మాత్రలు, పంచకర్మేంద్రియములు, పంచజ్ఞానేంద్రియములు, పంచవాయువులు |
| 36 తత్త్వములు | ఆత్మతత్త్వములు 25, విద్యాతత్త్వములు 10, శివతత్త్వము 1 వెరసి 36 ఇవియుకాక పైన జెప్పిన 25, విద్యాతత్త్వమందు సాదాఖ్యములు 5, కళలు 5, శివతత్త్వము 1-వెరసి 36 |
| 44 అంగ స్థలములు | పృథ్వీతత్త్వములోని కర్మేంద్రియములు 5, అప్తత్త్వములోని జ్ఞానేంద్రియములు 5, అగ్నితత్త్వములోని విషయములు 5, వాయుతత్త్వములోని వాయువులు 5, ఆకాశతత్త్వములోని కరణములు 5, భానుతత్త్వములోని విభూతులు 5 - శివతత్త్వములోని శ్వేతాది వర్ణములు 5, ఆత్మతత్త్వములోని నాదములు 5, వీనితో శివతత్త్వము, అనాద శివతత్త్వము, అనాది నిష్కల పరశివతత్త్వము, అనాది నిష్కల పరాత్పర శివతత్త్వము,- ఇవియన్నియు చేరి 44 తత్త్వములైనందున అంగస్థలములు 44 అయినవి |
| 57 లింగతత్త్వములు | ఆధారమందు 4, స్వాధిష్ఠానమందు 6, మణిపూరమునందు 10, అనాహతమందు 12, విశుద్ధియందు 16, ఆజ్ఞయందు 2, బ్రహ్మరంధ్రమందు 3, శిఖయందు 3, పశ్చిమమందు 1 - ఇట్లు ఏబదియేడు ప్రణవంబులే 57 లింగస్థలములకు కారణములైనవి |
| 101 స్థలములు | ఆచార లింగ స్థలములు 9, గురులింగ స్థలములు 9, శివలింగ స్థలములు 9, ప్రసాద లింగ స్థలములు 9, జంగమ లింగ స్థలములు 9, మహాలింగ స్థలములు 12- వెరసి 57 |
| | అంగ స్థలమందున్న భక్తి స్థలములు 15, మహేశ్వర 9, ప్రసాది 7, ప్రాణలింగి 5, శరణ 4, ఐక్య 4 వెరసి 44 |
| | మొత్తము చేరి 57 + 44 = 101 స్థలములు |

216 సకీలములు

భక్తుడు భక్తాది స్థలములందు ఆరు రీతులుగా షట్స్థలమందు 36 తీరులగును శరణుడు (1) పల్లింగిముఖకు (2) ముఖము (3) హస్తము (4) శక్తి (5) భక్తినుండి (6) అర్పణ చేయునపుడు 36 × 6 = 216 సకీలములు ఆచరింపబడును

ఇదియే ఇంకొక విధము

భక్తాది స్థలములు 6 త్యాగాంగ, భోగాంగ, యోగాంగములు 3 చేరి 9 అంగములు 1 ఆకృతి 2 ప్రణవ 3 నాద 4 చక్ర 5 వర్ణ 6 అంగ 7 ఆత్మ 8 స్థల 9 తను 10 హస్త 11 లింగ 12 ముఖ 13 శక్తి 14 భక్తి 15 పదార్థ 16 ప్రసాద 17 పూజారి 18 దేవత 19 కలా 20 సాదాఖ్య 21 లక్షణ 22 సంజ్ఞ 23 దిక్కు 24 వేదములు-ఇట్లు 9 × 24 = 216 సకీలములు

ఈ శబ్దకోశము మైలార బసవలింగ శరణులు వ్రాసిన త్రిపథములకు 'వీరశైవ దార్శనిక సిద్ధాంతము, వ్యాఖ్య' వ్రాసిన పండితులు పూజ్యులైన శ్రీ ని ప్ర జగద్గురు ముండరిగి సంస్థానాధీశులైన అన్నదానేశ్వర మహాస్వాముల అనుమతి పడసి ఇక్కడ పొందుపఱచడమైనది

